# అష్టావక్ర గీత



వ్యాఖ్యానం :

**స్వామి చిన్మయానంద**

# అష్టావక్ర గీత




ఆంగ్లమూలం:

**స్వామి చిన్మయానంద**

తెనుగుసేత :

**టి. అన్నపూర్ణ**

విజయవాడ

చిన్మయారణ్యం పబ్లికేషన్స్ ట్రస్టు

భీమవరం

# అష్టావక్రగీత

నాల్గవ ముద్రణ : 2011
ప్రతులు : 1500

ఐదవ ముద్రణ : 2016
ప్రతులు : 1500

వెల : రూ. **130-00**

*ప్రతులు దొరుకుచోటు :*

**చిన్మయారణ్యం పబ్లికేషన్స్ ట్రస్టు**
**C/o. పద్మినీ జ్యూయలర్స్, మెయిన్ రోడ్,**
**భీమవరం - 534 201**
**పశ్చిమ గోదావరి జిల్లా**
**ఫోన్ : 9849461336, 08816-230468**

*ముద్రణ :*
**నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
విజయవాడ - 520 003.
ఫోన్ : 0866-2574828

# అష్టావక్రగీత

నమో దేవదేవా! నమో దివ్యతేజా!

నమోఽద్వైత తత్త్వార్థ బోధనాయ!

మోక్షమొసగు శాస్త్రరూపమే నీవంచు

నాదు మనమునందు కొలుతు నిన్ను!

గురుదేవ నీ కృపావీక్షణలేశమ్ము

గూఢమౌ తత్త్వార్థ బోధకమ్ము!

ఋజుమార్గమును జూపు ఋషితుల్యుడవు నీవు

మార్గదర్శివి మానవాళికెల్ల!

దేశకాలవస్తు గుణరూప జ్ఞానమ్ము

వాస్తవమ్మున భావమాత్ర మౌను

యతివరా, శాస్త్రస్వరూపా! నమస్సులివె,

చిద్రూప చిన్మయానంద స్వామి!

...

# తొలినుడి...

పరమపూజ్య ఓంకార స్వాములవారిని గూర్చి వ్రాయడం అంటే అనంతమైన ఆకాశంయొక్క ఔన్నత్యాన్ని, అగాధమైన సముద్రపులోతులను కొలవడమే. అష్టావక్రగీతలోని అఖండ సహజసమాధి స్థితికి తార్కాణం వారే!

నిస్తరంగ జలరాశి నిశ్చలమైన శ్రీ స్వామీజీ అంతరంగం అనంత తత్త్వమే! సంకల్పంకూడాలేని వారి హృదయంనుండి భగవత్సంకల్పంగా శాంతి తరంగాలు ఉవ్వెత్తుగా లేచాయి.................తోటపల్లి, విశాఖపట్టణం, కోటగిరి,కాకినాడ,ఉప్పాడ....ఇంకా ఎన్నో ఎన్నో ఆశ్రమాలుగా రూపొందుతున్నాయి. శాంతికోసం తపనచెందే జీవులపాలిట కల్పద్రుమాలుగా అవి విలసిల్లుతున్నాయి.

పూజ్యశ్రీస్వామీజీవారు మహాసమాధిలోకివెళ్ళిన ఈ సంవత్సరంలోనే **అష్టావక్రగీత**కు పూజ్యగురుదేవుల ఆంగ్లవ్యాఖ్యానం తెలుగులో అనువాదమై ముద్రితం కావడం విశేషము. దానిని శ్రీస్వామీజీకి అంకితంగా సమర్పించాలని చిన్మయామిషనువారు కోరుకోవడం సహజమే.

**పూజ్యశ్రీ ఓంకారస్వామి** వారికి భక్తిప్రపత్తులతో నైవేద్యమిడి తెనుగుజాతికి చిన్మయమిషను ఇచ్చే **సంక్రాంతి కానుక** ఇది! శుభం.

మహాప్రసాదంగా దీనిని స్వీకరించి సాధకులు, ముముక్షువులు, తరించమని వేడుతూ సెలవు తీసుకుంటాను!

బెంగుళూరు

7-12-82 --స్వామిని శారదాప్రియానంద.

# పరిచయము...

భగవద్గీత, వశిష్ఠగీతలవలెనే ఈ అష్టావక్రగీత కూడ, శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు చేసిన బోధ భగవద్గీత. వశిష్ఠులు శ్రీ రామచంద్రునికి చేసిన బోధ వశిష్ఠగీత. జీవన్ముక్తుడైన అష్టావక్రమహర్షి సాధన చరమ దశలోనున్న జనక మహారాజునకు చేసిన బోధ అష్టావక్రగీత. చక్కగ సాధనచేసి, సమాధి స్థితులను బాగుగ అలవరచుకొనిన సాధక శ్రేష్ఠుల నుద్దేశించినది ఈ అష్టావక్రగీత. అందుకే ఇది సామాన్యులకు సాధన కుపక్రమిస్తున్న వారికి ప్రయోజనాన్ని ఇవ్వజాలదు. ఒక పథంగా పొరపాటుగ భావాలను గ్రహిస్తే, అనర్థము చేకూర్చవచ్చును. కాని ఇది అద్భుతమైన గ్రంథరాజము. దీని భావములను గ్రహించిన తదుపరి చదువవలసిన గ్రంథము లేదన్నను అతిశయోక్తి కాదు!!

ఈ గ్రంథమునకు శ్రీ గురుదేవుల వ్యాఖ్య ఒక ప్రత్యేక విశిష్ఠతను కలిగి యున్నది. గురుదేవుల నిజస్థితి, వారి పరిపూర్ణత్వము ఈ వ్యాఖ్యానంలో చక్కని సాధకులకు రేఖామాత్రంగానైనా కన్పడక మానదు. ఆంగ్లమున ఈ వ్యాఖ్యను" చదివినపుడు గురుదేవుల "సచ్చిదానంద స్వరూపస్థితి"అవగతము కాగలదు. దీనిని తెనుగున కనుదించి ఆంధ్ర ముముక్షుజనావళికి అందించుటకు నా మనస్సు ఎంతో ఆరాటపడినది. కాని అనువాదము చేయుటకు ధైర్యము చాలలేదు. కాని బ్రహ్మచారి నారాయణ చైతన్యుల ప్రోత్సాహముతో శ్రీమతి టి. అన్నపూర్ణగారు అనువదించినారు అని తెలిసిన వెంటనే ఆ రచన ప్రతులను నాకు పంపమని వారికి వ్రాశాను. అమె ఎంతో ఆప్యాయంగా పంపినారు.

ఒక ఏకాంత ప్రదేశంలో కూర్చుని దీనిని ఎడిట్ చేయదలచినాను. శాంతి ఆశ్రమవాసులైన శ్రీ ఓంకార స్వామివారు మే, జూన్ నెలలో ఉదకమండలమునకు సమీపమున నున్న కోటగిరిలో ఎండాకాలమందు వారి శాంతి కేంద్రంలో వుంటారని తెలిసి 17-5-82 తేదిన అక్కడికి వెళ్ళినాను. శ్రీ ఓంకారస్వామి ఆశీస్సులతో ఆ శీతల కొండలమధ్య ఒక లోయలో నిర్మించిన "ధ్యానగుహ" (Meditation cave)లో కూర్చుని ఈ గ్రంధాన్ని ఎడిట్ చేసినాను. అపుడు శ్రీ ఓంకారస్వామిని ప్రతిదినము దర్శిస్తూ వారి సత్సంగ

కార్యములలో పాల్గొనెడి వాడను. శ్రీ ఓంకారస్వామి జీవన్ముక్తుడు. అష్టావక్ర గీతలోని జీవన్ముక్తుని ఆయనలో దర్శించగలిగినాను. ఆ దినములలో ఎంతటి దివ్యమైన ఆత్మానుభూతిని పొందితినో అదంతయు గురుదేవుల కటాక్షము, ఓంకారస్వామి ఆశీస్సులని భావించితిని. 28-5-82 తేది నుండి ఓంకారస్వామి ఆరోగ్యము క్షీణించినది 10-6-82 తేదీన కోయంబత్తూరు నుండి శాంతి ఆశ్రమమునకు వ్యానులో పయనించునపుడు స్వామి పరమ పదము పొందిరి. ఈ వార్త వినిన నేను వారి అంతిమ గడియలలో వారివద్ద లేనందుకు ఎంతో తపించితిని. కాని ఆ మహాత్ముని చివరిదినములలో వారివద్దవుంటూ ఈ మహోత్కృష్ట గ్రంథమును ఎడిట్ చేయుట నా అపూర్వ భాగ్యంగ భావించి ఈ గ్రంథాన్ని వారి దివ్యస్మృతి చిహ్నంగ అంకితం చేయాలని సంకల్పం కలిగింది. శ్రీ గురుదేవులకు నా సంకల్పాన్ని తెలుపు కున్నాను. వారు ప్రేమమూర్తులు. తక్షణమే శాంతిఆశ్రమ మహాత్మునికి అంకితముగా ప్రకటించ మని ఆదేశించినారు.

కావున ఈ ఆంధ్ర అనువాదాన్ని మహాత్ముడైన శ్రీ ఓంకారస్వామి దివ్యస్మృతి చిహ్నంగ ఆంధ్రముముక్షు జనావళికి అందిస్తున్నాము. పూజ్యశ్రీ ఓంకార స్వామిగారు తోటపల్లి కొండలలోని శాంతి ఆశ్రమ స్థాపకులు. నిజంగా అది శాంతి నిలయమే. అందు ఎన్నో సూక్తులు సాధకుల ఉపయోగార్థము రచింపబడి యున్నవి. నిర్వాణ మందిరప్రాంగణములో రచింపబడిన సూక్తి " I weep for those who do not weep for God"దేవుని కొరకై ఏడ్వని వారిని గురించి నాకు ఏడుపు వస్తుంది, అని ఉన్న సూక్తి నన్ను ఎంతో ఆకర్షించింది. వారి బోధయొక్క సారాంశము వారి శాంతి ప్రార్థనలో చూడవచ్చు. (అది పత్యేకముగ ఆంగ్లమున, ఆంధ్రమున ముద్రింపబడినది)

ఈ గ్రంథమును ఆంగ్లమునుండి అనువదించిన శ్రీమతి టి. అన్నపూర్ణ గారు ఉత్కృష్ట ఆధ్యాత్మిక సాధకురాలు. లేకున్న ఈ గ్రంథమును ఇంత చక్కగ అనువదించుట అసాధ్యము. ఆంగ్లమునందు గురుదేవుల వ్యాఖ్య ఆ పరమసత్యాన్ని తెలుపుటలో భాష, భావములు రెండుపోటీ పడినట్లుంది. అదే స్థాయిలో ఆంధ్రమున అందించగల సమర్థత, భావ ప్రకటన, భాషా నైపుణ్యము శ్రీమతి టి. అన్నపూర్ణలోనున్న విషయమును ఈ గ్రంథమును

అధ్యయనము చేయువారికి స్ఫురించక తప్పదు. సెంట్రల్ చిన్మయ మిషన్ ట్రస్టు వారి తెలుగు విభాగముల ప్రచురణకు శ్రీమతి టి. అన్నపూర్ణగారు చేయుచున్న సేవకు వారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని గురుదేవులు బెంగుళూరు నేషనల్ యజ్ఞమునందు ఆవిష్కరించుట ఒక ప్రత్యేకత! చక్కని ఆధ్యాత్మిక సాధనగల పవిత్ర హృదయులకు ఈ గ్రంధము ఎంతో సహకరిస్తుంది. శ్రీ గురుదేవులు పూజ్య శ్రీ చిన్మయానందుల కృపాకటాక్షము, శ్రీ ఓంకార స్వామివారి ఆశీస్సులు ఈ గ్రంధమును అధ్యయనముచేయు సాధకులకు తప్పక లభించగలదని విశ్వసిస్తూ

ఈ గ్రంధమును అందించగల అదృష్టమును ప్రసాదించిన

శ్రీ చిన్మయానందుల పాదపద్మములకు నమస్కరిస్తూ!

కేవలంగ కేవలుడై నిలుస్తున్నా!

హరిః ఓం!!

---జూటూరివేమయ్య.

# ఆద్యంతాలమధ్య......

ఏకమేవ, అద్వితీయం----ఉన్న సత్యం ఒకటే, రెండవదేదీ లేదు. ఇదే భారతీయార్ష విజ్ఞాన సర్వస్వం.

రెండవదేదీలేదు---శాస్త్రం మీద, గురువుమీద, అచంచల విశ్వాసం, అపార గౌరవం ఉన్నాయి. ఏ బుద్ధితో అనేకత్వాన్ని గ్రహిస్తున్నానో, అదే బుద్ధితో ఏకత్వమే ఉందనీ, అదే అనేకంగా భ్రమకలిగిస్తోందనీ స్పష్టంగా తెలుసుకోవాలి. ఆకాశం నీలవర్ణంగా కనిపిస్తున్నా అక్కడేమీ లేదని ఎంత నిశ్చయంగా తెలుసో, అంత నిశ్చయంగా ఈ కనిపిచంచే అనేకత్వం భావనామాత్రమనీ, సత్యాత్వ భ్రమ కలిగిస్తున్నదనీ తెలుసుకోవాలి. నీలవర్ణం కనిపిస్తునే ఉంటుంది, కాని ఆకాశంలో లేదని నిశ్చయంగా తెలుసు. జగత్తును భావంలో, భావంగా గుర్తిస్తునే ఉన్నాను, అయినా సత్యంగా ఏకంగా నిత్యంగా ఉందని నిశ్చయంగా తెలుసు. ఈ జ్ఞానార్జనమే మానవ జీవిత పరమార్థం, ఇదే ముక్తి, మోక్షము, సర్వమూ కూడా.

---అన్నపూర్ణ.

# అష్టావక్రగీత......పరిచయము

సత్యం ఏకంగా అద్వయంగా ఎలా ఉందో తెలియజెప్పేది తత్త్వ జ్ఞానం. దీనిని ఎన్నో శాస్త్రాలు పురాణాలు ఇతిహాసాలు ఆఖ్యానాలూ ఉపాఖ్యానాలూ, మహాత్ములూ మామూలు మనుషులూ కూడా చెప్పడానికి ప్రయత్నించడంతో అనేకరకాలయిన వ్యాఖ్యానాలూ అనుమానాలూకూడా అభివృద్ధి చెందుతూనే ఉన్నాయి.

వీటిలో ఎక్కువ మంది ప్రమాణంగా అంగీకరించిన వాటిలో శ్రీమద్భగవద్గీత ఒకటి. ఇది శ్రీ కృష్ణార్జున సంవాద రూపంలో ఉంది. ఇందులో అర్జునుడు సత్యాన్వేషిగా, కృష్ణుడు తత్త్వబోధకుడుగా భగవంతుడుగా కనిపిస్తారు. రెండవదైన వశిష్ఠగీత (యోగవాసిష్ఠం)లో శ్రీరామునికి గురువుగా వశిష్ఠుడు జ్ఞానవిజ్ఞానాల నందిస్తూ తత్త్వబోధ చెయ్యడం చూస్తాం. అష్టావక్ర గీతకూడా ఇదే విధంగా జనక మహారాజునకూ అష్టావక్ర మునీంద్రునికి జరిగే సంవాద రూపంలో ఉంది.

మహాభారతంలో ఇది చాలా చక్కని ఉపాఖ్యానం. అష్టావక్రుడు సుజాత గర్భంలో ఉండగానే తన తండ్రి కాహరుడు చదివే వేద శాస్త్రాలన్నిటినీ విని ఆకళింపు చేసుకుని మహాపండితుడు అయినాడు. ఒకనాడు తన తండ్రి చదివే దానిలో తప్పువిని గర్భంలో నుండే దిద్దబోగా, కోపించిన కాహరుడు, శిశువును అష్టావక్రుడవు కమ్మని శపించడంతో అష్టవంకరలతో జన్మించాడు. ఇతని చిన్న తనంలోనే ఇతని తండ్రి జనక మహారాజు నాశ్రయించి ధనం సంపాదించాలనే కోరికతో విదేహపురానికిపోయి, అక్కడ జనకరాజర్షి ఆస్థానపండితుడయిన వందినునితో ఓడిపోయి, అతని తండ్రి అయిన వరుణునికి సేవకునిగా నియమింపబడి ఉండిపోవలసి వచ్చింది. అష్టావక్రుడు తన రూపంతోపాటు తండ్రి లేకపోవడాన్ని కూడా అందరూ హేళనచేయడం భరించలేక, తల్లి సుజాతను తండ్రి గురించి నిలదీసి అడిగి తెలుసుకున్నాడు. అప్పటికి 12 సంవత్సరాల బాలుడయినప్పటికీ తనమీద దృఢవిశ్వాసంతో విదేహనగరానికి వెళ్ళి, చాలాకష్టం మీద రాజాస్థానం ప్రవేశించి, ఆస్థాన విద్వాంసుడయిన వందినుని ఓడించి,తండ్రిని చెరనుండి విడిపించాడు. సంతోషస్వాంతుడైన తండ్రి,

కుమారుని సమంగానదిలో స్నానం చేసిరమ్మని అతని వక్రత్వాన్ని పోగొట్టి అందమైన బాలునిగా ఆశీర్వదిస్తాడు. సత్యాన్వేషి అయిన జనకరాజర్షి ప్రశ్నలూ, అష్టావక్ర మునీంద్రుని జవాబులూ ఈ అష్టావక్రగీత (అష్టావక్ర సంహిత) గా పేరు పడ్డాయి.

ఉన్న ఏకైక సత్యమే తాననీ, అదే అనంతంగా భ్రమ కలిగిస్తున్నదనీ, దృఢజ్ఞానం కలిగిన అష్టావక్రుడు చెప్పేది అర్థంచేసుకోవడానికి జనక మహారాజు వలె అర్హతకలిగి ఉండాలి. అంటే సత్యాన్వేషణలో అనేక ప్రయత్నాలు చేసి, అనేక కోణాలనుంచి అర్థం చేసుకోగలిగే శక్తి కలిగి, చివరగా మిగిలిపోయిన కొద్ది సందేహాలు కలిగివారికే అర్థం అవుతుంది. సగుణరూపి అయిన భగవంతుని ప్రసక్తే లేని ఈ సంవాదం వింటే సామాన్యులకు అర్థం కన్నా అపార్థం అయే అవకాశమే ఎక్కువ ఉన్నది. సర్వవ్యాపియై భగవంతుడే ఉన్నాడనీ, నేనూ జగత్తూ వేరే లేవనీ, దృఢజ్ఞానం కలిగి, ఆ భగవంతుడిని, ఆ ఏకైక సత్యాన్ని అన్వేషించే బుద్ధికలిగిన వారికి మాత్రమే ఇది సరైన ప్రయోజనం ఇవ్వగలదు.

సాధన చతుష్టయ సంపన్నులై, శాస్త్రాధ్యయన తత్పరులై, ధార్మిక జీవనం సాగిస్తూ, అంతరంగ శుద్ధిని, నిశ్చల మనోబుద్ధుల శాంతస్థితిని సాధించి, సత్యాన్వేషణకోసమే జీవిస్తున్న ఉత్తమాధికారులకు, అర్హులకు, ఈ గీత ఉద్దేశించబడింది. అహంకారాన్ని, తద్వారా చూడబడే ప్రపంచపు స్వభావాన్నీ చక్కగా అర్థంచేసుకుని, భావంలో భావంతో గుర్తింపబడే భావనామయ జగద్భ్రమను విడనాడాలనే దృఢసంకల్పంతో, ధీరత్వంతో ఆఖరి అడుగు వేయబోయే సత్యాన్వేషులకు, సాధక శ్రేష్ఠులకు, తత్త్వజిజ్ఞాసులకు మాత్రమే ఇది సరిగా అర్థం అవుతుంది.

...

# విషయసూచిక

| సంఖ్య | విషయము | పుట |
|---|---|---|



...

ఓం

## అధ్యాయం - 1

# ఆత్మ సాక్షిగా - అందరిలో

మహాపండితుడు, విజ్ఞాని, రాజర్షి, అయిన జనకుడు తన సందేహాలను, సమస్యలను ఆత్మనిష్ఠుడయిన అష్టావక్ర మునీంద్రుని ముందుంచి తీర్చవలసిందిగా ప్రార్థిస్తున్నాడు.

భగవంతుడన్నా, సత్యమన్నా, ఆత్మ అన్నా, ఏ పేరుతో పిలిచినా ఉన్నది ఒకే ఒక సత్యం. అదే ఇంద్రజాల సమానమయిన తన మాయా కల్పిత జ్ఞానంలో తానే చిక్కుకున్నట్లు, దేహ మనోబుద్ధులతో కూడిన జీవిగా, తాను చూస్తున్నా ననుకునే ప్రపంచంలో వ్యవహరిస్తున్నట్టుగా, మనస్సుతో భావిస్తున్నది. తనలో అసంఖ్యాకములయిన రాగద్వేషాలను, నిశ్చయానిశ్చయాలను, ఆశానిరాశలను, అనుభవిస్తూ తనదైన ప్రపంచంలో మానసికానుభవం పొందుతూ ఉన్నట్టుగా జీవుడు భావిస్తున్నాడు. ఈ కర్తృత్వ భావన కారణంగా తత్ఫలితమయిన జన్మ-కర్మచక్రంలో భ్రమిస్తున్నట్టుగా భ్రమపడుతున్నాడు. ఈ బాధలలో ఉండిపోకుండా బయటపడడానికి,తనకూ, జగత్తుకూ సృష్టికర్త అయిన జగదీశ్వరుని, ప్రార్థించాలనే కోరికతో ఏకాగ్రత పెరుగతున్నది. ఈ ఏకాగ్రత, ఈ భావనాబలం తన పరిస్థితుల ననుకూలంగామార్చి సరైన మార్గాన్ని చూపి సత్యమైన జ్ఞానాన్నందిస్తుంది. ఏ బుద్ధితో తానుగా, జగత్తుగా జగదీశ్వరుడుగా భావిస్తూ, భ్రమపడుతూ భ్రమిస్తున్నాడో అదే బుద్ధితో ఉన్నది ఒకేఒక సత్యమనీ, అదే తాననీ, కనిపిస్తున్నట్టున్న దంతా భ్రమ అనీ తెలుసుకోవడంతో భ్రమాజన్య భావనా చక్రంలో భ్రమణం సమాప్తమవుతున్నది. అజ్ఞానం నశించి జ్ఞానం మిగిలిపోతున్నది. తిమిరం పోయింది, తేజస్సు మిగిలింది. జ్ఞానజ్యోతి నిశ్చలంగా, ఏకంగా, అద్వితీయంగా తానుగా ప్రకాశిస్తున్నది, నిత్యంగా.

భ్రమాజన్య జ్ఞానంతో తాదాత్మ్యం చెందినపుడు జీవుడుగా భావించిన జీవాత్మ ఏదైతేఉందో అదే ఆత్మ, అదే సత్యం, తత్వజ్ఞానం సహాయంతో, సాక్షిగా నిలబడి, తన స్వయంజ్యోతిగా ఆనందంగా, కేవలంగా ఉంది, ఉంటున్నది.

జనక ఉవాచ :-

శ్లో॥కథం జ్ఞానమవాప్నోతి కథం ముక్తిర్భవిష్యతి ।
వైరాగ్యం చ కథం ప్రాప్తం ఏతద్ బ్రూహి మమ ప్రభో॥1.

టీ॥ హే ప్రభో!=సర్వసమర్థులగునో స్వామీ!, (పురుషః=పురుషుడు), కథం=ఎట్లు, జ్ఞానం=జ్ఞానమును, అవాప్నోతి=పొందుచున్నాడు, ముక్తిః=ముక్తి, కథం=ఎట్లు, భవిష్యతి= కలుగును, చ= మరియు, వైరాగ్యం=వైరాగ్యము, కథం=ఎట్లు, ప్రాప్తం=ప్రాప్తించునదిగా (భవిష్యతి=అగును), ఏతత్ =దీనిని, మమ=నాకు, బ్రూహి=చెప్పుము.

**ప్రభూ! జ్ఞానార్జనకు మార్గం ఏది? ముక్తిని ఎలా సాధించడం? వైరాగ్యం ఎలా నిలుస్తుంది? నా మీద కరుణించి అనుగ్రహించండి.**

రోగి తన రోగనివారణ కోసం వైద్యుని దగ్గరకు వెళ్ళినప్పుడు, తన బాధను వీలైనంత స్పష్టంగా తెలియబర్చాలి. ఇలా చెప్పకపోతే, వైద్యుడే రోగ నిర్ధారణచేసి చికిత్స జరపడానికి కొంతకాల వ్యవధి అవసరం అయి, కాలం అనవసరంగా గడిచిపోయే ప్రమాదం ఉంది. ఇదే విధంగా జిజ్ఞాసువైన శిష్యుడు గురువును సమీపించినప్పుడు తన సందేహాలను వీలైనంత స్పష్టంగా తెలియ జెప్పే ప్రయత్నం చెయ్యాలి. దీనిని వింటూనే శిష్యునిలో ఉండే మానసిక,బుద్ధి పరమైన సమస్యలనూ, ఆధ్యాత్మికాభివృద్ధిలోగల అవరోధాలనూ గ్రహించడానికి వీలవుతుంది. గురువుకు తదనుగుణంగా బోధచెయ్యడానికి వెంటనే వీలు కలుగుతుంది. ఇక్కడ ఈ అష్టావక్రగీత జనకరాజర్షి ప్రశ్నలతో ప్రారంభం అవుతున్నది.

సాయం సంధ్యా సమయంలో, మసక వెలుతురులో ఒక స్థాణువును (స్తంభాన్ని కానీ పాతివున్న కొయ్యనుగానీ) చూసి భూతంగా భ్రమపడే అవకాశం ఉంది. స్థాణువునిచూసి పొరపడడంలో జనించినభూతం భయభ్రాంతుడిని చేస్తుంది. అనేక సాధకబాధకాలకు ఆధారం అవుతుంది. ఆ పొరపడినవానిని అధోగతిపాలు జేస్తుంది. ఉన్నది స్థాణువే అని గ్రహించకపోవడం (అగ్రహణం) చేతనూ, ఉన్న దానిని ఇంకొకలా భావించడం చేతనూ (అన్యథాగ్రహణం), ఈ భూతం ఉనికి సాధ్యం అవుతున్నది. ఉన్నదేదో స్పష్టంగా తెలియని అజ్ఞానమే దీనికి కారణం. జ్ఞానం అనే వెలుగును సంపాదిస్తే అజ్ఞానాంధకారం పటాపంచలవుతుంది. ఉన్న దేదో నిశ్చయంగా తెలిసినప్పుడు, భ్రమపడడమూ జరగదు. బాధపడడం అసలే

ఉండదు. ఉన్నది స్థాణువే అని తెలియనివారూ, స్థాణువు అని విన్నాం కానీ భూతంలాగే కనిపిస్తోంది. అనుకునేవారూ కూడా, ఎంత కష్టపడి అయినా ఈ జ్ఞానజ్యోతిని సంపాదించి సత్యదర్శనం పొంది తీరాలి. సత్యం జ్ఞానం అనంతం అని వర్ణింపబడే ఆత్మస్వరూపాన్ని, పరబ్రహ్మతత్త్వాన్ని, సరైనదృష్టితో (వెలుగుతో) చూడకపోవడంవల్ల అనంతనామరూప సమన్వితమయిన జగత్ జీవ ఈశ్వర భ్రమను కలిగిస్తూ బాధిస్తోంది.చీకటిలోంచి వెలుగులోకి వస్తే చీకటి మాయం అయిపోతుంది. సరైన జ్ఞానదృష్టిని సాధిస్తే అజ్ఞానం అదృశ్యమయి పోతుంది. చూచే నేనూ, చూడడబడే ప్రపంచమూ, ఈ చూచి చూడబడడం అనే సంబంధంవల్ల సాధ్యం అయే అసంఖ్యాక కష్టసుఖాలుకూడా అజ్ఞాన జనితాలే. చూచే నేనెవరో,చూడబడేదేమిటో, ఎలా చూడబడుతున్నదో స్పష్టంగా తెలిపే జ్ఞానాన్ని సంపాదిస్తే యదార్థం బోధపడుతుంది, భ్రమనశిస్తుంది. ఈ జ్ఞానం ఎలా వస్తుంది? ఎలా సంపాదించాలి? ఇదీ ఇక్కడ జిజ్ఞాసువయిన జనకుని మొదటి ప్రశ్న.

ఈ శరీరంతో, మనోబుద్ధులతో, ఈ ప్రపంచంలోని అనేక వస్తువులనూ, తన ఇష్టాయిష్టాలనూ, వీటి కనుగుణంగా సాధించడానికో వదిలించుకోవడానికో (ప్రవృత్తి మార్గం, నివృత్తి మార్గం) బుద్ధిలో కదిలే ఆలోచనల అలజడినీ చూచే వారంతా ఏదో ఒకనాటికి ఈ నిశ్చయానికి రాక తప్పదు. ఈ ప్రపంచం దుఃఖా లయం, అశాశ్వతం, ఈ జనన మరణాలూ, జీవితమూ, ఇవి అశాశ్వతాలని తెలుస్తున్నప్పటికీ, ఏదో శాశ్వతంగా సాధించాలనే తపనా, పరస్పర విరుద్ధ భావాల సంఘర్షణా, వీటిలోనుండి బయటపడి తీరాలి---ఈ జీవితం నిజంగా దుర్భరం, దుఃఖమయం, అశాశ్వతం ముక్తిని సాధించడం ఎలా? ఈ మనశ్శరీరా లను చూస్తున్నంతసేపూ, ఇవే నేనని భావిస్తున్నంతసేపూ ఈ బంధం ఉంటూనే ఉంది, ఫలితంగా ముక్తి మార్గాన్ని అన్వేషించక తప్పడమూ లేదు. ఈ మనశ్శరీ రాలు నేను కాదని తెలుసుకోవడమే నా నిజస్వరూపాన్ని, సత్ చిత్ ఆనంద రూపాన్ని గుర్తించడం అన్నమాట. బంధం ఉన్నంతసేపూ, బాధ ఉన్నంతవరకూ ముక్తికోసం అన్వేషణ తప్పదు కాబట్టి ఇక్కడ రాజర్షి రెండవప్రశ్న ముక్తిని ఎలా సాధించడం అన్నది చాలా అవసరంగా అర్థవంతంగా కనిపిస్తున్నది.

ముక్తి అంటే బంధం నుండి విడివడడం. పూర్ణంగా ముక్తి కావాలనుకు న్నప్పుడు, కొంతవరకైన మనం మనమనుకునే రాగబంధాలనుండి విడివడడానికి ప్రయత్నించాలి. నిశ్శబ్దాన్ని చూడడానికి మనం నిశ్శబ్దంగా ఉండడం అవసరం.

రాగబంధాలనుండి విడివడే ప్రయత్నం చెయ్యడమంటే బలవంతంగా వాటిని తెంపేసుకోవాలని అర్థం కాదు. ఏది ఎంతవరకూ అర్థమో వివేకంతో చూడాలి. అలా చూసే ప్రయత్నంలోనే మనం చాలా బంధాలనుండి బయటపడడం స్పష్టంగా చూడగలుగుతాము. అలా చూడడాన్నే వైరాగ్యదృష్టి అనవచ్చు. మమత్వం నుండి బయటపడడానికి వైరాగ్యం కావాలి. వైరాగ్యం ఉన్నమేరకు మమత్వం ప్రభావం తగ్గుతూ ఉంటుంది. ఇలా ఇవి పరస్పరాధారంగా ఉన్నప్పటికీ, మనకు ప్రయోజనకారిగా ఉండడానికి బుద్ధి వివేకవంతమూ విచక్షణా సహితమూ కావాలి. పూర్ణంగా ముక్తిని కోరుకొని ప్రయత్నించే వారికి వైరాగ్యం ఎంతో అవసరం. ఈ వైరాగ్యాన్ని ఎలా సంపాదించి నిలుపుకోవడం? ఇదీ జనక మహారాజు మూడవ ప్రశ్న. ఎవరికివారే సదసద్వివేకంతో నిత్యానిత్య విచక్షణాసహిత బుద్ధితో మమ త్వం నుండి బయటపడి వైరాగ్యాన్ని సంపాదించి నిలుపుకోవాలి. దీనికి ఎంతో దీక్ష, ధీరత్వం అవసరం. జీవితంనుండి, మమతానురాగాలనుండి భయంతో పారి పోవడం, సోమరిగా, అర్థరహితంగా, నిర్వీర్యంగా జీవించడం-వైరాగ్యమూ కాదు, ముక్తి సాధింపనూబడదు. జీవిత సమస్యల మధ్య, రాగబంధాలమధ్య, ధైర్యంగా నిలబడి, అవి ఏమిటో, ఎలా బాధిస్తున్నాయో తెలుసుకునే ప్రయత్నం చెయ్యాలి.

నేను అసంతృప్తిగా, అసంపూర్ణంగా ఉన్నాననుకునే అహంకారం. సంపూర్ణంగా, సంతృప్తిగా ఉండాలనుకుంటుంది, తనకంటే భిన్నంగా బాహ్యంగా కనబడే అన్నిటిలోనూ అందుకోసం అన్వేషిస్తుంది. ఈ అన్వేషణలో అనేకానేక విష యాలను చూడడం జరుగుతుంది. చూసిన వాటిలో కొన్ని యిష్టమైనవిగాను మరి కొన్ని అయిష్టంగాను అనిపించకమానవు. ఇష్టమైన వాటిపై రాగమూ, తద్విరుద్ధ మయిన వాటిపై ద్వేషమూ కలుగక మానదు. ఇష్టమయిన దానిని సంపాదించే ప్రయత్నంలోనూ, అయిష్టానికి దూరంగా ఉండే ప్రయత్నంలోనూ అనేక బాధలు ఆరంభమయి జీవితాన్ని దుఃఖమయం చేస్తాయి. చూడబడే విషయాలూ, చూసే విషయీ ఈవిధంగా పరస్పరంగా సంతోషం సంపాదించాలనుకుంటూ అసంతృప్తి పాలబడడం జరుగుతున్నది. పూర్ణత్వాన్ని ప్రేమిస్తూ అసంపూర్ణంగా ఉండిపోతు న్నారు. అహంకారం, కోరికలూ, బాధలూ లేని పూర్ణ ముక్తస్థితిని కోరుతున్నప్పటికీ, సరైనజ్ఞానమూ, సరైన ప్రయత్నమూ లేని కారణంగా నిత్య అసంతృప్తితో అసంపూర్ణ జీవిగా మిగలడం చూస్తున్నాము.

ద్వైతభావనతో జీవించే ప్రతివారికీ ఈ రాగద్వేషాల బంధాలూ, బాధలూ,

తప్పకుండా ఉంటూనే ఉంటాయి. అహంకారం మనశ్శరీరాలతో తాదాత్మ్యం చెంది బాహ్యాభిముఖమయి తనకంటే వేరుగా ప్రపంచాన్ని చూస్తూ కష్టసుఖాల ను అనుభవిస్తున్నానుకుంటున్నది. తనకంటే భిన్నంగా రెండవదానిని చూడడమే అజ్ఞాన జనితమయిన అగ్రహణం అన్యధా గ్రహణాలుగా, ఈ మహాసంసార చక్రానికి ఇరుసుగా వర్ధిల్లుచున్నది. ఈ భ్రమాజనిత రాగద్వేషాలకు బంధీ అయి ముక్తి కోసం ఆరాటపడుతున్నది అహంకారం. ప్రశ్న చాలా చిన్నదే-వైరాగ్యాన్ని ఎలా సంపాదించి నిలుపుకోవాలి? మనశ్శరీరాలతో తాదాత్మ్య సంబంధం నుండి విడివడి తన సహజ స్వరూపాన్ని చూడగలగడం ఎలా? అని అడుగుతున్నాడు ఈ ప్రశ్నలో.

శిష్యుని సందేహాలనూ స్థితినీ సమర్థతనూ గుర్తించిన అష్టావక్ర మునీం ద్రుడు జవాబు యివ్వబోతున్నాడు. ఇదే ఈ అధ్యాయం అంతటా వివరంగా చర్చించబడింది.

**అష్టావక్ర ఉవాచ :-**

**శ్లో॥ ముక్తి మిచ్ఛసి చేత్తాత! విషయాన్ విషవత్ త్యజ ।**
**క్షమార్జవ దయాతోష సత్యం పీయూషవద్భజ ॥ 2.**

టీ॥ హే తాత=ఓ నాయనా (త్వం=నీవు), ముక్తిం=మోక్షమును, ఇచ్ఛసి చేత్= కోరుచున్న వాడవైనట్లయితే, విషయాన్=విషయములను, విషవత్=విషమువలె, త్యజ =త్యజింపుము, చ=మరియు, క్షమా = ఓరిమిని, ఆర్జవ = ఋజుత్వమును (మంచి మార్గ మున నడచుటను), దయా=భూతదయ కలిగి యుండుటను, తోష=సంతోషమును, సత్యం=సత్యమును, పీయూషవత్=అమృతమునువలె, భజ=సేవింపుము.

**కుమారా! ముక్తిని సాధించాలనే కాంక్ష ఉంటే విషయభోగాలను విషతుల్యంగా భావించి త్యజించు. క్షమ, దయ, ఋజువర్తనం, నిత్యసంతృప్తి వీటిని అమృతంగా భావించి సంపాదించి వృద్ధిచేసుకో.**

సులభంగా సూక్ష్మంగా కనిపించే ఈ ఉపదేశంలో రెండు నిర్దుష్ట మయిన దారులు సూచించబడ్డాయి. లక్ష్యాన్ని సాధించడానికి చెయ్యవలసినవీ చెయ్యకూడనివీ వేర్వేరుగా విభజింపబడి బోధించబడ్డాయి.

ఆలోచనా ప్రవాహమే మనస్సు. ఈ ప్రవాహం మహావేగంతో అల్లకల్లో లంగా సుడిగుండాలతో వర్షాకాలంలో వరదలతో ఉప్పొంగిన మహానదిలా ఉంటే, మనస్సును స్వాధీనంచేసుకోవడం చాలా కష్టసాధ్యమవుతుంది. కాబట్టి మనస్సును

ప్రశాంతంగా ఉంచే గుణాలన్నిటినీ వృద్ధిచేసుకుంటూ అశాంతి కలిగించే వాటిని విడిచిపెట్టాలి.

ఇంద్రియాలను భోగాలవైపు ఆకర్షించే విషయాలన్నిటినీ విషతుల్యంగా భావించి విడిచిపెట్టాలి అని మునీంద్రులు సలహా ఇస్తున్నారు. అనంతమైన బాహ్యప్రపంచంలో వస్తువులు లేనిదెక్కడ? ఎక్కడ చూసినా ఏదో ఒకటి కనిపిస్తూనే ఉంటుంది, ఇంద్రియాలకు ఆకర్షణో వికర్షణో కలుగుతూనే ఉంటుంది. ఫలితంగా మనస్సులో అలజడి ఆరంభమయి అపారమైన వ్యథ కలుగుతుంది. విషయాలను లేకుండా చెయ్యలేం కాబట్టి విషయి గురించి జాగ్రత్త తీసుకుంటే సరిపోతుంది. విషయాలనంతంగా బాహ్యంగావున్నా వాటిని గ్రహించి స్పందించే మనస్సు మన అధీనంలోనే, మనలోనే ఉంది కాబట్టి దానిని శాంతంగా వుంచే వాటిని అమృతం గాను, అలజడిని రేపే వాటిని విషతుల్యంగానూ భావించి శ్రద్ధగా వ్యవహరిస్తే మనస్సును లొంగదీసుకోవడం సులభసాధ్యం అవుతుంది.

ఈ విధంగా విచక్షణతో విషయాల విషవలయంనుండి మనస్సును జాగ్రత్తగా మళ్ళించుకోగలగడాన్ని వేదాంత పరిభాషలో దమము అంటారు. మనస్సును స్వాధీనం చేసుకోవడానికి ఈ దమం ఒక్కటే చాలదు. హిమాలయ గుహలో ఏకాంతంగా కూర్చున్నా తన ఊహలతోనే అలజడిని సృష్టించుకోగల నేర్పరి ఈ మనస్సు! మనస్సుయొక్క శక్తి మహాద్భుతం. ఆశ్చర్యకరం! అనుక్షణ మూ అప్రమత్తతతో కాపలాకాస్తున్నా మనకు తెలియకుండానే మనస్సు తన యిష్టము వచ్చిన చోటుకి వెళ్ళిపోతూ ఉండడం మన అనుభవంలో ఉన్నదే. కాబట్టి మనస్సును శాంతంగా ఉంచే మంచి విలువలను అమృతంగా భావించి సంపాదించి నిలుపుకోవడానికి అనుక్షణమూ ప్రయత్నిస్తూనే ఉండాలి. మంచి విలువలను అర్థం చేసుకుని యిష్టపడి అనుసరించడం ద్వారానూ, చెడు విలువ లను తెలుసుకొని నిత్యమూ నిరసించడం ద్వారానూ మనస్సును శాంతపరచి స్వాధీనం చేసుకోవడం సులభ సాధ్యమవుతుంది. క్షమ, దయ, నిత్యసంతృప్తి సత్యవాక్పరిపాలన, గర్వం లేకపోవడంవంటి మంచి విలువల విలువ తెలిసి విలువైనవిగా భావించి, అనుసరించి, జీవితానికి విలువనూ, మనస్సుకు శాంతినీ సంపాదించాలి. అలా జీవించడంలో గల ఆనందాన్ని అనుభవించాలి.

ఎవరైనా మనకు హానిచేసినప్పుడు వారిమీద కోపం రావడం సహజం. కాని, కొంచెం నిదానించి చూస్తే, ఆ కోపం వల్ల మనలో కలిగే అలజడి, అశాంతి,

బాధ వీటితో పోలిస్తే, అసలు హాని కలిగించిన బాధ ఎంత అల్పమో మనకే తడుతుంది. అసలు బాధకంటే కోపంవల్ల కోరితెచ్చుకున్న బాధే ఎక్కువ కాలం దుస్సహంగా దుర్భరంగా మనలను వేధించడం చూడవచ్చు. క్షమాగుణంతో శత్రువునుకూడా క్షమించగలిగినప్పుడు మనస్సు హాయిగా ప్రశాంతంగా ఉంటుంది! నిజానికి కక్ష తీర్చుకోవాలనుకోవడంలో హాయి ఉంటుందనుకుని పొరపడి మనకు మనమే శిక్షవేసుకుంటున్నామన్నమాట. ఇదేవిధంగా అనుక్షణమూ జాగరూకతతో పరిస్థితులను పరిశీలిస్తూ ఉంటే మనస్సును శాంతంగా హాయిగా ఉంచేవన్నీ మంచి విలువలని మనకే తెలుస్తుంది. మనలక్ష్యం హాయిగా ఉండడం అని మనకు తెలుసును కనుక అలా ఉండడానికి నిజంగా ప్రయత్నించడమే, మంచి విలువలను గుర్తించి ఆచరించడం అవుతుంది. ఏది మంచి విలువ అని ఎవరినీ అడగ వలసిన పనేలేదు! సంతోషంగా ఉండడం, సత్యం పలకడం, గర్వం లేకపోవడం వీటన్నిటినీ విమర్శించి చూస్తే మనం హాయిగా శాంతంగా ఉండ డానికీ ఈ విలువలకూ తేడా లేదని తెలిసిపోతుంది. హాయిగా ఉండాలనుకుంటూ తెలివి తక్కువతోచేసే ప్రయత్నాలే శత్రుత్వం, కోపం, గర్వం మొదలయినవన్నీ ఒక్క అబద్ధం చెప్తే దానిని నిలబెట్టడానికి జ్ఞాపకం పెట్టుకుంటూ వరుసగా ఎన్నో అబద్ధాలు ఆడవలసి వస్తుంది. అదే నిజం మాటాడితే మనస్సుకు ఈ శ్రమ అంతా తగ్గి హాయిగా తేలికగా ఆనందంగా ఉండగలుగుతుంది.

ఇటువంటి శాంత మనస్సు మాత్రమే దేన్నైనా నేర్చుకోగలుగుతుంది, సాధించగలుగుతుంది. త్రికరణశుద్ధిగా, అంటే మనో వాక్కాయ కర్మలలో ఒకటిగా ఉండగలిగిన సమ్యక్ మనస్సు మాత్రమే సత్యాన్ని శోధించి సాధించ గలుగు తుంది. శాశ్వతానందదాయకమైన ముక్తిని సాధించగోరే సాధకుడు ముఖ్యంగా ప్రశాంత మనస్సునూ, వివేకసహితమైన బుద్ధినీ సాధించి, వాటి సహాయంతో సత్యాన్వేషణ చెయ్యాలి. ప్రశాంత మనస్సూ వివేకయుక్తబుద్ధి, రెండూ రెండు పాదాలుగా మనలను నడిపించి గమ్యాన్ని చేర్చగలుగుతాయి. పాదాలతో నడక ప్రారంభించకుండా గమ్యం చేరాలనుకోవడం అవివేకమే!

ఈ గీత మొత్తంలో ఇక్కడ ఒక్కచోట మాత్రమే అష్టావక్ర మునీంద్రుడు ఈ నైతికవిలువల గురించీ వాటి ఆవశ్యకత గురించి చెప్పడం జరిగింది. మనస్సుకూ వాక్కుకూ అగోచరమయిన స్థితిలో ఉంటూ దాని గురించే చెప్పబోతున్నప్పటికీ, దానిని అర్థం చేసుకోవడానికనుగుణంగా మనస్సును ఏ స్థితిలో ఉంచుకోవాలో

తెలియజేస్తున్న ఆ మహామునీంద్రులు అపార కరుణా సముద్రులు పరస్పరాధార భూతంగా, ద్వైతంగా,నిజంగా ఉన్నట్టున్న ఈ ప్రపంచంలో నిలబడి ప్రశ్నిస్తున్న సాధకునికి ప్రపంచాతీత సత్యం గురించి చెప్పినా వెంటనే అర్థం కాదనే నిజాన్ని గుర్తించినారు. దయాళురైన ఆ మునివర్యులు. అందుకే అతని స్థాయికి దిగివచ్చి, ఈ బోధన అర్థం కావడానికి కావలసిన కనీసార్హతలను, అర్హ స్థితిని సూచించడం జరిగింది.

**శ్లో॥ న పృథ్వీ న జలం నాగ్నిర్ న వాయుర్ద్యౌర్నవా భవాన్।**
**ఏషాం సాక్షిణమాత్మానం చిద్రూపం విద్ధి ముక్తయే॥ 3.**

టీ॥ భవాన్ = నీవు, న పృథివీ = భూమివి కావు, జలం న = జలము కావు, అగ్నిః= అగ్నివి, న = కావు, వాయుః = గాలివి = న = కావు, న ద్యౌః = ఆకాశమువు కావు, వా = అయితే, ముక్తయే=ముక్తి కొఅకు, ఏషాం=వీటన్నిటికి, సాక్షిణం=సాక్షివిగను, చిద్రూపం = జ్ఞానస్వరూపడవుగను, ఆత్మానం = నిన్ను, విద్ధి = తెలిసి కొనుము.

**ఈ కనిపించే పృథివీ, జలం, అగ్ని, వాయువు, ఆకాశం ఇవేవీ నీవు కాదు. వీటన్నిటిని చూస్తున్న సాక్షివే నీవు. ఈ సాక్షిచైతన్యం, ఆ సత్ చిత్ ఆనంద స్వరూపమే రెండింటికీ భేదమేలేదని గ్రహించడమే ముక్తి.**

వివిధ ప్రత్యేకరూప సమన్వితమయిన ఈ మహావిశ్వమంతా పృథివ్యాపస్తేజో వాయురాకాశములనబడే పంచమహాభూతాల స్థూలాంశలతో నిర్మింపబడింది. వీటి సూక్ష్మాంశలతో మనస్సు బుద్ధీ తయారయినవి. వేదాంత పరిభాషలో ఈ మనో బుద్ధులను సూక్ష్మశరీరం అంటారు. ఈ సూక్ష్మ శరీరం స్థూలశరీరాన్ని తన వాహనంగా ఉపయోగించుకొని సర్వకోర్కెలు తీర్చుకోవాలనుకుంటుంది. మనం గతంలో ప్రోగుచేసుకున్న వాసనలన్నీ (కోరికలు,ఆలోచనలు) ఈ సూక్ష్మ శరీరం ద్వారా రూపుదాల్చి విజృంభించి కోరికతీరగానే నశిస్తుంటాయి. ఈ వాసనలు బుద్ధిలో కోరికరూపంలో పుట్టి, మనస్సులో ఆలోచనల అలజడిని సృష్టించి శారీరక కర్మలుగా బాహ్యప్రపంచంలో బహిర్గతంగా వ్యక్తమవుతూ ఉంటాయి. దీనితో వ్యక్తికీ, సమాజానికీ, ప్రపంచానికీ, సంబంధం ఏర్పడి బలీయమవుతున్నది. ఈ స్థూల సూక్ష్మ శరీరాలూ, ఆ బాహ్యవస్తుమయ ప్రపంచమూ కూడా, పంచ మహాభూతాల కలయికతో,ప్రకృతిచే సృష్టింపబడుతున్నాయి. వాసనల వలననే స్థూల సూక్ష్మ శరీరాలూ, సమస్త చరాచర సృష్టీకూడా ఉనికిని సంతరించుకుంటున్నాయి.

ఈ వాసనలు క్షయం అయిపోతే ఈ మహాద్భుత సృష్టికి పనేలేదనీ, బంధితుడుగా భావిస్తున్న జీవుడే ఏకాకిగా అనంతమూ శుద్ధమూ అయిన చైతన్యస్వరూపంగా తన్ను తాను చూసు కుంటాడనీ మునీంద్రులు సూచిస్తున్నారిక్కడ.

ఈ శ్లోకం మొదటి అర్థభాగంలో పంచ మహాభూతాలు నీవు కావని తెలియ బరుస్తున్నారు అష్టావక్రులు. అనాదిగా తన్నుతాను మనశ్శరీరాలతో కూడిన జీవుడుగా భావిస్తూ ఉండడంచేత, ఆ మనశ్శరీరాలు పంచభూతాల కలయికతో తయారు కాబడినవనీ, ఆ పంచభూతాలు నీవు కావనీ చెపుతున్నారు. నీవు చూసే వస్తువులేవీ "నీవు" కావడానికి వీలులేదు. నీవు చూసే మనశ్శరీరాలను నీవుగా పొరపడకు. వాటిని చూసే సాక్షిచైతన్యమే నీవు అని శ్లోకంలో రెండవ పంక్తిలో చెప్పుతున్నారు. మొదటి పాదంలో మనం కానిదేదో చెప్పినా అందువల్ల మనకు తెలిసేదేమీ ఉండదు. పూర్తిగా అర్థం కావడానికి మనం ఎవరో కూడా తెలియ జెప్పాలి. ఈ సత్యాన్నే రెండవ పాదం చెప్పుతున్నది.

మనశ్శరీరాలను తానుగా పొరపడుతూ, వాటి బాధలన్నింటినీ తనవిగా భావిస్తూ, బాధపడుతున్న జీవుడు ముక్తిని సాధించాలంటే, తాను కాని వాటితో తాదాత్మ్యం విడనాడి తన స్వస్వరూపాన్ని తెలుసుకొని మననం చేసి అనుభవం లోకి తెచ్చుకోవాలి. మనలో,ప్రతిఒక్కరిలో ఉండే చైతన్యం కారణంగానే మనస్సులో అనుభూతులూ శారీరక అనుభవాలూ తెలియబడుతున్నాయి. బాహ్యంగానూ అంతరంలోనూ నిత్యమూ మనం వాటిని తెలుసుకుంటూనే ఉన్నాము. చైతన్య ప్రకాశం ఉండడం వల్లనే సమస్త అనుభవాలనూ మన బుద్ధిలో మనం చూచుకో గలుగుతున్నాము.

మన పరిసరంలోని వస్తువులు మనకు సూర్యకాంతిలో ఏ విధంగా కనబడతాయో, అదేవిధంగా చైతన్య ప్రకాశంవల్లనే అన్ని అనుభవాలనూ మనం తెలుసుకోగలుగుతున్నాం. సూర్యకాంతి ఏవిధంగా తాను ప్రకాశింపజేసే వస్తువులపై ఆధారపడిలేదో, సంబంధించిలేదో, అదే విధంగా చైతన్య జ్యోతికూడా దేనిమీదా ఆధారపడి లేదు, సంబంధించిలేదు. చైతన్య ప్రకాశం ఉంటే మిగతావి ఉన్నట్టుగా కనిపిస్తున్నాయి. ఆ చైతన్యమే, ఆ సాక్షిరూప చైతన్యమే నీవు అని స్పష్టం చేస్తున్నారు. మహర్షి తన శ్లోక పరార్థంలో విషయాలనంతంగా విచిత్ర నర్తనం సాగిస్తున్నట్లుగా, మదిలో మెదిలే భావాలను మహాద్భుత సృష్టిగా బుద్ధి నిశ్చయించి నిజంగా భ్రమపడుతున్నది. ఈ భ్రమే నేనుకాదు, భ్రమను చూస్తున్న

సాక్షిచైతన్యమే నేను, ఈ నేను, ఈ చైతన్య జ్యోతివల్లనే మిగిలినవన్నీ ఉన్నట్టుగా ప్రకాశిస్తున్నాయి, తెలియబడుతున్నాయి.

చైతన్యజ్యోతికీ, ఆలోచనలతో గుర్తింపబడే వస్తుప్రపంచానికీగల సంబంధ రహిత సంబంధం చిత్రాతిచిత్రం! సంబంధం లేని ఈ సంబంధం ఉన్నట్టుగా ఇక్కడ సూచించడంలో ఒక ప్రత్యేక ప్రయోజనం ఉంది. దీనివల్ల సాధకుల ధ్యానానికొక ఆలంబనం దొరుకుతున్నది. నిన్ను నీవు సాక్షిగా తెలుసుకో, చూసుకో అని మునీంద్రులన్నప్పుడు, విషయాలను తెలుసుకునే విషయిగా తనను తాను గుర్తించాలి సాధకుడు. ఇందుకు ప్రయత్నించేటప్పుడు విషయాలున్నాయని స్పష్టంగా గుర్తించాలి. వాటికంటే తానువేరని చూడగలగాలి, తనకు వాటికీగల సంబంధం గురించి కూడా కొంత అవగాహన ఉండితీరాలి. ఇవి లేనిదే ధ్యానం వేపు బుద్ధి మళ్ళదు. కాబట్టి ఈ సంబంధరహిత సంబంధాన్ని ప్రత్యేకంగా ఇక్కడ సూచించారు మునీంద్రులు. వస్తురహితంగా, విషయరహితంగా కేవలం చైతన్యం ఉంది ఆత్మగా, తెలియని దానిని గురించి చెప్పేటప్పుడు, తెలిసిన వాటిని ఉపమానంగా వాడితేనే కొంచమైనా అర్థం అయే అవకాశం ఉంటుంది. విషయాలను చూస్తున్న చైతన్యం యేదైతే ఉందో అదే ఆత్మ, అదే స్వయం జ్యోతిగా సర్వాన్నీ ప్రకాశింపజేస్తోంది అని చెప్పవలసి వస్తున్నది. ప్రకాశింపబడేవే లేకపోతే, దానిని చైతన్యం అనడం కూడా అర్థరహితం! ప్రకాశింపబడేవాటిని మనం చూస్తున్నాం, తెలుసుకోబడేవి తెలియబడుతున్నాయి. వీటి సంబంధంతో వీటి ఉనికి తెలియబడడానికి కారణమయిన చైతన్యాన్ని సూచించి, అదే నీవనీ, దానిని ధ్యానిస్తూ నీ స్వరూపాన్ని చూసుకోమనీ ఉపదేశిస్తున్నారు మునీంద్రులిక్కడ. అలా చూడడంలో, ఆ నిష్ఠలో నిలబడినప్పుడు మిగిలినవన్నీ లేనేలేవు. ఉన్నది ఒకే ఒక సత్యం,ఏకంగా,కేవలంగా! నిజానికి ఈ మాటలన్నీ ఇక్కడ అర్థరహితాలే, మాటలకందని స్వస్థితి అది-అది అనుభవైక వేద్యం. మనదృష్టి ఒక్కొక్క సమయంలో ఒక్కదానిని మాత్రమే చూడగలుగుతుంది, ఇది మనందరికీ అనుభవంలో ఉన్నదే. చిత్తం బాహ్యాభిముఖంగా చూస్తుంటే విషయాలు కనిపిస్తాయి. అంతర్ముఖంగా తన్ను తాను చూసుకుంటూ ఉంటే, ఆ స్థితిలో నిజానికి విషయాల ఉనికి ఎక్కడ? కేవలం నేను నేనుగా, ఆత్మగా అద్వయంగా మిగిలిపోతున్నాను. మనస్సుకూ మాటలకూ అందని మాహానంద పూర్ణస్వస్థితిని మాటలలో వర్ణించబూనడం, మాటలతో చూపించబూనడం దుస్సాహసం, అయినప్పటికీ మనకున్న

ఏకైక సాధనం, మాటలే కాబట్టి, ఆ మాటలతోటే, శబ్దాలతోటే నిశ్శబ్దాన్ని సూచించి నిశ్శబ్దంగా మనకు బోధిస్తారు,మనలను కూడా ఆ అనుభవంలో ఉండేలా చేస్తారు. వారే మహామునీంద్రులు,మహాత్ములు,గురువులు, వారందరికీ ఇదే మన మౌనాంజలి.

ప్రస్తుతం పంచమహాభూతాల సమ్మేళనంతో తయారయిన ఈ వస్తు మయ ప్రపంచంతో తాదాత్మ్యం చెంది, మాయా మోహితులమై, భ్రమకు లోనై బాధపడుతున్నాం. ఏకాగ్ర చిత్తంతో ధ్యానించి, స్థూల సూక్ష్మ శరీరాలు నేననే భ్రమనుండి బయటపడిననాడు, ఆ నిశ్శబ్ద నిరామయ స్థితిలో నిలబడగలిగి నప్పుడు వాసనలన్నీ నశించిపోతాయి. వాసనలే సర్వసృష్టికీ మూలం కాబట్టి అవి నశించిన నాడు, ధ్యానించేవాడు, ధ్యానం, ధ్యానలక్ష్యం, అన్నీ ఒక్కటే అయిన అనుభవంలో నిలచిపోవడం జరుగుతుంది.

దేనితోటి సంబంధం లేకుండా విడిగా నిలబడి చూసే వానిని సాక్షి అంటారు. ఒక ప్రమాదం జరిగిందనుకుంటే దానితో ఏ సంబంధమూ లేకుండా దూరంగా నిలబడి చూసేవాడు మాత్రమే సాక్షి అనబడుతాడు. మనందరిలోనూ కేవలం సాక్షిమాత్రంగా ఈ ఎఱుక, ఈ చైతన్యం, ఉండి, అన్ని సంఘటనలనూ చూస్తున్నది. అయితే చూసే నేను వేరుగా ఉన్నానని గుర్తించకుండా, చూడబడే మనశ్శరీరాలతోటే వాటి అనుభవాలతోటే తాదాత్మ్యం చెంది, సుఖదుఃఖాల నను భవిస్తున్నామనుకుంటూ, భ్రమపడుతూ బాధపడుతున్నాం! ఇదంతా కేవలం మన అజ్ఞానమే, మన భ్రమే! అచంచల దీక్షతో, ధ్యానంతో తనను తాను గుర్తించిన సాధకుడు, ఈ చూడబడే ప్రపంచానికీ తనకూ, సూర్యకాంతికీ వస్తువులకూ ఉన్నలాంటి సంబంధమే ఉందని గుర్తించి తీరుతాడు. ప్రకాశింపజేసేవాడు ప్రకాశింపబడేవాటికంటే ఎప్పుడూ భిన్నమే! నేను సర్వాన్నీ తెలుసుకునే తెలివిని మాత్రమే! చైతన్యమే నేను! తెలియబడే మనశ్శరీరాలూ ప్రపంచమూ నేనుకాదు! ధ్యానం మొదటిదశలో సర్వాన్నీ సాక్షిగా చూడగలగడం చాలా అవసరం. మరెంతో ప్రయోజనకరం. బాహ్యాభ్యంతరాలలో ఏది సంభవించినట్లు కనిపించినా సర్వానికీ నేను సాక్షిని మాత్రమే అని సర్వదా గుర్తించడం ధ్యానానికి మొదటి మెట్టు. ఈ శ్లోకం కైవల్యోపనిషత్తులోని ఒక శ్లోకాన్ని స్ఫురణకి తెస్తోంది.

న భూమిరాపో న చ వహ్ని రస్తి న చానిలో మేఽస్తి న చాంబరం చ
ఏవం విదిత్వా పరమాత్మరూపం గుహాశయం నిష్కలమద్వితీయం|| (23)
సమస్తసాక్షిం సదసద్విహీనం ప్రయాతి శుద్ధం పరమాత్మ రూపమ్ |(24) (కైవల్యోపనిషత్తు)

*భూమి,జలం,అగ్ని,వాయువు, ఆకాశం--ఇవేవీ లేనేలేవు. ఈ విధంగా హృద్గుహలో ఏకాకిగా, అద్వయంగా, సర్వసాక్షిగా, వ్యక్తావ్యక్త ప్రపంచాల కతీతంగా ఎవరైతే తననుతాను గుర్తిస్తారో అట్టి సాధకుడు సర్వాధిష్ఠానమైన సత్యమే తానయి ఆ అనుభవంలో అచంచలంగా ఉండిపోతాడు.*

**శ్లో॥ యది దేహం పృథక్ కృత్య చితి విశ్రామ్య తిష్ఠసి ।**
**అధునైవ సుఖీ శాంతః బంధముక్తో భవిష్యసి ॥ 4.**

**టీ॥** (త్వం=నీవు), దేహం=శరీరమును, పృథక్కృత్య = వేరుచేసి, చితి = చైతన్య రూప ఆత్మయందు, విశ్రామ్య = విశ్రాంతినిబొంది, (మనస్సును ఏకాగ్ర పరచి), తిష్ఠసి యది = ఉంటున్నవాడవైనట్లయితే, అధునా ఏవ = ఇప్పుడే, సుఖీ = సుఖివిగను, శాంతః=శాంతుడవుగను, బంధముక్తః = బంధమునుండి విడివడిన వాడవుగను, భవిష్యసి =కాగలవు.

**నీ శరీర తాదాత్మ్యమునుండి విడివడి, నీ ఎఱుకలో నిష్ఠలో నిలబడ గలిగిన తక్షణమే నీవు శాంతంగా ఆనందరూపంగా ముక్తుడవుగా నిన్ను నీవు గుర్తిస్తావు.**

ముక్తిని కాంక్షించేవారు వేటిని విషతుల్యంగా త్యజించాలో, వేటిని అమృతోపమానంగా భావించి సంపాదించాలో ఇదివరకే చెప్పబడింది. అలా చెయ్యడంలో లాభించే అనంతానంద స్వరూపస్థితికూడా వర్ణించబడింది. ఈ మార్గం నిరపాయమూ చాలా నిర్దుష్టమూ అనీ, లక్ష్యం తప్పకుండా చేరుకో గలరనీ ఇక్కడ స్పష్టం చేస్తున్నారు. కేవలం మనశ్శరీరాల తాదాత్మ్యము నుండి విడివడి మనస్సును అంతర్ముఖంచేస్తే చాలదు. గాఢనిద్రలో ఎవరికీ కూడా శరీర స్పృహ ఉండదు, అయినప్పటికీ ఆధ్యాత్మికానుభవం రావడంలేదుకదా! శరీరస్పృహనుండి విడివడుతూ తనదైన స్వరూపస్థితిలో తెలుసుకుంటూ నిలబడడానికి చేసే ప్రయత్నమే ధ్యానము.

మన ఆధ్యాత్మిక సాధనలన్నీ కూడా మనస్సును శాంతంగా ఉంచి ధ్యానానుకూలంగా మలచడానికే నిర్దేశించబడ్డాయి. ప్రగాఢమయిన ధ్యానంలో తన స్వస్థితిలో తాను నిలచిన తక్షణమే, పరిమితమయిన అహంకారం నశిస్తుంది, సహజంగా అనంతానంద రూపమయిన స్వస్థితిలో శాంతంగా బంధరహితంగా కేవలంగా ఉండిపోవడం జరుగుతుంది. అసంతృప్తి, ఆరాటం, బంధం బాధ ఇవన్నీ పరిమితమయిన అహంకారం మాత్రమే అనుభవిస్తుంది. వేదాంత వాఙ్మ

యంలో రెండు రకాలా దృఢాభిప్రాయాలున్నాయి. మరణానంతరం మాత్రమే ముక్తి సాధ్యమని కొందరి అభిప్రాయము. దేహం నశించేక మాత్రమే ముక్తి లభించడాన్ని విదేహముక్తి అంటారు. అష్టావక్రుడు, ఆచార్య శంకరులు మొదలైన వారు దేహం ఉండగానేకదా మిగతా మనుషులవలె కార్యకలాపాలు చేస్తు న్నప్పుడే ముక్త స్థితిని అనుభవించడం సాధ్యమని దృఢంగా చెప్పు తున్నారు. దీనిని జీవన్ముక్తి అంటారు. ఇప్పుడే, ఇక్కడే, జీవించి ఉండగానే ముక్తులవడం అని అర్థం. ఈ జీవన్ముక్తస్థితి వర్ణింపబడుతోంది ఈశ్లోకంలో. సరిగా ఇటువంటిదే యోగవాశిష్ఠంలో ఒక శ్లోకం ఉంది.

యది సర్వం పరిత్యజ్య తిష్ఠస్యుత్క్రాన్త వాసనః ।
అమునేవ నిమేషేణ తన్ముక్తోసి న సంశయః ॥ (యోగవాశిష్ఠం.)

*సర్వాన్నీ త్యజించి, వాసనారహితంగా నీవు నిలవగలిగిన క్షణంలోనే ముక్తి నందగలవు. ఇందుకు సందేహం ఏమ్మాత్రమూ లేదు.*

అనంతమూ ఏకమూ అయిన సత్యమే (ఆత్మే) ఉందనీ, సృష్టి అసలు లేనేలేదనీ బోధించే మాండూక్యకారిక, యోగవాశిష్ఠంవంటి ఉత్తమ గ్రంథాలకు నిజమైన పునాదులు ఈ అష్టావక్రగీతలో కనిపిస్తాయి. సృష్టి అసలు లేనేలేదని చెప్పే వాదాన్ని "అజాత వాదం" అంటారు.

ఏ వస్తువులయినా కలిగి ఉండడంలో నిజానికి యే బాధాలేదు. బాధ అంతా ఆ వస్తువులు మనమీద ఆధిక్యత చూపిస్తేనే. మనకు బాగా డబ్బుంటే సమస్యే లేదు. కాని ఆ డబ్బుకే మనం బానిసలమయితే అన్నీ సమస్యలే. ఆహారం ఎటువంటి దయినా మనం స్వీకరించడంలో దోషం లేదు. ఆ ఆహారమే మనలను ఆరగిస్తేనే అసలు చిక్కంతా!

ఇది బాగా అర్థం అయితే, ఇదే తర్కంతో మన ఆధ్యాత్మిక జీవిత విధానాన్ని చూద్దాం. మనశ్శరీరాలు మనకు ఉండడంలోనూ వాటిని ఉపయోగించు కోవడంలోనూ యే దోషమూ లేదు. తెలివైన వారు స్వతంత్రంగా హాయిగా ఉపయోగించుకో గలుగుతారు. వాటిని అజ్ఞానంలో మనమే మనశ్శరీరాలుగా భ్రమపడి వాటి అనుభవాలే మనవనుకొని, వాటి సుఖంకోసం సదా శ్రమపడుతూ, బానిసలమై, మన అహంకారాన్ని మనమే సృష్టించుకొని సంసారచక్రంలో నిస్సహాయంగా చిక్కుకుంటున్నాం!

ఈ అహంకారం తనమీద తానే యుద్ధం ప్రకటించుకొని, తానెవరని

ఆలోచించడం మొదలు పెట్టి, తాను చూసేవి తానుకానని తేల్చుకుని, ఏకాగ్ర బుద్ధితో, ధ్యానానుకూల మానసంతో తన స్వస్థితిని చేరుకోవడమే మొత్తం వేదాంతం సాధన అంతాకూడా. ఈ మనశ్శరీరాలు నేను కాదనీ, సమస్తాన్నీ సాక్షిగాచూసే చైతన్యమే తాననీ, తెలిసేలా చేసేదే వేదాంత సాధనా, ధ్యానమూ ఇదంతా క్లుప్తంగా ఈ శ్లోకంలో సూచింపబడింది.

**శ్లో॥ న త్వం విప్రాదికోవర్ణః నాశ్రమీ నాక్షగోచరః ।**
**అసంగోఽపి నిరాకారః విశ్వసాక్షీ సుఖీభవ ॥ 5.**

టీ॥ త్వం = నీవు, విప్రాదికః = బ్రాహ్మణుడు మొదలగు, వర్ణః = వర్ణము (జాతి) గలవాడవు, న = కావు, ఆశ్రమీ = నాలుగు ఆశ్రమములకు చెందినవాడవు, న = కావు, అక్షగోచరం = ఇంద్రియ విషయము, న = కావు, పరం తు = అయితే (నీవు), అసంగః = సంగరహితుడవు, నిరాకారః = నిరాకారుడవు, విశ్వసాక్షీ = విశ్వమునకు సాక్షివి, అసి = అగుచున్నావు, ఇతి = ఇట్లని, మత్వా = తలచి, సుఖీభవ = సుఖివిగమ్ము.

**నిజానికి నీవు బ్రాహ్మణ మొదలగు యే వర్ణానికీ చెందవు. ఏ ఆశ్రమానికీ చెందవు. ఇంద్రియాలచే నీవు చూడబడవు. సంగరహితుడవు, నిరాకారుడవు, సర్వసాక్షివి నీవు విచారాన్ని విడనాడి సంతుష్టుడవై జీవించు.**

హిందూమతంలో వ్యక్తులందరూ నాలుగు వర్ణాలుగా విభజింపబడ్డారు. ఈ విభజన ముఖ్యంగా, వ్యక్తులలో అంతర్గతంగా ఉన్న వాసనల కనుగుణంగా జరిగింది. వాసనలాధారంగా మనశ్శరీరాలూ, సమస్త బాహ్యసృష్టి ఉన్నట్టుగా గుర్తింపబడుతున్నాయి. చైతన్య ప్రకాశంలో శుద్ధమైన ఆత్మ, వాసనలనుండి స్వతంత్రంగా ఉంది, ఉంటుంది. మానవుల విభజన ఈ విధంగా జరిగిన అనంతరం వారి జీవితాలు నాలుగు దశలుగా విభజింపబడ్డాయి. వాటిని ఆశ్రమా లంటారు. 1) విద్యార్థి దశని బ్రహ్మచర్యమనీ, 2) ధర్మబద్ధంగా వైవాహిక జీవితాన్ని గడపడాన్ని గృహస్థాశ్రమమనీ, 3) ఇలా జీవించడంలోని అనుభవాలతో సత్యాన్వేషణాదృష్టి బయలుదేరి, తత్త్వాన్ని గురుముఖతః తెలుసుకోవడానికీ, తపస్సు చేయడానికీ కాలాన్ని వెచ్చించే దశని వానప్రస్థమనీ, 4) ఈ విచారణా, తపస్సూ ఫలితంగా అహంకార మమకారాలు మిథ్యగా భ్రమగా గుర్తించి, బంధాలనుండి విడివడి స్వతంత్ర జీవితాన్ని గడపడాన్ని సన్యాసాశ్రమమనీ అంటారు. ఈ విభజన చాలా స్పష్టంగా ఉంది. తనకు ప్రపంచానికీ ఉండే సంబంధంపట్ల, తనకుండే దృక్పథంలో మార్పునిబట్టి మానసిక పరిణామంలోని వివిధ దశలనూ, నాలుగు ముఖ్య

భాగాలుగా విభజించి, నాలుగు ఆశ్రమాలుగా నిర్దేశించారు. అనంతమైన ఆత్మ, అఖండంగా, అద్వితీయంగా ఉంది, ఉన్నది ఒకటే, తెలుసుకునేదీ తెలియబడేదీ లేవు, కాబట్టి ధర్మాధర్మాలు, జ్ఞానాజ్ఞానాలు ఉండే ఆస్కారమే లేదు. ఈ సత్యం తెలుసుకున్నాక జీవించే జీవితం కాబట్టి సన్యాసాశ్రమానికి ఏ విధినిషేధాలూ, ధర్మాలూ లేవు. అయినప్పటికి సమాజ క్షేమం కాంక్షించి, వారివల్ల సమాజానికి మేలు జరగాలి కాబట్టి వారికీ కూడా కొన్ని బాధ్యతలు కాని బాధ్యతలను సూచించారు. ఈ నాలుగు ఆశ్రమ ధర్మాలు కూడా ఆత్మకు లేవు, ఆత్మలో లేవు.

వర్ణధర్మాలూ, ఆశ్రమధర్మాలూకూడా ప్రాథమిక దశలో సాధకునికి మానసిక పరిణతి నివ్వడానికి తోడ్పడతాయి. ఆ దశలో సాధకుడు ఇంకా తన మనశ్శరీరాలతో తాదాత్మ్యం చెంది ఉంటాడు కాబట్టి. ఆ భావం నుండి విడివడడానికి ఇవన్నీ సహాయపడతాయి. పరిశుద్ధ ఆత్మస్వరూపాన్ని జ్ఞానేంద్రియాలూ మనస్సూ చూడలేవు. బుద్ధి తెలుసుకోలేదు. వీటన్నిటినీ చూస్తు ఉనికి నిచ్చేదే ఆత్మ. కాబట్టి క్లుప్తంగా చెప్పాలంటే ఆత్మ యేరకమయిన వస్తువూకాదు, ఇది కేవలం సత్ చిత్ మాత్రమే. సత్ అంటే ఉనికి (ఉన్నట్లుగా తెలియబడేది),చిత్ అంటే ఉన్నదానిని తెలుసుకునే తెలివి. ఉన్నట్లుగా అనిపించడమూ దానిని తెలుసుకుంటున్నట్టు భావించడమూ - ఇలా పరస్పరాధారంగా, అవినాభావంగా యేకంగా ఉండేదే సత్ చిత్ రూప ఆత్మ, అదే పరబ్రహ్మం.

సర్వసృష్టినీ చైతన్యవంతంగా ప్రకాశమానంగా చేసే, పరిశుద్ధ ఆత్మకు, సృష్టితో యే విధమైన సంబంధమూ లేదు, సూర్యకాంతిలో కనబడే సమస్త వస్తువులకు సూర్యునకు ఎలా సంబంధం లేదో, అదేవిధంగా ఆత్మకు ప్రపంచానికీ సంబంధమే లేదు. ఏ వస్తువుచేత పరిమితం కాదు, కాబట్టి ఆత్మకు యే రూపమూ ఉండదు. మనలో చిత్ రూపంలో ఉండి సర్వరూపాలనీ సాక్షిగా చూస్తూ ఉంటుంది. విశ్వాన్నంతటినీ చూస్తుంది కాబట్టి ఇది విశ్వసాక్షి. సంస్కృతంలో అక్షి అంటే కన్ను అని అర్థం. చూసే ఇంద్రియాన్ని కన్ను అని అన్నప్పటికీ చూడడం తెలియడం అనేది మొత్తం అనుభవాలనందించే అన్ని జ్ఞానేంద్రియాలకూ చెందినటువంటి సమిష్టిక్రియ. అక్షి అనేది ఈ తెలియబడడం అనే సమిష్టి క్రియని సూచిస్తుంది. ఈ అధ్యాయం మొత్తంలో నాలుగయిదుచోట్ల సర్వసాక్షిగా విశ్వసాక్షిగా ఆత్మ సూచింపబడింది. ఈ సర్వసాక్షి, విశ్వసాక్షి భావాలు శ్వేతాశ్వతరోపనిషత్తు (VI-II)లో వివరింపబడ్డాయి. భగవంతుడు సర్వానికీ సాక్షి

అని అక్కడ చెప్పడం ఆత్మను ఉద్దేశించే, మనస్సు లోనూ బుద్ధిలోనూ తెలియ బడే సర్వాన్నీ నిరాసక్తంగా అసంగంగా కేవలంగా చూస్తూ ఉంటుంది ఆత్మ. కైవల్యోపనిషత్తులోకూడా ఇటువంటి ప్రయోగమే ఒకటి ఉంది.

త్రిషుధామసు యద్ భోగ్యం భోక్తా భోగశ్చ యద్ భవేత్
తేభ్యో విలక్షణః సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః (కైవల్యోపనిషత్తు-18)

*జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనే మూడవస్థలలోనూ, అనుభవింపబడేదీ, అనుభవించే వ్యక్తి, అనుభవం అనే వాటన్నిటికంటే విలక్షణంగా ఉండే ఈ సాక్షీ, నిత్యమూ కళ్యాణ ప్రదంగా చిద్రూపంగా భాసిస్తూ ఉంటుంది.*

నిరాకారమూ సర్వసాక్షి అయిన ఆ ఆత్మవు నీవేననే ధ్యానంలో సదా సంతోషంగా జీవించు. మన కష్టసుఖాలూ, రాగద్వేషాలూ, వీటి సంఘర్షణా జనిత మయినవ్యథ, ప్రపంచ సంబంధమయిన సమస్యలూ అన్ని క్రమంగా క్షీణించి నశిస్తాయి. ధ్యానములో నిశ్చలత నిష్ఠ వృద్ధి అయినకొద్దీ సాధకునిలో శాంతమూ, సంతోషమూ, సమత్వమూ వృద్ధి అవుతూనే ఉంటాయి. చివరగా తనదైన ఆనంద రూపంలో తాను నిలవగలుగుతాడు.

**శ్లో॥ ధర్మాధర్మౌ సుఖందుఃఖం మానసాని న తే విభో ।**
**న కర్తాఽసి సంభోక్తాఽసి ముక్త ఏవాసి సర్వదా ॥ 6.**

టీ॥ హే విభో! = ఓ సర్వవ్యాపకుడా!, మానసాని = మనస్సంబంధములైన, ధర్మాధర్మౌ = ధర్మాధర్మములున్ను, సుఖం దుఃఖం = సుఖదుఃఖములున్ను, తే = నీకు, న = లేవు, చ = మరియు, త్వం = నీవు, కర్తా = కర్తవుగాని, భోక్తా = భోక్తవుగాని, న అసి = కావు, సర్వదా = ఎల్లప్పుడు, ముక్త ఏవ అసి = ముక్తుడవే అగుచున్నావు.

**ధర్మం, అధర్మం, సుఖం, దుఃఖం మొదలైవన్నీ మనస్సుకూ బుద్ధికీ చెందిన లక్షణాలు. నీకు చెందినవి కావు. ఓ సర్వవ్యాపీ! నవ్వు కర్తవూకావు, భోక్తవూ కావు, నీవు సర్వదా స్వతంత్రుడవు, ముక్తుడవు.**

అహంకారం ఉన్నంతసేపూ రెండు రకాల భావాలతో కూడి ఉంటుంది. కర్త తానని అనుకోవడం మొదటిది, అనుభవించేది తానని అనుకోవడం రెండవది బాహ్యప్రపంచంతో వ్యవహరించేటప్పుడు తానే చేస్తున్నాననుకుంటుంది. అంతరంగ ప్రపంచంలో మానసికంగా అనుభవిస్తున్నాను అని తలపోస్తూ ఉంటుంది. ఈ రెండు భావాలూ కలిసి అహంకారంగా భాసిస్తూ ఉంటాయి.

ఈ అహంకారం ప్రపంచంతో వస్తువులతో వ్యవహరిస్తున్నప్పుడు

మంచిని కోరుతున్నా చెడ్డని చెయ్యవలసి వస్తూనే ఉంటుంది. కర్తగా మంచి పనులనూ, చెడ్డపనులనూ కూడా చెయ్యవలసి ఉంటుంది. భోక్తగా అనుభవాలలో సుఖదుఃఖాల ననుభవిస్తూనే ఉంటుంది. ఈ విధంగా అహంకారం ద్వంద్వాల ప్రభావం నుండి,వాటి వల్ల ఉదయించే సంఘర్షణలనుండి, కష్టసుఖాలనుండి తప్పించుకోలేక బంధంలో ఉండిపోతుంది.

మంచిచెడుల సంఘర్షణా, బాధలు లేకుండా సుఖాలే ఉండాలని కోరుకోవడమూ, ఇవన్నీ కూడా మనోధర్మాలనీ, బుద్ధిలక్షణాలనీ, నీకు వీటితో యే మాత్రమూ సంబంధం లేదు. కాబట్టి సంతృప్తితో జీవించమనీ శిష్యునికి తెలియచెప్పుతున్నారిక్కడ గురువర్యులు. నిత్యశుద్ధమైన ఆత్మగా నీకు సంఘర్షణలూ సమస్యలూ యేమీ లేవు. అవన్నీ కేవలం నీ అహంకారానికి చెందినవి మాత్రమే.

అహంకారం తాను కర్తనని అనుకున్నప్పుడు బుద్ధిలో మంచిచెడ్డలను విమర్శించి నిర్ణయిస్తూ ఉంటుంది. ఈ మంచిచెడ్డలు బుద్ధికి చెందిన విలువలు మాత్రమే. ఇదే విధంగా మనస్సుతో తాదాత్మ్యం చెందిన అహంకారం కష్ట సుఖాలను అనుభవిస్తూ ఉంటుంది. ఇవి మనోధర్మాలు మాత్రమే. మనోబుద్ధులకు చెందిన కర్త, భోక్త, భావాలు సమష్టిగా అహంకారంగా వ్యవహరింపబడుతున్నాయి. ఈ మనో బుద్ధులతో తాదాత్మ్యం పోగానే, అవే నేననే భావంపోగానే, అహంకారం మాయం అయిపోయి ఆనందస్వరూపమైన ఆత్మమాత్రమే మిగిలి ఉంటుంది.

**శ్లో॥ ఏకో ద్రష్టాఽసి సర్వస్య ముక్తప్రాయోఽసి సర్వదా ।**
**అయమేవ హి తే బన్ధో ద్రష్టారం పశ్యసీతరమ్ ॥ 7.**

**టీ॥** ఏకః = ఒక్కడవే, సర్వస్య = సర్వమునకు, ద్రష్టా = చూచువాడవు, అసి = అగుచున్నావు, చ = మఱియు, సర్వదా =నిరంతరము, ముక్తప్రాయః= అత్యంత ముక్తుడవు, అసి = అగుచున్నావు, ద్రష్టారం = చూచువానిని, ఇతరం = ఇతరునిగా, పశ్యసీతియత్ = చూచుచున్నా ననుదేదిగలదో, అయమేవ = ఇదియే, తే = నీకు, బంధః = బంధము, హి = నిశ్చయము.

సర్వాన్నీ చూసే ఏకైక సాక్షివి నీవే, నీవు సర్వదా స్వతంత్రుడవే. నిన్ను నీవు ద్రష్టగా, సాక్షిగా భావించకుండా అన్యథా భావించడమే నీ బంధానికి కారణం.

నాలోని చైతన్య ప్రకాశంలో నా జ్ఞానేంద్రియాలు, మనస్సు, బుద్ధి పని చెయ్యడం జరుగుతోంది. ఏకంగా ఉండే చైతన్యం సాక్షిగా, ఈ ఉపకరణాల ద్వారా బాహ్యంగా వస్తు ప్రపంచాన్నీ, మానసిక యిష్టాయిష్టాలనూ, బుద్ధిలోని ఆలోచనలనూ గమనిస్తోంది. ఈ విధంగా ఆత్మ చైతన్యమే నాలో సాక్షిగా ఉంటూ నా జీవితాన్ని అనుభవాలనీ గుర్తిస్తోంది. ఇదే చైతన్యం. అందరిలోనూ సాక్షిగా ఉంటూ, అందరి మనశ్శరీరాలద్వారా అన్నిటిని తెలుసుకుంటూ, సర్వసాక్షిగా, ఏకంగా ఉంటోంది. ఈ చైతన్యమే నీవు, "తత్ త్వం అసి" కాబట్టి నీవు ఎప్పుడూ ముక్తుడవే. నిన్ను ఏది బంధించలేదు.

అయితే నీవు బంధింపబడి బాధలు పడుతున్నాననే భ్రమ ఎలా కలిగింది అనే అనుమానం రావచ్చు. ఈ సర్వాన్నీ సాక్షిగా చూసే చైతన్యమే నీవనే సత్యాన్ని విస్మరించి, ఆ ప్రకాశంలో పనిచేస్తున్నట్టున్న మనస్సు, బుద్ధి, అహంకారం శరీరాలనే నీవనుకొని భ్రమపడుతున్నావు. వాటి బాధలన్ని నీవిగా భావిస్తున్నావు, వాటి పరిమితులనుచూసి నిన్ను నీవు పరిమితంగా భ్రమ పడుతున్నావు. నీవు చూసే వాటినే నీవనుకునే ఉన్మాదావస్థలో ఉండడమే నీ బంధానికీ బాధలకూ కారణం.

ఆత్మమాత్రమే కేవలంగా ఏకంగా సర్వాన్ని తెలుసుకుంటూ సర్వ సాక్షిగా ఉంది. తెలియబడే విషయాలనేకం,అనంతం కానీ ఉన్న విషయి మాత్రం ఒక్కటే. ఈ ఉన్నట్లుగా స్ఫురించే వస్తుమయ ప్రపంచం ఆత్మమీద ఆరోపింప బడింది, అంటే ఆత్మలో ఉన్నట్టుగా భావింపబడుతోంది, భ్రమ కలగజేస్తోంది అని అర్థం. అగ్ని, వేడి ఎలా ఏకంగా అవినాభావంగా ఉంటున్నాయో, అదే విధంగా, ఆత్మ అంటేనే సత్ చిత్ స్వరూపం అని ఇదివరకే తెలుసుకున్నాం. సత్ అంటే ఉనికి అనీ, ఉన్నట్లుగా స్ఫురించడం అనీ, చిత్ అంటే ఆ ఉన్నదానిని తెలుసు కోవడమనీ కూడా ఇదివరకే తెలుసుకున్నాం. ఉన్నట్లుగా స్ఫురించడం అంటేనే చిత్ గా తెలియబడడం అన్నమాట. కాబట్టి సత్ ఉంటే చిత్ ఉంటుంది, సత్ అంటే చిత్ అన్నమాట. మనలో తెలుసుకునే తెలివే చైతన్యం, అదే సాక్షి, ఈ సాక్షి చైతన్యమే ఉన్నట్లుగా స్ఫురించే తన సత్ రూపాన్ని తాను తెలుసు కుంటున్నదన్నమాట. ఈ సత్ చిత్ రూప ఆత్మ సదా ఏకంగా, ఏకాంతంగా ఉంది, ఉంటున్నది, ఉంటుంది. ఎన్ని ఉన్నట్లుగా అనిపించినా ఉన్నది ఒకే ఒక ఆత్మ, ఇది ఏకం అద్వితీయం. ఆకాశాన్ని ఎంత జాగ్రత్తగా చూసినా నీలంగా

కనిపిస్తూనే ఉంటుంది, కాని నిజానికి నీలవర్ణం ఎక్కడ ఉంది వినీలాకాశంలో? ఆత్మ చిత్ గా-సాక్షిగా సత్ ను చూస్తూనే ఉంటుంది,తెలుసుకుంటూనే ఉంటుంది. ఉన్నట్టుగా స్ఫురించేది భావమే. తెలుసుకునేదీ భావమే. ఈ భావాలు విడివిడిగా మనచే గుర్తింప బడడానికి మధ్యలో నిశ్శబ్దంగా చలన రహితంగా ఆత్మ ఆనందంగా ఉంది. సత్ గా స్ఫురించినా ఆత్మే, చిత్ గా తెలుసుకున్నా ఆత్మే, వీటిమధ్య నిశ్శబ్దంగా ఆనందంగా ఉండేది ఆత్మే, ఉన్నదంతా సత్ చిత్ ఆనంద మైన ఆత్మ మాత్రమే. రెండవదేదీ లేనేలేదు.

ఇక్కడ కైవల్యోపనిషత్తు ముక్తకంఠంతో ఘోషిస్తున్న సత్యం స్ఫురణకు వస్తోంది.

అపాణిపాదోహ మచిన్త్యశక్తిః పశ్యామ్యచక్షుః స శృణోమ్య కర్ణః
అహం విజానామి వివిక్తరూపో నచాస్తి వేత్తా మమ చిత్సదాఽహమ్ ॥
(కైవల్యోపనిషత్తు **21**)

*నాకు ఏ అవయవాలూ లేవు, నా శక్తి అనంతం, కళ్ళులేకుండా చూస్తున్నాను, చెవులు లేకుండా వింటున్నాను, నాకు యే రూపమూలేదు, నాకు సర్వమూ తెలుసు, నన్ను తెలుసుకునేది వేరే యేదీ లేదు. నేను నిత్య శుద్ధ జ్ఞాన జ్యోతిని, జ్ఞానానంద స్వరూపోఽహం.*

## శ్లో॥ అహం కర్తేత్యహం మానమహాకృష్ణాహిదంశితః ।
## నాహం కర్తేతి విశ్వాసామృతం పీత్వా సుఖీభవ ॥ 8.

టీ॥ అహం=నేను, కర్తా = కర్తను, ఇతి = ఇట్లనెడి, అహం మాన = అహంకార మనెడి, మహాకృష్ణా హి = గొప్పకాలసర్పముచేత, దంశితః = కరువబడిన నీవు, నాహం కర్తా = నేను కర్తనుగాను, ఇతి = ఇట్లనెడి, విశ్వాసామృతం = విశ్వాసరూపమైన అమృతమును, పీత్వా = పానముచేసి, సుఖీ = సుఖివిగా, భవ = అగుము.

"నేను కర్తను" అనుకునే అహంకారం అనబడే మహాభయంకర కృష్ణ సర్పంచే కరవబడి విషంతో నిండి యున్నావు నీవు. ఈ అమృతాన్ని త్రాగి సుఖంగా ఉండు, నేను సాక్షిని మాత్రమే "నేను ఏదీ చెయ్యడమూ లేదు, అనుభవించడమూ లేదు," అనే భావనే అమృతంగా పానంచేసి, సుఖంగా ఉండు.

నేను చూస్తున్నాను, నేను వింటున్నాను. నేను ఆలోచిస్తున్నాను. మొదలైనవన్నీ వాడడానికి కారణం, మనం మన ఇంద్రియాలతోటే మనోబుద్ధుల తోటే తాదాత్మ్యం చెందడమే. ఇంద్రియాలూ మనోబుద్ధులూ కలిసి, చూడడం

వినడం ఆలోచించడం మొదలయినవన్నీ చేస్తున్నాయి. వాటికి పనిచేసే శక్తినిస్తున్న నీవే, అవి పనిచేస్తుంటే కర్తగా పొరపడుతున్నావు. ఈ భ్రమాజన్య భావంలో నుండే అహంకారం పుడుతోంది.

ఈ అహంకారం పనిచేస్తుంటే, విషయ భోగాలవైపు బలంగా ఆకర్షింపబడి వాటికి దాసులమై పోతున్నాము. ఈ ఆకర్షణతో, అనుభవించాలనే కోరికతో, కోరికలను తీర్చుకోవాలనుకునే పట్టుదలలోనుండి జనించే సమస్యాసంఘర్షణ బలంలో నలిగి నశించిపోతూ బంధంలో చిక్కుకుంటున్నాం, ఆధ్యాత్మికాభి వృద్ధికి అవకాశమే లేకుండాపోతుంది. అహంకారాన్ని కాలసర్పంతోనూ, అహంకారం పనిచెయ్యడంవల్ల వచ్చే ఫలితాలను ఆ విషసర్పం కరవడంవల్ల వచ్చే విష పరిణామంగానూ అష్టావక్రులు పోలుస్తున్నారు.

ఈ విషప్రభావం నుండి బయటపడడానికి ఒకే ఒక మార్గం ఉంది. ఇంద్రియ మనోబుద్ధులను నీవుగా భ్రమపడడం కారణంగా ఈ విషపరిణామం సంభవం అయింది కాబట్టి, మళ్ళీ తిరిగి ఈ భ్రమను పోగొట్టడానికి "ఇవేవీ నేను కాదు" అని అస్తమానం గుర్తుచేసుకోవడమే ఏకైకమార్గం. అహంకారం అనబడే విషానికి విరుగుడు కాబట్టే ఈ భావనను అమృతంతో పోల్చడం జరిగింది.

**శ్లో|| ఏకో విశుద్ధబోధోఽహం ఇతి నిశ్చయవహ్నినా ।**
**ప్రజ్వాల్యాజ్ఞానగహనం వీతశోకస్సుఖీభవ ॥ 9.**

**టీ||** అహం=నేను, ఏకః = ఒక్కడను, విశుద్ధబోధః = అతిశుద్ధ బోధస్వరూపుడను, ఇతి = అను, నిశ్చయవహ్నినా = నిశ్చయరూపమగు అగ్నిచేత, అజ్ఞానగహనం = అజ్ఞాన రూపారణ్యమును, ప్రజ్వాల్య = దహింపజేసి, వీతశోకః = పోగొట్టబడిన దుఃఖముగల వాడవై, సుఖీభవ = సుఖివికమ్ము.

**అజ్ఞాన మహారణ్యాన్ని, ఏకమయిన శుద్ధచైతన్యం నేనే అనే జ్ఞానాగ్నితో (భావనతో)దగ్ధం చేసి, సమస్త దుఃఖాలనుండీ విముక్తుడవై సంతోషముతో జీవించు.**

ఆత్మను సరిగా గ్రహించక అన్యథాగ్రహించడాన్ని, భావించడాన్ని వేదాంత భాషలో అజ్ఞానం అంటారు. ఈ అజ్ఞానం ఇక్కడ మహారణ్యంతో పోల్చబడింది. మహారణ్యంలో చిక్కుకున్నవానికి ఎలా దారితెలియక దట్టమయిన అడవిలోనికి పోయి పోయి ఆకలిదప్పులతో, రక్షణలేకుండా ఎలా జీవితం

దుర్భరం అవుతోందో అదేవిధంగా అజ్ఞానంలో చిక్కుకున్న వాడు కూడా బయట పడడం దుర్లభం. మహారణ్యంలో క్రూరమృగాలున్నట్లే అజ్ఞానారణ్యంలో అహం కారమూ రాగద్వేషాలూ మన నావరించి పూర్తిగా కబళించి వేస్తాయి. ఈ ఉపమానం మనశాస్త్రాలలో తరుచూ వాడబడుతూ ఉంటుంది.

దేశకాలావృతమయిన ప్రపంచం గురించి కార్యకారణసంబంధ రూపంలో ఉండే జ్ఞానాన్ని మనం ప్రస్తుతం మన బుద్ధిద్వారా గ్రహిస్తున్నాం. సాధనద్వారా బుద్ధిలో అలజడి తగ్గి, శాంతం వృద్ధి అయినప్పుడు, సహజంగా బుద్ధి అంతర్ముఖం అయి, నిశ్చలత్వాన్ని పొంది నిశ్శబ్దంగా తన సహజ శాంత స్థితిని గుర్తించడం జరుగుతుంది.

ఈ విధంగా స్థిరమూ శాంతమూ గంభీరమూ అయిన బుద్ధి తన స్వరూపా న్ని ధ్యానం చేసి, మననం చేసి శుద్ధస్థితినందుతుంది. దీనినే వేదాంత పరిభాషలో అంతఃకరణ శుద్ధి అంటారు. ఇలా శుద్ధి పొందిన అంతఃకరణ మాత్రమే సత్యాన్ని గ్రహించగలుగుతుంది, అనంతమైన ఆత్మస్వరూపంగా మిగిలిపోతుంది.

మనలో చైతన్యం ఉంది కాబట్టే, మన జ్ఞానేంద్రియాల ద్వారా, మనో బుద్ధులద్వారా ప్రపంచ జ్ఞానాన్ని పొందగలుగుతున్నాం. రాళ్ళలోనూ కర్ర లోనూ చైతన్యం లేదు. కాబట్టి అవి జడం, జడపదార్థానికి జ్ఞానం ఉండదు. చైతన్యం ఉన్నచోట జ్ఞానం ఉంటుంది. వస్తువులను అనుభవాలను చైతన్య వంతంగా గుర్తించడమే మనకున్న జ్ఞానమంతా. మనలోని చైతన్యం ప్రస్తుతం ఈ జ్ఞాన రూపంలోనే మనకు తెలియబడుతున్నది.

ఈ జ్ఞానంలో నుండి వస్తువులన్నిటినీ తీసివేయగా మిగిలినదే శుద్ధ జ్ఞానము, దీనిని విశుద్ధబోధ అంటారు.

సాధకుడు, తన ధ్యానంలో నిష్ఠ పెరిగినకొద్దీ, మనోబుద్ధుల ప్రభావం నుండి విడివడి, వాటి పరిధికతీతంగా ఉండే స్వస్థితిలో, ఉన్నది నేనే, నేనే శుద్ధ జ్ఞానాన్ని, విశుద్ధ చైతన్య స్వరూపాన్ని అని గుర్తించగలుగుతాడు. ఈ గుర్తింపులో ఈ విశుద్ధబోధలో, ఈ జ్ఞానాగ్నిలో అజ్ఞానం అనబడే మహారణ్యం దగ్ధం అయిపోతుంది అని అష్టావక్రులు అంటున్నారు.

మనకు యిష్టం అయిన వస్తువు దూరం అయితే బాధకలుగుతుంది.

ఈ బాధఅనేది' మనోలక్షణం మాత్రమే సుఖదుఃఖాలు, సంతోషవిచారాలు, మొదలయినవన్నీ మానసిక ఉద్రేకాలుగా మనస్సుచేతనే అనుభవింపబడతాయి. శుద్ధచైతన్య స్వరూపంగా నిలబడినప్పుడు, మనస్సును అధిగమించి, అతీతంగా ఉంటాం కాబట్టి, మనోలక్షణాలయిన బాధలక్కడ ఉండవు. ఈ ఆత్మస్వరూపాన్ని నీవుగా గుర్తించి, ఆ స్థితిలో నిష్ఠతో ఆనందంగా జీవించు.

**శ్లో॥ యత్ర విశ్వమిదం భాతి కల్పితం రజ్జుసర్పవత్ ।**
**ఆనన్దపరమానన్దః స బోధస్త్వం సుఖం చర ॥ 10.**

టీ॥ యత్ర = ఏ యానందస్వరూపమైన ఆత్మయందు, ఇదం = ఈ, విశ్వం = ప్రపంచము, కల్పితం = కల్పించబడినదై, రజ్జుసర్పవత్ = త్రాటియందు పామువలె, భాతి = తోచుచున్నదో, సః = ఆ ఆనంద, పరమానన్ద = ఆనందాతీత పరమానంద స్వరూపుడవును, బోధ---జ్ఞాన స్వరూపుడవును, త్వం = నీవు, అసి = అగుచున్నావు, (అందువలన), సుఖం = సుఖపూర్వకముగా, చర = సంచరింపుము.

**పరమానందపూర్ణచైతన్యమే నీవు. ఆ చైతన్యంలో ఈ ప్రపంచం, రజ్జువులో సర్పంవలె గోచరించి భ్రమింపజేస్తోంది. భ్రమనువీడి, ఆనందపూర్ణ చైతన్యంగా హాయిగా జీవించు.**

పరమార్థతః సాధకుడు, సాధ్యమయిన పరమాత్మకంటే భిన్నంకాదని క్రిందటి శ్లోకంలో చెప్పేరు. మననిత్య జీవితంలో అనుక్షణమూ అనంత వస్తుమయ మయిన ప్రపంచాన్ని బాహ్యంగా చూస్తున్నాం. అంతర్గతంగా మనస్సు యిష్టా యిష్టాలు, కోరికలు, బుద్ధి ఇంకా అనేకానేక భావాలు ఉండడం గుర్తిస్తున్నాం. ఇవన్నీ ఎక్కడనుండి వచ్చేయి? ఎలా పుట్టాయి? పరిశుద్ధమయిన ఆత్మ ఏకంగా అద్వయంగా ఉన్నట్టయితే, ఈ చూడబడే ప్రపంచమూ, చూడడానికి ఉపకరణాలుగా ఉపయోగపడే మనశ్శరీరాలు అసత్యం కావాలి. ఈ అసత్యం ఎక్కడనుండి పుట్టింది? సత్యంలో నుండి అసత్యం జనించగలదా? జనిస్తే రెండవది ఉన్నట్టే కదా!

నానాత్వభ్రాంతి కలిగిస్తున్న ఈ మాయా ప్రపంచపు ఉనికి గురించి వివరించడానికి, వేదాంతంలో ఎంతో అందమయిన ఉపమానం వాడబడింది. సాయం సంధ్యాసమయంలో, మసకచీకటిలో ఒకతాడు పాముగా భావింపబడింది. అది తాడే అన్నజ్ఞానం కలిగిన వెంటనే భ్రాంతసర్పం మాయం అయిపోతుంది. తాడు అని గ్రహించకపోవడమే పాముగా అన్యధాగ్రహింపబడడానికి కారణం అవుతుంది. ఈ అన్యధా గ్రహణమే మిగిలిన భయానికీ బాధలకూ కారణం

అవుతున్నది. ఇదే విధంగా మన స్వస్వరూపమయిన సత్ చిత్ ఆనందాన్ని గుర్తించక- పోవడమే (అగ్రహణం), మనశ్శరీరాహంకారాలతో కూడిన జీవుడూ, అనంతవస్తుమయమయిన ప్రపంచంగా గుర్తింపబడి, భయభ్రాంతులను కలుగ జెయ్యడానికి కారణం అవుతున్నది. అధిష్ఠానమయిన ఆత్మను గుర్తించగానే ఆరోపింపబడిన ప్రపంచం మిథ్య అవుతున్నది. అధిష్ఠానమయిన తాడుని గురించి తెలియగానే ఆరోపింపబడిన పాము అదృశ్యమయినట్టే!

ఈ అనంతానందమే నీవు అని అష్టావక్రులు నిశ్చయంగా చెపుతున్నారు. ఈ ఆత్మమీదే ప్రపంచం ఆరోపింపబడింది. తాడు మీద పాము ఆరోపింపబడి నట్టుగా! నీదైన ఆనందములో నిష్ఠతో నిలబడి హాయిగా జీవించు.

ధ్యానాభ్యాసం మొదలుపెట్టిన సాధకునికి ఈ శ్లోకాలన్నీ చాలా ఉపయోగపడతాయి. ఏకాంత స్థలంలో దృష్టిని అంతర్ముఖంచేసి ఈ శ్లోకాలను మందస్వరంతో చదువుకుంటూ, అర్థం చూస్తుంటే, బాగా మననం జరిగి ధ్యాననిష్ఠ కుదురుతుంది.

**శ్లో॥ ముక్తాభిమానీ ముక్తో హి బద్ధో బద్ధాభిమాన్యపి ।**
**కిం వదంతీహసత్యేయం యా మతిస్సాగతిర్భవేత్॥11.**

టీ॥ **ముక్తాభిమానీ** = ముక్తియందు అభిమానముగలవాడు, ముక్తః = ముక్తుడగు చున్నాడు, బద్ధాభిమానీ = బంధమునందు అభిమానము కలవాడు, బద్ధః = బద్ధుడగు చున్నాడు, మతిః = బుద్ధి, యా = ఎటువంటిదో, గతిః = గతి, సా = అటువంటిది, భవేత్ = అగును, ఇతి = ఇట్లని, ఇహ = యీ లోకములో, ఇయం = ఈ, కింవదంతి = లోకప్రవాదము, సత్యా = సత్యమైనది.

తనను తాను ముక్తునిగా భావించేవాడు ముక్తుడే. బద్ధునిగా భావించేవాడు బంధంలోనే ఉండిపోతాడు. "యద్భావం తద్భవతి"-- ఎలా భావిస్తాడో అదే అయి తీరతాడు అనేది పరమసత్యం.

"యామతిః సా గతిః" మనం ఎలా భావిస్తామో అదే మనం అయిపోతాము. మనలను మనం నిస్సహాయులుగా, పరిమితత్వాలతో మనశ్శరీరాలతో బంధింప బడిన జీవిగా తలపోస్తూ అంటే మనగతి యింతే. ఇలా కాకుండా శాస్త్రాలు మన స్వస్వరూపం యేదని చెపుతున్నాయో దానినే అస్తమానమూ ధ్యానిస్తే, మన స్వస్థితిని తప్పకుండా గుర్తించగలుగుతాము. ఉపనిషత్తులు కూడా దీనినే గట్టిగా

చెపుతున్నాయి. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"-- మన బంధ స్థితికి మోక్షానికీ కూడా మనస్సే కారణం.

యోగవాశిష్టంలో కూడా ఇటువంటిదే చెప్పబడింది. "యత్ చిత్తం తన్మయో భవతి పూరుషః"-- మనస్సులో ఉదయించిన ఆలోచన, మానసిక తాదాత్మ్య శక్తితో రూపుదాల్చి నిజంగా కనిపిస్తుంది.

ఆధ్యాత్మిక జీవితంలో, సాధనలో కూడా ఈ నిజాన్ని చూడవచ్చు. నిజంగా పామున్నట్టుగా మనం పడిన భ్రమ, తాడును ఏవిధంగానూ మార్చడం లేదు. ఇదే విధంగా నిత్యశుద్ధ అనంత చైతన్యం ఎప్పుడూ కూడా అది గుర్తించే అనుభవించే జగత్తుగా మారనేలేదు. ఆత్మను ఆత్మగా గ్రహించని అజ్ఞానంనుండి వాసనలు, వాసనల నుండి కోరికలు, కోరికలనుండి మనోబుద్ధులూ అవి చూపించే ప్రపంచమూ స్వప్నంలో వలెనే కనిపించి ఆ సమయంలో నిజమనే భ్రమను కల్పించడం జరుగుతున్నది. స్వప్నంలో నుండి మేలుకున్న వానిని స్వప్నం బాధించదు, కాని ఆ మాయ ప్రభావంలో ఉన్నంతసేపూ బాధపడక తప్పదు. ఆత్మను గ్రహించకపోవడం (అగ్రహణం) నుండి, ప్రపంచాన్నీ దాని బాధలను గ్రహించడం (అన్యధాగ్రహణం) అనే భ్రమ ఉదయిస్తున్నది. పొరపాటుగా యేర్పరచుకున్న భావాలను సరైన అవగాహనతో సరైన భావాలతో సరిచెయ్యవచ్చు. మన స్వస్వరూపాన్ని తరుచూ, అస్తమానం గుర్తుచేసుకోవడం (ధ్యానంవలన మనదైన ఆత్మానుభవం పొంది ఆనందంగా జీవించవచ్చు.

**శ్లో|| ఆత్మాసాక్షీవిభుః పూర్ణ ఏకో ముక్తశ్చిదక్రియః |**
**అసంగో నిస్పృహశ్శాంతో భ్రమాత్సం సారవానివ||12.**

టీ|| ఆత్మా = ఆత్మ, సాక్షి = సాక్షి, విభుః = వ్యాపకము, పూర్ణః = పూర్ణము, ఏకః = ఏకము, ముక్తః = ముక్తము, చిత్ = చైతన్యరూపము, అక్రియః = క్రియారహితము, అసంగః = సంగరహితము, నిస్పృహః = ఇచ్ఛారహితము, శాంతః = శాంతమునై యున్నది, భ్రమాత్ = భ్రాంతివలన, సంసారవాన్ ఇవ = సంసారముకలది వలె తోచుచున్నది.

ఆత్మ కేవలము సాక్షి. సర్వవ్యాపి. పూర్ణం. అద్వయం. ముక్తం, చిద్రూపం, అకర్త, అసంగం, శాంతం. మాయా ప్రభావంతో ప్రపంచంగా సంసారంగా భావించబడుతోంది.

ఆత్మానుభవం పొందిన, బ్రహ్మనిష్ఠులైన అష్టావక్రమునీంద్రులు ఇది వరకు చెప్పినసారాన్నే మరల ఈ శ్లోకంలో చెప్పారు. నీవు ఈ శరీరమూ మనసూ కావు, పరిశుద్ధమైన ఆత్మవే నీవు.

ఆదిమధ్యాంతం శూన్యమైన అపరిమిత సత్యాన్ని పరిమితమయిన మాటలలో వర్ణించడం సాధ్యం కాదు. అయినప్పటికీ మన మహర్షులు భాషతోనే భాషకతీతమయిన సత్యాన్ని సూచించడానికి ఒక ప్రత్యేక పద్ధతిని రూపొందించారు. ఈ పద్ధతిలో ప్రత్యేకశ్రద్ధతో వాడబడిన మాటలయొక్క బాహ్యార్థం ఎలా ఉన్నా, వాటి లక్ష్యార్థం మాత్రము ధ్యాన నిష్ఠాగరిష్ఠుడయిన సాధకునికి ఆత్మానుభవాన్ని తప్పక అందించి తీరుతుంది. తత్ +త్వం+అసి (తత్త్వమసి) మహావాక్య లక్ష్యార్థ సారాన్ని ఈ శ్లోకంలో అందిస్తూ క్రిందటి పదకొండు శ్లోకాలలోనూ వివరింపబడిన దానినే సంగ్రహంగా మళ్ళీ చెప్పేరు.

ఆత్మను సాక్షి అనడంలో, ఇది సర్వాన్నీ చైతన్యవంతం చేస్తుందనీ, చైతన్యవంతం చెయ్యబడే వాటికంటే ఇది ఎప్పుడూ వేరేననీ స్పష్టంగా చెప్పేరు. ఈ సాక్షి సర్వవ్యాపి విభుః. ఏవిధంగా భ్రమాజన్యమయిన పాము నిండా తాడు ఉందో, అదే విధంగా సర్వప్రపంచంలోనూ అధిష్ఠానమయిన ఆత్మ వ్యాపించే ఉంది. ఆత్మ సర్వగతమనీ, అన్ని ప్రాణులలోనూ ఆత్మే ఉందనీ సూచింపబడు తున్నది. ఇది పూర్ణం, దీనిలో కొత్తగా చేర్చవలసింది ఏదీలేదు, అలాగే తీసివేయ బడేదికూడా ఉండదు. స్తంభాన్ని భూతంగా భ్రమించడంలో స్తంభానికి క్రొత్తగా యేమీ చేరలేదు. ఆ భ్రమపోయినప్పుడు పోయేదికూడా యేమీ ఉండదు. ఈ కనిపించే సర్వనామ రూపాలకు ఆత్మే అధిష్ఠానంగా ఉంది.

ఈ ఆత్మ ఏకం, ఉన్నది ఒక్కటే కాబట్టి సర్వస్వతంత్రం, "ముక్తః", ఇది తెలుసుకునే చిత్ కాబట్టి ఇది అకర్త. "అక్రియః". ఆకాశంలో ఎన్ని కదులుతున్నా ఆకాశానికి ఎలా కదలికలేదో అదేవిధంగా చిత్ లో ఎన్ని తెలియబడుతున్నా చిత్ యేమీ చెయ్యడం లేదు. అకర్తగా అక్రియగా ఉంది, ఉంటోంది.

ఆకాశంలో ఎన్ని ఉన్నా అవన్నీ ఆకాశానికి ఎలా సంబంధించి లేవో, అదే విధంగా ఆత్మలో (చిత్ లో) ఎన్ని తెలియబడుతున్నా, ఉన్నట్లు కనిపించినా ఆత్మ అసంగమే "అసంగః". (నిస్పృహః)---ఇందులో ఏ కోరికలు లేవు. వాసన లుంటే కోరికలుంటాయి. వాసనలనే ప్రకాశింపజేసే ఈ చైతన్యంలో కోరికలెలా ఉంటాయి? కోరికలే లేవు కాబట్టి ఆలోచనల అలజడులూ, అంతులేని శారీరక

క్రమా ఉండజాలవు. కాబట్టి ఈ పరమ సత్యం---"శాంతః"---శాంతంగా వర్ణింప బడినది.

అనల్పభావాన్ని అల్పపదాలతో వర్ణించారు. ఈ పది పదాలనీ మననం చెయ్యగలిగిన మనస్సు, మనస్సు కతీతమైన మహత్తర సత్యాన్ని గ్రహించ గలదు, భావనాతీతమైన అనుభవంలో నిలచిపోగలదు. ఈ పరిణామరహితమైన ఆత్మ, అజ్ఞానంవలన, మాయాప్రభావంతో పరిమితమైన అహంకారంగా, జీవుడు గా పరిణామం చెందినట్లు అనిపిస్తోంది.

చూస్తున్నాను, ఆలోచిస్తున్నాను, అనుభవిస్తున్నాను అని భావించే వ్యక్తిగత అహంకారం, బాహ్యాభ్యంతరాలలో అనేకానేక ఆకర్షణలకులోనై వాసన లను సృష్టించుకుంటుంది. ఈ పోగుచేసుకున్న వాసనలను అనుభవించడానికి అనేక దేహాలలో పుడుతూ, మరణిస్తూ కొత్తవాసనలను పోగుచేసుకుంటూ జనన మరణచక్రంలో చిక్కుకుని దుర్భర వేదన ననుభవిస్తుంది. ఈ పరిభ్రమణమే సంసారం అనబడుతుంది.

నిజానికి ఆత్మ అంహకారంగా జీవుడుగా మారడంలేదు. తాడు పాముగా మారడం లేదు, స్తంభం భూతంగా పరిణామం చెందడం లేదు. అలా మారి అనంతవేదన ననుభవిస్తున్నట్టుగా భ్రమను మాత్రమే కలుగజేస్తోంది.

**శ్లో॥కూటస్థం బోధమద్వైతం ఆత్మానం పరిభావయ ।**
**ఆభాసోఽహం భ్రమం ముక్త్వాభావం బాహ్యమథాంతరం॥13**

టీ॥ అహం = నేను, ఆభాసః = ఆభాసరూప అహంకారి జీవుడను, ఇతి=ఈ ప్రకార మగు, భ్రమం = భ్రాంతిరూపమగు, బాహ్యం = బాహ్యమైనట్టియు, అంతరం = లోపల నున్నట్టియు, భావం = భావమును, ముక్త్వా = విడిచిపెట్టి, కూటస్థం = కూటస్థుడనని, బోధం = జ్ఞానరూపుడననియు, అద్వైతం = ద్వైత రహితుడనియు, ఆత్మానం = నిన్ను, పరిభావయ = చింతింపుము.

**బాహ్యాభ్యంతరాలలో అలజడిని సృష్టించే భావాల్ని విడనాడి, నేను అహంకారాన్ని అనే భ్రమని వీడి సత్ చిత్ ఆనందమయమయిన ఆత్మనే నేను అనే ధ్యానంలో సంతోషంగా జీవించు.**

ఆత్మ అంటే అర్థం యేమిటో దానికోసం ఎక్కడ అన్వేషించాలో సూచించే బాణం గుర్తులవంటి మాటలను యింతవరకూ వాడి సాధకులను ఆత్మాభిముఖు

లను చేసేరు అష్టావక్రమునీంద్రులు. ఆ మాటలను చూడడం కాక అవి చూపించే లక్ష్యార్థమయిన ఆత్మను తనలో సర్వసాక్షిగా ఉండడాన్ని గుర్తించమని ఈ శ్లోకం లో గట్టిగా నొక్కి చెపుతున్నారు. నిశ్చలమూ శాంతమూ అయిన మనస్సుతో, మనస్సు బుద్ధీ అహంకారమూ నేననే భ్రమనువీడి, వాటికుండే పరిమితులను తనవిగాపడే బాధను విడచిపెట్టి, వీటన్నిటినీ చూసే సాక్షివైపు దృష్టి మళ్ళించి, తన్ను తాను సత్ చిత్ రూపంగా ధ్యానించాలి. సదా తెలుకుంటూ ఉండాలి.

ఈ గీత మొత్తంలో ఈ ఒక్క శ్లోకంలో మాత్రమే ధ్యానం చెయ్యమని శిష్యుడిని ఆదేశిస్తున్నారు. ఇకముందు ఈ భావాన్ని కూడా అధిగమించి, ధ్యానం చెయ్యడమే తన అసంపూర్ణత్వాన్ని అంగీకరించడంగా తెలుసుకొని ధ్యానాన్ని కూడా విడనాడమని చెప్పబోతున్నారు మునీంద్రులు. ధ్యానం చెయ్యాలి అనే భావం ఉండడమే ఆత్మని తెలుసుకోకుండా, దూరంగా రెండవదిగా ఉన్నానని భ్రమపడడం అవుతుంది, పూర్ణమైనది ఆత్మ అంటూనే అవమానించడం అవుతుంది.

ఆత్మలక్షణాలను మనస్సులో యాంత్రికంగా జపించడం ధ్యానం కానేరాదు. ఇంతవరకూ చెప్పబడిన వాక్యాలను బాగా మననం చేసి,లక్ష్యార్థాన్ని బుద్ధితో చేరుకుని, సందేహ రహిత స్థితిలో నిశ్చలంగా బుద్ధి నిలచిపోవాలి. ఇలా నిశ్చలంగా శాంతంగా నిలచిన బుద్ధితో, యే క్షణాన్నయినా సత్యాన్ని దర్శించ బోతున్నానన్న ఎఱుకతో ఏకాగ్రంగా ఉన్న మనస్సుతో సాధకుడు నిలవగలగడమే ధ్యానానికి పరమావధి. భావశూన్యమయినప్పటికీ బహుజాగ్రత్తగా, సర్వవిషయా లనూ విస్మరించి, విషయీ సాక్షీ అయిన ఆత్మమీద దృష్టి నిలపడాన్ని ఇక్కడ 'పరిభావయ' అన్నపదం సూచిస్తుంది.

'కూటస్థ' అన్నపదం ఇందులో వాడబడింది. ఇది చాలా అర్థవంతమైనది. అనేకార్థాలు కలిగినదీకూడా. కూట అంటే 1) పర్వత శిఖరాగ్రం, 2) చిత్రమైన మాయ, (3) కమ్మరి ఇనుప సామానులను వంచడానికి సాగదియ్యడానికి కొట్టేటప్పుడు ఆధారంగా వాడే దిమ్మవంటిది (దాగిలి) అనే అర్థాలున్నాయి. ఈ అర్థాలన్నీ కూడా ఇక్కడ వాడబడ్డాయి. ఆత్మే అన్నిటికంటే సర్వోన్నతమయినది, శిఖరాగ్రంవంటిది, కనిపించే మాయా ప్రపంచం అంతటికీ అధిష్ఠానం ఆత్మే. దీనిమీద సర్వమూ కనబడి రూపుమార్పుకుంటున్నా ఇదిమాత్రమే స్థిరంగా ఉండేది.

సర్వసృష్టికీ ఆధారంగా అధిష్ఠానంగా ఉండే సత్యాన్ని, ఆత్మని, వేదాంతభాషలో బ్రహ్మం అంటారు. ఇదే ఆత్మ మనోబుద్ధుల ద్వారా వ్యక్త మయిన గుర్తింపబడడాన్ని "ఆభాస" అంటారు. ఇదే జీవుడుగా వ్యవహరింప బడుతుంది.

శ్లో॥ దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక! ।
బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీభవ ॥ 14.

టీ॥ పుత్రక! = ఓ కుమారా!, (త్వం = నీవు), దేహాభిమానపాశేన = దేహాభిమాన మనెడి త్రాటిచేత, చిరం = చాలాకాలం నుండి, బద్ధః = కట్టుబడినవాడవు, అసి = అగుచున్నావు, అహం = నేను, బోధః = జ్ఞానస్వరూపుడను, ఇతి = అనెడి, జ్ఞానఖడ్గేన = జ్ఞానఖడ్గము చేత, తత్ = ఆ పాశమును, నికృత్య = ఛేదించి, సుఖీభవ = సుఖివి కమ్ము.

**పుత్రా! నీ దేహమే నీవు అనే భావంతో చిరకాలంగా బంధింపబడి ఉన్నావు. సర్వాన్నీచూస్తున్న సాక్షిచైతన్యమే నీవనే భావమనే జ్ఞానఖడ్గంతో, ఈ బంధాన్ని ఛేదించి సంతోషంతో జీవించు.**

ఈ మధ్యనే ఒక క్రిష్టియను మతగురువు గా॥జార్జి అనే ఆయనచే హిందూమతం స్వీకరింపబడింది. ఆయనకు జనార్దనం అనే పేరు పెట్టబడింది. ఈ తతంగమంతా అయిన మరునాడే ఒకాయన చప్పట్లుకొట్టి "జనార్దనంగారూ" అని పిలిచాడు. ఈ వ్యక్తి పలకకుండా వెళ్ళిపోతున్నాడు. మొదటి వ్యక్తి పరుగెత్తుకునివెళ్ళి, భుజంతట్టి, "మీరు జనార్దనంగారేనా?" అని అడిగేడు. ఇవతలి వ్యక్తి పొరబడ్డాడన్న భావాన్ని సూచిస్తూ చిరునవ్వుతో "మీరు పొర పడ్డారు, నేను జార్జిని" అన్నాడట! ఇంత తతంగం జరిగి మతం మార్చుకుని క్రొత్తపేరును జనార్దనంగా గ్రహించినప్పటికీ, తన పాతపేరుతో చిరకాల సహవాసం కారణంగా కొత్తపేరును మరిచిపోయాడు. ఈ క్రొత్తదృష్టిలో నిలబడడానికి కొంత కాలవ్యవధి అవసరం అన్నమాట.

అనేకవేల జన్మలనుండి శరీరమే నీవనుకుంటూ పరిణామం చెందుతూ, ఈ మానవ దేహం ధరించి, నీ బుద్ధి గొప్పతనాన్ని నువ్వు తెలుసుకుంటూ అభినందించుకుంటూ, మనశ్శరీరాలే నీవనే దృఢభావంలో స్థిరపడి ఉన్నావు. దీనిని కాదని ఒక్కమారు తెలుసుకుంటే సరిపోదు. కృషితో దీక్షతో సదా ధ్యానించి

నీ స్వరూప స్థితిలో నిలవగలగడానికి కాలవ్యవధి అవసరమవుతుంది. ఇదంతా అర్థం చేసుకుని జాలితో ప్రేమతో అష్టావక్రులు చెపుతున్నారు. కాబట్టే 'పుత్రక' అని సంబోధించడం జరిగింది.

ఆత్మతత్త్వాన్ని, సత్యాన్ని బోధించి, దానిని ఎక్కడ ఎలా సాధించాలో వివరించిన గురువర్యులు ఇకమీదట ఏమీ చెయ్యలేరు. భ్రమలో ఉన్న సాధకుడే తన భ్రమను పోగొట్టుకోవాలి. తానే సత్ చిత్ ఆనందాన్ని గ్రహించాలి. అందుకనే ఎంతో ప్రేమతో మరెంతో ఆత్రుతతో ఇలా అంటున్నారు- 'ఈ శరీరమే నీవనుకునే అజ్ఞానాన్ని, ఆత్మవే నీవనే నిశ్చయమనే జ్ఞానఖడ్గంతో ఛేదించు' నీ స్వస్థితిని గుర్తించి సంతోషంతో జీవించు.

మనశ్శరీరాలు నీవనుకుని పొరపడడంతో బాధామయమయిన సంసార చక్రంలో చిక్కుకుని దారి తెలియకున్నావు. అజ్ఞానం నశించగానే జ్ఞానం అక్కడే ఉండడాన్ని గుర్తిస్తావు. చైతన్యమయమయిన ఆత్మవునీవే అని దృఢంగా తెలుసుకుని హాయిగా జీవించు.

శ్లో॥ నిస్సంగో నిష్క్రియోఽసి త్వం స్వప్రకాశో నిరంజనః।
అయమేవ హి తే బంధః సమాధిమనుతిష్ఠసి ॥ 15.

టీ॥ త్వం = నీవు, నిస్సంగః = సంగరహితుడవు, నిష్క్రియః = క్రియా రహితుడవు, స్వప్రకాశః = స్వయం ప్రకాశరూపుడవు, నిరంజనః = దోష రహితుడవు (ఇట్లుండగా), త్వం=నీవు, సమాధిం = చిత్తవృత్తి నిరోధమాత్రరూప సమాధిని, అనుతిష్ఠసి=అనుష్ఠించుచున్నావు, (ఇతియత్ = అనునదేదిగలదో), అయమేవ = ఇదియే, తే = నీకు, బంధః = బంధము.

**నీవు నిస్సంగుడవు, నిష్క్రియుడవు, స్వయంజ్యోతివి, నీలో ఏ మాలిన్యమూ లేదు, దీనిని ధ్యానించు, ఈ విధంగా నీ బంధాన్ని తొలగించుకో.**

నీ మనశ్శరీరాలతోగాని, వానిచే అనుభవింపబడే వస్తువులతోగాని ఆత్మకు ఏ సంబంధమూ లేదు. స్తంభానికి భూతంతోగాని, దానివల్ల కలిగే కష్టనష్టాలతోగాని ఏ సంబంధమూ లేనట్టే, పరిమితమైనది మాత్రమే అపరిమితం కావాలనే కోరికతో కర్మలను చెయ్యగలదు. ఆత్మ అనంతమూ పూర్ణమూ కావడం వల్ల ఇందులో కోరికలూ లేవు, వాటి ఫలితమయిన కర్మలూ ఉండవు,

ఇది నిష్క్రియం. ఇది స్వయం జ్యోతి. కళంకరహింతగా "నిరంజనః" సర్వ వాసనలకు అతీతంగా, వాటిని చైతన్యవంతం చేస్తూ చిత్ రూపంలో మనలో సాక్షిగా ఉండి, స్థూల సూక్ష్మకారణ శరీరాలను చూస్తున్నది.

ఆత్మకు యే బంధమూ లేదు. ఇది నిత్యముక్తము. కాబట్టి దానికి ధ్యానంతో పనిలేదు. ధ్యానం చేస్తున్నామంటే, ధ్యానించే, వేరుగా తలచే అహంకారం కొద్దిగానయినా మిగిలి ఉన్నట్టే. ఈ వేరు భావం పూర్తిగా పోయేదాకా బాగా మననం చెయ్యాలి. నిద్రకోసం ప్రయత్నిస్తున్నంతసేపూ నిద్ర ఉండదు, నిద్ర పోతూ వుంటే నిద్రకోసం ప్రయత్నమే ఉండదు! సర్వాన్నీ చైతన్యవంతం చేస్తూ సర్వానికీ సాక్షిగా ఆత్మే ఉంది, ఆ ఆత్మే నేను అనే భావం దృఢమయే దాకా మననం చెయ్యాలి. ఈ దృఢజ్ఞానం వచ్చేక "నేను" కాని మనోబుద్ధులతో ధ్యానం ఎందుకు చేస్తాను?

ధ్యానం ద్వైతభావాన్నీ బంధస్థితనీ సూచిస్తుందనీ నిత్యముక్తమయిన ఆత్మ అయిన తనకు ధ్యానంతో పనిలేదని అనగలిగే అష్టావక్రుని వంటి ఆత్మ నిష్ఠులు చాలా అరుదుగా ఉంటారు. బంధం ఉందన్న భావన ఉంటేనే ముక్తి కోసం ప్రయత్నిస్తారు. ధ్యానిస్తున్నామంటే శాస్త్రం చెప్పే దానిని సరిగ్గా అర్థం చేసుకోలేదని అర్థం అవుతున్నది, ఉన్నది ఒకే ఒక ఆత్మ, అదే స్వయం జ్యోతిగా, సర్వసాక్షిగా, సర్వత్రా ఉంది అన్నది సరిగ్గా అర్థం అయితే నేను వేరుగా ఉండే అవకాశమేలేదు. వేరేలేనప్పుడు ధ్యానం ఎందుకు? కాబట్టి శాస్త్రం చెప్పేది అర్థం అయేవరకూ శ్రవణమూ మననమూ చెయ్యడమే మన కర్తవ్యం.

చిత్తశుద్ధితో, నిజాయితీతో సత్యాన్నన్వేషించే సాధకునికి ఈ శ్లోకంలో అత్యంత విలువయిన సూచన ఉంది. బాహ్యంగా నేను చేస్తున్నాను, చూస్తున్నాను, అనుభవిస్తున్నాను మొదలయిన ఆలోచనలన్నీ అణిగిపోయినప్పటికీ, అంతర్గతంగా అహంకారం నేను ధ్యానిస్తున్నాను అనే ఆలోచనతో అస్తిత్వాన్ని నిలుపుకోవడానికి ప్రయత్నిస్తూ ఉంటుంది. ఈ విధంగా బీజప్రాయంగానయినా ఆలోచన ఉందంటే, అది ఎప్పుడు మహారణ్యంగా విస్తరిస్తుందో మనకే తెలియదు, ధ్యానం మళ్ళీ గుర్తువచ్చేసరికి మనం ఎక్కడయినా ఉండవచ్చు. ధ్యాననిష్ఠలో చివరి దశకు చేరిన వారందరిలోనూ బహుశా, ఈ "నేనుధ్యానిస్తున్నాను" అన్నభావన ఆటంకంగా ఉంటుంది కాబోలు. ఈ దశను దాటి ధ్యానాన్ని వీడి ధ్యేయ స్థితిలో

ఉండడం కష్టమవుతూ ఉంటుంది వీరందరికీ. అందుకే ఈ శ్లోకంలోని సూచన సాధకులకు అత్యంత విలువైనది, తనలో అంతర్గతంగా తెలియకుండా మిగిలి పోయిన కర్తృత్వభావన ధ్యానంగా మిగిలిపోతుంది. అనే హెచ్చరిక ఉంది దీనిలో.

యోగవాశిష్ఠంలో కూడా ఇటువంటి సూచనలనే చూడవచ్చును.

సాధో సమాధిశబ్దేన పరాప్రజ్ఞోచ్యతే బుధైః
అజస్రమంబువహనాద్ యధా నద్యా న రుధ్యతే. (అధ్యా. 62-9)
తధాత్మ జ్ఞానహీనాత్మా కాలోజ్ఞస్య న లభ్యతే. (అధ్యా. 62-19)

*ఓ సాధూ!అంతటా ఉండే పరమాత్మే నాలో కూడా ఆత్మగా ఉంది అని తెలుసు కోవడమే, ఆ అనుభవంలో ఉండడమే సమాధి అనబడుతుంది. నదిలోని నీరు నిత్యమూ ఎలా ప్రవహిస్తూ ఉంటుందో, అదే విధంగా సమాధి స్థితుడయిన వానిలో ఏకమయిన ఆత్మనే నేను అనే భావం సర్వదా ఉంటుంది.*

అటువంటప్పుడు అతడు ధ్యానం ఎలా చేయగలడు? దేన్ని గురించి ధ్యానిస్తాడు? అసలు దేనికోసం ధ్యానించాలి? ఆత్మజ్ఞానాన్ని పొందడాన్ని ప్రజ్ఞ అంటారు. స్థితప్రజ్ఞుడయిన వానిలో ఏకమయిన ఆత్మచైతన్యమే నేను, ఈ చిత్తే సర్వప్రాణులలోనూ చైతన్యంగా వ్యక్తమవుతోంది అనే జ్ఞానం ఎప్పుడూ ఉంటుంది. అందుకే వశిష్ఠులు ఆశ్చర్యంగా ఇలా అంటున్నారు.

సర్వగః సర్వదైవాత్మా సర్వమేవ చ సర్వధా
అసమాధి హి కౌసా స్యాత్ సమాధిరపి కః స్మృతః. (యోగవాశిష్ఠం అధ్యా.62-64)

*ఆత్మసర్వవ్యాపిగా, అందరిలోనూ చైతన్యంగా వ్యక్తమవుతూ అంతటా ఎల్లప్పుడూ ఉండగా సమాధిస్థితి లేకపోవడం ఎలా సంభవం? అసలు సమాధిస్థితి వేరే ఉండడం ఏమిటి?*

## శ్లో॥త్వయా వ్యాప్తమిదం విశ్వం త్వయి ప్రోతం యథార్థతః।
## శుద్ధబుద్ధస్వరూపస్త్వం మాగమః క్షుద్రచిత్తతామ్ ॥16.

టీ॥ ఇదం=ఈ, విశ్వం=ప్రపంచము, త్వయా = నీచేత, వ్యాప్తం = వ్యాప్తమైనది, త్వయి = నీయందే, ప్రోతం = కూర్చబడినది, త్వం = నీవు, యథార్థతః = నిజముగా, శుద్ధబుద్ధస్వరూపః = శుద్ధచైతన్య స్వరూపుడవు, క్షుద్రచిత్తతాం = నీచమైన చిత్తవృత్తిని, మాగమః = పొందకుము.

నీవు ఈ విశ్వం అంతటా వ్యాపించి ఉన్నావు, ఈ విశ్వం నీలో ఉన్నట్టుగా భాసిస్తోంది. పరిశుద్ధమయిన ఆత్మచైతన్యమే నీవు. క్షుద్రమయిన భ్రమాజన్య భావాలకు తావిచ్చి విచారానికి లోనుకావద్దు.

ఏ వస్తువయినా ఉన్నదంటే, ఆ వస్తువు తయారుకావడానికి కారణ మయిన పదార్థాన్ని అంతటా పూర్తిగా కలిగి ఉంటుంది. వస్తువు తయారవడానికి కావలసిన కారణాన్ని ఉపాదానకారణమని అంటారు. కుండ ఉందంటే దాని ఉపాదాన కారణమయిన మట్టి కుండ అంతటా పూర్తిగా ఉండి తీరుతుంది. ఏ ఆత్మ చైతన్యంవల్ల ఈ ప్రపంచము ఉన్నట్టుగా తెలియబడుతున్నదో, ఆ చైతన్యం ప్రపంచం అంతటా తప్పకుండా ఉండితీరాలి. మన మనస్సులో కల తెలియబడుతున్నప్పుడు, కలను చూస్తున్నప్పుడు, ఆ స్వప్నం అంతటా మనస్సే నిండి ఉండి అనేకంగా భ్రమ కలిగిస్తూ ఉంటుంది. ఇది మన అందరికీ అనుభవమే. నీవు ఆత్మ, కాబట్టి నీవు ఈ విశ్వమంతటా వ్యాపించే ఉన్నావు.

మనస్సులో పుట్టిన స్వప్నమంతటా మనస్సు ఉంటుంది. అంతేకాదు ఆ స్వప్నం మనస్సులో మాత్రమే ఉనికి కలిగి ఉంది. మనస్సులోనే మనస్సు చేతనే నిర్మించబడింది. మనస్సులోనే ఉనికిని కలిగి ఉండి అందులోనే లయమయి పోతుంది. మనస్సునుండి విడిగా స్వప్నం లేదు. మట్టితో కుండ తయారయింది. కుండ అంతా మట్టికుండ మట్టిలోనే ఉనికి కలిగి ఉండి మట్టిలో లయిమయిపోతుంది. కుండ ఉన్నా లేకపోయినా మట్టే ఉంది. ఇదే విధంగా, పరిశుద్ధమయిన ఆత్మ చైతన్యమే నీవు, నీలోనే, నీవల్లనే, ఈ వివిధ ప్రత్యేక రూప సమన్వితమయిన విశ్వం అంతా ఉనికిని కలిగి ఉంది, నామరూపాలతో గుర్తింప బడుతోంది.

నీలోనే నీవల్లనే ఈ ప్రపంచం ఉనికిని సంతరించుకున్నప్పటికీ ఇది నిన్నేవిధంగానూ బంధించదు, పరిమితం చేయలేదు. అద్వయమూ పరిపూర్ణ మూ అయిన ఆత్మ చైతన్యంలో విషయాలూ విషయీ కూడా పడుగు పేకలవలె అల్లుకుపోయి ఏకంగానే ఉంటాయి, ఇలా అద్వయంగా ఉంటేనే అనేక భ్రాంతిని కలిగిస్తూ అసాధారణమూ అనిర్వచనీయమూ అయిన జగన్నాటకాన్ని ప్రదర్శించే మహాశక్తివంతమయినది ఈ ఆత్మ చైతన్యం.

ప్రతివస్తువుకూడా ఏదో ఒక నామం రూపంతోటె గుర్తింపబడతాయి. ఈ ప్రపంచంలో మనకి తెలిసేదేదయినా ఈ నామ రూపాలలోనే ఉంది. ఈ సర్వ నామ రూపాలూ ఉన్నట్టుగా బుద్ధిలో గుర్తింపబడడానికి కారణమయిన సద్వస్తువూ అధిష్ఠానమూ నీవే. నీ స్వస్థితిని మరిచి, నీచే గుర్తింపబడేవానిని నీవుగా పొరపడి, వాటి లక్షణాలను పరిమితులను నీవిగా భావించి బాధపడడం

ఉన్మాద లక్షణం,వివేకవంతులు చేసేపనికాదు. నిన్ను నీవు మనశ్శరీరాహంకారా లతో పరిమితమయిన జీవునిగా భావిస్తూ విచారపూర్ణ జీవితాన్ని అనుభవించడం విచారకరం. "క్షుద్రభావాలకు తావివ్వకు" అని అష్టావక్రులు హెచ్చరిస్తూ, నీకంటే గొప్పది రెండవదేదీ లేదు అని నిశ్చయంగా బోధిస్తున్నారు.

**శ్లో॥ నిరపేక్షో నిర్వికారో నిర్భరశ్శీతలాశయః ।**
**అగాధబుద్ధి రక్షుబ్ధో భవ చిన్మాత్రవాసనః ॥ 17.**

టీ॥ త్వం = నీవు, నిరపేక్షః = కోరికలేనివాడవుగను, నిర్వికారః = వికారరహితుడవుగను, నిర్భరః = చిద్ఘనరూపుడవుగను, శీతలాశయః = శాంతి ముక్తి స్థానముగను, అగాధబుద్ధిః = అగాధ చైతన్య బుద్ధిరూపుడవుగను, అక్షుబ్ధః = అవిద్యాక్షోభరహితుడవుగను, చిన్మాత్రవాసనః = చైతన్యమాత్ర స్వరూపస్థితుడవుగను, భవ = అగుము.

**నీవు కోరదగినదేదీ లేదు, నీవు పరిణామరహితుడవు, సమదృష్టి కలిగిన సాక్షివి, జ్ఞానస్వరూపమే నీవు, సర్వాన్నీ చైతన్యవంతంచేసే చిన్మాత్ర రూపివి వాసన అంటూ ఉంటే, కేవలం ఆ చైతన్యాన్నే కోరుకో (ఇంక వేరే కోరదగినదేదీలేదు)**

శుద్ధమూ పూర్ణమూ ఏకమూ అయిన ఆత్మవు నీవే కాబట్టి నీవు దేనిమీదా ఆధారపడిలేవు. (నిరపేక్షః). నీకు పరిమితులు లేవు. సర్వత్రా సర్వదా నీవు పూర్ణానివే (నిర్భరః), అహంకారయుక్తమయిన జీవితంలో అసంఖ్యాకంగా కోరికలు అగ్నిజ్వాలల వలె దహించి వేస్తుంటాయి. ఇందుకు భిన్నంగా ఆత్మవే నీవనే భావంలో నిలువగలిగినప్పుడు అనంత పరిపూర్ణ శాంతమే నీవుగా స్థిరంగా ఉంటావు (శీతలాశయః).

మహనీయమూ, మాననీయమూ అయిన ఈ ఆత్మను, ఈ చిత్ స్థానాన్ని, మహర్షులు వర్ణించేటప్పుడు సాధారణంగా ఆత్మానుభవాని కర్తమయిన స్థితిని సూచిస్తుంటారు. ఉపనిషత్తులలో విరివిగా ఈ పద్ధతి వాడబడింది. ఏదో ఒక నామవాచక విశేషణంతో ఆత్మను సూచించి దానిగురించి చర్చిస్తుంటారు. ఇక్కడ ఆత్మ "అగాధబుద్ధిః", "అక్షుబ్ధః" అని చెప్పబడింది. అగాధబుద్ధి అంటే ఆలోచనా రహితంగా స్థిరమూ గంభీరమూ అయిన బుద్ధి అని అర్థం. ఈ బుద్ధిలో చైతన్యం సహజంగా ఉంటుంది. ఇక్కడ స్వరూపానుభవం సాధ్యమవుతుంది.

సాధకులందరికీ సాధారణంగా ఆచార్యులందరూ ఒకేసలహాని ఇస్తుంటారు.

"చైతన్యాన్ని సదా కోరుకో "భవ చిన్మాత్రవాసనః" మన కోరికలవల్ల ఆలోచనలు మారుతుంటాయి. ఆలోచనలతో అనుభవాలుద్భవిస్తాయి. ప్రాపంచిక వస్తు సంబంధ మయిన కోరికలుంటే, దానికి తగిన ఆలోచనలు రావడం, నానాత్వంగా భాసించే ప్రపంచానుభవం కలగడమూ జరుగుతుంది. ఏదికోరితే అది అనుభవంగా వస్తుంది. కాబట్టి దీక్షతో నిశ్చలంగా, సదా ఆత్మానుభవాన్నే కోరుకో. నీ ఆలోచనలన్నీ ఆత్మమయం అయి, నిత్యమననం జరిగి ఆత్మానుభవంలో సహజంగా ఉండడం జరుగుతుంది.

**శ్లో॥ సాకారమనృతం విద్ధి నిరాకారం తు నిశ్చలమ్ ।**
**ఏతత్తత్త్వోపదేశేన న పునర్భవసంభవః ॥ 18.**

**టీ॥** సాకారం = శరీరాదికములగు దృశ్యములను, అనృతం = మిథ్యగా, విద్ధి = తెలిసికొనుము, నిరాకారం = నిరాకారమగు ఆత్మతత్త్వమును, నిశ్చలం=చలన రహితమై నిశ్చలమైనదానినిగా, విద్ధి=ఎఱుగుము, ఏతత్ = ఈ, తత్త్వోపదేశేన = యథార్థోప దేశము చేత, పునః = మఱల, భవసంభవః = సంసారమునందు పుట్టుట, న భవతి = జరుగదు.

**రూపం ఉన్నది నశిస్తుందనీ, రూపరహితమైనది నిత్యమనీ తెలుసుకో. ఈ జ్ఞానంవల్ల పునర్జన్మలనుండి ముక్తిని పొందగలవు.**

కిందటి శ్లోకంలో అగాధబుద్ధివే నీవు, ఆ బుద్ధిని సాధించు అని చెప్పబడింది. నిజాయితీగా సాధనచెయ్యగోరే సాధకునికి ఇక్కడ ఒక సమస్య ఎదురౌతుంది. ఆలోచనలు లేకుండా చేద్దామని ప్రయత్నించేకొద్దీ, అనంతంగా అవి ఉదయించి దృష్టిని మళ్ళిస్తూనే ఉంటాయి. గత అనుభవాలాధారంగా మనో బుద్ధులు అనేకానేక రూపాల్ని నామాల్ని ఊహించి రూపించి చూపిస్తూనే ఉంటాయి. మనస్సుని శాంతంగానూ బుద్ధిని నిశ్చలంగానూ ఉంచడాని కనువైన పద్ధతినొకదానిని సూచిస్తు న్నారిక్కడ అష్టావక్రమహర్షి.

సాధకులు తాము సాధించదలుచుకున్న దానిని స్పష్టంగా అర్థం చేసుకుని తీరాలి. ధ్యానంలో సత్యమయిన దానిని సాధించాలనుకుంటున్నాడు. సాధకుడు సత్యం అంటే ఏమిటో అర్థం చేసుకోవాలి. ఏది సత్యమో అది నిత్యం, భూత భవిష్యద్వర్తమానకాలాలలో ఇది మార్పుచెందదు, ఇది కాలానికతీతం. కాలబద్ధం కాదు. పరిణామరహితమైనది అంటే రూపం లేనిదన్నమాట. రూపం ఉంటే మార్పు ఉండే తీరుతుంది. దీనికి భిన్నంగా భూతకాలంలో లేనిదీ,

భవిష్యత్తులో ఉండనిదీ, వర్తమానంలో ఉన్నట్టు కనిపిస్తున్నదీ ఆ సత్యం, మిథ్య అన్నమాట. స్తంభం నిజం, భూతం మిథ్య, జాగ్రత్ స్థితి నిజం, స్వప్నం మిథ్య సముద్రం నిజం. తరంగాలుమిథ్య, అనుక్షణమూ మార్పు చెందుతూ ఉండే నానాత్వ ప్రపంచం మిథ్య, అధిష్ఠానమయిన ఆత్మసత్యం. మనోబుద్ధులతో వాటి ఊహా వ్యూహరచనలమధ్య నిలబడి, అంటే మిథ్యమధ్యలో నిలబడి సత్యాన్ని దర్శించాలనుకుంటున్నాడు సాధకుడు.

శరీరం మనస్సు బుద్ధీ అనుభవాలూ ఉద్రేకాలూ ఆలోచనలూ అన్నీ అనునిత్యం మారుతునే ఉంటాయి. కాబట్టి అవి అసత్యం. ఇవి ఉన్నట్టుగా స్ఫురింప జేస్తూ, గుర్తిస్తూ, లేకపోవడాన్ని(అభావాన్ని)కూడా చూసే ఆత్మ నిత్యమయినది. ఈ విధంగా ఏది సత్యమో, ఏది అసత్యమో స్పష్టంగా తెలిసిన సాధకుడు అసత్యాన్ని విస్మరిస్తూ, సత్యాన్ని స్మరిస్తూ లక్ష్యాన్ని చేరడం సులభం అవుతుంది. "రూపం కలది", అనుభవయోగ్యమయినది, అసత్యమని తెలుసుకో, నిరాకారమైనది మార్పు చెందదు, కాబట్టి అది సత్యమని తెలుసుకో.

ఈ సూచనతో, సహజంగా సాధకుని దృష్టి, అనుభవాల నందించే మన శ్శరీరాలనుండి శుద్ధచైతన్య రూపమయిన సాక్షివేపు మళ్ళుతుంది. ఈ సత్య స్వరూప జ్ఞానంలో నిష్ఠకలగగానే, అజ్ఞాన జనితమయిన అహంకారమూ, దాని కల్పనా మాత్రమయిన ప్రపంచమూ కూడా మిథ్యగా సాధకునిచే గుర్తింప బడతాయి. ఆ తరువాత అవి ఉన్నా లేనట్టే, ఆకాశంలో నీలవర్ణం కనిపిస్తున్నా లేదని తెలిసినట్టే, కనిపిస్తున్నా ప్రపంచం మిథ్య అని తెలుస్తూనే ఉంటుంది.

శ్లో॥ యథై వాదర్శమధ్యస్థే రూపేఽన్తః పరితస్తు సః ।
తథైవాస్మిన్ శరీరేఽన్తః పరితః పరమేశ్వరః ॥ 19.

టీ॥ యథా ఏవ = ఏ ప్రకారముగానైతే, ఆదర్శమధ్యస్థే = అద్దము యొక్క మధ్య భాగమునందున్న, రూపే=ప్రతిబింబమునందు, అన్తః పరితః = అంతట, సః = ఆ శరీరం, భాసతే=తోచుచున్నదో, తథైవ=అట్లే, అస్మిన్‌శరీరే = ఈ శరీరమునందు, అంతఃపరితః = లోపల వెలుపలకూడా, పరమేశ్వరః = పరమేశ్వరుడు, భాసతే = భాసించుచున్నాడు.

అద్దంలో కనిపించే ప్రతిబింబములోనూ ప్రతిబింబం పైనాకూడా ఏ విధంగా అద్దం వ్యాపించి ఉంటుందో, అదేవిధంగా శరీరంలోపలా పైనా కూడా పరమాత్మ ఆవరించి ఉంటుంది.

ధ్యానించేటప్పుడు సాధకుడు తనలో సాక్షిగా ఉండే చైతన్యాన్నే స్మరించినా, క్రమంగా మనశ్శరీరాల తాదాత్మ్యమునుండి భ్రమాజన్య బాధల నుండీ విడవడిన తరువాత,అనంత చైతన్యస్వరూపంగా తన్ను తాను గుర్తిస్తాడు. అప్పుడతనికి బాహ్యాభ్యంతరాలనేవి ఉండవు. ఉన్నదంతా ఎఱుకలోనే చైతన్యం లోనే ఉంది. నా ఎఱుకలోనే నా శరీరమూ ప్రపంచమూ కూడా ఉన్నాయి, ఆ ఎఱుకే నేనని తెలిసిన సాధకునికి బాహ్యాభ్యంతరాలెలా ఉంటాయి? ఈ బాహ్యా భ్యంతరాలనేవి కేవలం శరీరానికి చెందినవే కాని ఆత్మకు కాదు.

ఒకగదిని ఒకకుండని చూస్తే వాటి దృష్ట్యా ఆకాశం లోపలా పైనాకూడా ఉంటుంది. గది గోడలని తీసేసినా, కుండ పగిలిపోయినా, ఆకాశం బాహ్యాభ్యంతర శూన్యంగా ఏకంగా మిగిలిపోతుంది. ఇదే విధంగా సాధకుడు మనశ్శరీరాలతో సాధన మొదలుపెట్టి, అవి తాను కానని తెలుసుకుని, తన్ను సర్వగతమూ సర్వ వ్యాప్తమూ అయిన చైతన్యంగా తెలుసుకున్నప్పుడు,అంతవరకూ తనవనుకున్న పరిమితులు కూడా మాయం అయిపోతాయి, అఖండాత్మ స్వరూపంగా మిగిలి పోతాడు.

ఈభావాన్ని బోధించడానికే ఇక్కడ అద్దమూ ప్రతిబింబమూ ఉదాహరణగా చెప్పేరు అష్టావక్రులు. అద్దంలో ప్రతిబంబానికి బాహ్యాభ్యంతరాలలో అద్దమే ఉంటుంది. ప్రతిబింబం అద్దంలో మాత్రమే ఉనికిని కలిగి ఉంటుంది. ప్రతిబింబం పోయినా అద్దం మామూలుగా మిగిలే ఉంటుంది. అది ఉన్నప్పుడు కూడా అద్దానికి దానితో ఏ విధమయిన సంబంధమూ ఉండదు. ఇదే విధంగా చైతన్యంలో, చైతన్యం వల్లనే, స్థూల సూక్ష్మ కారణ శరీరాలు ఉన్నట్టుగా, వాసనా బలం కారణంగా స్ఫురిస్తూ నర్తిస్తూ తెలియబడుతున్నాయి. మనలో వీటి ప్రతి బింబమే అహంకారంగా గుర్తింపబడుతోంది.

గతవాసనలు ఆధారంగా ఈ మూడు శరీరాలు కూడా ఉన్నట్టుగా భ్రాంతిని కలిగిస్తున్నాయి. ఆత్మని గుర్తించని అజ్ఞానం కారణంగా ఇవి నిజంగా ఉన్నాయనే భ్రమ కలుగుతోంది. భూతాన్ని చూస్తున్నప్పటికీ స్తంభమే ఉంది, శరీరాన్ని చూస్తున్నప్పటికీ ఆత్మే ఉంది శరీరంగా, చైతన్యంలో ఆత్మలో.

ఏ విధంగా అద్దంలో ఉన్న ప్రతిబింబం అద్దానికి సంబంధించిలేదో, అదే విధంగా ఈ మూడు శరీరాలూ అవి చూస్తున్న ప్రపంచమూ ఉన్నట్టున్నా ఆత్మకి సంబంధించి లేవు. ఆత్మ చైతన్యం ఉండడంవల్లే అవి ఉన్నాయి, ఉన్నట్టు తెలియ

బద్దాయి. అయినా చైతన్యానికి ఏవిధంగానూ సంబంధించి లేవు. ఆరోపింపబడిన ప్రపంచం ఉన్నప్పుడు లేనప్పుడూ కూడా ఉన్నది ఆత్మే.

ఈ ఉపమానాన్ని వాడుతూ యిచ్ఛాపూర్వకంగానే అష్టావక్రులు 'పరమేశ్వర' అనే మాటను కూడా వాడేరు. ఉన్నట్టున్న జీవుడూ, జీవుడున్న ప్రపంచమూ ఆ ప్రపంచ సృష్టికర్త అయిన భగవంతుడూ, మూడు మూడు ముఖ్యభాగాలుగా అజ్ఞానంలోనుండి జనించే భ్రమలో అహంకారంచే గుర్తింప బడుతున్నాయి. బాహ్యంగా ఇలా గుర్తింపబడుతున్నట్టే అంతర్గతంగా స్థూల సూక్ష్మ కారణ శరీరాలుగా అహం-కారంలో గుర్తింపబడుతున్నాయి. ఇలా గుర్తింప బడేదంతా అజ్ఞానంవల్ల ఉదయించిన భ్రమ అనీ, నిత్యమూ అన్నిటికీ అధిష్ఠానంగా ఉండేది ఆత్మచైతన్యం మాత్రమే అనీ స్పష్టం చేస్తున్నారు.

శ్లో|| ఏకం సర్వగతం వ్యోమ బహిరంతర్యథా ఘటే ।
నిత్యం నిరంతరం బ్రహ్మ సర్వభూతగణే తథా || 20.

టీ|| యథా = ఏ ప్రకారంగా, సర్వగతం = సర్వవ్యాపకమైనట్టియు, ఏకం = అద్వితీయమైనట్టియు, వ్యోమ = ఆకాశము, బహిః = వెలుపల, అంతః = లోపల, ఘటే = ఘటమునందు, అస్తి = ఉంటున్నదో, తథైవ = అట్లే, నిత్యం = నిత్యమైనట్టియు, నిరంతరం = నిరంతరమైనట్టియు, బ్రహ్మ = బ్రహ్మము, సర్వభూతగణే = సమస్తభూత శరీరములయందును, అస్తి = ఉంటున్నది.

**సర్వవ్యాప్తమయిన ఆకాశం ఏవిధంగా కుండకి పైనా లోపలా ఉంటుందో, అదేవిధంగా సర్వవ్యాప్తమూ, అచలమూ అయిన బ్రహ్మతత్త్వం చరాచర జగత్తంతటా నిండి ఉంది.**

కిందటి శ్లోకంలో అద్దమూ ప్రతిబింబమూ ఉపమానంగా చూపిస్తూ మనోజ్ఞంగా ఆత్మయొక్క సర్వవ్యాపకత్వము సూచింపబడి, ఆత్మయొక్క అసంగత్వం కూడా చెప్పబడింది. ఈ అధ్యాయానికి చివరిదైన ఈ శ్లోకంలో, అన్నిటి లోనూ అంతర్లీనంగా ఆత్మే ఉంటుందని చెప్పబడింది. ఈ భావాన్ని అందించ డానికి మరొక చక్కని ఉదాహరణని ఉపనిషత్తులనుండి గ్రహించి మనకందిస్తున్నారు మునీంద్రులు. అకాశంలో ఉండే అన్ని కుండలలోనూ కూడా ఆకాశమే ఉంటుంది. అదేవిధంగా ఉన్నట్టుగా గుర్తింపబడే సమస్త వస్తువుల లోనూ, సర్వనామరూపాల లోనూ బ్రహ్మతత్వమే నిండి ఉంటుంది. (సర్వ-భూత-గణే).

ఘటాకాశం (కుండలోని ఆకాశం). ఆ ఘటం యొక్క పరిమాణంచే పరిమితమైనట్లుగా కనిపిస్తుంది. అదే ఆకాశం ఆ ఘటం కారణంగానే శుభ్రం గానూ అశుభ్రం గానూ కూడా తోచవచ్చు. కాని నిజానికి అకాశానికి పరిమితి ఎక్కడ? అదేవిధంగా అనంతమైన చైతన్యంలో అన్ని ఉపకరణాలూ ఉపాధులూ ఉన్నట్టనిపిస్తాయి, ఆడుకుంటాయి, అంతమయిపోతాయి. అన్నిటిలోనూ చైతన్యమే. పరిమితమయి ఉన్నట్టుగా భ్రమకూడా కలుగజేస్తుంది.

ఈ ఘటాకాశ ఉదాహరణ వేదాంతంలో తరుచుగా వాడబడుతూ ఉంటుంది. ఆత్మ అన్నిటిలోనూ ఉందని ఈ ఉపమానం ద్వారా చెప్పబడుతున్నది.

•••

# అధ్యాయం - 2

# ఆత్మ - అత్యద్భుతం

మానసాతీతమయిన అనుభవాన్ని మాటలలో వర్ణించడానికి మహర్షు లందరూ ప్రయత్నించేటప్పుడు, సరైన మాటలు దొరకక, ఎలా చెప్పాలో తెలియక ఆశ్చర్యానందాల మధ్య అస్పష్ట పదజాలంతో అసంపూర్ణంగా ఆ అనుభవాన్ని అభివర్ణిస్తారు. బ్రహ్మతత్త్వాన్ని ప్రత్యేక పద్ధతిలో కొన్ని మాటలు వాడి లక్ష్యార్థాలతో సూచిస్తూ తెలియజెప్పగల సమర్థతగల ఉపనిషద్ ఋషులు కూడా చాలాచోట్ల ఎలా చెప్పాలో తెలియని ఆశ్చర్యంతో, ఆశ్చర్యార్థకమయిన వాక్యాలనే వాడుతుంటారు! ఈ అధ్యాయంలో జనకమహారాజు తన అనుభవాన్ని వర్ణించడానికి ప్రయత్నిస్తూ మాటలు కరువై ఆశ్చర్యంలో తేలిపోతూ వర్ణించ డాన్ని అనేకచోట్ల గమనిస్తాము.

అధికారీ అర్హుడూ అయిన జనకరాజర్షికి బ్రహ్మనిష్ఠుడయిన అష్టావక్ర మునీంద్రుడు బ్రహ్మవిద్యనుపదేశించడం కిందటి అధ్యాయంలో చూచినాము. ఉత్తమాధికారి కాబట్టి ఉపదేశింపబడిన వెంటనే లక్ష్యార్థాన్ని గ్రహించి బ్రహ్మా నుభవాన్ని పొందగలిగినాడు.

మనబుద్ధితో అర్థంచేసుకోగలిగి, స్పష్టంగా చూడగలిగిన ఏ అనుభవ మూ ఆశ్చర్యం అనడానికి వీలులేదు. ఏ అనుభవం బుద్ధికి ఏ విధంగానూ అందకుండా తార్కికంగానైనా ఏదీ చెప్పలేని స్థితిలో బుద్ధి నిలబడిపోతుందో, అటువంటి అనుభవాన్ని ఆశ్చర్యం అంటాం. ఇటువంటి ఆశ్చర్యకరమయిన అనుభవంలో బుద్ధి ఉన్నప్పుడు సందిగ్ధావస్థలో నిశ్శబ్దంగా ఉండిపోతుంది. బ్రహ్మానుభవం మనో బుద్ధుల కతీతమైనది కాబట్టే తరచుగా 'అత్యద్భుతం ఆశ్చర్యకరం' అని వర్ణింపబడుతూ ఉంటుంది. 'ఆశ్చర్యమయమ్-దేవమ్'. ఈ ఆశ్చర్యం అన్నమాట భగవద్గీతలో ఉపనిషత్తులలోనూ కూడా కనబడుతుంది.

ఈ అధ్యాయంలో ఈ బ్రహ్మానుభవానందం మనోహరంగా వర్ణింప బడింది. ఈవర్ణనను అర్థం చేసుకుని ధ్యానించే సాధకులకు వెంటనే ధ్యాననిష్ఠ

కుదురుతుంది. చైతన్యంలోనే, చైతన్యంవల్లనే ఉనికినికలిగి, తెలియబడే ప్రపంచ వర్ణన వినగానే మననశీలి అయిన మనీషి, ఈ విశాల విశ్వమంతా తనలో తన చైతన్యంలో, అణుమాత్రంగా భాసించడం స్పష్టంగా చూడగలుగుతాడు. సాధారణమయిన అహంకారంతో కూడిన బుద్ధి దీనిని అర్థంచేసుకుంటే, ఇటువంటి అనుభవం తనలో సాధ్యం అని వింటే, ఆశ్చర్యంలో మౌనంగా నిశ్చలంగా నిలచిపోతుంది.

అష్టావక్రమునీంద్రుని వాక్యామృతంతో జనకరాజర్షిఅజ్ఞానం పటాపంచ లయింది. తెలుసుకునేవాడు, తెలుసుకోవడం, తెలియబడేది, ఈ త్రిపుటి ఒక్కటే అనీ, ఎన్ని నామరూపాలతో తెలియబడినా, ఏకంగా అద్వయంగా ఉన్నది చైతన్యమయమయిన ఆత్మే అనీ స్పష్టంగా తెలిసింది. శరీరం, మనస్సూ, బుద్ధీ, అహంకారం, జీవభావం సర్వమూ కరిగి బ్రహ్మభావంలో ఐక్యమయి పోవడాన్ని అనేక ఉపమానాలతో అనుపమానంగా, అపురూపంగా అద్భుతంగా అందించ గలిగిన జనకమహారాజు ధన్యుడు!

జనక ఉవాచ :--

శ్లో॥ అహో నిరఞ్జనశ్శాన్తః బోధోఽహం ప్రకృతేః పరః ।
ఏతావన్తమహం కాలం మోహేనైవ విడమ్బితః ॥ 1.

టీ॥ అహం=నేను, నిరంజనః =దోషరహితుడను, శాన్తః = శాంత స్వరూపుడను, బోధః = జ్ఞానరూపుడను, ప్రకృతేః = ప్రకృతికి, పరః = పరుడను (అయితే), అహో = ఆశ్చర్య మేమనగా, ఏతావన్తం = ఇంత, కాలం=కాలపర్యంతము, మోహేనైవ = అజ్ఞానము చేతనే, విడమ్బితః =మోసపోతిని.

**ఆహా! నిష్కళంకమూ, నిత్యశుద్ధమూ అయిన ఆత్మని, చైతన్య స్వరూపాన్ని నేనే! సర్వప్రకృతికి అతీతంగా నేను ఉన్నాను. ఇంతకాలమూ అజ్ఞానంతో భ్రమతో ఉన్మాదునివలె జీవించాను.**

ఇంతకాలమూ ఈ మనశ్శరీరాలే నేననుకుని వాటి అనుభవాలే నావనుకుని బాధామయ, పరిమితజీవితాన్ని గడిపిన నా అజ్ఞానానికి సిగ్గుపడుతున్నాను" తన అజ్ఞానానికి చింతిస్తూ ఆత్మానుభవం పొందిన సాధకుడు అనుకుంటున్న మాటలివి. ప్రకృతేః పరః-ప్రకృతికి అతీతంగా తానున్నానని గ్రహించగలిగేడు. మనశ్శరీరాలూ వాటి బాధలూ తనవికావని తెలిసికొని తనదైన శాంతస్థితిని గుర్తించగలిగేడు. శుద్ధ

చైతన్యం తానేననీ, తనవల్లె సర్వమూ తెలియబడుతున్నదనీ వాసనలు మనశ్శరీరాలూ కూడా తనలోనే తెలియబడుతున్నాయనీ, తాను నిరంజనంగా సర్వాత్మగా సర్వసాక్షిగా ఉన్నాననీ తెలుసుకున్నాడు.

అనంతకాలం నుండీ అనేక జన్మలనెత్తుతూ ఆ శరీరాలతో తాదాత్మ్యం చెందుతూ కష్టసుఖాల ననుభవిస్తూ వాసనలను పోగుచేసుకుంటూ, జన్మలను పెంచుకుంటూ, సంసారచక్రంలో కేవలం తనభ్రమ కారణంగా చిక్కుకొని బాధపడుతున్నాడు, బంధింపబడి ఉన్నాడు.

సాంఖ్యదర్శనంలో,నామరూపాత్మకమయిన ఈ సర్వజగత్తుకూ కారణంగా ప్రకృతి చూపబడింది. జడమయిన ఈ ప్రకృతిని పురుషుడు చైతన్యవంతం చేస్తాడని చెప్పబడింది. ఆత్మనిష్ఠుడయిన అష్టావక్రుడు బుద్ధిని సంతృప్తిపరచే ఈ సిద్ధాంతాల జోలికిపోకుండా తనదైన అనుభవాన్ని యథాతథంగా అందించడంలో ఆత్మచైతన్యమే సర్వాన్నీ చైతన్యవంతం చేస్తున్నదని స్పష్టంగా చెప్పేరు. ఆత్మే చైతన్యంగా ప్రకృతీ పురుషులనిద్దరినీ తెలుసుకుంటున్నది అని నిశ్చయంగా చెప్పుచున్నారు.

**శ్లో॥ యథా ప్రకాశయామ్యేకః దేహమేనం తథా జగత్ ।**
**అతో మమ జగత్సర్వం అథవా న చ కించన ॥ 2.**

టీ॥ యథా = ఏప్రకారము, ఏనం = ఈ, దేహం = దేహమును, ఏకః = అద్వితీయుడనై, ప్రకాశయామి = ప్రకాశింపజేయుచున్నానో, తథా = ఆ ప్రకారముగానే, జగత్ = ప్రపంచమునుగూడా, ప్రకాశయామి = ప్రకాశింపజేయుచున్నాను, అతః = ఈ కారణము వలన, సర్వం = సంపూర్ణమైన, జగత్ = ప్రపంచము, మమ = నా సంబంధమైనదిగా నున్నది, అథవా = లేక, మమ = నాకు, కిఞ్చన = కొంచెముగూడ, న = లేదు.

**నేనే ఈ శరీరాన్ని చైతన్యవంతం చేస్తూ జగత్తును చూపిస్తున్నాను. కాబట్టి ఈ ప్రపంచమంతా నాదే, కాని నిజానికి నాలో ఏదీలేదు.**

ఆత్మానుభవస్థితుడయిన రాజర్షి తన ప్రస్తుత అనుభవాన్ని వ్యక్తం చేస్తున్నారు. "నేనే ఈ శరీరాన్ని చైతన్యవంతం చేస్తూ ప్రపంచాన్ని చూపిస్తున్నాను"---జడపదార్థానికి స్వయం ప్రకాశకత్వం లేదు. నా శరీరము మనస్సు బుద్ధీ కూడా జడమయిన పదార్థంతో నిర్మింపబడినవే. ఇవి ప్రకాశింపబడడానికి కారణం వేరుగా ఉండాలి. నాలో చైతన్యమే లేకపోతే ఈ విషయి---విషయ సంబంధంగా భాసించే ఈ సర్వప్రపంచమూ ఎలా తెలియబడుతుంది?

చైతన్యం వల్లనే ఇంద్రియాలు పని చెయ్యడం, మనస్సులో కలిగే సంచలనాలు, బుద్ధిలోని ఆలోచనలూ కూడా తెలియబడుతున్నాయి. ప్రపంచంలో ఈ చైతన్యమే లేకపోతే జ్ఞానం ఉండే ఆస్కారమే ఉండేదికాదు. ఏదైనా ఉందని తెలియబడడానికి చైతన్యమే కారణం.

తనకు కొత్తగా వచ్చిన అనుభవజ్ఞానంతో జనకుడు, తనలోని భావనా లోకాలు, బాహ్యంగా గుర్తింపబడుతున్న నామరూపాత్మక వస్తుమయ ప్రపంచమూ కూడా తనవల్లనే, చైతన్యంవల్లనే తెలియబడుతున్నాయి అని స్పష్టం చేస్తున్నారు. పరస్పరాధారంగా, విషయి-విషయ సంబంధంగా గుర్తింపబడే విశాల విశ్వమంతా ఆత్మ చైతన్యం వల్లనే తెలియబడుతున్నది, ప్రకాశింపబడుతున్నది అని నిశ్చయంగా నిస్సందేహంగా చెప్తున్నారు రాజర్షి.

వెనువెంటనే పవిత్రమూ పూర్ణమూ ఏకమూ అయిన తన స్వస్థితిని గమనిస్తూ ఆ దృష్ట్యా,'నేనే ఉన్నాను--నాలో ఏదీ లేదు' అనే సత్యాన్ని నొక్కి చెప్తున్నారు.

ఆత్మ చిత్ స్వరూపంగా సర్వాన్ని ప్రకాశింపజేస్తుంది, అంటే తెలియబడేటట్టు చేస్తుంది, సత్ రూపంలో సర్వానికీ అధిష్ఠానమయి తానే ఉంటుంది.

**శ్లో:। సశరీరమహో! విశ్వం పరిత్యజ్య మయాఽధునా ।**
**కుతశ్చిత్కౌశలాదేవ పరమాత్మా విలోక్యతే ॥ 3.**

టీ॥ స శరీరం = శరీర సహితమైన, విశ్వం = ప్రపంచమును, పరిత్యజ్య = విడిచిపెట్టి (తననుండి వేరుచేసి), కుతశ్చిత్ = ఎక్కడనో, కౌశలాదేవ = చమత్కారమువలననే (ఉపదేశమువలననే), మయా = నాచేత, అధునా = ఇప్పుడు, పరమాత్మా = పరమాత్మ, విలోక్యతే = చూడబడుచున్నాడు (అనునది), అహో = ఆశ్చర్యము.

**అహో! నా శరీరాన్ని, శరీరం చూచే ప్రపంచాన్నీ కూడా విస్మరించి, నా గురుకృపచే, పరమాత్మను తెలుసుకుంటున్నాను.**

క్రిందటి రెండు శ్లోకాలలోనూ ఆశ్చర్యం సందిగ్ధంగా వ్యక్తమయింది. ఇక్కడ నుండి స్పష్టంగా తన ఆశ్చర్యాన్ని వ్యక్తంచేస్తూ, "అహో" అని వాడుతూ తన అనుభవాన్ని వర్ణించడాన్ని గమనిస్తాము.

అహంకారంతో, నేననే భావంతో అన్నిటినీ గుర్తిస్తుంటాము, మనశ్శరీరాలూ అవిచూచే,అనుభవించే విషయాలూ కలిపితే ప్రపంచమనబడుతుంది. ఈ ఉపకరణాల కలితంగా నిలచిచూచినప్పుడు వాటి అనుభవాలూ కూడా లేకుండాపోతాయి.

"శరీరాన్ని, శరీరం చూచే ప్రపంచాన్ని విస్మరించిన సాధకుడు శూన్యంలో ఉండి పోతాడు"; చూడబడే సర్వానికీ అధిష్ఠానంగా ఉన్న ఆత్మానుభవంలో ఆనంద స్వరూపంగా నిలచిపోతాడు. అందుకే జనకుడు ఇలా అంటున్నారు. పరమాత్మను ఇప్పుడు తెలుసుకుంటున్నాను.

ఇక్కడ "విలోక్యతే" (తెలుసుకుంటున్నాను), చూస్తున్నాను అనే మాటని అపార్థం చేసుకోకూడదు. ఈ మాట వాడబడినప్పటికీ ఇక్కడ చూచేవాడు--- చూడబడేది అని రెండు వేరుగా లేవు. అద్వయమయిన ఆత్మలో ద్వంద్వాలకు తావులేదు. అయినప్పటికీ "దర్శనం" చూడడం అనేమాట వాడడంతో, నిశ్చయంగా చూచాను. కాబట్టి సందేహం లేదు అని సాధకుడికి గట్టిగా చెప్పడమే కనిపిస్తుంది. స్వయంగా చూచిందే సత్యం అనీ, అక్కడింకేమీ సందేహాలుండవనీ అనుకునే సాధకుని బుద్ధికి అందేటట్టుగా చెప్పడానికే ఈ పదప్రయోగం వాడబడింది.

అయితే సాధకునికి ఈ 'దర్శనం' ఎలా సాధ్యం అయింది? గురుకృప వల్లనా? శ్రవణ మననాల ప్రభావమా? భక్తికి ఫలితమా? శ్రమించి సాధించినదా? ఎలా? ఏవిధంగా ఈ ద్వంద్వాతీత అనుభవం సాధ్యమయింది?

వేదాంతుల దృష్టిలో ఆత్మ ఏ కారణానికీ చెందిన "కార్యం" కాదు, ఏ ప్రత్యేక ప్రయత్నం వల్ల సాధింపబడిన ఫలితమూ కాదు, సాధనవల్ల సాధ్యమయేది కూడా కాదు, ఆత్మ ఉంది, ఉంటుంది, ఇది నిత్యం, సాధింపబడినదేదయినా మార్పుచెంది నశిస్తుంది. నాశరహితమయిన ఆత్మ నిత్యమూ ఉంది, ఉంటుంది. ఇది పరిణామ రహితం.

అయితే ఆధ్యాత్మిక సాధనలన్నీ అర్థరహితమూ నిరుపయోగమూనా? మతం కేవలం నమ్మకమేనా? పలురకాలా యోగసాధనలన్నీ వంచనమాత్రమేనా? కాదు. కానేకాదు. ఇవన్నీ అవసరమే. మనం అశాంతితో నిండిన మనస్సునూ, అలజడులతో నిండిన బుద్ధినీ శాంతంగా సంతోషంగా ఉండేలా చెయ్యాలంటే వాటి బాధలకు కారణమయిన భ్రమను తొలగించాలి. ఆలోచనా ప్రవాహం ఉధృతితగ్గి, శాంతినంది క్రమంగా ఆగినప్పుడు మనోబుద్ధుల నధిగమించగలుగుతాం. అప్పుడు మాత్రమే అహంకారం లేకుండాపోతుంది. భ్రమాజనిత అహంకారం నశించగానే సత్యదర్శనం అవుతుంది, అజ్ఞానం నశిస్తే జ్ఞానం కనిపిస్తుంది. చీకటిపోతుంది. వెలుగు అక్కడే ఉంది, ఉంటుంది. సర్పభ్రాంతి నశిస్తే ఎప్పుడూ అక్కడ అలాగే తాడు ఉండడాన్ని గుర్తిస్తాము.

ఏదో తెలియని అదృశ్యశక్తి వల్ల, ఈ మహత్తరానుభవాన్ని పొందగలిగేనని ఎంతో నిజాయితీతో చెప్తున్నారు రాజర్షి. శ్రవణ మననాల ఫలితమో, ఉపనిషద్ ఋషుల ఆశీః ప్రభావమో, గురు పరంపర కృపావీక్షణమో, ఏదో తెలియకపోయినా, మొత్తంమీద ఈ అనుభవం వచ్చినందుకు వారందరికీ కృతజ్ఞతలు చెప్తున్నారు. "కుతశ్చిత్ కౌశలాత్ "-ఏదో తెలియని సుకృతం కారణంగా- ఆత్మానుభవం లభ్యం అయింది.

నిజాయితీ, చిత్తశుద్ధి కలిగిన ఏ శిష్యుడయినా తన గురువెవరో, ఏ ప్రత్యేక పద్ధతివల్ల, జ్ఞానంవల్ల ఆత్మానుభవం లభ్యమయిందో చెప్పలేడు. ఈ చరాచర జగత్తూ, ప్రతీసంఘటనా కూడా అహంకారాన్ని అనునిత్యమూ తీర్చిదిద్దుతూ ఆత్మానుభవానికి అర్హమయే మార్గంవెంట నడిపిస్తూనే ఉంటాయి. అటువంటప్పుడు తెలివున్న ఎవరైనా ఏ ఒక్కరినయినా ఏ విధంగా తన గురువని నిర్దేశించి చెప్పగలరు? ఏ ప్రత్యేక పద్ధతి నవలంబించేనని చెప్పగలరు? ఆశ్చర్యానందాల మధ్య వారు చెప్పగలిగిందల్లా ఒక్కటే----ఆ అనుభవంలో తానున్నాననీ తనకే తెలియని ఏ గురుకృపో అందుకు కారణమనీ మాత్రమే.

**శ్లో॥ యథా న తోయతోఽభిన్నాః తరంగా ఫేనబుద్బుధాః ।**
**ఆత్మనో న తథా భిన్నం విశ్వమాత్మ వినిర్గతమ్ ॥ 4.**

టీ॥ యథా=ఎట్లు, తోయతః = జలముకంటే, తరంగాః = అలలు, ఫేన బుద్బుధాః= నురుగున్ను, బుడగలున్ను, అభిన్నాః = భిన్నమైనవి (వేరైనవి)కావో, తథా =అట్లే, ఆత్మ వినిర్గతం = ఆత్మనుండి పుట్టిన (ఆత్మ విశిష్టమైన), విశ్వం = ప్రపంచము, ఆత్మనః = ఆత్మకంటే, భిన్నం = వేరైనది; న = కాదు.

**తరంగాలు, నురుగు, బిందువులు, నీటినుండి ఎలా వేరుకావో, అదే విధంగా ఆత్మలో కనిపించే ఈ ప్రపంచమంతా ఆత్మనుండి భిన్నంకాదు.**

అద్భుతమూ మహత్తరమూ అయిన ఆత్మానుభవంలో, పదార్థమూ శక్తీ కలిసి నిర్మింపబడినట్లున్న యీ చరాచర జగత్తంతా ఎక్కడ ఉంటుంది? ఎలా ఉంటుంది? ఏమౌతుంది? ఇవన్నీ చైతన్యంలో లయం అయిపోయి ఏకంగా చైతన్యమే ఉంటుందని జనకులు అన్నారు. అయితే ఇది తార్కికంగా బుద్ధికి అందుతుందా? బుద్ధికి అందనిదానిని ఆమోదించి అందుకు ప్రయత్నం చెయ్యలేం కదా! జనకుని నిజాయితీని శంకించవలసిన అవసరం లేదు. అయినా మనం

అర్థంచేసుకోవడం ఎలా??? బుద్ధి కలీతమయిన ఈ అనుభవాన్ని బుద్ధితో గ్రహించ డానికి వీలుగా జనకులే స్వయంగా ఒక ఉదారహణ ఇచ్చేరు. సృష్టింపబడిన ఏ వస్తువయినా తన ఉపాదాన కారణయిన మూలకారణంకంటే భిన్నంగా ఉండ జాలదు. మూలపదార్థం నుండే వస్తువులు తయారవుతాయి. తరంగాలు,నురుగు, బిందువులు మొదలైనవి సముద్రంనుండే పుడుతున్నాయి. ఇవి సముద్రంకంటే, నీటికంటే, వేరుకావు.

ఏ కార్యమయినా కారణానికి రూపాంతరం మాత్రమే, ఆత్మచైతన్యం నుండి ఉద్భవించిన జగత్తంతా ఆత్మనుండి భిన్నంగా ఉండదు. ఆత్మానుభవంలో ఈ ఏకత్వం స్పష్టంగా తెలియబడుతుంది. అపారజలరాశి అయిన సముద్రంలో, తరంగా లు, నురుగు, తుంపరలు పైపైన ఎన్ని పుట్టి, గిట్టినా, సముద్రం మార్పు చెందదు. అసలు పుట్టినట్లుగా కన్పించే తరంగాలు మొదలయినవన్నీ నీరే! నామం, రూపం, మాత్రమే వేరు! ఇదేవిధంగా ఈ కనిపించే విశాల విశ్వమంతా ఆత్మచైతన్యమే దీనినుండి ఏ విధంగానూ ఎప్పుడూ భిన్నం కాదు.

శ్లో|| తంతుమాత్రో భవేదేవ పటో యద్వద్విచారతః ।
ఆత్మతన్మాత్రమేవేదం తద్వద్విశ్వం విచారితమ్ ||5.

టీ|| యద్వత్ = ఏ ప్రకారము, విచారతః = విచారణవలన, పటః = వస్త్రము, తంతుమాత్రః ఏవ = నూలు మాత్రమే, భవేత్ = అగుచున్నదో, తద్వత్ = అదేవిధముగ, విచారితం = (నిశితంగా) విచారింపబడిన, ఇదం = ఈ, విశ్వం = ప్రపంచము, ఆత్మ తన్మాత్రమేవ = ఆత్మ సత్తామాత్రమే, (అని తెలియుచున్నది).

ఒక వస్త్రాన్ని నిశితంగా పరిశీలిస్తే అది కేవలం దారపు సముదాయం మాత్రమే అని చెప్పవచ్చు. అదే విధంగా నిశితంగా పరిశీలిస్తే ఈ కనబడే ప్రపంచమంతా ఆత్మచైతన్యమే అని ధృవపడుతుంది.

శాస్త్రాధ్యయనం చేస్తూ, అర్థం చేసుకోవడానికి సాధనచేస్తూ ఉంటే మొదటిదశలో సత్యాన్వేషికి, మహర్షుల మహత్తరమయిన మహావాక్యాలర్థమవడం అతికష్టం. ఇది సహజమే. బుద్ధి కలీతమయిన సత్యాన్ని దర్శించి చెప్తున్నవారు ఆచార్యులు, కాని దేహతాదాత్మ్యంతో మనోబుద్ధుల సహాయంతో సత్యాన్ని అర్థం చేసుకోవాలనుకుంటున్నాడు శిష్యుడు, కాబట్టి బుద్ధిలక్షణాలయిన తర్కం మీమాంస, న్యాయం, తప్పకుండా ఆశ్చర్యంతో అశక్తతతో ఆగిపోతాయి;మహాత్ముల అనుభవాలు అద్భుతంగా నమ్మశక్యంకానివిగా అనిపించడం అప్పటికి సహజమే.

అయినప్పటికీ శాస్త్రం ఎంతో శ్రద్ధతో, శిష్యుని తార్కికబుద్ధికి సంభవం అనిపించే విధంగా, సత్యాన్ని అందించడానికి ప్రయత్నిస్తుంది. బుద్ధికతీతమయిన సత్యాన్ని బుద్ధికి అందించడంకోసం, ఏ దేశానికి ఏ మతానికి చెందిన మహాత్ములయినా, అనేకానేక ఉదాహరణలనూ, అద్భుత ప్రక్రియలనూ, అర్థస్ఫోరకమయిన ఉపమానాలనూ వాడుతూనే ఉన్నారు.

ఉపనిషత్తులలో తరుచుగా కనబడే ఒక ఉదాహరణని అష్టావక్రులు ఇక్కడ ఉపయోగిస్తున్నారు.

మన నిత్యజీవితంలో వస్త్రాలను వాటి ఉపయోగం దృష్ట్యా వస్త్రంగా గుర్తిస్తుంటాము. కాని కొంచెం ఆలోచించి చూస్తే దారాలు దగ్గరగా అల్లబడి ఉన్న దానిని వస్త్రం అంటున్నామని అర్థం అవుతుంది. అది దారమేకదా అని బట్టల షాపుకి వెళ్ళి ఒక కిలో దారం ఇవ్వమని అడిగితే, అర్థంచేసుకుని ఆ బరువుకి తూగే బట్టని మనకెవ్వరూ ఇవ్వరు! "ఇక్కడ బట్టలే అమ్ముతాం కానీ దారం ఉండదు" అని వెంటనే ఆ షాపు యజమాని అనమూవచ్చు! వస్త్రం దృష్టితో దారాన్ని చూస్తున్నప్పుడు సహజంగా దారం ఉనికి గుర్తింపబడదు. వస్త్రాన్ని చూస్తూ కూడా అది దారమే అని లోపల గుర్తుంచుకోవడానికి వివేక విచక్షణలతో కూడిన బుద్ధి అవసరం.

నిత్యజీవితంలో అనుక్షణమూ సంఘటనలను గుర్తిస్తూ, అవి కలిగించే కష్టసుఖాలు సంతోష విచారాలతో కొట్టుకుపోతూ మరల సంఘటనలను గుర్తిస్తూ తీరుబడీ, విశ్రాంతి, విచక్షణా లేకపోవడంతో మనం చూసేదేమిటి? అని ఆలోచించం, చూస్తున్నామనుకుంటున్న నానాత్వ ప్రపంచాన్ని సత్యంగా నిశ్చయించుకుంటాం. అసత్యమేమో అన్న అనుమానం రావడానికయినా అవకాశమూ తీరుబడి ఉండవు! ఇక్కడ ఆగి విచక్షణతో వివేకంతో చూస్తే ప్రపంచం చైతన్యం నుండి భిన్నంకాదని తెలిసిపోతుంది, అని ఆచార్యులు అంటున్నారు. చైతన్యం వ్యక్తమవుతుంది. ఆలోచనగా---సూర్యుడు కాంతిగా వ్యక్తమయినట్టే. ఈ ఆలోచనలు వరుసగా,క్రమబద్ధంగా, ప్రవాహంగా గుర్తింపబడడమే మనస్సు అనబడుతున్నది. ఈ గుర్తింపబడిన మనస్సు ఎంతో ప్రతిభావంతంగా, బలీయంగా భావింపబడుతున్నది. ఈ మనస్సులోని ఆలోచనలు చైతన్యప్రకాశంతో అనేక నామరూపాలు సంతరించుకుని మనోబుద్ధులతో గుర్తింపబడుతున్నాయి. ఈ విధంగా చూస్తున్నాననుకునే మనోబుద్ధులూ, చూడ బడ్డాయనుకున్న నామరూపాలూకూడా చైతన్యమే,

ఈ విధంగా జగద్భ్రాంతిని కలిగిస్తూ మాయామోహితులను చేసే ఆలోచనా ప్రవాహం, గంభీరమూ స్థిరమూ అయిన ధ్యానంలో అదృశ్యమయిపోతుంది. ఆలోచనలంతం కావడంతో మనస్సు నశిస్తుంది, మనస్సు లేనప్పుడు మహా అద్భుతమయిన ఈ సృష్టి ఎక్కడ? ఎలా ఉండగలదు?!?

వైజ్ఞానిక దృక్పథంతో ఈ ప్రపంచపు సత్యత్వాన్ని, అస్తిత్వాన్ని తరచి చూస్తే ఈ విశాల విశ్వమంతా చైతన్యమేననీ కనిపించే నానాత్వం భ్రాంతి అనీ స్పష్టంగా తెలుస్తుంది.

**శ్లో॥యథైవేక్షురసే క్లుప్తా తేన వ్యాప్తైవ శర్కరా ।**
**తథా విశ్వం మయి క్లుప్తం మయా వ్యాప్తం నిరంతరం॥6.**

**టీ॥** యథైవ = ఏ ప్రకారమయితే, ఇక్షురసే = చెఱకురసమునందు, క్లుప్తా = ఇమిడి యున్న, శర్కరా = పంచదార, తేనైవ = ఆ యిక్షురసముచేతనే, వ్యాప్తా = వ్యాప్తమగు చున్నదో, తథైవ = అట్లే, మయి = నాయందు, క్లుప్తం = ఇమిడియున్న (కల్పితమైన), విశ్వం = ప్రపంచము, మయా = నాచేతనే, వ్యాప్తం = వ్యాప్తమైయున్నది.

**చెఱుకురసంతో తయారయిన పంచదారనిండా ఎలా చెఱుకురసం నిండి ఉంటుందో అదేవిధంగా నాలో ఉండే ఈ ప్రపంచమంతా నాచే పూర్తిగా ఆవరింపబడి ఉంది.**

శిష్యునికి పరిచయమయిన పరిమితవస్తు ప్రపంచంనుండే ఉపమానాలను గ్రహించి ఉదాహరణగా వాడతారు ఆచార్యులు ఈ పరిమితమైనది అపరిమిత మైన సత్యాన్ని పూర్తిగా బోధింపజాలదు, కాని ఏదో ఒక లక్షణాన్ని తెలియ బరచడాని కుపయోగిస్తుందని అటువంటి ఉపమానాలను వాడవలసి వస్తూ ఉంటుంది. కొన్నిసమయాలలో ఇవి విపరీతార్థాన్ని కూడా ఇవ్వవచ్చు. అందుకనే శిష్యుడు ఎలా గ్రహించిందీ కూడా ఆచార్యులు గమనిస్తూనే ఉంటారు.

వస్త్రపు ఉదాహరణలో వస్త్రం అంతా దారాలసముదాయమే. దారం లేకుండా వస్త్రానికి ఉనికేలేదు. అయినప్పటికీ దారాల పడుగు పేకల అల్లికల మధ్య ఎంతచిన్నవయినప్పటికీ ఖాళీలు ఉండే ఉంటాయి కదా. ఈ ఉదాహరణ ఒక విధంగా అపార్థం కాబడే అవకాశం ఉంది. వస్త్రంలోవలెనే, సృష్టిలో కనబడే వస్తువులూ ప్రాణులూ చైతన్యమే అయినప్పటికీ వాటిమధ్య ఖాళీలు ఉంటాయి కదా, అక్కడ చైతన్యం ఉండదన్నమాట! ఇలా అర్థం అయితే చైతన్యం సర్వ

వ్యాప్తం అన్నమాట అర్థరహితం అయే ప్రమాదం ఉంది. ఇది ఊహించే ఆచార్యులు ఇంకొక ఉపమా నాన్ని ఇక్కడ వాడుతున్నారు. ఈ ఉమానంతో ఇదివరకు చెప్పినదే ఇంకా స్పష్టంగా అర్థం అయే అవకాశం ఉంది.

చెఱుకురసంతో తయారయిన పంచదారలో అణువణువునా చెఱుకు రసం ఉంటుంది. పంచదారరేణువు రుచికీ చెఱుకురసం రుచికీ ఏ రకమయిన భేదమూ లేదు. ఇదే విధంగా "నాలో ఉండే ప్రపంచానికీ నాకూ ఏ భేదమూ లేదు"

వివిధ ప్రత్యేకరూప సమన్వితంగా కనిపించే ఈ విశాల విశ్వమంతా చైతన్యమేననీ, రెండవదేదీలేదనీ, పై మూడు శ్లోకాలలో వాడిన ఉపమానాలతో శిష్యుడికి అర్థం అవుతుంది. నిజానికి ఉన్నదంతా ఆత్మచైతన్యమే, రెండవదేదీ లేనేలేదు.

అయితే ఈ ప్రాపంచిక అనుభవాలెలా సాధ్యం అవుతున్నాయి? ప్రపంచం ఏ విధంగా కనిపించడం సంభవం అవుతున్నది? దీని సృష్టికర్త ఎవరు? ప్రాథమిక దశలో శ్రవణ మననాలు చేసే సాధకునికి ఇటువంటి సందేహాలు తప్పకుండా వస్తాయి. తరువాత శ్లోకంలో జవాబు యివ్వబడుతుంది.

**శ్లో॥ ఆత్మాజ్ఞానాజ్జగద్భాతి ఆత్మజ్ఞానాన్న భాసతే :**
**రజ్జ్వజ్ఞానాదహిర్భాతి తద్జ్ఞానాద్భాసతే న హి ॥ 7.**

**టీ॥** ఆత్మాజ్ఞానాత్ = ఆత్మను తెలుసుకొనకపోవుటవలన, జగత్ = సంసారము, భాతి = తోచుచున్నది, ఆత్మజ్ఞానాత్ = ఆత్మను తెలిసికొనుటవలన, న భాతి = తోచుట లేదు, రజ్జ్వజ్ఞనాత్ = త్రాడు అని తెలిసికొనకపోవుటవలన, అహిః = సర్పము, భాతి = తోచుచున్నది, చ = మరియు, తత్జ్ఞానాత్ = ఆ రజ్జు జ్ఞానమువలన, న భాసతే హి = సర్పము తోచుటలేదుగదా!

**ఆత్మగురించిన అజ్ఞానంతో జగత్తు ఉన్నట్లుగా తోస్తోంది, ఆత్మజ్ఞానం వస్తే ప్రపంచం అదృశ్యం అయిపోతున్నది. తాడును తాడుగా తెలుసుకోక పోవడంచేతనే పాము అనే భ్రమకలగడం సంభవం అవుతున్నది. తాడు అని తెలియగానే పాము భ్రమ నశిస్తుంది.**

అనంతనామ రూపాలతో అత్యాశ్చర్యకరమయిన ఈ సృష్టి అంతా ఏ విధంగా ఉందో తెలియజెప్పడానికి, వేదాంతంలో తరుచుగా వాడబడే రజ్జు సర్పభ్రాంతి ఉపమానాన్ని తీసుకు వచ్చేరు. అధిష్ఠానంగా ఉన్నది తాడు అని

తెలియనిస్తున్నది. అజ్ఞానం నుండి, ఉన్నది పామే అనే భ్రాంతి జనిస్తుంది. బుద్ధి ఆవరణలో ఉండిపోవడమూ, మనస్సు విక్షేపం చెంది దృశ్యాలను చూస్తూ కష్టసుఖాల ననుభవించడమూ జరుగుతున్నది. ఆ అనుభవాలకు చలిస్తూ ఊహాలోకాలు నిర్మిస్తూ ఈ భ్రాంతిని కొనసాగేటట్టు చేసేది మనస్సే. అనుభవాలకు చలించడంతో రాగద్వేషాలు బయలుదేరుతున్నాయి. వీటి ఆధారంగా మళ్ళీ అనుభవాలు వస్తూ, వాటికి చలిస్తూ ఈ భ్రాంతి అనంతంగా సాగిపోతూనే ఉంది. అధిష్ఠానం తెలియగానే అజ్ఞానమూ తత్ఫలితమయిన భ్రమకూడా మాయం అయిపోతాయి, ఉన్నది తాడే అని నిశ్చయంగా తెలియగానే సర్పమూ దానివల్ల కలిగిన భయమూ బాధామయం అయినట్టే!

ఉన్నది ఆత్మచైతన్యమే అని తెలియని అజ్ఞానంనుండి, అనుభవించేవాడు,అనుభవింపబడేది(విషయి,విషయాలు)గా గోచరించే ప్రపంచం ఉద్భవిస్తోంది. అనుభవిస్తున్నాననుకుంటున్న అహంకారం తనయిష్టా యిష్టాలతో సుఖ దుఃఖాలతో ఈ భ్రమను పెంచి పోషిస్తూ బాధభరించలేనప్పుడు ఈ బంధంనుండి ముక్తి కోరుకుంటున్నది. ఈ భావన స్థిరపడినకొద్దీ మనస్సు ఏకాగ్రత చెందుతుంది; ఏకాగ్రత నందిన మనస్సులో ఆలోచనల ఉధృతం క్రమంగా తగ్గి ముక్తి కావాలనే ఈ చివరి ఒక్క కోరికాకూడా క్రమంగా అదృశ్యం అయిపోతుంది. ఆలోచన నశించగానే అహం-కారము నశిస్తుంది. అహంకారము లేకపోవడమే ఆత్మ చైతన్యం స్వయంగా ప్రకాశించడం ఇక్కడ ఏకంగా అద్వయంగా ఆత్మ మాత్రమే ఉంది.

ఉపనిషత్తులలో వాడిన ఉపమానమే జనకులు కూడా వాడడంతో జనకుని అనుభవం ఉపనిషద్ ఋషుల అనుభవంవంటిదేననీ, ఉపనిషద్ వాక్యాలు సత్యమనీ ఋజువౌతున్నది.

ఆత్మగా నా స్వభావమూ లక్షణాలూ ఏమిటి? ప్రస్తుతం నాకొక వ్యక్తిత్వం ఉంది. ఆకాశం దృష్ట్యా పరిమిత స్థానం ఉంది, కాలంలో ప్రస్తుతం ఉన్నాను. అహంకారం నశిస్తే ఇంక నేను అనబడేది ఏదీ ఉండదు కదా? ఆ తరువాత నేను ఏ విధంగా ఉంటాను? అప్పుడు నా స్వభావం ఏమిటి? ఈ ప్రశ్నలకు రాబోయే శ్లోకంలో జవాబు చెప్పబోతున్నారు. తన అనుభవ దృష్టితో జనకరాజర్షి.

శ్లో॥ ప్రకాశో మే నిజం రూపం నాతిరిక్తోఽస్మ్యహం తతః ।
యదా ప్రకాశతే విశ్వం తదాఽహం భాస ఏవ హి ॥8.

టీ॥ ప్రకాశః = ప్రకాశము, మే = నాయొక్క, నిజం = యథార్థమైన, రూపం = రూపముగా నున్నది, తతః = ఆ ప్రకాశ స్వరూపముకంటే, అహం = నేను, అతిరిక్తః = వేరైనవాడను, న అస్మి = కాను, యదా = ఎప్పుడు, విశ్వం = ప్రపంచము, ప్రకాశతే = ప్రకాశించుచున్నదో, తదా = అప్పుడు, తత్ = ఆ ప్రకాశము, అహం భాస ఏవ హి = నా ప్రకాశమువలననే, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

**నేను స్వయంజ్యోతిని. నేనూ ప్రకాశమూ వేరుకావు. ప్రపంచం కనిపిస్తుందంటే అందుకు కారణమయిన కాంతిని నేనే. నా వల్లనే ప్రపంచం తెలియబడుతున్నది.**

శారీరక మానసిక అనుభవాలన్నీ మనకు తెలియబడడానికి కారణం మనలోని చైతన్యమే. ఏదైనా వస్తువు కనిపించడానికి కాంతి ఎలా ఉపయోగపడు తున్నదో, అదే విధంగా మన అనుభవాలన్నీ తెలియబడడానికి చైతన్యం సహాయ పడుతున్నది. అందుకే చైతన్యాన్ని జ్యోతితో,ప్రకాశంతో,పోల్చేరు. తెలియబడేవి ఆలోచనలైతే, అవి అలా తెలియబడడానికి చైతన్యం ఆధారంగా ఉంటున్నది. ఈ తెలియబడడం అనేది అర్థం అవడానికి ఉపమానంగా ప్రకాశాన్ని దృశ్యాన్నీ పోల్చేరు. అంతేకాని, కేవలం వాచ్యార్థం తీసుకుని ఆత్మ అంటే అన్నిటికంటే ఎక్కువ కాంతి కలది అని భావించరాదు. చాలామంది ఇలాగే పొరబడి సత్య దర్శనంమీది కోరిక ఎక్కువ కావడంతో తమ ధ్యానంలో సత్యాన్ని తేజోరాశిగా దర్శించామని తలపోస్తూ ఉంటారు. ఆత్మజ్యోతి అనేమాటయొక్క వాచ్యార్థం మాత్రం గ్రహించడం చేతనూ, సత్యాన్ని వీలయినంత వేగంగా దర్శించాలనే తహతహతోనూ ఉండడంతో మనస్సు ఇటువంటి భ్రమను కల్పిస్తుంది. నిజంగా అటువంటి కాంతిని చూసి ఉంటే, అది వేరు దృశ్యం అవుతుంది కానీ దృక్ ఎన్నటికీ కాజాలదు. చైతన్యం అనేమాటను జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. తెలియబడడానికి కారణమైన తెలివే చైతన్యం, వస్తువు తెలియబడడానికి ప్రకాశం ఉపయోగపడినట్టుగా, ఆలోచనలు తెలియబడేట్టు చేస్తుందని మాత్రమే అర్థం. ఈ "జ్యోతి" "ప్రకాశం" అనేపదాల అర్థాన్ని జాగ్రత్తగా అర్థంచేసుకుని లక్ష్యార్థమయిన చైతన్యంగా నిలచిపోవాలి. నిశ్శబ్దం అన్నమాటకు అర్థాన్ని తెలుసుకుని ఆ స్థితిలో ఉండిపోవాలి. అంతేకాని నిశ్శబ్దం, నిశ్శబ్దం అంటూ

ఉంటే నిశ్శబ్దం ఎక్కడ ఉంటుంది?!? చైతన్యం అంటే ఏమిటో సూచించడానికి వాడిన పదాలను వదిలేసి లక్ష్యార్థాన్ని గ్రహించగలగాలి. రామకృష్ణ పరమహంస ఈ కాంతిగురించి చెప్పుతూ"కాంతిలక్షణాలు లేని కాంతి"గా వర్ణించారు. ప్రాణులు ప్రపంచాన్ని తెలుసుకునే చేస్తున్న కారణంగా చైత్యన్యాన్ని జ్యోతిగా వేదాంతం లో వాడుతున్నారు.

అహంకారం నశించగానే సాధకుడు తన్నుతాను చైతన్యజ్యోతిగా గుర్తిస్తాడు. ఈ చైతన్యమే విషయినీ, విషయాలనూ, అహంకారాన్నీ, అనుభవా లనూ కూడా తెలియబడేలా చేస్తోందని గుర్తిస్తాడు.

భావనాతీతమయిన ఈ అనుభవంతో జనకుడు "నేను స్వయంజ్యోతిని నేనూ ప్రకాశమూ వేరుకావు" అంటున్నారు. ఈ చైతన్యం ఎటువంటి జ్యోతో మానవ మేధకు ఎన్నటికీ అందదు; అర్థం చేసుకోవాలనిపించగానే ఆలోచన అయి పోతున్నది. ఆలోచనను మనం గుర్తిస్తున్నాం కాబట్టి అది విషయమయి, విషయి నైన నాకంటే వేరుగా ఉంటున్నది. ఇంతేకాక ఆలోచనలతో గుర్తింపబడేదంతా మనోబుద్ధుల ప్రభావంతో కల్పింపబడిన ఊహాలోకమే అవుతుంది. చైతన్యాన్ని అర్థం చేసుకోవాలనుకున్న తక్షణమే మనోబుద్ధులు పనిచేసి చైతన్యంతో ప్రకాశించే ఆలోచనలు మాత్రమే గుర్తిస్తాయి. చైతన్యం మనోబుద్ధుల కలితంగా వాటికి ఆధారంగా ఉంటూ చూడాలనుకుంటున్నంతసేపూ చూస్తున్నంతసేపూ శారీరక అనుభవాలుగా, మనోబుద్ధులు ఉద్రేకాలు భావాలుగా తెలియబడుతున్నది. చైతన్యం అంటే ఏమిటో తెలియక పోవడమే అజ్ఞానం.తెలుసుకోవాలని ప్రయత్నించి చూచినంతసేపూ ప్రపంచమే కనిపిస్తూ ఉంటుంది. ఆకాశాన్ని ఎంతసేపూ చూచినా ఎంత తార్కికంగా ఆలోచించినా నీలంగా కనిపిస్తూ ఉంటుంది. అక్కడ నిజంగా ఏమీ లేదని తెలుసుకొని, ఆ నీలవర్ణపు ఉనికికి సంబంధించిన సమస్య నుండి బయటపడి శాంతంగా ఉదాసీనంగా హాయిగా ఉండడం సాధ్యమే. ఇదే విధంగా చైతన్యం గురించి అర్థం చేసుకోవాలనుకోవడం అర్థరహితమని గుర్తించి, శాంతంగా ఉదాసీనంగా హాయిగా భావశూన్య స్థితిలో ఉంటే?!-అలా ఉండడమే చైతన్యంగా నిలచిపోవడం.

సినిమాహాలులో ప్రేక్షకులకు వెనుకగా అర్క్ లైట్ ఉంటుంది. దాని కాంతితో ప్రేక్షకుల ముందున్న తెర అంతా కాంతిమయమవుతుంది. మెషిన్ రూములో ఈ లైటుముందుకి ఫిల్ము వచ్చినప్పుడు ప్రేక్షకులకు, వారికి ముందుగా

అనేకనామరూపాలతో అద్భుతమైన ప్రదర్శన కనిపిస్తుంది. ఇదేవిధంగా మనలో ఉండే చైతన్యానికి దగ్గరగ మనవాసనలు రాగానే, బాహ్యాభ్యంతరాలలో మనశ్శరీరాలద్వారా జగన్నాటకాన్ని అహంకారం చూస్తున్నాననుకుంటుంది, చూస్తుంది.

దృక్ దృశ్యభావమయమయిన ఈ మహావిశ్వమంతా చైతన్యంలో, చైతన్యంవల్ల, చైతన్యంతో కల్పింపబడుతోంది. చూచేవాడు, చూడబడేది, చూడడం ఈ భావాలన్నిటికీ చైతన్యమే ఆధారం, చైతన్యమే ఇవన్నీ,-సముద్రంలో తరంగాలు నురుగు, బిందువులు అన్నీ సముద్రమే అయినట్టుగా; భగవద్గీతలో ఒక శ్లోకం ఇక్కడ తప్పకుండా గుర్తుకు వస్తుంది.

యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత!. (భగవద్గీత-13-33)

*ప్రపంచమంతటికీ ఒకే సూర్యుడు వెలుగునిస్తున్నట్టుగానే, ఓ భారతా, ఒకే పరమాత్మ, ఒకే క్షేత్రజ్ఞుడు ఈ క్షేత్రాన్నంతటినీ ప్రకాశింపజేస్తున్నాడు.*

ఉపనిషద్ ఋషులుకూడా దీనినే నొక్కిచెప్పున్నారు. ఉన్నట్టున్న దంతా, ప్రకాశించేదంతా, అనుభవింపబడేదంతా ఆత్మచైతన్యం యొక్క వ్యక్త రూపమే. సత్ రూపంలో ఉనికి కలిగినట్లుగా అనిపిస్తూ, చిత్ రూపంలో తెలుసు కుంటున్నాననుకుంటుంది. సత్ చిత్ ఆనందమే సర్వానికీ ఆధారం, అధిష్ఠానం, ఇదే సర్వమూ, ప్రపంచాన్ని తెలుసుకుంటున్నాను అన్నభావం చైతన్యంవల్లనే చైతన్యంలోనే సాధ్యం అవుతుంది.

**శ్లో॥ అహో! వికల్పితం విశ్వం అజ్ఞానాన్మయి భాసతే ।
రూప్యం శుక్తౌ ఫణీ రజ్జౌ వారి సూర్యకరే యథా ॥9.**

టీ॥ యథా=ఏ ప్రకారము, శుక్తౌ = ముత్యపుచిప్పయందు, రూప్యం = వెండియు, రజ్జౌ = త్రాటియందు, ఫణీ = సర్పమున్ను, సూర్యకరే = సూర్యకిరణములయందు, వారి = జలమున్ను, వికల్పితం = కల్పింపబడి, భాసతే = తోచుచున్నదో, తథైవ = అట్లే, వికల్పితం = విశేషకల్పితమగు, విశ్వం = ప్రపంచము, అజ్ఞానాత్ = అజ్ఞానము వలన, మయి = నాయందు, భాసతే = తోచుచున్నది, అహో = ఆశ్చర్యము.

**అహో! అద్భుతం! అజ్ఞాన జనితమయిన భ్రమకారణంగా ప్రపంచం నాలో భాసిస్తున్నది. ముత్యపుచిప్పలో వెండివలె, తాడులో పామువలె, ఎండ మావులలో జలంవలె ప్రపంచం నాలో ఉన్నట్లుగా అనిపిస్తున్నది.**

గడచిన అయిదు శ్లోకాలలోనూ వివిధ ఉపమానాల సహాయంతో, ఈ ప్రపంచం ఉన్నట్లుగా కనబడడానికి ఆత్మచైతన్యమే కారణమని నిరూపింప బడింది. కార్యమయిన ప్రపంచంలో కారణమయిన ఆత్మ సర్వవ్యాప్తంగా ఉందని కూడా నిరూపింపబడింది. మట్టితో తయారయిన కుండలో అంతటా పూర్తిగా మట్టి ఉండి తీరుతుంది. అయితే మట్టి పరిణామం చెందడంవల్ల, రూపాంతరం చెందడంవల్ల ఇది సాధ్యమయింది.

అనంతమయిన ఆత్మ కూటస్థం--పరిణామరహితం, మార్పుచెందనిది, కనబడే ప్రపంచానికి ఆత్మకారణం అంటే ఆత్మలో మార్పు సాధ్యం అని ఒప్పు కున్నట్టే అవుతుంది. మార్పుచెందేది నశించితీరుతుంది. కాబట్టి ఈ మార్పును ఒప్పుకుంటే, ఇంతవరకూ ఆత్మగురించి చెప్పబడింది అసత్యంగానూ, వేదాంతం తర్కసమ్మతంగాని అసంబద్ధ ప్రలాపంగానూ అనిపించక మానదు!

అందుకనే ఈ శ్లోకంలో జనకుడు వేదాంతంలో తరుచుగా వాడబడే ఇంకొకమూడు ఉపమానాలతో, కనబడే నామరూపాత్మక ప్రపంచం కేవలం మనః కల్పితభ్రమ అని చెప్పుతున్నారు. భ్రమ అధిష్ఠానాన్ని ఏ విధంగానూ మార్చదు. అధిష్ఠానాన్ని సరిగ్గా చూడకపోవడంవల్ల మాత్రమే భ్రమ ఉన్నట్టు కనిపిస్తుంది. సత్యాన్ని గ్రహించగానే అసత్యం అదృశ్యమయిపోతుంది.

ముత్యపుచిప్ప వెండివలె కనిపించడం, తాడునుచూసి పాముగా భ్రమ పడడం, సూర్యకాంతిలో ఎండమావిలో నీరున్నట్టు కనబడడమూ మనకు తెలిసినవే. ఇదేవిధంగా ఆత్మలో ప్రపంచం ఊహించబడుతున్నది; కల్పించబడుతున్నది, ఆరోపింపబడింది. ఆత్మను గ్రహించవలసినట్లుగా గ్రహించక పోవడంతో ప్రపంచాన్ని ఊహిస్తున్నాను, మనస్సులో నిర్మిస్తూ చూస్తున్నాను. ఆత్మను ఆత్మగా, సరిగ్గా గుర్తించినప్పుడు భ్రమ తొలగిపోతుంది.

**శ్లో॥ మత్తో వినిర్గతం విశ్వం మయ్యేవ లయమేష్యతి ।**
**మృది కుంభో జలే వీచిః కనకే కటకం యథా ॥ 10.**

టీ॥ యథా = ఏ ప్రకారము, మృది = మట్టియందు, కుంభః = కుండయు, జలే = జలమునందు, వీచిః = అలలున్ను, కనకే = సువర్ణమునందు, కటకం = కడియము మొదలగు భూషణములున్ను, లయం = లీనమును, యాన్తి = పొందుచున్నవో, (తద్వత్ = అట్లే), మత్తః = నానుండి, వినిర్గతం = ఉత్పన్నమైన, ఇదం = ఈ, విశ్వం= ప్రపంచం, మయ్యేవ = నాయందే, లయం = లయమును, ఏష్యతి = పొందును.

ఏ విధంగా కుండ మట్టిలో కలిసిపోతుందో, తరంగం నీటిలో కరిగిపోతుందో, ఆభరణం బంగారంలో ఐక్యమయిపోతుందో, అదేవిధంగా నాలో భాసించే ప్రపంచం నాలోనే లయం అయిపోతుంది.

స్తంభంలో భూతం కనిపించినప్పుడు, మాయం అయిపోయినప్పుడు కూడా భూతం ఎక్కడినుండో అక్కడికి వచ్చిందని కానీ తిరిగి ఎక్కడికో వెళ్ళి పోయిందనికానీ అనలేం. ఇది కేవలం చూసేవాని భ్రాంతి మాత్రమే, కాబట్టి చూసే వాని (మనస్సులో) ఊహలో మాత్రమే ఉనికిని కలిగి ఉంటుంది. అయితే ఈ కనిపించిన భూతం స్తంభంలోనే కనిపించి అక్కడే లయం అయిపోయిందని చెప్పితీరాలి.

తన అనుభవంతో నిర్ఘాంతపోయిన జనకుడు, ఈ ప్రపంచం ఏవిధంగా అదృశ్యం అయిపోయిందో చెప్పాలని ప్రయత్నిస్తున్నారు. కార్యం ఏవిధంగా కారణంలో ఐక్యం అయిపోతుందో, అదేవిధంగా ఈ విషయి-విషయ సంబంధ మాత్రంగా స్ఫురించే ఈ జగత్ భ్రమ అంతా తనలోనే ఐక్యం అయిపోయిందని స్పష్టం చేస్తున్నారు.

**శ్లో॥ అహో! అహం నమో మహ్యం వినాశో యస్య నాస్తిమే।**
**బ్రహ్మాది స్తంబపర్యన్తం జగన్నాశేఽపి తిష్ఠతః ॥ 11.**

టీ॥ బ్రహ్మాదిస్తంబపర్యన్త మపి = బ్రహ్మ మొదలుకొని తృణమువఱకును, తిష్ఠతః = ఉంటున్నటువంటి, యస్య మే = యే నాకు, జగన్నాశే అపి = జగత్తునశించినదై నప్పటికీ, నాశః=నాశము, న అస్తి = లేదో, అహో = ఆశ్చర్యము, (అత ఏవ=ఈ కారణము వలననే), అహం = నేను, మహ్యం = నాకొఱకు, నమః = నమస్కారమును చేయు చున్నాను.

అహో! నేను అద్భుతంగా ఆశ్చర్యకరంగా ఉన్నాను. నన్ను నేనే అభినందించుకుంటున్నాను. గడ్డిపోచ మొదలు జగదీశ్వరుని వరకూ గల మొత్తం జగత్తంతా నశించినా నేను శాశ్వతంగా నాశరహితంగా ఉన్నాను.

అద్భుతమయిన తన అనుభవాన్ని, ఆశ్చర్యకరమయిన తన అద్వైత స్థితిని ఇక్కడనుండి నాలుగు శ్లోకాలలో చెప్పబోతున్నారు శ్రీ జనకులు. దేశ కాలావృతంగా భాసించే సమస్త జగత్తుకు అధిష్ఠానంగా ఏకంగా అద్వయంగా ఉన్న ఆత్మస్వరూపమే తానని చెప్పబోతున్నారు.

"అత్యాశ్చర్యకరం, అత్యద్భుతం అయిన నన్ను నేనే అభినందించుకుంటున్నాను"---"అహో, అహం నమామ్యహం" ఇదే గీతం ఈ నాలుగు శ్లోకాలలోనూ ఆలపింపబడుతోంది. ఆత్మానుభవం అద్భుతం ఆశ్చర్యకరం మాత్రమే కాదు, అది పవిత్రమూ, దివ్యమూ, అత్యంత ఆహ్లాదకరమూ కూడా. కాబట్టి ఇది గౌరవించదగినది, ఆరాధించదగినది, పూజార్హమైనది.

శుద్ధమయిన చైతన్యం నాశరహితం, అక్షరం, జగదీశుడూ అతని జగత్తూ ఆడే జగన్నాటకానికి రంగస్థలమే ఈ ఆత్మ పాత్రలు వస్తున్నాయి, పోతున్నాయి. కాని రంగస్థలం మాత్రం ఎప్పుడూ కాంతిమయంగా స్థిరంగా అలాగే ఉంటున్నది (కాంతి అంటే తెలియబడడానికి ఉపయోగపడే తెలివి-చిత్). మిథ్యాత్మకమయిన ఈ ప్రపంచ నాటకం జరుగుతూనే ఉన్నా, ఈ ఆత్మ శాంతంగా, అక్షరంగా, నిత్యంగా ఉంది, ఉంటుంది.

"ఈ అనంతమైన ఆత్మనే నేను"---ఇదే ఆత్మానుభవం. ఈ శ్లోకాలలో ఉత్తమ పురుష ఏకవచన పదప్రయోగం; జనకుడు తన్ను తాను ఆత్మగా గుర్తించడాన్ని ధృవపరుస్తోంది. ఉపనిషత్తులన్నీ ముక్తకంఠంతో ఘోషిస్తున్నాయి--"బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి"బ్రహ్మను తెలుసుకున్నవాడు ఆ బ్రహ్మమే, వేరుకాదు.

ఇదే భావం ఇంకా అందంగా వరాహ ఉపనిషత్తులో ఇలా వర్ణింపబడింది.

సర్వభూతాంతరాస్థాయ నిత్యముక్త చిదాత్మనే
ప్రత్యక్చైతన్యరూపాయ మహ్యమేవ నమోనమః. (వరాహోపనిషత్తు-11-33)

*అన్నిప్రాణులలోను చిద్రూపంగా నివసిస్తూ, నిత్యముక్తుడనై, చైతన్యరూపంగా ఉన్న నాకు నేను నమస్కరించుకుంటున్నాను.*

సర్వప్రాణులలోనూ ఉన్నటువంటి---(సర్వభూతాంతరస్థాయ)-అన్న బహువచనంలో మొదలుపెట్టి, ఏకవచనంతో ముగించడం ఇక్కడ వ్యాకరణ దోషంగా భావించరాదు. నీలోనూ, నాలోనూ అందరిలోనూ ఉన్న ఆత్మ ఒకటే అని నిశ్చయంగా చెప్పడం కోసం వేదాంతార్థంలో అలా వాడబడింది.

ఇదే అర్థం వచ్చే శ్లోకం యోగవాశిష్టంలో కూడా ఉంది. దీని భావం ఇలా ఉంది------"నీకూ, నాకూ నమస్కారం, ఇద్దరమూ చైతన్యమే, ఉన్నది చైతన్యం ఒక్కటే"

శ్లో॥ అహో అహం నమో మహ్యం ఏకోఽహం దేహవానపి ।
క్వచిన్న గంతా నాగంతా వ్యాప్య విశ్వమవస్థితః ॥12.

టీ॥ అహం = నేను, అహో = ఆశ్చర్యరూపుడను, మహ్యం = నాకొఱకు, నమః = నమస్కారము, అహం = నేను, దేహవానపి = దేహధారినైనప్పటికినీ, ఏకః = అద్వితీయుడను, క్వచిత్ = ఎక్కడ నుండీ, గన్తా = పోవువాడను, న = కాను, క్వచిత్ = ఎక్కడికి, న ఆగన్తా = వచ్చువాడనుగాను, విశ్వం = ప్రపంచమును, వ్యాప్య = ఆవరించి, అవస్థితః = ఉంటున్నాను.

అద్భుతమైన నాకు నమస్కారము, శరీరంతో ఉన్నప్పటికీ నేను ఎక్కడ నుండీ రానూలేదు; ఎక్కడికీ పోవడమూ లేదు, విశ్వాన్నంతా ఆవరించి ఏకంగా ఉన్నాను.

తన అనుభవంతో దిగ్భ్రాంతి చెందిన జనకుడు తన ఆశ్చర్యాన్ని వ్యక్తం చెయ్యడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు.

నా శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధీ, దేశకాలాలలో పరిభ్రమించడం నాకు స్పష్టంగా తెలుసు. పరిమితమయిన జీవిగా శరీరంతో దేశకాలాలకు లోబడి ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశానికి చరిస్తూనే ఉన్నాను. ఆత్మగా నన్ను నేను తెలుసుకున్న యీ తరుణంలో, అన్ని కదలికలూ నాలో జరగడం చూస్తున్నాను. కానీ, నేను ఎక్కడికీ కదలడం లేదన్నది స్పష్టంగా బోధపడింది. నిత్యమూ, చైతన్యంగా నేను సర్వవ్యాప్తంగా ఉన్నాను. నాలోనే ఈ జగన్నాటకమంతా ఒక అంశంగా, అణుమాత్రంగా, కనిపిస్తున్నది!

శ్లో॥ అహో అహం నమో మహ్యం దక్షో నాస్తీహ మత్సమః ।
అసంస్పృశ్య శరీరేణ యేన విశ్వం చిరం ధృతమ్ ॥13.

టీ॥ యేన = ఎందుచేత, శరీరేణ = శరీరముతో, అసంస్పృశ్య = వేరయి (అంటక), మయా = నాచేత, (ఇదం = ఈ), విశ్వం = ప్రపంచము, ధృతం = ధరించబడుచున్నదో, (అతః = ఈ కారణమువలన), ఇహ=ఈ ప్రపంచములో, మత్సమః=నాతో సమానమయిన, దక్షః = సమర్థుడు (నేర్పరి), నాస్తి = లేడు, అహో = ఆశ్చర్యరూపుడనైన, అహం = నేను, మహ్య = నాకొఱకు, నమః = నమస్కారమును చేయుచున్నాను.

అద్భుతమయిన నన్ను నేను అభినందించుకుంటున్నాను! ఈ విశ్వాన్ని స్పృశించకుండానే అనాదిగా ధరిస్తున్నాను. ఈ సత్యం నాకు మాత్రమే అర్థం అవుతుంది. నాకంటే సమర్థులెవరూ లేరు.

జీవన చిహ్నాలుగా ప్రతిప్రాణిలోనూ మనం చూసే నైపుణ్యం, సమర్థత, చైతన్యం యొక్క వ్యక్తరూపాలే. ఉపాధులద్వారా వ్యక్తమయే చైతన్యమే జీవన చిహ్నంగా మనచేత గుర్తింపబడుతున్నది. సమస్త ప్రాణులలోనూ వ్యక్తమయ్యే సమిష్టి జీవశక్తిని భగవంతుడని అంటూ అతడిని సర్వశక్తిమయునిగా భావిస్తున్నాము. ఈ సర్వశక్తిమయుడైన జగదీశుడూ జగత్తూకూడా నాచే ధరింపబడుతున్నాయి. అయినా నాకు వాటితో ఏ సంబంధమూ లేదు. అసత్యమూ భ్రమాజన్యమూ అయిన జగత్తు నాలో లేనేలేదు.

సంబంధం కాని ఈ సంబంధమే సత్యానికీ అసత్యానికీ మధ్య ఉన్నది. భూతం స్తంభంమీద ఆధారపడి ఉన్నది, అయినా స్తంభం భూతాన్ని స్పృశించడం లేదు. నాలో ఉండే స్వప్న ద్రష్ట అనేక అనుభవాలు పొందుతూ సుఖదుఃఖాల ననుభవిస్తూ బయటపడలేక విలపిస్తున్నాడు. అయినప్పటికీ జాగ్రదవస్థలో ఉన్న నాకు ఆ స్వప్న ప్రపంచంతోగాని, ద్రష్టతోగాని, కష్టసుఖాలతోగాని ఎటువంటి సంబంధమూ లేదు.

ఈ చిత్రాతి చిత్రమయిన సంబంధాన్ని గమనిస్తే, ఆత్మను ఆరాధించ కుండా ఉండలేము. మనశ్శరీరాలు గత అనుభవాలను స్మరిస్తూ కొత్తవి ఊహిస్తూ వాటితో యిష్టా యిష్టాలను పెంచుకుని చలిస్తూ, తమవైన ప్రత్యేక ప్రపంచాలను నిర్మించుకుంటున్నాయి. జయాపజయాలను,సుఖదుఃఖాలను,జనన మరణాలను, ఊహించి నిర్మించి అనుభవిస్తున్నాయి. వీటన్నిటిమధ్య నిశ్చలంగా శాంతంగా ఆత్మ ఉంది, ఆ ఆత్మే నేను. ఈ జగన్నాటకం నానుండే ఉనికిని సంతరించుకొని సాగుతున్నది. ఉన్నవాటన్నిటిలో నిశ్చయంగా నేను గౌరవింపబడాలి. ఆరాధింప బడాలి.

**శ్లో॥అహో అహం నమో మహ్యం యస్య మే నాస్తి కించన ।**
**అథవా యస్యమే సర్వం యద్వాఙ్మానసగోచరమ్ ॥14.**

టీ॥ యస్య మే = యే నాకు, కించన = కొంచెముకూడ, నాస్తి = లేదో, అథవా = లేనిచో, యస్య = యే, మే = నాకు, వాఙ్మానసగోచరం = వాక్కులకు మనస్సునకు గోచరమగుచు, యత్ = యే, సర్వం = సమస్తమున్ను, (అస్తి = విషయమగుచున్నదో అట్టి), అహో = ఆశ్చర్యరూపుడగు, అహం = నేను, మహ్యం = నా కొఱకు, నమః = నమస్కరించుచున్నాను.

అహో! ఆత్మనైన నాకు నమస్కృతులు, నాలో ఏదీలేదు, వాక్కుకూ మనస్సుకూ గోచరించేవన్నీ నాలోనే ఉన్నాయి.

ఆత్మస్తుతిలో ఆఖరిశ్లోకం ఇది. అప్రయత్నంగా అతిసహజంగా అభివంద నాలర్పించడం జరిగింది. ఆత్మ సర్వానికీ అధిష్ఠానం కాబట్టి ప్రపంచంలో ఉండే సర్వాన్నీ తనదనవచ్చు. తనదైన శుద్ధస్వరూపాన్ని భ్రమాజనితమయిన సృష్టి యొక్క మిథ్యాత్వాన్ని గుర్తించి తనలో ఏమీలేనేలేదని అననూవచ్చు. ఆత్మగా తన్ను తాను గుర్తిస్తూ ఆ అనుభవజ్ఞానంతో రాజర్షి, పరస్పర విరుద్ధంగా ధ్వనిస్తున్నా సత్యాన్నే వచిస్తున్నారు. "అన్నీ నాలోనే ఉన్నాయి, నాలో ఏవీలేవు."

ఇదేభావాన్ని రాజర్షి ఇంతకుముందు శ్లోకాలలో కూడా చెప్పేరు "ప్రపంచ మంతా నాలో ఉంది, నిశ్చయంగా నాలో ఏదీలేదు" "అవాఙ్మానస గోచరమ్"--అని జనకులు అనడంలో, ఊహించగలిగినదీ, నిర్దేశించి చెప్పగలిగినదీ. అంటే సర్వమూ అన్న అర్థం ఉంది. అల్పపదాలలో అపారమైన అర్థాన్ని అంది వ్వడంలో సంస్కృతానికి సాటిరాగల భాష మరొకటి లేదు.

**శ్లో॥ జ్ఞానం జ్ఞేయం తథా జ్ఞాతా త్రితయం నాస్తి వాస్తవమ్ ।**
**అజ్ఞానాద్భాతి యత్రేదం సోఽహమస్మి నిరంజనః ॥15.**

టీ॥ యత్ర = ఎచట, జ్ఞానం = జ్ఞానము (తెలివి), జ్ఞేయం = తెలుసుకొనదగిన వస్తువు, జ్ఞాతా = తెలుసుకొనువాడు (అను), త్రితయం = మూడింటిగుంపు, వాస్తవం = వాస్తవముగ, నాస్తి = లేదో, చ = మఱియు, యత్ర = యెచ్చట, అజ్ఞానాత్ = అజ్ఞానము వలన, ఇదం = ఈ మూడింటిగుంపు, భాతి = తోచుచున్నదో, సః = ఆ, అహం = నేను, నిరంజనః = నిరంజన రూపుడను, అస్మి = అగుచున్నాను.

తెలుసుకునేవాడు, తెలియబడే విషయమూ, తెలుసుకోవడమూ--ఈ త్రిపుటి--ఈ మూడూ నిజానికి నాలో లేవు. శుద్ధమైన ఆత్మచైతన్యాన్ని నేను నాలో అజ్ఞానంవలన ఈ త్రిపుటి ఉన్నట్టుగా అనిపిస్తున్నది.

నానాత్వంతో భాసించే ఈ ప్రపంచంలో అనుభవాలు కలగడానికి ముఖ్యంగా మూడు విషయాలు ఉండితీరాలి. 1) తెలుసుకునేవాడు, 2) తెలియ బడే వస్తువు, 3) ఈ రెండింటి సంబంధమూ అయిన తెలియబడడం అనే క్రియ, జ్ఞానం ఈ మూడూ లేనిదే ఏ అనుభవమూ సాధ్యం కాదు.

అహంకారం అనుభవక్షేత్రాన్ని అధిగమించి ఆత్మగా తన్నుతాను

తెలుసుకున్నప్పుడు ఈ త్రిపుటి ఆడే మాయా జగన్నాటకం ఉండజాలదు. శుద్ధమైన ఆత్మలో అజ్ఞానంవలన ఈ త్రిపుటి ఉన్నట్టుగా భావింపబడుతోంది. ఈ మూడూ కూడా మనస్సుయొక్క కల్పనలే. ఆత్మను తెలియకపోవడంచేత భ్రమతో జగత్తుగా జీవుడుగా ఈశ్వరుడుగా భావిస్తోంది. సాధకుడు తన్నుతాను శుద్ధచైతన్యంగా గుర్తించినప్పుడు ఈ భ్రాంతి తొలగిపోతుంది.

మనం కలకంటున్నప్పుడు ఆ స్వప్న లోకమంతా, స్వప్నం చూసే నేనూ స్వప్న ప్రపంచమూ నాకూ ప్రపంచానికీ ఉండే సంబంధం---ఈ మూడింటి మీదే ఆధారపడి ఉంటుంది. ఈ స్వప్న ద్రష్ట (తైజసుడు) మేలుకోగానే ఈ మూడు కూడా ఏకమయిన జాగ్రద్రష్ట(విశ్వుని) యొక్క మనస్సులో లయం అయిపోతాయి. విశ్వుని మనస్సే తన ఊహలతో స్వప్న ప్రపంచాన్నీ త్రిపుటినీ కూడా నిర్మిస్తున్నది, కష్టసుఖాలనూ, యిష్టాయిష్టాలను, అన్నిరకాల అనుభవాలను అనుభవిస్తున్నది. ఈ త్రిపుటి ఉన్నంతసేపూ స్వప్నలోకం చాలా నిజంగా ఉంటుంది. మేలుకోగానే తన స్వస్థాన మనదగిన మనస్సులో లయం అయిపోతుంది. అహంకారానుభవ క్షేత్రంనుండి సాధకుడు చైతన్యానుభవస్థితికి రాగానే, అహంకారమూ ప్రపంచమూ అనుభవాలూ కూడా చైతన్యంలో లీనం అయిపోతాయి. చైతన్యం ఏకంగా అవ్యయంగా శుద్ధంగా ఉంటుంది.

**యోగవాశిష్ఠంలో ఇలా ఉంది,**

మృతం చిత్తం గతౌ తృష్ణా ప్రక్షీణే మోహపంజరః
నిరహంకారతా జాతా జాగ్రత్యస్మిన్ ప్రబుద్ధవాన్ . (యోగవాశిష్ఠం-81-9)

*మనస్సు నశిస్తే కోరికలు నశిస్తాయి. అహంకారం, పంజరం నుండి బయటపడిన పక్షివలె భ్రాంతిని విడిచి, ఆత్మానుభవంలో స్వేచ్ఛగా ఉంటుంది. శ్రీ అవధూత దత్తాత్రేయులు, అవధూత గీతలో ఈ ఆత్మానుభవాన్ని, ఏకత్వానందాన్ని ఇలా వర్ణించినారు.*

ధ్యాతా న తే హి హృదయే న చ తే సమాధిః
ధ్యానం న తే హి హృదయే న బహిః ప్రదేశః ।
ధ్యేయం న చేతి హృదయే న హి వస్తుకాలో
జ్ఞానామృతం సమరసం గగనోపమోహమ్ ॥

(అవధూత గీత III-41)

*ధ్యానించేవాడు లేడు, హృదయంలో సమాధీలేదు, ధ్యానమూ లేదు, హృదయానికి బాహ్యంగా దేశమూలేదు, ధ్యానించదగినదేదీ లేదు, హృదయంలో వస్తువులూ, కాలమూ లేవు, ఆకాశంవలె అసంగంగా, జ్ఞానామృతంలో సమచిత్తంతో నేనే ఉన్నాను.*

భావనాతీతమయిన ఇటువంటి అనుభవాలు పరిమితమయిన బుద్ధికి అర్థం కావు. ఈ అనుభవాలకు వ్యాఖ్యను స్థిరగంభీరమయిన ధ్యానంలో ఎవరికి వారే దర్శించి స్వంతం చేసుకోవాలి.

**శ్లో॥ ద్వైతమూలమహో దుఃఖం నాన్యత్తస్యాస్తి భేషజమ్ ।**
**దృశ్యమేతన్మృషా సర్వం ఏకోఽహం చిద్రసోఽమలః ॥16.**

టీ॥ దుఃఖం=దుఃఖము, ద్వైతమూలం=ద్వైతమే కారణముగా గలది, తస్య= ఆ ద్వైత మూలదుఃఖమునకు, అన్యత్ = ఇతరమైన, భేషజం = ఔషధము, నాస్తి = లేదు, ఏతత్= ఈ, సర్వం = సమస్తమైన, దృశ్యం = దృశ్యము, మృషా=మిథ్య, అహం= నేను, ఏకః= ఒక్కడనే, చిద్రసః = జ్ఞానైకస్వరూపుడను, అమలః = నిర్మలుడను, (అనుజ్ఞానమే ఔషధము)

**అన్ని దుఃఖాలకు ద్వైతభావమే మూలకారణం. ఈ దుఃఖం నివారింపబడాలంటే, అనుభవయోగ్యంగా కనబడేవన్నీ మిథ్య అనీ, అనుభవించే నేను ఏకంగా అద్వయంగా చైతన్యంగా ఉన్నాననీ తెలుసుకోవడమే మార్గం.**

కష్టం, బాధ, విచారం అన్నీకూడా మనస్సులోని అలజడులు మాత్రమే. మనస్సులో అలజడి ఎక్కువయినకొద్దీ విచారం కూడా ఎక్కువవుతూ ఉంటుంది. మనస్సు ఎంత శాంతంగా ఉంటే మనిషి అంతహాయిగా ఉంటాడు. బాహ్యాభ్యంతరాలలో నానాత్వ ప్రపంచాన్ని చూడడమే మనస్సులో అలజడికి కారణం ద్వైతభావాన్ని చూడటమే అన్ని బాధలకు మూలకారణం. తన్ను తాను ఏకమూ అద్వయమూ అయిన ఆత్మగా గుర్తించిననాడు నానాత్వ ప్రపంచం మిథ్యగా తెలియబడుతుంది. కాబట్టి ఆత్మజ్ఞానికి ఈ మిథ్యా ప్రపంచంవల్ల ఎటువంటి హానీ ఉండదు. "న అన్యత్ తస్య అస్తి భేషజం"-అహంకారానుభవ క్షేత్రంలోని బాధలు పోవాలంటే సత్యాన్ని తెలుసుకోవడం కంటే వేరే ఏ మార్గమూ లేదు.

**శ్లో॥ బోధమాత్రోఽహమజ్ఞానాత్ ఉపాధిః కల్పితో మయా ।**
**ఏవం విమృశ్యతో నిత్యం నిర్వికల్పే స్థితిర్మమ ॥ 17.**

టీ॥ అహం = నేను, బోధమాత్రః = జ్ఞానైకస్వరూపుడను, మయా = నాచేతనే, అజ్ఞానాత్ = అవిద్యవలన, ఉపాధిః = ఉపాధి, కల్పితః = కల్పింపబడినది, ఏవం = ఈ ప్రకారము, నిత్యం = ఎల్లప్పుడు, విమృశ్యతః = విచారణ చేయుచున్న, మమ = నాకు, నిర్వికల్పే = నిర్వికల్పసమాధియందు, స్థితిః = స్థితి, భవతి = అగుచున్నది.

**నేను శుద్ధచైతన్యాన్ని. అజ్ఞానంతో నన్ను నేను శరీరిగా భావిస్తున్నాను.**

సకల మానసిక వృత్తులనూ విడనాడి నా స్వరూపాన్ని ధ్యానించి ఆ అనుభవంలో ఉండి పోతాను.

"నిర్వికల్ప"అన్నమాట మొదటిసారిగా వాడబడడం చూస్తున్నాము. ఆలోచనలులేని స్థితి అని ఈ మాటకు అర్థం, దీన్ని మొదటిసారిగా అష్టావక్ర మునీంద్రులే వాడేరు. తరువాత పతంజలి మహర్షి దీన్ని బాగా వ్యాప్తిచేసేరు. శ్రీ శంకరులు ఈ పదాన్ని విరివిగా వాడేరు. ముఖ్యమైన ఉపనిషత్తులలోగాని భగవద్గీతలోకాని ఈ పదం వాడబడకపోవడం గమనార్హం.

జాగ్రదవస్థకు చెందిన వ్యక్తిత్వాన్ని మరిచిపోతే స్వప్నం సంభవం అవుతుంది. నేను సాక్షిచైతన్యాన్ని, నేను చూసేవన్నీ మిథ్యగా నాలో ఉన్నట్టు భ్రమకలిగిస్తున్నాయి. అని తెలుసుకుంటూ మనశ్శరీరాలతో నిత్యమూ వ్యవహరించడమే ఆత్మానుభవాన్ని సాధించే కీలకం. ఇలా నిత్యమూ తెలుసుకుని వ్యవహరించడంతో మనస్సు శాంతంగా ఉంటుంది--"నిర్వికల్పః" శరీరం, మనస్సు, బుద్ధి వాటి వాటి అనుభవక్షేత్రాలలో విహరించడం వల్ల నష్టం ఏమీలేదు. ఆత్మనే నేను అని స్థిరంగా అర్థం చేసుకున్నప్పుడు బాహ్యప్రపంచం మన అంతరంగాన్ని ఏ విధంగానూ బాధించజాలదు.

ఈ గీతలో ఆలోచనా రహితమైన స్థితి. ఈ నిర్వికల్ప అన్న పదంతో సుమారు ఆరుమార్లు సూచింపబడింది. గౌడపాదుని కారిక ఈ అష్టావక్రగీతచే బాగా ప్రభావితమైనట్లు కనిపిస్తుంది. అందులో ధ్యానలక్షణమైన సమాధిస్థితిని ఈ "నిర్వికల్ప" పదంతో అనేకచోట్ల సూచించడం కనిపిస్తుంది. ఈ నిర్వికల్ప సమాధి స్థితిలో విషయి, విషయ భేదం పూర్తిగా అంతరించి ఆత్మ కేవలంగా మిగిలిపోతుంది.

**శ్లో॥ అహో మయి స్థితం విశ్వం వస్తుతో న మయిస్థితమ్ ।**
**న మే బన్ధో஽స్తి మోక్షోవా భ్రాన్తి శ్శాన్తా నిరాశ్రయా॥18.**

టీ॥ మే=నాకు, బన్ధో వా = బంధముగాని, మోక్షో వా = మోక్షముగాని, నాస్తి=లేదు, అహో = ఆశ్చర్యమైన విషయమేమనగా, మయి = నాయందు, స్థితం = ఉన్నటువంటి, విశ్వం = జగత్తు, వస్తుతః = వాస్తవముగా, మయి = నాయందు, న స్థితం= ఉండలేదు (ఇతి విచారతః = ఇట్లు విచారించుటవలన), భ్రాన్తిః=భ్రాంతి, నిరాశ్రయా = ఆశ్రయ రహితమైనదై, శాన్తా = శాంతిని పొందుచున్నది.

నాకు బంధమూలేదు, ముక్తిలేదు. ఆశ్రయమయిన అజ్ఞానం నశించడంతో భ్రాంతికూడా నశించిది. అహో! ఈ ప్రపంచమంతా నాలో ఉన్నట్లు కనిపిస్తున్నా నిజానికి నాలో ఏమీలేదు.

మనశ్శరీరాలుకోరే కోరికలను బానిసలవలె తీరుస్తూ, తమలోని లోపాలను స్పష్టంగా తెలుసుకుని బయటపడడం అసంభవంగా గుర్తిస్తున్న ప్రారంభ దశలోని సాధకులకు, వారి సర్వబంధాలనుండీ ఎలా బయటపడవచ్చో చెబుతున్నారు. సాధకుడు ధ్యానబలంతో తన స్వస్థితి అయిన ఆత్మానుభవంలో నిలువగలిగినప్పుడు, అక్కడ బంధం అనే మాటకు అర్థమే లేదు, ఎందుకంటే ఆత్మ నిత్యముక్తం-- ఎప్పుడూ బంధింపబడలేదు. నా స్వప్నంలో నేను జైలులో బంధింపబడి బాధపడి ఉండవచ్చు, మెలకువ వచ్చాక నాకు విముక్తి లభించిందని సంతోషించాలా? ఇదే విధంగా నాకు బంధమూ లేదు, ముక్తిలేదు అని అంటున్నారు. ఆత్మానుభవాన్ని పొందిన జనకరాజర్షి, ఆత్మానుభవాన్ని పొందడంతో అజ్ఞానం నశించింది. అజ్ఞానం లేకపోవడంతో భ్రమాజన్యమయిన అహంకారానికి ఉనికిలేదు. అహంకారంలేనిస్థితిలో బంధమోక్షాలనే భావాలు ఎవరికి ఉంటాయి? ఉండనే ఉండవు.

నిన్నటిరాత్రి స్వప్నం నన్ను చాలా బాధపెట్టి ఉండవచ్చు, ప్రస్తుతం మేలుకుని ఉన్న నన్ను ఆ స్వప్న ప్రపంచం ఏమీ చెయ్యలేదుకదా! "ఇదేవిధంగా ప్రపంచం నాలో ఉన్నా, నాలో లేనట్టే" అని జనకుడు చెప్తున్నారు. ఆత్మజ్ఞాని, యిచ్ఛాధీనంగా మనశ్శరీరాలతో బాహ్యదృష్టితో అతడు ఆత్మలోనే స్థితుడయి ఉంటాడు, ఆ స్థితిలో విషయి-విషయాలుకూడా అతనిలో లేనట్టే.

**శ్లో॥ స శరీరమిదం విశ్వం న కించిదపి నిశ్చితమ్ ।**
**శుద్ధచిన్మాత్ర ఆత్మా చ తత్కస్మిన్కల్పనాఽధునా ॥19.**

టీ॥ స శరీరం=శరీరముతో గూడిన, ఇదం=ఈ, విశ్వం = ప్రపంచము, కించిదపి = కొంచెముగూడ, న=లేదు, చ=మరేమనగా, ఆత్మా = ఆత్మ, శుద్ధ చిన్మాత్రః = శుద్ధచైతన్య మాత్రము, ఇతి=ఇట్లని, యదా = ఎప్పుడు, నిశ్చితం = నిశ్చయింపబడుచున్నదో, తదా = అప్పుడు, కస్మిన్ = ఏ విషయమునందు, అధునా = ఇప్పుడు, కల్పనా = విశ్వకల్పన? (కల్పన అనవసరమని భావము).

ఈ శరీరమూ ప్రపంచమూ కూడా మిథ్య అని నాకు నిశ్చయంగా తెలుసు. అధిష్ఠానంగా ఎప్పుడూ ఉండే ఆత్మ శుద్ధమైనది. చైతన్య స్వభావంకలది అని కూడా తెలుసు. ఇక నేను దేనిని గురించి ఊహిస్తాను? దేనిని కోరుతాను?

ప్రస్తుత ఆత్మానుభవ స్థితిలో తానూ శుద్ధచైతన్యమూ ఒకటే అని నిశ్చయంగా తెలుసుకున్నాడు జనకుడు."శుద్ధచిన్మాత్ర! స్వప్నం నుండి మేలుకున్న వానికి తాను మెలుకువగా ఉన్నానన్న జ్ఞానంతో పాటే అంతవరకూ తాను చూసిందంతా భ్రమ, మిథ్య అని కూడా తెలుస్తుంది. ఇదేవిధంగా ఆత్మజ్ఞానం రావడం అంటే, అహంకారమూ జగత్తూ భ్రమ అని తెలిసిందన్నమాటే. ఉన్నది తాడే, భయంకరసర్పం కాదని నిశ్చయంగా తెలిసినవాడు ఇంకా ఆ సర్పం తన్ను వెంట తరుముతున్నదనీ హానిచేస్తుందనీ భయపడతాడా? ఆ భ్రాంత సర్పం కనిపిస్తున్నంతసేపే తత్సంబంధమయిన కల్పనలుంటాయి. ఇదేవిధంగా కల్పనా జగతిని చూస్తున్నంతసేపే కాల్పనిక సమస్యలూ ఊహాగానాలూ ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. తనకు కొత్తగా లభించిన అనుభవంతో జనకుడు 'దేనిని గురించి నేను ఊహిస్తాను? కోరుకుంటాను?' అంటున్నారు. ఆత్మజ్ఞాని ప్రపంచం లో వ్యవహరించగలడు కానీ దేనినీ ఊహించడు, కోరుకోడు.

**శ్లో॥ శరీరం స్వర్గనరకౌ బంధమోక్షౌ భయం తథా ।**
**కల్పనా మాత్రమేవైతత్ కిం మే కార్యం చిదాత్మనః॥ 20.**

టీ॥ ఏతత్ = ఈ , శరీరం = శరీరమున్ను, స్వర్గనరకౌ = స్వర్గనరకములున్ను, బంధమోక్షౌ = బంధమోక్షములున్ను, తథా = ఆ ప్రకారమే, భయం = భయమున్ను, కల్పనా మాత్రమేవ = కల్పనా మాత్రమేయైయున్నది, చిదాత్మనః = చిత్స్వరూపుడనగు, మే = నాకు, (ఏతేన = దీనితో), కిం = ఏమి, కార్యం = కార్యము.

శరీరమూ, స్వర్గనరక భావాలూ, బంధమోక్షాలూ, భయమూ ఇవన్నీ కేవలం కల్పనలే,ఊహలే,వీటన్నిటివల్లా నాకు ప్రయోజనం ఏమిటి? వీటన్నిటికి ఆధారమయిన చైతన్యమే నేను.

క్రిందటి శ్లోకంలో జ్ఞాని దేనినీ కోరవలసిన అవసరంలేదనీ దేనినీ ఊహించడనీ స్పష్టం చేసిన జనకుడు ఈ శ్లోకంలో సామాన్యంగా మతపరంగానూ వేదాంతంలోనూ సాధకుడు ఆలోచించే వాటి గురించి చెప్తున్నారు.

మనం నిజంగా ఉన్నాయనుకుంటున్న స్థూల సూక్ష్మ కారణ శరీరాలు కూడా మన ఊహాశక్తి జనితాలే, వాటి క్షేత్రాలలో అవి అనుభవాలనీ ఆందోళనలనీ ఆలోచనలనీ ఊహిస్తూ కల్పిస్తూ ఉంటాయి. ఇవన్నీ కలిసి అహంకారంగా గుర్తింప బడతాయి. ఈ అన్ని ఊహలకూ కల్పనలకూ మూలమయిన చైతన్యమే తానయి నప్పుడు, ఆ స్థితిలో వీటన్నిటికీ ఉనికి ఉండదు.

వ్యావహారిక జగత్తులో వ్యవహరిస్తున్నంత సేపూ, జీవుడు, తనకు తెలిసిన అనుభవాలదృష్ట్యా ఆనందానుభవ పూర్ణమయినది స్వర్గమనీ, బాధామయమయినది నరకమని ఊహిస్తుంటాడు. తనదైన శరీరంలో తాను బంధింపబడి ఉన్నాననుకుంటాడు. తనుచూసే మనస్సునే తానుగా భావిస్తూ, కష్టసుఖాలనుభవిస్తూ వాటిని వదలించుకోవాలనో, సంపాదించాలనో తాపత్రయపడుతూ, ఇంకా అనేక ఊహా కల్పనలను చేస్తూనే ఉంటాడు; వీటితో భయపడతాడు, బాధపడతాడు భరించలేననుకుంటాడు. నిజానికి ఇవన్నీ మనఃకల్పితాలే.

ఈ సర్వకల్పనలకూ మూలమయిన చైతన్యమే తానని తెలిసినప్పుడు వాటి గురించి ఎందుకు ఆలోచిస్తాడు? "స్వప్నజగత్తంతా నా మనస్సులో కల్పింపబడిందని తెలిసేక ఏవిధంగా నేను దాని గురించి ఆలోచించడం మానేస్తానో అదే విధంగా, చైతన్యమే నేనని తెలుసుకొని ఈ చైతన్యంలో మిథ్యగా కనబడే శరీరాన్నీ ప్రపంచాన్నీ పూర్తిగా విస్మరిస్తాను. ఈ ప్రపంచపు కష్టసుఖాలూ ఆకర్షణలూ నన్ను బాధించవు" అని జ్ఞాని అయిన జనకుడు అంటున్నారు. జ్ఞాని సదా శాంతంగా తన స్వస్థితిలో నిశ్చలంగా ఉంటాడు.

**శ్లో|| అహో! జనసమూహేఽపి న ద్వైతం పశ్యతో మమ ।**

**అరణ్యమివ సంవృత్తం క్వ రతిం కరవాణ్యహమ్ ॥ 21.**

టీ|| జనసమూహే అపి = జనసమూహము మధ్యమునందును, ద్వైతం = ద్వైతమును, న పశ్యతః = చూడనటువంటి, మమ = నాకు, అరణ్యమివ = అరణ్యము వలె, సంవృత్తం = ఉన్నది (అయినది), తస్మాత్ = ఆ కారణమువలన, అహం = నేను, క్వ = ఎక్కడ, రతిం = (మోహమును)రతిని, కరవాణి = చేయగలను, అహో = ఆశ్చర్యం.

**అహో అద్భుతం! మహాజన సమూహ మధ్యంలో కూడా నాకు రెండవదేదీ కనిపించడం లేదు. ద్వైతభావమేలేదు. అరణ్యంలో ఉన్నట్టుగానే ఉంది. దేనిమీదనయినా నాకు కోరిక ఎలా ఉంటుంది?**

నామరూపాత్మకమయిన జగత్తంతా ఏ విధంగా మిథ్యగా ధృవపడిందో, ఏ విధంగా తాను అనంతమైన ఆత్మచైతన్యంగా నిలచి ఉన్నాడో కిందటి శ్లోకాలలో వర్ణించారు జనకుడు. శరీరభావనా, మానసిక యిష్టాయిష్టాలూ, బుద్ధి తాలూకు నిశ్చయానిశ్చయాలూ, అన్నీకూడా తనలో ప్రస్తుతంలేవు. తాను కేవలం చైతన్యరూపాన్నని తెలుసుకున్నాడు.

సహజంగా మనకొక సందేహం రావచ్చు, ఆత్మజ్ఞాని సమాజంలో తిరిగే టప్పుడు ఏమని భావిస్తాడు? ఈ సందేహాన్ని ఇక్కడ జనకులు తీరుస్తున్నారు. మనోబుద్ధులకు మాత్రమే నానాత్వం గోచరిస్తుంది. వాటిని అధిగమించినప్పుడు నానాత్వాన్ని చూసే అహంకారి ఉండడు. తన స్వస్థితిలో నిలచిన జనకుడు అందుకే ఇలా అంటున్నారు. "అహో అద్భుతం! ద్వైతమే లేదు".

జనసమూహ మధ్యలో ఉన్నప్పటికీ అంతటా చైతన్యమే భాసించడం చూస్తున్న జనకుడు, అరణ్యమధ్యంలో ఏకాంతంగా శాంతంగా ఎలా ఉంటుందో అదే విధంగా ఇక్కడ కూడా ఉందని అంటున్నారు.

ఈ విధంగా సర్వత్రా తన ఆత్మచైతన్యాన్నే చూస్తున్నప్పుడు, దేని మీదనయినా రాగభావం ఎలా కలుగుతుంది జ్ఞానికి? తన స్వస్థితిలో తాను ఆనందంగా ఉంటాడు, వ్యవహారాలన్నీ సహజంగా వాటంతటవే జరుగుతుంటాయి.

**శ్లో॥ నాహం దేహో న మే దేహః జీవో నాహమహం హి చిత్।**
**అయమేవ హి మే బన్ధ ఆసీద్యా జీవితే స్పృహా ॥ 22.**

టీ॥ అహం=నేను, దేహః = శరీరము, న = కాను, మే = నాకు, దేహః = దేహము, న = లేదు, అహం = నేను, జీవః = జీవుడను, న = కాను, చిత్ = జ్ఞానస్వరూపుడను (అస్మి=అగుచున్నాను), జీవితే = జీవితమునందు, యా = యే, స్పృహా = ఆశ (యనున దేది గలదో), అయమేవ = ఇదియే, మే = నాకు, బంధః = బంధము.

నేను శరీరం కాదు, నాకు శరీరమూ లేదు. నేను జీవుడిని కాను, నేను చైతన్యాన్ని నేను జీవిస్తున్నానని జీవించాలని అనుకున్నాను-ఇదే నా నిజమైన బంధం.

జ్ఞానానుభవ స్థితుడయిన జనకుడు తన ప్రస్తుతస్థితిని, పూర్వపు స్థితిని పోల్చిచూసి చెప్పుతున్నారీశ్లోకంలో.

ఆత్మానుభవంలో తాను శరీరం కాదని తెలుసుకున్నారు. శరీరం అంటే స్థూలసూక్ష్మ కారణ శరీరాలూ మనో బుద్ధులూ కలిసిన కూటమి అని ఇక్కడ అర్థం. సర్వవ్యాప్తమూ అనంతమూ అయిన చైతన్యంలో పదార్థపరమయిన పరిమితులు ఉండవు.

"నాకు శరీరమూ లేదు"--- చైతన్యంగా తన్ను తాను తెలుసుకున్న జనకుడు దేనికీ సంబంధించి లేనని తెలుసుకున్నారు, అన్ని శరీరాలూ తనలో,

ఎఱుకలో, చైతన్యంలోనే ఉన్నాయి, ఏ శరీరమూ తనదికాదు. ఇటువంటి భావమే భగవద్గీత (7-12)లో చక్కగా ఇలా చెప్పబడింది. "న త్వహం తేషు తే మయి" --- "నేను వాటిలో లేను, అవి నాలో లేవు" భగవాన్ శ్రీ కృష్ణుడు ఇదే భావాన్ని ఇంకొక చోటకూడా ఇలా వ్యక్తం చేసినారు.

మయాతత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః. (భగవద్గీత-9-4)

*ఈ ప్రపంచమంతా నాచేత అవ్యక్తరూపంలో ఆవృతమై ఉంది. అన్ని ప్రాణులూ నాలోనే ఉన్నాయి. నేను మాత్రం వాటిలో లేను.*

తాను శరీరంకాననీ, తనకు శరీరం లేదనీ జనకుడు భావిస్తున్నారు, కాబట్టి జనకునికి శారీరక అనుభవాలేవీ లేవు. ఇవి లేని కారణంగా అనుభవించే అహంకారమూ జీవభావమూ కూడాలేవు. అతడు కేవలం చైతన్యమే---"అహం హి చిత్ "

"చైతన్యాన్నయిన నేను చైతన్యంగా నన్ను నేను ఇప్పుడు తెలుసు కున్నాను. ఈ మధ్యకాలంలో నా బాధలకూ బంధింపబడిన భావానికీ కారణం ఏమిటి" అని జనకులు ఆలోచిస్తున్నారు. జవాబుకూడా తానే చెప్పుతున్నారు. భ్రమలో, జీవిస్తున్నాననుకున్నప్పుడు ఇంకా జీవించాలనీ, విషయభోగాలను భవించాలనీ కోరుకోవడమే తన బంధానికి కారణమని చెప్పుతున్నారు. భ్రమ తొలగిపోగానే కోరుకునే అహంకారం నశించింది, ఆత్మచైతన్యం స్థిరంగా నిలిచి ఉంది.

## శ్లో॥ అహో! భువనకల్లోలైః విచిత్రై ర్ద్రాక్సముత్థితమ్ ।
## మయ్యనన్త మహోమ్భోధౌ చిత్తవాతే సముద్యతే ॥23.

టీ॥ అనన్త మహోమ్భోధౌ = అపారసుఖసముద్రమువలెనున్న, మయి = నాయందు, చిత్తవాతే = చిత్తమనువాయువు, సముద్యతే = వీచినదగుచుండగా, విచిత్రైః = విచిత్రము లైన (నానావిధములైన), భువనకల్లోలైః = ప్రపంచ సంబంధములగు తరంగముల చేత, ద్రాక్ = శీఘ్రముగా, సముత్థితం = పుట్టుట (తరంగములుత్పన్నము లైనవని భావము.)

**ఆహా! అద్భుతం! అనంతచైతన్య సాగరమయిన నాలో మానసిక కల్లోలం నుండి అనేకానేక ప్రపంచాలనబడే తరంగాలు క్షణంలో ఉద్భవిస్తున్నాయి.**

వాక్చతురత, పదలాలిత్యం, భావగంభీరతలతో నిండిన చివరి ఈ మూడు

శ్లోకాలలోనూ అష్టావక్రులు తనకిష్టమయిన సముద్ర ఉపమానాన్ని అర్థవంతంగా సమర్థతతో వాడుతున్నారు.

వాతావరణంలో ఉద్భవించిన పెనుగాలులతో తరంగాలు పైకిలేస్తాయి. తుఫానుగా మారతాయి, సముద్రం అల్లకల్లోలంగా కనిపిస్తుంది. ఈ పెనుగాలులు బలంతగ్గి శాంతించినప్పుడు తరంగాలు కూడా శాంతించి సముద్రంలో లయ మయి పోతాయి.

మనస్సు సుషుప్తిలోవలె శాంతస్థితిలో ఉన్నప్పుడల్లా ఏ దృశ్యభావాలు తెలియబడవు, మెలకువ వచ్చిన తక్షణమే, కదలిక కలగడానే,మనస్సు పనిచెయ్యడం ప్రారంభిస్తుంది. అలజడి మొదలవుతుంది. అనేక భావాలు మనచే గుర్తింపబడతాయి. "అనంతచైతన్య సాగరంలో నా స్వస్థితిలో"--- జనకులు చెప్పుతున్నారు, "మానసిక కల్లోలం చెలరేగినప్పుడు పెనుగాలులవంటి అలజడులూ, పర్వత సమానమయిన తరంగాలవంటి అనుభవాలూ ఉద్భవించి నాచే నాలో, భావాలుగా గుర్తింప బడతాయి" సంగ్రహంగా చెప్పాలంటే, మనస్సు శాంతస్థితిలో ఉంటే జగత్తు ఉండదు. పరమార్థదృష్ట్యా తెలుసుకునే చైతన్యంతప్ప వేరుగా ప్రపంచం లేనేలేదు. జీవ, వస్తుమయమయిన ఈ ప్రపంచమంతా, మానసిక కల్లోలజనిత కల్పనారూపాలే భావసారమయిన చైతన్యంలో భావాలు తెలియబడుతున్నాయి. సత్ లక్షణంతో ఉనికి ఉన్నట్టుగా, అనిపిస్తూ, చిత్ లక్షణంతో తెలుసుకుంటున్నట్టు భావిస్తూ మనస్సు, అహంకారం, ఉనికిని సంతరించుకుంటున్నాయి. ఆ మనస్సు లోని భావాలనే మహాద్భుత సృష్టిగా చూస్తున్నామనుకుంటూనే నిజమని భ్రమపడుతున్నాం. మనస్సు శాంతించగానే భావాలకదలిక ఆగిపోయి భావసార మయిన ఆత్మగా సత్ చిత్ ఆనందంగా నిశ్చలంగా నిలచిపోతుంది.

శ్లో॥ మయ్యనన్త మహామ్భోధౌ చిత్తవాతే ప్రశామ్యతి ।
అభాగ్యాజ్జీవవణిజో జగత్పోతో వినశ్వరః ॥ 24.

టీ॥ అనన్త మహామ్భోధౌ = అపారసముద్రరూపుడనగు, మయి = నాయందు, చిత్త వాతే = చిత్తరూపమగు వాయువు, ప్రశామ్యతి = శాంతించినదగుచుండగా, జీవవణిజః = జీవరూపుడగు వ్యాపారియొక్క, జగత్పోతః=జగద్రూపమైన నౌక (శరీరము), అభాగ్యాత్= దురదృష్టమువలన, వినశ్వరః = నశించిపోయినది.

అనంతచైతన్య సాగరమయిననాలో మనఃకల్లోలం సమసిపోయినప్పుడు, అభాగ్యుడయిన జీవవ్యాపారియొక్క జగన్నౌక ఛిన్నాభిన్నమై మునిగిపోతుంది.

సౌందర్యభరితమైన సముద్ర ఉపమానాన్ని కొనసాగిస్తూ జనకుడు "మానసిక కల్లోలాలనబడే తుఫానులు అణగిపోగానే ప్రపంచం అనబడే నావకూడా మునిగిపోయి అదృశ్యం అయిపోతుంది. ఆత్మే మిగిలి ఉంటుంది" అంటున్నారు.

అద్భుత కవితా కల్పనా చాతుర్యంతో జీవుని వ్యాపారితో పోలుస్తున్నారు. జీవుడు తన నావ అయిన దేహంతో ఈ జగత్సంసార సాగరంలో అనేకచోట్ల ఆగుతూ వ్యాపార సంబంధాలు పెంచుకుంటూ అనుభవాలు సంపాదిస్తూ ఆకర్షణల నభివృద్ధి చేసుకుంటూ రాగద్వేషాలననంతంగా ప్రోగుచేసుకుంటూ వాసనారూపంలో అనంత ధనరాశిని ప్రారబ్ధ ఆగామి సంచితాలనబడే కర్మలలో నిలవచేసుకుని జనన మరణ చక్రంలో పరిభ్రమిస్తున్నాడు. మనస్సు శాంతస్థితి నందినప్పుడు ఈ జీవ జగద్భావాలు చైతన్యసాగరంలో లయం అయిపోతున్నాయి. అపారమయిన అనంత చైతన్యసాగరం కల్లోలరహితంగా శాంతంగా స్థిరంగా మిగిలిపోతుంది.

**శ్లో॥ మయ్యనన్త మహామ్భోధావాశ్చర్యం జీవ వీచయః ।**
**ఉద్యన్తి ఘ్నన్తి ఖేలన్తి ప్రవిశన్తి స్వభావతః ॥ 25.**

**టీ॥** అనన్తమహామ్భోధౌ = అపారమహాసముద్ర రూపుడనైన, మయి = నాయందు, జీవవీచయః జీవులను తరంగములు, ఉద్యన్తి = లేచుచున్నవి, ఘ్నన్తి = ఒకదానితో నొకటి ఒరుచుకొనుచున్నవి, ఖేలన్తి = ఆడుకొనుచున్నవి, స్వభావతః = స్వభావము గానే, ప్రవిశన్తి = లయించుచున్నవి.

**ఆశ్చర్యకరం! అద్భుతం! నాలో, అనంత చైతన్యసాగరంలో, జీవులంతా తరంగాలవలె ఉద్భవిస్తూ, చరిస్తూ, నర్తిస్తూ, కొంతకాలమునకు కాలగర్భంలో కలసి పోతున్నారు.**

ఈ పుస్తకాన్ని చదవడం ఆపేసినా, మానేసినా, కూడా చాలా కాలం వరకూ ఈ అధ్యాయానికి చివరిదైన ఈ శ్లోకం యొక్క భావగాంభీర్యమూ కవితా సౌందర్యమూ సాధకుని వెన్నాడుతూనే ఉంటుంది.

శుద్ధచైతన్యమయిన నాలోనుండి జడమయిన ప్రపంచాలేకాక అందు లోని సర్వప్రాణులూ జీవకోటి కూడా ఉద్భవిస్తున్నాయి. మన స్వప్నంలో దీనిని స్పష్టంగా చూడగలం. మెలకువరాగానే మనః కల్పితమయిన స్వప్న జగత్తంతా జాగ్రదవస్థలోని మనస్సులో లయం అయిపోవడం మనందరికీ నిత్యమూ అనుభవమే.

స్వప్నంలోవలెనే జీవులు ఉద్భవించి, కష్టసాధ్యమయినా తమ ఉనికిని సుస్థిరం చేసుకునే ప్రయత్నం చేస్తూ, అనుభవాల ననుభవిస్తూ, రాగద్వేషాలను పెంచుకుంటూ, వాసనలను పోగుచేసుకుంటూ చనిపోతున్నారు- మరల మరొక తరంగంలా ఉద్భవించడానికి! మనస్సు శాంతస్థితిలో ఉంటే మనస్సుచే గుర్తింపబడే సర్వనామరూపాలూ,తమ నామరూపాలను విడనాడి చైతన్యంగా ఉండిపోతాయి, కదలిక ఉన్న నీరు తరంగం అనే నామం రూపంతో గుర్తింపబడి, కదలిక ఆగిపోగానే నిశ్చలంగా నీరుగా ఉన్నట్టే.

...

## అధ్యాయం - 3

# ఆత్మ అందరిలో - అందరూ ఆత్మలో

"అహంబ్రహ్మాస్మి" అన్న ఉపనిషద్ మహావాక్యమే అసలైన నిత్య సత్యం. అద్వయమయిన ఆత్మలో నిష్ఠకలిగిన మనిషికి ఈ కనిపించే ప్రపంచమంతా అర్థరహితమూ ఆధారశూన్యమూ అయిన భ్రమగా నిశ్చయంగా తెలుస్తుంది. మృత్యుభయమూ, రాగబంధమూ, కోరికల తీవ్రతతో జనించే అలసటా అసంతృప్తీ అన్నీకూడా ఆత్మజ్ఞానంతో అదృశ్యమయిపోతాయి. అటువంటి మహాత్మునిద్వారా ఆత్మప్రకాశం బహిర్గతమవుతూ దివ్య సౌందర్యాన్ని అద్భుతప్రకాశాన్నీ అందిస్తుంది అందరికీ.

జ్ఞానీ అయిన జనకుడిని ఆత్మనిష్ఠుడయిన అష్టావక్రుడు పరీక్షించ దలచిన హేళనాస్వరంతో ప్రశ్నలడగడాన్ని ఈ అధ్యాయంలో చూస్తాం. మనస్సుకతీతంగా నిలవగలిగి, ఆత్మానుభవాన్ని పొంది, దృశ్యప్రపంచ మంతా నామరూపాత్మకమనీ మిథ్య అనీ గుర్తించిన జనకుడు ఇంకా తన ధర్మాన్ని ఎందుకు విడిచిపెట్టలేదు? రాజరికపు హోదాలూ, దర్బారు మర్యాద లూ, కట్టుబాట్లూ, నియమాలూ, రాజ్యపాలనలోని బరువు బాధ్యతలూ, కష్ట సుఖాలూ, శాసననిర్మాణాలూ పాలనలూ ఇవన్నీ ఏ రాజూ తప్పించుకో లేనటువంటివి? అయితే ఆత్మదృష్ట్యా ఇవన్నీ భ్రాంతితోకూడిన కల్పనలే. కాబట్టి, ఇవన్నీ సక్రమంగా నిర్వహిస్తున్నాడంటే, ఆత్మపరంగా, "అజ్ఞానం" మిగిలి ఉందని అనుకోవలసి ఉంటుంది.

ఇటువంటి తర్కంతో అష్టావక్రులు తన శిష్యుని జ్ఞాననిష్ఠను, అనుభవ జ్ఞానాన్ని పరీక్షిస్తున్నారు. దీని తరువాత అధ్యాయంలో జనకరాజర్షి తనమీద ఆరోపింపబడిన వాటన్నిటికీ అర్థమయిన సమాధానాన్నిస్తున్నారు. అద్వైతాన్ని అధ్యయనం చేసే సాధకులకు ఈ రెండు అధ్యాయాలూ సంయుక్తంగా ఎంతో ఉత్సాహాన్నీ స్ఫూర్తినీ యిస్తాయనడలో సందేహం లేదు.

అష్టావక్రుని ములుకులవంటి ప్రశ్నలు హేళనతో కూడిన మాటలు

జనకుని అహంకారాన్ని తీవ్రంగా గాయపరచి తీరాలి. అతడు పూర్తిగా ఆత్మ నిష్ఠుడు కాకపోతే.

**అష్టావక్ర ఉవాచ :-**

**శ్లో॥ అవినాశిన మాత్మానం ఏకం విజ్ఞాయ తత్త్వతః ।**
**తవాత్మజ్ఞస్య ధీరస్య కథమర్థార్జనే రతిః ॥ 1.**

**టీ॥** ఏకం = అద్వయమైన, అవినాశినం = నాశరహితమైనట్టి, ఆత్మానం = ఆత్మను, తత్త్వతః = యథార్థముగా, విజ్ఞాయ = తెలుసుకొని, ధీరస్య = ధీరుడైనట్టియు, ఆత్మజ్ఞస్య = ఆత్మజ్ఞానుడైనట్టియు, తవ = నీకు, అర్థార్జనే = అర్థార్జనమునందు, కథం = ఎట్లు, రతిః= ఆసక్తి, (భవతి = కలుగుచున్నది).

**అక్షరమూ ఏకమూ అయిన ఆత్మను తెలుసుకున్న ధీరుడవూ జ్ఞానివీ అయిన నీవు, ఈ సంపదలను సంపాదించాలని ఇంకా ఎందుకు కోరుచున్నావు?**

ఆత్మానుభవం పొందిన తరువాతకూడా జనకుడు తన రాజ్యపాలన యథాప్రకారంగా కొనసాగించేడు. హేళనధ్వనించే ప్రశ్నలతో ఈ శ్లోకాలలో అష్టావ్రకుడు జనకుని పరీక్షిస్తున్నాడు. అద్వయమయిన ఆత్మానుభవాన్ని తాను పొందేనని చెప్తూనే, బాహ్యంగా ద్వైతమయమయిన ప్రపంచంలో సమర్థతో కర్మల నాచరిస్తున్నాడు. విదేహాధిపతి నాశరహితమూ, నిత్యసత్యమూ, ఏకమూ అయిన ఆత్మని తెలుసుకొని కూడా, బాహ్యప్రపంచంలో తన సామాజిక రాజకీయ బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తూ, ధనాన్ని సంపాదిస్తూ వెచ్చిస్తూ నిరంతర కర్మశీలిగా ఎలా ఉంటున్నాడు జనకుడు?

**శ్లో॥ ఆత్మాజ్ఞానాదహో ప్రీతిః విషయ భ్రమగోచరే ।**
**శుక్తే రజ్ఞానతో లోభః యథా రజతవిభ్రమే ॥ 2.**

**టీ॥** యథా = ఏప్రకారము, శుక్తేః = ముత్యపు చిప్పయొక్క, అజ్ఞానతః = జ్ఞానం లేకపోవుటవలన, రజతభ్రమే = వెండియనెడి భ్రాంతియందు, లోభః = లుబ్ధత గలుగు చున్నదో, తథా=అట్లే, ఆత్మాజ్ఞానాత్=ఆత్మను తెలిసినకొనక పోవుటవలన, విషయభ్రమ గోచరే=నశ్వరములగు దృశ్యవిషయముల యందు, ప్రీతిః=ప్రీతి, (భవతి=కలుగుచున్నది).

**అజ్ఞానంవల్ల నత్తగుల్లని వెండిగా భ్రమించి లోభంతో సంపాదించడానికి శ్రమపడతారు. ఇదేవిధంగా ఆత్మ తెలియని కారణంగా, అజ్ఞానంవల్ల, ఇంద్రియ గోచరమయిన ప్రపంచం మీద రాగభావం ఉదయించి వృద్ధిచెందుతుంది.**

క్రిందటి శ్లోకంలో భావాన్నే వివరిస్తూ, అష్టావక్రులు ఇలా అంటున్నారు. ఆత్మనిగురించిన అజ్ఞానంవల్లనే, భ్రమకు లోనయిన అహంకారం. ఇంద్రియ గోచరమయిన విషయభోగాలను వాంఛిస్తుంది. జనకునికి ఆత్మానుభవం ఉంటే విషయభోగాలమీద వాంఛ ఉండరాదు. తనకి ఆత్మానుభవం ఉందని తానే అంటున్నాడు. అయినా రాజుగా ఐశ్వర్యాన్ని సంపాదిస్తూనే ఉన్నాడు. సమాజ సేవ చెయ్యాలనీ, ప్రాపంచిక కర్మల నాచరించాలనీ, అద్వైతానుభవస్థితుడయిన జ్ఞాని ఎలా అనుకుంటాడు? నత్తగుల్ల అని తెలియక, వెండి అని భ్రమించడం వలన మాత్రమే దానిని సంపాదించి భద్రపరచాలనిపిస్తుంది!

జనకుని పరీక్షించాలనే దృష్టితో అష్టావక్రుడు, అతడు సింహాసనాన్నీ అధికారాన్నీ వదలలేకపోవడమే "అజ్ఞానానికి" నిదర్శనం అని అంటున్నారు.

**శ్లో॥ విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే ।**
**సోऽహమస్మీతి విజ్ఞాయ కిం దీన ఇవ ధావసి ॥ 3.**

టీ॥ యత్ర = ఏ ఆత్మరూప సముద్రమునందు, ఇదం = ఈ, విశ్వం = ప్రపంచము, తరంగా ఇవ = తరంగములవలె, స్ఫురతి = తోచుచున్నదో, సః=ఆ యాత్మయే, అహం = నేను, అస్మి = అగుచున్నాను, ఇతి = ఈ ప్రకారము, విజ్ఞాయ = తెలిసికొని, కిం = ఎందుకొఅకు, దీన ఇవ = దీనునివలె, ధావసి = (విషయములపైకి)పరుగెత్తుచున్నావు.

సముద్రంనుండి కెరటాలు జనించినట్టుగా, నానుండే విశ్వం ఉద్భవిస్తుంది అని తెలుసుకున్ననీవు, ఎండమావుల వెంట ఎందుకు పరుగెడుతున్నావు?

అసంపూర్ణంగా తనను భావించిన అహంకారం, తనచుట్టూ ఉన్న అసంఖ్యాకమయిన వస్తువులను సంపాదించి పూర్ణత్వాన్ని సాధించాలనుకుంటుంది. అన్నిటికీ అధిష్ఠానమయిన ఆత్మగా, పూర్ణంగా నిన్ను నీవు గుర్తించేనని అంటున్నావు. నీలోనుండే విశాలవిశ్వమంతా ఉదయించి నర్తించి లయం అవుతుందని అంటున్నావు, అయితే ఎందుకు? దేనిని కాంక్షించి ఇంకా ఇలా కష్టపడి ప్రణాళికలను వేస్తూ, అమలు జరుపుతూ సమాజసేవ చేస్తూ విశ్రాంతి లేకుండా నికృష్టంగా జీవిస్తున్నావు? భ్రమాజనిత అహంకారానికి బానిసలయిన జీవులు మాత్రమే ఇలా ప్రవర్తిస్తారు. జనకుడు కూడా ఈ జీవులలాగే ప్రవర్తిస్తూ ఉంటే అతనిలో ఈ జ్ఞానం ఉందని ఎలా అనుకోవడం?

కావాలనే ఈ విధంగా అష్టావక్రుడు తన శిష్యుడిని హేళన చేస్తున్నారు. ఆత్మానుభవంలో నిష్ఠ ఏర్పడిందో లేదో పరీక్షించాలనే ఇలా ప్రశ్నిస్తున్నారు.

శ్లో|| శ్రుత్వాఽపి శుద్ధచైతన్యం ఆత్మానమతిసున్దరమ్ ।
ఉపస్థేఽత్యంత సంసక్తః మాలిన్యమధిగచ్ఛతి ॥ 4.

టీ|| అతిసున్దరం = మిక్కిలి సుందరమైనటువంటి, శుద్ధచైతన్యం = శుద్ధచైతన్య స్వరూపమగు, ఆత్మానం = ఆత్మను, శ్రుత్వా అపి = వినియు (తెలిసికొనియు), ఉపస్థే = సమీపమునందున్న విషయములయందు, అత్యన్తసంసక్తః = మిక్కిలి ఆసక్తిగలవాడు, మాలిన్యం = అపరిశుద్ధతను, అధిగచ్ఛతి = పొందుచున్నాడు.

**ఆత్మ శుద్ధమయినది అత్యంత సౌందర్యపూర్ణమూ అని విన్నాక కూడా ఏ విధంగా విషయభోగాలనాశిస్తూ మలినమయిన జీవితం గడుపగలడు?**

ఆత్మ అనంత సౌందర్యభావ సంపన్నమనీ, నిత్యశుద్ధమనీ, విని బుద్ధితో అర్థం చేసుకున్నవారికి, భ్రమాజన్యమయిన ప్రాపంచిక భోగాలమీద విరక్తి జనించి తీరుతుంది. స్వప్నంలో సౌందర్యరాశిగా కనిపించిన భార్యను మెలకువ వచ్చేక కూడా ఎవరైనా ప్రేమిస్తారా? మహారాజైన జనకుడు భోగభాగ్యాలతో నృత్య గానాలతో వైభవంగా జీవిస్తున్నట్టుగా కనిపిస్తున్నాడు. ఆత్మజ్ఞాని ఏ విషయ భోగాన్నయినా ఎలా ప్రీతితో అనుభవించగలడు?---అని అష్టావక్రులు ఆశ్చర్య పడుతున్నారు. విషయభోగాలు మనస్సులో కోరికలనూ అశాంతినీ అలజడినీ సృష్టిస్తాయి. ఈ కోరికలూ అశాంతీ మనస్సును దావానలంలా దహించి వేస్తాయి. కల్లోలిత మనస్సు సత్యాన్ని దర్శింపజాలదు. కాబట్టి నిజాయితీగా సాధనచేసే వారంతా విషయ భోగాసక్తికి దూరంగా ఉంటేనే శాంతంగా ఉంటారు, అందుకే దూరంగా ఉండాలి.

శ్లో|| సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।
మునేర్జానత ఆశ్చర్యం మమత్వమనువర్తతే ॥ 5.

టీ|| సర్వభూతేషు = సమస్త భూతములయందును, ఆత్మానం = తనను, చ = మఱియు, సర్వభూతాని = సమస్తభూతములను, ఆత్మని = ఆత్మయందును, జానతః = తెలుసుకున్నటువంటి (చూచుచున్నటువంటి), మునేః=మునికి, మమత్వం = మమ కారము, అనువర్తతే = అనుసరించి వచ్చుచున్నది, (అనునది), ఆశ్చర్యం = ఆశ్చర్య కరమైనది.

సర్వప్రాణులలోనూ తనను చైతన్యంగానూ, చైతన్యమయిన తనలో సర్వప్రాణులనూ చూడగలిగిన జ్ఞాని ఏ విధంగా, "నేను" "నాది" అనే మమత్వంతో వ్యవహరించగలడు? ఇది ఆశ్చర్యకరమే!

మామూలు మనుషులు "నేను చేస్తున్నాను", "ఇదినాది" అనుకోవడంలో వారి అహంకారం వ్యక్తమౌతుంది. ఈ అహంకారం కర్మలను చేస్తున్నాననుకున్నప్పుడు "నేను" గానూ, తనచుట్టూ ఉండే తనకిష్టమయిన వస్తువులలో "నావి" గానూ వ్యక్తం అవుతూ ఉంటుంది. ఈ"నేను", "నావి" కలిస్తే వ్యక్తిత్వమవుతుంది. ఈ వ్యక్తిత్వం తానెవరో తనకు తెలియని అజ్ఞానం నుండి జనిస్తోంది.

ఆత్మజ్ఞానినంటూనే జనకుడు ఏవిధంగా ఈ అహంకార మమకారాలను ఇంకా కలిగి ఉన్నాడా? అని అష్టావక్రులు ఆశ్చర్యపడుతున్నారు. విదేహరాజ్యం తనదేననే భావం ఉండడం వల్లనే కదా ఇంకా రాజ్యాన్ని పాలిస్తున్నాడు జనకుడు- అని అంటున్నారు. రాబోయే అధ్యాయంలో వినయశీలి అయిన జనకుడు తన గురువుకి అర్థమయిన సమాధానలివ్వడం చూస్తాము.

ఈ శ్లోకంలో మొదటిపాదం భగవద్గీతలో కూడా ప్రతిధ్వనించడం గుర్తువస్తుంది.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శినః . (భగవద్గీత-6-29)

*యోగారూఢుడయిన జ్ఞాని సర్వప్రాణులలోనూ చైతన్యాన్నీ, చైతన్యమయిన తనలో సర్వాన్నీ గుర్తించి సమదృష్టి కలిగి ఉంటాడు.*

**శ్లో॥ ఆస్థితః పరమాద్వైతం మోక్షార్థేఽపి వ్యవస్థితః।**
**ఆశ్చర్యం కామవశగః వికలః కేళిశిక్షయా ॥ 6.**

టీ॥ పరమాద్వైతం = పరమాద్వైతమును, ఆస్థితః = ఆశ్రయించినటువంటివాడై, మోక్షార్థే అపి = మోక్షార్థమునందుకూడ, వ్యవస్థితః = ప్రయత్నపరుడైన పురుషుడు, కామవశగతః = కామమునకు వశుడై, కేళిశిక్షయా = క్రీడాభ్యాసములచేత, వికలః = వికలుడగుచున్నాడు (అనునది), ఆశ్చర్యం = ఆశ్చర్యకరమైన విషయము.

**అద్వైతానుభవనిష్ఠుడయిన జ్ఞాని, కామవశుడై కర్మలను చెయ్యడం ఆశ్చర్యం కలిగిస్తోంది.**

నిర్దాక్షిణ్యంగా వరుసగా లోపాలను చూపిస్తూ జనకునికి ఆత్మజ్ఞానం

లేదని అంటున్నారు. పరీక్షించదలచిన గురువయిన అష్టావక్రులు, స్వానుభవం తో, సమత్వబుద్ధితో సవినయంగా శాంతంగా గురువు మాటలను వింటూ తన్ను తాను చూసుకుని తృప్తితో నిల్చున్నాడు, శిష్యుడయిన జనకుడు.

రాజుగా, గృహస్థుగా తన బాధ్యతలను నిర్వహిస్తూ రాణులతో సంతోషంగా సంసారంచేస్తున్న జనకునికి ఆత్మానుభవం ఉందా? ఉంటే సామాన్యుని వలె దేహమనోబుద్ధులతో కామవశుడై ఎలా సుఖంగా ఉండగలుగుతున్నాడు? అతని అనుభవం నిజమైనదేనా? అనే సందేహాన్ని వ్యక్తం చేస్తున్నారు ఆచార్యులు.

ములుకులవంటి ఈ మాటలను వింటూకూడా శాంతంగా ఉండగలుగు తున్నాడు జనకుడు, జ్ఞానబలంతో.

**శ్లో॥ ఉద్భూతం జ్ఞానదుర్మిత్రం అవధార్యాతి దుర్బలః ।**
**ఆశ్చర్యం కామమాకాంక్షేత్ కాలమన్త మనుశ్రితః ॥ 7.**

టీ॥ ఉద్భూతం = ఉత్పన్నమైన, జ్ఞానదుర్మిత్రం = జ్ఞానశత్రువైన కామమును, అవధార్య = ధారణచేసి, అతిదుర్బలః = మిక్కిలి దుర్బలుడై, అన్తంకాలం = అంత కాల మును, అనుశ్రితః = ఆశ్రయించినటువంటివాడు, కామం = కామమును, ఆకాంక్షేత్ = కోరును, ఆశ్చర్యం = ఆశ్చర్యము.

**జ్ఞానానికి కామం శత్రువు వంటిదని తెలిసికూడా, జవసత్వాలుడిగిన వృద్ధాప్యంలోనయినా కామాన్ని విడువలేకున్నారు సామాన్యులు--ఇది నిజంగా ఆశ్చర్యమే!**

అష్టావక్రుని శిష్యుడయేనాటికి జనకుడు యవ్వనదశనుదాటి చాలాకాల మైందని స్పష్టంగా తెలుస్తూనే ఉంది. కామవశులయిన వారి మనస్సు శారీరక మైన కోరికలతో సదా సంక్షుభితమై ఉంటుంది. అల్లకల్లోలమయిన మన్సుకు ఆధ్యాత్మిక సాధన అసాధ్యం. సాధకులందరికీ కామం జ్ఞానానికి శత్రువు వంటిదని తెలిసే ఉంటుంది.

శిష్యుడు యౌవనదశలో ఉంటే అతని యౌవనం దృష్ట్యా అర్థంచేసుకుని క్షమించవచ్చు. అంత్యకాలమనదగిన వృద్ధాప్యంలో ఉన్నజనకుడు, ఆత్మజ్ఞాని నని చెప్పుకుంటూ, విషయభోగాలను యథాపూర్వంగా అనుభవించడం చూస్తే అనుమానం వస్తున్నది. అతడు మాయా మోహితుడయి అజ్ఞానంలోనే ఉండి తీరాలి.

శ్లో॥ ఇహాముత్ర విరక్తస్య నిత్యానిత్య వివేకినః ।
ఆశ్చర్యం మోక్ష కామస్య మోక్షాదేవ బిభీషికా ॥ 8.

టీ॥ ఇహ = ఇహలోక భోగముల నుండియు, అముత్ర = పరలోక భోగముల నుండియు, విరక్తస్య = విరక్తుడైనటువంటివీన్నీ, నిత్యానిత్య వివేకినః = నిత్యానిత్య వివేకము కలిగి నటువంటివిన్ని, మోక్షకామస్య = మోక్షమును గోరు పురుషునకు, మోక్షాదేవ = మోక్షము నుండియే, బిభీషికా = భయము (కలుగుచున్నది) అనునది, ఆశ్చర్యం = ఆశ్చర్యము.

**ఇహపరలోకాల రెండురకాల సుఖాలయినా నిరాసక్తత గలిగి నిత్యానిత్య వివేకం కలిగి మోక్షకామియైన వాడు, ఇంకా తన శరీర నాశనం గురించి భయపడడం ఆశ్చర్యకరమే!**

మాయాప్రభావం మహావిచిత్రమైనది. శరీరం తాను కానని తెలుసుకుని, తానుగా సత్యానుభవంలో నిలవాలని కోరుకునే మోక్షకామి కూడా శరీరం పైన ప్రేమ కలిగి ఉంటాడు. ప్రాపంచిక విషయ భోగాలమీద, పరలోక సుఖాల మీదా విముఖతను సాధించవచ్చు, ఏది నిత్యమో,ఏది అనిత్యమో వివేకవంతమైన బుద్ధితో నిశ్చయంగా తెలుసుకోవచ్చు, నిత్యమైన సత్యాన్ని సాధించాలనే దృఢమైన దీక్షకూడా ఉండవచ్చు. ఇన్నీ ఉన్నా స్థిర గంభీరమైన ధ్యానంలోకి వెళ్ళడానికి మనస్సు నిరాకరిస్తుంది. అప్రయత్నంగానే, అయిష్టంగానే ధ్యానానికి విఘ్నం కలుగుతూ ఉంటుంది. రేఖామాత్రంగా తన వ్యక్తిత్వంపై ఉన్న ప్రేమే ఈ విఘ్నానికి కారణం. అహంకారం తనకు ఉనికి ఉండదని భయపడుతూ ఉంటుంది! ఈ సహజ దేహతాదాత్మ్యాన్ని విడనాడడం చాలా కష్టసాధ్యం. ఆత్మానుభవానికి చివరిగావచ్చే అడ్డు ఇదే. స్వ శరీరాన్ని ప్రేమించడం ప్రాణికి సహజ ధర్మం. ఈ సహజత్వంలోంచి అహంకారం బలాన్ని పుంజుకుంటుంది. శరీరానికి అనేక రకాలయిన సుఖానుభవాల్ని అందించాలని తాపత్రయపడుతుంది. ఈ తాపత్రయమే, ఈ కోరికే దేహతాదాత్మ్యాన్ని శతాధికం చేసి అహంకారాన్ని మరింత బలీయంగా చేస్తుంటుంది! ఇలా పరస్పరాధారంగా సహజ దేహతాదాత్మ్యమూ అహంకారమూ వర్ధిల్లుతుంటాయి.

జనకుడు చెప్పిన మాటలకు చేసే చేతలకూగల వైరుధ్యాన్ని విమర్శిస్తూ ఈ శ్లోకం వరకూ అష్టావక్రులు జనకుని శంకిస్తూనే ఉన్నారు.

శ్లో॥ ధీరస్తు భోజ్యమానోఽపి పీడ్యమానోఽపి సర్వదా ।
ఆత్మానం కేవలం పశ్యన్న తుష్యతి న కుప్యతి ॥ 9.

టీ॥ ధీరస్తు = ధీరుడగు ఆత్మజ్ఞానియయితే, భోజ్యమానః అపి = భోగముల నను భవించుచున్న వాడైనప్పటికిని, చ = మఱియు, పీడ్యమానః అపి = పీడింపబడుచున్న వాడైనప్పటికిని, సర్వదా = ఎల్లప్పుడు, కేవలం = ఏకమైన, ఆత్మానం = ఆత్మస్వరూపు డగు తనను (ఆత్మను), పశ్యన్ = చూచుచున్నవాడై, న తుష్యతి = సంతోషించడు, న కుప్యతి = కోపించడు.

జ్ఞాని సర్వదా తన స్వరూపనిష్ఠలో ఉంటూ తాను తప్ప రెండవదేదీ లేదనే దృఢజ్ఞానంతో మానావమానాలలో సమబుద్ధిని కలిగి ఉంటాడు.

ఆత్మజ్ఞాని తనచుట్టూ ఎటువంటి సంఘటనలు జరిగినా కలతజెందక దృఢచిత్తంతో శాంతంగా ఉండగలుగుతాడు. సన్మానింపబడినా, సాధింపబడినా సమత్వభావంతో ఉండగలుగుతాడు. వచ్చే ప్రతిసంఘటననూ యధాతథంగా తీసుకోగలుగుతాడు. ఎవరిమీదా ద్వేషంకానీ ప్రేమకానీ కలుగవు. సంఘటనలను సాక్షిగా చూస్తాడుకానీ సంక్షోభానికి లోనుకాడు. సర్వదా సమచిత్తంతో స్వరూప నిష్ఠలో ఏకత్వానందాన్ననుభవిస్తూ శాంతంగా ఉంటాడు.

మహాత్ముల జీవితాలను సమీక్షిస్తే ఈ సత్యం స్పష్టంగా స్ఫురిస్తుంది. ఉన్నది కేవలంగా చైతన్యమయమయిన ఆత్మేననీ, కనిపించే నానాత్వమంతా భ్రాంతి జన్యదృశ్యమనీ దృఢంగా తెలిసినవారు కావడంచేత పూజింపబడినప్పుడు పొంగిపోరు, దూషింపబడినప్పుడు కృంగిపోరు, సర్వదా సమచిత్తంతో ఉండ గలగడం జ్ఞానికిమాత్రమే సాధ్యం.

శ్లో॥ చేష్టమానం శరీరం స్వం పశ్యత్యన్య శరీరవత్ ।
సంస్తవే చాపి నిందాయాం కథం క్షుభ్యేన్మహాశయః॥10.

టీ॥ చేష్టమానం = సమస్తక్రియలను చేయుచున్న, స్వం = తనయొక్క, శరీరం = శరీరమును, అన్యశరీరవత్ = ఇతరునియొక్క శరీరమువలె, యః = ఎవడు, పశ్యతి = చూచుచున్నాడో, సః = అటువంటి, మహాశయః = మహాశయుడగు పురుషుడు, సం స్తవే = స్తుతియందును, నిందాయాం = నిందయందును, కథం = ఎట్లు, క్షుభ్యేత్ = క్షోభను పొందును.

మహాత్ములు నిర్మమత్వంతో తమ శరీరం పనిచెయ్యడాన్ని పర

శరీరం వలె భావించి చూడగలరు. అటువంటివారిని దూషణ భూషణలేమి చెయ్యగలవు?

శుద్ధమైన ఆత్మగా తాను చైతన్యస్వరూపాన్నని తెలుసుకుంటాడు జ్ఞాని. శారీరికంగా కర్మలు చెయ్యడంలోనూ, మానసిక ఉద్రేకాలలోనూ, బుద్ధిలో ఆలోచనలుగానూ యీచైతన్యమే వ్యక్తం అవుతుంది. ఇంతేకాక వీనిని వ్యక్తం చేసే మనశ్శరీరాలు కూడా యీ చైతన్యం వల్లనే ఉనికిని కలిగి ఉన్నాయి. అతడు సర్వదా విషయిగా తననూ, విషయానుభవాలుగా ప్రపంచాన్ని సాక్షిగా చూస్తుంటాడు. స్వప్నాన్ని స్వప్నంలో ఉండగానే, జాగ్రత్ చైతన్యంతో చూడ గలిగిన స్థితిని ఊహించగలిగితే, జ్ఞాని జగత్తును చూసేదృష్టి అర్థం అవుతుంది. జాగ్రదవస్థలోని జ్ఞానంతో, తనలోని స్వాప్నికుడే (తైజసుడు) స్వప్న ప్రపంచాన్ని నిర్మించుకుని అనుభవించడాన్ని అందరూ సాక్షిగా చూస్తూనే ఉన్నాము. ఇదే విధంగా ఆత్మానుభవదృష్టితో చూసినప్పుడు, జాగ్రదవస్థలోని విశ్వుడే తన విశ్వాన్ని నిర్మించుకుని వినోదించడం స్పష్టంగాచూడడం సాధ్యం అవుతుంది. దీనిని బుద్ధితో అర్థం చేసుకున్న వేదాంత విద్యార్థికి, ఆత్మజ్ఞానియొక్క స్థితీ దృష్టీ కొంతవరకూ అర్థం అయే అవకాశం ఉంది. ఆత్మానుభవానంద స్థితుడయి జగన్మిథ్యాత్వాన్ని స్పష్టంగా చూస్తున్న జ్ఞానికి సామాన్యుల దూషణ భూషణలు సంతాప సంతోషాల నేవిధంగా కలుగజేస్తున్నాయి?

పూర్ణత్వమే తానని తెలుసుకున్నవ్యక్తి ప్రపంచంలో ఏ విధంగా వ్యవహరించేదీ చెప్తున్నారీ శ్లోకాలలో అష్టావక్రులు. జీవన్ముక్తుని జీవనలీలకు జోహారులర్పించడమే ఈ గీత అంతటా కనిపిస్తుంది. పరిమిత ప్రపంచంలో బాధామయమూ నికృష్టమూ అయిన జీవితాన్ని గడుపుతున్న మనుష్యులమధ్య అహంకార మమకారాలు లేకుండా జీవితాన్ని ఆటగా చూడగలుగుతున్న జీవన్ముక్తునికి సాటిరాగలవారెవ్వరు?

**శ్లో॥ మాయమాత్రమిదం విశ్వం పశ్యన్విగత కౌతుకః ।**
**అపి సన్నిహితే మృత్యౌ కథం త్రస్యతి ధీరధీః ॥11.**

టీ॥ విగతకౌతుకః = దూరముచేయబడిన అజ్ఞానాది కుతుకము గలిగినటువంటి, ధీరధీః=ధీరపురుషుడు, ఇదం విశ్వం=ఈ ప్రపంచమును, మాయామాత్రం = మాయా మాత్రస్వరూపము గలదానినిగా, పశ్యన్=చూచుచున్నవాడై, మృత్యౌ = మృత్యువు, సన్నిహితే అపి=సన్నిహితమైనదయినప్పటికిని, కథం=ఎట్లు, త్రస్యతి=భయపడును.

ఈ సర్వచరాచర జగత్తును మిథ్యగా గుర్తించి, నిరాసక్తుడై శాంతుడైన జ్ఞానికి మరణ మాసన్నమయినా భయమెందుకు?

తనలో కనిపించని సుఖసంతోషాలను సంపాదించాలనే ప్రయత్నంలో నిరంతరమూ విషయభోగాసక్తులయి, వాటిని సాధించడానికి శ్రమపడుతూ యిష్టా యిష్టాలనూ రాగద్వేషాలనూ పెంచుకుంటూ తీరని కోరికలతో జనన మరణ వలయంలో చిక్కుకుంటారు. పరిపూర్ణమయిన సుఖాన్ని సాధించగలమనే ఆశతో ఇంకా శ్రమిస్తూనే ఉంటారు. ఇంతకాలమూ ప్రయత్నిస్తూ విఫలులవుతున్నాసరే! తను సాధించలేనిది తనవారైనా సాధించగలరేమో అన్న భావమే సంతతిమీద ప్రేమగా వ్యక్తమౌతూ ఉంటుంది. సంతానకాంక్షతో, వారిని కని పెంచడంలో సమస్యలు వృద్ధి అవుతూ ఇంకా బంధిస్తూ అశాంతినే సృష్టిస్తుంటాయి. శాంతిని కోరుతూ అశాంతిని చేరుకుంటున్నారు. జ్ఞాని తన ఆత్మానుభవంతో ప్రపంచాన్ని మిథ్యామాత్రంగా గుర్తిస్తాడు కాబట్టి, ఈ సుఖసంపాదనాభిలాషా, తదనుగుణ మయిన ప్రయత్నమూకూడా అర్థవిహీనమయినవనీ,ఎండమావులవెంట పరుగుల వంటివనీ తెలుసుకుని నిరాసక్తంగా నిర్లిప్తంగా శాంతంగా ఉంటాడు.

ఆకర్షణీయంగా బాహ్యప్రపంచంలో కనిపించే విషయాలే మనస్సులో అశాంతిని సృష్టిస్తాయి. బుద్ధిలో ఆలోచనలని రేకెత్తిస్తాయి. వాటిని సాధించాలనే ప్రయత్నమే జీవనసంగ్రామం. ఆత్మానుభవ స్థితుడయిన జ్ఞాని, తన అజ్ఞాన జనిత భ్రమాకార్యమనదగిన మిథ్యా జగతిని గుర్తించి, విస్మరించి స్వస్థితిలో శాంతంగా ఉంటాడు. అట్టివానిని మరణమయినా ఎలా భయపెడుతుంది? మరణం శరీరానికేగాని శరీరి అయిన తనకుకాదని తెలుసతడికి. పుట్టిన శరీరం నశించడం దానిధర్మమనీ అందుకు బాధపడవలసిన పనిలేదనీ తెలిసినవానికి మరణ మయినా మరోదృశ్యమే!

**శ్లో|| నిస్స్పృహం మానసం యస్య నైరాశ్యేऽపి మహాత్మనః|**
**తస్యాత్మజ్ఞానతృప్తస్య తులనా కేన జాయతే ||12.**

**టీ||** యస్య=ఏ, మహాత్మనః = మహాత్మునియొక్క, మానసం = మనస్సు, నైరాశ్యే అపి = మోక్షమునందుకూడ, నిస్స్పృహం = ఇచ్ఛారహితముగా నున్నదో, తస్య = అటువంటి, ఆత్మజ్ఞానతృప్తస్య=ఆత్మజ్ఞానమువలన తృప్తుడైనవానికి, తులనా =సామ్యము, కేన = ఎవనితో, జాయతే = కలుగుచున్నది (అతనితో సదృశుడెవడు లేడని భావము)

కోరదగినదేదీలేదని తెలిసి నిత్యతృప్తుడై ఉన్న జ్ఞానికి సాటిరాగల వారెవ్వరు, ఎటువంటి నిరాశాపూరిత నికృష్టమయ సంఘటననీ కూడా మిథ్యా దృశ్యంగా, సాక్షిగా వీక్షించి స్వస్థితిలో ఆనందంగా ఉండగలుగుతాడు జ్ఞాని.

మానవుని మనస్సు ఎప్పుడూ ఒక క్రమమూ నిర్ణీతమూ అయిన పద్ధతిలోనే పనిచేస్తూ ఉంటుంది. ఏదైనా ఒక వస్తువును చూస్తుంది, యిష్టపడు తుంది, తప్పకుండా సంపాదించాలనుకొని శ్రమపడుతుంది. కోరబడే వస్తువులు కొద్దిగానూ కోరేవారు చాలమందీ ఉండడంవల్ల ప్రయత్నించినవారిలో ఏ కొద్ది మందో సాధించగలరు, మిగిలినవారంతా నిరాశచెందవలసిందే. సాధించిన తరువాత ఆ వస్తువులో అనుకున్నంత విలువ కనుపించకనో, పరిస్థితుల ప్రాబల్యం వల్ల వస్తువు తనది కాకుండా పోవడమో లేక వస్తుసహజమయిన పరిణామం సంభవించి అది తనకు నచ్చకనో మరలా అశాంతి మొదలవుతుంది. ఇలా తరుచుగా అశాంతికి లోనయిన మనస్సు విచారావృతమయి, తన్నివారణార్థం మరలా ప్రయత్నిస్తూ విచారానికి లోబడుతూ "సంసారం" లో చిక్కుకుంటుంది. సర్వసాధారణంగా సామాన్యులందరిమనస్సూ ఈ విధంగానే పనిచేస్తూ ఉంటుంది.

ఎటువంటి సంకటపరిస్థితిలోనూ సంతోషంగా ఉండగలిగే జ్ఞాని మనస్సు నిజంగా అభినంధించదగిందే, అందుకే అష్టావక్రులు "మహాత్ములతో సరిపోల్చ దగినదేదీలేదు" అంటున్నారు. జీవితలక్ష్యం గురించి చర్చించే ప్రతి గ్రంథంలోనూ ఇటువంటి వాక్యాలు తరుచు కనిపిస్తూనే ఉంటాయి. యోగ వాశిష్ఠంలో ఇలా ఉంది............................."వితతం హృదయస్య, మహామతేః హరిహరాబ్జ జలక్షశతైరపి తులనామేతిన...................."--- *మానసిక బంధాలను మిథ్యగా గుర్తెరిగి శాంతుడయిన జ్ఞానికి లక్ష త్రిమూర్తులయినా సాటిరారు.*

"నైరాశ్యేపి మహాత్మనః"----నైరాశ్య అన్నమాటకి కోరికలులేనట్టి అని అర్థం. మోక్షం కావాలనే కోరికను కూడా మిథ్యగా భావించి విడచిపెట్టిన జ్ఞానికి సాటి ఏదీలేదు. అతడు నిత్యశాంతుడు, శాంతస్వరూపుడు.

**శ్లో॥ స్వభావాదేవ జానానో దృశ్యమేతన్న కించన ।**
**ఇదం గ్రాహ్యమిదం త్యాజ్యం స కిం పశ్యతి ధీరధీః॥13.**

టీ॥ యః = ఎవడు, ఏతత్ = ఈ, దృశ్యం = దృశ్యప్రపంచము, స్వభావాత్ = స్వాభావికముగనే, న కించన = కొంచెముగూడలేదు, ఇతి = ఇట్లని, జానానః =

తెలుసుకొనునో, సః = అట్టి, ధీరధీః = ధీరపురుషుడు, ఇదం = ఇది, గ్రాహ్యం = గ్రహించదగినదని, ఇదం త్యాజ్యం = ఇది విడిచిపెట్టదగినదని, కిం = ఎట్లు, పశ్యతి = చూచుచున్నాడు.

**ఈ కనిపిస్తున్నట్టున్న ప్రపంచం నిజంగా అస్తిత్వం కలిగిలేదని తెలుసుకున్న జ్ఞానికి కొన్ని విషయాలమీద ఇష్టత మరికొన్నిటి మీద అయిష్టతా ఏవిధంగా ఉండగలదు?**

ఆత్మానుభవస్థితుడయిన జ్ఞానికి ఈ ప్రపంచమంతా కేవలం స్వప్నం వంటి దృశ్యమనీ, వాస్తవంలో లేదనీ దృఢంగా తెలుసు. ప్రపంచాన్ని నిజంగా భావిస్తున్న సాధారణ వ్యక్తియొక్క బుద్ధిమాత్రమే తాను చూస్తున్న విషయాలలో కొన్ని ఆహ్లాదకరంగా ఉపయోగకరంగా ఉన్నాయని అంగీకరిస్తూ కొన్నిటిని నిరుపయోగమని భావిస్తూ ఉంటుంది.

జ్ఞానికూడా వస్తుమయ ప్రపంచాన్ని చూస్తూనే ఉంటాడు. అయితే అతని చూడడం మనం చూడడంకంటే భిన్నంగా ఉంటుంది. మనం మన వాసనానుగుణంగా యిష్టా యిష్టాలతో మనచుట్టూ ఉన్నవాటిని చూస్తూ, వాటి ఉపయోగాన్నీ విలువనీ నిర్ణయిస్తుంటాము. జ్ఞాని దేనినీ ఉపయోగమనికానీ నిరుపయోగమనికానీ భావించక కేవలం దృశ్యంగా చూస్తుంటాడు. అతని దృష్టిలో వాసనల ప్రమేయం ఉండదు.

నత్తగుల్ల అని గుర్తించే అది ఎంతగా మెరుస్తున్నా ఎవరు దానిని వెండివలె భద్రపరచాలని అనుకుంటారు?

మహోపనిషత్తులో ఇటువంటి భావమే ఇలా వ్యక్తీకరింపబడింది. "తతో బ్రహ్మఘనే నిత్యే సంభవన్తి న కల్పితాః.............." "యదస్తీహ తదేవాస్తి విజ్వరో భవ సర్వదా (మహోపనిషత్తు-IV-13,14)--- నిత్యమూ ఏకమూ అయిన ఆత్మ *సర్వానికీ అధిష్ఠానంగా ఉంది, అజ్ఞానంవల్ల కలిగే భ్రమలకూ, ఊహాకల్పనలకూ ఆత్మతో ఏ సంబంధమూ లేదు.* భ్రమఉన్నా లేకున్నా కూడా ఆత్మ పరిణా రహితంగా స్థిరంగా ఉంటుంది. అట్టి ఆత్మవైన నీవు కలతలనువీడి శాంతంగా స్థిరంగా జీవించు.

**శ్లో॥అన్తస్త్యక్తకషాయస్య నిర్ద్వన్ద్వస్య నిరాశిషః ।**

**యదృచ్ఛయాఽఽగతో భోగః న దుఃఖాయ న తుష్టయే ॥14.**

టీ॥ అన్తః త్యక్త కషాయస్య = అంతఃకరణమునుండి నెట్టివేయబడిన విషయ వాసనా మలాదిదోషములు గలిగినటువంటినీ, నిర్ద్వన్ద్వస్య = ద్వంద్వములగు శీతోష్ణ సుఖదుఃఖాదులు లేనటువంటినీ, నిరాశిషః = ఆశారహితుడైన వానికి, యదృచ్ఛయా = దైవయోగమువలన, ఆగతః = వచ్చినటువంటి, భోగః = భోగము (భోగవస్తువులు), దుఃఖాయ=దుఃఖము కొరకు, న = కావు, తుష్టయే = సంతోషము కొఱకున్ను, న = కావు.

**కోరికలనుండి ముక్తిపొందినవాడు, ద్వంద్వాతీతస్థితిలో ఉన్నావాడు అయిన జ్ఞానికి యాదృచ్ఛికంగా లభించే వస్తువులపట్ల సంతోషంగానీ విచారం గానీ ఉండవు..**

మనిషి మనస్సులో సూక్ష్మంగా, అంతర్గతంగా ఉండే కోరికలవల్లే అతని మానసికోద్రేకాలూ, బుద్ధిపరమైన ఆలోచనలూ రూపుదిద్దుకుంటూ ఉంటాయి. వీనినే వాసనలు అంటారు. ఈ వాసనలే మనం చూసే సమస్త విషయాలనూ రెండు రకాలుగా విభజిస్తూ ఉంటాయి. ఉపయోగకరమైనవి, నిరుపయోగమైనవి అక్కడనుండి మానవ ప్రయత్నమంతా ఇష్టమయినవానిని సాధించడం కోసమూ అయిష్టమయినవాటిని దూరంగా ఉంచడం కోసమూ జరుగుతూ ఉంటుంది.

ఈ ప్రయత్నంలో మనస్సు ఒత్తిడికి, అలజడికి,అశాంతికి లోనవుతుంది. సంతోష విచారాలు, జయాపజయాలు, శీతోష్ణాలు మొదలయిన ద్వంద్వాలన్నీ మనస్సును మరింత కృంగదీసి నీరసింపజేసి శక్తివిహీనంగా జేస్తాయి. పరిపూర్ణ వ్యక్తిత్వం కలిగిన జ్ఞాని వాసనలనన్నింటినీ జయించి ఉంటాడు కాబట్టి మానసిక సంబంధమయిన బాధలేవీ, అతడి శాంతిని ధ్వంసం చేయజాలవు. మానసిక బంధాలనదగిన కోరికలనుండి ముక్తుడయిన అతనికి, వస్తువులుండడంగానీ, లేకపోవడంగానీ సంతోషవిచారాలను కలుగజేయవు. యాదృచ్ఛికంగా సంభవించిన దేనితోనయినా అతడు సంతోషంగా సర్వదా ఉండగలడు. అతని ఆనందాన్ని ఏ వస్తువులూ ఎక్కువా చెయ్యవు, ఏ వస్తువులూ దానిని తగ్గించనూ లేవు. నిత్య తృప్తుడై సమత్వబుద్ధిలో సదా శాంతంగా జీవిస్తాడు.

జ్ఞాని నిత్యమూ స్వస్థితిలో ఉంటాడు, ఏకమూ అద్వయమూ ఆనంద మయమూ అయిన ఆ స్థితిలో నిష్ఠగలిగి ప్రపంచంలో జీవిస్తూనే ఉన్నా, ప్రపంచం అతని నేవిధంగానూ బాధింపజాలదు. భ్రమ పెట్టనేరదు.ఏకత్వంలో అనేకత్వాన్ని నానాత్వంలో ఏకత్వాన్నీ సమభావంతో చూస్తూ సదా శాంతంగా జీవిస్తాడు.

## అధ్యాయం-4

# ఆత్మానుభం (ఆత్మసాక్షాత్కారం) విశిష్టత - ప్రత్యేకత

గురువయిన అష్టావక్రుడు తనపై ఆరోపించిన వాటన్నిటికి శాంతంగా అర్థ మైనరీతిలో సమాధానంచెప్తూ,తన అనుభవ సత్యత్వాన్ని నిరూపిస్తున్నారు జనకులీ అధ్యాయంలో.

తనలో ఆత్మచైతన్యాన్ని, చైతన్యమయిన తనలో సర్వసృష్టినీ చూడగలిగిన జ్ఞానికి తానూ ప్రపంచమూ వేరుకాదని తెలుసు, సృష్టీ ---సృష్టికర్తా వేరుకావు కాబట్టి, తానూ సృష్టికర్తా కూడా వేరుకాదని తెలుసు. నిజానికి తన ఎఱుకలో తన చైతన్యంలో, సర్వసృష్టీ సృష్టికర్తకూడా రజ్జువులో సర్పంవలె, స్తంభంలో భూతంవలె, భ్రమాకల్పితాజ్ఞానంతో తెలియ బడుతున్నారు. ఈ సత్యాన్ని అర్థం చేసుకుని నిర్భయంగా ఆనందంగా జీవిస్తాడు జ్ఞాని తన కోరికలకు తానేదాసుడై తన భయాల బాధల బరువును తానే మొయ్యలేక, అజ్ఞానంతో అశాంతితో గానుగెద్దువలె జీవించే సామాన్యు నికీ, ఆత్మజ్ఞాననిష్ఠుడై అనంతానంద స్వరూపంగా జీవనలీలను సాక్షిగా చూస్తున్న జ్ఞానికీ, స్వర్గనరకాలకున్నంత తారతమ్యం ఉంది.

ఈ ప్రపంచమంతా మనిషి యొక్క భాగమే. మనిషి దీనినుండి ఏవిధంగానూ వేరుకాదు. కుట్టుమిషను, టేపురికార్డరువలె వేరు వేరు భాగాల నతికిస్తే మనిషి తయారుకాడు. తల, కాళ్ళు, చేతులు, గుండె, కాలేయము మొదలయినవన్నీ మరలతో బిగింపబడి అతకబడలేదు. పేర్లు వేరయినా అవన్నీ మనిషిలోని భాగాలే. ఇదేవిధంగా మనిషి ప్రపంచంనుండి నామం చేత మాత్రమే వేరుగా గుర్తింపబడతాడు. నిజానికి ప్రపంచంలో అతి ముఖ్య భాగమే మనిషి,ప్రపంచమే మనిషి,ఆ మనిషే ప్రపంచము. గుండె కాలేయం

మనిషిలోని భాగాలుగా నామమాత్రంగా గుర్తింపబడుతున్నా అవి మనిషి నుండి ఎలా వేరుకావో అదేవిధంగా ప్రపంచమూ మనిషీ వేరుకావు.

ప్రపంచంతో మనకున్న ఈ అవినాభావసంబంధం అర్థం కాకపోతే, మన నామమే మనలను మోసంచేసి బంధిస్తుంది! అందుకే మన మహర్షులు ప్రపంచమని పిలువబడేదంతా కేవలం నామరూపాలేననీ ప్రపంచమూ మనిషీ వేరు కావనీ గట్టిగా చెప్పుతున్నారు. మన భయాలన్నీ మనం ప్రపంచంనుండి వేరుగా ఉన్నాం అన్న భావనవల్ల కలిగేవే. ఉన్న ఏకైక సత్యానివి నీవే అని తెలియడంతో ద్వైతభావం నశించి భయం అదృశ్య మయిపోతుంది. ఏకమూ అద్వయమూ అయిన ఆత్మను నేనే అని తెలుసు కోవడం అంటే, ఈ సమాజమూ ప్రపంచమూ నా మనసులోని భాగాలే అని గుర్తించడమే.

ఆకాశంలో వస్తువుల ఉనికిగాని, వాటి కదలికగాని, ఆకాశాన్ని ఏవిధంగానూ బాధించదు. బాహ్యంగా ఉండే వస్తువులుగాని, శరీరం అనుభవించే విషయభోగాలుగాని ఆత్మను బాధించవు, ఆ ఆత్మే తానని తెలుసుకున్న జ్ఞానిని కూడా ఏ అనుభవాలూ బంధించవు, బాధించవు, సూక్ష్మమయిన దానిని స్థూలమయినది పరిమితం చెయ్యజాలదు.

**జనక ఉవాచ :-**

**శ్లో॥ హన్తాత్మజ్ఞస్య ధీరస్య ఖేలతో భోగలీలయా ।**
**న హి సంసారవాహీకైః మూఢైః స్సహ సమానతా ॥ 1.**

టీ॥ భోగలీలయా = భోగలీలలతో (లీలా భోగములతో), ఖేలతః = క్రీడించుచున్న, ఆత్మజ్ఞస్య = ఆత్మజ్ఞానియగు, ధీరస్య = ధీరపురుషునకు, సంసారవాహీకైః = సంసార భారమును మోయుచున్న, మూఢైః = మూఢులతో, సమానతా = సమానత్వం, హన్త = అయ్యో! నహి = లేదు.

**అద్భుతం! ఆత్మనే తానని అర్థంచేసుకున్న జ్ఞాని జీవితాన్ని ఆటవలె జీవించగలడు. మాయా మోహితులయి సంసారభారంతో జీవితాన్ని నరక ప్రాయంగా శాపంగా భావించే సామాన్యులకూ జ్ఞానికీ పోలిక ఎక్కడ?**

తన మొదటి శ్లోకంలోనే జనకుడు తను చెప్పదలచుకున్నదంతా సూచిస్తూ, జ్ఞానికి ఎవరూ సాటిరారని అంటున్నారు. బాహ్య ప్రపంచంలో లీలా

మాత్రంగా వ్యవహరించే జ్ఞాని ఎక్కడ? అనేక జన్మల ప్రారబ్ధాన్ని మోస్తూ, ఆ వాసనానుగుణంగా గానుగెద్దులాగా, అనేక కోరికలు కోరతూ, శ్రమపడుతూ, యిష్టాయిష్టాలతో రాగద్వేషాలు పెంచుకుంటూ కొత్తవాసనలను మళ్ళీ పోగు చేసుకుంటూ దుర్భరమూ నికృష్టమూ అయిన జీవితాన్ని భరించలేక భరిస్తూ ఉన్న సామాన్యుడెక్కడ? ఇద్దరినీ పోల్చి చూడడం ఏమిటి?

మనశ్శరీరాలే తానుకాననీ వాటి కాధారమయిన ఆత్మచైతన్యమే తాననీ తెలుసుకున్న జ్ఞాని మనశ్శరీరాలతో బాహ్యంగా కర్మలుచేసినా సంతోషంగా ఆటాడుతున్నట్టుగా చేస్తాడు కాని, చెయ్యవలసి వచ్చిందే అని బాధపడుతూ చెయ్యడు. చిన్నపిల్లలకు ఆట అతి సహజం. ఒక చిన్నపిల్లవానిని ఎందుకు ఆడు కుంటున్నావు? అని అడిగితే జవాబు చెప్పలేడు. జవాబు చెప్పగలిగితే ప్రయోజనం ఉంటే అది ఆట కానేకాదు. ఆట అనేది అతి సహజంగా ఆనందంగా ఉన్నప్పుడు పాటలాగే శారీరికంగా వ్యక్తమవుతూ ఉంటుంది. ఆట, ఆటకోసమే ఆనందంతో ఆడబడుతుంది. కానీ వేరే ఏ ప్రయోజనమూ ఉండదు. ఇటువంటి భావంతో లీలామాత్రంగా సర్వకర్మలనూ చేస్తూ ఉంటాడు జ్ఞాని బాహ్యలోకంలో.

జ్ఞానికీ అజ్ఞానికీ బాహ్యంగా పనిచేసేతీరులో ఏ భేదమూ కనిపించదు. అయితే పనిమీద ఉండే దృష్టిలోనూ, చెయ్యడంపై ఉండే అభిప్రాయంలోనూ ఎంతో తేడా ఉంటుంది. సోమరిగా విచక్షణారహితంగా దూరంనుండి చూసేవారికి ఏ భేదమూ కనిపించకపోవచ్చు, కాని నిశితంగా వివేకంతో చూసేవారికి స్వార్థ పరత్వంతో అజ్ఞానంతో సామాన్యుడు పనిచెయ్యడమూ, నిస్వార్థంగా లీలా మాత్రంగా జ్ఞాని పనిచెయ్యడమూ స్పష్టంగా కనబడుతూనే ఉంటుంది.

అజ్ఞానంతో సామాన్యులు చేసే కర్మలతో తనపనులను పోల్చతగదని జనకులు అంటున్నారన్నమాట.

అన్నపూర్ణోపనిషత్తులో ఇదే భావం దృఢంగా ఇలా చెప్పబడింది.

అన్తః సంస్తిక్త నిర్ముక్తో జీవో మధురవృత్తిమాన్
బహిః కుర్వన్నకుర్వన్ వా కర్తా భోక్తా న హి క్వచిత్ .

(అన్నపూర్ణోపనిషత్తు-157).

మనశ్శరీరాలు తానుకానని తెలుసుకుని వాటిమీది మోహభావంవీడి, నిర్మమత్వంతో, నిరహంకారంతో ప్రేమపూరిత హృదయంతో జీవించేజ్ఞాని ఏ పనిని చేసినా, చేయకున్నా, తాను కర్తననీ, భోక్తననీ భావించడు.

శ్లో॥ యత్పదం ప్రేప్సవో దీనాః శక్రాద్యాః సర్వదేవతాః ।
అహో! తత్ర స్థితో యోగీ న హర్షముపగచ్ఛతి ॥ 2.

టీ॥ యత్=ఏ, పదం=స్థానమును, ప్రేప్సవః=పొందకోరుచున్నటువంటి, శక్రాద్యాః = దేవేంద్రుడు మొదలుగాగల, సర్వదేవతాః = సమస్తదేవతలు, దీనాః = దీనులై యుంటున్నారో, తత్ర = ఆ స్థానమునందు, స్థితః = ఉంటున్నటువంటి, యోగీ = యోగి, హర్షం = సంతోషమును, న ఉపగచ్ఛతి = పొందడు, అహో = ఆశ్చర్యం.

ఇంద్రాదిదేవతలుకూడా ఏ స్థితిని సాధించాలని వాంఛిస్తుంటారో అట్టి స్థితిలో ఉండికూడా యోగి అయినవాడు గర్వపడడు.

పూర్ణత్వస్థితిని పొందినయోగి పొందే ఆనందం ఇంద్రాది దేవతలుకూడా యీర్ష్యపడేటటువంటిది. ఆనందస్వరూపమయిన తన స్వస్థితిలో ఉండడమే ఆ ఆనందహేతువు, ఇది నిత్యమయినది. పూర్ణమయినది. దేవతల ఆనందం వారి పుణ్యఫలంగా కొంతకాలమే ఉండేటటువంటిది. అందుకనే వారుకూడా ఈ నిత్యా నందస్థితిని పొందాలని వాంఛిస్తుంటారు.

తన స్వరూపమే ఆనందం, తనకన్నా రెండవదేదీ లేదు. కాబట్టి యోగి (జ్ఞాని) రెండవదానితో పోల్చిచూసి గర్వపడవలసిన కారణం ఉండదు. ఆనందం తన స్వభావమే కావడంతో అనుభవించే అహంకారం ఉండకపోవడం చేతనూ ఆనందంగా జ్ఞాని సహజస్వస్థితిలో నిలిచిపోతాడు. సుషుప్తి అవస్థలో ఆనందాన్ని అనుభవించే అహంకారం ఉండదు. అయినా అది ఆనందమయ స్థితి కాబట్టే అందరూ నిద్ర అంటే అంతగా యిష్టపతారు. ఇటువంటిదే యోగిస్థితి.

స్వస్థితి అయిన ఆనందంలో నిష్ఠకలిగిన జనకుడు తన సహజస్థితిని వర్ణిస్తూ అట్టి తన్ను రాజభోగాలు మోహపెట్టజాలవనీ రాజ్యభారం తనదృష్టిని మళ్ళించనేరదనీ నిశ్చయంగా చెబుతున్నారు.

శ్లో॥ తజ్ఞస్య పుణ్యపాపాభ్యాం స్పర్శోహ్యన్తర్న జాయతే ।
న హ్యాకాశస్య ధూమేన దృశ్యమానోఽపి సంగతిః ॥ 3.

టీ॥ తజ్ఞస్య= ఆత్మపదమును తెలిసికొనిన జ్ఞానికి, అంతః = అంతఃకరణ సంబంధమైన, పుణ్యపాపాభ్యాం = పుణ్యపాపములతో, స్పర్శః = సంబంధము, న జాయతే = కలుగదు, హి=ఎందుకనగా, ఆకాశస్య=ఆకాశమునకు, ధూమేన=పొగతో, సంబంధః=సంబంధం, దృశ్యమానః అపి = చూడబడుచున్న దైనప్పటికి (వాస్తమునందు) న హి = లేదుకదా!

పొగ ఆకాశంలోవున్నా ఆకాశానికి ఎలా సంబంధించి లేదో ఏవిధంగా ఆకాశాన్ని కలుషితం చెయ్యడంలేదో, అదేవిధంగా, జ్ఞాని హృదయాన్ని పాప పుణ్యాలు స్పృశింపజాలవు.

పొగ, ధూళి, మబ్బులు ఆకాశంలో ఉన్నంతమాత్రం చేత ఆకాశం కలుషితం కావడం లేదు. ఆకాశం తన సూక్ష్మమయిన స్వభావంతో శుద్ధంగా ఉంటుంది. ఇదేవిధంగా, తాను చైతన్యాన్ననీ తనలోనే సర్వసృష్టి ఉందని తెలుసుకున్న జ్ఞానిని పాపపుణ్యాలు బంధింపజాలవు. మంచివాసనలు మంచి కోరికలకూ మంచి ఆలోచనలకూ మంచి పనులకూ కారణం అయి పుణ్యంగా మారతాయి. చెడ్డవాసనలు, చెడ్డకోరికల కర్మలకూ కారణమౌతూ పాపంగా మారుతాయి. తానే చైతన్యమని తెలుసుకున్న జ్ఞానికి తన మనశ్శరీరాలు తాను కానని తెలుసు. వాసనానుగుణంగా మనశ్శరీరాలు పనిచేస్తుంటాయి. ఈ వాసన లకు కూడా అతీతమయిన స్థితిలో జ్ఞాని ఉంటూ సర్వాన్నీ సాక్షిగా చూస్తుంటాడు.

రాజభోగాలు, రాచకార్యభారాలూ, దర్బారూ, రాజమర్యాదలూ అన్నీ రాజర్షి అయిన జనకుని చుట్టూ ఉన్నట్టుగా కనిపిస్తున్నా అతడు నిత్యమూ ఆత్మ నిష్ఠుడయి ఉండడం వలన అతని హృదయాన్ని ఇవేవీ స్పృశింపవు. ఆకాశంలో మబ్బులు, పొగ, ధూళి, ఉన్నట్టే ఇవన్నీ కూడా సాక్షిమాత్రంగా నిరాసక్తంగా అసంగంగా జనకునిచే చూడబడుతుంటాయి.

**శ్లో॥ ఆత్మైవేదం జగత్సర్వం జ్ఞాతం యేన మహాత్మనా ।**
**యదృచ్ఛయా వర్తమానం తం నిషేద్ధు క్షమేత కః॥4.**

టీ॥ యేన మహాత్మనా = యే మహాత్మునిచేత, ఇదం సర్వం = ఈ సంపూర్ణమైన, జగత్ = ప్రపంచము, ఆత్మైవ = ఆత్మయే, (ఇతి = అని), జ్ఞాతం = తెలుసుకొనబడు చున్నదో, తం=అటువంటి, యదృచ్ఛయా = ప్రారబ్ధవశమువలన స్వేచ్ఛగా, వర్తమానం = ఉంటున్న జ్ఞానిని, నిషేద్ధుం = నిషేధించుటకు, కః = ఎవడు, క్షమేత = సమర్థుడగును?

ఈ ప్రపంచమంతా తనలో లీలామాత్రంగా భాసిస్తున్నదని తెలుసు కున్న జ్ఞాని ఇచ్ఛాపూర్వకంగా సంతోషంగా ఆ లీలలో పాల్గొనగలడు. అతనిని అడ్డేవారెవరు?

అటువంటి జ్ఞానికి వేదాలుకూడా విధినిషేధాలు విధింపజాలవు. వేదా లలో చెప్పబడిన ధర్మాలూ విధినిషేధాలూ అన్నీ కూడా నిజానికి ఇటువంటి జ్ఞానుల ప్రవర్తన ఆధారంగా నిర్మింపబడినవే.

అహంకార రహితుడయిన జ్ఞానిలో సర్వప్రపంచమూ తన రూపమే నన్న భావం ఉంటుంది కాబట్టి అతడు అధర్మంగా ప్రవర్తించలేడు. ఎవరిమీదా ద్వేషభావం ఉండే ఆస్కారం లేదు కాబట్టి అన్యాయంగా పరుషంగా ప్రవర్తించ లేడు. అందుకే జ్ఞానులకు శాస్త్రాలు విధించిన ధర్మాలేవీ లేవు. ఒక మహాగాయకుడు, ఒక నాట్యాచార్యుడు ఏవిధంగా ఎన్నడూ లయతాళాలు తప్పరో అదే విధంగా ఆత్మానుభవ స్థితుడయిన యోగి ప్రవర్తన ఎన్నడూ అధర్మంగా ఉండ జాలదు.

**మహాభారతంలో శ్రీ శుకులు ఇలా అన్నారు.**

భేదాభేదౌ సపది గలితౌ పుణ్యపాపే విశీర్ణే
మాయామోహౌ క్షయముపగతౌ నష్టసందేహవృత్తేః
శబ్దాతీతం త్రిగుణరహితం ప్రాప్యతత్త్వావబోధమ్
నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః ॥ (శుకాష్టకం)

*భేదభావం నశించి, పుణ్యపాపాలపై ఉదాసీనభావం కలిగి, మాయా ప్రభావం నుండి బయటపడి, సంశయరహితుడై, త్రిగుణాతీతుడై భావాతీత స్థితిలో నిష్ఠకలిగినవాడై, చరా చరసృష్టి అంతటిలో తననూ, తనలో సర్వసృష్టినీ చూడగలిగిన జ్ఞానికి విధి నిషేధాలు విధించగలవారెవ్వరు?*

**శ్లో॥ ఆబ్రహ్మస్తంబపర్యన్తే భూతగ్రామే చతుర్విధే ।**
**విజ్ఞస్యైవ హి సామర్థ్యం ఇచ్ఛానిచ్ఛా వివర్జనే ॥5.**

**టీ॥** ఆబ్రహ్మస్తంబపర్యన్తే = చతుర్ముఖబ్రహ్మ మొదలుకొని తృణపర్యంతముగల, చతుర్విధే = నాలుగువిధములైన, (జరాయుజ అండజ స్వేదజ, ఉద్భిజములను), భూతగ్రామే = భూతసమూహమునందు, విజ్ఞస్య ఏవ = జ్ఞానికొక్కనికే, ఇచ్ఛనిచ్ఛా వివర్జనే = ఇచ్ఛానిచ్ఛలను త్యజించుటయందు, సామర్థ్యం = సామర్థ్యమున్నది, హి = నిశ్చయము.

**చతుర్విధమయిన సృష్టిలో బ్రహ్మనుండి గడ్డిపోచవరకూ ఒక్కజ్ఞాని మాత్రమే కోరికలను, యిష్టాయిష్టాలను త్యజించి సంతోషంగా జీవించగలడు.**

ఈ ప్రపంచంలో ప్రాణులన్నీ నాలుగు రకాలుగా ఉద్భవించాయని ఉపనిషత్తులలో చెప్పబడింది. అవి---1) గర్భజ--గర్భంనుండి జనించేవి, 2) అండజ--గ్రుడ్డులోనుండి పుట్టేవి 3) స్వేదజ---చెమటనుండి జనించేవి, 4) ఉద్భిజ---విత్తానాలనుండి పుట్టేవి. మనచుట్టూ ఉండే జీవులన్నీ ఈ నాలుగు

రకాలలోనే ఇమిడి ఉంటాయి. మొత్తం సృష్టి అంతా అని చెప్పడం కోసం బ్రహ్మ నుండి గడ్డిపోచవరకూ అని జనకుడు వాడేరు.

క్లుప్తంగ చెప్పాలంటే, సృష్టిలో ఉన్న సర్వప్రాణులలోనూ, ఒక్కజ్ఞాని మాత్రమే కోరికలకూ యిష్టాయిష్టాలకూ లోనుగాకుండా సంతోషంగా జీవించ గలడు, కోరికలూ యిష్టాయిష్టాలూ---ఈ రెండూ మాటలలోనూ మొత్తం మనస్సు చేసే పని అంతా ఇమిడి ఉంది. మనస్సును అధిగమించి యిష్టాయిష్టాలకూ, రాగ ద్వేషాలకూ అతీతంగా ఉండగలడు, కాబట్టే జ్ఞానిని అందరూ అంత గౌరవిస్తారు. అతనిలో అహంకారం ఉండదు కాబట్టి అతడు చేసే కర్మలు రాగద్వేషాలపై ఆధార పడి ఉండవు.

వాసనాధీనమైన మనస్సు తనవైన రాగద్వేషాలతో,యిష్టాలతో,ప్రపంచాన్ని చూస్తూ ప్రత్యేక ప్రపంచంలో బంధింపబడి పోతుంది. చూడబడే ప్రపంచమంతా మనోనిర్మితం--వాసనాధీనం. జ్ఞాని వాసనలకు అతీతంగా ఉండగలడు కాబట్టి వాసనా ధీనమయిన ప్రపంచం అతనికి కనిపించదు. అతడు నిత్యమూ ఏకమయిన స్వస్థి తిలో ఉంటూ తననే సర్వత్రా చూస్తూ సమత్వ బుద్ధితో సంతోషంగా జీవిస్తాడు. ఇదే భావం మహోపనిషత్తులో ఇలా చెప్పబడింది.

దృశ్యమాశ్రయసీదం చేత్ తత్ సచిత్తోఽపి బన్ధనాన్
దృశ్యం సంత్యజసీదం చేత్ తదాఽచిత్తోఽసి మోక్షవాన్. (మహోపనిషత్తు-VI-35)

*నీవుచూసే దృశ్యప్రపంచాన్నే సత్యంగా భావిస్తే నీవు బంధింపబడే ఉంటావు, దృశ్యాన్ని మిథ్యగా గుర్తించగలిగిన మనస్సు ముక్తస్థితిలో ఉంటుంది.*

## శ్లో॥ ఆత్మానమద్వయం కశ్చిత్ జానాతి జగదీశ్వరమ్ ।
## యద్వేత్తి తత్సకురుతే న భయం తస్య కుత్రచిత్ ॥6.

టీ॥ కశ్చిత్ = ఒకానొకడు, ఆత్మానం = ఆత్మను (జీవుని), చ = మఱియు, జగదీశ్వరం = జగదీశ్వరుని, అద్వయం = అద్వైతముగా (వేరుకాని వారినిగా), జానాతి = తెలిసికొనుచున్నాడు, సః = అట్టివాడు, యత్ = దేనిని, వేత్తి = తెలుసుకొనుచున్నాడో, తత్ = దానిని, కురుతే = చేయుచున్నాడు, తస్య = అట్టి ఆత్మజ్ఞానికి, భయం = భయము, కుత్రచిత్ = ఎక్కడగూడ, న = లేదు.

ఆత్మ ఏకంగా అద్వయంగా తానే ఉందనీ, ఆత్మే జగత్తూ, జగదీశ్వరుడుగా భాసిస్తూందనీ తెలుసుకున్న జ్ఞాని చాలా అరుదుగా కనిపిస్తాడు.

యధేచ్ఛగా అతని మనస్సులోకి వచ్చిన భావాన్ని చూస్తూ, నిర్భయంగా నిశ్చింతగా నిశ్చలంగా నిత్యమూ జీవిస్తూ ఉంటాడు.

తన స్వానుభవంతో తనలోని దివ్యత్వాన్ని, పూర్ణత్వాన్ని గుర్తించి ఆ జ్ఞానంతో నిర్భయంగా ఈ చివరిశ్లోకం చెప్పగలిగేరు జనకుడు. ఏకమూ అద్వయమూ అయిన ఆత్మగా తన్నుతాను గుర్తించడమే కాకుండా కనిపించే సర్వ జగత్తూ నామరూపాత్మక మనీ, అది అలా ఉన్నట్టు కనిపించడానికి తానే కారణ మనీ, తనులేనిదే ప్రపంచమేలేదనీ తెలుసుకున్న మహాజ్ఞాని జనకుడు, అటువంటి వ్యక్తి "యద్వేత్తితత్కురుతే"---మనస్సులోకి ఏ భావం వస్తే దానిని చేస్తాడు---చెయ్యదలచుకున్న దానిని నిర్భయంగా చేస్తాడని అర్థం. అధర్మమయినది, అన్యాయమైనది, హానికలిగించేది అయిన భావమే అతనికి రాదు. అతని మనశ్శరీరాలద్వారా జరిగే పనులన్నీ జగదీశుని శాసనానుగుణంగా లోకకళ్యాణకారకంగా జరగబడుతూ ఉంటాయి.

శిష్యుని స్థితినీ, అనుభవాన్నీ అవగాహననీ చూసి సంతృప్తుడయిన అష్టావక్రుడు బోధించ బోతున్నాడు ముందు అధ్యాయంలో.

...

## అధ్యాయం-5

# చతుర్విధ మార్గాలు-అహంకార వినాశనం-లయం

ప్రత్యక్ష ఆత్మానుభవంలో, చూస్తున్నామనుకునే మనశ్శరీరాలనూ, చూడబడే ప్రపంచాన్నీ, భావాలుగా, నామరూపాలుగా గుర్తించి విస్మరించడమే అష్టావక్రుల దృష్టిలో లయం. ఇది సాధ్యం అవడానికి నాలుగు విధాలుగా ప్రయత్నించాలి. ఈ నాలుగూ నాలుగు సోపానాలవంటివి. అన్ని సోపానాలనూ ఒకేసారి దాటడం ఎవరికీ సాధ్యంకాదు. ప్రతివారూ ప్రయత్నించి ఒక్కొక్క మెట్టునూ అధిరోహించి తీరాలి. ఈ విధంగా ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ చివరగా అహంకార రహితంగా స్థిరంగా సత్ చిత్ ఆనందరూపమయిన ఆత్మానుభవంలో ఎలా నిలవడం అన్నదే ఈ అధ్యాయంలో చెప్పబడింది.

శరీరస్పృహను, శరీరంతో తాదాత్మ్యాన్ని విడనాడడంతో మొదలయి ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ చివరగా కేవలమయిన తన స్వస్వరూపంలో నిలచేటట్టు చేస్తుంది. సాధకుని ఈ లయ యోగం, క్రమమూ దృఢమూ అయిన భావంతో నిత్యమూ పూర్ణమయిన ఆత్మచైతన్యం మీదే దృష్టి నిలపడంతో శరీరం బాహ్యవస్తుమయ ప్రపంచమూ కూడా విస్మరించబడతాయి. దీనినే పూర్ణలయ యోగమంటారు. ఒక్కక్షణం కూడా విడచిపెట్టకుండా సదా భగవంతుని స్మరిస్తూ ఉండడమే అన్నిటికంటే చాలా సులభమైన లయయోగ సాధన. ఇలా చెయ్యడంలో తప్పకుండా కొంతకాలానికి మనస్సు బాహ్యదృష్టినివీడి అంతర్ముఖం అయి తన మూలమైన చైతన్యంలో లయం అయిపోతుంది.

**అష్టావక్ర ఉవాచ :-**

**శ్లో॥ న తే సంగోఽస్తి కేనాపి కిం శుద్ధః త్యక్తుమిచ్ఛసి ।**
**సంఘాతవిలయం కుర్వన్ ఏవమేవ లయం వ్రజ ॥ 1.**

టీ॥ తే = నీకు, కేనాపి = దేనితోగూడ, సంగః = సంగమము, నాస్తి=లేదు, (అతః = ఈ కారణమువలన), శుద్ధః = శుద్ధుడవైన నీవు, కిం = దేనిని, త్యక్తుం = విడుచుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు, ఏవ మేవ = ఈ ప్రకారముగానే, సంఘాత విలయం = దేహాద్యభిమాన సంఘాత త్యాగమును, కుర్వన్ = చేయుచున్నవాడవై, లయం = మోక్షమును, వ్రజ = పొందుము.

**నీవు దేనికీ సంబంధించిలేవు, నీవు శుద్ధమైన ఆత్మ చైతన్యానివి. నీవు త్యజించవలసిన దేముంది? నేను శరీరాన్ని అనే భావాన్ని విడనాడగానే నీ మనస్సు తన మూలంలో లయం అయిపోతుంది.**

దృశ్యముగ దర్శింపబడుచున్న ఈ మిథ్యా జగత్తంతా శుద్ధచైతన్యమైన నీలో ఉన్నట్టుగా భాసిస్తోంది; నీపై ఆరోపింపబడింది. నీవే ఈ సర్వానికీ అధిష్ఠానమువు. నీవు త్యజించవలసిన దేదీలేదు. నీవు దేనితోనూ సంబంధించి లేవు. అసంగుడవై కేవలంగా ఉన్నావు. స్తంభం భూతంచే స్పృశింపబడదు. స్తంభం దేనిని త్యజించాలి?

మనశ్శరీరాల కూటమిని వేదాంతపరిభాషలో "సంఘాతం"అని అంటారు. జ్ఞానేంద్రియాలు, మనస్సు, బుద్ధీ, అహంకారం అన్నీ కలిసి సంఘాత మనబడుతుంది. శుద్ధమయిన ఆత్మచైతన్యంలో రెండవదేదీ లేకపోయినప్పటికీ, ఉన్నదేదో తెలియని అజ్ఞానంవలన ఉన్నదానిని పొరపాటుగా, మరొకటిగా ఊహించడం సంభవిస్తున్నదని తెలుసుకున్నాము. ప్రస్తుతంలో ఈ భ్రమా జన్యమయిన మనశ్శరీరాలతో తాదాత్మ్యం చెంది ఇవే మనమనుకుని జీవిస్తున్నాము. వీటన్నిటినీ చూచే సాక్షిచైతన్యమే నేను అని అవిచ్ఛిన్నంగా అనుక్షణమూ ధ్యానిస్తే, ఆ భావం బలీయమయి, భ్రమ నశిస్తుంది. అహంకారం అదృశ్యమైపోతుంది. ఈవిధంగా మనోలయాన్ని సాధించి శాంతంగా జీవించు అని అష్టావక్రులు సలహా ఇస్తున్నారు.

ఇటువంటి భావమే అన్నపూర్ణోపనిషత్తులో ఇలా వ్యక్తీకరింపబడింది.

పదమాద్యమనాద్యన్తం త్యస్యబీజం న విద్యతే
తత్ర సంలీయతే సంవిత్ నిర్వికల్పంచ తిష్ఠతి
భూయో న వర్తతే దుఃఖైః....................(అన్నపూర్ణోపనిషత్తు, IV-69)

దేనికైతే ఆది అంతము ఉండవో దానికి కారణమూ ఉండదు. అట్టి దానిలో నీ మనస్సునూ బుద్ధినీ, లయం చేసి శాంతంగా ఉండు. అటువంటి వ్యక్తిని ఎన్నటికీ బాధలు స్పృశింపజాలవు.

శ్లో॥ ఉదేతి భవతో విశ్వం వారిధేరివ బుద్బుదః ।
ఇతి జ్ఞాత్వైకమాత్మానం ఏవ మేవ లయం వ్రజః ॥2.

టీ॥ వారిధేః = సముద్రమునుండి, బుద్బుద ఇవ = బుడగవలె, భవతః=నీ నుండి, విశ్వం = ప్రపంచము, ఉదేతి = పుట్టుచున్నది, ఇతి = ఇట్లని, ఏకం = ఒకటియైన, ఆత్మానం = ఆత్మను, ఏవమేవ = ఈ ప్రకారముగానే, జ్ఞాత్వా = తెలిసికొని, లయం = శాంతి రూపమోక్షమును, వ్రజ = పొందుము.

**సముద్రంలోనుండి ఒక నీటిబుడగ జనించినట్టుగా నీలోనుండి యీ జగత్తు ఉద్భవిస్తుంది. ఇది తెలుసుకుని అద్వైతజ్ఞానంతో ఆత్మగా నిలచిపో, ఈ విధంగా మనోలయాన్ని సాధించు.**

ఈ గీత అంతటా ఈ సముద్రం, తరంగాలు, బిందువు, ఉపమానం విరివిగా వాడబడింది. ధ్యానానుకూలమయిన ఒక చక్కటి భావం, ఈ శ్లోకంలో అందించబడింది. సముద్రపు నీటినుండి ఏవిధంగా ఒక నీటిబిందువు వేరుగా ఉన్నట్టుకనబడి కొంతకాలం విహరించి మళ్ళీ సముద్రంలో నీరుగా లయం అయి పోతుందో అదేవిధంగా నీ చైతన్యంలో జగద్భావం ఉదయించి నర్తించి లయం అయిపోతుంది. జలకణంగా ఉన్నా అది సముద్రపునీరే, కేవలం నామ రూపాలు మాత్రమే వేరుగా ఉన్నాయి ఇదేవిధంగా జగత్తు అనేక నామరూపాలతో తెలియ బడుతున్నా అధిష్ఠానమయిన ఆత్మచైతన్యంకంటే వేరుగాదు, నిత్యమూ దృఢ భావంతో ఈ భావాన్ని మననం చేస్తుంటే మనస్సులోని ఉద్రేకాలూ బుద్ధిలోని అలజడులూ తగ్గి శాంతస్థితినంది ప్రగాఢధ్యానంలో అనంతచైతన్యరూపమయిన ఆత్మానుభవం లభ్యమవుతుంది. ఈ విధంగా మనోలయాన్ని సాధించవచ్చు.

ఇక్కడ ఈ రెండవమెట్టులో అష్టావక్రులు ఇలా సూచిస్తున్నారు. ప్రగాఢ ధ్యానంలో సాధకుడు తన మనస్సునూ, మనోభావజనిత కల్లోలాలనూకూడా పూర్తిగా లయం చెయ్యాలి.

అనంతమైన ఆత్మనే నేను అనుకోవడానికి ఎంతో ధీరత్వమూ, శాస్త్రి హృదయాన్నర్థం చేసుకున్న శుద్ధమైన తేజోవంతమైన బుద్ధీ అత్యవసరం. ఇవి

లేనిదే వేదాంత ధ్యానమూ అభ్యాసమూ సాధ్యంకావు. "అహం బ్రహ్మాస్మి"--"నేను అనంతమైన ఆత్మచైతన్యాన్ని" అనేభావం యోగవాశిష్టంలో ఒక శ్లోకంలో ఇలా చెప్పబడింది.

బ్రహ్మేంద్ర విష్ణువరుణాః యద్యత్కర్తుం సముద్యతాః
తదహం చిదీవపుః సర్వం కరోమీత్యేవ భావయేత్. (యోగవాశిష్ఠం121-8)

*బ్రహ్మవిష్ణువు వరుణుడు మొదలైన దేవతలు సాధించగలిగిన దేదైనాసరే, శుద్ధ చైతన్యమయిన నేను నిశ్చయంగా సాధించగలను.*

ఇది అభూతకల్పనో ఊహాగానమో కాదు. సత్యమైన ఆత్మబలం అంతటిది! అయితే ఈ స్థితిని ఒక్కమారుగా ఎవరూ సాధించలేరు. క్రమంగా ఒక్కొక్కమెట్టే ఎక్కుతూ భగవద్గీతలో సూచించినట్లుగా ఓర్పుతో అచంచల దీక్షతో సాధించాలి.

శనైః శనైః రుపరమేత్ బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనఃకృత్వా న కించిదపి చింతయేత్. (భగవద్గీత-VI-25)

*క్రమంగా మెల్లమెల్లగా శాంతస్థితిని సాధిస్తూ బుద్ధిని దృఢంగా ఉంచి మనస్సును ఆత్మభావంలో లగ్నంచేసి అన్యభావాలను విడనాడాలి.*

**శ్లో॥ ప్రత్యక్షమప్యవస్తుత్వాత్ విశ్వం నాస్త్యమలే త్వయి ।**
**రజ్జుసర్ప ఇవ వ్యక్తం ఏవ మేవ లయం వ్రజ ॥ 3.**

టీ॥ వ్యక్తం = దృశ్యమానమగు, విశ్వం = సంసారము, ప్రత్యక్షమపి = ప్రత్యక్షమైనప్పటికినీ, అవస్తుత్వాత్ = వాస్తవముగా లేనిదైనందున, అమలే = మలరహితుడవగు, త్వయి = నీయందు, రజ్జుసర్ప ఇవ = రజ్జువునందు సర్పమువలె, నాస్తి = లేదు, ఏవమేవ = ఈ ప్రకారముగానే, లయం = శాంతిని, వ్రజ = పొందుము.

**తాడులో భ్రాంతసర్పంవలె నీలో ఈ జగత్తు ఉన్నట్టుగా కనిపిస్తున్నా, పరమార్థతః విశ్వం లేనేలేదు. నీవు శుద్ధమైన చైతన్య స్వరూపానివి. ఈ భావం నీలో దృఢపడితే నీ మనస్సు నశిస్తుంది. ఈ విధంగా మనోలయాన్ని సాధించు.**

సాధారణంగా మనం ఏదైన వస్తువును చూస్తే అది ఉంది అనే అనుకుంటాము. ఆ వస్తువు నిజంగా లేదేమో అనే అనుమానం అయినా మనకు రాదు. మనం చూసినదంతా నిజం కానక్కరలేదని కొన్ని ఉదాహరణలలో అప్పుడప్పుడు అనిపిస్తూ ఉంటుంది. తాడులో పామును ఊహించి భ్రమజెందడమూ నత్తగుల్లను వెండివస్తువుగా పొరపడడమూ, స్తంభాన్ని చూసి భూతమని భయపడడమూ,ఇవన్నీ ఆయా సమయాలలో ఎంతనిజంగా కనిపించినా కేవలం మనః

కల్పితాలే. ఉపనిషత్తులలో తరుచుగా వాడబడే ఈ ఉపమానంతో అష్టావక్రులు ఇలా సూచిస్తున్నారు. ఈ జగత్తు కనిపిస్తున్నా వస్తుతః మనఃకల్పిత భ్రమ మాత్రమే, చూడడానికి నిజంగా కనిపిస్తూ అనుభవయోగ్యంగా మనస్సుచే గుర్తింపబడుతూ ఉన్నప్పటికీ మనస్సు నధిగమించి చైతన్యానుభవంలో ఆత్మ నిష్ఠ కలిగినప్పుడు జగత్తుకు ఉనికి లేనేలేదు. భావప్రవాహమయిన మనస్సులో గుర్తింపబడుతూ భావనామాత్రంగా అనేక నామరూపాలుగా మనోబుద్ధులచే తెలియబడుతూ ఈ జగత్తంతా నిజంగా ఉన్నట్టుగా భావింపబడుతున్నది. ఆత్మ చైతన్యం తనదైన "సత్" లక్షణంతో ఉనికిగా స్ఫురిస్తూ, "చిత్" లక్షణంతో తెలుసు కుంటున్నానని భావిస్తున్నది నేననే భావంచే, వివిధ ప్రత్యేక రూప సమన్విత మయిన,విశ్వంగా,నామరూపాలతో,భావాలుగా,భావప్రవాహమయిన మనస్సులో గుర్తింపబడుతున్నది. ఈ మనఃకల్పిత మాత్రమయిన జగత్తుయొక్క మిథ్యాత్వాన్ని స్పష్టంగా గుర్తిస్తూ,తనపై ఆరోపింపబడిందని తెలుసుకుని, ఆరోపింపబడిన నామ రూపాలను విస్మరిస్తే, మనస్సు లయ స్థితిలో ఉంటుంది. ఈ విధంగా మనో లయాన్ని సాధించి స్వస్థితిలో నిలిచిపో.

ఇది లయ యోగంలో మూడవమెట్టు. కనిపిస్తున్న దృశ్యజగత్తుయొక్క మిథ్యాత్వాన్ని గుర్తించి ప్రపంచం లేదనే నిశ్చయభావంతో, మిథ్యాత్వభావాన్ని సాధకుని చైతన్యంలో లయం చేయాలి. ఈ విధానం అన్నపూర్ణోపనిషత్తులో ఇలా వివరింపబడింది.

యథా విపణగా లోకా విహరంతోఽప్యసత్సమాః
అసంబంధాత్ తథాజ్ఞస్య గ్రామోఽపి విపినోపమః. (అన్నపూర్ణోపనిషత్తు1-23)

ఈ లయాన్ని సాధించిన జ్ఞాని నిత్యమూ కేవలుడై ఆ అనుభవంలో ఉండ గలుగుతాడు. జనసమూహ మధ్యంలో ఉన్నా అతని శాంతికి భంగం కలుగదు.

గౌడపాదుని కారికలో కూడా ఈ లయయోగాభ్యాసం ఎంతో ఫలవంతంగా వర్ణింపబడింది. ఏకాగ్రమయిన మనస్సుతో,ధ్యానంలో,బాహ్యవస్తుమయ ప్రపంచ జ్ఞానాన్ని లయం చెయ్యాలి. ఆత్మనే ఏకాగ్రతతో ధ్యానించాలి. "అపరోక్షానుభూతి" లో ఆచార్య శంకరులు,ధ్యానంతో మనోలయాన్ని మూడుదశలుగా సాధించ వచ్చునని బోధించేరు. 1) శరీరమూ అది చూసే ప్రపంచమూ నేను కానని తెలుసుకుని దేహతాదాత్మ్యాన్ని విడవాలి, 2) ఆత్మనే నేనని తెలుసుకొని ఆ భావంలో ధ్యానంలో నిలవాలి. 3)ఆత్మజ్ఞానాన్ని కూడా మరిచిపోయి నిశ్చలంగా చైతన్యంగా నిలచిపోవాలి.

ఈ లయ యోగాన్ని శూన్యవాదంగా పొరపడకూడదు. అన్ని లేవను కుంటూ శూన్యంలో నిలచిపోవడమే దీనిలక్ష్యం కాదు. భగవద్గీతగానీ, అష్టావక్రుడు కానీ ఉపనిషద్ ఋషులు కానీ, ఈ శూన్యవాదాన్నీ బోధించలేదు. అహంకారం కేంద్రంగా మనస్సు అనునిత్యమూ అనేకత్వాన్ని గుర్తిస్తూ భ్రమపడుతున్నది. ఈ భ్రమను తొలగించడానికి అద్వైతసత్యాన్ని అర్థంచేసుకుంటూ ఆ స్థితిలో, అనుభవంలో నిలువగలగడాన్నే వీరందరూ బోధిస్తున్నారు.

శ్లో॥ సమదుఃఖసుఖఃపూర్ణ ఆశానైరాశ్యయోః సమః ।
సమజీవితమృత్యుస్సన్ ఏవ మేవ లయం వ్రజ ॥ 4.

టీ॥ సమదుఃఖసుఖః = సుఖదుఃఖములయందు సమతత్త్వముగల వాడవై, పూర్ణః = పరిపూర్ణుడవై, ఆశానైరాశ్యయోః = ఆశా నిరాశలయందు, సమః = సమభావము గలవాడవై, సమజీవితమృత్యుః = జీవిత మృత్యువులయందు తుల్యుడవై, ఏవమేవ సన్ = ఈ ప్రకారముగా అయినవాడవై, లయం = బ్రహ్మదృష్టిని, వ్రజ = పొందుము.

**సంతోష విచారాలతో, ఆశనిరాశలలో, జీవన్మరణాలలో, నిశ్చలంగా పరిణామరహితంగా నీవేవుంటావు. నీవు మార్పుచెందడంలేదు. ఈ భావంతో లయాన్ని సాధించు.**

లయయోగంలో నాలుగవదీ చివరిదీ అయిన ఈ దశలో అష్టావక్రులు, సాధకునికి ఇలా ఉపదేశిస్తున్నారు. ఆత్మతత్త్వాన్ని అర్థం చేసుకుంటూ, మననం చేస్తూ చివరగా బుద్ధిలో ఉండే జ్ఞానాన్ని భావాలను విడనాడి ఆత్మగా నిశ్చలంగా నిలచిపొమ్మని అదేశిస్తున్నారు.

సంతోషవిచారాలు, ఆశనిరాశలు, జీవన్మరణాలు, ఇవన్నీ బుద్ధిలో ఉండే జ్ఞానానికి విలువలకీ సంబంధించినవి. ఈ బుద్ధిని లయం చెయ్యడం అంటే బుద్ధి పనిచెయ్యడం ఆగిపోవడం అన్నమాటే. చైతన్యంలో ఇవేవీ లేనేలేవు. ఇవి సాక్షి చైతన్యమయిన విషయికి సంబంధించిన విషయాలు మాత్రమే. బుద్ధికి అతీతంగా ఉంటూ భావాలకే ఆధారమయిన చైతన్యం భావాల ఊహలకు ఎన్నటికీ అందదు. ఇది తెలిసిన బుద్ధి, తెలుసుకోవాలనే కోరిక అర్థరహితమని గ్రహించి ఆగిపోతుంది. ఈ విధంగా మనోలయాన్ని సాధించు.

ఆత్మను సాక్షి చైతన్యంగా భావిస్తూ, మనస్సులోని ఉద్రేకాలూ, బుద్ధి లోని భావాలూ శారీరిక కర్మలూ అన్నీ కూడా సాక్షిమాత్రంగా చూడబడడాన్ని

గుర్తించి మననం చేస్తే, గుర్తిస్తున్నాననుకుంటున్న అహంకారం లయం అయి పోతుంది. ఆ అహంకారంచే గుర్తింపబడే ప్రపంచం కూడా దానితోపాటే అదృశ్య మయి పోతుంది.

జీవభావాన్ని పరమాత్మభావంతో ఐక్యంచెయ్యడానికి, ఈ విధంగా తెలుసుకుంటూ, మననం చేస్తూ, ఈ నాలుగు దశలద్వారా లయాన్ని సాధించాలి. అదే జీవబ్రహ్మల ఐక్యస్థితి. ఏకత్వానుభవం, అద్వైతస్థితి అని అష్టావక్రమహర్షి లయ యోగాన్ని బోధించినారు.

...

# అధ్యాయం-6

# పరమాత్మ

గురువైన అష్టావక్ర మునీంద్రునికి శిష్యుడైన జనకరాజర్షికి జరిగిన సంవాదరూపంగా అష్టావక్రగీత ఉపదేశింపబడినది. అద్వయమైన ఆత్మ తత్త్వాన్ని వేదాంతదృష్టితో అర్థంచేసుకోగోరుతున్న సాధకులమైన మనకు, ఆ మహర్షి చూపించే సత్యం దిగ్భ్రాంతులను చేస్తుంది. సత్యద్రష్ట అయిన జనకుని దృష్టి, స్థితి అను మహోన్నతానుభవమూ రేఖా మాత్రంగానయినా అర్థం చేసుకుని మనస్సు మౌనంగా నిశ్చలంగా భావరహితంగా నిలచిపోతుంది.

కిందటి అధ్యాయంలో లయయోగంగురించి అష్టావక్రులు వివరించారు. ఈ అధ్యాయంలో వారి శిష్యుడయిన రాజర్షి జనకుడు లయం చేయవలసిన దేదీ లేదని, తాను చూస్తున్నదంతా సత్ చిత్ ఆనందమయమైన ఆత్మ మాత్రమేననీ అంటున్నారు. అద్వయమైన ఆత్మలో లయం చెయ్యబడవలసిన రెండవదే లేనేలేదు. ఇది అన్నిటికీ అతీతంగా ఉంది-----"ప్రకృతేః పరాః పరాత్ పరాః?"--లయయోగంతో లయం చేసే ప్రయత్నమే అజ్ఞానానికి నిదర్శనం. అద్వయమైన ఆత్మలో దేనిని లయం చెయ్యాలి? ఇదీ జనకుని ప్రశ్న.

సర్వానికీ అతీతంగా ఉన్న ఈ ఆత్మస్థితే ఈ అధ్యాయంలో వివరింప బడుతోంది. ఆత్మ మహాకాశంగానూ, జగత్తు అందులో ఉన్న ఘటతుల్యం గాను వర్ణింపబడి, ఆత్మతత్త్వాన్ని అర్థం చేసుకున్నాక జగత్తు ఆత్మను ఏ విధంగానూ పరిమితం చెయ్యనేరదని స్పష్టం చేస్తున్నారు.

అష్టావక్రగీతలో ఆత్మయొక్క సగుణ నిర్గుణ తత్త్వాలు రెండూ సమానస్థాయిలో చూపబడ్డాయి. సత్ చిత్ లక్షణాల ఏకత్వమూ, అవినాభావ సంబంధము వివరింపబడ్డాయి. భగవద్గీత కూడా దీనినే ఘంటాపథంగా చెప్తోంది. "సర్వజగత్తు ఆత్మలోనే ఉంది ఆత్మ సర్వజగత్తులోనూ ఉంది!

ఇటువంటి స్థితిలో దేనిని ఎందులో లయం చెయ్యాలి? లయ-యోగాభ్యాసం అసందర్భం, అర్థరహితం అనవసరం అంటున్నారు. రాజర్షి చూస్తున్నానను కునే అహంకార రూపంలో కొంత అజ్ఞానం మిగిలి ఉంటేనే, దానిని లయం చెయ్యడానికి ప్రయత్నం చెయ్యాలి. ఉన్నది ఒకే ఒక ఆత్మ అని సర్వదా తెలుసుకున్నప్పుడు లయంతో అవసరమేముంది?

**జనక ఉవాచ :-**

**శ్లో॥ ఆకాశవదనన్తోఽహం ఘటవత్ప్రాకృతం జగత్ ।**
**ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో నగ్రహో లయః ॥ 1.**

టీ॥ అహం = నేను, ఆకాశవత్ = ఆకాశమువలె, అనన్తః = అంతములేనివాడను, జగత్ = ప్రపంచము, ఘటవత్ = ఘటమువలె, ప్రాకృతం = ప్రకృతి జన్యమైనది, తథా = ఆ కారణమువలన, ఏతస్య = దీనికి, త్యాగః = త్యాగము, న = లేదు, నగ్రహః = గ్రహణము లేదు, న లయః = లయము లేదు, ఇతి జ్ఞానం = ఇదియే జ్ఞానము.

**అనంతమయిన ఆకాశంవలె నేనున్నాను. దృశ్యమానమయిన జగత్తు నాలో కుండవలె ఉంది. ఇదే నిజమయిన జ్ఞానం. ఇందులో నేను ఆమోదించ వలసినది, త్యజించవలసినది, లయం చేయనలసినది ఏదీలేదు.**

క్రిందటి అధ్యాయంలో అపారమైన కరుణతో అష్టావక్రులు తన స్థితి నుండి క్రిందికి దిగివచ్చి అజ్ఞానదశలో ఉండే శిష్యునికి అర్థమవాలనే కోరికతో లయయోగాన్ని గూర్చి చెప్పడం జరిగింది. ఆత్మనిష్ఠుడయిన జనకుడు, ఆ అనుభవదృష్టితో సర్వత్రా ఏకంగా తానే ఉండడాన్ని గుర్తిస్తూ, భ్రమ కారణంగా గోచరించే జగత్తు కూడా తనలో లీలామాత్రంగా భాసించడం గుర్తిస్తూ, తనకంటే వేరుగా రెండవదేదీ లేదనీ, లయం చెయ్యవలసినదేదీ లేదనీ అనగలుగుతున్నారు. అద్వయంగా ఏకంగా ఆత్మమాత్రమే ఉంది, అందులోనే భ్రమకారణంగా భావనా మాత్రంగా మనఃకల్పిత జగత్తుకూడా ఉంది. ఈ రెండింటినీ తన్నుగానే గుర్తిస్తు న్నప్పుడు లయయోగాన్ని అభ్యసించడం హాస్యాస్పదమని అర్థరహితమని అంటున్నారు.

తన అజ్ఞానాన్ని నిర్మూలించడం కోసం అష్టావక్రమునిచే ఉపదేశింపబడిన లయయోగాన్ని మొదటి శ్లోకంలోనే ఎదుర్కొని విమర్శిస్తూ జనకులు తన ఆత్మా నుభవాన్ని వ్యక్తం చేసేరు, నిరూపించుకున్నారు తన గురువు సమక్షంలో.

ఉపనిషద్ వాఙ్మయంలో ఆత్మను మహాకాశంతోనూ, దృశ్యమానమయిన సృష్టినీ,జీవులనూ కుండతోనూ(ఘటాకాశం)అందులోని ఆకాశంతోనూ సాధారణంగా పోలుస్తుంటారు.

**"ఆకాశం ఆత్మా" ----బృహదారణ్యకోపనిషత్తు.**

**"ఆకాశాత్మా" --- తైత్తిరీయోపనిషత్తు.**

**"ఆకాశం బ్రహ్మ" --- ఛాందోగ్యోపనిషత్తు.**

మాండూక్య కారిక అనబడే వేదాంత గ్రంథం ఈ అష్టావక్రగీత తరువాత రాయబడినట్టుగా భావిస్తారు. ఆ కారికమీద ఈ గీత ప్రభావం చాలా హెచ్చుగా ఉండడం గమనార్హం. ఈ కారికలో ఈ మహాకాశ ఘటాకాశాల ఉపమానం చాలా వివరంగా వివరింపబడింది. మహాకాశాన్ని అనంత చైతన్య రూపంగానూ, వ్యక్తి లోని జీవచైతన్యాన్ని ఘటాకాశంతోనూ పోల్చి చూపబడింది. ఈ కారికలోని ఈ వివరణ మననం చేసే సాధకులకు చాలా ఉపయోగకరంగా ఉండి ఆత్మతత్త్వాన్ని సుబోధకం చేస్తుంది. (మాండూక్య కారిక అద్వైత ప్రకరణం 3-7)

అఖండమైన ఆత్మచైతన్యందృష్ట్యా అహంకారమూ, అహంకారముచే చూడబడే మిథ్యాజగత్తూ కూడా లేనేలేవు. సాధకులందరికీ ఈ స్థితిని సాధించ డమే లక్ష్యంగా ఉంటుంది. ఈ స్థితిలోనున్న జనకుడు లయ యోగాభ్యాసం అనవసరమూ అర్థరహితమూ అనడంలోగల అంతరార్థం ఇదే. అఖండమయిన ఆత్మచైతన్యంలో "త్యజించవలసినదిగాని ఆమోదించవలసినదిగాని నశింపజేయ వలసినదిగాని లేనేలేదు" కారికలో కూడా ఇదేభావం అష్టావక్రగీతకు ప్రతిధ్వనిగా ధ్వనిస్తుంది.

గ్రహో న తత్రనోత్సర్గశ్చిన్తా యత్ర న విద్యతే
ఆత్మసంస్థం తదా జ్ఞానమజాతి సమతాం గతమ్.

(మాండూక్య కారిక అద్వైత ప్రకరణం---38)

*ఆనందాన్ని కోరుతూ మనస్సు కల్పనలను కల్పిస్తూ ఉంటుంది. ఈ మనస్సు మహానందంతో మౌనంగా లీనమైపోతుంది. ఆత్మలో, అప్పుడు చూసే వాడూ చూడబడేదీ అని రెండుగా జ్ఞానం విడిపోకుండా, జ్ఞానస్వరూపమైన చైతన్యంగా నిశ్చలంగా ఉండిపోతుంది.*

ఇట్టి ఆత్మలో నిష్ఠకలిగినవానికి లయం చెయ్యవలసినదేదీ ఉండదు. మహోపనిషత్తు ఇలా అంటోంది.

సర్వాతీత పదాలమ్బీ పరిపూర్ణైక చిన్మయః
నోద్వేగీ న చ తుష్టాత్మా సంసారే నావసీదతి. (మహోపనిషత్తుVI-63)

భావాతీతస్థితిలో పరిపూర్ణ చైతన్య రూపంగా తన్ను తాను తెలుసుకుంటూ జీవించేవ్యక్తికి సాధించవలసినదీ, సాధ్యమయేదీ అని వేరుగా ఉండవు, పరిణామం చెందే ప్రపంచంతో అతనికి ఏ సంబంధమూ లేదు; నిత్యతృప్తుడై నిర్వికారుడై జీవిస్తూంటాడు.

**శ్లో॥ మహోదధిరివాహం స ప్రపంచో వీచిసన్నిభః ।
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః ॥2.**

టీ॥ అహం = నేను, మహోదధిరివ = సముద్ర సదృశుడనుగా నున్నాను, స = ఆ, ప్రపంచః = ప్రపంచము, వీచిసన్నిభః = తరంగములతో తుల్యమైనది, తథా = ఆ కారణమువలన, ఏతస్య = దీనికి, త్యాగః = త్యాగము, న = లేదు, గ్రహః = గ్రహణము, న = లేదు, లయః = లయము, న = లేదు.

**నేను మహాసముద్రం వలె ఉన్నాను. నాలో తరంగంవలె ఈ జగత్తంతా నామరూపాత్మకంగా తెలియబడుతోంది. ఇదే నిజమైన జ్ఞానము. ఇది తెలిసిన వానికి త్యజించవలసినదీ, గ్రహించవలసినదీ, లయం చెయ్యవలసినదీ ఏదీ ఉండదు.**

సత్యస్వరూపమైన ఆత్మను గురించి చెప్పే శాస్త్రాలన్నీ ఉపమానాలను ఉదాహరణలను, ప్రతీకలను, ఇంకా అనేక విధాలైన పద్ధతులను వాడుతూనే ఉన్నాయి. భాషాతీతమైన అనుభవాన్ని భాషలో వర్ణించడానికి సాధ్యం కాదు. ఈ ఆత్మ మన మనోబుద్ధులకతీతంగా, ఉంటూ, అవి పనిచెయ్యడానికి ఆధారంగా ఉంటోంది. ఆత్మచైతన్యం ఉండడంవల్లనే మన ఆలోచనలను మనం తెలుసుకోగలుగుతున్నాం. భాషతో వర్ణించగలుగుతున్నాం. ఈ భాషతో ఆ భావనాతీత స్థితిని వర్ణించడానికి ప్రయత్నిస్తున్నాయి శాస్త్రాలన్నీ. అంతేకాని, ఆ స్థితిని నిర్వచించి చెప్పబోవడం లేదు.

అర్హతగలిగిన సాధకులకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అందించడానికి ఈ ఉపమానాలు, ఎంతగానో ఉపయోగపడతాయి. భౌతికశాస్త్రాన్ని బోధించడంలో కూడా ఇటువంటి పద్ధతులను వాడుతూనే ఉన్నారు. విద్యుచ్ఛక్తిని గురించి చెప్పేటప్పుడు సముద్రతరంగాలతోనూ వాయుచలనంతోనూ పోల్చి వర్ణిస్తూనే

ఉన్నాం. విద్యుచ్ఛక్తి తరంగమూకాదు,గాలీకాదని మనకు నిశ్చయంగా తెలుసు. ఉపమానాన్ని ఉపమేయం అనుకోవడం హాస్యాస్పదం. మనం ఎక్కడికైనా వెళ్ళాలనుకున్నప్పుడు దారిప్రక్కనుండే "సైన్‌బోర్డుల" ను గుర్తిస్తూ బాట వెంబడే వెళ్ళాలి. ఆలాకాకుండా "సైన్‌బోర్డు"ను ఎక్కితే లాభం ఏమిటి?

ఇటువంటి జాగ్రత్తలు మనకు చాలా అవసరమే! ఈ హెచ్చరికలే లేకుంటే ఉపమానాల వాచ్యార్థాన్ని మాత్రమే గ్రహించి అక్కడే ఆగిపోయి సత్యాన్ని గుర్తించే అవకాశాన్ని కోల్పోతాం. శుద్ధమూ అఖండమూ అయిన ఆత్మలో నిష్ఠు డయిన జనకుడు తనను అపార జలరాశి అయిన సముద్రంతో పోలుస్తూ తనలో సహజంగా సామాన్యంగా ఉన్న తరంగాలతో ఈ కనబడే జగత్తును పోలుస్తున్నారు. స్పష్టంగా నామరూపాలు వేరుగా ఉన్నా తరంగాలు నీరే, సముద్రమే. అదేవిధంగా భావాలతో గుర్తింపబడే ఈ ప్రపంచమంతా భావసారమయిన చైతన్యమునుండి ఏవిధంగానూ వేరుకాదు. నామరూపాలతో పరిమితం కాబడిన సముద్రం తరంగ ముగా గుర్తింపబడుతున్నది. ఇదేవిధంగా నామరూపాలతో పరిమితం కాబడిన చైతన్యమే ఈ జగత్తుగా తెలియబడుతున్నది. తరంగం సముద్రంనుండి వేరు కాదని తెలియడానికి తరంగం దేన్ని త్యజించాలి? దేన్ని ఆమోదించాలి? దేన్ని నశింపజేయాలి? దేన్ని లయం చేసుకోవాలి? తరంగంగా ఉన్నా అది సముద్రమే! ఇదేవిధంగా జనకుడు తనకంటే వేరుగా రెండవదేదీ లేదనీ తాను దేనినీ లయం చెయ్యవలసిన అవసరం లేదనీ అంటున్నారు.

అర్థవంతమూ, అనంతభావ సౌందర్యభరితమూ అయిన ఈ ఉపమానం సాధకుని మనస్సులోని సందేహాన్ని నివారిస్తుంది. శుద్ధమూ అనంతమూ అయిన చైతన్యం ఎప్పుడూ పరిమితం కానేలేదు. పరిమితం అయినట్టుగా కేవలం భ్రమ మాత్రమే కలిగిస్తున్నది. సముద్రంలో తరంగాలన్నీ వేరుగా స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నాయి. వాటి నామరూపాలుకూడా వేరు, అయినా సముద్రంనుండి తరంగాలు వేరుకావు. సముద్రమే ఉంది. ఇదేవిధంగా గుర్తింపబడిన సర్వసృష్టి భావంలో గుర్తింపబడిన భావాలుగా చైతన్యంలో ఉండడంతో ద్వైతమన్నది ఎప్పుడూ లేదన్నది స్పష్టపడుతున్నది. ఇదేభావం కొనసాగుతున్నది తర్వాత శ్లోకంలో.

శ్లో॥ అహం స శుక్తిసంకాశః రూప్యవద్విశ్వకల్పనాః ।
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః ॥3.

టీ॥ సః = ఆ, అహం = నేను, శుక్తిసంకాశః = ముత్యపుచిప్పతో సమానుడను, విశ్వకల్పనా = ప్రపంచకల్పనము, రూప్యవత్ = వెండితో సమానముగా నున్నది, తథా = ఆ కారణమువలన, ఏతస్య = దీనికి, త్యాగః న = త్యాగము లేదు, గ్రహః = గ్రహణము, న = లేదు, లయః = లయము, న = లేదు.

**నత్తగుల్లలో వెండిని చూసినట్లు భ్రమచెందడం వంటిదే---నాలో జగత్తును చూడడం, నన్ను నేను తెలుసుకోవడానికి త్యజించవలసినది, ఆమోదించవలసినది నశింపజేయవలసినది ఏదీలేదు.**

శుద్ధచైతన్యం జగత్తుగా కనబడడానికి పరిణామంచెంది ఉండాలనే సందేహం మిగిలి ఉంటుంది చాలామంది సాధకులలో. ఈ సందేహ నివారణార్థమే ఈ ఉపమానాలు ఉపయోగింపబడుతున్నాయి. వెండిగా కనబడడంలో గుల్ల ఏ విధంగానూ మార్పుచెందడంలేదు. గుల్ల యథాప్రకారంగానే ఉంటుంది. భ్రమ వల్ల గుర్తించే బాహ్యరూపాలవల్ల అధిష్ఠానం మార్పుచెందదు. శుద్ధచైతన్యమే నేనని తెలుసుకోవడమే జ్ఞానం. అహంకారమూ, అహంకారం అనుభవించే బాహ్య వస్తుమయ ప్రపంచ భావనలూ కూడా కేవలం మిథ్య. భ్రమాకల్పితమైన భావనలు మాత్రమే. ఇటువంటి అఖండ చైతన్యానుభవంలో లయయోగాన్ని అభ్యసించడం అనవసరమే, అసాధ్యమే.

**శ్లో॥ అహం వా సర్వభూతేషు సర్వభూతాన్యథోమయి ।**
**ఇతి జ్ఞానం తథై తస్య న త్యాగో న గ్రహోలయః ॥4.**

టీ॥ అహం = నేను, వా = నిశ్చయముగా, సర్వభూతేషు = సమస్తభూతముల యందును, అథో = మరియు, సర్వభూతాని = సకలభూతములును, మయి =నా యందును, (సన్తి = ఉంటున్నవి), తథా = ఈ కారణమువలన, ఏతస్య = దీనికి, న త్యాగః = త్యాగము లేదు, న గ్రహః = గ్రహణములేదు, న = లయః = లయమున్ను లేదు, ఇతి = ఈ ప్రకారమైనదో, జ్ఞానం = జ్ఞానము.

**సర్వప్రాణులలోనూ నేనున్నాను. నాలో సర్వజగత్తూ ఉంది. ఇదే నిజమైన జ్ఞానం. నేను త్యజించవలసినది కాని, ఆమోదించవలసినది కాని, లయం చేయవలసినది కాని----ఏదిలేదు.**

ఉపనిషద్వాఙ్మయంలో ఆత్మజ్ఞానం లభించడం అంటే మిగిలిన చరాచర జగత్తు అంతటికన్నా భిన్నంగా సాధకుడు తన దివ్యత్వాన్ని గ్రహించడం అని అర్థం కాదు. అనంత సౌందర్యమయమూ సత్యజ్ఞాన స్వరూపమూ అయిన

తన్ను తాను తెలుసుకొని, తనకంటే వేరుగా రెండవదేదీలేదని నిశ్చయంగా గ్రహించి ఆ స్థితిలో నిత్యమూ ఉండడమే ఆత్మనిష్ఠ అనబడుతుంది. స్వప్నం నుండి మేలుకోగానే స్వప్న ప్రపంచమంతా జాగ్రత్ జ్యోతిలో లీనమై పోతుంది. ఇదేవిధంగా ఆత్మజ్ఞానానుభవంతో అఖిలజగత్తు మిథ్యాకల్పిత భావనాభ్రమగా చైతన్యస్వరూపమయిన తనలోనే ఉండడాన్ని ప్రత్యక్షంగా అనుభవిస్తాడు జ్ఞాని.

భగవద్భావాన్ని వర్ణించేటప్పుడూ, ఆత్మజ్ఞానవర్ణనలోనూ, కూడా సౌందర్యం అన్నపదం వాడబడుతూనే ఉన్నా, ఇది చాలావరకూ అపార్థం చేసుకోబడుతున్నది అని చెప్పక తీరదు. సౌందర్యం అనగానే కంటికికనిపించే రూపానికి మాత్రమే చెందినదనే అర్థంలోనే చాలామంది చూస్తున్నారు. ఏ ఒక్క వస్తువూ ఏ యిద్దరికీ ఒకే విధమయిన సౌందర్యభావన కలుగజేయదు. పోగా కొందరికి ఇదే వస్తువు అనాకారంగా, అసహ్యంగా కనబడినా ఆశ్చర్యపోనక్కర లేదు! వస్తువులో సౌందర్యం లేదనీ, చూసే దృష్టిలో, భావంలో సౌందర్యం ఉన్నదనీ స్పష్టపడుతున్నది. ఈ సౌందర్యానికి ప్రమాణం ఏమిటి అన్నది చూడాలి. సౌందర్యానుభూతిలో మనస్సు నిశ్చలం అయి, ఆలోచనలు ఆగిన తరుణంలో స్వస్వరూపమయిన ఆనందంలో నిశ్చలంగా కాలాతీతంగా ఉండగలుగుతుంది. పరస్పరాధారమయిన బాహ్యప్రపంచ జ్ఞానంలోకి వచ్చిన తరువాతే ఆ అనుభవాన్ని తెలుసుకుని విలువను నిర్ణయిస్తుంది బుద్ధి. ఈ బుద్ధి దృష్ట్యా అలా కాలాతీత స్థితిలో ఎంతకాలం ఉండగలిగేమో, ఆ కాల పరిమాణమే అనుభూతికి కొలతబద్ద. ఈ కొలమానంతో కొలిస్తే అనంత సౌందర్య సంపన్నం ఆత్మానుభవం అన్నది నిర్వివాదాంశం. కళ్ళతోచూసే దృశ్యసౌందర్యం, వీనులవిందైన సంగీత మాధుర్యం, మంచివాసన, అద్వైతానందాన్ననుభవంలోకి తెచ్చే స్పర్శానుభూతి, మంచి రుచీ, హృద్యంగమమైన కవితాసుధామాధురి, సర్వ కారణ కారణాన్నన్వేషించే తీవ్రబుద్ధి విభవమూ, ఇలా ఏ అనుభూతిని తీసుకున్నా వాటిని కొలిచే కొలమానం ఆనందమే. ఆ దృష్టితో ఈ భావాలన్నిటి యొక్క అనంతాద్భుత రూపంగా ఆత్మను వర్ణించడం సమంజసమే. ఆధ్యాత్మిక సాధనలో వేదాంత వాఙ్మయ పరిచయంలో ప్రతీపదానికీ వాచ్యార్థమేకాక లక్ష్యార్థం కూడా ఉంటుందని గుర్తించి ఆ లక్ష్యా న్నందుకోవడానికి సాధకులు ప్రయత్నించాలి.

ఇటువంటి పరిపూర్ణతా దృష్టి కలిగిన జ్ఞాని భావాలు ఉపనిషత్తులలోనూ భగవద్గీతలోనూ కూడా ఇదేవిధంగా వర్ణించబడ్డాయి. సత్యం ఒక్కటే, జ్ఞానాను

భవం ఒక్కటే, కాబట్టే మహాత్ముల వచనాలన్నిటిలోనూ ఒకేభావం ధ్వనించడాన్ని చూడవచ్చు. జనకుడు కూడా ఇదే భావాన్ని వ్యక్తం చేస్తూ----"చైతన్యంగా అన్ని ప్రాణులలోనూ నేనే ఉన్నాను, చైతన్యమయిన నాలో సర్వప్రాణులూ ఉనికిని కలిగి ఉన్నాయి" అని అంటున్నారు. భూతం స్తంభం అంతటా పూర్తిగా ఉంది, స్తంభం భూతం నిండా ఆవరించి ఉంది. ఈ భావమే ఈశావాస్యోపనిషత్తులో ఇలా ఉంది.

యస్తుసర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానంతతో న విజుగుప్సతే. (ఈశావాస్యోపనిషత్తు-6)

*అన్ని నామరూపాలనూ తనవిగానూ, తనను అన్ని నామరూపాలలోనూ చూడగలిగిన జ్ఞానికి పతనం ఎన్నడూ లేదు.*

**ఇదే భావం భగవద్గీతలో ఇలా చెప్పబడింది.**

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శినః. (భగవద్గీత-VI-29)

*యోగారూఢుడైన జ్ఞాని, సర్వప్రాణులలోనూ చైతన్యంగా తననూ చైతన్య మయి తనలో సర్వసృష్టినీ వీక్షించి సమత్వబుద్ధితో శాంతుడై జీవిస్తాడు.*

ఇట్టి జ్ఞానికి లయ యోగం అవసరం ఏమిటి?

...

అధ్యాయం-7

# ఆత్మ - ఆనందనిలయం

విద్యావంతులూ తెలివైనవాళ్ళూకూడా, మనం ఈ ప్రపంచంలోనికి వచ్చేమనీ నమ్మడానికి సిద్ధంగా ఉంటారు. ఈ ప్రపంచంలోకి రావడం అంటే, ప్రపంచం మననుండి విడిగా దూరంగా ఉందనీ, ఎక్కడినుండో మనం ఇందులోకి వచ్చేమనీ అర్థం. ఇక్కడ కొద్దిగా ఆగి ఆలోచిస్తే, విజ్ఞానశాస్త్రం ఏమంటున్నదో పరిశీలిస్తే, సత్యం ఇందుకు భిన్నంగా ఉందని స్పష్టంగా తెలుస్తుంది. నిజానికి మనం ఈ ప్రపంచంలోనికి రాలేదనీ, ప్రపంచంనుండే మనం పుట్టేమనీ విజ్ఞానశాస్త్రం విశ్వసనీయంగా చెప్పుతున్నది, ఋజువు చేస్తున్నది.

విజ్ఞానశాస్త్ర వేత్తలకంటే ఒకడుగు ముందుకువేస్తూ ఈ అధ్యాయం లో అష్టావక్రులు, ఈ ప్రపంచం మొత్తం ఆత్మనుండే ఉద్భవించిందని నిశ్చయంగ చెప్పుతున్నారు.

అనంతసాగరంలో విడిగా కనిపిస్తూ కూడా సముద్రంగా ఉన్న తరంగాల వలెనే, అనంత చైతన్య స్వరూపమయిన ఆత్మలో మనమంతా విడిగా కనిపిస్తున్నప్పటికీ ఆత్మమాత్రమే ఉంది, అనేక ప్రాణులు విడివిడిగా లేవు.

ఇలా విడివిడిగా వ్యక్తిత్వం కలిగిన జీవులతో ఈ ప్రపంచం ఆవరించ బడి వేరుగా ఉనికి కలిగి లేదు. ఈ మొత్తం ప్రపంచం ఆత్మ చైతన్యంలోనే ప్రపంచభావంగా, భావప్రవాహమయిన మనస్సులో తెలియబడుతున్నది. సముద్రంలోని కదలికలు తరంగాలుగా నామరూపాలతో గుర్తింపబడుతున్నాయి. చైతన్యంలో నామరూపాత్మకమయిన మహాప్రపంచ భావనలు మనస్సులో కల్లోలం కలిగినప్పుడు తెలియబడుతున్నాయి.

ఈ మానసిక కల్లోలాన్ని ధ్యానబలంతో లయం చెయ్యకపోయినా, ఈ మనస్సుకు మూలమయిన ఆత్మ చైతన్యం సదా శాంతగంభీరంగా ఏకంగా

ఉంటుంది. ఇందులో అలజడులేమీ లేనేలేవు. బాహ్యంగా ఉపరిభాగంలో కెరటాలున్నప్పటికీ అగోచరమూ అనంత గంభీరమూ అయిన సాగరగర్భపు లోతులలో సదా శాంతంగా నిశ్చలంగా ఉండనే ఉంటుంది.

ఈ మౌన గంభీరమయిన చైతన్యరాశిలో, వాసనాప్రేరితమయిన మానసాకాశంలో అనంతనామాలు అనేకరూపాలు కనిపిస్తూ, మాయం అయిపోతూ నామరూపాలతో ప్రపంచంగా గుర్తింపబడుతూ, గుర్తింపబడడాన్ని కాలభావంతో గమనిస్తూ, విషయాల ననుభవిస్తున్నా ననుకుంటున్నది అహం కారభావం---ఇదంతా ఇంద్రజాలికుని విద్యావిభవం వంటిదే. చంచలించే మనస్సు కల్పించే భ్రమలే ఈ సృష్టి దాని లయమూ, కూడా. మనస్సును, అందులో తెలియబడే భావనామయ ప్రపంచాన్నీ ఉందని ఆమోదించడం కాని, లేదని నిరూపించడం కాని ఆత్మకు అవసరంలేదు. చైతన్యసాగర మనదగిన ఆత్మ నిశ్చల గంభీరంగా శాంతంగా నిత్యమూ ఉంటుంది. భావనా తరంగాలు అప్పుడప్పుడు కదలాడి నామరూపాలతో తెలియబడి గుర్తింప బడుతుంటాయి.

లయ యోగాభ్యాసం చెయ్యడం అజ్ఞానం మిగిలి ఉండడానికి చిహ్నమనీ, దాని అవసరంలేదనీ చెప్పిన జనకులు ఇంకా సంతృప్తి చెందక ఆత్మతత్త్వం గురించి ఆనందంతో ఇంకా వర్ణిస్తున్నారు. ఈ అధ్యాయంలో, ఆత్మ ఆనందానికి నిలయం, అద్భుత సౌదంర్య తేజోవిరాజితం, అనుపమానం, కేవలం అని ఆనందంతో గానం చేస్తున్నారు.

జనక ఉవాచ :-

శ్లో॥ మయ్యనన్త మహామ్భోధౌ విశ్వపోత ఇతస్తతః ।
భ్రమతి స్వాన్తవాతేన న మమా స్త్యసహిష్ణుతా ॥1.

టీ॥ అనన్తమహామ్భోధౌ=అపార మహాసముద్రమువలెనున్న, మయి= నాయందు, విశ్వపోతః = ప్రపంచరూపనావ, స్వాన్తవాతేన = మనోరూపవాయువు చేత, ఇతస్తతః = ఇటునటు, భ్రమతి = తిరుగుచున్నది (పరంతు = అయితే), మమ = నాకు, అసహిష్ణుతా = అసహనశీలత, నాస్తి = లేదు.

అపారసాగరంవలె ఉన్న నాలో జగత్తనే నావ మనస్సనే వాయువుచే కదలింపబడినదై కదలాడుతున్నది. అందువల్ల నాకేవిధమైన అశాంతీలేదు.

జ్ఞాని అనగానే అతనిచుట్టూ ఉన్న నానాత్వాన్ని చూడనివాడనీ, అతని మనస్సులోనూ బుద్ధిలోనూ, ఆలోచనలుండవనీ అర్థంకాదు. అవన్నీ ఉన్నా అతడు మనవలె రాగద్వేషాధీనుడై చలించకుండా స్థిరంగా ఉండగలడు. బాహ్యాభ్యంతరాలలో అతనికి ప్రపంచం వలన ఎలాంటి అశాంతీ కలుగదు. నిత్యమూ తాను అనంత చైతన్యస్వరూపమయిన ఆత్మననే జ్ఞానం ఉండడంతో, తానుగాక రెండవదేదీ లేదనే దృఢజ్ఞానంతో నిర్భయంగా సంతోషంగా జీవించగలడు.

ఈ చైతన్య మహాసముద్రంలో అలలవలె జగత్తు నామరూపాలతో తెలియబడుతూ ఉంటుంది. వాసనాబలం కారణంగా మనస్సులో కోరికలనే సుడిగాలులు బయలుదేరి చైతన్యసాగర ఉపరిభాగంలో అలలవలె, ప్రపంచం నామరూపాలతో మనస్సులోన తెలియబడుతుంది. వారివారి రాగద్వేషాలు, సుఖదుఃఖాలు ఆధారంగా ప్రతివారి మనస్సులోనూ వారిదైన ప్రత్యేక ప్రపంచం నిర్మింపబడుతూ ఉంటుంది. ఈ విధంగా నా మనస్సులో నా భావనా లోకమూ, నీ మనస్సులో నీ మనోసామ్రాజ్యమూ ఉత్పన్నం కావడంతో ఎవరికి వారే, ఒకే చోట ఉన్నా, ఎంతోదూరంగా ఎవరి ప్రత్యేక లోకంలో వారు నివసిస్తూ ఉంటారు. ఈ వ్యక్తిగత కల్పితలోకాల సమిష్టిరూపమే బాహ్యంగా మనకు కనబడే చరాచర జగత్తంతా, ఇదంతా ఈ సమిష్టి మనస్సుచే కల్పింపబడి స్థితినంది, లయం అయిపోతూ, ఈ మధ్యలో చరిత్రను సృష్టిస్తూ, అనంతకాలపు వాహనంగా సాగిపోతూ ఉన్నట్టుగా మనస్సులో గుర్తింపబడుతున్నది

తనచే గుర్తింపబడేదంతా ఈ వ్యష్టి, సమిష్టి మనస్సులయొక్క కల్పన అని తెలుసుకున్న జనకరాజర్షి "జ్ఞానికి ప్రపంచం వలన అశాంతి కలుగదు, బాహ్యాభ్యంతరాలలో ఏమి సంభవించినా అదంతా భ్రమమాత్రమే అని తెలుసుకుని సదా శాంతంగా తన సహజస్థితిలో ఉండగలడు" అని నిశ్చయంగా చెబుతున్నాడు.

**శ్లో॥ మయ్యనన్త మహామ్భోధౌ జగద్వీచిః స్వభావతః ।**
**ఉదేతు వాఽస్తమాయాతు న మే వృద్ధిర్న చ క్షతిః ॥2.**

టీ॥ అనంతమహామ్భోధౌ=అపార మహాసముద్రరూపుడనగు, మయి = నాయందు, జగద్వీచిః = జగద్రూపమగు కల్లోలము, ఉదేతు = ఉదయించునుగాక! వా = లేనిచో, అస్తం = లయమును, ఆయాతు = పొందునుగాక! మే = నాకు, వృద్ధిః = వృద్ధియు, న = లేదు, క్షతిః = హానియును, న = లేదు.

మహాసముద్రంవలె ఉన్ననాలో తరంగాలవలె జగత్తు ఉద్భవించి నర్తించి లయం అవుగాక, అందువలన నాలో వృద్ధి క్షయములు కలుగనేరవు.

క్రిందటి శ్లోకంలో వాడిన ఉపమానాన్నే ఇంకా వివరిస్తున్నారు జనకులు. సముద్రంలో అలలు కదలినప్పుడు, ప్రతి అలా తనదైన ప్రత్యేక రూపం కలిగే ఉంటుంది. అయినా అలలన్నీ సముద్రమే. ఎన్ని అలలు పుట్టినా సముద్రం తరిగి పోదు. అలలు ఉన్నా లేకపోయినా సముద్రం సముద్రమే. ఇదేవిధంగా వివిధ ప్రత్యేకరూప సమన్వితమయిన విశ్వంగా అనేక నామాలతో భావంలో భావాలుగా తెలియబడినప్పుడూ, శాంతస్థితిలోనూ కూడా సదా శాంతగంభీరంగా స్థిరంగా చైతన్యమయంగా ఆత్మమాత్రమే ఉంది. ఆ ఆత్మే నేను అని తెలుసుకోవడమే నిజమైన విజ్ఞానం. ఈ విజ్ఞానమూ అనుభవమూ ఉన్న నాలో ఎన్ని భావనా తరంగాలు కదలాడినా మార్పు ఎలా సంభవించగలదు?---నిత్యమూ నేను పరిణామరహితంగా ఆత్మగా చైతన్యమయంగా కేవలంగా ఉన్నాను.

మాయా సిద్ధాంతాన్ని అష్టావక్రులు అంతగా ఆమోదించి హర్షించినట్లు లేదు. మనోగోచరమయే భావనామయ ప్రపంచమంతా అజ్ఞానజనితమయిన భ్రమవల్లనే ఉనికి కలిగి ఉన్నదని గుర్తించిన ఆ మహాముని నేరుగా ఆ అజ్ఞానం గురించే వివరంగా చెప్పుతున్నారు. ఉన్న సత్యాన్ని సరిగ్గా గుర్తించకపోవడం అనే అజ్ఞానం సర్వత్రా ఉంది. దీనిని అగ్రహణం అంటారు. ఈ అగ్రహణమే అన్యధా గ్రహణానికి కారణమయి నానాత్వ ప్రపంచంగా గుర్తించబడుతోంది. మూలమయిన అజ్ఞానాన్ని తత్వజ్ఞానంతో నశింపజేస్తే తజ్జనితమయిన భ్రమకూడా నశించి తీరుతుంది. ఈ భ్రమే మనస్సుగా మహాప్రపంచాన్ని గుర్తిస్తోంది. ఆచార్య శంకరులు వివేకచూడామణిలో ఇలా అంటున్నారు.

నహ్యస్యవిద్యా మనసోఽతిరిక్తా మనోహ్యవిద్యాభవబంధహేతుః
తస్మిన్ వినష్టే సకలం వినష్టం విజృంభితేఽస్మిన్ సకలం విజృంభతే
(వివేక చూడామణి-169)

మనస్సునుమించిన అజ్ఞానం లేదు. మనస్సే అజ్ఞానం. ఇదే పరిణామాత్మకమయిన సకల వ్యధలను అనుభవాలను కలిగిస్తోంది. ఈ మనస్సు నశిస్తే సర్వసృష్టీ నశిస్తుంది. మనస్సు పనిచేస్తే జగత్తంతా ప్రకాశిస్తుంది.

**శ్లో॥ మయ్యనన్త మహాంభోధౌ విశ్వం నామ వికల్పనా ।**
**అతిశాన్తో నిరాకర ఏతదేవాహమాస్థితః ॥ 3.**

టీ॥ అనన్తమహామ్భోధౌ = అనంతమహాసముద్రమువలెనున్న, మయి = నాయందు, విశ్వం = ప్రపంచము, నామ = అనగా, వికల్పనా = కల్పనామాత్రమై యున్నది, అహం = నేను, అతిశాన్తః=అత్యంత శాంతస్వరూపుడను, నిరాకారః = నిరాకారుడను, చ = మఱియు, ఏతదేవ = ఈ ఆత్మకు, ఆస్థితః = ఆశ్రయుడనై యున్నాను.

అనంతసాగరమువలె ఉన్నా నాలో జగత్తనే ఊహాకల్పిత భ్రమ తెలియబడుతున్నది. నేను నిత్యమూ శాంతంగా నిరాకారంగా కేవలంగా ఉన్నాను. ఈ నిశ్చయ జ్ఞానంలో నేను నిశ్చలంగా ఆనందంగా ఉన్నాను.

క్రిందటి శ్లోకంలో వాడబడిన సాగరమూ తరంగాలూ ఉపమానం వినగానే తొందరపడి సాధకుడు, సాగరంలోవచ్చిన కదలికవల్ల పరిణామం చెంది, తరంగాలు ఏర్పడినట్లే చైతన్యం పరిణామం చెంది భావనామయ జగత్తుగా ఏర్పడిందని అనుకోవచ్చు,చైతన్యం తాత్కాలికమే అయినా నామరూపాలుగా మారిందని అపోహ పడవచ్చు. ఈ అపార్థానికి అవకాశం కలుగకుండా ఈ శ్లోకం చెప్పబడింది.

నామరూపాత్మకమైన ఈ చరాచర జగత్తంతా సమిష్టి మనస్సు యొక్క ఊహాకల్పన మాత్రమే, "వికల్పన మాత్రమే. నిజానికి ప్రపంచానికి ఉనికి లేనేలేదు. ఆత్మ నిరాకారంగా నిశ్చలంగా సదా శాంతగంభీరంగా ఉంది. ఈ విషయం ఇదివరకే మొదటి అధ్యాయంలో స్పష్టం చేయబడింది.--- "సాకార మనృతం విద్ధి నిరాకారం తు నిశ్చలమ్"(1-18). రూపం కలిగినవన్నీ భ్రమలే, ఇవి మార్పుచెంది నశిస్తాయి. రూపరహితమైనది మాత్రమే నిత్యం, పరిణామ రహితం.

శ్లో॥ నాత్మా భావేషు నో భావః తత్రానన్తే నిరంజనే ।
ఇత్యసక్తోఽస్పృహశ్శాన్తః ఏతదేవాహమాస్థితః ॥ 4.

టీ॥ ఆత్మా = ఆత్మ, భావేషు = దేహాదిభావములయందు, న = లేదు, భావః = దేహాదికభావము, తత్ర = ఆ, అనన్తే = అనంతమైన, నిరంజనే = నిరంజన (నిర్ద్వంద్వ)మైన ఆత్మయందు, నో=లేదు, ఇతి = ఈ ప్రకారముగా, అసక్తః = సంగరహితుడనైన, శాన్తః= శాంతుడనైన, అహం=నేను, ఏతదేవ=ఈ యాత్మ స్వరూపుడనైయ్యే, ఆస్థితః =ఉంటున్నాను.

ఆత్మ వస్తువులో లేదు, వస్తువుకూడా ఆత్మలో ఉండజాలదు. ఆత్మ అనంతం, అమలం, అద్వయం కాబట్టి ఆత్మలో కోరికలు రాగభావం ఉండే ఆస్కారంలేదు. ఇది నిత్యశాంతస్వరూపం. ఈ జ్ఞానంతో సదా నేను శాంతంగా నిశ్చలంగా ఉంటాను.

స్తంభం భూతంగా మారలేదు. భూతం భ్రమాజన్యకల్పిత భావన, ఈ భూతం స్తంభంలో ఎన్నడూలేదు. ఇదేవిధంగా మనఃకల్పిత భావసమూహమయిన వస్తుమయ ప్రపంచం ఆత్మలో ఎప్పుడూ లేదు. దృశ్యగోచరమయిన ప్రపంచానికి అధిష్ఠానంగా ఆత్మఉంది. ఈ ఆత్మవస్తుమయ ప్రపంచంగా ఎన్నడూ మారనేలేదు. ఇది సహజంగా, శాంతంగా, స్థిరగంభీరంగా, అద్వయంగా ఉండడం చేత, దేనిమీదనయినా రాగం, ద్వేషం, కోరిక ఉండే ఆస్కారమేలేదు. ఆత్మకన్నా రెండవది లేనేలేదు. కాబట్టి ఆత్మచే కోరబడవలసినదేదీ ఉండదు. ఏకంగా అద్వయంగా ఉన్న ఆత్మే ఈ కనిపించే సర్వమూ కూడా"అని ఉపనిషత్తు ఉద్బోధిస్తున్నది----"ఆత్మా ఏకమేవ ఇదం సర్వం" రాగభావమూ, కోరికా మనః కల్పిత భ్రమలు మాత్రమే. ఈ రెండింటిని అధిగమిస్తే మనస్సును అధిగమించినట్టే. మనస్సు లేనిచోట అశాంతి ఉండదు, శాంతగంభీరమైన ఆత్మానందమే ఉంటుంది. ఈ దృఢజ్ఞానానుభవ నిష్ఠుడయిన జనకుడు సదా ఆనందంగా తాను మాత్రమే ఉన్నానని అంటున్నారు.

**శ్లో॥ అహో చిన్మాత్ర మేవాహం ఇన్ద్రజాలోపమం జగత్ ।**
**అతో మమ కథం కుత్ర హేయోపాదేయకల్పనా ॥5.**

టీ॥ అహం = నేను, చిన్మాత్రం = చైతన్యమాత్రస్వరూపుడను, జగత్ = ప్రపంచం, ఇన్ద్రజాలోపమం=ఇంద్రజాలముతో సమానమైనది, అతః = ఈ కారణమువలన, మమ = నాకు, హేయోపాదేయకల్పనా -హేయ = త్రోసివేయుట, ఉపాదేయ = తీసికొనుటయనెడి, కల్పనా = కల్పన, కుత్ర = దేనియందు, కథం = యెట్లు, (క్రియతే = చేయబడుచున్నది).

**ఆహా ఆశ్చర్యం,అద్భుతం! శుద్ధచైతన్యంగా నేను మాత్రమే ఉన్నాను. ఈ జగత్తు ఇంద్రజాలంవలె నాలో కనిపిస్తోంది. అయినప్పుడు నాలో సంతోష విచారాలు ఎలా ఉండగలవు?.**

ఈ ప్రపంచంలో ఉన్న ఏ వస్తువయినా సరే జ్ఞానిని ఆకర్షించదు. వికర్షణా కలిగించదు.రాగభావరహితుడై ఇంద్రజాల సమయమున దృశ్యప్రపంచాన్ని సదా శాంతంగా వీక్షిస్తూ ఉంటాడు. మనస్సు కల్పించిన మాయాజాలమయిన నానాత్వప్రపంచాన్ని వినోదంతో వీక్షిస్తూ ఉంటాడు. కళ్ళకెదురుగా కనిపిస్తున్నా అందులో సత్యం లేదని, ఆకాశపు నీలివర్ణంవలె ఉన్నట్టుగా భ్రమింపజేస్తున్నదనీ అతనికి స్పష్టంగా తెలుసు. కాబట్టి సహజంగా అతనికి ఈ జగన్నాటక దృశ్యాలపై ఎటువంటి భావమూ కలుగదు.

ఈ దృక్పథంతో జీవించే జ్ఞాని జీవితం అతనికి శాంతినివ్వడమేగాక సమాజానికి కూడా ఎంతో మేలు కలుగజేస్తుంది. మహోపనిషత్తులో ఇటువంటి భావమే వ్యక్తీకరించబడింది.

బహిః కృత్రిమసంరంభో హృదిసంరంభ వర్జితః
కర్తా బహిరకర్తాన్తర్లోకే విహర శుద్ధధీః.

ఓ *జ్ఞానీ!* బాహ్యప్రపంచానికి బహుకార్యభారాలతో సతమతమవు తున్నట్లు కనిపిస్తూ అంతరంగంలో అతి శాంతమూర్తివై అకర్తవై స్థిరంగా ఉంటూ, ఈ మనఃకల్పిత జగన్నాటకాన్ని వినోదంతో వీక్షించు.

బాహ్యప్రపంచంలో బహుకార్యాలను నిర్వహిస్తున్నట్లు కనిపిస్తూనే జ్ఞానులు తమ అంతరంగంలో సదా శాంతంగా అకర్తగా కేవలంగా తను మాత్రమే ఉండడాన్ని గుర్తిస్తుంటారు.

...

## అధ్యాయం-8

# బంధము - విముక్తి

క్రిందటి అధ్యాయంలో ఆకర్షణీయంగా హృద్యంగా జనకునిచే వర్ణింపబడిన ఆత్మానుభవజ్ఞానం సత్యమే ఐతే, ఈ ప్రపంచంలో ఇంతమంది ఎందుకు బాధపడుతూ దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్నారు? అనంతమైన ఈ ఆనందం వారికి ఎందుకు అందడంలేదు? ఈ సందేహాన్ని సకారణంగా వివరిస్తున్నారు అష్టావక్రులీ అధ్యాయంలో. బంధం ఎలావచ్చింది? ముక్తి ఎలా లభిస్తుంది? మనస్సు సదా బాహ్యాభిముఖము అయి ఉంటుంది, కాబట్టి అహంకార జనిత భావాలన్నీ బాహ్యప్రపంచాన్నీ తనకంటే వేరుగా గుర్తిస్తుంటాయి. తన కంటే వేరుగా రెండవది ఉందంటే భయమూ బాధా, బంధమూ ఉండనే ఉంటాయి. ఈ మనస్సే అంతర్ముఖం అయి బాహ్యదృష్టిని విడనాడితే, భావాల కల్లోలం ఆగిపోయి అహంకారం తనమూలమయిన చైతన్యాన్ని గుర్తించగలుగుతుంది---ఇదే ముక్తి.

మనస్సు మహావేగంతో బాహ్యవస్తుమయ ప్రపంచాన్ని గుర్తిస్తున్నప్పుడు యిష్టాయిష్టాలను ఏర్పరచుకుంటుంది. యిష్టమయినవానిని సాధించాలనీ అయిష్టమయినవాటికి దూరంగా ఉండాలనీ కోరుకుని ప్రయత్నిస్తుంది. ఈ ప్రయత్నంలో రాగద్వేషాలు ఉదయించి వృద్ధిచెందుతాయి. కొన్ని వస్తువుల కోసం తాపత్రయం చెందుతూ మరికొన్నిటిచే తరుమబడుతూ రాగద్వేషాధీనమయిన మనస్సు వాసనలను పోగుచేసుకుటూ వాటిని అనుభవించడంకోసం జన్మలనెత్తుతూ జననమరణ రూపమయిన సంసారచక్రంలో చిక్కుకుని బయటపడేదారి కానరాక విలపిస్తూ ఉంటుంది. ఇదే బంధం. ఒక్కమాటతో బంధాన్ని, మరొక్కమాటతో ముక్తినీ, మహోపనిషత్తు ఇలా నిర్వచిస్తున్నది.

ద్వేపదే బంధమోక్షాయ నిర్మమేతి మమేతి చ
మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే (మహోపనిషత్తు)

*బంధం మోక్షం అన్నమాటలను రెండుమాటలలో నిర్వచించవచ్చు. మమత్వం బంధిస్తుంది, నిర్మమత్వం ముక్తస్థితే.*

**శ్లో॥ తదా బన్ధో యదాచిత్తం కించిద్వాంఛతి శోచతి ।**
**కించిన్ముంచతి గృహ్ణాతి కించిద్ధృష్యతి కుప్యతి ॥ 1.**

టీ॥ యదా = ఎప్పుడు, చిత్తం = మనస్సు, కిఞ్చిత్ = ఏ కొంచెమునైనను, వాంఛతి = కోరుచున్నదో, శోచతి = దుఃఖించుచున్నదో, ముఞ్చతి = విడుచుచున్నదో, గృహ్ణాతి = గ్రహించుచున్నదో, హృష్యతి = సంతోషించుచున్నదో, కుప్యతి = కోపించు చున్నదో, తదా = అప్పుడు, బన్ధః = బంధము (భవతి = అగుచున్నది.)

**మనస్సు దేనినయినా కోరినా దేనికోసమయినా విచారించినా, దేనినయినా అమోదించినా, నిరాకరించినా సంతోష విచారాలను పొందినా, బంధింపబడి ఉన్నట్టే.**

ముందుగా బంధం అంటే ఏమిటో తెలియబరుస్తున్నారు అష్టావక్రులు. సాధకులమయిన మనందరికి ఇది అనుభవంలో ఉన్నదే కాబట్టి సులభంగా బోధ పడుతుంది. బంధంలో ఉండబట్టే ఈ అష్టావక్రగీతను చదువుతున్నారు. అలా కాకపోతే హాయిగా ఎవరి గీతాన్ని వారే ఆలపిస్తూ ఏకాంతానందాన్ని అనుభవిస్తూనే ఉందురు!! బంధం అంటే ఏమిటో క్షుణ్ణంగా అర్థం చేసుకున్న బుద్ధికి ముక్తస్థితి ఊహామాత్రంగానైనా అందితీరుతుంది.

బాహ్యప్రపంచంలో ఒక వస్తువునుచూసి, యిష్టపడి దానిని సంపాదించడం వలన ఆనందం కలుగుతుందని నిశ్చయించుకుని అందుకు ప్రయత్నించాలను కోవడం "కోరిక" అనబడుతుంది. ఆ వస్తువును పొంద లేకపోవడం కాని, పొంది కూడా కాలవశాత్తూ పరిణామం చెందిన ఆ వస్తువు నచ్చకపోవడం లేక వస్తువు నశించడం వీటివల్ల కలిగేది విచారం అనబడుతుంది.

మనస్సుకు ఆహ్లాదం కలిగించే వస్తువులను ఆమోదిస్తుంది. అననుకూల మయిన వానిని త్యజించాలనుకుంటుంది. తనచుట్టూ ఉన్న పరిస్థితులు తనకు నచ్చినట్టు ఉంటే సంతోషంగా ఉంటుంది. దీనికి వ్యతిరేకంగా ఉంటే, వ్యతిరేకించిన మనస్సు క్రోధావృతమవుతుంది.

ఇటువంటి మనస్సుకు బానిసగా జీవితాన్ని సాగించడం బంధం అవుతుంది. మనశ్శరీరాల యిష్టాయిష్టాలకు వశుడై వాటిని సదా సంతృప్తి పరచ డానికి శ్రమిస్తూ, వాటికి కట్టుబడి బానిసవలె జీవించడమే బంధస్థితి.

శ్లో॥ తదాముక్తిర్యదా చిత్తం న వాంఛతి న శోచతి ।
న ముంచతి న గృహ్ణాతి న హృష్యతి న కుప్యతి ॥ 2.

టీ॥ యదా = ఎప్పుడు, చిత్తం = మనస్సు, న వాంఛతి = కోరదో, న శోచతి = దుఃఖించదో, న ముంచతి = విడిచిపెట్టదో, న గృహ్ణాతి = గ్రహించదో, న హృష్యతి = సంతోషించదో, న కుప్యతి = కోపించదో, తదా = అప్పుడు, ముక్తిః = ముక్తి, (భవతి = అగుచున్నది)

మనస్సు కోరికకూ విచారానికీ లోనుకానప్పుడు, సంతోష విచారాలను పొందనప్పుడు, ఆమోదము, నిరాకరణము, క్రోధము---వీటికి వశం కానప్పుడు ముక్తస్థితిలో ఉన్నట్లే.

క్రిందటి శ్లోకంలో వివరించబడిన బంధస్థితికి వ్యతిరేకమయిన ముక్తస్థితి వర్ణించబడింది. ఈ స్థితి సాధింపబడాలంటే మనస్సుకు బాహ్య వస్తుమయ ప్రపంచంలో లభ్యమయ్యే ఆనందంకంటే చాలా గొప్పదయిన ఆనందం తనలోనే ఉందని తెలియాలి. ఈ ఆనందానుభవంలో లగ్నమయిన మనస్సు బాహ్య వస్తువులపై మమతానురాగాలను సృష్టించి పెంచుకోదు. అన్నపూర్ణోపనిషత్తు ఇలా అంటోంది.

న మోక్షే నభసః పృష్ఠే న పాతాలే న చ భూతలే
సర్వాశాసంక్షయే చేతః క్షయో మోక్ష ఇతీష్యతే
(అన్నపూర్ణోపనిషత్తు,11-23)

బాహ్యాభ్యంతర చతుర్దశ భువనాలలో ఎక్కడా ముక్తిలభించదు. కోరికల కల్లోలం నశించి శాంతస్థితినందిన మనస్సులో మాత్రమే ముక్తి లభ్యమవుతుంది. కామాన్ని జయించినప్పుడు, కోరికలు లేనప్పుడు, ఆలోచనా ప్రవాహం ఆగిపోతుంది. మనస్సు తన రూపాన్ని కోలుపోయి స్వరూపంలో నిలుస్తుంది. ఇదే ముక్తస్థితి.

ఇదే భావాన్ని యోగవాశిష్ఠం కూడా వ్యక్తం చేస్తోంది.

భావనాశనం మోక్షో బంధో హి దృఢభావనా.

(యోగవాసిష్ఠం అధ్యాయం, 85-119)

ఆలోచనలు నశించడమే ముక్తి, ఆలోచనా ప్రవాహంలో కొట్టుకు పోవడమే బంధం.

సాధకుడు తన కోరికలను వివేకంతో విచక్షణాజ్ఞానంతో అర్థం చేసుకుని విడనాడడంకన్నా వేరుమార్గం లేదు. ఈ భావమే ఇంకొకచోట ఇలా వివరింపబడింది.

ఇచ్ఛామాత్రమవిద్యేయం తన్నాశో మోక్ష ఉచ్యతే
స చాసంకల్పమాత్రేణ సిద్ధోభవతి వై మునే.

*కోరికలకు విడిగా అజ్ఞానంలేదు. కోరికలు నశించిన స్థితే ముక్తస్థితి. కోరికలు నశించిన క్షణంలోనే మననశీలి అయిన మనీషి స్వతంత్రుడౌతున్నాడు.*

**శ్లో॥ తదా బన్ధో యదా చిత్తం సక్తం కాస్వపి దృష్టిసు ।**
**తదా మోక్షో యదా చిత్తం అసక్తం సర్వదృష్టిషు ॥3.**

టీ॥ యదా = ఎప్పుడు, చిత్తం = మనస్సు, కాసు = ఎటువంటి, దృష్టిషు = విషయములయందు, సక్తం = ఆసక్తమగుచున్నదో, తదా = అప్పుడు, బంధః = బంధమగుచున్నది, అపి చ = మరియు, చిత్తం = మనస్సు, యదా = ఎప్పుడు, సర్వ దృష్టిషు=సమస్తవిషయములయందును, అసక్తం=సక్తముకాదో, తదా=అప్పుడు, మోక్షః = మోక్షము కలుగుచున్నది.

ఇంద్రియగోచరమయిన ఏ వస్తువుమీదనయినా కోరికవుంటే అదే బంధం. ఇంద్రియగోచరమయ్యే వస్తుప్రపంచంపై నిరాసక్తతతో విడిగా నిలవ గలగడమే ముక్తి.

మొదటిశ్లోకంలో కామవశుడై ఇంద్రియలోలుడై జీవించడం బంధం అని చెప్పేరు. ఇప్పుడు మానసికంగా వాటినుండి విడివడడమే ముక్తి అని చెప్పు తున్నారు మునివర్యులు. ఈ రెండు శ్లోకాలలోనూ కూడా మనస్సుకూ దానిచే చూడబడే బాహ్యప్రపంచానికీ గల సంబంధమే రెండువిధాలుగా వివరింపబడింది. మొదటిదానిలో కామవశమై బాహ్యప్రపంచంతో రాగబంధం కలిగి ఉండడం బంధ హేతువనీ, ఈ శ్లోకంలో, నిరాసక్తతతో వివేక జన్యమైన వైరాగ్యభావంతో బాహ్యప్రపంచంతో వ్యవహరించగలగడం ముక్తి అనీ నిరూపింపబడింది. రెండూ మనోభావాలే. మనస్సుకూ జగత్తుకూగల సంబం ధమే,అయిన అనంతవ్యత్యాసం ఉంది,బంధమోక్షాలకు హేతుభూతాలయేయి!

బాహ్యంగా ఇంద్రియగోచరమయ్యే వస్తుమయప్రపంచ ప్రభావం మనస్సుపై చాలాబలంగా ఉంటుంది. మనస్సుకు గోచరమయ్యే ప్రపంచానికిగల

సంబంధం విషయంలో వివేకజన్య వైరాగ్య భావంతో విచక్షణతో సాధకులు చాలా మెలకువగా వ్యవహరించాలని అష్టావక్రులు సలహా యిస్తున్నారు. మనోగోచరమయే ప్రపంచాకర్షణ వికర్షణలకు, మనస్సు లోబడి జీవిస్తే బంధం అవుతుంది. దృశ్య ప్రపంచ సత్యత్వాన్ని, దృక్ దృశ్య సంబంధాన్ని అర్థం చేసుకుని, ఆకర్షణకూ భ్రమకూ లోబడకుండా వివేకంతో వ్యవహరించడమే ముక్తస్థితి.

**శ్లో॥యదా నాహం తదా మోక్షః యదాऽహం బన్ధనం తదా।**
**మత్వేతి హేలయా కించిత్ మాగృహాణ విముంచమా ॥4.**

టీ॥ యదా=ఎప్పుడు, అహం=నేను, (అహంకారము ఉన్నదో) తదా = అప్పుడు, బన్ధః = బంధము, (భవతి = అగుచున్నది), యదా = ఎప్పుడు, అహం = అహంకారం, న = లేదు, తదా = అప్పుడు, మోక్షః = మోక్షము, (భవతి = అగుచున్నది), ఇతి = ఈ ప్రకారముగా, మత్వా = తలంచి, హేలయా = లీలగా, మా గృహాణ = గ్రహించకుము, మా విముంచ = విడచి పెట్టకుము.

నేను అనే అహంకారం లేకపోవడమే ముక్తి. అహంకారం ఉండడమే బంధం. ఇదే తెలుసుకుని ఆకర్షణ వికర్షణలకు లోనుకాకుండా దేనినీ ఆమోదించ కుండా త్యజించకుండా శాంతంగా ఆనందంగా జీవించు.

ఈ అధ్యాయానికి చివరిదైన ఈ శ్లోకంలో అష్టావక్రులు సాధకులను ఇలా హెచ్చరిస్తున్నారు. "హాస్యానికయినా, ఆటగానయినా, ఇంద్రియగోచరమయే ప్రపంచాన్ని సత్యంగా ఒక్క క్షణంకూడా భావించకు". చూస్తున్నది నిజంకాదు అన్నభావం కదలాడినా, చూసేవ్యక్తిగా అహంకారాన్ని బలపరుస్తున్నామన్న మాటే! అందుకే దేనినీ ఆమోదించనూవద్దు, నిరసించనూ వద్దు. నిరాసక్తంగా సాక్షిగా దృశ్యాన్ని చూస్తూ, చూస్తున్న దానిని వివేకవంతమూ విచక్షణాసహితమూ అయిన జ్ఞానంతో అర్థం చేసుకోవాలి. చూస్తూ ఉండే "నేను" లేనిస్థితే ముక్తి. నేను చూస్తున్నాను అనుకోవడమే బంధం. బంధంలేదని తెలుసుకుంటే ముక్తి అనే పదమే అర్థరహితమై, బంధముక్త్యతీతంగా కేవలంగా అహం మిగిలిపోతుంది!

•••

## అధ్యాయం-9

# నిర్లిప్తత-ఉదాసీనత (నిర్వేదము)

సాధకుడు తన స్వరూపాన్ని తెలుసుకోవాలంటే ముఖ్యంగా మూడు గుణాలను అభివృద్ధి చేసుకోవాలి అని అష్టావక్రులు అంటున్నారు. అవి 1) నిర్వేదము (నిర్లిప్తత) 2) సమత 3) యుక్తి. ఇందులో ప్రతి ఒక్కటీ మిగిలిన వాటివల్ల ప్రభావితం అవుతుంది. నిర్వేదము, సమత్వము లేనిదే తార్కికంగా యుక్తిపరంగా ఆలోచించడం సాధ్యం కాదు. నిర్వేదం ఉండాలంటే సమత్వ బుద్ధీ, యుక్తీ, సహాయం చెయ్యవలసిందే. ఇలాగే సమత్వబుద్ధి ఉండడానికి మిగిలినరెండూ ఉండి తీరవలసినదే. నిజానికి ఈ మూడూ కూడా శరీరమూ మనస్సూ బుద్ధిద్వారా ఏకకాలంలో సాధింపబడాలి. అప్పుడే ప్రయోజనకరం కాగలవు.

బాహ్యవస్తుమయ ప్రపంచాకర్షణనుండి విడిగా నిర్లిప్తంగా ఉదాసీనంగా శరీరం ఉండాలి. రాగద్వేషాలాధారంగా మనస్సు తన యిష్టంవచ్చిన రీతిలో నర్తించడం మానాలంటే సమత్వభావం చాలా అవసరం. ఇంద్రియగోచరమయే ప్రపంచం, కేవలం మనఃకల్పిత భ్రమఅనీ, భావనామాత్రమనీ శాస్త్రాధారంతో యుక్తి సహాయంతో బుద్ధి తెలుసుకోగలగాలి.

శరీరంతో తాదాత్మ్యమూ తద్వారా ప్రాపంచిక భోగాలమీద మక్కువా అహంకారాన్ని పటిష్టంచేసి అజ్ఞానాన్ని పెంచడానికి తోడ్పడతాయి. దీనికి నిర్వేదమే మందు. ఈ భావంవల్ల వస్తువిషయ భోగాలపై ఆకర్షణతగ్గి సాధకుడు వాటి బంధంనుండి బయటపడతాడు. అప్పుడీ విషయభోగాలూ యిష్టాయిష్టాలూ వాటికోసం శారీరకంగా బానిసవలె పడవలసిన శ్రమా తగ్గుతాయి. ఈ ప్రపంచమంతా పంచమహాభూతాల (పృథివి, ఆపస్, తేజో, వాయు, ఆకాశం) సమ్మేళనంతో తయారుకాబడింది. ఇవి వేరు వేరు నిష్పత్తులలో కలిసి మహా ప్రపంచంగా రూపొందినవి. వాటిని యథాతథంగా చూస్తే నిజానికి ఎటువంటి విలువాలేదు. కాని మన యిష్టాయిష్టాలూ రాగ

ద్వేషాలూ ఆ వస్తువులను ఆవరించి వాటికి లేని విలువల నాపాదించి తమ ఉనికిని బలపరచుకుంటాయి. ఈ కల్పిత మానసిక విలువలతో వస్తువులను సంపాదించుకోవడానికీ వదలించుకోవడానికీ అనవరతము శ్రమపడుతూ, బాధామయమైన సంసారంలో చిక్కుకొని పోతున్నాం. ఉదాసీనభావాన్ని వృద్ధి చేసుకుంటే కోరికలు నశిస్తాయి. కోరికలకు నిర్వేదమే మందు!

కోరికే సంసారం, నిర్వేదభావమే ముక్తికి మార్గం.

**అష్టావక్ర ఉవాచ :-**

**శ్లో॥ కృతాకృతే చ ద్వంద్వాని కదా శాంతాని కస్య వా ।**
**ఏవం జ్ఞాత్వేహ నిర్వేదాత్ భవ త్యాగపరోఽవ్రతీ ॥ 1.**

టీ॥ కృతాకృతే = కర్తవ్యా కర్తవ్యములును, ద్వంద్వాని = సుఖదుఃఖ శీతోష్ణాది ద్వంద్వములను, కస్య=ఎవనికి, కదా=యెప్పుడు, శాన్తాని = శాంతించుచున్నవి, ఏవం = యీ ప్రకారము, వా = నిశ్చయముగా, జ్ఞాత్వా = తెలిసికొని, ఇహ = ఈ ప్రపంచము నందు, నిర్వేదాత్ = హేయత్వబుద్ధివలన, అవ్రతీ = ఆగ్రహములేనివాడవై, త్యాగపరః = త్యాగపరుడవుగా, భవ = అగుము.

**ధర్మాచరణలో కలిగే ధర్మసందేహాలు, ద్వంద్వానుభవాలు ఎవరికి చెందినవి? అవి ఎప్పుడు లేకుండా పోతాయి? నశించేదెవరు? ఈ విధంగా కూలంకషంగా విచారించి, తర్కించి, ప్రపంచంపట్ల పూర్తిగా ఉదాసీనభావం వహించి రాగరహితుడవై త్యాగధనుడవై జీవించు.**

విచారసరళి పూర్తిగా వివరింపబడింది. ఇక్కడ కర్తననుకునే అహంకారాన్ని బాధిస్తాయి. ధర్మాచరణలోని ధర్మసందేహాలు చెయ్యవలసిన పనిని చేసితినని సంతోషించడం కాని చెయ్యలేక పోయినందుకు విచారించడం కాని కర్త అయిన అహంకార ధర్మం.

ఈ అహంకారమే భోక్తననుకొని, అనుభవిస్తున్నా ననుకోవడంతో శీతోష్ణాలు రాగద్వేషాలు, సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలు ఉనికిని సంతరించుకుని బలపడుతున్నాయి. ఈద్వంద్వాల ప్రభావాన్ని భోక్తగా అహంకారమే అనుభవిస్తోంది. ఈ అహంకారం నశించినప్పుడే ద్వంద్వాలుకూడా నశిస్తాయి. మనఃకల్పితాలయిన ఈ ద్వంద్వాలు, అజ్ఞానజన్యమైన అహంకారానికి చెందినవి.

భూతమూ దానికి సంబంధించిన బాధలూ స్తంభాన్ని ఏవిధంగానూ

బాధింపజాలవు. అహంకారం ఆత్మమీద ఆరోపింపబడిన భ్రమ కావడంవలన ఆ అహంకారానికి చెందిన బాధలేవీ ఆత్మనైన నన్ను బాధించజాలవు. ఈ ఆరోపింప బడిన సర్వజగత్తుకు అధిష్ఠానమే నేను.

అయితే ఈ వస్తుమయ ప్రపంచాన్ని ఏ విధమయిన దృష్టితో చూడాలి? నాలో నీకు రెండుకొమ్ములు ఒక తోక కనిపించినప్పుడు నాకూ వాటికీ సంబంధం ఎలా ఉండాలి? నిజానికి అవి నాలో లేనేలేవు. వాటియెడ నేను ఉదాసీన భావాన్ని చూపించడం నీపైనా నీ అజ్ఞానం మీదా జాలిచూపడం కాదా? నాపై నీకుండే స్నేహం కొద్దీ వాటికి నూనెరాసి అందంగా చెయ్యాలనుకుంటే నేను తప్పకుండా ఒప్పుకుంటాను! లేని కొమ్ములకు నీవు రాసిన నూనె నన్నెలాగూ అంటదు, పైగా నాకు సేవచేసితినన్న తృప్తి నీకు దక్కుతుంది!!

ఈ దృక్పథం నీకు అర్థమయితే జ్ఞానులందరూ ప్రపంచంతో వ్యవహరించే తీరుకూడా తప్పకుండా అర్థం అవుతుంది. రాగరహితుడవై, త్యాగిగా, ఆత్మను ఆత్మగా చూస్తూ ఆరోపింపబడిన భ్రమను విడనాడి సదా శాంతంగా జీవిస్తాడు.

"త్యాగపరాః అవ్రతీ"--- ఇక్కడ అవ్రతీ అంటే ఏ వ్రతములనూ చెయ్యని వాడని అర్థం. ఏవైనా కోరికలున్నవారు అవి తీరడంకోసం వ్రతాల నాచరిస్తారు. కోరికలే లేనివారికి వ్రతంతో పని యేమిటి? ఇక్కడ అష్టావక్రులు ఈ పదాన్ని వాడి రాగరహితుడైనవ్యక్తి అనే అర్థాన్ని సూచించారు.

**మహోపనిషత్తులో ఇలా చెప్పబడింది**

నాకృతేన కృతేనార్థో న శ్రుతిస్మృతివిభ్రమైః
నిర్మందర ఇవాంభోధిః స తిష్ఠతి యథాస్థితః.

*ధర్మశాస్త్రాలు విధించిన ధర్మాచరణపట్ల ఉదాసీన భావం కలిగి, నిశ్చల గంభీరమయిన సముద్రంవలె, చైతన్యమయమయిన తన స్వరూపంలో స్థితిని కలిగి జ్ఞాని శాంతంగా జీవిస్తాడు.*

**శ్లో॥ కస్యాపి తాత! ధన్యస్య లోకచేష్టావలోకనాత్।**
**జీవితేచ్ఛా బుభుక్షాచ బుభుత్సోపశమం గతా॥2.**

**టీ॥** హేతాత = ఓ నాయనా! లోకచేష్టావలోకనాత్ = ఉత్పత్తి వినాశరూపమగు లోక స్వరూపక్రియలను చూచుటవలన, కస్య = ఒకానొక, ధన్యస్యాపి = ధన్యునకు మాత్రమే, జీవితేచ్ఛా = జీవింపవలెననెడి కోరిక, బుభుక్షా = భోగేచ్ఛ, బుభుత్సా = జ్ఞానం సంపాదించవలెననెడి అభిలాష, ఉపశమం = శాంతిని, గతా = పొందుచున్నది.

కుమారా! లోకాన్నర్థం చేసుకోవడం వలన జీవించాలని, అనుభవించాలనీ, తెలుసుకోవాలనీ కోరికలు నశించగా శాంతుడై జీవించే జ్ఞాని లోకంలో చాలా అరుదు. అట్టివాని జన్మ నిజంగా ధన్యమే.

అపారమయిన ప్రేమతో (తాత) కుమారా అని జనకుని సంబోధిస్తున్నారు మునీంద్రులు. తనచుట్టూ ఉన్న జీవితాన్ని, జీవితంలోని బాధలనూ, భయాలనూ ఆందోళననూ అశాశ్వతత్వాన్నీ, చూస్తూకూడా మనిషి జీవించాలనే కోరికనుండి బయటపడలేక పోతున్నాడు. మనశ్శరీరాలకు అవినాభావసంబంధం ఉంది. మనస్సే శరీరం, జీవించాలనీ ఇంద్రియాలతో విషయ భోగాలనుభవించాలనీ మనస్సు కోరుకుంటుంది. వాటిని తీర్చుకోవడం కోసం అనేకవిధాల శ్రమిస్తుంది, ఈ కోరికలలో కొన్నిమాత్రమే తీరి మిగిలిన వాటివల్ల అంతులేని అసంతృప్తి బయలుదేరుతుంది. తీరని కోరికల ఒత్తిడితో బుద్ధి పనిచేస్తుంది. తీరేవిధానం ఏమిటని ఆలోచించడం మొదలుపెట్టిన బుద్ధి క్రమంగా తీర్చేవారెవరనీ, కోరికలంటే ఏమిటనీ, కోరే నేనెవరనీ, కనబడే ప్రపంచం ఏమిటనీ, ఇలా అనంతంగా ప్రశ్నలు వేసుకుంటూ తెలుసుకోవాలనుకుంటుంది. బుద్ధి లక్షణమే తెలుసుకోగోరడం, తెలుసుకోగోరేబుద్ధి ఉన్నంతకాలమూ తెలియబడే ప్రపంచంకూడా ఉండనే ఉంటుంది.

మనశ్శరీరాలకి జీవితేచ్ఛ, బుభుక్షా, అంటే జీవించాలనీ అనుభవించాలనీ కోరికలు అసంఖ్యాకంగా ఉంటాయి. జీవితం అశాశ్వతం బాధామయం అని తెలిసినప్పటికీ, బుద్ధికి సంబంధించి తెలుసుకోవాలనే కోరిక-బుభుత్స విధిగా ఉంటుంది. మనచుట్టూ ఉన్న జీవితాన్ని ప్రపంచాన్నీ చూస్తూ కూడా ఈ కోరికలను విడిచిపెట్టలేకపోవడం ఆశ్చర్యకరం, విచారకరం!

అధిష్ఠానమయిన చైతన్యం, ఇంద్రజాల సదృశమయిన ప్రపంచంగా తెలుసుకోవాలనుకునే బుద్ధిలో తెలియబడే భావాలుగా, జగత్ జీవ ఈశ్వర భావాలతో విభ్రాంతిని కలిగిస్తున్నది. ఈ సత్యాన్ని అర్థంచేసుకుని భ్రమకూ అజ్ఞానానికీ మూలమయిన తెలుసుకోవాలనే కోరికను విడచిపెట్టి నిశ్చలబుద్ధితో శాంతంగా జీవించే మహాత్ములు చాలా అరుదుగా ఉంటారు. జీవితపు మిథ్యాత్వాన్ని అర్థంచేసుకుని నిర్లిప్తతతో ఉదాసీన భావంతో సాక్షిగా చూస్తూ శాంతంగా స్వస్థితిలో నిష్ఠకలిగిన అట్టి మహాత్ముల జీవితం ధన్యం. సాధారణంగా అందరూ జీవితేచ్ఛకూ బుభుక్షకూ, బుభుత్సకూ దాసులయ్యే ఉంటారు.

తెలుసుకోగోరే బుద్ధి బహిర్ముఖమయి బాహ్యప్రపంచాన్ని చూస్తున్నంతసేపూ తెలియబడేవి అనంతంగా ఉంటూనే ఉంటాయి. ఇదే బుద్ధి ఇదే లక్షణంతో అంతర్ముఖమయి శాస్త్రసహాయంతో సత్యాన్నన్వేషిస్తే క్రమంగా శాంతస్థితినంది స్వస్థితిలో నిలువగలుగుతుంది. ఇలా అంతర్ముఖమయిన బుద్ధి,జీవితేచ్ఛా బుభుక్షలనూ, విచక్షణతో వితరణగుణంతో చూసే మనస్ఫూర్తి కలిగిన వ్యక్తి మాత్రమే నిర్వేదాన్నీ, నిర్లిప్తతతనూ సంపాదించగలడు. మిగిలిన వారంతా దుఃఖాలయం అశాశ్వతం అయిన జీవితాన్ని చూస్తున్న గ్రుడ్డివారు, గ్రుడ్డిగా అను సరిస్తూనే ఉంటారు. ఏదో తెలుసుకోవాలనుకొంటూ, వింటూ, విన్నదాన్ని అర్థం చేసుకోలేని చెవిటివారు, అందుకే వింటున్నా తెలుసుకోవాలనుకుంటూనే ఉంటారు.

**శ్లో॥ అనిత్యం సర్వమేవేదం తాపత్రితయ దూషితమ్ ।**
**అసారం నిందితం హేయం ఇతి నిశ్చిత్య శామ్యతి ॥3.**

టీ॥ ఇదం=ఈ, సర్వం=సమస్తప్రపంచము, అనిత్యం=అనిత్యమైనది, తాపత్రితయ దూషితం = తాపత్రయముచేత దూషితమైనది, అసారం = సారహీనమైనది, నిందితం =నిందితమైనది, హేయం = హేయమైనది, ఇతి=ఇట్లని, నిశ్చిత్య=నిశ్చయించి, శామ్యతి = శాంతిని పొందుచున్నాడు.

**ఈ ప్రపంచం అనిత్యమని, మూడువిధములైన తాపంచే బాధింపబడేదనీ, సారహీనమని, దీనిని విడనాడితేనే శాంతి లభిస్తుందనీ తెలుసుకున్న జ్ఞాని నిత్యము సమచిత్తం కలిగి శాంతంగా ఉండగలడు.**

చూస్తున్న గుడ్డివాడుగా, వింటున్నా చెవిటివాడుగా, బుద్ధిని సద్వినియోగం చెయ్యకుండా జీవితాన్ని మానవుడు వృథాచేస్తున్నాడని కిందటి శ్లోకం లో అష్టావక్రులన్నారు. విషయభోగాలనభిలషించే జీవితం విషాదానికి లోను కావడాన్ని చూస్తూ కూడా మనిషి విరక్తుడవడం లేదు. జ్ఞాని అయినవాడు ఈ ప్రపంచాన్ని ఎటువంటిదృష్టితోచూస్తాడోఈశ్లోకంలో చెపుతున్నారు మునీంద్రులు.

అజ్ఞాని సమస్యలతో, సందేహాలతో, బాధలతో సతమతమవుతూ ఉంటాడు. జ్ఞాని సమత్వ బుద్ధికలిగి శాంతంగా జీవించగలుగుతాడు. ఈ జీవితం అనిత్యమనీ, బాధామయమనీ మూడు విధములయిన తాపములచే దహింపబడుతూ ఉంటుందనీ తెలుసుకునీ, మమకారామూ రాగబంధమూ లేకుండా సాక్షిమాత్రంగా వీక్షించగలుగుతాడు.

శరీరం మనస్సూ బుద్ధి వలన కలిగే బాధలను ఆధ్యాత్మికమనీ, బాహ్య ప్రపంచంనుండి సంక్రమించే కష్టాలను అధిభౌతికమనీ, ప్రకృతిపరంగా సంభవించే విఘాతాలను ఆధిదైవకమనీ అంటారు. ఈ మూడురకాల తాపాలచే జీవి నిత్యమూ దహింపబడుతూ ఉంటాడు.

**శ్లో॥కోऽసౌకాలో వయః కిం వా యత్ర ద్వంద్వాని నోऽనృణామ్।**
**తాన్యుపేక్ష్య యథా ప్రాప్త వర్తీ సిద్ధిమవాప్నుయాత్ ॥ 4.**

టీ॥ యత్ర = దేనియందు, నృణాం = మనుష్యులకు, ద్వంద్వాని = సుఖదుఃఖ ద్వంద్వములు, నో = లేవో, అసౌ=ఈ, కాలః=కాలము, కః=ఏది? వయః = వయస్సు, కిం = ఏది? అపి తు = అయితే, న కః అపి = ఏమియు లేదు , ఇతి = ఇట్లని, తాని = వాటినన్నిటిని, ఉపేక్ష్య = ఉపేక్షించి, యథా ప్రాప్తవర్తీ = యాదృచ్ఛికముగా వచ్చిన భోగముల ననుభవించుచూ, సిద్ధిం = సిద్ధిని, అవాప్నుయాత్ = పొందుచున్నాడు.

**మానవ జీవితంలో ద్వంద్వాల ప్రభావానికి లోనుకాని కాలమేది? వీటిని తటస్థంగా చూస్తూ, కావాలనే కోరికలేకుండా వచ్చినవాటిని నిరసించకుండా స్థిరత్వంతో జీవించేవానికి పూర్ణత్వం తప్పకుండా సిద్ధిస్తుంది.**

సుఖదుఃఖాలతో నిండిన ఈ జీవితంపై ఆకర్షణ ఉన్నంతవరకూ ద్వంద్వాలు మనిషిని బాధిస్తూనే ఉంటాయి. మనస్సుతో తాదాత్మ్యం చెంది జీవిస్తున్నంతకాలమూ శీతోష్ణాలు, మానావమానాలు, కలిమిలేములు, యిష్టాయిష్టాలు మొదలుగాగల అసంఖ్యాకములైన ద్వంద్వాలు దుర్భరమైన మనఃకల్లోలాన్ని సృష్టించి పెంచి పోషిస్తూనే ఉంటాయి. ఇక్కడ అష్టావక్రులు చెప్పినట్టుగా మనిషి జీవితంలో వీటి ప్రభావం లేనిదెప్పుడు? అహంకారం ఉన్నంతసేపూ ద్వంద్వాలు ఉండనే ఉంటాయి.

ఈ ద్వంద్వాల ప్రభావంనుండి తప్పించుకోవడానికి మనస్సుతోగల తాదాత్మ్యాన్ని విడనాడడం ఒక్కటే మార్గం. మనస్సును అధిగమించి,ద్వంద్వాలకతీతంగా నిలువగలగిన వ్యక్తిమాత్రమే పరిపూర్ణమైన శాంతితో జీవించగలడు. అట్టివానికి సంభవించే ఏ సంఘటననైనా సమత్వబుద్ధితో స్వీకరించగలుగుతాడు. "యథాప్రాప్తవర్తి". అట్టివానిలో అజ్ఞానజన్యమైన అహంకారం నశించి జ్ఞానం ప్రకాశిస్తుంది. ఇక్కడ మహోపనిషత్తులోని ఒక శ్లోకం జ్ఞప్తికి వస్తోంది.

సంతోషామృతపానేన యే శాంతా స్తృప్తిమాగతాః
ఆత్మారామా మహాత్మనస్తే మహాపదమాగతాః . (మహోపనిషత్తు 4-35)

*సంతోషం అనే అమృతాన్ని పానంచేసి శాంతిని తృప్తిని సాధించిన మహాత్ములు, ఆత్మజ్ఞానం పొంది, ఆత్మనిష్ఠులౌతారు.*

సుఖం ఉంటే దుఃఖం కూడా ఉండి తీరుతుంది. ద్వంద్వాలలో ఏ ఒక్కటి ఉన్నా రెండవది కూడా పక్కనే ఉంటుంది. ఇవి అయస్కాంతంలో ఉత్తర దక్షిణ ధృవాల వంటివి. అయస్కాంతం ఉందంటే, ఈ రెండు ధృవాలూ ఉండి తీరుతాయి. ఇదేవిధంగా అహంకారం, మనస్సూ ఉంటే ద్వంద్వాలు తప్పనిసరిగా ఉంటాయి. ఈ భావం ఎంతో అందంగా ఒక శ్లోకంలో ఇలా చెప్పబడింది.

సుఖస్యానన్తరం దుఃఖం దుఃఖస్యానన్తరం సుఖమ్
ద్వయమేతద్ధి జన్తూనామలంఘ్యం దినరాత్రివత్ .

*సుఖం తర్వాత దుఃఖం, దుఃఖం తరువాత సుఖం తప్పకుండా వస్తుంటాయి. ఏ ప్రాణికూడా వీటినుండి తప్పించుకోలేదు. ఇవి దివారాత్రా లంత సహజంగా వరుసక్రమంలో వస్తూనే ఉంటాయి.*

విచారంనుండి తప్పించుకోవాలంటే సంతోషంలోకి వచ్చితీరాలి. సంతోషం వద్దనుకుంటే విచారం వచ్చి తీరుతుంది. ఈ ద్వంద్వాలలో దేనిని కోరినా నిరాకరించినా రెండవది తప్పకుండా ఉండనే ఉంటుంది. సముద్రం లో తిన్నగా వెళుతున్నకొద్దీ తరంగాలను తప్పించుకోలేం. ఒకటి తర్వాత ఒకటి వస్తూనే ఉంటాయి అంతులేకుండా. ఇదే సముద్రంనుండి ఎత్తుగా విడిగా పోగలిగితే తరంగాలనుండి తప్పించుకోగలం. ఇదేవిధంగా మనస్సునుండీ అహంకారంనుండి విడివడగలిగితేనే ద్వంద్వాలప్రభావం అదృశ్యం అవుతుంది.

**శ్లో॥ నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాం తథా ।**
**దృష్ట్వా నిర్వేదమాపన్నః కో న శామ్యతి మానవః ॥ 5.**

టీ॥ మహర్షీణాం = మహర్షులయొక్కయు, సాధూనాం = సాధుపురుషుల యొక్కయు, తథా = అదేవిధముగ, యోగినాం = యోగుల యొక్కయు, నానామతం = భిన్నభిన్నములగు మతములను, దృష్ట్వా = చూచి, నిర్వేదం = వైరాగ్యమును, ఆపన్నః = పొందినవాడై, కః మానవః = ఏ మానవుడు, న శామ్యతి = శాంతిని పొందడు?

**ఎందరో మహానుభావులు-మహర్షులు, సాధువులు, యోగీశ్వరులు, వీరి ప్రవచనాలు అనేకవిధాలుగా కనిపించినా ఉన్న సత్యం ఒకటే అని తెలుసుకుని జ్ఞాని నిర్వేదంతో శాంతుడవుతాడు.**

ఎందరో మహానుభావులు తమ అనుభవాలను తెలియజెచ్చే ప్రయత్నం చేసేరు. మరెందరో మేధావులు వారి ప్రవచనాలను వ్యాఖ్యానించేరు. వీటితో తత్త్వశాస్త్రం శాఖోపశాఖలుగా బహుళంగా విస్తరించింది. వీటన్నిటినీ చూసిన సాధారణ సాధకుడు సందేహంలోపడి సంశయాత్ముడై సాధననే విస్మరించవచ్చు అందుకే ఆచార్యశంకరులు తమ "వివేకచూడామణి" లో ఇలా అన్నారు.

శబ్దజాలం మహారణ్యం చిత్త భ్రమణకారణమ్
అతఃప్రయత్నాజ్ఞాతవ్యం తత్త్వజ్ఞస్తత్త్వమాత్మనః (వివేకచూడామణి - 60)

శాఖోపశాఖలయిన ఈ తత్త్వశాస్త్రం తర్క వ్యాఖ్యలతో మహారణ్యంవలె దుర్గమమైనది. ఇందులో నుండి బయటపడడం మహాకష్టం. ఇందులోపడి మతి పోగొట్టుకోకుండా తెలివైన సాధకులు చైతన్యస్వరూపమైన ఆత్మను కనుగొని నిష్ఠను సంపాదిచుకోవాలి.

తెలివైన సాధకుడు అన్నిరకాల అభిప్రాయాలను వివేకవిచక్షణలతో సమీక్షించి బుద్ధికి పరిమితమైన జ్ఞానంతో, బుద్ధికతీతమూ ఆధారమూ అయిన చైతన్యం తెలియబడదనీ,సత్యాన్ని సూచించడమే బుద్ధికి పరమావధి అనీ గ్రహిస్తాడు. కాబట్టి నిజమైన సాధకుడు వాదప్రతివాదనలను తర్కాన్నీ విడచిపెట్టి, విభిన్న అభిప్రాయాలమీద విమర్శనాత్మకమైన నిర్లిప్తతకలిగి ఉంటాడు. వాదం అజ్ఞానాన్ని ప్రదర్శిస్తుంది. విచారణ విజ్ఞానాన్ని అన్వేషిస్తుంది. చిత్తశుద్ధికల్గిన సాధకులు గురువులద్వారా సత్యంగురించి శ్రవణంచేసి, విన్నదానిని మననం చేసి, పాండితీ ప్రకర్షమీద ప్రలోభంవీడి, వాద ప్రతివాదాల జోలికిపోక శాంతమూ, శుద్ధమూ చైతన్యస్వరూపమూ అయిన ఆత్మానుభవాన్ని సాధిస్తారు.

ఎందరో మహానుభావులు సత్యాన్ని ఎన్నో విధాలుగా వర్ణిస్తున్నప్పుడు ఎవరిని మార్గదర్శిగా ఎన్నుకోవాలి అనే సందేహం సహజంగా వస్తుంది. రాబోయే శ్లోకంలో దీనికి సమాధానమిస్తున్నారు మునివర్యులు.

**శ్లో॥ కృత్వా మూర్తిపరిజ్ఞానం చైతన్యస్య న కిం గురుః ।**
**నిర్వేదసమతాయుక్త్యా యస్తారయతి సంసృతేః ॥ 6.**

టీ॥ నిర్వేద=వైరాగ్యము, సమతా=సమత్వము, యుక్త్యా=యుక్తులచేత, చైతన్యస్య = చైతన్యముయొక్క, మూర్తి పరిజ్ఞానం = ఆకారవిశేషజ్ఞానమును, కృత్వా = చేసి, యః = ఎవడు, సంసృతేః=సంసారమునుండి, (స్వం = తనను), తారయతి = తరింపజేసికొను చున్నాడో, సః = అట్టివాడు, గురుః=గురువు, న కిం=కాడాయేమి? (అగుచున్నాడని భావము)

శుద్ధమైన చైతన్యస్వభావాన్ని తెలుసుకుని,తార్కికమూ, సమత్వమూ కలిగి బుద్ధితో, ప్రపంచంమీద నిర్వేదభావం కలిగి, జనన మరణ యుక్తమయిన సంసారచక్రంనుండి ముక్తుడయినవాడు మాత్రమే నిజమైన మార్గదర్శి కాగలడు.

వేదవేదాంగాలలో అపారమైన ప్రజ్ఞ ఉండడమే గురువు అర్హత నిర్ణయించదు. శాస్త్రపరిజ్ఞానం శ్రోత్రియత్వం వాంఛనీయమూ, ఆకర్షణీయమూ అయినప్పటికీ కేవలం అది ఒకటే చాలదు. ఆత్మానుభవనిష్ఠుడై నిర్వేదమూ, సమత్వమూ యుక్తి యుక్తమయిన బుద్ధిని కలిగియుండిన వ్యక్తిమాత్రమే నిజమైన మార్గదర్శి కాగలడు. అష్టావక్రులు అభిప్రాయములో బ్రహ్మనిష్ఠ కలిగిన జ్ఞాని మాత్రమే ఇతరులకు గురువు కాగల అర్హత కలిగినవాడు.

అర్హతలేని గురువును త్యజించమని గురుగీత అంటోంది. "జ్ఞానహీనో గురుస్త్యాజ్యో"---"స్వవిశ్రాంతిం న జానాతి, పరశాంతిం కరోతి కిం"----తనలో లేని శాంతిని పరులకు ఏవిధంగా ఇవ్వగలడు?

**శ్లో॥ పశ్య భూతవికారాం స్త్వం భూతమాత్రాన్ యదార్థతః ।**
**తత్ క్షణాద్బంధ నిర్ముక్తః స్వరూపస్థో భవిష్యసి ॥ 7.**

టీ॥ భూతవికారాన్ = భూతవికారములైన దేహేంద్రియాదులను, యదార్థతః = వాస్తవముగా, భూతమాత్రన్ = భూతమాత్రములనుగా, త్వం = నీవు, పశ్య = చూతువు గాక, తత్ క్షణాత్ = అట్లు చూచినవెంటనే, బంధనిర్ముక్తః = బంధమునుండి విడివడిన వాడవై, స్వరూపస్థః = స్వరూపస్థితియందున్న వాడవుగా, భవిష్యసి = కాగలవు.

**పంచమహాభూతాలు పరిణామం చెంది వస్తువులుగా మారినా, వాటి నుండి నిజానికి వేరుగాలేవు. ఇది తెలుకుంటే వాటి బంధంనుండి విడివడినట్టే. ఈ విధంగా బంధరహితుడవై స్వరూపంలో ముక్తుడవై నిలచిపో.**

మనచుట్టూ ఉన్న ప్రపంచమంతా పదార్థంతో నిర్మితపబడింది. ఆ పదార్థపు మూలాన్ని నిశితంగా పరిశీలిస్తే పంచభూతాలు పంచీకరణం చెంది పదార్థంగా రూపొందడమే కనిపిస్తుంది. ఏ వస్తువును పరీక్షించినా పంచభూతాలయిన పృథివి, జలము,అగ్ని, వాయువు ఆకాశము కానిదేదీ ఎక్కడా ఎందులోనూ గోచరించదు. బంగారంతో తయారుకాబడిన ఏ ఆభరణాన్ని చూసినా బంగారం తప్ప వేరేదేదీ కనిపించదు. నామరూపాలు మాత్రమే వేరుగా ఉంటాయి. ఇదేవిధంగా కనబడే ప్రపంచమంతా రాగద్వేషాలు అర్థరహితమనిపించి అదృశ్యమయిపోతాయి.

ఇంతవరకూ వస్తువులన్నీ నిజంగా ఉన్నాయనుకుంటూ, వాటి ప్రత్యేకతలను గుర్తించి, రాగద్వేషాలతో వానిని సంపాదించాలనికానీ వదిలించుకోవాలనికానీ నిత్యమూ శ్రమిస్తున్నాము. పదార్థపు యదార్థ స్వరూపం తెలుసుకున్నాక దేని మీదనైనా ప్రత్యేకదృష్టి ఎలా ఉండగలదు? అజ్ఞానంవల్ల కలిగిన రాగద్వేషాలు ఈ యదార్థ జ్ఞానంతో అంతరిస్తాయి. రాగద్వేషాలవల్ల ప్రేరేపింపబడి చేసే పనులూ, ప్రయత్నాలూ,శ్రమా అన్నీ వ్యర్థంగా కనిపించి త్యజించబడతాయి. ఆ స్థానే మనస్సులో అనంతశాంతి చోటుచేసుకుంటుంది. అశాంతి స్థానంలో అనంత శాంతి ఉదయించగానే ఆ ప్రకాశంలో, ఆలోచనల ఉరవడి తగ్గిన నిశ్చలత్వంలో శుద్ధమైన చైతన్యం స్వయంగా కేవలంగా భాసిస్తుంది. అహంకారం---అహం సర్వభూతాత్మ అని గ్రహించి ఆనందంగా మిగిలిపోతుంది.

**శ్లో॥ వాసనా ఏవ సంసార ఇతి సర్వా విముంచ తాః ।**
**తత్త్యాగో వాసనా త్యాగాత్ స్థితిరద్య యథా తథా ॥8.**

టీ॥ వాసనా ఏవ = వాసనలే, సంసారః = సంసారము, ఇతి = ఇట్లని, జ్ఞాత్వా = తెలిసికొని, తాః సర్వాః = ఆ వాసనలన్నింటినీ, విముంచ = విడువుము, వాసనా త్యాగాత్ = వాసనాత్యాగమువలన, తత్త్యాగః=ఆ సంసార త్యాగము గూడా అగుచున్నది, అద్య = ఇట్లయినపిదప, యథా = ప్రారబ్ధమెట్లున్నదో, తథా = తదనుసారమే, స్థితిః = శరీరస్థితి యగుచున్నది.

**కోరికలచేతనే ఈ ప్రపంచమంతా నిర్మింపబడి నడుపబడుతోంది. కాబట్టి కోరికలను త్యజించు, కోరికలను విడివగలిగితే ప్రపంచాన్ని విడచినట్లే. ఈ స్థితిలో నీవు ఎక్కడ నివసించినా ఒకటే, సమానమే.**

సూక్ష్మంగా, అంతర్గతంగా మనలో ఉండే వాసనలు మనస్సులో కోరికలు గానూ బుద్ధిలో ఆలోచనలుగానూ వ్యక్తం అవుతుంటాయి. అందుకే సాధారణంగా వాసనలను కోరికలు అని వాడుతూ ఉంటాం. అయితే నిజానికి కోరికల యొక్క బీజరూపమే వాసనలు. మనిషిలో ఉండే ఈ మొత్తం వాసనలను కారణశరీరమనీ, లింగదేహమనీ అంటారు. ఈ కారణ శరీరమే మనిషిలోని వ్యక్తిత్వంగా వ్యక్తమవుతూ ఉంటుంది. (కారణశరీరం--వ్యష్టిలోని మొత్తం వాసనలు కారణశరీరం అనబడతాయి సమిష్టిజీవుల సమష్టి వాసనలు మాయ అనబడతాయి. ఈ మాయగా వ్యక్తమయే ఆత్మచైతన్యమే ఈశ్వరుడు అనబడుతున్నాడు. "సర్వాః శరీరాభిమానీ, సమిష్టికారణ శరీరాభిమానీ పరమాత్మా ఈశ్వరః"--ఈ

సృష్టికి, స్థితికి, లయానికి కారణమయిన మహాశక్తి, అన్ని ప్రాణులలోనూ బయటా కూడా ఉంటూ ఈశ్వరుడుగా గుర్తింపబడుతున్నాడు.

మనశ్శరీరాలలో ఆలోచనలుగా, కోరికలుగా, క్రియలుగా వ్యక్తమయే ఈ ఆలోచనలే (వాసనలే) అహంకారాన్ని స్వార్థభావంతో బంధిస్తాయి. ఆ బంధంతో జనన మరణ యుక్తమైన జీవిత చక్రం క్రమం తప్పకుండా పరిభ్రమిస్తూ ఉంటుంది. "వాసనా ఏవ సంసారః"---ఈ వాసనలే సంసారానికి బీజం వంటివి. కోరికలు లేకుండా చేసుకోవడమే సంసారం నుండి బయటపడడం, వాసనారాహిత్యమే ముక్తి.

"అద్య"--ఇప్పుడు--కోరికలను త్యజించి,వాసనలను క్షయింపజేసుకున్న తరువాత, వ్యక్తికి సంపూర్ణ స్వతంత్రం లభిస్తుంది. అతడు ఎక్కడ ఏ విధంగా జీవించినా సంసారచక్రం అట్టివానిని బాధించదు, బంధించదు. యోగవాశిష్ఠంలో ముక్తి ఇలా వివరింపబడింది.

బన్ధో హి వాసనా బన్ధో మోక్షః స్యాద్ వాసనాక్షయః
వాసనాస్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపిత్యజ. (యోగవాశిష్ఠం)

*బంధం అంటూ ఉంటే అది మన వాసనలే. ఈ వాసనలు లేకపోవడమే ముక్తి. ముందుగా వాసనలన్నిటినీ క్షయింపజేసుకుని తరువాత ముక్తి కావాలనే కోరికను కూడా విడచిపెట్టు, నీ లక్ష్యాన్ని సాధించి గమ్యాన్ని చేరినట్టే.*

• • •

అధ్యాయం-10

# నిర్మమత్వం-వైరాగ్యం

ఉన్నదానిని వదలకుండా మరొకదానిని చేరలేం. ప్రస్తుత స్థితిని వదిలి ఉత్తమలక్ష్యాన్ని చేరుకోవడమే ప్రగతి అనబడుతుంది. అజ్ఞానాన్ని విడచిపెడితేనే జ్ఞానంలో ఉండగలుగుతాము. కోపోద్రేకాన్ని విడచిపెడితేనే శాంత స్థితిని అనుభవించగలుగుతాము. మాయను మిథ్యను విడిచిపెడితేనే సత్యదర్శనం సాధ్యమవుతుంది. ఈ కారణంచేతనే వేదాంత గ్రంథాలలోనూ, మత, ధర్మగ్రంథాలలోనూ కూడా వైరాగ్యావశ్యకత గురించి గట్టిగా చెప్పబడింది. కోరికలూ ఉద్రేకాలే మనస్సును అశాంతికి లోనుజేసి బాహ్యాభిముఖమయి తనచుట్టూ ఉండే ప్రపంచానికి బానిసగా ఉండేటట్లు చేస్తాయి. వైరాగ్యం అంటే "నాది అనే మమకారం లేకపోవడం నిర్మమత్వం అని అర్థం" వైరాగ్యభావంతో శరీరం మనస్సు బుద్ధులతో తాదాత్మ్యాన్ని విడువగానే మనం ఆత్మానుభవంలో ఉంటాం.

క్రిందటి అధ్యాయంలో అహంకారం అనుభవించే విషయాలపట్లా వస్తువులపట్లా మనస్సుకు ఉండవలసిన భావాన్ని గూర్చి చర్చించడం జరిగింది. నిరంతర పరిణామశీలం కలిగిన బాహ్య ప్రపంచవస్తువులపై నిర్వేదాన్ని, ఉదాసీనతను కలిగి ఉండాలని చెప్పారు. ఈ అధ్యాయంలో సాధకుని బుద్ధిలో ప్రపంచంపై ఉండవలసిన భావాన్ని గూర్చి వివరిస్తున్నారు. ఈ వివరణతో నిర్వేదానికి నిర్వచనం ఇస్తూ అదే వైరాగ్యంగా బుద్ధిలో ఉండాలని అంటున్నారు.

ఈ ప్రాపంచిక సుఖదుఃఖాలన్నీ కూడా అశాశ్వతమైనవి. మనలో పరిపూర్ణ శాంతి నిండుగా ఉండాలంటే ముందుగా అశాంతిని తొలగించి హృదయాన్ని ఖాళీగా ఉంచాలి. ఇందుకోసం కోరికలను ఉద్రేకాలను విడనాడాలి. అనాదిగా ఆచారపరంగా వచ్చే చతుర్విధ పురుషార్థాలయిన ధర్మం,

అర్థం, కామం, మోక్షం---వీటిని కూడా విడనాడాలి. మనలో ఉండే ఏ కోరికలయినాసరే ఈ నాలుగు రకాలుగానే ఉంటాయి. వీటికి విడిగా ఏ కోరికా ఉండజాలదు. ఇందులో చివరిదయిన మోక్షం మీద కోరికని కూడా చివరగా విడిచిపెట్టవలసినదే. కోరికఉంటే అశాంతి తద్వారా మిథ్యాసృష్టి ఉండక తప్పదు. కాబట్టి మోక్షం కావాలంటే చివరగా మోక్షం కావాలనే కోరికను కూడా విడవవలసే ఉంటుంది.

బ్రహ్మమాత్రమే సత్యము కనబడే జగత్తంతా ఐంద్రజాలికుని మాయా సృష్టివలె మిథ్యే. ధర్మ, అర్థ, కామ, మోక్షాలకోసం చేసే ప్రయత్నాలన్నీ కూడా ఈ మిథ్యలో భాగాలే. మోక్షం కావాలనే కోరికకూడా అజ్ఞాన జనితమే. కాబట్టి వీటన్నిటినుండి విడివడడమే ముక్తి. వైరాగ్య భావంవల్ల మాత్రమే ఇది సాధ్యమవుతుంది. మనలోని అజ్ఞానాన్ని ప్రకాశింపజేస్తూ మనకు తెలిసేలా చేస్తున్న మనలోని చైతన్యమే పరమాత్మ. కాబట్టే అజ్ఞానం కూడా మాయలో భాగమేనని ఇదివరకే చెప్పబడింది.

**అష్టావక్ర ఉవాచ :-**

**శ్లో॥ విహాయ వైరిణం కామం అర్థం చానర్థసంకులమ్ ।**
**ధర్మమప్యేతయోర్హేతుం సర్వత్రానాదరం కురు ॥1.**

టీ॥ వైరిణం = శత్రురూపమగు, కామం = కామమున్ను, చ = మరియు, అనర్థ సంకులం = అనర్థములతో నిండిన, అర్థం = అర్థమున్ను, విహాయ = విడిచిపెట్టి, ఏతయోః =ఈ రెండింటికీ, హేతుం = కారణమైన, ధర్మమపి = ధర్మమునున్ను, విహాయ = విడిచిపెట్టి, సర్వత్ర = ధర్మార్థ కామములయందును, వాటికి నిమిత్తములగు కర్మముల యందును, అనాదరం = అనాదరమును, కురు = చేయుము.

**కోరికను నీ శత్రువుగా భావించు, ఐశ్వర్యం అనర్థహేతువనీ, కోరికలను పెంచడానికి తోడ్పడుతుందనీ తెలుసుకో. ఈ కోరికలకు, ఐశ్వర్యానికీ కూడా ధర్మం మూలమని గుర్తించు, ఇలా గుర్తించడంలో కోరికను, సంపదను, ధర్మాన్నీకూడా, పరిమితులను ప్రయోజనాలను గుర్తించి, ఉదాసీన భావంతో పరిత్యజించు.**

సంప్రదాయబద్ధమైన హిందూజీవితం ధర్మ, అర్థ, కామ, మోక్షమనెడి నాలుగింటిని సాధించేదిగా నియమింపబడింది. ధర్మానికనుగుణంగా జీవిస్తూ

వీలయిన అర్థాన్ని సంపాదిస్తూ, వివేక వితరణలతో కోరికలను (కామం) తీర్చుకుంటూ, మోక్షాన్ని సాధించడమే మానవజీవిత పరమార్థం. ఇది సంభవం అయేలా చెయ్యడానికి జీవితాన్ని నాలుగు ఆశ్రమ విభాగాలుగా విభజించేరని ఇదివరకే చెప్పబడింది. అవి బ్రహ్మచర్య,గృహస్థ,వానప్రస్థ, సన్యాసాశ్రమములు.

మోక్షసాధన కుపయోగపడే జీవితానికి అర్థమైన గౌరవాన్నివ్వాలి. ఆ జీవితాన్ని పూర్తిగా సంతోషంగా జీవించాలి. ఆ విధంగా జీవితాన్ని మలచడాని కుపయోగపడే ధర్మానికి, సంతోషంగా జీవించడాని కవసరమయే అర్థకామాలకు కూడా అర్థమైన విలువ నిచ్చినప్పటికీ, వాటి పరిమితులను కూడా గుర్తించాలి. ధర్మ అర్థ కామాల ఆకర్షణలోనూ విలువలోనూ మునిగిపోయి మోక్షాన్ని విస్మ రించరాదు. వీటిని సాధించటంలో అహంకార మనోబుద్ధులు దృఢపడి, చివరలో వీటిని విడనాడడం కష్టతరం అయే ప్రమాదం ఉంది. అందుకే సాధకులను అష్టావక్రు లిచ్చట హెచ్చరిస్తున్నారు. ధర్మార్థ కామ మోక్షాల ఆవశ్యకతనూ, విలువనూ, అవధినీ, పరిమితినీ, ప్రయోజనాన్ని పూర్తిగా గుర్తిస్తూ జీవించడంలో వాటి బంధంనుండి బయట పడగలగాలి. అప్పుడే మోక్షం సాధ్యం అవుతుంది. ఈ అవగాహన సక్రమంగా లేనిపక్షంలో వానిలోనే బంధింపబడి ఉండిపోవడం జరుగుతుంది.

వేదాంత విద్యార్థికి "కోరిక" శత్రువు వంటిది. ఈ కోరికలు మనస్సును అశాంతితో నింపి లక్ష్యాన్ని మరపింప చేస్తాయి. విషయ భోగవాంఛలతోనూ ప్రయత్నాలతోనూ కాలం గడిచిపోతుంది. ధ్యానం కష్టసాధ్యమవుతుంది. అందుకనే కోరికలను శత్రువుగా భావించి అప్రమత్తతతో వ్యవహరించాలి. అర్థాన్ని సంపాదించడంలోనూ దాచడంలోనూ ఖర్చుచేయడంలోనూ కూడా మనస్సు అంతులేని అశాంతికి గురికాక తప్పదు. కాబట్టి జాగ్రత్త చాలా అవసరం. ధర్మా చరణలో పేరు ప్రతిష్ఠలు, సన్మానాలు, సంపదలూ వృద్ధి అయి మనస్సును అన్యాక్రాంతం చేసి లక్ష్యాన్ని విస్మరింపజేస్తాయి. వీటన్నిటి ప్రయోజనాలను పరిమితులనూ గుర్తిస్తూ, అర్థమైన విలువనిస్తూ పూర్తిగా జీవించడంలో మొత్తం కోరికలనుండి బయటపడగలగాలి. చివరగా మోక్షం కావాలనే కోరికను కూడా విడచిపెట్టాలి. కోరిక ఏ రూపంలో ఉన్నా అజ్ఞానం ఉందన్నమాటే.

అత్యున్నతమైన ఈ వైరాగ్యభావంతో ధ్యానించాలి. జీవితంలో ఏమీ సాధించలేని నిరాశతో భయపడి అన్నిటినీ వదిలివేయడం కాదిది. తనచుట్టూ

ఉన్న ప్రపంచాన్నీ తన జీవితాన్నీ పూర్తిగా అర్థం చేసుకోవడంతో పరిణతి చెందిన బుద్ధిలో వికసించిన అత్యున్నత భావమే వైరాగ్యము.

**శ్లో॥ స్వప్నేంద్రజాలావత్పశ్యత్ దినాని త్రీణి పంచవా ।**
**మిత్రక్షేత్ర ధనాగార దారదాయాది సంపదః ॥ 2.**

టీ॥ మిత్రక్షేత్ర ధనాగారదార దాయాదిసంపదః= మిత్రులు, క్షేత్రములు, ధనములు, భవనములు, స్త్రీలు, సోదరులు మొదలుగు సంపదలన్నియు, స్వప్నేంద్ర జాలవత్ = స్వప్నమువంటివనియు, ఇంద్రజాలమువంటివనియు, త్రీణి = మూడుగాని, వా =లేక, పంచ = ఐదుగాని, దినాని = దినములవరకే ఉండుననియు, పశ్య=చూడుము.

**అదృష్టవశాత్తు ప్రాప్తించిన మిత్రక్షేత్ర ఐశ్వర్య దారాసుతాది బంధు జాలాన్ని స్వప్నంవలె, ఇంద్రజాలంవలె మూడు లేక ఐదురోజులు ఉండేవిగా భావించి వ్యామోహాన్ని విడనాడు.**

క్రిందటి శ్లోకంలో చెప్పబడిన చతుర్విధ పురుషార్థాలయిన ధర్మార్థ కామమోక్షాలను సంపాదించడానికి మనస్సు నడిచే మామూలు మార్గంనుండి బయటపడడానికి వీలైన సూచనల నిస్తున్నారు. ఈ శ్లోకంలో తనచుట్టూ ఉన్న జీవితాన్ని ప్రపంచాన్నీ, జీవితపు విలువలను, లక్ష్యాన్నీ కూడా స్వప్నంవలె ఇంద్రజాలంవలె భావించడంలో మనస్సుకు వాటిపైనుండే వ్యామోహం తగ్గుతుంది. "దినాని త్రీణి పంచవా"---మూడు లేక ఐదు దినాలుగా----అనడంలో చాలా అల్పకాలం ఉండేవిగా భావించమని సూచిస్తున్నారు. వర్తమానంలో ఉన్నట్టు అనిపిస్తూ, నిత్యమూ పరిణామం చెందుతూ నశించే వస్తువులపై మమకారం పెరగకుండా ఉండడానికి ఈ భావన బాగా ఉపయోగపడుతుంది.

ఇంద్రియాల అనుభవక్షేత్రాల అనిత్యత్వాన్ని నిత్యమూ గుర్తుచేసుకుంటుంటే వైరాగ్యభావం పెంపొందుతుంది. ప్రాపంచిక సుఖసంతోషాలూ భోగాలూ అనిత్యమనిపించగానే నిత్యమైనదానిని సాధించాలనే భావం దృఢపడుతుంది, ఆ భావనతో విషయాలపై వైరాగ్యమూ పెరుగుతుంది.

**శ్లో॥ యత్ర యత్ర భవేత్తృష్ణా సంసారం విద్ధి తత్ర వై ।**
**ప్రౌఢవైరాగ్య మాశ్రిత్య వీతతృష్ణ స్సుఖీభవ ॥ 3.**

టీ॥ యత్ర యత్ర = ఏ యే విషయములయందు, తృష్ణా = ఆశ (కోరిక), భవేత్ = అగునో, తత్ర=అచ్చట, సంసారం = సంసారము, (ఉన్నదని), విద్ధివై = నిశ్చయముగా

తెలిసికొనుము, ప్రౌఢవైరాగ్యం = అసాధారణ వైరాగ్యమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, వీతతృష్ణః = తృష్ణారహితుడవై, సుఖీభవ = సుఖవంతుడవగుము.

**కోరిక ఉంటే ప్రపంచం ఉందని తెలుసుకో. ప్రగాఢమయిన వైరాగ్య భావంతో కోరికల నధిగమించి హాయిగా జీవించు.**

మన మహర్షులు తమ అనుభవంలో ఈ భావాన్ని ఎన్నిమార్లయినా విసుగులేకుండా చెప్పుతూనే ఉన్నారు. కోరికలు సృష్టించే మోహపు విలువలను జయించలేకపోతే, ఇంద్రియాలు కోరే విషయభోగాలను సంపాదించడానికి అనునిత్యమూ శ్రమపడుతూ జీవితాన్ని దుఃఖమయం చేసుకోవలసి వస్తుంది. భాగవతంలో పింగళ అనే వేశ్యని వర్ణిస్తూ ఇలా చెప్పబడింది.

ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖం
యధా సంఛిద్య కాంతాశం సుఖం సుష్వాపి పింగళా. (భాగవతం-11-8-44)

*కోరికే సర్వవికారాలకు మూలకారణం, కోరికలు లేకపోవడమే ఆనంద హేతువు. పింగళ తనవాంఛను ఆతృతను నశింపచేసికొని హాయిగా నిద్రపోగలిగింది. యోగవాశిష్ఠంలో కూడా ఇదేభావం ఎంతో అందంగా చిత్రీకరించబడింది.*

మనోరథరథారూఢం యుక్తమిన్ద్రియ వాజిభిః
భ్రామ్యత్యేవ జగత్ కృత్స్నం తృష్ణాసారధి చోదితమ్.

*మనస్సనే రథం మీద ఇంద్రియాలనబడే గుఱ్ఱాలచే లాగబడుతూ అహంకారం ప్రపంచమంతటా సంచరిస్తూ ఉంటుంది. కోరికే ఈ రథసారధి.*

**శ్లో॥ తృష్ణామాత్రాత్మకో బన్ధః తన్నాశో మోక్ష ఉచ్యతే ।**
**భవాసంసక్తి మాత్రేణ ప్రాప్తితృష్టిర్ముహుర్ముహుః॥ 4.**

టీ॥ తృష్ణామాత్రాత్మకః = తృష్ణామాత్రస్వరూపమే, బంధః = బంధము, తన్నాశః = ఆ తృష్ణానాశమే, మోక్షః=మోక్షమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది, భవాసంసక్తి మాత్రేణ = సంసారమునందాసక్తి లేకపోవుటచేత, ముహుర్ముహుః = మాటిమాటికి, ప్రాప్తితుష్టిః = ఆత్మప్రాప్తియు, తృప్తియు కలుగుచున్నది.

**కోరిక బంధహేతువు, తన్నాశమే ముక్తి. ప్రపంచంపట్ల వైరాగ్యభావం కలిగి ఉండడం వలననే ఆత్మానందం సాధింపబడుతుంది.**

కోరికలు నశిస్తే ఆలోచనలు ఆగిపోతాయి, మనస్సుకు పనే ఉండదు. మనస్సు లేనిచోట అహంకారం ఉండజాలదు. అహంకారం లేకపోతే నానాత్వమయమూ దుఃఖాలయమూ అయిన ప్రపంచాన్ని అనుభవించేవారెవరు? కాబట్టి ఆత్మానుభవానికి వైరాగ్యమే సక్రమమయిన మార్గము.

మహోపనిషత్తులో ఇదేభావం ఇలా విశదీకరింప బడింది.---- ""భోగేచ్ఛా మాత్రకోబన్ధస్తత్ త్యాగో మోక్ష ఉచ్యతే""---విషయభోగవాంఛలే బంధము, వాటిని త్యజించడమే ముక్తి అనబడుతుంది.

**శ్లో॥ త్వమేక శ్చేతనః శుద్ధః జడం విశ్వమసత్తథా ।**
**అవిద్యాపి న కించిత్సా కా బుభుత్సా తథాపి తే ॥5.**

టీ॥ త్వం = నీవు, ఏకః = ఒకడవు (అద్వితీయుడవు), శుద్ధః = శుద్ధుడవు, చేతనః = చైతన్యస్వరూపుడవు, విశ్వః = ప్రపంచము, జడం = జడస్వరూపము, చ = మఱియు, అసత్ = అసత్తు, తథా = ఆ ప్రకారము, సా = ఆ, అవిద్యా = అవిద్య, అపి = కూడ, నకించిత్ = ఏమియులేనిది, తథా అపి = అట్లయినప్పటికి గూడ, తే = నీకు, బుభుత్సా = బోధగొనవలెననెడి యిచ్ఛ, కా = ఎక్కడిది?

**శుద్ధమైన చైతన్యస్వరూపమే నీవు. ఈ ప్రపంచమంతా జడం, మిథ్య, అజ్ఞానానికి ఉనికేలేదు. ఇంకా నీవు దేనిని తెలుసుకోవాలనుకుంటున్నావు?**

గత నాలుగు శ్లోకాలలోనూ మనం విడువవలసిన వాటినిగూర్చి చెప్పిన అష్టావక్రులు ఇప్పుడు సాధకునిలోగల ఆత్మస్థానాన్ని సూచించే ప్రయత్నం చేస్తు న్నారు. దానితో తాదాత్మ్యం చెందడం అంటే మిగిలిన వాటన్నిటినీ త్యజించడమే.

మన సహజసిద్ధమైన స్థితి ఆత్మ--ఈ ఆత్మ, చైతన్యస్వరూపమే, మిగిలిన ప్రపంచమంతా జడమే అయినప్పటికీ ఆత్మప్రకాశంలో పనిచేస్తున్నట్టుగా కనిపిస్తుంది మిథ్య,జడము,నామరూపాత్మకమయిన ఈ ప్రపంచంలో అధిష్ఠానమయిన ఆత్మ మాత్రమే సత్యమైనది. శుద్ధ చైతన్యజ్యోతి స్వరూపమయిన ఆత్మలో అజ్ఞానాంధ కారం ఉండజాలదు. అని చెప్పిన గురువర్యులు "తెలివినంతా ఉపయోగించి బుద్ధితో ఇంతకన్నా అర్థం చేసుకోవలసినదేమున్నది అని అడుగుతున్నారు. శాస్త్రాలసహాయంతో అర్థం చేసుకోవలసినదంతా ఇదే. ఆత్మానుభవాన్ని కోరే నిజమైన సాధకునికి ఇంతకంటే తెలుసుకోవలసిన తేదీలేదు. శబ్దజాల మహారణ్య మనదగిన తత్త్వశాస్త్రి చర్చలతో మీమాంసలతో, తర్క వితర్కాలతో పాండిత్యాన్ని పెంచుకుంటే అజ్ఞానజనితమయిన అహంకారం పెరుగుతుందేతప్ప, ఆ పాండిత్యం సత్యదర్శనాని కుపయోగపడదు.

చెప్పవలసినదంతా చెప్పి శిష్యునికి సలహా యిస్తున్నారు మహర్షి. మనస్సులోని కోరికలనుండీ, శారీరక ఆకర్షణలనుండీ బయటపడిన సాధకుడు బుద్ధిలోని తెలుసుకోవాలనే అంతులేని కోరికచే బంధింపబడే ప్రమాదం ఉంది.

అందుకే హెచ్చరిస్తున్నారు. శాస్త్రసారాన్ని గ్రహించి మననంచేసి అనుభవం లోకి తెచ్చుకోవాలేగాని, అనవసర తర్కవితర్కాలతో పాండితీ ప్రకర్షకూ ప్రలోభానికీ లోనుకారాదు. మహోపనిషత్తు నిర్దుష్టంగా ఇలా చెప్తోంది.

నాహం న చాన్యదస్తీహ బ్రహ్మైవాస్మి నిరామయమ్
ఇత్థం సదసతోర్మధ్యాత్ యః పశ్యతి స పశ్యతి. (మహోపనిషత్తు5-60)

*వ్యక్తిగా విడిగా నేనుగాని నానుండి వేరుగా మిగిలినవారుగాని నిజానికి లేనేలేరు. నిష్కళంకమైన ఆత్మచైతన్యమే నేను, ఈ విధంగా వ్యక్తావ్యక్తల మధ్యగా రెండింటినీ వ్యక్తపరచే చైతన్యంగా తననుతాను గుర్తించినవాడే సత్యద్రష్ట.*

శ్లో|| రాజ్యం సుతాః కళత్రాణి శరీరాణి సుఖానిచ ।
సంసక్తస్యాపి నష్టాని తవ జన్మని జన్మని ॥ 6.

టీ|| రాజ్యం = రాజ్యము, సుతాః = పుత్రులు, కళత్రాణి=భార్యలు, శరీరాణి= దేహములు, చ = మఱియు, సుఖాని = సుఖములు, సంసక్తస్య = ఆసక్తిగలవానికి, నష్టాని = నష్టములగుచునే యున్నవి, తవ అపి = నీకుగూడ, ఏతే = ఇవన్నియు, జన్మని జన్మని = ప్రతిజన్మమునందును, నష్టాని = నశించుచునే యున్నవి.

**రాజ్యభోగాలు, దారాపుత్రాదులు,సంపదలు,శరీరాలు అన్నిటిని అనేక జన్మలనుండి పోగొట్టుకుంటూనే ఉన్నావు, వాటిని నీవెంతగా ప్రేమించినా నిలబెట్టుకోలేక పోయావు.**

క్రిందటి శ్లోకంలో నిగూఢమైన తత్వార్థం స్పష్టంగా చెప్పబడింది. సాధకుడు సాధ్యమనబడే ఆత్మకన్నా వేరుకాడు, జడము మిథ్య అయిన ప్రపంచం తోగాని ఉనికేలేని అజ్ఞానంతోగాని అతనికి ప్రమేయమేలేదు, తత్త్వజ్ఞులచే ఆత్మ ఇలా నిర్వచింపబడింది.

స్థూలసూక్ష్మకారణ శరీరాత్ వ్యతిరిక్తో అవస్థాత్రయః
సాక్షీ సచ్చిదానంద స్వరూపో యస్తిష్ఠతి సః ఆత్మా.

*స్థూలసూక్ష్మ కారణ శరీరాలకు భిన్నంగా, జాగ్రత్ స్వప్నసుషుప్తి అవస్థలకు సాక్షిగా, సత్ చిత్ ఆనందస్వరూపంగా మనలో ఉన్నదే ఆత్మ.*

సామాన్యులకు కూడా అర్థం అయేవిధంగా ఇక్కడ అష్టావక్రులు వైరాగ్యావశ్యకతను దృక్పథాన్నీ తర్కబద్ధంగా న్యాయసమ్మతంగా వివరిస్తున్నారు. 'రాజ్యభోగాలు దారాపుత్రాదులు సంపదలు'---వీటన్నిటినీ అనేక జన్మలనుండి

ప్రేమిస్తూ నిలుపుకోవడానికి ప్రయత్నిస్తూ కూడా దేన్నీ నిలుపలేక పోయాము. ప్రతీజన్మలోనూ అన్నీ మన యిష్టానికి వ్యతిరేకంగా నశిస్తూనే ఉన్నాయి. కాబట్టి అనిత్యమైన ఈ విషయాలపై వ్యామోహం వీడడం తెలివైన వారి లక్షణం. సృష్టింప బడిన ప్రతీదీ నశించి తీరుతుంది. దాని ధర్మమే అది. తెలివైనవారెవరూ మిథ్యా ప్రపంచంపై మమతా మోహాలను పెంచుకోరు.

**శ్లో॥ అలమర్థేన కామేన సుకృతేనాపి కర్మణా ।**
**ఏభ్యః సంసారకాంతారే న విశ్రాన్త మభూన్మనః ॥ 7.**

**టీ॥** అర్థేన = అర్థముచేతను, కామేన = కామముచేతను, సుకృతేన కర్మణా = పుణ్యకర్మచేతను, అలం=చాలును, తథా అపి = అయినప్పటికీ, ఏభ్యః = ఈ మూడింటి నుండియు, సంసారకాంతారే = సంసారారణ్యమునందు, మనః = మనస్సు, విశ్రాంతం = విశ్రాంతిని పొందునదిగా, నా భూత్ = కాలేదు.

**ఇప్పటికి అనుభవించబడిన ఈ కోరికలు, సంపదలు, ధర్మకార్యాలు చాలు! ఈ ప్రపంచం అనబడే మహారణ్యంలో మనస్సుకు ఎక్కడా శాంతి లభించడం లేదు.**

క్రిందటి శ్లోకంలో భావాన్నే కొనసాగిస్తూ----ఈ కోరికలు, సంపదలు ధర్మాధర్మాలు, అనుభవాలు అన్నీ వ్యర్థమని, ఆత్మమాత్రమే నిత్యమూ శాశ్వతమూ అని చెప్పుతున్నారు. ఎండమావులవెంట నీటికై పరుగెట్టినట్లు వాటిపై మోహాన్ని పెంచుకోకు. సంపదలతో కోరిక లనంతంగా పెరుగుతున్నాయి. ఈ కోరికలు తీరడంతో సంతృప్తిచెందిన మనస్సు ఇప్పటికి లేనేలేదు. ఒక కోరిక తీరిన సంతోషం అనేక ఇతర కోరికలకు కారణమవుతున్నది. ధర్మకార్యాలుచేసి సంపాదించిన పుణ్యంతో ఐశ్వర్యాన్ననుభవిస్తున్నావు. దానితో కోరికలు అసంఖ్యాకంగా పెరుగుతూనే ఉన్నాయి. అవి తీరడానికి మరల ధర్మం శరణ్యం అవుతున్నది. ధర్మంతో ఐశ్వర్యం, సుఖం, కోరికలు, మళ్ళీ ధర్మం ఇలా నిరంతరమూ పరిభ్రమించే సంసార చక్రంనుండి బయటపడడం అసాధ్యం అవుతున్నది. ఈ నిజాన్ని గుర్తించి వైరాగ్యదృష్టితో శాంతుడవై జీవించు.

**శ్లో॥ కృతం న కతి జన్మాని కాయేన మనసా గిరా ।**
**దుఃఖమాయాసదం కర్మ దద్యాప్యుపరమ్యతామ్ ॥8.**

టీ॥ కతి = ఎన్ని, జన్మాని = జన్మముల నుద్దేశించి (జన్మలనుండి), కాయేన = శరీరముచేత, మనసా = మనస్సుచేతను, గిరా = వాక్కుచేతను, దుఃఖం = దుఃఖమును కలుగజేయునట్టియు, ఆయాసదం = శ్రమను కలుగుజేయునట్టియు, కర్మ = కర్మ, న కృతం = చేయబడలేదు, ఇతి = ఇట్లని (నిశ్చయించి), తత్ = ఆ కర్మ, అద్యాపి = ఇప్పుడైనను, ఉపరమ్యతాం = విరమింపబడుగాక!

**అనేక జన్మలనుండి మనశ్శరీరాలతో కష్టతరమూ బాధాయుతమూ అయిన పనులను చేస్తూనే ఉన్నావు, ఇకనైనా ఇప్పటినుండీ నీ ప్రయత్నాలను అపుచెయ్యి.**

గీతలో ఎంతో స్పష్టంగా, ఏ విధంగా స్వార్థపూరిత తామసిక కర్మలు దుఃఖాలను ప్రసాదిస్తాయో వివరింపబడింది. సత్వ రజో గుణాలతో స్వార్థరహితంగా కర్మలనుచేసి సుఖాలను సాధించినప్పటికీ అవి కూడా బంధహేతువులై సంసారానికి బంధీలను చేస్తున్నాయి. స్వార్థరహితమైన ధర్మకర్మలవల్ల సత్వగుణం వృద్ధిచెంది మనస్సు శాంతంగా ఉండడం నిజమే. ఆ శాంత మనస్సు శాస్త్రార్థాన్ని చక్కగా గ్రహించగలుగుతుంది, ధ్యానించగలుగుతుంది. ఏమయినా ఈ ఫలితాలన్నీ కూడా అనిత్యమైనవే, మిథ్యలో భాగాలే అని తెలిసిన జ్ఞాని వాటిపై వైరాగ్య భావం కలిగి ఉంటాడు.

ఎంతో సమర్థతతో ధర్మశాస్త్ర సమ్మతంగా, మనంచేసే మంచిపనులన్నీ కూడా మధ్య మధ్య సంతోషాన్ని చూపిస్తున్న విచారావృత జీవితాలను ప్రసాదిస్తున్నాయి.

ఇలా వివేకవంతంగా ఆలోచించగలగే సాధకునికే అష్టావక్రులు చెప్పుతున్నారు. "తదద్యాప్యుపరమ్యతాం"--ఇకనుండైనా నీ ప్రయత్నాలను మానుకో!

యోగవాశిష్ఠంలో కూడా ఇటువంటి సలహా ఇవ్వబడింది.

భుక్త్వా వర్షసహస్రాణి దుర్భోగపటలీమిమామ్
ఆబ్రహ్మస్తంబపర్యంతం న తృప్తిరుపజాయతే.

సామ్రాజ్యం సుచిరం కృత్వా తథా భుక్త్వా వధూగణం
భుంక్త్వా పరబలానుచ్చైః కిమపూర్వమవాప్యతే.

ప్రాప్తేన యేన నో భూయః ప్రాప్తవ్యమవశిష్యతే
తత్ప్రాప్తౌ యత్నమాతిష్ఠేత్ కష్ట్యాపి హి చేష్టయా.

(యోగవాసిష్ఠం- నిర్వాణ ప్రకరణం)

వేలకొద్దీ సంవత్సరాలు ఎటువంటి విషయ భోగాల ననుభవించినా, బ్రహ్మనుండీ గడ్డిపోచవరకూ ఎవరూ ఎప్పుడూ తృప్తిపడలేదు. సామ్రాజ్యాల నేలినా, శత్రుసంహారం చేసినా, సౌందర్యవంతులైన భార్యలతో సంపదలతో జీవితాన్ని గడిపినా, చివరకి లాభించేదేమిటి? దేనిని సంపాదిస్తే మరి దేనినీ సంపాదించవలసిన అవసరంలేదో అట్టి ఆత్మ పదాన్ని సాధించడానికి నీ సర్వ ప్రయత్నాలు ధారపొయ్యి, ఆ ప్రయత్నానికి నీ జీవితాన్ని అంకితం చెయ్యి!

...

## అధ్యాయం-11

# ఆత్మ - జ్ఞానస్వరూపము

ఈ అధ్యాయంలో ఆత్మ చిత్స్వరూపంగా వర్ణింపబడింది. ఈ చైతన్యం సర్వవ్యాప్తం, సర్వగతం. దీనికంటే వేరుగా రెండవదేదీలేదు. ఇది నిత్యశాంత నిశ్చలతత్వం. ఈ శుద్ధమయిన ఆత్మ చైతన్యప్రకాశంలో ప్రపంచం ఉన్నట్టుగా తెలియబడుతున్నది. ఈ ఆత్మ కేవలంగా ఆనందంగా ఉంది. నిజంగా తెలివైన అహంకారం, తను ఆత్మకంటే వేరుకాదని తెలుసు కున్నప్పుడు బాహ్యప్రాపంచిక భోగాలపై ఆసక్తిని విడనాడి శాంతంగా ఉంటుంది.

గీతలో బోధింపబడిన "కర్మలో అకర్మ--అకర్మలో కర్మ" సిద్ధాంతాన్ని అష్టావక్రుడు ఆమోదించి తన గీతలో ఎంతోస్పష్టంగా వివరించేరు. ఈ అధ్యాయాన్ని జ్ఞానాష్టకంగా భావించవచ్చు. జ్ఞానస్వరూప వర్ణనే ఈ అధ్యాయపు ధ్యేయంగా కనిపిస్తుంది. నిత్యమూ సత్యమూ అయిన శాంత స్థితి ఆత్మలో మాత్రమే లభించగలదు. ఈ ఆత్మానుభవాన్ని సాధించడాని కనువైన జ్ఞానాన్ని ఈ అధ్యాయంలో వివరిస్తున్నారు. చిన్నదిగా కనిపిస్తున్న ఈ జ్ఞానాష్టకంలో జీవన్ముక్తుని స్వభావం చక్కగా వర్ణించబడింది. ఇంతే కాకుండా సాధకులు లక్ష్యసాధన కర్తవ్యమైన సూచనలు కూడా స్పష్టీకరించ బడ్డాయి. మనచుట్టూ కనిపించే ప్రపంచపు యదార్థతత్వం బాగా అవగాహన అయితేనే, మోహపు విలువలు తగ్గి, నిర్వేదము వైరాగ్యము అంకురిస్తాయి. ఈ వైరాగ్య దృక్పథం అలవడి నిర్వేదంతో చూసినప్పుడే, సమత్వభావంతో సునిశితమూ సూక్ష్మమూ అయిన ధ్యానం సాధ్యమవుతుంది.

అష్టావక్ర ఉవాచ :-

శ్లో॥ భావాభావవికారశ్చ స్వభావాదితి నిశ్చయా ।
నిర్వికారో గతక్లేశః సుఖేనైవోప శామ్యతి ॥ 1.

టీ॥ భావాభావ వికారః = భావముయొక్కయు అభావము యొక్కయు వికారము, స్వభావాత్ = స్వభావమువల్లనే, (భవతి = అగుచున్నది). ఇతి=ఈ ప్రకారము, నిశ్చయీ = నిశ్చయముగలవాడు, నిర్వికారః = వికారరహితుడును, గతక్లేశః = క్లేశ రహితుడై, సుఖేన = సుఖముగా, ఉపశామ్యతి = శాంతిని పొందుచున్నాడు.

**నామం, రూపం కలిగినదేదయినా సరే మార్పుచెంది నశిస్తుంది. ఇది సృష్టిధర్మం అని తెలిసినవానిని దుఃఖం బాధించదు. నిత్యమూ శాంతంగా ఉండగలడు.**

కనిపించే జగత్తును భౌతికశాస్త్రపరంగా, వైజ్ఞానికంగా అర్థం చేసుకుని పదార్థపు యదార్థ స్వరూపం అవగత మవుతుంది. ఈ అవగాహనతో వస్తువు లను ఉపయోగదృష్టితో చూచి అనవసర వ్యామోహాన్ని విడువగలుగుతాము. మోహపు విలువలను విడచి యదార్థాన్ని యథాతథంగా చూడడంతో, ప్రగాఢమూ నిగూఢమూ అయిన జీవిత సత్యాలను దర్శించే వీలు కలుగుతుంది. బుద్ధిలో ఏర్పడే విలువలను, విజ్ఞానాన్నిబట్టి, మనశ్శరీరాలు ప్రవర్తిస్తూ ఉంటాయి. ఈ విలువలను సద్విలువలుగా మలచడానికి ఎనిమిది పాఠాల నందిస్తున్నారిక్కడ మహర్షి. జ్ఞానియొక్క స్వభావ శీల ప్రవర్తనలను దృశ్యచిత్రంగా రూపొందిస్తూ మనలను కూడ జ్ఞానివలె తీర్చిదిద్దుతున్నారు.

శాస్త్రాన్ని అధ్యయనం చేస్తూ,నిశితమూ,నిర్దుష్టమూ అయిన విధానంతో మననంచేస్తూ, ఉపనిషద్ ఋషుల భావాలను స్వజ్ఞానంగా చేసుకుంటూ, ఆ దృక్పథంతో ప్రపంచాన్నీ జీవితాన్నీ చూస్తూ ఉండాలి. శాస్త్రాన్ని స్థూలంగా పైపైన అర్థం చేసుకోవడంవల్ల అంతగా ప్రయోజనం ఉండదు. పాండిత్యం సంపాదించినా ఆధ్యాత్మికాభివృద్ధికి దోహదం చేయదు, శాస్త్రహృదయాన్ని అర్థం చేసుకుని, ఆ దృక్పథంతో జీవిస్తూ, జీవితాన్నీ ప్రపంచాన్నీ అర్థం చేసు కోవడంతో మన మనశ్శరీరాలు బాహ్యప్రపంచంతో వ్యవహరించే విధానమే మారిపోతుంది.

ఈ ప్రపంచం నిత్య పరిణామశీలి అనీ, పుట్టిన ప్రతీవస్తువూ నశించే తీరుతుందనీ నిశ్చయజ్ఞానం కలిగిన వ్యక్తి మనస్సు శాంతంగా స్థిర గంభీరంగా ఉంటుంది. సముద్రతీరమున కూర్చుని అలలు ఎప్పటికీ తగ్గడంలేదే అని తెలివైన వాడెవడూ విచారించడు. సముద్రపు స్వభావమే అది అని దృఢజ్ఞానంతో దృఢ చిత్తుడై ఉంటాడు. ప్రతిదినమూ సూర్యుడు ఉదయించడం గురించి అస్తమించడం

గురించి మనమెవరమూ బాధపడడంలేదు. అలా జరగడం అత్యంత సహజం అని మనందరికీ నిశ్చయంగా తెలియడమే అందుకు కారణం.

ఇదేవిధంగా వేదాంతసాధకుడు, సముద్ర తరంగాలవలెనే ప్రపంచం కూడా అనుక్షణమూ మార్పుచెందుతూ ఉంటుందన్న దృఢజ్ఞానం కలిగి ఉంటాడు. కాబట్టి అతని మనస్సు ప్రకృతిలోని పరిణామాలకు చలించకుండా వ్యామోహ పడకుండా, ప్రతిక్షణమూ ప్రశాంతంగా జీవించగలుగుతాడు.

యోగవాశిష్టం ముక్తకంఠంతో ఇలా ఘోషిస్తుంది.

ఇమా విచిత్రాః కలనాః భావాభావమయాత్మికాః
దుఃఖాయైవ తవోగ్రాయ న సుఖాయ కదాచన. (యోగవాశిష్ఠం-52-12)

*అంతులేని ఈ ఆలోచనా తరంగాలు ఉద్భవిస్తూ లయమవుతూ ఉన్నంత సేపూ నీకు దుఃఖమేగాని సుఖం లేదు.*

**శ్లో॥ ఈశ్వరస్సర్వ నిర్మాతా నేహాన్య ఇతి నిశ్చయీ ।**
**అంతర్గళిత సర్వాశః శాంతః క్వాపి న సజ్జతే ॥ 2.**

టీ॥ ఇహ=ఈ ప్రపంచమునందు, సర్వనిర్మాతా=సమస్తమును ఉత్పత్తి చేయువాడు, ఈశ్వరః = ఈశ్వరుడు, అన్యః = ఇతరుడెవడును, న = కాడు, ఇతి = ఇట్లని, నిశ్చయీ = నిశ్చయముగల పురుషుడు, అంతర్గళిత సర్వాశః = అంతఃకరణమునందు నశించి పోయిన సమస్తాశలు గలవాడై, శాంతః = శాంతుడై, క్వ అపి = యెక్కడను, న సజ్జతే = ఆసక్తుడు కాడు.

**ఈ కనబడే సృష్టి అంతా ఈశ్వర నిర్మితమై, వేరుగా రెండవదిలేదు అనే నిశ్చయ జ్ఞానం కలిగిన సాధకునికి కోరికలు నశించి శాంతుడై ఉంటాడు. ఈ జ్ఞానంతో అతడు దేనినీ కోరలేడు. ప్రలోభపడజాలడు.**

అనంతసత్యంనుండి నానాత్వ ప్రపంచదృశ్యం ఉద్భవించింది. ఈ దృశ్యప్రపంచం తనమూలంకంటే భిన్నంగా ఉండజాలదు. సృష్టికర్తా సృష్టీ కూడా ఏకమైన సత్యం యొక్క విభిన్న వ్యక్తరూపాలు మాత్రమే. బంగారంతో చేయబడిన నగలన్నీ నామరూపాలు వేరుగా ఉన్న బంగారమే.

మనస్సులో ఆలోచనా తరంగాలు కదలడం తత్ఫలితంగా బాహ్య ప్రపంచం కనబడడం, అన్నీకూడా చైతన్యంలోనే ఉంటూ చైతన్యంలోనే తెలియబడుతున్నాయి. దీనిని అర్థం చేసుకున్న సాధకుడు, కోరదగినదేదీ వేరుగా

లేదనీ తెలిసి కోరికలను విడనాడి శాంతుడై ఉంటాడు. తనకంటే భిన్నంగా రెండవదేదీ లేనప్పుడు కోరదగిన దేముంటుంది? కోరికలే లేనప్పుడు రాగభావం ఎలా ఉంటుంది? తానే సర్వంగా భావిస్తూ తెలియబడుతూ తెలుసుకుంటున్నానని తెలిసినవానికి కోరికగానీ రాగద్వేషాలు కానీ ఉండడం అసంభవం, అనూహ్యం అనవసరం.

ఈ శ్లోకాల ద్వారా జ్ఞానియొక్క దృష్టితో మనం ప్రపంచాన్ని చూస్తున్నామని మరిచిపోకూడదు.

**శ్లో॥ ఆపదః సంపదః కాలే దైవాదేవేతి నిశ్చయీ ।**
**తృప్తః స్వస్థేంద్రియో నిత్యం న వాంఛతి న శోచతి ॥ 3**

**టీ॥** కాలే = కాలమునందు, (ఆకాలము వచ్చునప్పుడు), ఆపదః = ఆపదలును, సంపదశ్చ = సంపదలును, దైవాత్ ఏవ = అదృష్టమువల్లనే (భవన్తి = కలుగుచున్నవి), ఇతి = ఈ ప్రకారముగా, నిశ్చయీ = నిశ్చయముగలవాడు, నిత్యతృప్తః = ఎల్లప్పుడు సంతోషముగలవాడై, స్వస్థేంద్రియః = ఉపశమించిన ఇంద్రియములు గలవాడై, న వాంఛతి = అప్రాప్తవస్తువులను కోరడు, న శోచతి = నష్టమయిపోయిన వస్తువులను గూర్చి దుఃఖింపడు.

**ప్రారబ్ధానుగుణంగా కష్టసుఖాలు, అర్హమైనకాలంలో ప్రాప్తిస్తున్నాయని నిశ్చయంగా తెలిసిన జ్ఞాని రాగద్వేషాలకు లోనుగాక, నిశ్చల మనస్సుతో వచ్చిన సంఘటలను ఆయా సమయాలలో ప్రసాదబుద్ధితో స్వీకరిస్తూ శాంతుడై జీవిస్తాడు.**

"యద్భావం తద్భవతి"-మన సుఖదుఃఖానుభవాలు మన దృక్పథంపై ఆధారపడి ఉంటాయి. అన్నీ తనకనుకూలంగా సుఖకరంగా ఉన్నా, ఉన్నదానితో తృప్తిపడక, ఏదో ఒక దానికోసం తాపత్రయపడుతూనే ఉంటారు కొందరు. అన్నీ బాధామయ పరిస్థితులే అయినా వాటిమధ్య కూడా శాంతంగా ఆత్మవిశ్వాసంతో జీవిస్తారు మరికొందరు.

ప్రస్తుతం ప్రాప్తించే కష్టసుఖాలన్నీ గతజన్మలో ఆర్జించిన పాపపుణ్యాల ఫలితాలే. ఇది బాగా అర్థమయితే వచ్చిన సంఘటనలను ధీరోదాత్త శాంత మనస్సుతో ఆహ్వానించి హాయిగా జీవించవచ్చును. ప్రారబ్ధానుగుణంగా నిశ్చయింపబడినవి ఎలాగూ తప్పకుండా వస్తాయని తెలుసు కాబట్టి పరిస్థితులు ఇంకొకలా

ఉండాలని అనుకోవడం కానీ అందుకు ప్రయత్నించడం కానీ జరగదు. ఇంద్రియాలు నిత్యమూ అట్టి జ్ఞాని అధీనంలోనే ఉంటాయి, అతనికి కోరికలే ఉండవు జరుగుతున్న వాటిని చూసి సంతోష విచారాలను పొందడు, తనకు లేనివీ కావాలనిపించిన వాటినీ కోరుతుంది మనస్సు. తనకు కావాలనిపించిన వానిని పోగొట్టుకుంటే దుఃఖిస్తుంది. ఈ సుఖ దుఃఖాలన్నీ మన గతజన్మ కర్మల ఫలితాలే అని తెలుసుకున్నజ్ఞాని, కొత్తవానిని కోరక, వచ్చిన వానిని నిరాకరించక శాంతంగా జీవిస్తాడు.

అధాపదం ప్రాప్య సుసంపదం వా మహామతిః స్వప్రకృతం స్వభావమ్
జహాతినో మందరవేల్లితోపి శౌక్ల్యం యదా క్షీరమయాంబురాశిః.

(యోగవాశిష్ఠం)

మంధరపర్వతంచే మధించబడినప్పటికీ పాలసముద్రం తన సహజ స్వభావమయిన తెల్లదనాన్ని కోల్పోనట్టే, అదృష్ట దురదృష్టాలలో ఏది సంభవించినా నిజమైనజ్ఞాని నిశ్చలంగా నిత్యశాంతుడై ఆత్మానుభవంలో ఉంటాడు.

ఉన్నతమైన భావాలతో సత్యాన్ని అర్థం చేసుకున్నప్పుడు మాత్రమే మనస్సు తన సహజమైన కోరికలను వీడగలుగుతుంది. ఈ భావాభ్యాసం భగవద్గీతలో ఇలా వివరింపబడింది.

శనైః శనైరుపరమేత్ బుద్ధ్యాధృతి గృహీతయా
ఆత్మసంస్థం మనఃకృత్వా నకించిదపి చింతయేత్. (భగవద్గీత-6-25)

బుద్ధిని స్థిరంగా ఉంచి, మనస్సు ఆత్మనే కోరునట్లుగా మలచి, వివిధములైన ఆలోచనలనుండి విడివడి, క్రమక్రమంగా శాంతిని సాధించాలి.

కఠోపనిషత్తు కూడా ఈ భావాన్నే ఇలా దృఢపరుస్తోంది.

యదాసర్వే ప్రముచ్యన్తే కామా యేస్య హృదిశ్రితాః
అథ మర్త్యోమృతో భవత్ యత్రబ్రహ్మ సమశ్నుతే.

(కఠోపనిషత్తుII-14)

సర్వకోరికలను త్యజించి, భావశూన్య స్థితిలో నిలవగలగినప్పుడు మానవుడు అమరుడయి తానే బ్రహ్మమని తెలుసుకుంటాడు.

**శ్లో॥ సుఖదుఃఖే జన్మమృత్యూ దైవాదేవేతి నిశ్చయీ ।**
**సాధ్యాదర్శీ నిరాయాసః కుర్వన్నపి న లిప్యతే ॥ 4.**

టీ॥ సుఖదుఃఖే = సుఖదుఃఖములును, జన్మమృత్యూ = జననమరణములును, దైవాదేవ = దైవమువలననే (భవన్తి = కలుగుచున్నవి), ఇతి = ఇట్లని, నిశ్చయీ = నిశ్చయముగలవాడు, సాధ్యాదర్శీ = సాధ్యకర్మలను చూచుచున్నవాడై, నిరాయాసః = శ్రమరహితుడై, కుర్వన్ = కర్మలను చేయుచున్నవాడై, న లిప్యతే = దేనిని అంటాడు.

**సుఖదుఃఖాలు జననమరణాలు గతకర్మఫలితాలని నిశ్చయంగా తెలిసిన జ్ఞాని, ప్రాపంచిక విషయభోగాలను కోరలేడు. బాధ్యతలనుండీ, కోరికలనుండీ ముక్తుడవుతాడు. అతడు కర్మలను చేస్తున్నప్పటికీ కోరికలు లేవు. కాబట్టి వాటిచే బంధింపబడడు.**

ఈ ప్రస్తుత జీవితంలో తను సాధించిన గొప్పలు, కష్టసుఖాలూ, అన్నీ కూడా గత జన్మలోని తన కామ్యకర్మల ఫలితాలే అని నిశ్చయంగా తెలిసిన జ్ఞాని, అశాశ్వతమూ దుఃఖ సమన్వితమూ అయిన ప్రాపంచిక భోగాలను ఏ విధంగా కోరగలడు? అట్టి మనిషి శాశ్వతమైన ఆత్మతత్త్వాన్ని, బ్రహ్మజ్ఞానాన్ని మాత్రమే నిత్యమూ కోరుకుంటాడు. దృశ్యమానమయే సమస్త జగత్తుకు అధిష్ఠానమయిన ఆత్మచైతన్యాన్నే సదా ధ్యానిస్తాడు. బుద్ధిచే తెలియబడే అజ్ఞాన జనితమూ భ్రమాసహితమూ అయిన బాహ్య ప్రాపంచికవిషయాలను కోరడం మాని, అధిష్ఠానమయిన ఆత్మతత్త్వాన్నే కాంక్షిస్తాడు. ప్రాపంచికమయిన కోరికలు లేవు కాబట్టి తత్సంబంధమయిన అశాంతీ బాధాకూడా అతనిని బాధించవు. ప్రస్తుత జీవితంలోని సంఘటనలన్నీ ఈశ్వరానుగ్రహంగా వస్తున్నాయనే దృఢజ్ఞానం ఉండబట్టి అతడు కర్తననీ భోక్తననీ అనుకోడు. కొత్తవాటిని కోరే మనస్సతనిలో ఉండదు, కాబట్టి అతనిలో అహంకారము ఉండదు. అహంకార రహితుడైన వ్యక్తి, వ్యష్టిగా కనిపించినా సమిష్టిలో భాగం మాత్రమే, వ్యష్టి కాదు. ఈ కారణం చేత అతడు ఏ పనులు చేసినట్టు మనకు కనిపించినా వాటి ఫలితాలు మాత్రము అతనికి చెందవు. అట్టిజ్ఞాని నిత్య స్వతంత్రుడు, ముక్తి అనేమాట అర్థవిహీన మతనికి.

భగవద్గీత అంతటా ఈ "కర్మలో అకర్మ" సిద్ధాంతం నిండి ఉంది. దీనిని అష్టావక్రుడు సంపూర్ణంగా ఆమోదించి బోధిస్తున్నారు. అహంకార సహితమయిన కర్మలూ కోరికలూ వ్యక్తిత్వాన్ని బలపరచి తద్వారా భవిష్యత్తును కూడా నిర్మిస్తున్నాయి. వ్యష్టిననే భావంతో వ్యక్తిత్వపు అభిరుచులతో,కొత్త కోరికలు కోరుతూ, కర్మల నాచరిస్తూ, ఫలితాల ననుభవిస్తూ, మరల కోరుతూ సంసారచక్రంలో చిక్కుకోడం సంభవం అవుతోంది. మనస్సు ఆత్మజ్ఞానాన్నే సదా కోరుతూ, మనో

బుద్ధులు ఆత్మకే అంకితంగా, ఏకాగ్రంగా ఏకోన్ముఖంగా ఉండడాన్ని "అఖండాకారవృత్తి" అని అంటారు. అట్టి జ్ఞానిలో అహంకార మమకారాలు ఉండవు కాబట్టి ప్రస్తుత కర్మల ఫలితాలతనిని పొందజాలవు. ప్రస్తుతకర్మలు ప్రారబ్ధవశంగా సంభవిస్తూ, సాక్షిగా చూడబడి లయం అయిపోతున్నాయి. అతని వాసనలు ఈ విధంగా క్షయం అయిపోవడాన్ని అతడు నిజానికి గుర్తించనే గుర్తించడు. చూసే మన దృష్టికి అర్థం అవడానికి మాత్రమే అతడు ప్రారబ్ధాన్ని శాంతంగా అనుభవిస్తున్నాడు అని చెప్పవలసి వస్తున్నది. ఈ సందర్భంలో గీతావచనం ఇలా వివరిస్తున్నది.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే. (భగవద్గీత 5-7)

శుద్ధమైన మనస్సుతో అహంకార రహితమైన బుద్ధితో, కర్మలను యోగంగా ఆచరిస్తూ, విజితేంద్రియుడై, చైతన్యమైన తనలో సర్వసృష్టినీ, సర్వ జగతిలోనూ చైతన్యమైన తననూ తెలుసుకుంటున్న జ్ఞాని, కర్మల నాచరిస్తున్నప్పటికీ అతడు అకర్తయే.

అట్టిజ్ఞాని నిజానికి కర్మలను చెయ్యడమూ లేదు. సాక్షిగా చూడడమూ లేదు. కర్మఫలదాత, కర్మాధ్యక్షుడూ అయిన పరమేశ్వరుడు తన నియమానుసారంగా నడుపుటను మనం మన దృష్టితో చూస్తున్నాము.

**శ్లో॥ చింతయా జాయతే దుఃఖం నాన్యథేహేతి నిశ్చయీ।**
**తయా హీన స్సుఖీ శాంతః సర్వత్ర గళితస్పృహః ॥ 5.**

టీ॥ ఇహ = ఈ ప్రపంచమునందు, చింతయా = చింతచేత, దుఃఖం = దుఃఖము, జాయతే = కలుగుచున్నది, అన్యథా = వేరొకవిధముగా, న = కలుగదు, ఇతి = ఇట్లని, నిశ్చయీ = నిశ్చయము గలవాడు, సుఖీ = సుఖవంతుడును, శాంతః = శాంతుడును, సర్వత్రగలితస్పృహః = అంతట నశించిన కోరిక గలవాడై, తయా = ఆ చింతనుండి, హీనః = రహితుడగుచున్నాడు.

**తన ఆతృతే తనకు దుఃఖాన్ని ప్రసాదిస్తోందని నిశ్చయంగా తెలిసిన జ్ఞాని ఆతృతనువీడి శాంతుడై, కోరికలులేని స్థితిలో హాయిగా జీవిస్తాడు.**

మనస్సులోని ఆతృత, అలజడి దుఃఖంగా మార్పుచెంది బాధిస్తుంది. ఏదైనా ఇలా జరగాలనికానీ, జరగకూడదనికానీ, బుద్ధిపరంగా కోరికగలిగితే, అది ఆతృతగా మారుతుంది. ఆతృత దుఃఖహేతువు. ఇది తెలిసిన జ్ఞాని వచ్చిన

వాటిని ప్రసాదబుద్ధితో స్వీకరిస్తూ ఆతృతను వీడి, దుఃఖరహితుడై శాంతంగా జీవిస్తాడు. ఆతృత లేకపోవడమే ఆనందంగా ఉండడం. జరుగుతున్నట్టు కనిపిస్తున్న యదార్థాన్ని యథాతథంగా స్వీకరిస్తూ, భవిష్యత్తును గూర్చిన భావనలను విడనాడి వర్తమానంలో తృప్తితో ఆత్మజ్ఞాననిష్ఠుడై హాయిగా జీవిస్తాడు. తానే ఆనంద స్వరూపాన్నని తెలుసుకుని, ఆనందంకోసం అనవసర ప్రయత్నాలు మాని, ఆతృత, దుఃఖమూలేకుండా నిత్యతృప్తితో నిదిధ్యాసనకు అర్థంగా భాసిస్తాడు.

మనస్సులో ప్రాపంచిక వస్తువులపై, విషయాలపై కోరిక ఉన్నప్పుడు మాత్రమే ఆతృత జనించి అలజడిని నింపుతుంది. ఈ మనస్సులో రాగద్వేషాలు బయలుదేరి విషయాలతో విడదీయరాని బంధంతో పెనవేసుకుపోతాయి. ఇందులో నుండి మళ్ళీ క్రొత్తకోరికలు పుడుతూ ఉంటాయి. ఈవిధంగా కోరికలే మనసును విషపూరితంచేసి బాధామయం చేస్తుంటాయి.

ఇక్కడ కూడా జ్ఞాని మనస్సనే కిటికీ ద్వారా (బాహ్యప్రపంచాన్ని) మనం చూస్తున్నామని మరచిపోకూడదు.

## శ్లో॥ నాహం దేహో న మే దేహః బోధోఽహమితి నిశ్చయీ ।
## కైవల్యమివ సంప్రాప్తః న స్మరత్యకృతం కృతమ్ ॥ 6.

టీ॥ అహం = నేను, దేహః = శరీరమును, న = కాను, మే = నాకు, దేహః = దేహము, న = లేదు, అహం = నేను, బోధః = జ్ఞానస్వరూపుడను, ఇతి = ఈ ప్రకారమగు, నిశ్చయీ = నిశ్చయముగలవాడు, కైవల్యం = విదేహముక్తిని, సంప్రాప్తః = పొందినవాడై, అకృతం = అకృతమును, (చేయబడని దానిని), కృతం = చేయ బడినదానిని, న స్మరతి = స్మరింపడు.

**ఈ శరీరమే "నేను" కాదు, ఈ శరీరమూ "నాది" కాదు. నేను శుద్ధచైతన్య స్వరూపాన్ని. ఇది నిశ్చయంగా తెలిసిన జ్ఞాని, ఇదివరకు చేసిన వాటిని కాని చెయ్యనివాటిని కాని తలుచుకోడు, తాను మాత్రమే కేవలంగా నిత్యమూ ఉన్నానని తెలుసుకుంటూ ఉంటాడు.**

మానసికంగా అనాత్మను తానుకాదని తెలిసి నిరసిస్తూ, తనను ఆత్మగా నిరంతరమూ ధ్యానించే నిత్య కఠోరసాధనలోనే సాధకుడు అనంత శాంతిని అనుభవిస్తాడు. ఈ సాధనలో సహజంగా అతడు---"న స్మరత్యకృతం కృతమ్"-

తాను చేసినవాటి గురించికాని, తాను చెయ్యనివాని గురించి కానీ, తలచనే తలచడు. సాధారణ మనస్సు గతం గురించి తలపోస్తూ బాధపడుతూ ఉంటుంది. గతం గురించి బాధపడడంలో వర్తమానం కూడా బాధాకరమవుతోంది. భవిష్యత్తు గురించిన ఆతృతతో బాధపడడం ప్రారంభిస్తుంది. ఈ విధంగా సదా అశాంతి తోనే గడుపుతూ ఉంటుంది. సాధారణంగా మానవ మనస్తత్వమే ఈ విధంగా ఉంటుంది. ఇలా ఎందుకు చేసేనని కానీ, ఇంకొకలా చేసి వుండవలసినదనికానీ, గతంగురించి ఆలోచిస్తూ, భవిష్యత్తులో ఇలా చెయ్యాలని ఆలోచించడంతో కాలం గడచిపోతుంది. అందుకనే ఇక్కడ అష్టావక్రుడు ఈ విధంగా సూచించారు. దీనిని అర్థంచేసుకున్న సాధకుడు గతాన్ని భవిష్యత్తునీ విస్మరించి నిత్య వర్త మానంలో నిశ్చల శాంతితో జీవించగలుగుతాడు."కైవల్యమివ"---కైవల్య చందాన్ని, ఏకత్వపుటనుభవాన్ని పొందగలుగుతాడు.

**కఠోపనిషత్తులో కూడా ఇదే సలహా కనిపిస్తుంది.**

యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ
బుద్ధిశ్చ న విచేష్టతే తామాహుః పరమాం గతిమ్.
(కఠోపనిషత్తు-2-4-14)

*మనస్సుతోసహా పంచజ్ఞానేంద్రియాలూ విశ్రాంత స్థితిలో ఉంటూ, బుద్ధి భావనాతరంగ రహితంగా నిశ్చలంగా నిలవగలగడమే మహోన్నతమైన ఆత్మా నుభవస్థితి.*

"నేను","నాది" అనే భావాలు అహంకారానికి చెందినవి. "నేను" శరీరం కాదనీ, శరీరము "నాది" కాదనీ తెలిసిన జ్ఞానికి అహంకారం అదృశ్యమయి పోతుంది. అహంకారంస్థానే ఆత్మ స్వయంగ ప్రకాశిస్తుంది. మహోపనిషత్తు ఈ విధంగా గానం చేస్తోంది.

ద్వే పదే బంధమోక్షాయ నిర్మమేతి మమేతి చ
మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే.
(మహోపనిషత్తు-4-72)

*నాది అనేభావం సృష్టించే పెనుతుఫానులే ఈ బంధమోక్షాలు, నాది అనే భావాన్ని, మమత్వాన్ని, నిర్మూలింపగలిగితే మోక్షం అనే పదం అర్థరహిత మౌతుంది. ఈ మమత్వ భావనతోనే జీవి బంధింపబడి, ముక్తికోసం తపిస్తున్నది. ఈ భావం నశించగానే ముక్తస్థితిలో ఉండడాన్ని గుర్తిస్తున్నది.*

**శ్లో॥ ఆబ్రహ్మ స్తంబపర్యన్తం అహమేవేతి నిశ్చయీ ।**
**నిర్వికల్పః శుచిశ్శాన్తః ప్రాప్తాప్రాప్త వినిర్వృతః ॥7.**

టీ॥ ఆ బ్రహ్మ స్తంబపర్యన్తం = బ్రహ్మ మొదలుకొని తృణమువరకును, అహమేవ = నేను ఉంటున్నాను, ఇతి = ఇట్లని, నిశ్చయీ = నిశ్చయముగలవాడు, నిర్వికల్పః = సంకల్పరహితుడై, శుచిః = నిర్మలుడై, చ = మరియు, శాన్తః = శాంతుడై, ప్రాప్త అప్రాప్త వినిర్వృతః = ప్రాప్తాప్రాప్తములకు సంతుష్టుడై (సుఖీ భవతి = సంతుష్టుడగుచున్నాడు.)

**బ్రహ్మనుండి గడ్డిపోచవరకూగల సర్వసృష్టిలోనూ నేనే ఉన్నాను. ఈ నిశ్చయజ్ఞానం కలిగిన జ్ఞాని భావోద్రేకతరంగాల తాకిడినుండి ముక్తుడవుతాడు. ప్రాప్తించిన వాటినుండి, ప్రాప్తించని వాటినుండి, వాటికి సంబంధించిన సుఖ దుఃఖ సంకల్పాలనుండి విముక్తుడై నిర్వికల్పుడై శాంతంగా జీవిస్తాడు.**

పరిమితిగలిగిన మనస్సు మాత్రమే సంకల్పాలకు సంచలించి బాధకు లోనవుతుంది. ఈ పరిమితులు ఎక్కువయినకొద్దీ బాధలు కూడా అధికమవుతూ ఉంటాయి. విషయాలపైగల మమత్వంతో ఈ పరిమితులు ఏర్పడుతూ ఉంటాయి. ఈ మమత్వం అనేక కోరికల రూపంలో మనస్సును వస్తువులకు బందీని చేస్తోంది. మమత్వాన్ని పూర్తిగా విసర్జించిన మనస్సు మౌనంగా శాంతంగా ఆనంద మయంగా స్వస్థితిలో పరమాత్మగా నిలచిపోతుంది.

ఈ మనః పరిమితుల నధిగమించి సర్వవ్యాప్తంగా సర్వ నామరూపాల కాధారంగా, చైతన్యంగా తానే ఉన్నానన్న సత్యాన్ని గుర్తించిన జ్ఞాని, మనస్సు కలీతంగా ఉంటాడు కాబట్టి, మానసిక అశాంతి, వికల్పము అతనిని బాధించదు. సంకల్ప వికల్పములు లేకుండా మనస్సు ఉండే ఆ స్థితిని నిర్వికల్పస్థితి, లేక సమాధి అని అంటారు. దీనిని భర్తృహరి ఇలా నిర్వచించారు. ఏకమయిన సత్యం మీద ఏకాగ్రతతో దృష్టి నిలపడంలో తెలుసుకునేవాడు, తెలియబడేది, తత్సంబంధ జ్ఞానము అనే త్రిపుటి లయమవడంతో వ్యష్టిభావం కూడా విలీన మవుతుంది. పతంజలి మహర్షి ఎక్కువగా వాడి వ్యాపింపజేసిన ఈ "నిర్వికల్పం" అన్నపదం ముఖ్యమైన ఉపనిషత్తులలోగాని భగవద్గీతలోగాని కనిపించకపోవడం ఆశ్చర్యకరం. అయినా ఈ పదాన్ని అష్టావక్రుడు యథేచ్ఛగా వాడడాన్ని ఇందులో చూస్తున్నాము.

**శ్లో॥ నానాశ్చర్య మిదం విశ్వం న కించిదితి నిశ్చయీ ।**
**నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించివ శామ్యతి ॥ 8.**

టీ॥ ఇదం=ఈ, విశ్వం = ప్రపంచము, నానాశ్చర్యం = అనేకాశ్చర్యములు గలది, న కించిత్ = కొంచెముగూడలేనిది, ఇతి = ఇట్లని, నిశ్చయీ = నిశ్చయము గలవాడు, నిర్వాసనః=వాసనారహితుడై, స్ఫూర్తిమాత్రః = పరిపూర్ణ బోధస్వరూపుడై, న కించిదివ = సకల వ్యవహార రహితుడై, శామ్యతి = శాంతిని పొందుచున్నాడు.

**నానాత్వంతో అద్భుతంగా కనిపించే ఈ ప్రపంచమంతా కేవలం భ్రమ అని తెలుసుకున్న జ్ఞాని సంకల్పములను విడనాడి శాంతుడై జీవిస్తాడు. కేవలం చైతన్యం మాత్రమే ఉందని గుర్తించే కేవలానందాన్ని ఏకత్వాను భూతిని పొందుతూ ఉంటాడు.**

ఈ చివరి శ్లోకంలో అనగా అజాతవాద వివరణ పూర్తయింది. సాధకుని మనశ్శరీరాలద్వారా అనుభవింపబడుతున్న నానాత్వ ప్రపంచమంతా నిజానికి ఎక్కడా ఉనికిని కలిగిలేదని పూర్తిగా తెలుసుకోగలుగుతాడు. జగన్మిథ్యాత్వ జ్ఞానాన్ని దృఢంగా కలిగి ఉండడంచేత ప్రాపంచిక వస్తువులను కలిగి ఉండాలని కానీ, అనుభవించాలనికానీ కోరికలతనికి కలగవు. కోరికలులేని కారణంచేత సూక్ష్మశరీరం క్రమంగా భావరహితమయి నశిస్తుంది. వాసలు అప్పటికే నశించినవి, కాబట్టే అతనికి కోరికలు కలగవు. ఈ విధంగా కారణ శరీరం కూడా నశిస్తుంది. అహంకారం తనను అనంతచైతన్యమయిన అహంగా ఆత్మగా గుర్తించగలుగుతుంది. వృత్తిరహితమయిన శుద్ధచైతన్యంగా అనంతంగా అద్భుతంగా ఆనందంగా ఆత్మ కేవలంగా భాసిస్తూ ఉంటుంది.

•••

# అధ్యాయం-12

# ఆత్మనిష్ఠ, బ్రహ్మనిష్ఠ- ఎలా సాధ్యం?

జ్ఞానాష్టక మనదగిన క్రిందటి అధ్యాయంలో జ్ఞాని తన మనోబుద్ధుల తో బాహ్యప్రపంచాన్ని ఏ దృక్పథంతో చూసేది. ప్రాపంచిక విషయాలు అతని మనోబుద్ధులను ఎలా ప్రభావితం చేసేదీ మనోజ్ఞంగా మహత్తరంగా వర్ణింపబడింది. ఈ వర్ణనతో జ్ఞాని దృష్టిలోగల ప్రపంచాన్ని మనం దర్శించ గలిగేము.

వేదాంతం ఆత్మను గురించి బోధించే శాస్త్రం, ఎందరో మహాను భావులు ఎన్నోవిధాలుగా తమ అనుభవాన్ని వ్యక్తం చేసినారు. వారి పాండితీ విభావాన్ని మేధానైశిత్యాన్ని చూసి మెచ్చుకోవడం కాకుండా సాధకుడు ఆ చెప్పబడిన మాటల లక్ష్యార్థాన్ని తన అనుభవానికి తెచ్చుకుని, ఆ స్థితిలో నిలువగలిగినప్పుడే ఆ శాస్త్రం ప్రయోజనకారి కాగలదు. అంతవరకు ఈ శాస్త్రసారాన్ని తనలో మరల మరల చదువుకుంటూ వింటూ మననం చేసుకుంటూ ఉండవలసిందే.

నిజమైన శిష్యుడుగా జనకుడు తన గురువుచెప్పిన దానిలోని నిజాన్ని లోతును గ్రహించి ఒప్పుకుంటున్నాడు. ఈ అధ్యాయంలో రాజర్షి తను ఏయే దశలను దాటి చివరగా ఆత్మానుభవంలో నిష్ఠుడైనదీ వివరంగా వివరిస్తున్నారు.

మహారాజుగా మాహాసామ్రాజ్య భారాన్ని వహిస్తూ, అంతులేని ఐశ్వర్యాన్ని రాజరికపు భోగాలను అనుభవిస్తూ కూడా ఏవిధంగా ఆత్మనిష్ఠుడై ప్రవర్తిస్తున్నదీ, ఏయే దశలను దాటి వచ్చినదీ, ఈ ఎనిమిది శ్లోకాలలోనూ వ్యక్తం చేస్తున్నారు. భగవద్గీతలోని సుప్రసిద్ధమైన ఉపమానం "**పద్మపత్ర మివాంభసా**" వలెనే జనకుడు కూడా తామరాకు మీది నీటి బొట్టువలె ప్రపంచంలో తన ధర్మాలను నిర్వహిస్తూ కూడా అసంగంగా, కేవలంగా ఆత్మనిష్ఠుడై ఉండడాన్ని-ఇందులో మనం గుర్తిస్తాము.

మనస్సును అశాంతికి లోనుచేసే ఆలోచనా తరంగాలను పూర్తిగా నిర్మూలించడమే శాంతస్వరూపమైన ఆత్మను దర్శించేమార్గం. ఎంతో ప్రయత్నించిన తరువాత కూడా మిగిలిపోయే చివరి సందేహాత్మక ఆలోచనలను కూడా ప్రగాఢ ధ్యానంలో లయం చేసుకోవడం సాధ్యం అవుతుంది. మమత్వం ఎంతగా విస్తరించి ఉంటుందో, వాటన్నిటినుండీ మనకు ఆలోచనలు అశాంతి వస్తూనే ఉంటాయి. క్రమంగా దశల వారీగా నేర్పుతో, శాస్త్రజ్ఞానం ఆధారంగా మమత్వ పరిధిని తగ్గిస్తూ ఆలోచనలను తగ్గిస్తూ చివరగా మనస్సును నిశ్చలం చేసుకోవాలి. ఈ విధానాలన్నీ కూలంకషంగా ఈ అధ్యాయంలో చర్చించ బడ్డాయి.

జనక ఉవాచ :-

శ్లో॥ కాయకృత్యాసహః పూర్వం తతో వాగ్విస్తరాసహః ।
అథ చిన్తాసహస్తస్మాత్ ఏవమేవాహ మాస్థితః ॥ 1.

టీ॥ పూర్వం = పూర్వము, కాయకృత్యాసహః = శరీరసంబంధమగు కార్యము లను, సహింపనివాడనై (అనిష్ఠముగలవాడనై), తతః = తరువాత, వాగ్విస్తారసహః = జపాదినిందాస్తుతిరూప కర్మలను సహింపనివాడనై, అథ = తరువాత, చిన్తాసహః = మానసిక కర్మలను సహింపనివాడనై (అనిష్టమువలన విడిచి పెట్టినవాడనై), తస్మాత్ = ఆ కారణమువలన, అహమేవ = నేనే, ఆస్థితః = ఉంటున్నాను.

**ముందుగా శారీరక కర్మలను చెయ్యడంలో అసహనం కలిగింది. క్రమంగా మాటాడడంలోనూ ఆలోచించడంలోనూ కూడా విముఖత కలిగింది, అనగా శారీరక, వాచక, మానసిక కర్మలయందు సంపూర్ణ విముఖత కలిగినది. ఈ విధంగా చివరకు నిర్వికల్పంగా "నేను" గా ఆత్మనిష్ఠుడనయి కేవలంగా నిలవగలిగేను.**

మనం చేసే కర్మలన్నీ మూడు రకాలుగా ఉంటాయి. శరీరంతో చేసేవి వాచా చేసేవి (మాటాడడం వగైరా), మానసికంగ చేసేవి. సాధకులు ముందుగా ఈ మూడింటిని బాహ్యవిషయ ప్రపంచంనుండి ఆత్మతత్వంవైపు మరలించాలి. చేసేపని మాటలాడేమాట ఆలోచించే ఆలోచన అన్నీ ఆత్మతత్వాన్వేషణా పరం గానే ఉండాలి.

భక్తితోచేసే పూజలు, యజ్ఞాలు కర్మయోగంగా చేసే సమాజసేవ

మొదలయినవన్ని శారీరక కర్మలను ఆత్మాన్వేషణవైపు మరలించడానికి మార్గాలే. భగవంతుని నామాన్ని గానం చెయ్యడం, జపధ్యానాలు చెయ్యటడం, మత శాస్త్రిగ్రంధాలను చదడవం మనస్సును మరలించే మర్గాలు. బుద్ధిపరంగా తనకున్న వాటిని గూర్చిగాని లేనివాటిని గూర్చిగాని ఆలోచించడం మాని వాటికి కారణమనిపించే భగవత్ తత్వాన్ని గురించి సదా ఆలోచించాలి. ఈ విధంగా శరీరాన్ని మనస్సును బుద్ధినీ భగవదన్వేషణా భావంవైపు మరలించి లయం చెయ్యాలి.

ఈ విధంగా శరీరాన్ని మనస్సును బుద్ధిని మలిచి ఏకాగ్రతతో ధ్యానం చెయ్యాలి. ధ్యాననిష్ఠకుదిరేకొద్దీ శారీరకంగాచేసే పూజలూ, జపాలూ, వాచకంగా చేసే కీర్తనలూ, బుద్ధిపరమైన శాస్త్రాధ్యయనమూ మొదలైనవి కూడా క్రమంగా ఆటంకంగా అనిపిస్తాయి. ఏకాగ్రతతో ధ్యానంతో ఉన్నతస్థితికి చేరిన మనస్సు క్రమంగా సంకల్పాలను విసర్జించి నిర్వికల్పమవుతుంది.

ఈ విధంగా తన ఆధ్యాత్మిక జీవనయాత్రను వర్ణిస్తూ జనకుడు, త్రికరణములతోనూ త్రికరణశుద్ధితోనూ చేసే తన కర్మల నన్నిటినీ కూడా సహించలేక అవరోధాలుగా భావించి విడచిపెట్టితినని చెప్పుతున్నారు. ఈ విధంగా సర్వ సంకల్పాలను విసర్జించి తానుగా నిలచిపోయానని స్పష్టం చేస్తున్నారు.

ఇది అభూతకల్పన ఎంతమాత్రమూ కాదు. మానవసేవ, యజ్ఞయాగ క్రతు వ్రత దానధర్మాలు, యమ నియమాది అష్టాంగయోగ సాధనలు, శాస్త్రాధ్యయనము, జపధ్యానాదులు అన్నీ కూడా మొదట్లో సాధకులకు ఎంతో విలువైనవిగా సాధింపవలసినవిగా కనబడడం నిజమే ఇవన్నీ కలిసి సాధకుని లక్ష్యం చేర్చడానికి ధ్యాననిష్ఠ కుదరడానికి ఎంతగానో ఉపయోగిస్తాయి. ఈ ధ్యాననిష్ఠ వచ్చేక, సంకల్పవర్జితమైన మనసు నిలచేక ఇదివరకటి ప్రయత్నాలన్నిటినీ కొసాగించడం అర్థరహితంగా వృధా ప్రయాసతో కూడినదిగా అనిపిస్తుంది. ఆత్మ చైతన్యంగా తానే అంతటా ఉండడం అనుభవంలోకి వస్తుంది. వ్యక్తిగా విడిగా ఏదైనా ప్రయత్నించడం ఈ ఏకత్వస్థితిలోనుండి సమష్టి భ్రమలోకి వ్యష్టిగా రావడమే అని తెలిసిన జ్ఞానికి, సమస్త కార్యకలాపాలూ, సర్వ సంకల్పాలూ విడువదగినవిగా, ప్రయాసతో కూడినవిగా, అర్థరహితంగా వ్యర్థంగా అనిపించక మానవు. ఈ సమస్త కర్మములు అనే సాధనలూ నావ ఐతే, ఆత్మానుభవతీరాన్ని చేరేక కూడా నావలోనే ఉండడానికి ఎవరైనా ఎలా యిష్టపడగలరు?

ఇదేభావం యోగవాశిష్ఠంలో ఇలా వివరింపబడింది.

కర్మైవదేహో ననుదేహ ఏవ చిత్తం తదే వాహమితీహ జీవః
సః జీవ ఏవేశ్వరచిత్ స ఆత్మా సర్వః శివస్త్వేక పదోక్తమేతద్.

(యోగవాశిష్ఠం-661-9)

*గతజన్మలోని కర్మలఫలమే ఈ శరీరము, గత వాసనలచే రూపు దాల్చిన జీవుడైన అహంకారము మనస్సుచే శరీరం ద్వారా కర్మలను చేయిస్తూ ఉంటుంది. ఈ జీవుడు ఈశ్వరుని వ్యక్తస్వరూపమే. ఈశ్వరుడూ ఆత్మా వేరు కావు. ఈ విధంగా ఉన్నదంతా ఏకైక శివస్వరూపమే.*

ఇటువంటి అనుభవ సహితజ్ఞానం ఉన్న క్షణాలతో గతంలోని ప్రయత్నాలను పోల్చిచూస్తే దుస్సహమయిన మానసిక కల్లోలంగా అవి అనిపిస్తాయి.

శ్లో॥ ప్రీత్యభావేన శబ్దాదేః అదృశ్యత్వేన చాత్మనః ।
విక్షేపైకాగ్ర హృదయః ఏవమేవాహమాస్థితః ॥ 2.

టీ॥ శబ్దాదేః=శబ్దాదులయొక్క, ప్రీత్యభావేన = ప్రీతి లేకపోవట వలనను, ఆత్మనః = ఆత్మ, అదృశ్యత్వేన = అదృశ్యమగుటచేతను (కనబడకపోవుటచేతను), విక్షేపైకాగ్ర హృదయః = విక్షేపములనుండి, యేకాగ్రమగు హృదయముగలవాడనై, అహం = నేను, ఏవమేవ = ఈ ప్రకారముగా, ఆస్థితః = ఉంటున్నాను.

**శబ్దం మొదలైన విషయాలు నన్నాకర్షించడం లేదు. ఆత్మ అగోచరం, నా మనస్సులో ఏ విధమయిన ఆలోచనలూ కదలడం లేదు. సంకల్ప రహితంగా ఆత్మగా నేనున్నాను.**

సత్యపథాన్ని అధిష్ఠించిన జనకుడు తానధిరోహించిన సోపానాలను వివరిస్తూ శబ్దాది విషయాలు నాకు ప్రీతినివ్వడంలేదు, అంటున్నారు. శాస్త్రాధ్యయనం, మననము, సత్సంగము మొదలయినవన్నీ కూడా ఈ "శబ్దాది" అన్న మాటకు అర్థమే. ఇవన్నీ తనను ఆకర్షించడం లేదు. కాబట్టి వాటన్నిటిని వదలి వేసేరు. ధ్యానంలో ఆత్మను చూడాలని, తెలుసుకోవాలని అనుభవించాలని మనస్సు అనుకుంటుంది. ఆత్మ అగోచరం, అనూహ్యం, నిర్వికల్పం, కాబట్టి ధ్యానం కూడా జనకుని ఆకర్షించడంలేదు. మనో బుద్ధులతో ప్రయత్నపూర్వకంగా చేసే ఏ ప్రయత్నమయినా తనను స్వస్థితినుండి దూరం చేస్తోందని తెలిసి "అన్ని ప్రయత్నాలను విడిచిపెట్టి స్వస్థితిలో ఆనందంగా ఉన్నాను" అంటున్నారు.

శ్లో॥ సమాధ్యాసాదివిక్షేపౌ వ్యవహారః సమాధయే ।
ఏవం విలోక్య నియమం ఏవమేవాహ మాస్థితః ॥ 3.

టీ॥ సమాధ్యాసాదివిక్షేపౌ = అభ్యాసాదులవలన విక్షేపము కలుగుచుండగా, సమాధయే = సమాధికొఱకు, వ్యవహారః = వ్యవహారము, (భవతి = అగుచున్నది), ఏవం = ఇటువంటి, నియమం = నియమమును, విలోక్య = చూచి, ఏవమేవ = ఇట్లే (సమాధిరహితుడనై), అహం = నేను, ఆస్థితః = ఉంటున్నాను.

**మనస్సులో ఆలోచనా చలనం ఉన్నప్పుడే ధ్యానానికీ సమాధికీ ప్రయత్నించాలనీ తెలుసుకుని, ఆలోచనలే లేనినేను ప్రయత్నాలకు దూరంగా ఉన్నాను, ఈ విధంగా సదా ఆత్మనిష్ఠుడనై ఉన్నాను.**

అధ్యాసవల్ల కలిగిన మిథ్యా కల్పనలవైపు మనస్సు చలిస్తున్నప్పుడే సమాధికోసం ప్రయత్నంగా ధ్యానం అవసరమవుతుంది. శరీరం మనస్సు అహం కారం వాటి అనుభవక్షేత్రాలు అందులోని విషయాలు అన్నీకూడా మనస్సుచే కల్పింపబడినవే, ఆ కల్పింపబడిన వాటిపై ఆకర్షణ పెంచుకొని మనస్సు ఆ భోగాలలోనే ఉండిపోతుంది. అటువంటి మనస్సు ధ్యానానికి సంసిద్ధంగా ఉండదు. ఇది పూర్తిగా అర్థం చేసుకున్న జనకుడు "తన స్వరూపాన్ని గురించి అజ్ఞానంలో ఉండీ, భ్రమాకల్పిత జగత్తుతో బాధపడేవారు మాత్రమే ఆ బాధనుండి మనస్సును మళ్ళించడానికి ధ్యానమనే ప్రయత్నం చెయ్యాలి" అంటున్నారు. ఈ అజ్ఞానం లేని జనకుడు ధ్యానం అర్థరహితమని తలంచి వదలివేయడం జరిగింది. సదా ఆత్మనిష్ఠలో ఉంటున్నారు. ఆరోపింపబడిన భ్రమలు తొలగిపోగానే అధిష్ఠాన మయిన ఆత్మగా సాధకుడు తనను తాను తెలుసుకుంటాడు. అట్టి స్థితిలో అతనికి ధ్యానం చెయ్యవలసిన అవసరం లేదు. ధ్యానం చెయ్యడానికి అతనిదయిన ప్రత్యేక ఉపాధికూడా లేదు, సదా శాంతస్థితిలో ఉండడం జరుగుతుంది.

శ్లో॥ హేయోపాదేయ విరహాత్ ఏవం హర్షవిషాదయోః ।
అభావాదద్య హే బ్రహ్మన్ ఏవమేవాహ మాస్థితః ॥4.

టీ॥ హేబ్రహ్మన్ = ఓ పరబ్రహ్మస్వరూపా, హేయోపాదేయ విరహాత్ = త్యాజ్య గ్రాహ్యవస్తువులయొక్క వియోగమువలన, ఏవం = అట్లే, హర్షవిషాదయోః = సంతోష దుఃఖములయొక్క, అభావాత్ = అభావమువలన, అద్య = ఇప్పుడు, అహం = నేను, ఏవమేవ = యథార్థస్వరూపుడుగానే, ఆస్థితః = ఉంటున్నాను.

ఓ బ్రహ్మే! ఆమోదించవలసినదీ, నిరాకరించవలసినదీ లేదని తెలిసి, సుఖదుఃఖాలు లేకుండా ఉండడంలో సదా ఆత్మనిష్ఠుడనై ఉన్నాను.

గురువును అత్యంత గౌరవభావంతో "బ్రహ్మే" అని బోధిస్తూ తన వివరణను కొనసాగిస్తున్నాడు జనకుడు. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి"-- బ్రహ్మను తెలుసుకున్నవాడు బ్రహ్మమే. శిష్యునికి బ్రహ్మజ్ఞానాన్ని (ఆత్మ జ్ఞానాన్ని) అందించిన గురువు అతనికి సాక్షాత్ బ్రహ్మస్వరూపమే.

సాధకునికి "మంచి" ఆమోదయోగ్యంగానూ "చెడు" నిరాకరింపదగినది గాను అనిపిస్తుంది. ఈ మంచిచెడులు ధర్మాధర్మాలు, బుద్ధిచే నిర్ణయింపబడిన విలువలు మాత్రమే. ఈ బుద్ధిని అధిగమించి సంకల్పరహితుడైన యోగికి స్వీకరణ నిరాకరణలతో అవసరం ఏముంది? ఈ మంచి చెడులుగా తెలియబడే సర్వ ఆలోచనలూ ఏ చైతన్యంచే తెలియబడుతున్నాయో ఆ చైతన్యమే తానని నిశ్చయంగా తెలుసుకొని ఆ అనుభవంలో ఉంటాడు. ఈ మంచి చెడులను నిజమని భావించి, కర్తగా అనుసరించి ఆచరించడంవల్లనే తత్ఫలితంగా సంతోష విచారాలు కలుగుతున్నాయి. ఈ సుఖదుఃఖాలు మనస్సుచే అనుభవింపబడు తున్నాయి. సాధకుడు మనోబుద్ధుల నధిగమించినప్పుడు, ఈ సుఖదుఃఖాలు, ధర్మాధర్మాలు అతనికి ఉండనే ఉండవు. "సర్వసంకల్ప రహితుడనై ఈ విధంగా శుద్ధచైతన్యంగా నేనే ఉన్నాను" అంటున్నారు జనకులు.

శ్లో|| ఆశ్రమానాశ్రమం ధ్యానం చిత్తస్వీకృత వర్జనమ్ ।
వికల్పం మమ వీక్ష్యైతైః ఏవ మేవాహ మాస్థితః ।। 5.

టీ|| ఆశ్రమానాశ్రమం = ఆశ్రమ, అనాశ్రమములను, ధ్యానం = ధ్యానమును, చిత్తస్వీకృత వర్జనం = మనస్సుచేత స్వీకరింపబడిన వస్తుత్యాగమును, మమ = నాయొక్క, వికల్పం = వికల్పమును, వీక్ష్య = చూచి, అహం = నేను, ఏవమేవ = ఈ మూడింటికంటే భిన్నుడనై, ఆస్థితః = ఉంటున్నాను.

ఒక ప్రత్యేక ఆశ్రమంలో ఉండడం కాని, లేకపోవడంగాని, ధ్యానమూ, మనోనియమాలూ ఇవన్నీ కూడా నా స్వస్థితి నుండి నన్ను దూరంచేసే భావాలుగా గుర్తించి, సర్వసంకల్పవర్జితుడనై ఆత్మనిష్ఠుడనై ఉంటాను.

"ఆశ్రమం"-- హిందూజీవిత విధానం నాలుగు ఆశ్రమాలుగా విభజింప బడిందని ఇదివరకే తెలుసుకున్నాం. ఇవి బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ,

సన్యాస ఆశ్రమాలు. ఈ ప్రతి ఆశ్రమానికి ప్రత్యేకమైన విధి నిషేధాలు విధించబడి ఉన్నాయి. ఇవన్నీ కూడా మనస్సును ప్రత్యేకంగా మలచి ఆచరించవలసి ఉంటుంది. వీటన్నిటి లక్ష్యమూ ఆత్మానుభవం పొందడమే. నిశ్చలమయిన మనస్సుతో స్వస్థితిలో నిలచిన జనకునికి వీటి అవసరమే లేదు. అజ్ఞాన జనిత భ్రమాకల్పనలో మనశ్శరీరాలతో విహరిస్తున్నాననుకునే వారికి మాత్రమే ఈ ఆశ్రమాలూ, ఆశ్రమ ధర్మాలూ వర్తిస్తాయి.

సదా నిశ్చలమైన మనస్సుగల జ్ఞానికి ధ్యానం కూడా అనవసరమే. సర్వత్రా ఆత్మనే దర్శిస్తున్న జ్ఞానికి, మనస్సు చలించి విషయ భోగాలవైపు పరుగెట్టడం అనేదే ఉండదు. మనస్సు ఎంతదూరం వెళ్ళినా ఉన్నదంతా ఆత్మ చైతన్యమే కాబట్టి తననుండి వేరుకాదు. కాబట్టి మనస్సును నియమించవలసిన అవసరమే అతనికుండదు. ఇక ధ్యానంతో పనేముంది? ఆత్మనిష్ఠుడైన అతనికి, మనస్సుని నియమించవలసిన ధ్యానాదులుకూడా అసహనాన్నే కలిగిస్తాయి. కాబట్టి వాటిని వదలి జనకుడు స్వస్థితిలో శాంతంగా ఉన్నాడు.

ఇక్కడ జనకుడు నిర్వచించినస్థితి చతుర్విధ ఆశ్రమాలకు అతీత మైనది. ఈ స్థితిని "అత్యాశ్రమీ" అనీ, "అవధూత" అనీ అంటారు. ఇట్టి స్థితిలో ఉన్నావారిని గూర్చి మనశాస్త్రిలు ఇలా అంటున్నాయి.

యఃశరీరేంద్రియాదిభ్యో విభిన్నం సర్వసాక్షిణం పారమార్థిక విజ్ఞానం
సుఖాత్మానం చ స్వప్రభం పరమతత్త్వం విజానాతి సో అతివర్ణాశ్రమీ భవేత్.

*ఎవడైతే తనను తాను మనశ్శరీరాలకూ సర్వసృష్టికీ సాక్షిగా సర్వాత్మగా తెలుసుకుంటాడో, అతడికి కులమతాలు ఆశ్రమధర్మాలు ఏవీ ఉండవు. అతడు సర్వస్వతంత్రుడు, నిత్యముక్తుడు, అతనిని "అతి వర్ణాశ్రమి" అంటారు.*

**శ్లో॥ కర్మానుష్ఠాన మజ్ఞానాద్యథైవోపరమస్తథా ।**
**బుద్ధ్వా సమ్యగిదం తత్త్వం ఏవమేవాహ మాస్థితః॥6.**

టీ॥ యథా = ఎట్లు, కర్మానుష్ఠాన = కర్మానుష్ఠానము, అజ్ఞానాత్ = అజ్ఞానము వలన, (భవతి = అగుచున్నదో), తథా = అట్లే, ఉపరమః ఏవ = కర్మత్యాగము కూడా, (అగుచున్నది) ఇదం = ఈ, తత్త్వం = తత్త్వమును, సమ్యక్ = బాగుగా, బుద్ధ్వా = తెలుసుకొని, అహం = నేను, ఏవమేవ = కర్మను చేయుటయందుగాని, చేయకుండుట యందుగాని యిచ్ఛను త్యజించి, ఆస్థితః = ఉంటున్నాను.

కర్మలను చెయ్యడం ఏ విధంగా అజ్ఞానజనితమో అదేవిధంగా కర్మలను

వదలడం కూడా అజ్ఞానజనితమే. ఈ సత్యాన్ని సంపూర్ణంగా గ్రహించి నేను పనులను చెయ్యాలనికానీ, చెయ్యకూడదని కానీ అనుకోవడం లేదు. ఈ విధంగా శాంతంగా స్వస్థితిలో నిష్ఠుడనై ఉన్నాను.

తానెవరో తనకు తెలియని అజ్ఞానం నుండి జనించిన బుద్ధి తీసుకునే నిర్ణయాలవల్లనే కర్మలు చెయ్యాలనీ చెయ్యకూడదనీ అనిపిస్తూ ఉంటుంది. వ్యక్తిగతమైన అహంకారం బలీయంగా ఉన్నప్పుడు దానిని శాంతపరచి జ్ఞానాభిముఖం చెయ్యడానికి కొన్ని ధార్మికకర్మలు విధింపబడ్డాయి. ఇదే అహంకారం నిర్లజ్జగా పశుతుల్యంగా ప్రవర్తించకుండా కొన్ని నిషేధాలు విధించబడ్డాయి. ఈ విధి నిషేధాలు ఆత్మానుభవం కోరుకునే సాధకులకు అత్యవసరం. అజ్ఞాన జనిత భ్రమాకల్పిత అహంకార నాశనానికి ఈ విధి నిషేధాలు సహాయపడతాయి. రోగి జబ్బుగా ఉన్నంతకాలమూ వైద్యుడు నిర్ణయించిన మందులనూ పథ్యాన్నీ శ్రద్ధగా వాడాలి, పాటించాలి. జబ్బు నయంకాగానే వీటిని అతిక్రమించి తన మామూలూ, జీవితాన్ని ఆనందముగా జీవిస్తాడు. ఇదేవిధంగా సర్వధర్మాలు విధినిషేధాలు అజ్ఞానాంధకారంలో మార్గాన్నీ కాంతినీ వెతికే అజ్ఞానులకే ప్రయోజనాన్నిస్తాయి.

ఈ సత్యాన్ని సంపూర్ణంగా గుర్తించిన జనకుడు వీటన్నిటికీ అతీతమైన స్థితిలో ఆనందంగా ఉన్నానని అంటున్నాడు.

శ్లో॥ అచిన్త్యం చిన్త్యమానోఽపి చిన్తారూపం భజత్యసౌ ।
త్యక్త్వా తద్భావనం తస్మాత్ ఏవమేవాహమాస్థితః॥ 7.

టీ॥ అచిన్త్యం = చింతించుటకు శక్యముగాని బ్రహ్మమును, చిన్త్యమానః అపి = చింతించుచున్న వాడైనప్పటికిని, అసౌ = ఈ పురుషుడు, చిన్తారూపం = చింతా రూపమును, భజతి = పొందుచున్నాడు, తస్మాత్ = ఆకారణము వలన, తద్భావనం = ఆ చింతారూప భావమును, త్యక్త్వా = విడిచిపెట్టి, అహం = నేను, ఏవమేవ = భావనారహితుడనయ్యే, ఆస్థితః = ఉంటున్నాను.

అవాఙ్మానస గోచరమైన ఆత్మను గూర్చి ఆలోచించడంలో ఏదో ఒక రకమైన భావాన్ని ఆశ్రయించి భావంగా ఉండిపోతుంది. కాబట్టి ఆలోచనలను విడనాడి అధిష్ఠానమైన ఆత్మచైతన్యంగా ఆనందంగా ఉంటున్నాను.

అనంతచైతన్య ప్రకాశంవల్లనే మనలోని ఆలోచనలన్నీ తెలియబడుతున్నాయి. ఈ చైతన్యమే లేకపోతే బుద్ధి కేవలం జడపదార్థంగా ఉండిపోతుంది.

కాబట్టి సహజంగా తన భావాలతో తనకాధారమైన చైతన్యాన్ని తెలుసు కొనజాలదు. బేటరీ లైటులోని బల్బు తనవెనుక నున్న బేటరీలను ఎన్నటికీ కాంతివంతం చేయజాలదు. ఏ టెలిస్కోపూకూడా, మసకగానయినా, తన ద్వారా చూసే మనిషిని చూడజాలదు! ఇదేవిధంగా మనలో జీవంగా ఉంటూ, భావంలో సర్వాన్నీ తెలియబరుస్తున్న చైతన్యం, ఎన్నటికీ భావంచే తెలుసుకోబడదు. మన ఋషులంతా ఈ కారణంచేతనే ఆత్మను ఆవాఙ్మానస గోచరమని అన్నారు. భగవద్గీతలోకూడా భగవాన్ కృష్ణుడు, "**సూక్ష్మత్వాత్ తదవిజ్ఞేయమ్**"--అగోచర మైనంత సూక్ష్మ మైనది---అన్నారు.

భావాతీతమయిన ఈ ఆత్మనుగురించి మననం చెయ్యడమూ ధ్యానిం చడమూ కూడా బుద్ధిలో జనించే అపరిపక్వ ఆలోచనా విధానాలే. అయినప్పటికీ సాధకుని ప్రథమదశలో మనోబుద్ధులను శాంతింపజేయడానికి ఏకాగ్రము చేయ డానికి, ఎంతగానో ఉపయోగపడతాయి. భావాతీమయిన ఆత్మచైతన్యం గురించి భావించడంతో బుద్ధిలో ఆలోచనల అలజడి తగ్గి ప్రశాంతతనందుతుంది. భావా తీతస్థితిలో ఆత్మచైతన్యంగా ఉన్న జ్ఞాని ధ్యానించాలంటే ఆలోచనా రహిత స్థితినుండి ఆలోచనల అలజడిలోకి రావాలి! కాబట్టి "భావరహితుడనై నిత్యమూ శాంతంగా స్వస్థితలో ఉంటున్నాను" అని రాజర్షి చెపుతున్నారు.

**శ్లో॥ ఏవమేవ కృతం యేన స కృతార్థో భవేదసౌ ।**
**ఏవమేవ స్వభావో యః స కృతార్థో భవేదసౌ ॥8.**

టీ॥ యేన = ఎవనిచేత, ఏవమేవ = ఈప్రకారంగా క్రియారహితముగా, (సాధన వశాత్ = సాధనమూలముగా), కృతం = చేయబడినదో, సః అసౌ = అట్టి యితడు, కృతార్థః = కృతార్థుడుగా, భవేత్ = అగును, యః = ఎవడు, ఏవమేవ = ఈ ప్రకారము స్వతస్సిద్ధముగానే, స్వభావః = స్వభావము గలవాడగుచున్నాడో, సః = అతడు, కృతార్థః = కృతకృత్యుడు, భవేత్ = అగును.

ఈ స్థితిని సాధించిన సాధకుడు ధన్యుడు. పవిత్రమైన తన స్వరూపాన్ని దర్శించిన అట్టివాని జన్మ ధన్యం.

జీవన్ముక్తుడయిన జనకుడు, ఆ అపరిమితానందంలో తనను తానే అభినందించుకుటున్నాడు.

"బ్రహ్మైవాహమస్మి ఇత్యపరోక్షజ్ఞానేన నిఖిలకర్మబంధ వినిర్ముక్తో

జీవన్ముక్తః" --- అని ఆచార్య శంకరులు అన్నారు. "నేనే బ్రహ్మని అనే అపరోక్ష జ్ఞానంలో అన్ని కర్మలనుండి ముక్తుడయినవాడే జీవన్ముక్తుడు.

సాధకుడు సాధనద్వారా సాధనారహితమైన ఆత్మస్థితినంది జీవిస్తుంటే అతనికతడేసాటి. శారీరకంగా మనమధ్య జీవిస్తున్నా అతడు పరబ్రహ్మ స్వరూపమే. ఆత్మానుభవమతనిలో సహజంగా, అప్రయత్నంగా స్వతస్సిద్ధంగా ఉంటుంది. అట్టి వానిని గురించి ఏమని వర్ణించగలము? మానవులమధ్య నివసించే మాధవుడే అతడు! అట్టివాని జన్మ ధన్యం. పరిపూర్ణం!!

...

## అధ్యాయం-13

# ఆత్మ - పరమానంద స్వరూపం

క్రిందటి అధ్యాయంలోని చివరి శ్లోకంతో జనకునిలోని కవి మేల్కొన్నట్లు కనిపిస్తోంది. జీవన్ముక్తుడయిన ఆ రాజర్షి ఆత్మను ఆనంద స్వరూపంగా ఈ అధ్యాయంలో కీర్తిస్తున్నారు.

శరీరంతోనూ మనస్సుతోనూ బుద్ధితోనూ చేసే పనులన్నింటిని పూర్తిగా విసర్జించగానే తన స్వరూపంతో ఉండడం సంభవిస్తుందని జనకులు ఇదివరకే వివరించారు. పరిశుద్ధమైన ఆత్మ చైతన్యంలో కర్మగానీ అకర్మగానీ లేవు. సుఖదుఃఖాలు లేవు, మంచిచెడ్డలు ఉండవు. ఇవన్నీ శరీరానికీ మనస్సు కూ బుద్ధికి సంబంధించినవి మాత్రమే. వీటన్నిటినీ ప్రకాశింపజేసేది చైతన్యం. కాబట్టి అది వీటన్నిటికంటే పూర్తిగా భిన్నమైనది.

జీవన్ముక్తుడయిన జ్ఞాని అనుభవించే ఆనందాన్నీ స్థితినీ ఉపనిషత్తులు కూడా సరిగ్గా వర్ణించలేకపోయాయి. కానీ ఇక్కడ ఈ ఏడు శ్లోకాలలోనూ జనకుడు ఆ పరమానందమయ స్వరూపానుభవాన్ని మన బుద్ధికి కూడా అందేటట్లు వర్ణిస్తున్నారు.

అంతరంగంలో మనశ్శరీరాలపై వ్యామోహాన్నీ తాదాత్మ్యాన్నీ విడనాడడమే నిజమైన సన్యాసము. అంతేకాని బాహ్యంగా తనకున్న వస్తువులను విషయాలను త్యజించడం కాదు. సాధారణంగా భిక్షాపాత్రతో ఏకైక కాషాయవస్త్రంతో భిక్షువువలె జీవిస్తూ చెట్టుకింద నిద్రపోవడం సన్యాసంగా చాలామందిచేత భావింపబడుతోంది. అయితే ఏ విలువాలేని ఆ కొద్ది వస్తువులూ కూడా అతని మనస్సును బంధించగల సమర్థతగలవే. అవిపోతే ఎలా గడుస్తుందని వాటిమీద దృష్టి అంతా ఉంచడంలో ఆధ్యాత్మి కాభివృద్ధికి అవరోధం ఏర్పడుతుంది. నిందాగర్భితంగా తన గురువన్న మాటలు జనకునికి జ్ఞప్తిలో ఉన్నట్టున్నాయి. జనకుడు రాజభవనంలో

నివసిస్తూ సమస్త ఐశ్వర్యాలను అనుభవిస్తున్నాడు. అతడు దేనినీ త్యజించ లేదు. ఇక్కడ రాజర్షి స్వయంగా తనస్థితిని బాహ్యంగానూ అంతరంగంలోనూ కూడా గుర్తించి జవాబు ఇవ్వబోతున్నారు.

ఏకంగా అద్వయంగా కాలాతీతంగా పరిణామరహితంగా నిత్యంగా ఆత్మే ఉన్నదనే సిద్ధాంతం నుండి వేదాంతం చెప్పిన, "అజాతవాదం" ఉద్భవిస్తోంది, అసలు సృష్టి పుట్టనేలేదు అని దీని అర్థం. నిజానికి ఉపనిషదుద్యాన పుష్పాల నుండే ఈ **అజాతవాదం** సౌందర్యాన్నీ సౌరభాన్నీ సంతరించుకుంది. హిందూతత్త్వశాస్త్ర విద్యార్థులమయిన మనం ఒక విషయాన్ని మాత్రం ఒప్పుకుని తీరాలి. ఉపనిషత్తులలో సూచనామాత్రంగా ఉన్న ఈ అజాతవాదాన్ని గ్రహించి వేదాంతంగా బోధించిన వారిలో ప్రథముడు అష్టావక్రమునీంద్రుడే. దీని తర్వాత నిస్సందేహంగా మాండూక్య కారికలో ఈ "అజాతవాదం" నిర్దుష్టంగా విపులంగా వేదాంత తత్త్వశాస్త్రంగా వివరింపబడి గుర్తింపబడింది.

ఇక్కడ వర్ణింపబడిన స్థితి జడపదార్థ నిర్మాతలయిన మనశ్శరీరాల భావనా తరంగాల జంఝామారుతానికి అందనిది, అతీతమయినది. నిశ్చలమూ నిత్యానంద స్వరూపమూ నిర్మలమూ అయిన ఈ స్థితి జీవన్ముక్తునిచే తానే అద్వయమయిన ఆత్మ చైతన్యమే దృఢజ్ఞానంతో అనుభవింపబడుతుంది.

**జనక ఉవాచ :-**

**శ్లో॥అంకిచనభవం స్వాస్థ్యం కౌపీనత్వేऽపి దుర్లభమ్ ।**
**త్యాగాదానే విహాయాస్మాత్ అహమాసే యథాసుఖమ్॥1**

టీ॥ అకించనభవం = (బ్రహ్మముతప్ప) మరేమియు లేదనెడి విచారణ వలన పుట్టిన, స్వాస్థ్యం = చిత్తము యొక్క స్థిరత, కౌపీనత్వే అపి = కౌపీనధారణము చేసినప్పటికినీ, దుర్లభం= దుర్లభము, అస్మాత్ = ఈ కారణమువలన, త్యాగాదానే = త్యాగగ్రహణములను, విహాయ = విడిచిపెట్టి, అహం = నేను, యథాసుఖం = సుఖపూర్వకముగా, ఆసే =ఉంటున్నాను.

**ఆత్మమాత్రమే** ఉందని రెండవదేది ఎప్పుడూ ఎక్కడా లేదనే నిశ్చయ జ్ఞానంవల్ల లభించే శాంతి అరుదైనది. కేవల కౌపీనధారికి కూడా అందరానిది. ఈ నిశ్చయజ్ఞానంతో త్యాగభావమూ భోగభావమూ రెండు లేకుండా నేను సుఖంగా జీవిస్తున్నాను.

ఆత్మానందాన్ననుభవించడానికి బాహ్యంగా వస్తువులను విషయాలను త్యజించినంతమాత్రాన ఏమీ ప్రయోజనముండదని పైన తెలుసుకున్నాము. తను బ్రతకడానికి అవసరమయిన వస్తువులను మాత్రమే ఉంచుకొని మిగిలిన వాటినన్నిటినీ దానం చేసినంతమాత్రాన--"అకించనభవం"--తాను తప్ప రెండవ దేదీలేదని, సృష్టిపుట్టనేలేదనీ జ్ఞానం కలుగద్దు, అనుభవం రాదు. త్యజించడానికి గాని, గ్రహించడానికి గాని కొంతయినా వ్యక్తిగత, అహంకారం మిగిలి ఉండాలి. అహంకారం అజ్ఞానజనిత భ్రమాకల్పన. ఈ అహంకారం పూర్తిగా నశించిన జ్ఞానిలో త్యజించేదెవరు? గ్రహించే దెవరు? దేనిని త్యజించడం, దేనిని గ్రహించడం? ఈ ద్వంద్వాలు నశించిన పరమానంద స్వరూపమే ఆ స్థితి. అందుకే జనకుడు "త్యాగ, భోగ, భావములు రెండూ లేకుండా సుఖంగా ఉన్నాను" అంటున్నారు.

వేరు వేరు ఉపనిషత్తులలో వేరు వేరు ఋషులచే సృష్టిని గురించి అనేక విధాలుగా బోధింపబడినప్పటికీ నిశితంగా పరిశీలించి చూస్తే ఒక విషయం స్పష్టపడుతుంది. అందరు ఋషులు కూడ మనోబుద్ధుల నధిగమించిన తరువాతే సత్యం అనుభూతమౌవుతుంది అని సూచిస్తూనే ఉన్నారు. ఆ భావాతీత స్థితి దృష్టితో చూస్తే అజ్ఞానం కారణంగా కలిగిన భ్రమాజనిత మనశ్శరీరాలూ వాటి వ్యవహార క్షేత్రమయిన ప్రపంచమూ కూడా, నిజానికి ఎక్కడా ఉనికి కలిగిలెవు. కేవలంగా ఆత్మచైతన్యం మాత్రమే అనంతానంద స్వరూపజ్యోతిగా నిత్యమూ భాసిస్తోంది, ఇది నిత్యం, అచలం, స్థిరం, అద్వయం.

భావనాతీతమయిన ఈ ఆత్మచైతన్యం దృష్ట్యా ఈ విశాల విశ్వం ఎప్పుడూ భావింపబడలేదు, భాసించలేదు! ఈ అజాతవాదం ఉపనిషత్తులం దంతటా నిండి నిబిడీకృతమై గూఢంగా ఉంది. అష్టావక్ర మునీంద్రుడు దీనిని వివరిస్తూ దృఢంగా చెపుతున్నారు. ఈయన తరువాత గౌడపాదుడు ఈ సిద్ధాంతాన్ని బాగా విస్తరించి ప్రత్యేక తత్త్వజ్ఞానంగా అజాతవాద సిద్ధాంతంగా తన కారికలో నిరూపించి వివరించేరు కారిక ఇలా అంటోంది.

యధా న జాయతే కించిత్ జాయమానం సమంతతః

(మాండూక్య ఉపనిషత్తు అద్వైత ప్రకరణం-12)

యతో జీవః సంభవోऽస్య న విద్యతే
ఏత దుత్తమం సత్యం యత్ర కించన్నజాయతే ॥

(మాండూక్య ఉపనిషత్తు, అద్వైతప్రకరణం-48)

"దేనినుండి నిజానికి ఏదీ పుట్టకుండానే అనంతనామ రూపాలతో ఉన్నట్టుగా భ్రమకొల్పుతున్నదో" అని చెపుతూ గౌడపాదుడు తన అద్వైత ప్రకరణాన్ని సుస్పష్టంగా ఇలా అంటూ ముగిస్తున్నారు.--"జీవుడనేవాడు ఎప్పుడూ పుట్టనేలేదు. జీవులు కార్యంగా కనబడదగిన కారణమే ఎన్నడూ ఎక్కడా లేదు. ఎప్పుడూ ఎక్కడా ఏదీ పుట్టనేలేదన్నదే సత్యమైన జ్ఞానం."

**శ్లో॥ కుత్రాపి ఖేదః కాయస్య జిహ్వా కుత్రాపి ఖిద్యతే ।**
**మనః కుత్రాపి తత్త్యక్త్వా పురుషార్థే స్థితః సుఖమ్ ॥2.**

**టీ॥** కుత్రాపి = ఎక్కడనో-ఒక్కొక్క విషయమై, కాయస్య = శరీరమునకు, ఖేదః = దుఃఖము, (భవతి = కలుగుచున్నది), కుత్రాపి = ఒకచోట, జిహ్వా = జిహ్వ, ఖిద్యతే = దుఃఖించుచున్నది, కుత్రాపి=ఎక్కడనో, మనః = మనస్సు, ఖిద్యతే = దుఃఖించుచున్నది, అతః = ఈ కారణమువలన, తత్ = ఆ మూడింటిని, త్యక్త్వా = విడిచిపెట్టి, పురుషార్థే = పరమపురుషార్థమైన ఆనందమునందు, స్థితః = ఉంటున్నాను.

**శరీర శ్రమ ఒకచోట, మాటలాడడం వలన అలసట మరొకచోట, ఆలోచన అలజడి ఇంకొక చోట, జీవలక్ష్యంగా పురుషార్థంగా దీనిని భావించకుండా త్యజించి, నేను సంతోషంగా జీవిస్తున్నాను.**

అలసటకీ అశాంతికీ కారణాలు---కాయిక, వాచిక, మానసిక కర్మలే అని ఇదివరకే తెలుసుకున్నాం. తన విజ్ఞానంతో జనకుడు---ఇంద్రియాలు అశాంతిని సదా సృష్టిస్తాయనీ శరీరమే జీవితాన్ని నశింపజేస్తుందనీ స్పష్టంగా గ్రహించగలిగేడు. యోగవాశిష్టంలో ఇదే భావం కవితాస్ఫూర్తితో ఇలా వర్ణించబడింది.

కురంగాలి పతంగేభమీనాస్త్వేకైకశో హతాః
సర్వైర్యుక్తైరనర్థైస్తు వ్యాప్తస్యాజ్ఞ కుతః సుఖమ్. (యోగవాశిష్ఠం)

*లేడి భ్రమరం, సీతాకోకచిలుక, ఏనుగు, చేప----వీటిలో ఒక్కొక్కటీ ఒక్కొక్క జ్ఞానేంద్రియం మీద వ్యామోహంతోనే తమ చావును కొనితెచ్చుకొంటున్నాయి. అజ్ఞాని అయిన మానవుడు తనఅయిదు జ్ఞానేంద్రియాలతోను తాదాత్మ్యం చెందుతున్నాడు. పాపం అతనికి ఈ ప్రపంచంలో ఏవిధంగా సుఖం లభించగలదు?*

ఇంద్రియాలు విషయభోగాలవైపు ఆకర్షింపబడడం ఒక్కటే అలసటకూ అశాంతికీ కారణం కాదు. శారీరికంగా చేసే తపస్సులూ, జప, ధ్యానాదులూ ఉపవాసాది నియమాలూ కూడా శరీరనాశన హేతువులే. భావాతీతచైతన్య స్థితుడైన జనకునికి ఈ భావాలతో ప్రమేయమూ ప్రయోజనమూ కూడా లేదు.

జప యోగాభ్యాసం చేసేవారు మంత్రాలనూ శాస్త్రాలనూ చదవడం కూడా "వాచిక" మయిన అలసటను అశాంతిని కలిగిస్తాయి. ధ్యానం కోసం ప్రయత్నించడం మనోబుద్ధుల నాశనానికి దారితీస్తాయి. ఆత్మచైతన్య నిష్ఠు డయిన జనకునికి వీటితో కూడా అవసరం లేదు. జీవితలక్ష్యం, పరమ పురుషార్థ మైన మోక్షం అతనికి సిద్ధసాధ్యంగా ఉంది, కాబట్టి కాయిక, వాచిక, మానసిక ప్రయత్నాలను వదలి "ఆనందంగా జీవిస్తున్నాను" అంటున్నారు.

**శ్లో॥కృతం కి మపి నైవ స్యాత్ ఇతి సంచిన్త్య తత్త్వతః ।**
**యదా యత్కర్తుమాయాతి తత్కృత్వాऽऽసే యథాసుఖం॥3.**

**టీ॥** కిమపి = ఏ కొంచమైనను, కృతం = శరీరాదులచేత చేయబడిన కర్మ, ఆత్మ కృతం = ఆత్మవలన చేయబడినది, నైవస్యాత్ = కానేకాదు, ఇతి = ఇట్లని, తత్త్వతః = యథార్థముగా, సంచింత్య = విచారించి, యదా = ఎప్పుడు, యత్ = ఏ కొంచెము కర్మ యైనను, కర్తుం=చేయుటకు, ఆయాతి = (అవసరము) వచ్చుచున్నదో, తదా = అప్పుడు, తత్ = దానిని, కృత్వా=చేసి, యథాసుఖం = సుఖపూర్వకముగా, ఆసే = ఉంటున్నాను.

**ఆత్మగా నిజానికి ఏ పనీ చెయ్యడంలేదనే నిశ్చయజ్ఞానంతో యథేచ్ఛగా ప్రాప్తించిన వానిని చేస్తూ (కర్తృత్వ భావంలేకుండా) నిజమైన సుఖంతో జీవిస్తున్నాను.**

గతజన్మ ప్రారబ్ధానుగుణంగా వాసనలతో పుడుతున్నాము. వాసనల కారణంగా బుద్ధిలో ఆలోచనలు కలుగుతున్నాయి. ఇవే కోరికలుగా మనస్సులో సంక్షోభాన్ని సృష్టిస్తున్నాయి. దీని ఫలితమైన కాయిక కర్మలుగా వ్యక్తమవు తున్నాయి. వాసనలు క్షయించిపోతే కోరికలు నశిస్తాయి. సహజంగా మనస్సు శాంతించి ఆలోచనల అలజడి తగ్గుతుంది. దానివలన అహంకార యుక్తము స్వార్థపూరితము అయిన కర్మలను అట్టివ్యక్తి చేయజాలడు. అదే చైతన్య స్వరూప స్థితి. ఆత్మసర్వవ్యాప్తమూ పూర్ణమూ కాబట్టి ఆత్మ చెయ్యవలసినదీ సాధించవలసినదీ ఏదీ ఉండదు. ప్రత్యక్షానుభవ సిద్ధమయిన ఈ మహత్తర జ్ఞానంతో జనకుడు కాయిక వాచిక మానసిక కర్మలనుండి విముక్తుడైనాడు. నేను చేస్తున్నాను, అనుభవిస్తున్నాను అనిపించే కర్తృత్వ భోక్తృత్వ భావాలతనిలో లేవు. ఈ విధంగా అహంకారంనుండి విముక్తుడైనాడు. అట్టిజ్ఞాని ఏ పనిని చేసినట్టు మనకు కనిపించినా నిజానికి అక్కడ వ్యక్తీలేడు---కర్మ చెయ్యబడడ మూ లేదు.

అయినప్పటికీ ప్రారబ్ధానుసారంగా పనులను చెయ్యవలసి వచ్చినప్పుడు కేవల ఉపకరణంగా నిమిత్తమాత్రంగా చేస్తున్నానని జనకుడు అంటున్నారు.

అహంకారం లేని స్థితిలో తానున్నాడు కాబట్టి, అహంకారం దర్శించే అనంతసృష్టి, తన రాజ్యంతో సహా అదృశ్యమయి పోయిందనీ అందుకే సుఖంగా జీవిస్తున్నాననీ జనకుడు స్పష్టం చేస్తున్నారు.

శ్లో॥ కర్మనైష్కర్మ్య నిర్బంధ భావా దేహస్థయోగినః ।
సంయోగాయోగవిరహాత్ అహమాసే యథాసుఖం ॥4.

టీ॥ కర్మనైష్కర్మ్య నిర్బంధభావాః = కర్మలయొక్కయు, నైష్కర్మ్యముల యొక్కయు బంధనము వలన మిళితమైన భావములు గలవారు, దేహస్థ యోగినః = దేహమునందు ఆసక్తిగల యోగులుగా (ఉన్నారు), అహం = నేను, సంయోగ వియోగ విరహాత్ = దేహసంయోగ వియోగాదులు లేనివాడనగుటవలన, యథా సుఖం = సుఖ పూర్వకముగా, ఆసే = ఉంటున్నాను.

శరీర తాదాత్మ్యము కలిగిన యోగులు మాత్రమే కర్మచెయ్యాలని కానీ అక్కర లేదని కానీ అంటూ ఉంటారు. ఈ రెండు భావాలనుండీ విడిగా ఉండి నేను నిజమైన సుఖాన్ని అనుభవిస్తున్నాను.

మహర్షులలోకూడా కొంతమంది నిత్యమూ కర్మలను యోగభావంతో చేస్తూనే ఉండాలని బోధిస్తారు. మరికొంతమంది సర్వసంగ పరిత్యాగులకు మాత్రమే తత్త్వజ్ఞానాన్ని బోధిస్తారు. ఇక భగవద్గీతలో భగవాన్ కృష్ణుడు కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూడమని సూచించారు. ఈ వివిధ రకములయిన సలహాలూ విధానాలూ సాధకుల దేహతాదాత్మ్యాన్ని గమనించి ప్రత్యేక పరిస్థితు లలో చెప్పబడినవే.

తమోగుణ ప్రధానులు ఈ విధంగా శ్రద్ధగా స్వార్థంకోసం కర్మలను చెయ్యడం వలన రజోగుణాన్ని సాధిస్తారు. రజోగుణ ప్రధానులయిన సాధకులు యోగభావంతో కర్మల నాచరిస్తే సత్వగుణాన్ని పొందగలుగుతారు. సాత్వికు లయిన సాధకులు కర్మల నాచరిస్తూనే అకర్మత్వాన్ని గుర్తించి తద్వారా నిష్క్రి యమైన ఆత్మానుభవాన్ని పొందగలరు.

పరిపూర్ణ ఆత్మనిష్ఠుడయిన జనకుడు, తాను శరీరినని భావించి కర్మలను చెయ్యాలనుకోవడాన్నీ, శరీరికాడు కాబట్టి కర్మలను మానివెయ్యాలను

కోపడాన్నీ కూడా సమదృష్టితో వీక్షించి ఉపేక్షిస్తున్నాడు. అహంకారవర్జితుడయిన అతని కర్మలను అపేక్షించేవారుగాని ఉపేక్షించేవారుగాని వేరుగాలేరని తెలుసుకొని కర్మలపట్ల ఉదాసీన భావంతో సుఖంగా జీవిస్తున్నాడు.

**శ్లో॥అర్థానర్థౌ న మే స్థిత్యా గత్యా వా శయనేన వా ।**
**తిష్ఠన్ గచ్ఛన్స్వపం స్తస్మాత్ అహమాసే యథాసుఖమ్॥5.**

టీ॥ మే = నాకు, స్థిత్యా = ఉండుటచేతగాని, గత్యా = వెళ్ళుటచేతగాని, వా = లేక, శయనేన = పండుకొనుటచేతగాని, అర్థానర్థౌ = అర్థానర్థములు (ప్రయోజనా ప్రయోజనములు), న = కొంచెముగూడ లేవు, తస్మాత్ = ఆ కారణమువలన, అహం = నేను, తిష్ఠన్ = కూర్చొన్నవాడనైనను, గచ్ఛన్ = నడచుచున్నవాడనైనను, స్వపన్ = శయనించు చున్నవాడ నైనను, యథాసుఖమ్ = సుఖపూర్వకముగా, ఆసే = ఉంటున్నాను.

**నేను కర్మలను చెయ్యడంలోగాని,వదిలివెయ్యడంలోగాని,విశ్రాంతిలో గాని మంచిచెడ్డలేవీ ఉండవు. కాబట్టి నేను ఉన్నా, లేకున్నా, నిద్రపోయినా సుఖంగానే ఉంటాను.**

ఏ కర్మ అయినా తనంత తానుగా మంచీకాదు, చెడూకాదు. కర్త ఏ మనోభావంతో కర్మచేస్తాడో ఆ భావం ఆ కర్మకు చెందుతుంది. కర్త అయిన అహంకారమేలేని వ్యక్తివలన జరగబడిన పనులకు మంచిచెడులేవీ ఉండజాలవు. అటువంటి మహాత్ములద్వారా భగవదిచ్ఛ వ్యక్తమవుతూ లోకకళ్యాణ కారకమవు తుంది. కూర్చున్నా నడుస్తున్నా నిద్రపోతున్నా ఏ పనిచేసినా, క్లుప్తంగా చెప్పాలంటే వారి శరరం పనిచేస్తున్నా మానినా నిద్రలో ఉన్నా సర్వకాల సర్వావస్థలలోనూ కూడా వారు ఆత్మానుభవానందంలోనే స్థితినంది ఉంటారు. అందుకే జీవన్ముక్తు డయిన జనకుడు "నేను సుఖంగా జీవిస్తున్నాను" అనగలుగుతున్నారు.

**శ్లో॥ స్వపతో నాస్తి మే హానిః సిద్ధిర్యత్నవతో న వా ।**
**నాశోల్లాసౌ విహాయాస్మాత్ అహమాసేయథాసుఖమ్॥6.**

టీ॥ స్వపతః = నిద్రించుచున్న, మే = నాకు, హానిః = హాని, నాస్తి = లేదు, వా = లేక, యత్నవతః = ప్రయత్నించుచున్న, మే = నాకు, సిద్ధిః = సిద్ధి, న = లేదు, అస్మాత్ = ఈ కారణమువలన, అహం = నేను, నాశోల్లాసౌ = హాని వృద్ధుల రెంటిని, విహాయ=విడిచిపెట్టి, యథాసుఖం = సుఖపూర్వకముగా, ఆసే = ఉంటున్నాను.

నిద్రపోవడం వలన నాకు నష్టమూ లేదు, పనిచెయ్యడంవలన లాభమూ లేదు, కాబట్టి లాభం నష్టం అనే భావాలను విడనాడి నిజమైన సుఖంతో జీవిస్తున్నాను.

అనంతానంద స్వరూపమయిన ఆత్మనే తానుగా తెలుసుకున్న జ్ఞానికి విశేష వ్యయప్రయాసలతో కూడిన పనులవల్ల లాభం కొత్తగారాదు. అలాగే ఏ పనుల వల్లనూ కూడా అతని ఆనందం తరిగిపోదు. ఏ పనీ చెయ్యకుండా నిద్ర పోయినా అతని స్థితిలో మార్పు ఉండదు. పూర్ణత్వాన్ని అనుభవిస్తున్న అతనికి కర్మలవల్ల సాధించగలిగినదీ, కర్మలు చెయ్యకపోవడం వలన నష్టపోయేదీ ఏదీ ఉండదు. తన అహంకారంతోపాటుగా లాభ నష్టాలను గురించిన భావాలు కూడా అతనిలో లయం అయిపోయాయి. కాబట్టి "నేను నిజంగా సుఖంగా జీవిస్తున్నాను" అని జనకుడు అంటున్నాడు.

**శ్లో|| సుఖాదిరూపా నియమం భావేష్వాలోక్య భూరిశః ।**
**శుభాశుభే విహాయాస్మాత్ అహమాసే యథాసుఖమ్||7.**

టీ|| భావేషు = భావములయందలి (అనేక జన్మలయందలి), సుఖాది రూపా నియమం = సుఖాది స్వరూపము యొక్క అనిత్యతను, భూరిశః = పలుసారులు, ఆలోక్య = చూచి, అస్మాత్ = ఈ కారణమువలన, శుభాశుభే = శుభాశుభకర్మలను, విహాయ = విడిచి, యథాసుఖం = సుఖపూర్వకముగా, ఆసే = ఉంటున్నాను.

**వివిధ పరిస్థితుల కనుగుణంగా ఈసుఖదుఃఖాలు మారుతూ ఉండడాన్ని గుర్తించిన నేను మంచి చెడ్డలను విసర్జించి నిజమైన సుఖంతో జీవిస్తున్నాను.**

సాధారణ మానవుడు భవిష్యత్తులో సుఖంగా ఉండాలనే కోరికతో మంచిని ఆచరించడానికి యిష్టపడతాడు. చెడుకి దూరంగా ఉండాలనుకుంటాడు. దుర్మార్గుడు కూడా తన దుర్మార్గపు పనులను తను సుఖంగా ఉండాలనే ధ్యేయంతోనే చేస్తూ ఉంటాడు. సుఖాన్వేషణే సర్వకర్మలకు మూలకారణం అని నిస్సందేహంగా చెప్పవచ్చును.

ఇంకొంచెం నిశితంగా మనచుట్టూ ప్రపంచాన్ని పరిశీలించి చూస్తే, మంచి మార్గాన పయనించేవారు బాధపడుతూ ఉండడమూ, చెడుమార్గంలో నడిచేవారు హాయిగా ఉండడాన్నీ కూడా గమనించగలం!! వ్యక్తిచుట్టూ ఉండే అవకాశాలూ పరిస్థితులనుబట్టి సుఖదుఃఖాలు మారుతూ ఉండడాన్ని స్పష్టంగా

గుర్తించవచ్చు. అయితే నిజానికి ఈ సుఖదుఃఖాలనేవి బాహ్యపరిస్థితుల మీద కాకుండా వ్యక్తి మనస్తత్వం మీదే ఆధారపడి ఉంటాయి. మనస్సు నధిగమించి, దాని లక్షణాలయిన మంచి చెడులను విసర్జించి, "నేను నిజంగా సుఖంగా జీవిస్తున్నాను" అంటున్నారు. ఆత్మానంద నిష్ఠులయిన రాజర్షి!

•••

## అధ్యాయం-14

# ఆత్మ - శాంత స్వరూపమే

నాలుగే శ్లోకాలతో కూడిన ఈ అధ్యాయాన్ని, "శాంతిస్తుతిగా" పరిగణించవచ్చు. ఇందులో భావనాతీతమయిన అనంత శాంతస్థితి వర్ణింపబడి కీర్తింపబడినది. ఆలోచనా ప్రవాహమే మనస్సు జ్ఞాని సదా పూర్ణమైన ఆత్మనిష్ఠలో ఉంటాడు. కాబట్టి అతనిలో కోరికలు ఉండవు. అతనిలో కోరికలు లేవు. కాబట్టి ఆలోచనలు ఉండజాలవు. కాబట్టి సహజంగా అతని మన్సు ఆలోచనారహితంగా, శూన్యచిత్తంగా ఉంటుంది. అచింత్యమైన ఆత్మానుభవంలో అటువంటి మనస్సు మాత్రమే ఉంటుంది. అటువంటి మనస్సు బాహ్యవస్తుమయ ప్రపంచందృష్ట్యా నిద్రపోయిన మనస్సుతో సమానమే. అటువంటిజ్ఞాని శాంతస్వరూపమయిన తన ఆత్మస్థితిలో జాగృతుడై ఉంటాడు.

ఈ అధ్యాయాన్ని ముగిస్తూ జనకుడు, అటువంటి పరిపూర్ణజ్ఞాని నర్థం చేసుకోవడం అటువంటి మరొక జ్ఞానికి మాత్రమే సాధ్యమని అంటున్నారు. ఆత్మ చైతన్యానుభవాన్ని అర్థం చేసుకోవడానికి ఆత్మానుభవమే ఉండాలి.

**జనక ఉవాచ :-**

**శ్లో॥ ప్రకృత్యా శాన్తచిత్తో యః ప్రమాదాద్భావ భావనః ।**
**నిద్రితో బోధిత ఇవ క్షీణసంసరణో హి సః ॥ 1.**

**టీ॥** యః = ఏ పురుషుడు, ప్రకృత్యా = స్వాభావికముగనే, శాన్తచిత్తః = శాంత చిత్తుడైయున్నాడో, నిద్రితః = పండుకొనినవాడు, బోధిత ఇవ = మేల్కొలుపబడిన వానివలె, ప్రమాదాత్=ప్రమాదమువలన, భావభావనః=పూర్వవిషయములను భావించు వాడైనను, సః = అట్టివాడు, క్షీణసంసరణః = క్షీణించిన సంసారము గలవాడే, (సంసార రహితుడు)

సహజంగా వృత్తిరహితమూ భావశూన్యమూ అయిన మనస్సుతో ప్రాపంచిక విషయాలపై జ్ఞాపకము ధ్యాసలేకుండా, వచ్చిన సంఘటనలను వచ్చినట్టే చూస్తూ జీవిస్తాడు జ్ఞాని. ఈ కారణంగా అతడు మేలుకుని ఉన్నా నిద్రపోయినట్లే. శారీరికంగా నిద్రపోయినా ఆత్మానుభవంలో సదా మేలుకొని ఉన్నట్టే.

శరీరాన్ని దాటిన ఏ అనుభవాన్నైనా భాషతో వర్ణించడానికి వీలుకాదు. భావాతీతమయిన ఆత్మచైతన్యానుభవాన్ని వర్ణించడానికి ప్రయత్నించిన మహర్షులంతా తప్పనిసరిగా కొన్ని పద్ధతులనుపయోగించి అసంపూర్ణ వాక్యాలతో, సూచనలతో పూర్ణత్వాన్ని బుద్ధికందించే ప్రయత్నం చేసినారు. "శాంతచిత్తః"---శాంతమయిన మనస్సుగల జ్ఞాని ప్రపంచంలో ఎలా వ్యవహరించేది తెలియజెప్పడానికి జనకుడు ఇక్కడ ప్రయత్నించడంలో ఈ విషయం గోచరిస్తుంది.

ప్రాపంచిక విషయాలతో మనకుగల గత అనుభవాల జ్ఞాపకాలు మన చిత్తంలో నిక్షిప్తమై భవిష్యత్తును రూపొందిస్తుంటాయి. వీటిని వాసనలు అంటారు. ఈ వాసనారూప జ్ఞాపకాలు కోరికలై మనశ్శరీరాలను కర్మకు పురిగొల్పుతూ ఉంటాయి. ఈ జ్ఞాపకాలతో మరల అనుభవించాలనే కోరికలతో అహంకారం జీవిస్తూ బలీయమవుతూ ఉంటుంది. జ్ఞాని ఈ వాసనల నధిగమించినవాడు కాబట్టి---"క్షీణ సంసరణః"---అని వర్ణించినాడు. వాసనలు లేనివానికి జ్ఞాపకాలు కూడా ఉండవు. వాసనా రహితమయిన ఈ స్థితిలో మనస్సు భావశూన్యంగా శాంతంగా ధ్యానమగ్నమయినట్లుగా నిశ్చలంగా ఉంటుంది. జీవన్ముక్తునిలో ఈ స్థితి సహజంగా ఉంటుంది. "ప్రకృత్యా"---స్వభావసిద్ధంగా ఉంటుంది.

సహజంగా సర్వకాలాల్లోనూ తానే ఏకమూ అనంతమూ అయిన చైతన్యాన్ననే అనుభవసహితజ్ఞానం ఉన్నప్పటికీ, జ్ఞానియొక్క పూర్వప్రారబ్ధాను సారంగా అతని మనశ్శరీరాలు విషయానుభవాలను పొందుతూ ఉంటాయి. ఆ సమయాల్లో కూడా అట్టి జ్ఞాని ఆత్మనిష్ఠుడై ఉండి, ఆ అనుభవాలను నిద్రలోవలె అనుభవించడం జరుగుతుంది. అతడు మాత్రము సదా ఆత్మానుభవంలోనే జాగృతుడై ఉంటాడు.

ఈ స్థితి యోగాభ్యాసమువలననూ మత్తు మందుల వలననూ సాధింప బడినది కాదు. ఆత్మనిష్ఠుడయిన బ్రహ్మజ్ఞానికి ఈ దృష్టి అప్రయత్నంగా

సహజంగా నిత్యమూ ఉంటుంది. నానాత్వం కలిగిన ఈ జగత్తు అతని చైతన్యపు ఉపరిభాగాన నవరస భరితమయిన దృశ్యచిత్రంగా తెలియబడుతూ ఉంటుంది.

**శ్లో॥క్వ ధనాని క్వ మిత్రాణి క్వ మే విషయదస్యవః ।**
**క్వ శాస్త్రం క్వ చ విజ్ఞానం యదా మే గళితాస్పృహా॥2.**

టీ॥ యదా=ఎప్పుడు, మే=నాయొక్క, స్పృహా=కోరిక, గళితా = జారిపోయినదో, తదా=అప్పుడు, మే = నాకు, ధనాని = ధనములు, క్వ = ఎక్కడ, మిత్రాణి = మిత్రులు, క్వ = ఎక్కడ, విషయదస్యవః = విషయములనే దొంగలు, క్వ = ఎక్కడ, చ = మఱియు, శాస్త్రం = శాస్త్రము, క్వ = ఎక్కడ, విజ్ఞానం = విజ్ఞానము, క్వ = ఎక్కడ?

**కోరికలే లేని నాలో సంపదలు, మిత్రులు, విషయరూపమైన దొంగలు ఎక్కడ ఉన్నారు? ఇంతేకాదు,శాస్త్రాలు విజ్ఞానం కూడా నాలో ఎక్కడ ఉన్నాయి?**

అహంకార సహితుడయిన వ్యక్తిగా ఉన్నంతకాలం ధనం, మిత్రులు, శాస్త్రాలు, విజ్ఞానము ఎంతో విలువైనవి. వీటివలననే వ్యక్తికి భద్రత, సుఖము, తృప్తి లభిస్తాయి. అహంకారం ఉన్నంతకాలమూ విషయాలు వ్యామోహ రూపంలో మనలోనికి జొరబడి శాంతిని హరించి బాధలకు లోనుచేస్తాయి. ఈ విషయ వ్యామోహం లోపల ప్రవేశించిందంటే మన సమత్వబుద్ధినీ, వివేకాన్నీ, విజ్ఞానాన్నీ, సంస్కృతినీ, సర్వాన్నీ హరించగలదు. ఇది నిజంగా నిజమే. కానీ, కోరికలన్నీ నశించి, తానే అనంతానంద స్వరూపమైన ఆత్మనని తెలుసుకున్న జ్ఞానికి విషయాలమీద విలువ ఎలా ఉంటుంది? సంపద, మిత్రులు, శాస్త్రాలు, విజ్ఞానం, ఇవన్నీ కలిసి మనదనుకునే మాయా ప్రపంచాన్ని సృష్టించి చూపించి మోహపరుస్తున్నాయి. ఇవన్నీ జ్ఞానిలో ఎక్కడ ఎలా ఉండగలవు?

స్వరూపనిష్ఠుడయిన జ్ఞానికి శాస్త్రాలెందుకు? విజ్ఞానం మీద విలువ ఎలా ఉంటుంది? ఈ శాస్త్రాలూ విజ్ఞానమూ కూడా తన స్వరూపాన్ని రూపించి, చూపించడానికి ఉపయోగపడే మార్గాలు మాత్రమే. గమ్యంచేరిన వానికి మార్గం తో ప్రయోజన మేముంటుంది? మార్గం గుర్తుండడం వలన అవసరం మాత్రం ఏమిటి? ఈ కారణంగానే జ్ఞానికి శాస్త్రాలమీదా విజ్ఞానం మీదా కూడా విలువ ఉండదు. ఇదేవిషయం భగవద్గీతలో ఇలా చెప్పబడింది.

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః. (భగవద్గీత-2-46)

*వరదనీరు పొంగిపొర్లేచోట చిన్న కొలను ఏవిధంగా ఉంటుంది? ఇదే విధంగా బ్రహ్మవిదుడైన జ్ఞానికి వేదాలతో ప్రయోజనం ఏమిటి?*

**శ్లో॥ విజ్ఞాతే సాక్షిపురుషే పరమాత్మని చేశ్వరే ।**
**నైరాశ్యే బన్ధమోక్షే చ న చిన్తా ముక్తయే మమ ॥ 3.**

టీ॥ సాక్షిపురుషే = సాక్షిమాత్రుడును, (ప్రత్యగాత్మ స్వరూపుడును), పరమాత్మని = పరమాత్మయగు, ఈశ్వరే = ఈశ్వరుడు, విజ్ఞాతేసతి = తెలియబడినవాడగుచుండగా, నైరాశ్యే = ఆశారహితమైన, బంధమోక్షే = బంధము యొక్క, విముక్తియందు, మమ = నాకు, ముక్తయే = ముక్తికొఱకు, చిన్తా = చింత, న = లేదు.

**సర్వానికి సాక్షి అయిన పరమపురుషుని గ్రహించగలిగినాను. ఇందు వలననే బంధమోక్ష భావభ్రాంతినివీడి శాంతంగా ఉదాసీనంగా ఉంటున్నాను.**

శాంతి చతుష్టయమనదగిన ఈ నాలుగు శ్లోకాలలోనూ జనకుడు ఆత్మానుభవం ఎందుకు అనంతశాంతి స్వరూపమో, ఆ శాంతి మనశ్శరీరాల మాలిన్యాలతో ఎందుకు కలుషితం కావడంలేదో వివరించడానికి ప్రయత్నిస్తున్నారు.

శుద్ధచైతన్య స్వరూపమయిన పరమాత్మ,బాహ్యాభ్యంతరాలలో సంభవించే సర్వసంఘటనలనూ సాక్షిగా తెలుసుకుంటూ ఉంటుంది. ఈ చైతన్యపు సన్నిధే సర్వచరాచర ప్రపంచాన్నీ నియమిస్తూ, శాసిస్తూ, నడిపిస్తూ, ఈశ్వరుడుగా గుర్తింపబడుతున్నది. ఈ ఈశ్వరతత్త్వమే సాధకుని సహజ నిత్యస్వరూపమని గ్రహించిన తరువాత అతనికి బంధమోక్షాలు వ్యర్థపదాలుగా తోచి వాటిపట్ల నిర్లిప్తత వహిస్తాడు. బంధంలో ఉన్నవానికి ముక్తి. స్వరూపజ్ఞానం లభించిన సాధకునికి బంధంయొక్క బాధలూ, ముక్తి లభించిందనే సంతోషమూ కూడా ఉండవు. ఈ సంతోష విచారాల కలీతంగా భావరహిత శాంతస్థితిలో ఉంటాడు.

శరీరసంబంధమైన కోరికలూ, మానసిక ఉద్రేకాలూ బుద్ధిలో భావ సంఘర్షణాజనిత దుఃఖమూ---ఈ మూడింటి సమ్మేళన మనదగిన దుఃఖమయ ప్రపంచ భావము లయంకాగా బంధమేలేని జ్ఞానికి మోక్షం మీద ఆసక్తి ఆతృత ఉండవు.

ప్రస్తుతం మన ఉపాధిలో ఉన్న ఉపకరణాలతో పరిమితమైన విషయాలను మాత్రమే గ్రహించగలము. అపరిమితమూ పూర్ణమూ అయిన ఆ శాంత స్థితిని, ఈ పరిమిత ఉపకరణాలతో గ్రహించడం అసాధ్యం, అసంభవం. ఒక చిన్న గరిటతో సముద్ర జలాన్ని పూర్తిగా ఖాళీచేయడం సాధ్యమేనా? పరిమితమైన ఈ

మనస్సు పరిపూర్ణ శాంతస్వరూపాన్ని అర్థం చేసుకోవడం అసాధ్యం. అపరి మితమూ అచింత్యమూ అయిన ఆత్మను సూచించడానికి మాత్రమే భాషలు సహాయపడగలవు.

శ్లో॥ అంతర్వికల్పశూన్యస్య బహిః స్వచ్ఛందచారిణః ।
భ్రాంతస్యేవ దశాస్తాస్తాః తాదృశా ఏవ జానతే ॥ 4.

టీ॥ అంతర్వికల్ప శూన్యస్య = అంతఃకరణమునందు వికల్పములు లేనటు వంటిన్ని, బహిః = వెలుపలకు మాత్రము, భ్రాంతస్య ఇవ = భ్రాంతుడువలె నున్నటు వంటిన్ని, స్వచ్ఛందచారిణః = స్వతంత్రముగా సంచరించుచున్న అతని యొక్క, తాఃతాః = ఆయా, దశాః = అవస్థలను, తాదృశా ఏవ = అటువంటి వారే, జానతే = తెలుసుకొను చున్నారు.

ఆంతర్యం భావశూన్యంగా, బహిరంగంగా బాలకునివలె స్వేచ్ఛగా విహరించేజ్ఞాని, బాహ్యంగా భ్రమకులోనై వ్యవహరిస్తున్నట్లే గోచరిస్తుంది. కాని నిజానికీ అతనిస్థితి అటువంటి మరొక జ్ఞానికి మాత్రమే తెలుస్తుంది.

శూన్యచిత్తుడై భావశూన్యుడై చైతన్యస్వరూపమయిన జ్ఞానిలో మనస్సు శాంతంగా బుద్ధి ఆలోచనా రహితంగా నిశ్చలంగా ఉంటుంది. కాబట్టి సహజంగా అతనిలో సంకల్ప వికల్పాలు,సంశయ,సందేహాలు ఉండవు. అహంకారరహితుడై ఆనందంగా చరించే అతనికి సామాజిక, లౌకిక, మత ధర్మాలేవీ వర్తించవు. అతనిలో కోరికలేమీ ఉండవు కాబట్టి అతడేపని చేసినా పరిణామాన్ని దృష్టిలో ఉంచుకోడు. అట్టి మహాత్ముల అడుగుజాడలు అఖిల మానవాళికి అనుసర ణీయాలు. అయినప్పటికీ అట్టివారి స్వేచ్ఛాచార ప్రవృత్తి మన సామాజిక, లౌకిక, రాజకీయ, మతధర్మాలకు ఒక సాకులాగా ప్రశ్నార్థకంగా అనిపించక మానదు! వారికి వారే ధర్మనియంతలు. ధర్మస్వరూపం రూపు దిద్దుకుంటుంది. వారి అడుగుజాడలలో.

అట్టి జ్ఞానులను నిర్ణయించడానికి మరొక జ్ఞానికి మాత్రమే సాధ్యమవు తుంది. జ్ఞానులయొక్క బాహ్యప్రవర్తన ఈ విధంగా అగమ్యగోచరంగా ఉండడంతో బాహ్యలక్షణాలనుబట్టి జ్ఞానులను నిర్ణయించడం అసాధ్యం అవుతోంది.

అట్టి మహాపురుషులను గూర్చి యోగవాశిష్టం ఇలా అంటోంది.

సంశాంతాంతఃకరణో గలితవికల్పః స్వరూప సారమయః
పరమ శమామృత తృప్త స్తిష్ఠతి విద్వాన్నిరావరణః. (యోగవాశిష్టం)

"భావసంచలనము అణగిపోగా, శాంతస్థితినందిన మనో బుద్ధులతో, మాయావనికను ఛేదించి, అనంత శాంతమనే అమృతాన్నాస్వాదిస్తూ, సదా శాంతుడై జీవనలీలను సాక్షిగా చూస్తూ ఉంటాడు" అట్టిజ్ఞానులు మానవాళికి మార్గ దర్శకులై ధృవతారలై ప్రకాశిస్తూ ఉంటారు!

•••

అధ్యాయం-15

# సత్యం ఏకం - అదే ఆత్మ బ్రహ్మం

అష్టావక్రగీత మొత్తంలో, అనంతభావగర్భితమూ, అపూర్వ సందేశ సమన్వితమూ అయిన అధ్యాయం ఇదే అని చెప్పక తప్పదు. పరమ సత్యమైన ఆత్మ సందేహరహితమైన పదాలతో ఇందులో ఇలా నిర్వచింప బడింది."ఏకమైన ఆత్మ చైతన్యము సృష్టి అంతటిలోనూ, సృష్టిఅంతా ఆత్మ చైతన్యంలోనూ ఉన్నది. శాస్త్రాలలో "తత్" పదంచే సూచింపబడే సత్ చిత్ ఆనంద స్వరూపం, భగవత్తత్త్వము---అహంకారరహితమైనది, అనాది, అకర్త; అటువంటి ఆత్మతత్త్వంలో ఎన్నడూ రెండవదేదీ లేనేలేదు. ఈ భావమే అజాతవాదంగా రూపొందింది. కార్యకారణ సంబంధంగా మనస్సుచే తెలియ బడే నామరూపాత్మకమైన మిథ్యా ప్రపంచమంతా ఆత్మ మాత్రమే; రెండవ దేదీ ఎక్కడా ఎన్నడూ లేదు.

అష్టావక్రుడు ఎంతో ప్రేమతో---"శ్రద్ధస్వ, శ్రద్ధస్వ"---ఈ అద్భుత మైన సత్యంలో విశ్వాసముంచమని అంటున్నారు. వివిధ అవస్థలలోనూ సర్వత్రా సమానంగా వ్యక్తమవడం మాత్రమే కాదు, ఈ పరిశుద్ధమైన ఆత్మ చైతన్యము భగవంతునివలె ఆరాధనీయమైనది, అతి పవిత్రమైనది.

బ్రహ్మతత్త్వము సాధకులందరికీ ప్రత్యక్షమయ్యే రీతిలో అవగాహన అయే విధంగా ఈ అధ్యాయంలో వివరింపబడింది. అష్టావక్రుడు ప్రగాఢమూ నిగూఢమూ అయిన తనఅనుభవంతో దీనిని చెప్పుతున్నారు. హిందూతత్త్వ శాస్త్రగ్రంథాలలో మరే గ్రంథమూ కూడా బ్రహ్మతత్త్వాన్ని ఇంత స్పష్టంగా సాధకుల బుద్ధికి అందించలేదని ఒప్పుకుని తీరాలి. అగాధమయిన తత్త్వ రహస్యాన్ని, అపూర్వమయిన సాధనావిధానాలతో,అద్భుతంగా,అసమానంగా, సాధకులు సత్యాన్వేషణాతురమయిన సునిశిత తీక్షణబుద్ధికి అందించగలదీ గీత. ప్రగాఢమయిన ధ్యానంలో దారిగానక పరితపించేవారికి అర్థమయిన సూచనలను అనువైన విధానంలో అందించగలిగినదీ గీత మాత్రమే.

అష్టావక్ర ఉవాచ :-

శ్లో॥ యథా తథోపదేశేన కృతార్థః సత్త్వబుద్ధిమాన్ ।
అజీవమపి జిజ్ఞాసుః పరస్తత్ర విముహ్యతి ॥ 1.

టీ॥ సత్త్వబుద్ధిమాన్ = సాత్త్వికబుద్ధిగలవాడు, యథాతథోపదేశేన = ఏ కొద్ది (సామాన్య) ఉపదేశమువలననే, కృతార్థః = కృతార్థుడుగా, భవతి = అగుచున్నాడు, పరః = ఆ సత్పురుషుడు, ఆజీవం = జీవిత పర్యంతము, జిజ్ఞాసురపి = తెలిసికొనుటకు యిచ్ఛగలవాడగుచున్నను, తత్ర = ఆ విషయము నందు, విముహ్యతి = మోహమును పొందుచున్నాడు.

**సత్త్వగుణ ప్రధానుడయిన సత్యాన్వేషికి ఆత్మతత్త్వం ఏవిధంగా ఉపదేశింపబడినా వెంటనే గ్రహించగలడు. మిగిలినవారు జీవితాంతమూ అధ్యయనం చేసినా అర్థాన్ని గ్రహించలేరు.**

బోధిపంబడే వేదాంత గ్రంథం ఒక్కటే అయినప్పటికిని బోధించే గురువు కూడా ఒక్కరే అయినప్పటికి ఈ బోధన, శిష్యులలో అనేకరకాలుగా గ్రహింపబడుతుంది. మహత్తరమయిన ఈ సత్యాన్ని అందుకునే సంసిద్ధత శిష్యునిలో ఉంటేనే బోధన సఫలమవుతుందనే సత్యాన్ని ఉపనిషద్ గ్రంథాలన్నీ కూడా గుర్తించినవి.

సత్త్వగుణ ప్రధానమయిన మనస్సు శాంతంగా నిశ్చలంగా ఉండి ఉపనిషత్తులలో బోధింపబడిన భావాల వాచ్య లక్ష్యార్థాలను యథాతథంగా గ్రహించ గలుగుతుంది. ఇది మనస్సు రజోగుణంతో అశాంతిగా అలజడిగా ఉన్నా, తమో గుణంతో అలసత్వంతో ఉన్నా, గంభీరమయిన శాస్త్రార్థాలను గ్రహింపజాలదు. మనస్సులో ఆలోచనా ప్రవాహపు ఉరవడి తగ్గి శాంత సంతోష స్థితిలో ఉన్నప్పుడు ఉద్రేకాల కోరికల జంఝామారుతం వీచనప్పుడు మనస్సు సత్త్వగుణం సంపా దించిందన్నమాట. అట్టి మనస్సుకే అత్యంత నిగూఢమయిన శాస్త్రజ్ఞానం అర్థం అవుతుంది. ఫలితంగా సత్యాన్ని దర్శించగలుగుతుంది.

ఇట్టి సంసిద్ధత కలిగిఉండడాన్ని అధికారిత్వం అని అంటారు. ఉత్తమాధికారి అయిన శిష్యునికి ఎవరిచే ఏవిధంగా ఉపదేశింపబడినా కేవలం సూచించబడినా కూడా సత్యం అవగతమవుతుంది. శుద్ధచైతన్య స్వరూపానుభవం కలిగి తీరుతుంది.

సాధకుని అంతరంగం శుద్ధినందకుండా, మనోబుద్ధులు కోరికల తీవ్రతచే తపిస్తున్న తరుణంలో జీవితాంతమూ శాస్త్రాన్ని అధ్యయనంచేసినా అర్థం చేసుకోలేక సందేహాలతో సతమత మవుతూనే ఉంటాడు.

**ఈ కారణం చేతనే యోగవాశిష్ఠం గురువులకు ఇలా సలహా నిస్తోంది.**

ఆదౌ శమదమ ప్రాయైః గుణైః శిష్యం విశోధయేత్
పశ్చాత్సర్వమిదం బ్రహ్మ శుద్ధస్త్వమితి బోధయేత్. (యోగవాశిష్ఠం.)

*ముందుగా శిష్యుని నిగ్రహాశక్తినీ శమదమాది సంపత్తినీ పరీక్షించాలి. ఆ తరువాత అర్హలకు "ఈ సృష్టి సర్వానికీ అధిష్ఠానమయిన పరమాత్మ చైతన్యమే నీవు" అనే సత్యాన్ని ఉపదేశించాలి.*

**శ్లో॥ మోక్షో విషయవైరస్యం బన్ధో వైషయికో రసః ।**
**ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు॥ 2.**

టీ॥ విషయవైరస్యం = విషయములయందుగల వైరాగ్యమే, మోక్షః = మోక్షము, వైషయికః = విషయసంబంధమైన, రసః = రసము, బన్ధః = బంధము, విజ్ఞానం = విజ్ఞానము, ఏతావదేవ = ఇంతమాత్రమేను, యథేచ్ఛసి = ఎట్లు అభిలషించుచున్నావో, తథా = ఆ ప్రకారము, కురు = చేయుము.

**విషయ భోగాలపై విరక్తియే ముక్తి. విషయ వాంఛలే బంధం. ఇదే నిజమైన జ్ఞానం. ఇది తెలుసుకుని నీకు ఇష్టము వచ్చినరీతి జీవించు.**

బంధం అంటే ఏమిటో, మోక్షం ఏమిటి స్పష్టంగా క్లుప్తంగా సాధకులకు సులభంగా అర్థమయేవిధంగా అందంగా నిర్వచిస్తున్నారు అష్టావక్రులు. అజ్ఞాన జనితమయిన అహంకారం ఆనందాన్వేషణలో అనంత వైవిధ్యంగల విషయాలను అనునిత్యమూ కోరుతూ ఉంటుంది. ఉన్న సమయమూ శక్తి కూడా వీటిని సంపాదించడానికే చాలక పరితపిస్తూ ఉంటుంది. ఈ స్థితే బంధమనబడుతుంది.

విశ్వవ్యాప్తమయిన ఆత్మచైతన్యానుభవం కలగగానే అహంకారం అదృశ్య మయిపోతుంది. పూర్ణత్వం సాధ్యమయిన ఈ స్థితిలో అహంకారం లయమవడం మాత్రమే కాదు, అంతవరకూ ఉన్న విషయవాంఛలన్నీ కూడా అంతర్థానమయి పోతాయి. విషయ భోగాలపై కలిగే ఈ విముఖతే, ఈ వైరాగ్య భావమే ముక్తికి సూచన.

తత్త్వజ్ఞాని అయిన అష్టావక్రుడు ఈవిధంగా బోధించిన తరువాత శిష్యునికి

తన జీవిత పథాన్ని మలుచుకోవడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇస్తున్నారు. ఇంకా వాసనలు మిగిలి ఉన్నవారు వాసనాక్షయ మయేవరకూ విషయ భోగాల మధ్య వివేకవంతమైన బుద్ధితో జీవించాలి. ఇంతకంటే వేరే మార్గం లేదు. వాసనల ఉధృతి తగ్గినవారిలో సహజంగా వైరాగ్యభావం ఉంటుంది. తనను తాను తెలుసు కునే ఈ యాత్రలో బలప్రయోగం చెయ్యకూడదు. సహజంగా ఎదగాలి తప్ప తిరగబడకూడదు. అందుచేతనే ఉపదేశానంతరం గురువులంతా తమ శిష్యులకు వారి జీవితాలను యథేచ్ఛగా మలచుకోవడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇస్తారు. అలా వారి జీవిత పథాలను నిర్ణయించుకోవడంలో వారి వాసనలను క్షయింప జేసుకునే అవకాశం లభిస్తుంది. భగవద్గీతలో కూడా శ్రీకృష్ణుడు తన బోధను ఇటువంటి భావంతోనే సమాప్తి చెయ్యడాన్ని చూస్తాం.

ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాత్ గుహ్యతరం మయా
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు. (భగవద్గీత-18-63)

*గుహ్యతమమైన ఈ జ్ఞానం నాచే నీకందించబడింది. బాగా మననం చేసిన తరువాత నీకు తోచిన రీతిలో వ్యవహరించు.*

మనస్సులోతీసుకునే నిర్ణయమే తెలియజేస్తుంది----వ్యక్తి బంధింపబడి ఉన్నాననుకుంటే ముక్తిని కోరుతుంది అతని మనస్సు. ఈ సందర్భంగా ఆచార్య శంకరులు ఇలా అంటున్నారు.

మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్.

*బంధమోక్షాలు రెండింటికీ మనస్సేకారణం. విషయభోగాలను వాంఛించే మనస్సు బంధింపబడుతుంది, శాంత మనస్సు ముక్తిని చూస్తుంది. జ్ఞానులందరూ ఈ విషయాన్నే పదే పదే చెప్పుతున్నారు.*

**శ్లో॥ వాఙ్మి ప్రాజ్ఞమహోద్యోగం జనం మూకజడాలసమ్ ।
కరోతి తత్త్వబోధోఽయం అతస్త్యక్తో బుభుక్షుభిః ॥ 3.**

టీ॥ అయం = ఈ, తత్త్వబోధ = తత్త్వజ్ఞానము, వాగ్మిప్రాజ్ఞమహోద్యోగం = అతి వక్త పండితుడు, గొప్ప ఉద్యోగియగు, జనం = జనుని, మూక జడాలసం = మూగ వానినిగను-జడునిగను-అలసునిగను, కరోతి=చేయుచున్నది, అతః = ఈ కారణమువలన, బుభుక్షుభిః = భోగేచ్ఛగలవారలచేత, అయం = ఈ బోధము, త్యక్తః = విడిచి పెట్టబడుచున్నది.

చురుకుగా తెలివిగా చక్కగా వ్యవహరించే వానిని ఈ జ్ఞానం మూగవానిగా జడసమునిగా నిర్లిప్తంగా మారుస్తుంది. కాబట్టి విషయ భోగ వాంఛా రతులైన వారు ఈ జ్ఞానాన్ని గర్హిస్తారు, ద్వేషిస్తారు.

ప్రపంచ వ్యవహారాల్లో ప్రగతిని సాధించాలంటే మంచి తెలివితేటలు, చురుకుదనము, వాగ్ధాటి, ప్రపంచ జ్ఞానము ఉండితీరాలి. అప్పుడు మాత్రమే వ్యవహారపరంగా ఉండే పోటీలో నెగ్గగలరు. ధ్యానశీలి అయిన సాధకుడు సాధన దశలో అజ్ఞాన జనితమయిన ప్రపంచంనుండి తన దృష్టిని మళ్ళిస్తాడు. కాబట్టి సహజంగా అతని ప్రవర్తన మూఢునివలె, జడసమునివలె, నిర్లిప్తంగా మారుతుంది. కాబట్టి విషయాలననుభవించాలనుకునేవారు ఈ జ్ఞానాన్ని గర్హిస్తారు.

అధ్యాత్మిక జీవితమంటే నిరాశానిస్పృహలతో జీవన్మృతునివలె జీవించడం అని అపోహపడకూడదు. బుద్ధుడు బోధివృక్షం క్రింద కూర్చుని తపస్సు చేసుకునే రోజుల్లో, పనికిరానివాడుగా, సోమరిపోతుగా, సమాజానికి భారంగా భావింపబడి ఉంటాడు. ఆత్మజ్ఞానాన్ని సంపాదించిన తరువాత భగవాన్ బుద్ధుడు గా ఆరాధింపబడుతున్నాడు. విషయలోలురైన మామూలు మనుష్యుల దృష్టిలో ఈ నాటికికూడా కారుణ్యమూర్తిగా అనేకమంది హృదయాలలో ఆరని జ్యోతిగా ఆరాధింపబడుతున్నాడు. విషయంలోలురైన మామూలు మనుషుల దృష్టిలో ఆధ్యాత్మిక జీవితం నిరాశా పూరితంగా నిర్వీర్యంగా నిష్ఫలంగా కనిపిస్తుంది. ప్రాపంచిక జీవితం అందంగా అర్థవంతంగా అనిపించి విషయ భోగాలననుభవిస్తూ వాసనలను క్షయింపజేసుకుంటారు.

"యథేచ్ఛసి తథాకురు"----యథేచ్ఛగా జీవించు అని క్రిందటి శ్లోకంలో శిష్యునితో చెప్పేరు మునీంద్రులు. ఈ శ్లోకంలో అలా అనడంలోని అంతరార్థాన్ని స్పష్టంగా వివరించారు.

శ్లో॥ న త్వం దేహో న తే దేహో భోక్తా కర్తా న వా భవాన్ ।
చిద్రూపోऽసి సదా సాక్షీ నిరపేక్షః సుఖం చర ॥ 4.

టీ॥ త్వం = నీవు, దేహః = శరీరము, న = కావు, తే = నీకు, దేహః = దేహము, న = లేదు, వా = అయితే, భవాన్ = నీవు, భోక్తా = భోక్తవుగాని, కర్తా = కర్తవుగాని, న = కావు, (కిం తు = మరేమనగా), చిద్రూపః = జ్ఞానస్వరూపుడవును, సదా = ఎల్లప్పుడు, సాక్షి = సాక్షివి, నిరపేక్షః = కోరిక లేనివాడవు, అసి = అగుచున్నావు, సుఖం = సుఖముగా, చర = మెలగుము.

ఈ శరీరమే నీవుకాదు, శరీరం కూడా నీదికాదు. నీవు కర్తవూ కావు, భోక్తవూ కావు, నిత్యమూ సాక్షిగా ఉండే ఆత్మ చైతన్యమే నీవు. ఇది తెలుసు కుని సుఖంగా జీవించు.

ఆధ్యాత్మిక జీవితాన్ని జీవించాలనే అభిరుచిగల శిష్యులకు తన బోధను కొనసాగిస్తున్నారు. "ఈ శరీరమే నేను" అని భ్రమతో ఇంద్రియాలను తృప్తిపరచడం కోసం విషయభోగాలను వాంఛిస్తాము. అందుకనే ఇక్కడ గురువుగారు హెచ్చరిస్తు న్నారు---"ఈ శరీరమే నీవుకాదు, "శరీరం కూడా నీది కాదు, ఈ. శరీరంపట్ల "నేను" "నాది" అనే భావాలను విడనాడాలి. అహంకార మమకారాలు అర్థరహితాలు. శరీరం పనులు చేస్తోంది, అనుభవిస్తుంది. కాబట్టి నేను కర్తనూ కాదు, భోక్తనూ కాదు. ఈ కర్తృత్వ భోక్తృత్వ భావనలు కలిసి మనలో అహం కారంగా గుర్తింప బడుతున్నాయి. నాచే చూడబడే శరీరం నేను కాదు, కాబట్టి దాని కర్మలూ అనుభవాలూ కూడా నావికావు, ఈ వివేకంతో అహంకారాన్ని అణగద్రొక్కాలి.

ఈ విధంగా స్థూల సూక్ష్మ శరీరాలు నేననే భావంనుండి విడివడిన శిష్యునికి, స్వరూపాన్ని నేరుగా తెలియజేస్తున్నారు మునీంద్రులు----"శుద్ధమైన చైతన్యమే నీవు" ---ఈ చైతన్యం వలన బుద్ధి ప్రకాశింపబడి విషయాలు తెలియ బడుతున్నాయి. కాబట్టి, శారీరక మానసిక బుద్ధిపరమైన అనుభవాలకు ఆలోచన లకు నీవు సాక్షివి మాత్రమే. సాక్షిచే చూపబడే దృశ్యం యొక్క (ఉపాధియొక్క) సుఖదుఃఖాలేవీ సాక్షిని స్పృశించవు. "దీనిని తెలుసుకుని హాయిగా జీవించు" అని ఆశీర్వదిస్తున్నారు మహర్షి.

**శ్లో॥ రాగద్వేషౌ మనోధర్మౌ న మనస్తే కదాచన ।**
**నిర్వికల్పోఽసి బోధాత్మా నిర్వికార స్సుఖం చర ॥5.**

టీ॥ రాగద్వేషౌ = రాగద్వేషములు, మనోధర్మౌ = మనోధర్మములు, తే = నీకు, మనః = మనస్సు, కదాచన = ఒకప్పుడును, న = లేదు, (త్వం = నీవు), నిర్వికల్పః = వికల్పరహితుడవు, నిర్వికారః = వికారరహితుడవు, బోధాత్మా = జ్ఞానస్వరూపుడవును, అసి = అగుచున్నావు, (అతః = ఇందువలన), సుఖం = సుఖపూర్వకముగా, చర = మెలంగుము.

రాగద్వేషాలు మనోధర్మాలు, నీది అనబడే మనస్సు నీవుకావు. చైతన్యమయిన నీ సమక్షంలో అవి తెలియబడుతున్నాయి. నీలో ఏ మార్పూ రావడం లేదు. ఇది తెలుసుకుని సుఖంగా జీవించు.

ఉద్రేకాలు, కోరికలు, రాగద్వేషాలు, సుఖదుఃఖాలు, ఇవన్నీ మనస్సు లోని చలనాలే, ఇవన్నీ నీ మనోబుద్ధులకు చెందినవి మాత్రమే. అనంతమూ శుద్ధమూ అయిన ఆత్మచైతన్యం వలన వాటిని తెలియబడేటట్టుగా చేస్తున్నది, మనోబుద్ధులే నీవుకాదు. చైతన్యపు సామీప్యంలో మనోబుద్ధులలోని భావాలు అలా తెలియబడే మనోబుద్ధుల బాధలూ భయాలూ భావాలూ నీవి కావు, నీవు భయపడటం లేదు, బాధపడడంలేదు, భావంగా మారనూ లేదు. నిత్యమూ సత్ చిత్ ఆనంద రూపమయిన ఆత్మగా ఉన్నావు. దీనిని అర్థం చేసుకుని సుఖంగా జీవించమని మహర్షి అంటున్నారు.

శ్లో॥ సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని।
విజ్ఞాయ నిరహంకారః నిర్మమస్త్వం సుఖీభవ ॥ 6.

టీ॥ సర్వభూతేషు = సమస్తభూతముల యందును, ఆత్మానం = ఆత్మను (తనను), ఆత్మని = తనయందు, సర్వభూతాని = సమస్తభూతములను, విజ్ఞాయ = తెలుసుకొని, నిరహంకారః = అహంకార రహితుడవై, నిర్మమః = మమత్వము లేనివాడవై, త్వం = నీవు, సుఖీభవ = సుఖివికమ్ము.

అన్ని ప్రాణులలోనూ చైతన్యంగా నీవున్నావు చైతన్యమయిన నీలో సర్వసృష్టి ఉంది, దీనిని తెలుసుకుని అహంకారం మమకార రహితుడవై సుఖంగా జీవించు.

నేను నాది అనే భావాలతో అహంకారం వ్యక్తమవుతూ జీవిస్తూ ఉంటుంది. నేను అనే భావం వ్యక్తిత్వంగా బలపడి, వాసనా బలంతో కొన్ని కోరికలతో కొన్ని వస్తువులను "నాది" గా భావిస్తూ ఉంటుంది. ఈ "నేను", "నాది" యొక్క సంబంధంతో ఆ భావాలు పరస్పరం బలపడడంతో వ్యక్తిత్వం బలపడుతుంది, ఫలితంగా బలమైన వ్యక్తిత్వం "నాది" అని బలీయంగా పట్టుకుంటుంది, రాగ ద్వేషాలు దృఢపడుతూ ఉంటాయి. వాసనలు మళ్ళీ పెరుగుతూ ఉంటాయి. నేను నాది అనే భావాలతో అహంకారం అపారమైన సంసార సాగరాన్ని ఈదలేక ఈదుతూ ఉంటుంది. ఈ అహంకారం నాచే చూడబడే విషయం మాత్రమే అనే దృఢజ్ఞానంతో, అహంకారాన్ని అధిగమించి "నేను"గా నిలబడడమే సర్వదుఃఖ నివారణోపాయం. అజ్ఞాన జనితమైన అహంకారం మమకార భావాల్ని జ్ఞానంతో అర్థంచేసుకుని అధిగమించి జయించడమే ఆత్మజ్ఞాన ప్రాప్తి. అజ్ఞానం నశిస్తే

ఆత్మ అక్కడే స్వయంగా వ్యక్తమవుతుంది. ప్రతి ప్రాణిలోనూ చైతన్యం ఉంది, కాబట్టి అవి జీవించి ఉన్నాయి, నా శరీరంలోనూ చైతన్యం ఉండబట్టే జీవించి ఉన్నాను, అన్నిటినీ తెలుసుకుంటున్నాను. సర్వప్రాణులలోనూ చైతన్యమైన నేనున్నాను. చైతన్యమైనవానిలో సర్వప్రాణులూ తెలియబడుతూ ఉన్నాయి. ఇది బాగా అర్థం అయితే నాలో తెలియబడే సర్వమూ నా భావాలే కాబట్టి కనబడే సర్వచరాచర సృష్టికూడా అనంత నామరూపాలతో నాలో కదలాడే భావాలు మాత్రమే అని స్పష్టంగా తెలుస్తుంది. ఏకమూ అనంతమూ అయిన చైతన్యం అంతటా అన్నిటిలోనూ ఉంటూ అన్నీ తెలుసుకుంటోంది---భావాలుగా, నామ రూపాలుగా, పరిపూర్ణమయిన ఈ అవగాహనలో అహంకారం లయం అయి పోతుంది. మరొక నామంగా, భావంగా నాలో ఉంటోంది. "అహం సర్వ భూతాత్మా"---ఏకంగా నేను ఉన్నాను. రెండవదేదీ, ఎప్పుడూ, ఎక్కడా లేనే లేదు. ఇదే అజాత వాదం, భారతీయార్ష విజ్ఞాన సర్వస్వం, అష్టావక్ర మునీంద్ర ప్రవచనం, ప్రస్థానత్రయ సందేశం. పరమశుభమయిన "నా" స్వరూపం.

పరమాత్మ సృష్టి అంతటిలోనూ ఉంటూ అతీతంగా గూడా ఉందన్న గీతా సిద్ధాంతాన్ని అష్టావక్ర మహర్షులు కూడా ఈ శ్లోకం మొదటిపాదం గీతా శ్లోకంలోని మొదటి పాదమే.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శినః. (భగవద్గీత-6-29)

*భగవాన్ కృష్ణుడు అంటున్నారు. యోగబలంతో తనను సర్వప్రాణు లలోనూ, సర్వసృష్టిని తనలోనూ యోగి చూడగలడు. కాబట్టి సర్వత్రా సమత్వ బుద్ధిని కలిగి ఉంటాడు.*

ఈ విధంగా సర్వసృష్టినీ నీవే అని తెలుసుకుని సర్వాత్మభావంతో సుఖంగా జీవించమని సలహా ఇస్తున్నారు మహర్షి.

**శ్లో॥ విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే ।**
**తత్త్వమేవ న సందేహః చిన్మూర్తే విజ్వరో భవ ॥ 7.**

టీ॥ యత్ర = ఏ స్థానమునందు, ఇదం = ఈ, విశ్వం = ప్రపంచము, సాగరే = సముద్రమునందు, తరంగా ఇవ = అలలవలె, స్ఫురతి=తోచుచున్నదో, తత్=అది, త్వమేవ = నీవే (అగుచున్నావు), న సందేహః = సందేహము లేదు, చిన్మూర్తే=జ్ఞాన స్వరూపమైన ఆత్మవిషయమై, విజ్వరః = సంతాపరహితుడవుగా, భవ = అగుము.

చిదానందరూపా! చైతన్యమయిన నీలో, సాగరంలో తరంగాలవలె, భావాలతో విశ్వం స్ఫురిస్తోంది. మానసిక కల్లోలాన్ని విడనాడి సుఖంగా జీవించు.

"తత్త్వమసి"----హిందూవేదాంత వాఙ్మయసారమయిన నాలుగు మహా వాక్యాలలోనూ ఒకటి. అష్టావక్రుని ఈ శ్లోకంలో ఆ మహావాక్యం ప్రతిధ్వనిస్తుంది. గురువు శిష్యునికి బోధిస్తున్నాడు. "వివిధ ప్రత్యేకరూప సమన్వితమయిన ఈ మహా విశ్వమంతా, నీలో, సాగరంలో తరంగాలవలె, స్ఫురిస్తున్నది, భాసిస్తున్నది." "చిన్మూర్తి"వి నీవు భావాలు తరంగాలైతే నీవే చైతన్యసాగరానివి "తత్త్వమసి" ---అది నీవే.

మన సహజస్వరూపాన్ని సత్ చిత్ ఆనంద పరబ్రహ్మగా గుర్తించడ మంటే మనస్సుతో తాదాత్మ్యం పోయిందన్నమాటే. ఫలితంగా కోరికలన్నీ నశిస్తాయి. బాహ్యప్రంపచంలో ఉండేవస్తువులు తమంతతాముగా మనకు దుఃఖాన్ని ప్రసాదించవు. ఆ వస్తువుపై మనకుండే కోరికలే వాటికి శక్తి నిస్తున్నాయి. ఆ శక్తితో అవి మనలను బంధిస్తున్నాయి, బాధిస్తున్నాయి. బానిసలుగా మారు స్తున్నాయి. ఈ కోరికలు నశిస్తే మనస్సు ఉద్రేకాలకు బాధలకు భయాలకు లోనుగాకుండా శాంతంగా హాయిగా ఉంటుంది.

**శ్లో॥ శ్రద్ధత్స్వ తాత! శ్రద్ధత్స్వ నాత్ర మోహం కురుష్వభోః।**
**జ్ఞానస్వరూపో భగవాన్ ఆత్మా త్వం ప్రకృతేః పరః ॥8.**

టీ॥ భోః తాత! = ఓ నాయనా!, శ్రద్ధత్స్వ = శ్రద్ధనుంచుము, శ్రద్ధత్స్వ = శ్రద్ధ నుంచుము, అత్ర = ఈ విషయమై, మోహం = మోహమును, న కురుష్వ = చేయకుము, త్వం = నీవు, జ్ఞానస్వరూపః = జ్ఞానస్వరూపుడవు, భగవాన్ = ఈశ్వరుడవు, ప్రకృతేః = ప్రకృతికి, పరః = పరుడుగా నున్నావు.

**కుమారా! శ్రద్ధను వీడకు,శ్రద్ధను నిలుపుకో,సందేహించకు. నీవుజ్ఞాన స్వరూపానివే, నీవే ఈశ్వరుడవు, నీవే ఆత్మవు, నీవు ప్రకృతికి అతీతంగా ఉన్నావు.**

భగవద్గీతలో కూడా శ్రద్ధగలవారు మాత్రమే ఆత్మజ్ఞానం పొందగలరని నొక్కి చెప్పబడింది.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాంశాంతిం అచిరేణాధి గచ్ఛతి. (భగవద్గీత 4-39)

*ఇంద్రియాలను నిగ్రహించి శ్రద్ధతో ప్రయత్నించే వారికే జ్ఞానం లభిస్తుంది. ఈ జ్ఞానంతో పరమశాంతి లభిస్తుంది.*

ఇక్కడ కొద్దిగా ఆగి "శ్రద్ధ" అనే పదానికి అర్థాన్ని గ్రహించాలి. సాధారణంగా అన్ని మతాలలోనూ, అందరిచేతనూ కూడా అపార్థం చేసుకోబడిన ఏకైక పదం ఇదే. "శ్రద్ధ" అనగానే గుడ్డినమ్మకంతో బుద్ధి లక్షణాలయిన వివేక విచక్షణ తర్క మీమాంసాదులను విడచి, శాస్త్రంలో చెప్పబడినవానిని ఆచరించడం అనే అపోహ చాలామందికి ఉంది. నిజానికి "శ్రద్ధ" యొక్క అర్థం ఇది కాదు. శాస్త్రం మీద అచంచలమైన నమ్మకం ఉంచి, సత్యాన్ని దర్శించేవరకూ ధీరత్వంతో, సహనంతో, వివేక విచక్షణాయుక్త నిత్య విచారణా శీలత్వంతో, బుద్ధి ఏకాగ్రతతో ఉండగలగడం, వేదాంత పరిభాషలో "శ్రద్ధ"ను ఇలా నిర్వచించినారు.

శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యావ ధారణమ్
సా శ్రద్ధా కథితా సద్భిర్యయా వస్తూపలభ్యతే.

(వివేకచూడామణి-25)

*శాస్త్రమూ గురువూ చెప్పినవాటిపై నమ్మకం ఉంచి, యథార్థాన్ని యథాతథంగా గ్రహించగలుగుతూ, భావార్థ గంభీరమయిన వాక్యాల వాచ్య, లక్ష్యార్థాలను ధీరత్వంతో, శాంతసహనాలతో గ్రహించగలగడం శ్రద్ధ అనబడుతుంది.*

సంగ్రహంగా శ్రద్ధను నిర్వచించాలంటే, ఇవాళ నేను నమ్మే విషయాన్ని త్వరలో నిశ్చయంగా తెలుసుకోగలుగుతాను అనే భావమని చెప్పాలి. తన బుద్ధి మీదా, శాస్త్రం మీదా నమ్మకం ఉంచుతూ, సునిశితమూ శాంతమూ తీక్షణమూ అయిన బుద్ధితో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. తన బుద్ధి మీద, తన లక్ష్యం మీద, స్వశక్తి మీద, విశ్వాసం శ్రద్ధ ఉన్నవారు మాత్రమే గమ్యాన్ని చేరగలరు. దే విషయాన్ని చాలా స్పష్టంగా ఇక్కడ చెప్పుతున్నారు మహర్షి.

**ఈ సందర్భంలో యోగవాశిష్ఠంలోని ఒక శ్లోకం గుర్తుకు వస్తుంది.**

యదిదం వచ్మి తత్సర్వం ఓమిత్యాదాతుమర్హసి
అస్మాభిశ్చిరమన్విష్టం నాత్ర కార్యా విచారణా. (యోగవాశిష్ఠం)

*మేము చెప్పేదానిని ఓంకారంతోపాటుగా గ్రహించే అర్హత నీకుంది.*

ఇంతకాలమూ విచారణచేసి అన్వేషించిన సత్యాన్ని చెప్తుతున్నాము. దీనిని నీవు తర్కించవలసిన అవసరంలేదు. భావాతీతమయిన వాటి గురించి చెప్పే ఈ వాక్యాలమీద, మహర్షుల మీద, నమ్మకం ఉంచి స్వీకరించు.

ఇటువంటి శ్రద్ధను నిత్యమూ నిలుపుకోగలుగుతేనే ధ్యానం సఫలమవుతుంది. మనస్సు శాంతంగా నిశ్చలంగా సహకరిస్తుంది. మనస్సు శాంతించి భావశూన్యంగా ఉన్నప్పుడు ధ్యానం ద్వారా సత్యాన్ని దర్శించే అవకాశం లభిస్తుంది. మహోపనిత్తు ఇలా అంటోంది.

యత్తు చంచలతాహీనం తన్మనోమృత ఉచ్యతే
తదేవ చ తపః శాస్త్రసిద్ధాన్తే మోక్ష ఉచ్యతే. (మహోపనిషత్తు-6-101)

"అలజడి అశాంతి లేకుండా నిశ్చలంగా ఉన్న మనస్సే అమృతత్త్వము అదే తపస్సు. ఉపనిషత్ వాఙ్మయంలో దీనినే మోక్షమని అంటారు.

**శ్లో॥ గుణైస్సంవేష్టితో ధేహస్తిష్ఠత్యాయాతి యాతి చ ।**
**ఆత్మా న గన్తా నాగన్తా కిమేనమనుశోచసి ॥ 9.**

టీ॥ గుణైః=గుణములతో, సంవేష్టితః = చుట్టబడినదై, దేహః = దేహము, తిష్ఠతి = ఉంటున్నది, సః = అది, ఆయాతి = వచ్చుచున్నది, యాతి = పోవుచున్నది, ఆత్మా = జీవాత్మ, న గన్తా = పోవునది కాదు, న ఆగన్తా = వచ్చునది కాదు, కిం = ఎందుకొఱకు, ఏనం = దీనిని గూర్చి, అనుశోచసి = దుఃఖించుచున్నావు?

**ప్రకృతిలోని పంచభూతాలతో నిర్మింపబడి శరీరం పుడుతున్నది. జీవిస్తున్నది, నశిస్తుంది. ఆత్మ రావడమూలేదు, పోవడమూలేదు. దేనిని గురించి విచారిస్తున్నావు?**

పంచభూతాలతో నిర్మింపబడిన శరీరం మరల అందులో కలిసిపోవలసిందే. శరీరాన్ని నడిపిస్తూ ఉంటుంది. బాహ్యంగానూ అంతరంగానూ మన వాసనల కనుగుణంగా అనుభవాల నందించడంకోసం శరీరం రూపుదాల్చింది. ఈ శరీరంలో అహంకారం ఏర్పడి, వశిస్తూ, శరీరంతో అనుభవాలను పొందుతూ ఉంటుంది. ఈ విధమయిన ఇన్నిరకాల స్థితులలోనూ, సర్వాన్నీ తెలియబడేలా చేస్తూ ఉంటుంది చైతన్యం. అనాదీ అచలమూ అయిన ఆత్మ ఎక్కడనుండీ రానూలేదు. ఎక్కడికీ పోవడమూ లేదు. ఆత్మ మార్పుచెంది రూపుదాల్చలేదు, జీవించలేదు, చనిపోలేదు. ఎప్పుడూ స్థిరంగాఉంటూ అన్నిటినీ ప్రకాశింప చేస్తున్నది,

ఇది నిత్యం,సత్యం,ఆ పరమాత్మే నీ సహజస్వరూపం అయితే శరీరం మరణించి నప్పుడు ఎందుకు దుఃఖిస్తున్నావు? సముద్రంలో అలలు కరిగిపోయినంత మాత్రాన సముద్రం వాటికోసం దుఃఖిస్తుందా?

ఇక్కడ వర్ణింపబడిన భావమూ విధానము కూడా భగవద్గీతను గుర్తుకు తెస్తున్నాయి. (భగవద్గీత II-11,13,16,18)

**శ్లో॥ దేహస్తిష్ఠతు కల్పాంతం గచ్ఛత్వద్యైవ వా పునః ।**
**క్వవృద్ధిః క్వ చ వా హానిః తవ చిన్మాత్ర రూపిణః॥10.**

టీ॥ దేహః పునః = దేహమయితే, కల్పాంతం = కల్పాంతమువరకు, తిష్ఠతు = ఉండుగాక!, వా = లేక, అద్యైవ = ఇప్పుడే, గచ్ఛతు = పోవుగాక, చిన్మాత్రరూపిణః = జ్ఞానమాత్రస్వరూపుడవగు, తవ = నీకు, వృద్ధిః = వృద్ధి, క్వ = ఎక్కడ, హానిః = హాని, క్వ = ఎక్కడ?

**శరీరం కల్పాంతమూ ఉన్నా, ఈ దినమే నశించినా, నీకు కలిగే హాని ఏమీలేదు. నీవు నిత్యంగా ఆత్మచైతన్యంగా ఉన్నావు.**

మనస్సుకోరే కోరికల కనుగుణంగా శరీరం చైతన్యంలో పుట్టి పెరిగి నశిస్తుంది. ఈ ప్రపంచమంతా స్థితికలిగి ఉన్నా, నశించినా, ఆత్మకు ఏవిధమయిన హానీ జరుగదు. స్తంభంలో భూతభ్రమ కలిగినా నశించినా స్తంభం మార్పు చెందనట్టే. చిత్తశుద్ధికలిగిన సాధకుడు మృత్యువునకు భయపడవలసిన అవసరం ఏముంది? శరీరానికి ఆత్మతో ఏవిధమైన సంబంధమూ లేదు. నిత్యమైన ఆత్మవే నీవు.

**శ్లో॥ త్వయ్యనన్త మహాంభోధౌ విశ్వవీచిః స్వభావతః ।**
**ఉదేతువాఽస్త మాయాతు న తే వృద్ధిర్నవా క్షతిః ॥11.**

టీ॥ అనన్తమహాంభోధౌ = అపార మహాసముద్రుడవగు, త్వయి = నీయందు, విశ్వవీచిః = ప్రపంచరూప తరంగములు, స్వభావతః = స్వాభావికముగనే, ఉదేతు = ఉదయించునుగాక, వా = లేక, అస్తం ఆయాతు = అస్తమించునుగాక, తే = నీకు, వృద్ధిః = వృద్ధి, న = లేదు, క్షతిః = నాశమున్ను, న = లేదు.

**చైతన్యసాగరమయిన నీలో ప్రపంచ దృశ్యాలయిన తరంగాలు ఎన్ని కదలాడినా నీకు వృద్ధిక్షయము లుండవు.**

ఈ గీతలో ఆరవ అధ్యాయం రెండవ శ్లోకంలోని భావమే ఇక్కడ మళ్ళీ

చెప్పబడింది. ఆత్మలో ప్రపంచం ఉన్నట్టుగా స్ఫురిస్తూ లయం అవుతోంది. దీనివలన ఆత్మకు ఏవిధమయిన మార్పూ సంభవించడం లేదు.

ప్రపంచ సృష్టి స్థితి లయములు మనఃకల్పిత భ్రమలు మాత్రమే. అహంకారానికి మాత్రమే అనుభవయోగ్యమయిన ఈ ప్రపంచం, ఆత్మ చైతన్యంలో లేనే లేదు. స్వప్నాలు వచ్చినా పోయినా జాగ్రతం పురుషునికి ఏ విధంగానూ సంబంధం లేనట్టే.

**శ్లో॥ తాత! చిన్మాత్రరూపోऽసి న తే భిన్నమిదం జగత్ ।**
**అతః కస్య కథం కుత్ర హేయోపాదేయ కల్పనా॥12.**

టీ॥ తాత=నాయనా! (త్వం=నీవు), చిన్మాత్రరూపః = చైతన్యమాత్ర స్వరూపుడవు, అసి = అగుచున్నావు, ఇదం = ఈ, జగత్ = ప్రపంచము, తే = నీకంటే, భిన్నం = భిన్న మైనది, న=కాదు, అతః = ఈ కారణమువలన, హేయోపాదేయ కల్పనా = త్యాజ్య గ్రహణముల యొక్క కల్పన, కస్య = ఎవనికి?, కథం = ఎట్లు? కుత్ర = ఎక్కడ?

**కుమారా! శుద్ధచైనత్య రూపానివి నీవు. ఈ జగత్తు నీనుండి విడిగా లేదు. అయినప్పుడు, ఎక్కడ (?) ఎందుకు (?) ఏవిధంగా (?) నీలో స్వీకార నిరాకరణ భావాలుండగలవు?**

ఎవరైనా తనను తాను ఏవిధంగా యిష్టంగాని అయిష్టంగాని పడగలరు? ఉన్నదంతా ఒకే ఒక చైతన్యం, అదే నేను, అయినప్పుడు నేను స్వీకరించవలసిన దేముంటుంది? రెండవదేదీ లేనప్పుడు నేను నిరాకరించవలసినది మాత్రం ఏది?

దేనినైనా సత్యమనిగాని అసత్యమనిగాని భావించినా ఆ భావాలన్నీ మనస్సుకు చెందినవి మాత్రమే. శుద్ధచైతన్యమయిన నాకు మనస్సేలేదు. ఇక మనో భావాలతో నాకు నిమిత్త మేముంది?

**యోగవాశిష్ఠంలో ఇదేభావం ఇలా వ్యక్తీకరించబడింది.**

విచిత్రవర్ణతా యద్వద్ దృశ్యతే కఠినాతపే
విచిత్ర శక్తితా తద్వద్ దేవేశే సదసన్మయీ. (యోగవాశిష్ఠం.)

*మధ్యవేసవికాలపు మధ్యాహ్నంలో ఆకాశంలో అనేక రంగులు గోచరిస్తాయి. ఇదేవిధంగా సగుణ నిర్గుణ స్వరూపమయిన భగవంతునిలో అద్భుతంగా అనేక లీలలు కనిపిస్తాయి.*

శ్లో॥ ఏకస్మిన్నవ్యయే శాన్తే చిదాకాశేఽమలే త్వయి ।
కుతో జన్మ కుతః కర్మ కుతోఽహంకార ఏవ చ ॥ 13.

టీ॥ ఏకస్మిన్ = ఒకటి అయినటువంటినీ్న, అమలే = నిర్మలమైనటువంటినీ్న, అవ్యయే = అవినాశి అయినటువంటినీ్న, శాన్తే = శాంతుడవైనటువంటినీ్న, చిదాకాశే = చిదాకాశ రూపుడవునైన, త్వయి = నీయందు, జన్మ = జన్మము, కుతః=ఎక్కడ నుండి?, కర్మ = కర్మ, కుతః = ఎక్కడనుండి?, అహంకారః = అహంకారము, కుతఃతి = ఎక్కడనుండి? (భవతి = కలుగుచున్నది).

**పరిణామరహితము, శాంతము, చిత్స్వరూపము, నిష్కళంకము, ఏకము అయిన ఆత్మవు నీవు. నీలో జన్మ, కర్మ, అహంకారం, ఏదయినా ఎలా ఉండగలదు?**

అద్వయమయిన అనంతసత్యం పరిణామరహితమై ఉండాలి. పరిణామం ఉంటే పరిమితమూ అనేకత్వమూ ఉంటాయి. శుద్ధమైన చైతన్యము మనస్సు కలీతంగా ఉంది కాబట్టి ఇది నిత్యశాంతమై ఉండాలి, మానసిక కల్లోలాలేవీ మనస్సు కలీతమయిన చైతన్యాన్ని చేరలేవుకదా! చైతన్యప్రకాశం వాసనలను కూడా తెలియబడేటట్టు చేస్తుంది. కాబట్టి చైతన్యంలో వాసనలుండే అవకాశం లేదు. అందుచేత అది నిష్కళంకమైనది. ఈ విధంగా "అవ్యయమూ శాంతమూ చిదాకాశమూ నిష్కళంకమూ అయిన ఆత్మే నీ నిజ స్వరూపం" అని అష్టావక్రులు నిస్సందేహంగా చెప్పుతున్నారు. సత్యాన్ని సరిగ్గా గ్రహించని అజ్ఞానంనుండి జనించిన జన్మ, జీవితం, అహంకారం, సహజంగా సత్యమైన నీలో ఉండజాలవు.

ఇందులో వాడబడిన "చిదాకాశం" అనే పదంయొక్క అర్థం అనంత గంభీరయుతం. యోగవాశిష్ఠం మొదలయిన గ్రంథాలలో ఈ మాట ఇక్కడ నుండి గ్రహింపబడి విరివిగా వాడబడి బహుళప్రచారం పొందింది. ఆకాశమే అన్ని వస్తువులకు తనలో ఉనికిని స్థలాన్ని యిస్తోంది. ఆకాశంలోనే వస్తువులు ఉండి తెలియబడుతున్నాయి. మనం చూసే బాహ్యప్రపంచంలోని వస్తువులన్నీ ఉండే ఆకాశాన్ని "మహాకాశం" అంటారు. ఆలోచనలు ఉనికి కలిగి తెలియబడే ప్రదేశాన్ని "చిత్తాకాశం" అంటారు. సర్వాన్నీ తెలుసుకునే తెలివి కలిగిన బుద్ధి స్థానాన్ని "చిదాకాశం" అంటారు. ఈ చిదాకాశంలోనే అనంతమైన ఆత్మ స్వరూపం రేఖామాత్రంగా తెలియబడుతుంది. ఈ శ్లోకంలో సాధకుని సహజ స్వరూపం "చిదాకాశం" గా బోధించబడింది.

శ్లో|| యత్త్వం పశ్యసి తత్రైకః త్వమేవ ప్రతిభాససే ।
కిం పృథగ్భాసతే స్వర్ణాత్ కటకాంగదనూపురమ్ ॥ 14.

టీ|| త్వం = నీవు, యత్ = దేనిని, పశ్యసి = చూచుచున్నావో, తత్ర = అచ్చట, ఏకః = ఒకడవైన, త్వమేవ = నీవే, ప్రతిభాససే = ప్రతిభాసించుచున్నావు, కటకాంగద నూపురం = కడియములు, భుజకీర్తులు, అందెలు మొదలగు ఆభరణములు, స్వర్ణాత్ = బంగారముకంటే, పృథక్ = వేరుగా, భాసతే కిం = భాసించునా?

**నీచే చూడబడేదంతా నీవే అయి ఉన్నావు. గాజులు, హారాలు మొదలైన ఆభరణాలు మూల పదార్థమయిన బంగారం కంటే వేరుగా ఉండ గలవా?**

బంగారు ఆభరణాలెన్ని రకాలైనా కేవలం నామరూపాలలోనే వేరుగా ఉంటాయి; అయినా అవన్నీ బంగారమే నామరూపాత్మకమయిన ఈ విశాల విశ్వమంతా నీ సహజ స్వరూపమయిన చైతన్యంనుండే ఉద్భవించింది. అయినప్పుడు ఈ విశాల విశ్వంలో నీవు కానిదేది? ఛాందోగ్యోపనిషత్తు ఈ విషయాన్నే ఇలా ధృవపరుస్తోంది.

సౌమ్యైకేన మృత్పిండేన
సర్వం మృన్మయం విజ్ఞాతం
స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం
మృత్తికేత్యేవ సత్యమ్.

(ఛాందోగ్యోపనిషత్తు)

*ప్రియమైన కుమారా! ఒక మట్టిముద్ద నీకు తెలిస్తే మట్టితో తయారు కాబడిన సర్వవస్తువులూ తెలిసినట్టే. నిజానికి వాటిలో ఉన్నదంతా మట్టే నామరూపాలు మాత్రమే వేరు.*

సంగ్రహముగా చెప్పాలంటే కార్యములన్నీ కారణము యొక్క రూపాంతరములే. ఇదేవిధంగా ఈ విశాల విశ్వమంతా చైతన్యమయమయిన ఆత్మే వేరే రూపంలో అనుభవింపబడుతున్నది.

శ్లో|| అయం సోఽహమయం నాహం విభాగమితి సంత్యజ ।
సర్వమాత్మేతి నిశ్చిత్య నిస్సంకల్పః సుఖీభవ ॥ 15.

టీ॥ సః = ఆ, అయం = ఇతడు, అహం = నేను, అయం = ఇతడు, నాహం = నేనుకాను. ఇతి = ఈ ప్రకారమగు, విభాగం = విభాగమును, సంత్యజ = విడిచి పెట్టుము, సర్వం = సమస్తమును, ఆత్మా = ఆత్మ స్వరూపము, ఇతి = ఇట్లని, నిశ్చిత్య = నిశ్చయించి, త్వం = నీవు, నిస్సంకల్పః = సంకల్పరహితుడవై, సుఖీభవ = సుఖింపుము.

**"అతడే నేను", "ఇది నేను కాదు" ఇటువంటి భేదభావాలను పూర్తిగా విడిచిపెట్టు. ఉన్నదంతా ఆత్మే అని తెలుసుకుని కోరికలు లేకుండా హాయిగా జీవించు.**

అష్టావక్రుని భావంలో, భావాతీతమయిన ఆత్మచైతన్యమూ, అనంత నామరూప భావసమన్వితమయిన ప్రపంచమూ వేరుకావు. తరంగాలు సముద్రం నుండి ఏవిధంగానూ వేరుకావు. సముద్రమే చలనంలో తరంగాలుగా గుర్తింపబడుతోంది. కోరికల ఒత్తిడివలన చైతన్యమే నామరూపాలతో భావాలుగా ప్రపంచంగా భావంతో గుర్తింపబడుతున్నది. నామరూపాలేవైనా, బాహ్యంగా ఎట్లు గుర్తింపబడినా గుర్తింపబడినవన్నీ చైతన్యంనుండి వేరుకావు.

ఈ విధంగా బాహ్యంగా గుర్తింపబడే ప్రపంచమంతా తనకంటే వేరు కాదని గుర్తించిన జ్ఞానికి కోరికలెలా ఉంటాయి? మననుండి వేరుగా ఏదైనా ఉంటేనే మనం దానిని కోరగలం. వేరుగా రెండవదేదీ లేనప్పుడు కోరిక ఎలా ఉండగలదు?

ఆత్మానుభవంలో జాగృతులైన ఋషులు ఇలా అంటున్నారు. "ఆత్మైవ ఇదం జగత్ సర్వమ్"--ఇవన్నీ ఆత్మకంటే వేరుకావు."సర్వం బ్రహ్మైవ జగత్"---నిరంతర పరిభ్రమణశీలి అయిన ఈ మహావిశ్వమంతా తన మూలమయిన ఆత్మకంటే భిన్నంకాదు. కాబట్టి "అయం సోఽహం"--అతడే నేను--అని చెప్పడంలో నేను వేరనే భావం ధ్వనించి అజ్ఞానం కనిపిస్తున్నది! ఇదేవిధంగా "అయం-నాహం" నేను మనశ్శరీరాలూ ప్రపంచమూ కాదు---అని చెప్పడం అజ్ఞాని అయిన బాలకునివలె పరిమితమయిన అహంకారం యొక్క ఉన్మత్త ప్రలాపాలే!!

"ఇదంతా నేనే--నాకంటే వేరుగా ఏదీలేదు. నేను సర్వవ్యాపినై ఉన్నాను" ఈ మహోన్నత జ్ఞానంలో స్థిరపడి మానసిక కల్లోలాన్ని విడనాడి నిశ్చలంగా శాంతంగా స్థిరంగా నీ స్వస్థితిలో నిలబడి సుఖంగా ఉండు.

**శ్లో॥ తవైవాజ్ఞానతో విశ్వం త్వమేకః పరమార్థతః ।**
**త్వత్తోఽన్యో నాస్తి సంసారీ నాసంసారీ చ కశ్చన ॥16.**

టీ॥ తవ = నీయొక్క, అజ్ఞానత ఏవ = అజ్ఞానమువల్లనే, విశ్వం = ప్రపంచము (భవతి = అగుచున్నది), పరమార్థతః = యథార్థముగా, త్వం = నీవు, ఏకః = అద్వితీయుడవు, అతః = ఈ కారణమువలన, త్వత్తః = నీకంటే, అన్యః = అన్యుడు, కశ్చన = ఒకానొకడు, సంసారీ = సంసారి, నాస్తి = లేడు, అసంసారీ = ఈశ్వరుడున్ను, అన్యః = ఇతరుడు, న = లేడు.

నీ అజ్ఞానం వల్లనే ప్రపంచం ఉన్నట్టుగా కనిపిస్తుంది. నిజానికి **ఉన్నది నీవే. నీకంటే వేరుగా జీవుడూ లేడు, ఆత్మా లేదు.**

మనస్సు పనిచేస్తున్నంతసేపూ ప్రపంచాన్ని చూసే అహంకారం ఉంటుంది. ఆ చూడబడే ప్రపంచానికి సృష్టి కర్త ఉండాలి. ఆ సృష్టికర్తకు పరమాత్మ ఉండాలి (బ్రహ్మం). వ్యక్తిలోని అహంకారరూపమైన జీవుడి వెనుకగా చైతన్యం ఉండాలి (ఆత్మ). ఈ విధంగా ఒకమారు జగత్తును చూడడానికి ఈశ్వరుడు, ఆత్మ, పరమాత్మ ఉండాలి. ఈ విభేదాలన్నీ సాధకునికి దశలవారీగా సహాయం చేస్తూ చివరగా తానే అనంతమైన ఆ పరమాత్మనని తెలుసుకునేలా చేస్తాయి. "త్వమేకః పరమార్థతః"--నిజానికి ఉన్నది నీవు మాత్రమే. నీకంటే వేరుగా జీవుడూలేడూ, పరమాత్మా లేడు. స్వప్నంలోంచి మేలుకున్నాక స్వప్నం చూసేవాడూ, స్వప్న ప్రపంచం కూడా ఏ విధంగా జాగ్రత్ పురుషుని మనస్సులో లీనం అయిపోతాయో అదేవిధంగా ఆత్మానుభవంలో జీవుడయిన నీవూ, నీచే చూడబడే ప్రపంచమూ కూడా లయం అయిపోతాయి.

అహంకారము, అహంకారము అనుభవించే సంసారమూ నీ ఉపాధివల్ల సంక్రమించినవి కావు, బాహ్యాభిముఖమైన నీ దష్టివల్లే అవి సంభవం అవుతున్నాయి. మహర్షులూ, జ్ఞానులూ వలెనే నీవు కూడా నీ దృష్టిని అంతర్ముఖం చేసి ఆత్మ మీద ఉంచితే సంసారబాధలు లేకుండా నిత్యానందంగా ఉండడాన్ని గమనించగలవు. ఇదేభావాన్ని ఇంకా స్పష్టంగా "సంక్షేప శరీరిక" లో చూడవచ్చు.

తవరూపమేవ తవ దుఃఖకరం యది తన్న పశ్యసి బహిర్ముఖ ధీః
తవరూపమేవ తవ తృప్తికరం యది తత్ర పశ్యసి నివర్త్యతమః. (సంక్షేప శరీరిక)

*నీ బాహ్యాభిముఖ దృష్టివలన నీ ఆత్మను గుర్తించక పోవడంతో నీ రూపంగా కనబడే నీ ఉపాధే నీ బాధలకు నాశనానికీ హేతువవుతోంది. ఈ*

అజ్ఞానావరణ తొలగిపోయినప్పుడు, నీ ఆత్మను గుర్తించగలిగినప్పుడు నీ ఉపాధి నీకు సంతోషదాయకమవుతుంది.

శ్లో॥ భ్రాన్తిమాత్ర మిదం విశ్వం న కించిదపి నిశ్చయీ ।
నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించిదివ శామ్యతి ॥17.

టీ॥ ఇదం = ఈ, విశ్వం = ప్రపంచము, భ్రాంతిమాత్రం = భ్రాంతి మాత్రము, కించిత్ = కొంచెమైనను, న = లేనిది, ఇతి నిశ్చయీ = ఇట్లని నిశ్చయము గలవాడు, నిర్వాసనః = వాసనారహితుడై, స్ఫూర్తిమాత్రః = ప్రకాశస్వరూపుడై, న కించిదివ = ఏమియు లేనివానివలె (ఏ వికారములు లేనివాడై), శామ్యతి = శాంతిని పొందుచున్నాడు.

ఈ జగత్తు మనఃకల్పిత మిథ్యాభ్రమ అనే నిశ్చయజ్ఞానం కలిగితే కోరికలు నశించి, చైతన్యరూపంగా, శాంతంగా, సృష్టి లేనట్టుగా ఏకంగా ఉండ గలవు.

తానే ఆత్మననే ప్రత్యక్షానుభవం కలిగిన సాధకుడు, తను మాత్రమే నిత్యసత్యమనీ, మిగిలినదంతా మిథ్యాభ్రమ అనీ నిశ్చయంగా తెలుసుకుంటాడు. ఆ తరువాత అతనికి కోరికలే ఉండవు. తనకంటే భిన్నమైనదేదీ లేదని తెలిసి నప్పుడు దేనిని కోరగలడు? తన మనసులో కోరికల అలజడిని కలిగించే బాహ్య వస్తుమయ ప్రపంచమే లేనట్టుగా సహజ శాంతచిత్తుడై ఉంటాడు. మనవలెనే జ్ఞాని కూడా ఈ లోకంలో నివసిస్తూ తన ఉపాధిద్వారా ప్రపంచాన్ని గుర్తిస్తాడు. అతడు గుర్తిస్తాడు కానీ, జగత్తు అతని నేవిధంగానూ కదలించజాలడు. జగత్తును చూస్తు న్నప్పుడు కూడా అది తననుండి వేరుకాదనే నిశ్చయజ్ఞానం సదా అతనికి ఉంటుంది.

శ్లో॥ ఏక ఏవ భవామ్భోధావాసీదస్తి భవిష్యతి ।
న తే బన్ధోఽస్తిమోక్షోవా కృతకృత్య స్సుఖం చర ॥18.

టీ॥ భవామ్భోధౌ = సంసారరూప సముద్రమునందు, ఏక ఏవ = ఒక్కడే, (ఆత్మ), ఆసీత్ = ఉండెను, అస్తి = ఉంటున్నాడు, భవిష్యతి = ఉండగలడు, తే = నీకు, బంధః = బంధము, న = లేదు, మోక్షశ్చ = మోక్షమున్ను, న = లేదు, త్వం = నీవు, కృతకృత్యః = కృతకృత్యుడవు, సుఖం = సుఖపూర్వకముగా, చర = సంచరింపుము.

త్రికాలాలోనూ ఉన్నదంతా కేవలమైన ఆత్మమాత్రమే. నీకు బంధమూ లేదు, ముక్తి అవసరమూ లేదు. నీవు చెయ్యవలసినదేదీ లేదనే నిశ్చింతతో సుఖంగా సంచరించుము.

యథాలాపంగా చూసేవారికి నామరూపాలు అనంతంగా అనిపించ వచ్చు. కానీ కొంచెం నిశితంగా పరిశీలిస్తే వీటన్నిటిలోనూ సామాన్య లక్షణం ఒకటి కనిపిస్తుంది. చెట్టు, మనిషి, జంతువు, అన్నీ కూడా ఉనికిని "సత్త"ను కలిగి ఉన్నాయి. చెట్టు మనిషి కాదు, మనిషి జంతువుకాదు, ఇలా రకాలలో తేడా లున్నా, ఉనికిని కలిగి ఉండడం అన్నది అన్నిటికీ సామాన్యమైన ఒకే ఒక లక్షణం. రాయి, పువ్వు, మొక్క, చంద్రుడు, సూర్యుడు ఇలా ఏ నామరూపాన్ని పరిశీలించినా అవన్నీ ఉనికిని కలిగి ఉండడం వల్లనే గుర్తింపబడుతున్నాయి. త్రికాలాలలోనూ ఈ "ఉనికి" ఉంటూనే ఉంది. ఇదే ఆత్మయొక్క "సత్" లక్షణం. గుర్తింపబడే నామరూపాలలో మాత్రమే మార్పు కనిపిస్తోంది. కాని నిత్యమూ, ఆత్మ "సత్"గా ఉండనే ఉంది.

ఈ సత్ రూప ఆత్మవే నీవు. నీవు తప్ప రెండవదేదీ లేనేలేదు. ఇక నిన్ను బంధించేదేముంది? నిన్ను నువ్వే బంధించుకోవుగదా! ఈ ఏకత్వాన్ని అర్థం చేసుకున్న జ్ఞానికి బంధమూ మోక్షమూ కూడా అర్థరహితాలే. ఈవిధంగా నిన్ను నువ్వు తెలుసుకుని బంధభ్రాంతి, ముక్తిపై కోరిక లేకుండా నిశ్చింతంగా సుఖంగా జీవించమని మునీంద్రులు బోధిస్తున్నారు.

శ్లో|| మాసంకల్ప వికల్పాభ్యాం చిత్తం క్షోభయ చిన్మయ ।
ఉపశమ్య సుఖం తిష్ఠస్యాత్మన్యానన్ద విగ్రహే ॥ 19.

టీ|| చిన్మయ=జ్ఞానస్వరూపా!, సంకల్ప వికల్పాభ్యాం=సంకల్ప వికల్పముల చేత, చిత్తం=మనస్సును, మా క్షోభయ = కలత పెట్టకుము, ఉపశమ్య =మనశ్శాంతిని పొంది, ఆనంద విగ్రహే =ఆనంద పూర్ణమయిన, ఆత్మని=ఆత్మస్వరూపము నందు, సుఖం = సుఖముగా, తిష్ఠ = ఉండుము.

**ఓ చిన్మయా! సంకల్ప వికల్ప రూపమైన అశాంతిని విడిచిపెట్టి శాంతించిన మనస్సుతో ఆనందస్వరూపంగా హాయిగా జీవించు.**

స్వభావతః శుద్ధచైతన్యమే నీవు. నీవు ఆమోదించవలసినదికాని, నిరాకరించవలసినదికానిలేదు. ఆత్మచైతన్యంలో మనశ్శరీరాలు లేవు. అవి భ్రమమాత్రమే. ఈ భ్రమను విడచిపెట్టి సంకల్ప వికల్పాలతో మనస్సును చలించనీక శాంతంగా నీ ఆనందస్వరూపంలో దృష్టిని కలిగివుండు. నానాత్వ ప్రపంచపు బాధలు ఏకమైన చిద్రూప ఆత్మను స్పృశింపజాలవు.

1) "నేను ఉన్నాను" అన్నభావం బంధానికి దారితీస్తుంది. "నేను ఉన్నాను" అన్న భావాన్ని భ్రమగా గుర్తించడమే ముక్తి. ఈ బంధభ్రాంతి నీలోనే ఉన్నప్పుడు ముక్తిని సాధించడానికి అర్హతలేదని ఆరాటపడడంలో అర్థం లేదు. అని యోగవాశిష్ఠం అంటోంది.

1) అహమిత్యేవ బంధాయ నాహమిత్యేవ ముక్తయే
ఏతావన్మాత్రకే బంధే స్వాయత్తే కిమ శక్తయా. (యోగవాశిష్ఠం)

**వశిష్ఠ మహర్షి ఇంకా ఇలా అంటున్నారు.**

2) మమేదమితి బంధాయ నాహమిత్యేవ ముక్తయే
ఏతావన్మాత్రకే వస్తున్యాత్మాయత్తే కిమజ్ఞతా. (యోగవాశిష్ఠం)

*"ఇదినాది" అన్నభావం బంధానికి దారితీస్తుంది. "నేను" లేను అనుకుంటే ముక్తి లభిస్తుంది. బంధం భావన మాత్రమే, కేవలం నీ భావనలోనే ఉంది. నీవు అజ్ఞానంలో ఉన్నానని ఎందుకు బాధపడతావు? సంకల్ప వికల్ప రూపమయిన ఆలోచనలతో నీకు అవసరమేముంది? ఆలోచనల అలజడిని విడిచిపెట్టు. ఆనంద రూపమైన ఆత్మవై హాయిగా జీవించు.*

**శ్లో॥ త్యజైవ ధ్యానం సర్వత్ర మా కించిద్ధృది ధారయ ।
ఆత్మా త్వముక్త ఏవాసి కిం విమృశ్య కరిష్యసి ॥ 20.**

టీ॥ సర్వత్ర ఏవ = సకలమునందంతటను, ధ్యానం = ధ్యానమును, త్యజ = విడువుము, హృది = హృదయమునందు, కించిత్=కొంచెముగూడ, మా ధారయ= ధరింపకుము, ఆత్మా = ఆత్మస్వరూపుడవగు, త్వం = నీవు, ముక్త ఏవ = ముక్తుడవే, అసి = అగుచున్నావు, విమృశ్య = విమర్శించి (విచారించి), కిం = దేనిని, కరిష్యసి = చేయగలవు.

**ధ్యానాన్ని కూడా విడచిపెట్టు. మనస్సులో ఆలోచనలను రానీకు. నీవు నిత్యముక్తమైన ఆత్మవు. ధ్యానంతో నీకు అవసరం ఏముంది?**

నిద్రిస్తున్నవానికి నిద్రపోయే ప్రయత్నంతో పనేముంది? ఇదేవిధంగా నీవు నిత్యముక్తమైన ఆత్మవని తెలుసుకున్నప్పుడు ధ్యానము, తార్కికమైన ఆలోచన, స్వాధ్యాయము-వీటితో అవసరం ఏమిటి? ఇవన్నీ చెయ్యడానికి మరలా అహంకారాన్ని గుర్తించి నీ అనుభవానికి దూరము కావలసి ఉంటుంది. పరమ పవిత్రమైన నీ ఆత్మానుభవాన్ని విడచి మానసిక కల్లోలానికి గురికావడమెందుకు?

ధ్యానిస్తూ, ధ్యానాన్ని విడిచిపెట్టడమే నిజమైన ధ్యానం. ఇదే నిదిధ్యాసనం. ధ్యేయం లేని, ధ్యానం కాని ధ్యానమే నిజమైన ధ్యానం. నిధిధ్యాసనం ఇదే పరిపూర్ణత్వం. మార్గమంతా గడచి గమ్యాన్ని చేరినట్టే లక్ష్యాన్ని చేరే చివరి మెట్టు ఇదే. ఇక్కడితో యోగం పని అయిపోతుంది. అహంకారం యొక్క స్వప్నం అంతానికి వచ్చింది. ఆత్మ ఆత్మగా ఆనందంగా ఉంది. ధ్యాని, ధ్యేయము ఒకటే అయిపోయిన స్థితి ఇది. మానవుడు మాధవుడయి మహదానంద పూర్ణుడై ఉంటాడు.

ఇది అష్టావక్రుని కవితా కల్పన మాత్రమే కాదు. యోగవాశిష్ఠం కూడా ఇదే భావాన్ని దృఢంగా ఇలా చెప్తోంది.

అనంతత్వాత్ అనంతస్య భ్రాంతిర్నాస్తి చ సంప్రతి
అభ్యాస భ్రాంతి రఖిలం మహా చిద్ఘన మక్షతమ్. (యోగవాశిష్ఠం.)

అనంతమైన ఆత్మలో భ్రమకు ఆస్కారమే లేదు. నిశ్చల తేజోరాశి అయిన చైతన్యాన్ని సాధించాలనుకోవడం మానసిక కల్పన మాత్రమే.

•••

అధ్యాయం-16

# ఆత్మనిష్ఠ - అనువైన సూచనలు

వేదాంత సాధనలో బాగా ప్రగతి సాధించిన సాధకులకు అత్యంత ఉపయోగకరమయిన విషయాలు క్రిందటి అధ్యాయంలో బోధింపబడ్డాయి. సాధనలో మొదటి దశలో ఉన్నవారికి ఈ అధ్యాయంలో అమూల్యమయిన సూచనలు సలహాలు ఇవ్వబడ్డాయి. ఆత్మనిష్ఠ కలగడానికి అడ్డువచ్చే ఆటంకాలను తొలగించుకోవడానికి అమూల్యమూ అతిపవిత్రమూ అయిన సలహాలనందిస్తున్నారిక్కడ అష్టావక్రులు.

విషయభోగాలపై కోరికలు నశించడం, ప్రాపంచిక దృశ్యాలన్నీ ఆత్మజ్ఞానంలో లయం కావడం--ఇదేముక్తి. చిత్తశుద్ధి కలిగిన సాధకులలో చాలామంది ఆత్మానుభవాన్ని అప్పుడప్పుడూ రేఖామాత్రంగా దర్శించ గలిగినా,అందులో చాలామందికి ఆత్మనిష్ఠ అందరానిదిగానే ఉండిపోతున్నది. ఆత్మనిష్ఠ కుదరకుండా వారికి వస్తున్న ఆటంకాలేమిటి? దీనికి సంతృప్తి కరమైన సమాధానాల నిస్తున్నారీ అధ్యాయంలో. ఆ అవరోధాలవల్ల ఆగి పోకుండా, జారిపోకుండా నిలవగలగడాని కనువైన అనేక సూచనలనుకూడా ఇస్తున్నారు.

మన మనస్సుద్వారా ప్రపంచాన్ని గుర్తిస్తున్నాము, ప్రపంచంతో సంబంధం పెట్టుకుంటున్నాము. ఈ మనస్సు ఆత్మలో లయం అయిపోయి నప్పుడు బాహ్య ప్రాపంచిక దృశ్యాలు అదృశ్యం అయిపోతాయి. సర్వ వ్యాప్తమైన చైతన్యం మాత్రమే మిగిలి ఉంటుంది. అందులో ప్రయత్నం లేకుండా సహజంగా ఉండగలుగుతాడు జ్ఞాని. మామూలు మనుష్యుల దృష్టిలో అతడు **"అలస్య ధురీణః"** ఒట్టి సోమరిపోతుగా కనిపిస్తాడు.

ధ్యానంలో ప్రగతి సాధించి చివరిదశలో ధ్యాననిష్ఠ కుదరక పరితపించే సాధకులకు ఈ శ్లోకాలలోని సూచనలు అత్యంత విలువైనవి.

వారి ఇష్టానికి వ్యతిరేకంగా అసహాయంగా అహంకారం పరిధిలోకి జారి పోయే సాధకులకు అమూల్యమయిన సలహాలనందిస్తున్నారు అష్టావక్ర మునీంద్రులిక్కడ.

అష్టావక్ర ఉవాచ :-

శ్లో॥ అచక్ష్వ శృణు వా తాత నానాశాస్త్రాణ్యనేకశః ।
తథాఽపి న తవ స్వాస్థ్యం సర్వ విస్మరణాదృతే ॥1.

టీ॥ తాత = ఓ నాయనా! అనేకశః = అనేక ప్రకారములుగా, నానా శాస్త్రాణి = అనేకవిధములగు శాస్త్రములను, ఆచక్ష్వ = చెప్పుము, వా = లేక, శృణు = వినుము, తథా అపి = అట్లయినను, సర్వవిస్మరణాత్ ఋతే = సమస్తమమును విస్మరించకుండా, తవ = నీకు, స్వాస్థ్యం = స్వస్థత (శాంతి), న = కలుగదు.

వత్సా! అనేక శాస్త్రములను అనేక రకాలుగా విని ఉండవచ్చు. అనేక విధములుగా అనేకమార్లు వాటిగురించి మాటాడి ఉండవచ్చు. ఎంత తెలుసుకున్నా, తర్కించినా, ఆ జ్ఞానాన్నంతటినీ మరిచిపోతేనే తప్ప నీ ఆత్మలో నిష్ఠుడవు కాలేవు.

భావాతీతమైన నిశ్చల ఆత్మ చైతన్యం తప్ప రెండవదేదీ లేదనే దృఢ జ్ఞానం కలిగిన అష్టావక్రుడు, జగదీశ్వరుని, జగత్తును, అహంకారాన్నీ కూడా ఉన్నట్టుగా గుర్తించడానికి ఒప్పుకోవడం లేదు. అనంతమైన ఆత్మ చైతన్యంలో, శుద్ధమైన ఆ శుభస్థితిలో, వస్తువులూ ఆలోచనలూ ఏవీ లేవు. బాహ్యాభ్యంత రాలలో దేనిని గుర్తించినా అది మనః కల్పిత భ్రమమాత్రమే.

కాబట్టి గురుదేవులు ఇలా చెప్పుతున్నారు----"ప్రపంచంలోని తాత్త్విక గ్రంథాలన్నిటినీ క్షుణ్ణంగాచదివి సారాన్ని గ్రహించిన మహాపండితుడవు కావచ్చు ఉపనిషత్తులమీద అనర్గళంగా అద్భుతంగా ఉపన్యాసాలివ్వగలగనూవచ్చు,అయి నప్పటికీ నీకు అర్థం అయినది కేవలం ఆ పదాలకుగల వాచ్యార్థం మాత్రమే, అవి సూచించే లక్ష్యార్థాన్ని గ్రహించి లక్ష్యాన్ని అందుకోలేదింకా!" మహాశ్చర్య కరమైన ఆ శాంతమయిన స్థితిని గ్రహించి అనుభవిస్తేనే తప్ప ఆత్మనిష్ఠుడవు కాలేవు. "స్వాస్థ్యం"---స్వస్థితిలో ఉండడమని అర్థం.

ఆత్మలో అనేక వస్తువులతో కూడిన ప్రపంచం లేనేలేదు. కాబట్టి సాధకుడు అంతవరకు అనుభవించిన మిథ్యవస్తు జ్ఞాపకాలను విస్మరించి తీరాలి.

ఈ "సర్వవిస్మరణ"------పూర్తిగా సర్వజ్ఞాపకాలనూ మరిచిపోవడం ఒకటే ఆత్మానుభవానికి మార్గం. సాధకుడు తన శరీరాన్ని, మనస్సును బుద్ధిని, వస్తుమయ ప్రపంచాన్ని, ఉద్రేకాలను, ఆలోచనలు మరచిపోయినప్పుడు, సర్వాన్నీ చూసే అహంకారం లయం అయిపోతుంది. అటువంటి సమయాల్లోనే అహంకారం అనంత సత్యంలో ఐక్యం అయిపోతుంది. తత్త్వశాస్త్ర జ్ఞానం కూడా జ్ఞాపకాలలో భాగం మాత్రమే. జ్ఞాపకాలు ఉన్నంతసేపూ అహంకారం ఉండనే ఉంటుంది.

నిజానికి అహంకారం అంటేనే జ్ఞాపకాల సముదాయం. ఒక క్రొత్తవ్యక్తి నీ దగ్గరకు వచ్చి నీవెవరని అడిగితే నీవిచ్చే జవాబంతా నీ పాతజ్ఞాపకాల సారమే కదా? జ్ఞాపకాలు లేని స్థితులయిన నిద్ర, మూర్ఛ, మత్తులో ఉన్నస్థితి, పిచ్చి తనం, వీటిలో కూడా అహంకారం ఉండడంలేదు.

ప్రస్తుతం మన మనస్సులు గత జ్ఞాపకాల వలయంలో సదా జీవిస్తూ బయటపడలేక పోతున్నాయి. ఈ కారణం చేతనే మన అసలు స్వరూపం మరచి పోయాము, ఇదే బంధంగా బాధిస్తోంది. దీనికి సరిగ్గా వ్యతిరేకమైనదే ముక్తస్థితి. ఈ స్థితిలో నీ సహజ స్వరూపంలో నీ అహంకారం లయం అయిపోవడంచేత భౌతిక ప్రపంచంపు అనుభవాలను మనస్సు గ్రహించడం లేదు. కేవలం నీవే సత్ చిత్ ఆనందంగా ఉన్నావు. జాగ్రదవస్థ రాగానే స్వప్నమదృశ్యమయి పోతుంది. స్వరూపంలో నిలవగానే సర్వసంకల్ప వికల్పరూపమయిన ప్రపంచం అగోచరమవుతుంది.

పాండిత్యం మాత్రమే ఉండి అనుభవం లేకపోవడం ఇక్కడ గర్హించ బడింది. కఠోపనిషత్తులోకూడా ఈ కేవల పాండిత్యం విమర్శింపబడి నిరసించ బడింది.

నాయమాత్మా ప్రవచనేన లభ్యః న మేధయా న బహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూస్వామ్.
(కఠోపనిషత్తు 1-2-23)

వేదాలు బాగా చదవడం వలన, పాండితీ వైభవం వలన బాగా శ్రవణం చెయ్యడం వలన ఆత్మ లభ్యం కాదు. ఆత్మానుభవం కావాలనే ప్రగాఢమయిన కోరిక కలవారికి మాత్రమే తన సహజ స్వరూపాన్ని ప్రదర్శిస్తూ ప్రత్యక్షమయిన ఐక్యతానుభవంలో ఏకంగా అద్వయంగా నిలుస్తుంది.

పంచదశిలో ఇదే భావం వివరింపబడింది.

గ్రంధమభ్యస్య మేధావీ విచార్య చ పునః పునః
పలాలమివ ధాన్యార్థీ త్యజేత్ గ్రంధమశేషతః.

ధాన్యంయొక్క తవుడు పొట్టు వదలి బియ్యం తీసుకున్నట్టుగా తెలివైన విద్యార్థి గ్రంధాన్ని బాగా చదివిన తరువాత మరల మరల అందలి భావాన్ని యోచించి విచారించి స్వంతం చేసుకుని, గ్రంధాన్ని వదిలెయ్యాలి. ఇక్కడ గ్రంధాన్ని త్యజించడమంటే గ్రంధస్థ భావసారాన్ని గ్రహించి అక్షరాల్ని వది లెయ్యడం అని అర్థం.

శ్లో॥ భోగం కర్మసమాధిం వా కురు విజ్ఞ! తథాऽపి తే ।
చిత్తం నిరస్త సర్వాశం అత్యర్థం రోచయిష్యతి ॥ 2.

టీ॥ విజ్ఞ! = ఓ జ్ఞానస్వరూపా! (త్వం = నీవు), భోగం = భోగమును గాని, కర్మవా = కర్మనుగాని, వా = లేక, సమాధిం = సమాధినిగాని, కురు = చేయుము, తథా అపి = అట్లయినను, తే = నీయొక్క, చిత్తం = మనస్సు, నిరస్త సర్వాశం = తిరస్కరింపబడిన సమస్త కోరికలుగలదై, (త్వాం = నిన్ను గూర్చి), అత్యర్థం = మిక్కిలి, రోచయిష్యతి = అభిరుచి గలిగియుండగలదు.

ఓ బుద్ధిమంతుడా! నీవు విషయ భోగాలనుభవింపవచ్చు. ధర్మ కర్మలు చేయవచ్చు. సమాధిని కూడా అభ్యసించవచ్చు, అయినా నీ మనస్సు ఇంకా నీ సహజ స్వరూప ఆనందస్థితిని కోరుతూనే ఉంటుంది. ఈ నీ సహజ స్వరూపం సర్వవిషయాలకు అతీతంగా ఉంటుంది. ఇందులో సర్వకోరికలు నశించిపోతాయి.

ప్రతిమనిషీ కోరికలతో అశాంతిని పొందుతూ, కోరికలను తీర్చు కోవాలని సదా ప్రయత్నించే విధానం చూస్తుంటే ఒకటి నిశ్చయంగా తెలుస్తున్నది. ఈ కోరికలు లేకుండా హాయిగా ఉండడానికి ప్రతివారూ తమకు తెలియకుండానే ప్రయత్నిస్తున్నారు. ఒక వస్తువును పొందాలనీ, అనుభవించాలనీ అనుకోవడంతో మనస్సు ఆ వస్తువును కోరుతుంది. ఈ కోరుకునే మనస్సు ఆ కోరికల బలంతో తన సహజ శాంతస్వరూపానికి విరుద్ధంగా అశాంతిగా మారిపోతున్నది. దీనిని సరిగా అర్థం చేసుకోని అహంకారం, ఆ వస్తువును సంపాదించాలని నిశ్చయించు కుంటుంది. వస్తువును సంపాదించగానే ఎంతో ఆనందం కలుగుతుంది. మానవుడు

తన తెలివితక్కువతో ఈ ఆనందం వస్తువునుండే లభించిందనుకుంటాడు. నిజానికి తన స్వభావానికి విరుద్ధమయిన కోరిక లేకపోవడంతో, తన స్వరూప మయిన ఆనందం అక్కడ ప్రకాశించింది.

వైజ్ఞానికంగా ఈ సంఘటనను పరిశీలిస్తే ఇలా స్పష్టంగా తెలుస్తుంది. కోరిక తీరడం వలన మనస్సులోని అశాంతిపోయి సహజ శాంతస్థితిలోకి వస్తుంది. అశాంతియుత మనస్సు, అడ్డుగా ఉంచిన కోరిక అనే తెర తొలగి పోగానే మన సహజ స్వరూపం స్వయంగా ప్రకాశిస్తున్నది అక్కడ.

ఎన్ని సంపదలు ఐశ్వర్యాలు ఉన్నా ఎవరూ కూడా పూర్తిగా సంతోషం గా ఉండలేకపోవడాన్ని గమనిస్తే అనాదిగా మనిషి మనస్సు నిశ్శబ్దంగా వ్యక్తా వ్యక్తంగా తన సహజస్థితిని కోరుతున్నట్టు స్పష్టపడుతున్నది. మూలంగా ఉన్న ఈ కోరికే బాహ్యంగా అహంకారానికి అనేక కోరికలుగా తెలియబడి అనునిత్యమూ వాటిని తీర్చడం కోసం శ్రమిస్తున్నది. ఈ ప్రపంచాన్నంతటినీ జయించి స్వాధీనం చేసుకున్నా ఇంకా ఏదో రూపంలో ఏదో ఒక కోరిక అశాంతి ఉండనే ఉంటుంది. అది తీరలేదనే బాధకూడా ఉంటుంది. తను పరిపూర్ణత్వాన్ని సాధించలేదని తపన పడుతూనే ఉంటాడు! ఈ మూల కారణాన్నీ సమస్యను నిశితంగా పరిశీలించిన గురువుగారు శిష్యునికి బోధిస్తున్నారు. మనిషి విషయభోగాలనుభవించినా, ధర్మకార్యాలు చేస్తున్నా, సమాధి నభ్యసించినా, శాంతి మాత్రం రావడంలేదు. కాబట్టి మూల కారణాన్ని శోధించి సరైన విధానా న్నవలంబించాలి.

ఇందులో "భోగం"--మనస్సుకు సంబంధించినది. "కర్మ"--శరీరానికి చెందినది, "సమాధి"--బుద్ధి పరిధికి సంబంధించినది. మనస్సు, శరీరం, బుద్ధి-ఈ మూడింటితోనూ పూర్తిగా ప్రయత్నించి విజయం సాధించినా ఇంకా సంతృప్తి లభించడం లేదు. ఏదో రూపంలో అశాంతి మిగిలే ఉంటున్నది. ఫలితంగా ఎన్ని సాధించినా మానవుడు నిత్య అసంతృప్తుడుగా మిగిలిపోతున్నాడు.

మనిషి తన మనశ్శరీరాలనూ, వాటి అనుభవక్షేత్రాలనూ, విషయా లనూ, కోరికలనూ, ఉద్రేకాలనూ అన్నిటినీ అధిగమించి తన సహజ స్వరూపాన్ని తెలుసుకున్ననాడే ఈ అశాంతి అదృశ్యమవుతుంది. అప్పుడు మాత్రమే సుఖంగా జీవించగలడు.

శ్లో॥ ఆయాసాత్సకలో దుఃఖీ నైనం జానాతి కశ్చన ।
అనేనైవోపదేశేన ధన్యః ప్రాప్నోతి నిర్వృతిమ్ ॥ 3.

టీ॥ ఆయాసాత్=(శరీరనిర్వాహార్థ) పరిశ్రమవలన, సకలః = సమస్త జనము, దుఃఖీ = దుఃఖముగలది, (భవతి = అగుచున్నది), ఏనం = దీనిని, కశ్చిత్ = ఒకానొకడును, న జానాతి = తెలిసికొనజాలకున్నాడు, అనేన=ఈ, ఉపదేశేనైవ = ఉపదేశముచేతనే, ధన్యః = ధన్యుడగు పురుషుడు, నిర్వృతిం = పరమ సుఖమును, ప్రాప్నోతి = పొందుచున్నాడు.

**నిత్యమూ శ్రమిస్తుండబట్టే అందరూ అశాంతిగా ఉంటున్నారు. కాని ఎవరూ ఈ నిజాన్ని గ్రహించడం లేదు. ఈ ఉపదేశాన్ని అర్థం చేసుకున్న వాడు ధన్యుడై ముక్తస్థితిలో ఉంటాడు.**

సమాజంలో ప్రతివ్యక్తికీ అనంతమైన కోరికలున్నాయి. దురదృష్ట వశాత్తు కోరేవారు అసంఖ్యాకంగా ఉన్నారు, కోరబడే వస్తువులు అల్పసంఖ్యలో ఉన్నాయి, ఫలితంగా శ్రమంచినా వస్తువులు లభించక నిరాశతో అనేకమంది మిగిలిపోవలసి వస్తుంది. అయినా ప్రతివ్యక్తీ తన కోరికల ఒత్తిడితో నిరంతరమూ శ్రమిస్తూనే ఉన్నాడు. వస్తువులను సంపాదించడంలో ఒకరితో ఒకరు పోటీ పడుతూ, నిత్యమూ, శ్రమిస్తూ, ఈ ప్రయత్నములో ఎక్కువమందిని బాధిస్తూ, తాము బాధపడుతూ మొత్తం సమాజమంతా విషయభోగాలవైపు పిచ్చి పరుగులు తీస్తున్నది. ఈ పిచ్చిపరుగులనే ప్రగతికి చిహ్నంగా నవనాగరికులు భావిస్తున్నారు. ఈ కోరికలకతీతంగా శాంతంగా విడిగా నిల్చి సమాజాన్ని చూసే వారికి దీపం పురుగులు జ్ఞప్తికి రాకమానవు. నవీన సమాజంలో మనుషు లంతా కోరికలకు వశులై, వాటిని తీర్చుకుంటే, శాంతీ సుఖమూ లభిస్తాయనే భ్రమలో పిచ్చిగా పరుగులు తీస్తూ దీపం పురుగులవలెనే, ఆ ప్రయత్నంలోనే బాధలకు లోనై నశిస్తున్నారు.

కోరికలవలయంలో చిక్కుకొని నిత్యమూ శ్రమిస్తూ ఫలితంగా అశాంతినీ బాధలనూ పెంచుకుంటూ తమనాశనానికి తామే దారిని తయారు చేసుకుంటున్నా మన్న సత్యాన్ని మాత్రం ఎవ్వరూ అర్థం చేసుకోలేకపోతున్నారు. ఈ సందర్భంలో యోగవాశిష్ఠంలో ఒక భావం గుర్తుకు వస్తుంది.

అజ్ఞానత పరమార్థేన క్రియామాత్రే చ తిష్ఠతా
ఫలకార్పణ్యయుక్తేన పుంసా తత్త్వం న చిన్త్యతే.
సంత్యక్త వాసనాన్మౌనాత్ తే నాస్త్యుత్తమం పదమ్. (యోగవాశిష్ఠం)

పరమార్థ తత్త్వాన్ని తెలియని కారణంగా వివిధ కర్మలలో నిత్యమూ శ్రమిస్తూ, ఫలితాల కోసం ఆతృతతో బాధపడుతూ మనిషి తన జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నాడు. సత్యతత్త్వం గురించి ఆలోచించే తీరికే దొరకడం లేదు. సర్వవాసనలనుండీ ముక్తుడయి శాంత నిశ్చల మనస్సుతో నిలవగలగడం కంటే గొప్పదైన స్థితేలేదు.

తెలివైనవారికి ఈ ఒక్క ఉపదేశవాక్యమే చాలును. జీవిత నావను కోరికల సుడిగుండంలో చిక్కుకోనీయకుండా శాంతమైన ఆత్మస్థితి అనే ఓడరేవుకు చేర్చి హాయిగా జీవిస్తారు.

**శ్లో॥ వ్యాపారే ఖిద్యతే యస్తు నిమేషోన్మేషయోరపి ।**
**తస్యాలస్య ధురీణస్య సుఖం నాన్యస్య కస్యచిత్ ॥4.**

టీ॥ యః=ఎవడు, నిమేషోన్మేషయోః = కంటియొక్క తెరచుటమూయుట యొక్క, వ్యాపారే = వ్యాపారమునందుకూడా, ఖిద్యతే = దుఃఖించుచున్నాడో, ఆలస్యధురీణస్య = నిస్పృహులలో శ్రేష్ఠుడగు, తస్య = అతనికి, సుఖం=సుఖము, (భవతి= అగుచున్నది), అన్యస్య = ఇతరుడగు, కస్యచిత్ = ఎవనికిగూడ, న = లేదు.

**కళ్ళను మూయిడం తెరవడం కూడా పరమబద్ధకంతో కష్టంగా భావించే, "ఆలస్యధురీణః" ఆలస్య ధురీణునిదే అనంతమైన సుఖం. అతనికి తప్ప మరి ఎవరికీ సుఖం లభించదు. (ఆలస్యధురీణుడంటే ఉదాశీనంగ ఉండుటలో అగ్రగణ్యుడు.)**

అంతరంగంలోని ఆలోచనా తరంగాలతాకిడే బాహ్యంలో కర్మలుగా వ్యక్తమవుతాయి. కోరికలు లేనివానికి ఆలోచనా ప్రవాహం ఉండదు. కోరికల కలితంగా ఆలోచనారహితంగా ఉన్నవ్యక్తిచే శారీరక కర్మలు చెయ్యబడవు.

అతడు ఆనందమయమూ అనంతమూ అయిన తన ఆత్మలో తాను స్థితుడై ఉంటాడు. అట్టివానికి తన శరీరమనే స్పృహ ఉండదు. శరీరంచే అనుభవింపబడేవేవీ అతని స్థితిని బాధింపజాలవు. నానాత్వ ప్రపంచాన్ని అతని శరీరం చూస్తున్నా అతడు మాత్రము నిత్యమూ ఆత్మానుభవంలోనే ఆనందంగా ఉంటాడు. దీనినే సమాధి అంటారు. ఈ సమాధిని సహజంగా నిత్యమూ అనుభవించడం అన్నది ఏ కొద్దిమంది మహితాత్ములకో సాధ్యమవుతుంది. ఈ

స్థితిని "సహజ సమాధి" అంటారు. ఇట్టి ఆత్మనిష్ఠులకు ఒక ఆలోచన రావడం కూడా బాధాకరమే. అందుకనే "కళ్ళుమూయడం తెరవడం కూడా కష్టమే" అని చెప్పబడింది.

మండుటెండలో కష్టించి పనిచేసే కూలివాని దృష్టిలో ఎయిర్ కండిషన్డ్ ఆపరేషన్ థియేటరులో సుఖంగా పనిచేసే డాక్టరు సోమరి కావచ్చు! మనదేశపు ప్రధాన న్యాయమూర్తి వారానికి అయిదు రోజులు మాత్రమే, అదైనా రోజుకు ఏ మూడు నాలుగు గంటలో పనిచేస్తూ, పెద్దమొత్తాన్ని జీతంగా పొందుతూ అన్ని సుఖాలనూ అనుభవిస్తుంటే అతనికన్నా సోమరి కనిపించక పోవచ్చు! ఇదే అదృష్టానికి కళ్ళులేకపోవడంగా అన్యాయానికి పరాకాష్ఠగా అనిపించనూవచ్చు!!

రాజకీయాందోళనలతో సతమతమయే రాజకీయవేత్త, నిముషం తీరుబడిలేని వణిక్ ప్రముఖుడు, సమాజసేవలో సర్వసౌఖ్యాలనూ మరచిన సంఘ సంస్కర్త---వీరి దృష్టికి సైంటిస్టులూ వేదాంతులూ సోమరులుగా అనిపించవచ్చు! బుద్ధిపనిచేసే క్షేత్రము సున్నితమూ సూక్ష్మమూ అయేకొద్దీ మనస్సుకు ఏకాగ్రత హెచ్చుతుంది, మనస్సు ఏకాగ్రతలో ఉంటే శరీరం నిశ్చలంగా పనిలేకుండా ఉన్నట్టు కనిపిస్తుంది. ఆలోచనా రహితులైన అనేకుల స్థూలదృష్టిలో శరీరం ఆ విధంగా నిశ్చలంగా పనిచెయ్యకుండా ఉండడం సోమరితనంగా కనిపిస్తుంది!

ఈ దృష్టితో చూసేవారికి, ఆత్మానుభూతికోసం ప్రయత్నిస్తూ ధ్యాననిష్ఠలో ఉండేవారుగాని, అనంతశాంతి స్వరూపమైన అనుభవంలో సమాధి స్థితిలో ఉన్నవారుగాని పరమ బద్ధకస్వరూపమైన సోమరిపోతులుగా అనిపించక మానరు! అతివేగంగా తిరిగే చక్రం అసలు ఉన్నట్టు కనిపించదు, మెల్లగా తిరిగే చక్రం మాత్రమే తిరుగుతున్నట్లు కనిపిస్తుంది.

అత్యంత వేగవంతమైన కదలిక, కదలికలేనట్టుగా కనిపించడమే భ్రమ, ఈ అర్థంలో సమాధి స్థితుడయిన యోగి, అనుక్షణమూ ప్రగతిని సాధించాలనే తపనతో శ్రమించే సామాజిక జీవికి----"ఆలస్యధురీణః"---బద్ధకస్తులలో అగ్రగణ్యుడుగ తప్పక కనిపిస్తాడు. కళ్ళరెప్పలను మూసి తెరవడంకూడా కష్టమని భావించే ఈ పరమ బద్ధకస్తుడు కేవలమూ శుభప్రదమూ అయిన తన సహజ స్వరూపనిష్ఠలో శాంతంగా ఉన్నాడని ఊహించనైనాలేము కదా!

శ్లో॥ ఇదం కృతమిదం నేతి ద్వంద్వైర్ముక్తం యదా మనః।
ధర్మార్థ కామమోక్షేషు నిరపేక్షం తదా భవేత్ ॥ 5.

టీ॥ ఇదం = ఇది, కృతం = చేయబడినది, ఇదం = ఇది, న కృతం = చేయ బడలేదు, ఇతి = ఇట్లనెడి, ద్వంద్వైః = ద్వంద్వములనుండి, యదా = ఎప్పుడు, మనః = మనస్సు, ముక్తం = ముక్తమైనదో, తదా = అప్పుడు, తత్ = అది, ధర్మార్థ కామమోక్షేషు = ధర్మార్థ కామ మోక్షములయందు, నిరపేక్షం = నిరపేక్షమైనదిగా, భవేత్ = అగును.

**ఈ పని చెయ్యబడింది, ఇది ఇంకా చెయ్యబడవలసి ఉంది అనే ద్వంద్వభావాల నుండి విడివడిన మనస్సు, ధర్మంపట్ల ఐశ్వర్యంపట్ల కోరికలూ ముక్తిపట్ల కూడా ఉదాసీనతతో ఉండగలదు.**

మనస్సుచే పరిమితం చేయబడుతూ మనస్సుతోనే పని చేస్తున్నంత కాలమూ ఈ ద్వంద్వానుభావాలనుండి మనం తప్పించుకోలేం. దుఃఖంలేని సుఖం ఎక్కడా ఉండదు, సుఖంలేని దుఃఖం అర్థవిహీనం. తెల్లకాగితం మీద తెల్లని చుక్క ఉంటే కనిపించదు. ఈ తెల్లచుక్క గుర్తింపబడాలంటే నల్లరంగు చుట్టూ ఉండాలి. ఇదేవిధంగా నల్లనిమచ్చ తెలియబడడానికి తెల్లని పరిసరాలు అవసరం. ఈ సుఖదుఃఖాలు, శీతోష్ణాలు, వెలుగుచీకట్లు, మొదలైన ద్వంద్వాలన్నీ కూడా పరస్పర విరుద్ధమయిన రెండు సంఘటనలు కావు. ఒక సంఘటనకు రెండు చివరలవంటివి మాత్రమే. ఉత్తర దక్షిణ ధృవాలు లేని అయస్కాంతాన్ని ఊహించగలమా?

మనస్సు నధిగమించినవారికి, పరస్పరాధార అనుభవక్షేత్రాలయిన ఈ ద్వంద్వాలు కూడా నశిస్తాయి. అట్టివానికి సాధించవలసిన లక్ష్యాలేమి ఉండవు.

హిందూ జీవిత విధానంలో మానవుని ఆధ్యాత్మిక సాధనకూ ప్రగతికీ అనుగుణంగా సాధించవలసిన లక్ష్యాలుగా ధర్మ, అర్థ, కామ, మోక్షాలు నాలుగూ నాలుగు దశలలో నియమింపబడ్డాయి. ఆత్మనిష్ఠుడయిన వ్యక్తికి ఈ ప్రాపంచిక జీవన లక్ష్యాలు అర్థవిహీనంగా నిష్ప్రయోజనంగా కనిపిస్తాయి. మానవ సమాజ విహిత ధర్మాలు కాని, హక్కులు బాధ్యతలూ కాని అతనికేవీ ఉండవు. కోరిక ఉంటేనే కర్మ ఉంటుంది కోరికలనుండి ముక్తుడయిన అతనికి చెయ్యవలసిన కర్మలేవి? మానసాతీతమైన అనుభవంలో నిష్ఠుడయి నిర్మలమూ

విస్పష్టమూ అయిన విజ్ఞాంతో తేజరిల్లే అట్టి జ్ఞానిని సమాజం సేవించడంలో, పూజించడంలో, సర్వమానవాళికీ గల ముక్తి కామన వ్యక్తమవుతోంది.

శ్లో॥ విరక్తో విషయద్వేష్టా రాగీ విషయలోలుపః ।
గ్రహమోక్ష విహీనస్తు న విరక్తో న రాగవాన్ ॥ 6.

టీ॥ విషయద్వేష్టా = విషయవాంఛా రహితుడైన వానిని, విరక్తః = విరాగి (అని), విషయ లోలుపః = విషయములయందు ఆసక్తిగలవాడు, రాగి = రాగి (అని), తు = అయితే, గ్రహమోక్ష=పట్టువిడుపులు, విహీనః=లేని జ్ఞాని, న విరక్తః = విరాగీకాడు, న రాగవాన్ = రాగీకాడు.

విషయ భోగవాంఛ కలవానిని "రాగి" అనీ, విషయ వాంఛా రహితుడైన వానిని "విరాగి" అనీ అంటారు. ప్రపంచాన్ని మిథ్యగా తెలుసుకుని ఆమోద విసర్జనలు లేని జ్ఞాని రాగీకాడు విరాగీ కాడు.

పరిశుద్ధమూ కేవలమూ అయిన ఆత్మగా జాగృతుడయిన జ్ఞాని దృష్టిలో వివిధ ప్రత్యేక రూప సమన్వితమయిన విశాల విశ్వం లేనేలేదు. ఈ ప్రపంచం ఉందనిగానీ లేదని గానీ భావించే మనస్సుకూడా అతనిలోలేదు. ప్రాపంచిక వస్తు విషయ భోగాలను వాంఛించే మనస్సు రాగం కలిగి ఉందనీ, వస్తువులపై విరక్తి కలిగివుంటే విరాగి అని అంటాము. అసలు వస్తువులను చూసే మనస్సేలేక వస్తువులు కనిపించని జ్ఞానిని రాగి అని కానీ విరాగి అని కానీ ఎలా అనగలము?

శ్లో॥ హేయోపాదేయతా తావత్ సంసార విటపాంకురః ।
స్పృహా జీవతి యావద్వై నిర్విచార దశాస్పదమ్ ॥7.

టీ॥ యావత్ = ఎంతకాలము, స్పృహా = తృష్ణయున్ను, యావత్ = ఎంత కాలము, నిర్విచార దశాస్పదం = అవివేక దశాస్థితియు, జీవతి = జీవించు చున్నదో, తావత్ = అంతవరకు, హేయోపాదేయతా = త్యాజ్యగ్రహణ భావమున్ను, సంసార విటపాంకురః = సంసారరూప వృక్షముయొక్క అంకురమున్ను, జీవతి = జీవించు చున్నది.

అవివేకానికి ఆటపట్టయిన కోరికలు ఉన్నంతకాలమూ బుద్ధిలో ఆమోద విసర్జనా భావాలు ఉండనే ఉంటాయి. అవే సంసార వృక్షానికి అంకురాలు.

మనుష్యులంతా ఏవిధంగా పతనం అయిపోతున్నారో భగవద్గీతలో వర్ణింపబడిన విధానం ఇక్కడ గుర్తుకువస్తోంది.

ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూప జాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే.
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి. (భగవద్గీత 2-62,63)

*మనిషి వస్తువుల గురించి ఆలోచించినప్పుడు వాటిపై రాగం పుడుతుంది, రాగంనుండి కోరికలు ఉదయిస్తాయి. ఈ కోరికనుండి క్రోధం ఉద్భవిస్తున్నది. కోపంనుండి భ్రమ, భ్రమనుండిస్మృతి విభ్రమము, ఆ మతిభ్రమణంతో బుద్ధి నశించడం జరుగుతాయి. వివేకవంతమైన బుద్ధి నశించడమే వినాశము.*

అవివేకంనుండి కోరికలు పుడుతున్నాయి. కోరికల బలంవలన వివేకం నశిస్తుంది. అర్థం చేసుకునే బుద్ధి వివేక హీనమై నీరసించడంతో మనచుట్టూ ఉన్న వస్తువులలో మంచివేవో, చెడ్డవేవో, ఏవి ఆమోదయోగ్యమో,వేటిని నిరాకరించాలో తెలియని అయోమయావస్థలో సంశయంలో అస్థిర చిత్తంతో అశాంతిగా జీవిస్తాము. ప్రాపంచిక జీవితానికి, ఈ సంసారమనబడే మహావృక్షానికి కోరికే విత్తనం. ఇష్టాయిష్టాలతో రాగద్వేషాలతో చిలవలుపలవలు కొమ్మలుగా ఏర్పడతాయి.

**శ్లో॥ ప్రవృత్తౌ జాయతే రాగో నివృత్తౌ ద్వేష ఏవ హి ।**
**నిర్ద్వన్ద్వో బాలవద్ధీమానేవ మేవ వ్యవస్థితః ॥ 8.**

**టీ॥** ప్రవృత్తౌ = ప్రవృత్తియందు, రాగః = రాగము, జాయతే = కలుగుచున్నది, నివృత్తౌ=విషయ నివృత్తియందు, ద్వేషః=ద్వేషమున్ను, జాయతే = కలుగు చున్నది, నిర్ద్వన్ద్వో = నిర్ద్వంద్వమునందు, బాలవత్ = బాలునివలెనే, ధీమాన్= బుద్ధిమంతు డగువాడు, ఏవమేవ = ఈ ప్రకారమే, వ్యవస్థితః = ఉంటున్నాడు.

**కర్మలతో విషయాలపై రాగం జనిస్తోంది. ఈ విషయాలకు దూరంగా ఉంటే ద్వేషం పుడుతోంది. జ్ఞాని ఈ ద్వంద్వాల కతీతంగా బాలునివలె చరిస్తూ ఉంటాడు, నిత్యమూ ఆత్మస్థితుడై ఆనందంగా ఉంటాడు?**

కోరికలేనిదే కర్మను చెయ్యలేం. ఏ క్షేత్రంలో ఎక్కువగా పనిచేస్తూ ఉంటామో అందుకు సంబంధించిన కోరికలు, వృద్ధిచెందుతూనే ఉంటాయి. బాహ్యప్రపంచంతో మనస్సు ముడిపడి ఉండడం రాగం అనబడుతుంది. ఈ విధంగా కర్మలనుండి రాగం జనిస్తుంది.

మనకయిష్టమైన కొన్నిరకాల కర్మలను నిరాకరిస్తాము. ఇలా నిరాకరించి వాటికి దూరంగా ఉండడం, ఆ అనుభవాలపట్ల మనకుండే అయిష్టతకు నిదర్శనం. జీవన్ముక్తుడయిన వానికి ఈ ద్వంద్వాలేవీ ఉండవు. అతనిలో రాగద్వేషాలు ఉండనే ఉండవు. నిత్యమూ అనంతానందంలో నివసిస్తూ జీవితంలో వచ్చే ప్రతీ సంఘటనకు హృదయ పూర్వకంగా స్వాగతం పలుకగలుగుతాడు! విషయ భోగాలమీద అతనికి కోరికా ఉండదు, విరక్తీ ఉండదు. అట్టి వ్యక్తి మాత్రమే పవిత్రమైన ఆత్మతత్త్వంలో నిష్ఠకలిగి ఉంటాడు.

తత్త్వశాస్త్రి గ్రంధాలన్నిటిలోనూ తరచుగా వాడబడే "బాలవత్" అనే ఉపమానాన్నే ఇక్కడ అష్టావక్ర మహర్షికూడా వాడినారు. జీవన్ముక్తుడైన జ్ఞాని బాహ్యప్రపంచంలో వ్యవహరించే తీరును వివరించడానికి ఈ ఉపమానం వాడబడుతుంది. దీనిని చాలా జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. మానసికానురాగ కలుషితమయిన అభిప్రాయాలను వీడి నిష్పక్షపాతంగా నిర్ణయించాలంటే చిన్న పిల్లల బుద్ధి పెరగని కారణం చేత వారు తెలివితక్కువ వారని ఒప్పుకుని తీరాలి. ఒక జ్ఞానిని బాలునితో పోల్చడం విచారకరంగా అవమానకరంగా తోచకపోదు. అయినా అన్నిశాస్త్రిగ్రంధాలలోనూ ఈ ఉపమానం వాడబడడం చూస్తే దీనికి ఇంతకంటే గంభీరమయిన వేరొక అర్థం ఉన్నదేమో అనిపించక మానదు.

ఏ సమయంలోనైనా కోపం వచ్చినా ప్రేమవచ్చినా చిన్న పిల్లలు ఆ సమయంలో దానిని వ్యక్తం చేసి తరువాత మరచిపోతారు. అంటే గత జ్ఞాపకాలతో వర్తమానాన్ని కలుషితం చెయ్యరు! జ్ఞానికూడా ఈ విధంగానే గత జ్ఞాపకాలతో గాని భవిష్యత్ప్రణాళికలతోగాని వర్తమానాన్ని కలుషితం చెయ్యకుండా నిత్య వర్తమానకాలంలో నిత్యతృప్తుడై జీవిస్తూ ఉంటాడు. "బాలవత్" అని జ్ఞానిని ఈ అర్థంలోనే వాడుతూ ఉంటారు. ప్రారబ్ధానుగుణంగా వచ్చే సంఘటనల నన్నిటినీ ప్రసాద బుద్ధితో స్వీకరిస్తూ ఉండడం వల్ల కొత్తకోరికలు పుట్టవు, కొత్తవాసనలు యేర్పడవు, ప్రారబ్ధం క్షయిస్తుందే కాని సంచితం పెరగదు.

సాధకులు తమ జీవితాన్ని చలన చిత్రాన్ని చూస్తున్నట్టుగా, సాక్షిగా, చూస్తూ సంఘటనలను ప్రసాదబుద్ధితో స్వీకరిస్తూ ఆనందంగా జీవించాలి. మన గమ్యం వెలుతురయితే మార్గం కూడా కాంతివంతంగా ఉంటుంది. ఆనందంగా జీవితపు బాటలో ప్రయాణం చేస్తూ ఆనందాన్ని తానుగా తెలుసుకోగలుగుతారు సత్యాన్వేషులయిన సాధకులు.

శ్లో॥ హాతుమిచ్ఛతి సంసారం రాగీ దుఃఖజిహాసయా ।
వీతరాగో హి నిర్దుఃఖః తస్మిన్నపి న ఖిద్యతి ॥ 9.

టీ॥ రాగీ = రాగసహితుడగు పురుషుడు, దుఃఖజిహాసయా = దుఃఖ నివృత్తి యందువాంఛగలవాడగుటచేత, సంసారం = సంసారమును, హాతుం = విడిచిపెట్టుటకు, ఇచ్ఛతి =కోరుచున్నాడు, వీతరాగః = రాగరహితుడగు పురుషుడు, నిర్దుఃఖః = దుఃఖము లేనివాడై, తస్మిన్నపి = ఆ సంసార విషయమై, న ఖిద్యతి హి = దుఃఖింపబడు గదా!

ప్రపంచంమీద మోహం ఉన్నా వారు అందులోని బాధలననుభవించి చలించిన చిత్తంతో ప్రపంచాన్ని త్యజించాలనుకుంటారు. మోహంలేని వారికి విచారం ఉండదు. కాబట్టి అట్టివారు ప్రపంచములో ఉన్నా బాధలకు లోనుకారు.

సాధారణంగా ఆలోచనా హీనులయిన అధిక సంఖ్యాకులు ప్రపంచం వల్లనే తాము బాధపడుతున్నామనుకుంటారు. ఈ ప్రపంచమంతా జడపదార్థంతో తయారు కాబడింది. అందులోని వస్తువులు జడం కాబట్టి తమంత తాముగా మనకు సుఖదుఃఖాల నివ్వజాలవు. వస్తువుమీద మనకున్న యిష్టమే సుఖంగా మనకు కనిపిస్తుంది. ఆ వస్తువే మనకయిష్టమయినదయితే దుఃఖాన్నిస్తుంది. "నశ్యం" అలవాటున్నవానికి అది లభిస్తే ఆనందంగా ఉంటుంది. అలవాటులేని వారికి నశ్యం పీల్చడంకన్నా బాధాకరమయినది ఏదీ లేదనిపిస్తుంది!

జడపదార్థాలు మనిషికి సుఖదుఃఖాల నివ్వగలుగుతున్నాయంటే, మనిషికిగల కోరికలు, ఇష్టాయిష్టాలూ, విలువలే అందుకు కారణం. వ్యామోహా లతో, కోరికలతో, స్వార్థపూరితమయిన అహంకారంతో జీవించి సామాన్యుడు తన చుట్టూ ఉండే పరిస్థితులవల్ల, తనకోరికలవల్ల, బాధపడుతూ నిరాశచెందుతూ ఈ ప్రపంచాన్ని త్యజించాలనుకుంటాడు. ఇటువంటి బాధాకరమైన అనుభవాలు అధికమవుతున్నకొద్దీ వీలైనంత వేగంగా ప్రపంచాన్ని త్యజించి ఇంతకంటే సుఖ కరమైన మరొక స్థితిలో ఉండాలని కోరుకుంటాడు.

జ్ఞానికి కోరికలు లేకపోవడం చేత విషయాలమీదా ప్రపంచం మీదా వ్యామోహం ఉండదు. ఈ విధమైన వైరాగ్యంతో జ్ఞానంతో జీవించడం వల్ల మనస్సు ప్రశాంతంగా స్వతంత్రంగా ఉంటుంది. ఇటువంటి మనస్సుకు బాహ్య విషయాలు సుఖాన్ని కానీ, దుఃఖాన్ని కానీ ఇవ్వజాలవు. నేను చేస్తున్నాను

అనుభవిస్తున్నాను అనే అహంకారం లేనివాడై అన్ని పరిస్థితులలోనూ ఆనందంగా జీవించగలుగుతాడు. ఆత్మానుభవనిష్ఠుడయిన జ్ఞాని ఈ విధంగా ప్రపంచంలో ఉన్నా నిర్మోహత్వంతో సుఖంగా శాంతంగా ఉండగలుగుతాడు. నరకమైనా అట్టివానిని బాధింపజాలదు. అతడు నిత్యానంద స్వరూపుడు కావున!

శ్లో॥ యస్యాభిమానో మోక్షేఽపి దేహేఽపి మమతా తథా ।
న చ యోగీ న వా జ్ఞానీ కేవలం దుఃఖభాగసౌ ॥ 10.

టీ॥ యస్య = ఎవనికి, మోక్షే=మోక్షమునందు, అభిమానః = అభిమానము గలదో, తథా = అట్లే, యస్య = ఎవనికి, దేహే అపి = దేహమునందు కూడా, మమతా = మమత్వమున్నదో, సః = అట్టివాడు, యోగీ వా = యోగి గాని, న = కాదు, జ్ఞానీ చ = జ్ఞానిగాని, న=కాజాలడు, (కిం తు = మరేమనగా), అసౌ = ఇతడు, కేవలం = కేవలము, దుఃఖభాక్ = దుఃఖభాజనుడు.

**శరీరాన్ని తనదిగా భావించేవాడుకానీ, మోక్షం కావాలనే కోరిక ఉన్నవాడు కానీ జ్ఞానీకాడు యోగీకాడు, కేవలం బాధామయజీవి మాత్రమే.**

కర్త భోక్త భావాలు కలసి అహంకారం అవుతుంది. ఈ అహంకారం రాజ్యమేలుతున్నంతకాలం ఆత్మానుభవం కలుగజాలదు. నేను ఆత్మను అన్వేషించే సాధకుడననే భావంకాని, నాకు ఆత్మానుభవం వచ్చిందని అనుకోవడం గానీ అహంకారపు ఊహలే; ఇటువంటి ఊహలతో అహంకారం మరింత బలపడుతుంది. అహంకారం బలీయమయేకొలదీ ఆత్మమరుగున పడిపోతుంది. ఇదే విధంగా, శరీరం నేననే భావంకానీ, శరీర రక్షణ పోషణ దృష్టికానీ ఏమాత్రం ఉన్నా ఆ మేరకు అహంకారం పనిచేస్తుంది, అహంకారం పనిచేస్తుంటే ఆత్మానుభవం అసంభవం అవుతుంది.

"నేను ముక్తికోసం ప్రయత్నిస్తున్నాను" అనికానీ, "నేను ముక్తుడిని" అని కానీ అనిపిస్తున్నంతసేపూ అహంకారం పనిచేస్తున్నట్టే. ఇదికాక, దేనినైనా తనదిగా భావిస్తున్నా, ఆఖరికి తన శరీరమైనాసరే, మమత్వ రూపంలో అహంకారం ఉందన్నమాటే. ఈ విధంగా అహంకార-మమకారాలు ఏ రూపంలో మిగిలి ఉన్నా సరే రాగద్వేషాల మధ్య నలిగిపోతూ బాధమయ ప్రాపంచిక జీవితం గడపవలసిందే, ఆత్మానుభవంరాదు---అని అష్టావక్రులు స్పష్టంగా చెప్పుతున్నారు.

శ్లో॥ హరో యద్యుపదేష్టా తే హరిః కమలజోఽపివా ।
తథాఽపి న తవ స్వాస్థ్యం సర్వ విస్మరణాదృతే ॥11.

టీ॥ తే=నీకు, హరః = శివుడు, ఉపదేష్టా యది = ఉపదేశకుడైనప్పటికినీ, హరిః వా = విష్ణువుగాని, కమలజః అపి వా = బ్రహ్మదేవుడుగాని, (ఉపదేశకుడైనను), తథా అపి = అట్లయినను, సర్వవిస్మరణాత్ ఋతే = సర్వ విస్మరణము కలుగకుండా (త్యాగము లేక), తవ = నీకు, స్వాస్థ్యం = శాంతి, న = కలుగదు.

**బ్రహ్మ విష్ణు మహేశ్వరులు స్వయంగా నీ గురువులైనా, నీవు సర్వాన్ని మరచిపోతేనేకాని నీకు ఆత్మానుభవం సిద్ధించదు.**

ఆధ్యాత్మిక తత్త్వశాస్త్రాన్ని బోధించే గురువుల గుణగణాల గురించీ సమర్థత గురించీ వారి లోటుపాట్ల గురించీ యోచించి ప్రయోజనం లేదు. వారెంతటివారైనా, వారి అనుభవాన్ని శిష్యునికి అందించడంలో అనేక పరిమితులుండడం వలన వారి బోధవల్లనే పూర్తి ప్రయోజనం ఉంటుందని భావించరాదు. వారి బోధ ఎటువంటిదైనా, సాధకునిలో సంసిద్ధత అర్హత ఉన్నప్పుడే సత్యం అవగతమవుతుంది. అనుభవానికి వస్తుంది. గురుకృప ఎంత ఉన్నా అది తమకు సహాయకారి కాకుండా సాధకుని మనస్సే అడ్డుగా నిలుస్తుంది. శిష్యుని గత జీవిత స్మృతులే మనస్సులో అడ్డుగా నిలుస్తాయి. గత జీవితపు అనుభవ స్మృతులసారమే అహంకారం అని మనం ఇదివరకే తెలుసుకుని ఉన్నాం. ఈ అహంకారమే అవరోధమయి నిలుస్తుంది.

ఈ గత స్మృతులను పూర్తిగా తుడిచివెయ్యగలిగినప్పుడే అహంకారం అంతమవుతుంది. ఆత్మానుభవం సిద్ధిస్తుంది. ఈ భావాన్ని దృఢంగా చెప్పడానికే అష్టావక్ర మహర్షి ఇక్కడ ప్రయత్నిస్తూ, త్రిమూర్తులే గురువులైనా ప్రయోజనం లేదనీ, సాధకుడు స్వయంగా తన గతస్మృతుల నుండి బయటపడాలని చెప్పు తున్నారు.

**ఈ సందర్భంలో యోగవాశిష్ఠం ఇలా అంటోంది.**

చిరమారాధితోప్యేష పరమప్రీతి మానసి
నా విచారవతో జ్ఞానం దాతుం శక్నోతి మాధవః. (యోగవాశిష్ఠం- 43-10)

*సాధకుడు, ఎంతభక్తుడైనా, ఎంతకాలం తపస్సు చేసినా, సాక్షాత్తు విష్ణుమూర్తికూడా అతనికి జ్ఞానాన్నివ్వలేడు సాధకుడు స్వయంగా ఆత్మవిచారం చేసి ఆ అనుభవంలోనికి వెళ్ళవలసిందే.*

## అధ్యాయం-17

# ఆత్మ ఏకం - అద్వయం, కేవలం

ఆలోచనా విధానం అత్యున్నత శిఖరాన్నధిరోహించింది ఈ అధ్యాయంలో. ఇందలి శ్లోకాలలోని భావౌన్నత్యం, అర్థగాంభీర్యం, కవితా మాధురి అష్టావక్ర మునీంద్రుల ధీశక్తికి, ఆత్మానుభవానికి నిదర్శనమై ఆనందస్వరూపాన్ని బుద్ధికి అందిస్తాయి. బాధామయమైన ఈ లోకంలో, మన మధ్యనే మనవలెనే జీవిస్తున్నా, జీవన్ముక్తుడు దేనికీ చలించక ఆనందంగా ఎలా జీవించేదీ వర్ణింపబడింది. ఈ రాబోయే శ్లోకాలలో జ్ఞాని తన మనశ్శరీరాలతో మానసిక భౌతిక ప్రపంచాలలో వ్యవహరించే తీరు ఉపనిషత్తులలో అక్కడక్కడా వర్ణింపబడి వేద ఉద్యాన వనంలో అపురూప పుష్పంగా అరుదుగా గోచరిస్తుంది. ఆ అపురూప కుసుమాలతో అద్భుతంగా అల్లబడిన మాలగా పోల్చవచ్చు ఈ శ్లోకావళిని.

వేదోద్యాన వనంలోని ఈ అపురూప కుసుమాలను వేదవ్యాసులు సేకరించారు. భగవాన్ కృష్ణుడు వాటిని గుచ్ఛంగా బంధించి పాండవ మధ్యమునికి కురుక్షేత్ర సంగ్రామ రంగస్థలిలో ప్రేమతో బహూకరించాడు. ఈ భావాలను అష్టావక్రులు అందమైన మాలగా మలచి శిష్యునికి శాశ్వతా లంకారంగా కంఠహారంగా అలంకరిస్తున్నారు.

ఆత్మయొక్క కేవలత్వాన్ని (కైవల్యాన్ని) గానం చేస్తున్నారిక్కడ, ఆనందంగా అద్వయంగా ఆత్మమాత్రమే ఉంది. ఈ స్థితిలోనికి జాగృతు డయిన సాధకుని సర్వకోరికలు అదృశ్యమయిపోతాయి, సాధింపదలచినవన్నీ సిద్ధించే ఉన్నాయి,ముక్తికావాలనే కోరికకూడా అర్థరహితంగా హాస్యాస్పదంగా అనిపిస్తుంది, మనస్సు మౌనంగా నిశ్చలంగా శాంతంగా అయిపోతుంది, మతి చలింపజేసే బాధలన్నీ మటుమాయం అయిపోతాయి. మనశ్శరీరాలతో తాదాత్మ్యం తొలగిపోయి మహానంద స్వరూపమయిన కైవల్య స్థితిలో సాధకుడు శాంతంగా నిశ్చలంగా ఉంటాడు.

అనంతానంద స్వరూపమయిన ఆత్మానుభవాన్ని వర్ణిస్తూ మహర్షి, ఆ స్థితిని సాధించాలనే ఉత్సాహాన్ని కలిగిస్తున్నారు సాధకులలో. జీవన్ముక్తుని స్వభావాన్ని అతనికి లభించే ఆనందాన్ని శాంతినీ అక్షర రూపంలో శిష్యుని మనోమందిరంలో చిత్రీకరిస్తూ ప్రగాఢ ధ్యానంలో ఈ సత్యాన్ని దర్శించడం సాధ్యమని అష్టావక్రులు స్పష్టపరుస్తున్నారు.

**అష్టావక్ర ఉవాచ :-**

**శ్లో॥ తేన జ్ఞాన ఫలం ప్రాప్తం యోగాభ్యాస ఫలం తథా ।**
**తృప్తః స్వచ్ఛేంద్రియో నిత్యం ఏకాకీ రమతే తు యః॥11.**

**టీ॥** యః = ఎవడు, నిత్యం = ఎల్లప్పుడు, తృప్తః = తృప్తుడై ఉంటున్నాడో, స్వచ్ఛేంద్రియః = ఇంద్రియ శుద్ధిగలవాడై, ఏకాకీ = ఎట్టి సంగమము లేనివాడై, రమతే = రమించు చున్నాడో, తేన = వానిచేత, జ్ఞానఫలం = జ్ఞాన ఫలము, తథా = ఆ ప్రకారమే, యోగాభ్యాస ఫలం = యోగాభ్యాస ఫలము, ప్రాప్తం = పొందబడుచున్నది.

**శాంతించిన ఇంద్రియాలతో, కోరికలు లేకుండా, తృప్తిగా నిత్య ఏకాంతాన్ననుభవించే వానికి యోగాభ్యాస ఫలమూ, జ్ఞానాధ్యయన ఫలమూ కూడా సిద్ధించినట్టే.**

భావాతీతమయిన శుద్ధచైతన్య స్థితిలోనికి జాగృతుడయేవరకూ సాధకుని యోగంగానీ జ్ఞానం కానీ ఫలించినట్టే. సాధ్యం లభించినప్పుడే సాధన సిద్ధించినట్లు. ఆత్మ చైతన్యంలో అహంకారం లయం అయిపోవడమే స్వస్థితి లోనికి సాధకుడు జాగృతుడవడం అనబడుతుంది. అద్వయమయిన ఆ స్థితిలో సాధకుడు, సాధన, సాధ్యం అన్నీ కేవలంగా సిద్ధించి ఉంటాయి, ఆనందమయ మయిన ఆ స్థితిని అనుభవించడమే మానవ జీవితపరమార్థం. అప్పుడు మాత్రమే అశాంతిరూపమైన అన్వేషణ అంతమవుతుంది.

పరిపూర్ణమైన ఈ స్థితిని సమీపిస్తూ, ఏకత్వానుభవాన్ని వర్ణిస్తూ, ఆనందమయమయిన సమాధి స్థితిని చేరిన తన మనస్సును, ప్రహ్లాదుడు యోగవాశిష్ఠంలో ఇలా వర్ణిస్తున్నాడు.

విరించిభవనాత్పారే తత్త్వాన్తే ప్యాహరత్ పదమ్
ప్రసరత్యేవ మే రూపమ్ అద్యాపి న నివర్తతే. (యోగవాశిష్ఠం)

"ఆహా! అనంత సత్యాన్ని ఆలింగనం చేసుకోవాలని నా మనస్సు

బ్రహ్మలోకం దాటి ఇంకా... .... ఇంకా వ్యాపిస్తోంది. ఆ మనస్సును వెనుకకు పిలవడం నా వశంలో లేదు.-----ఇలా వ్యాపిస్తూనే ఉంది..............." ఇక్కడ ఒక సంగతిని మనం స్పష్టంగా గమనించాలి. మనస్సు మామూలు స్థితిని దాటి ఎంత వ్యాపించినా, వ్యక్తి స్వాధీనంలో లేకపోయినా, ఇలా వర్ణించే అహంకారమూ రేఖామాత్రంగా మనస్సూ ఉండనే ఉన్నాయి. ఈ స్థితిని "సవికల్ప సమాధి" అంటారు. ఇందులో రేఖామాత్రంగా ఉన్న అహంకారం పూర్తిగా నశిస్తే "నిర్వికల్ప సమాధి" స్థితి నిశ్చలంగా కేవలంగా ఉంటుంది.

ఉన్నదంతా తానే అని తెలుసుకున్న ప్రహ్లాదునిలోని దివ్య తత్త్వము ఈ చివరిదశను యోగవాశిష్ఠంలో ఇలా వర్ణిస్తోంది.

హరిః ప్రహ్లాదనామయో మత్తోనాన్యో హరిః పృథక్
ఇతి నిశ్చయవానన్త వ్యాపికోఽహం చ సర్వతః. (యోగవాశిష్ఠం)

ప్రహ్లాదుని పేరుతో ఉన్న హరిని నేను. నాకంటే వేరుగా హరి ఎక్కడా లేడు. ఇది నా స్వానుభవం. నేను సర్వవ్యాప్తంగా ఉన్నాను, సర్వమూ నాలో ఉంది. నేను అన్నిటిలో ఉన్నాను. ఈ కైవల్యస్థితే పరమాత్మ పదమైన అనంత చైతన్యం ఇదే నిర్వికల్ప సమాధి.

**శ్లో॥ న కదాచిజ్జగత్యస్మిం స్తత్త్వజ్ఞో హంత ఖిద్యతి ।**
**యత ఏకేన తేనేదం పూర్ణం బ్రహ్మాండ మండలమ్॥2.**

టీ॥ తత్త్వజ్ఞః = తత్త్వజ్ఞాని, అస్మిన్ = ఈ, జగతి = ప్రపంచమునందు, కదాచిత్ = ఒకానొకప్పుడు గూడ, న ఖిద్యతి = ఖేదమును పొందడు, హంత = ఇది నిశ్చయము, యతః = ఎందువలన, ఏకేన = ఒక్కడగు, తేన = అతనిచేత, బ్రహ్మాండమండలం = బ్రహ్మాండమండలము, పూర్ణం = నిండింపబడి యున్నదో.

**సత్యాన్ని తెలుసుకున్న మనిషికి సంతాపం కలిగించేదేదీ ఉండదు. ఈ ప్రపంచంలో, ఈ ప్రపంచమంతా తానే వ్యాపించి ఉన్నానని అతనికి దృఢంగా తెలియడమే ఇందుకు కారణం.**

అనంతమైన ఈ బ్రహ్మాండంనుండి వేరుగా ఉన్నానన్న భావమే వెంటనే మన అల్పత్వాన్ని సూచించి భయభ్రాంతులను చేస్తుంది. అప్పటినుండి ఈ అల్పమూ పరిమితమూ అయిన మనశ్శరీరాలు,అపరిమితమైన ప్రపంచ విషయాలచే అనవరతమూ అణగద్రొక్కపడుతూ ఉంటాయి. మహాద్భుతమయిన ఈ

సృష్టినుండి నీవు వేరుగా ఉన్నానన్న భావమే సర్వబాధలకూ మూలకారణం. నీలోని వ్యక్తి ఆ మహావిశ్వంలోని కొంత భాగాన్నైనా కనీసం సాధించి సంపాదించి స్వంతం చేసుకోవాలనుకుంటాడు. ఆ మేరకు తన వ్యష్టితత్వాన్ని తగ్గించుకున్నాననుకుంటాడు!

అహంకారం ఈ అనంతమైన ప్రపంచాన్ని కేవలం తన మనస్సు ఇంద్రియాలద్వారా, వాటి పరిమితులతో పరిమితంగా మాత్రమే గుర్తించగలుగుతుంది. ఈ పరిమితత్త్వంతో పరిమితమైన అహంకారం,అనంతశక్తి సమన్వితమైన అనంత విశ్వాన్నిచూసి భయపడక తప్పదు. ఈ కారణంచేతనే అహంకారం సుఖదుఃఖాలను అనుభవిస్తోంది.

సత్యద్రష్ట అయిన జ్ఞానికి, గుర్తించబడే ఈ విశ్వమంతా అనంత చైతన్య సాగరమయిన తనలోని భావనాతరంగాలే అని స్పష్టంగా తెలుస్తున్నది. ఈ ప్రపంచమంతా తనలోని భాగమే, తానే ఈ ప్రపంచమంతా అన్న సత్యం అవగతమవుతుంది. కాబట్టి అతనిలో వ్యష్టి భావం, వ్యక్తిననే భావం అంతరించిపోతుంది. "తేన ఇదం బ్రహ్మండ మండలం పూర్ణమ్"---ఈ బ్రహ్మండమంతా తనచేత ఆవరింపబడి ఉంది. కాబట్టి "కదాచిత్ న ఖిద్యతి"---- జ్ఞాని ఎప్పుడూ బాధలకు లోనుగాడు.

ఇట్టి పరిపూర్ణ జ్ఞానిని హిందూమత గ్రంథాలన్నీ ఎంత కీర్తించినా విసుగు చెందడంలేదు. అలా కీర్తిస్తూనే ఉన్నాయి. భాగవతంలో భగవాన్ కృష్ణుడు స్వయంగా ఇలా అంటున్నాడు.

నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శినమ్
అనువ్రజామహం నిత్యం పూయే యేత్యంఘ్రిరేణుభిః

(భాగవతం, ఏకాదశ---14-16)

*సత్యద్రష్ట అయి సమత్వ దృష్టితో సర్వ జీవులనూ తన్నుగా భావిస్తూ సంతోషంగా చరించే జ్ఞాని అడుగుజాడలలో అతనిని వెన్నంటి నిత్యమూ చరిస్తుంటాను, అతని పాదధూళితో నేను పవిత్రుడనౌతాను.*

**శ్లో॥ న జాతు విషయాః కేఽపి స్వారామం హర్షయన్త్యమీ ।**
**సల్లకీపల్లవప్రీత మివేభన్నింబపల్లవాః ॥ 3.**

టీ॥ సల్లకీపల్లవప్రీతం = అందమగు చిగుళ్ళయందు ప్రీతిగల, ఇభం = ఏనుగును, నింబపల్లవాః = వేపచిగుళ్ళు, న హర్షయంతి ఇవ = సంతోష పెట్టజాలనియట్లు, అమీ = ఈ, కే = ఏ, విషయాః అపి = విషయములుగూడ, స్వారామం = స్వాత్మారాముని, న హర్షయన్తి = సంతోష పెట్టజాలవు.

సల్లకి ఆకులతో సంతోషించే ఏనుగును వేప ఆకులు ఏవిధంగా సంతృప్తి పరచజాలవో, అదేవిధంగా నిత్యానంద స్వరూపుడై ఆత్మనిష్ఠుడయిన జ్ఞానిని ప్రాపంచిక విషయభోగాలు సంతృప్తి పరచజాలవు.

ఏనుగు ఎంతో సంతోషంగా మధురమయిన సల్లకీపత్రాలను ఆహారంగా స్వీకరిస్తుంది. ఆ ఏనుగునే, ఎంతలేతగా ఆకుపచ్చగా ఉన్నా చేదయిన వేప ఆకులు ఎలా ఆకర్షించగలవు? పరమానంద పూర్ణమయిన తన స్వస్థితిలో హాయిగా కేవలంగా ఉన్న జ్ఞానిని భ్రమాకల్పిత ప్రాపంచిక విషయభోగాలేవిధంగా ఆకర్షించగలవు?

ఆత్మానందాన్ననుభవిస్తున్న యోగి యొక్క అనుభవాన్ని యోగవాశిష్ఠం ఇలా వర్ణించింది.

యథా వివిక్త మేకాన్తే మనో భవతి నిర్వృతమ్
న తథా శశిబింబేషు న చ బ్రహ్మేంద్ర సదమసు (యోగవాశిష్ఠం)

*భావరహితంగా నిశ్చల శాంత గంభీరంగా ఉండే మనస్సు పొందే ఆనందం, అందమైన చందమామలోగాని, బ్రహ్మలోకంలోగాని, ఇంద్ర సదనంలోకాని లభించదు, దానికదేసాటి.*

శ్లో॥ యస్తుభోగేషు భుక్తేషు న భవత్యధివాసితః ।
అభుక్తేషు నిరాకాంక్షీ తాదృశో బహుదుర్లభః ॥ 4.

టీ॥ యః = ఎవడు, భుక్తేషు = అనుభవింపదగిన, భోగేషు = భోగముల విషయమై, అధివాసితః = ఆసక్తుడు, న భవతి = కాడో, చ = మఱియు, అభుక్తేషు = అభుక్త పదార్థముల విషయమై, నిరాకాంక్షీ = ఆశారహితుడో, తాదృశః = అటువంటివాడు, బహుదుర్లభః = ప్రపంచమునందు దుర్లభుడు.

అనుభవింపబడిన విషయాల స్మృతులుగానీ, తనకందుబాటులోలేని విషయాలోచనలుగానీ లేనట్టి నిశ్చల మనస్సుతో శాంతంగా ఆనందంగా జీవించే జ్ఞాని ఈ ప్రపంచంలో చాలా అరుదుగా కనిపిస్తాడు.

సర్వవ్యాప్తమయిన ఆత్మతత్త్వంలో అహంకారాన్ని లయంచేసి సర్వ సంకల్పాలనూ విసర్జించినవాడే జ్ఞాని, అట్టి జ్ఞాని నిత్యమూ వర్తమానంలో జీవిస్తూ వచ్చే సంఘటనలను సాక్షిగా చూస్తూ ఉంటాడు. ఏ సంఘటన అయినా సరే మళ్ళా రావాలని కానీ రాకూడదనికానీ అతడనుకోడు. గత స్మృతులు కానీ భవిష్యత్ప్రణాళికలు కానీ అవి వర్తమానాన్ని ఎప్పుడూ కలుషితం చెయ్యవు. నిరహంకారుడై సర్వ సంఘటనలను సాక్షిమాత్రంగా సదా వీక్షిస్తూ, శాంతంగా, తాను ఆత్మననే దృష్టితో ఆనందంగా ఉంటాడు. నిరహంకారంగా చెయ్యబడే కర్మలకు కారణం ఏమి ఉండదు. బాహ్యవిషయాలకు మనశ్శరీరాలు, స్పందించి కర్మలు జరుగుతూ ఉంటాయి. అనుభవించే అహంకారం లేకపోవడంతో అనుభవ ఫలమయిన కోరికలు, వాటిఫలమయిన వాసనలూ ఉదయించవు, ప్రారబ్ధం మాత్రమే వ్యక్తమవుతూ క్షయించిపోతుంది. అందుకే జ్ఞానిచేసినట్టి మనకు కనిపించే కర్మలేవీ అతనిని బంధించజాలవని మహర్షి అంటున్నారు.

అనంతానందమయిన ఆత్మనే తానని తెలుసుకున్న జ్ఞానిలో భ్రమా కల్పిత మిథ్యా జగద్విషయాలపై వాంఛ జనించదు. అతనిచే చెయ్యబడే కర్మలన్నీ ప్రారబ్ధవశంగా ఆ ఉపాధిలో వ్యక్తమవడం మనం గుర్తిస్తాము. కానీ అవి ఆ జ్ఞానిలో ఎటువంటి సంచలనమూ కలిగించవు. మన ఊహకందని విచిత్ర వ్యక్తిత్వమతనిది, అతని కర్మలే ధర్మస్వరూపాలు!

**శ్లో॥ బుభుక్షురిహ సంసారే ముముక్షురపి దృశ్యతే ।**
**భోగమోక్షనిరాకాంక్షీ విరలోహి మహాశయః ॥ 5.**

టీ॥ బుభుక్షుః = భోగేచ్ఛగలవాడు, ముముక్షుః = మోక్షేచ్ఛగలవాడు, అపి = కూడ, ఇహ సంసారే = ఈ ప్రపంచమునందు, దృశ్యతే = కనబడుచున్నాడు, హి = అయితే, భోగమోక్షనిరాకాంక్షి=భోగమోక్ష ఆశారహితుడగు, మహాశయః = మహాత్ముడు, విరళః = అరుదుగానున్నాడు.

ప్రాపంచిక విషయభోగాలను కోరేవారూ, ముక్తిని కాంక్షించేవారూ కూడా ఈ ప్రపంచంలో మనకు కనిపిస్తుంటారు. కానీ, భోగాన్ని ముక్తినీ కూడా వాంఛించకుండా, కోరికలే లేకుండా నిత్యానందంగా నిత్యవర్తమానంలో జీవించే జ్ఞాని దర్శనం దుర్లభం.

ఆకలితో ఉన్నవాడు సహజంగా రుచికరమైన విందును ఆశిస్తాడు.

నీటిలో మునిగిపోతూ ఉన్నవాడు రక్షింపబడాలని ఆశిస్తాడు. పరిమితులతో బాధామయ జీవితాన్ని గడిపే వ్యక్తి ఇంద్రియాలద్వారా విషయసుఖాలను వాంఛిస్తాడు. పరిమితవ్యక్తి తన పరిమితులను బంధాలను వదలించుకుని ముక్తిని సాధించాలనుకుంటాడు. పదార్థపు యథార్థ స్వరూపాన్ని తెలుసుకుని, సత్ చిత్ ఆనందంగా తన్ను తాను గుర్తించిన యోగి విషయభోగాలను, ముక్తిని కూడా వాంఛించడు. అటువంటి "మహాశయుడు" చాలా అరుదుగా కనిపిస్తాడు.

## శ్లో॥ ధర్మార్థ కామమోక్షేషు జీవితే మరణే తథా ।
## కస్యాప్యుదార చిత్తస్య హేయోపాదేయతా న హి ॥6.

టీ॥ ధర్మార్థ కామమోక్షేషు = ధర్మార్థకామ మోక్షములయందును, జీవితే = జీవిత విషయమునను, తథా = అట్లే, మరణే = మరణవిషయమునందును, కస్య = ఒకానొక, ఉదారచిత్తస్య అపి = ఉదార చిత్తునకు మాత్రమే, హేయోపాదేయతా = త్యాగగ్రహణ ములు, న హి = ఉండవు.

**ధర్మ, అర్థ, కామ, మోక్షములందు, జీవన మరణములందు సమబుద్ధి కలిగి, దేనినీ కోరకుండా, నిరాకరించకుండా, వచ్చినవాటిని ప్రసాదబుద్ధితో ఆనందంగా స్వీకరిస్తూ నిత్యవర్తమానంలో జీవించే ఉదారుడు దుర్లభుడు.**

వ్యక్తిగత అహంకారంనుండి అనంతమైన అహమే తానని గుర్తించేవరకు ఈ జీవనయాత్ర సాగుతూనే ఉంటుంది. ఈ యాత్రలో అవసర విభాగాలుగా నాలుగు మజిలీలుగా చతుర్విధ పురుషార్థాలనబడే ధర్మార్థ కామ మోక్షాలను మన మహర్షులు గుర్తించి నియమించినారు. క్రమానుగతంగా వీనిని సాధించ డంలో అహంకారం అవసరమైన పద్ధతిలో మలచబడుతుంది. అహంకారం ఉన్నంతకాలమూ ఈ ధర్మాచరణ అత్యవసరమే. ఈ ఆచరణలో శుద్ధినందిన అహంకారమే చివరగా ఆత్మానుభవంలో లయం కాగలదు.

మానవ జీవిత లక్ష్యాలయిన ఈ నాలుగు పురుషార్థాల అవసరాన్ని అధిగమించిన జ్ఞాని దర్శనం దుర్లభమే. అహంకార రహితుడయిన అట్టి జ్ఞానిలో ప్రయత్నించి సాధించవలసిన ఈ లక్ష్యాలుకూడా ఉండవు. అందుకే అతడు వీటన్నిటినీ ఉదాసీనంగా నిర్లిప్తంగా సమదృష్టితో చూడగలుగుతాడు. జీవితం మరణం కూడా అట్టిజ్ఞానికి రెండు సంఘటనలు మాత్రమే.

జీవన మరణాలు శరీరానికి చెందిన స్థితులు మాత్రమే. శరీరాభిమాని

అయిన అహంకారం మాత్రమే వానిని గురించి ఆందోళనపడుతుంది. అమరమైన ఆత్మలో శరీరపు ఉనికి, వినాశము రెండూ కూడా రెండు భావాలు మాత్రమే. ఒక కెరటం జన్మించినా నశించినా సముద్రానికి బాధ ఏముంటుంది?

**శ్లో॥ వాంఛా న విశ్వవిలయే న ద్వేష స్తస్య చ స్థితౌ ।**
**యథా జీవికయా తస్మాద్ధన్య ఆస్తే యథా సుఖమ్॥ 7.**

టీ॥ విశ్వవిలయే = ప్రపంచలయమునందు, వాంఛా = ఇచ్ఛగాని, తస్య = ఆ విశ్వముయొక్క, స్థితౌ = స్థితియందు, ద్వేషః = ద్వేషముగాని, యః = ఎవడు, (న ప్రాప్నోతి = పొందడో), ధన్యః = ధన్యుడగు, సః = వాడు, యథాజీవికయా = యథా ప్రాప్తమగు ఆ జీవికద్వారా, యథాసుఖం = సుఖపూర్వకముగా, ఆస్తే = ఉంటున్నాడు.

**ఈ ప్రపంచం ఇలా ఉండాలని కాని, నశించాలనికాని జ్ఞాని కోరుకోడు. ఉన్న స్థితిపై అతనికి ద్వేషభావం ఉండదు. తన ప్రారబ్ధాను గుణంగా సంప్రాప్తమయిన దేదయినా అతడు సంతోషంగా స్వీకరించి ఆనందంగా జీవిస్తాడు.**

ఆత్మలో ఆత్మగా జీవిస్తున్న జ్ఞానికి ఆశించవలసిందేదీ ఉండదు. అతనికి కోరికలేవీ ఉండవు. కాబట్టి దేనినీ కోరడు. సర్వకోరికలకు అతీతమైన పూర్వస్థితిలో అతడుంటాడు. తన స్వరూపమయిన అనంత చైతన్యంలో ఈ జగత్తంతా ఒక అల వంటిది మాత్రమే అని అతనికి స్పష్టంగా తెలుసు. ఆత్మ చైతన్యం సాగరమయితే ఈ ప్రపంచం ఒక అల-అయినప్పుడు, ఈ శరీర మేపాటిది? కేవలం ఒక బిందువు మాత్రమే ఈ శరీరం బిందువుగా స్థితిగలిగి ఉన్నా సాగర గర్భంలో కలిసిపోయినా చైతన్య సాగరుడయిన అతనికి సమానమే. తనలోని అజ్ఞానావరణను ఛేదించుకుని తన సహజ సత్ చిత్ ఆనందరూపాన్ని గ్రహించ గలిగిన అట్టి జ్ఞానికి శరీర తాదాత్మ్యం ఉండదు.

అట్టి జ్ఞానికి ఈ నానాత్వప్రపంచ నాటకం సాగినా నశించినా ఒకటే, సత్యద్రష్ట అయిన అతనిలో భ్రమలన్నీ నశించిన కారణంగా, భావనాతరంగ సమన్వితమయిన నామరూపాత్మక జగత్తును భావాలుగా భావంతో అతడు చూస్తూ, చైతన్యమయిన తనలోని కదలికలే భావాలుగా గుర్తించి శాంతంగా ఆనందంగా జీవిస్తాడు.

అతడి దృష్టి ఏమయినా, మన దృష్టిలో మాత్రం అతడుకూడా సమాజం

లోని ఒక వ్యక్తే. అతని శరీరానికి కూడా మనలాగే తిండీ, బట్టా, ఇల్లూ, కావలసే ఉంటాయి. సమాజంలోని వ్యక్తిగా అట్టి మహాత్ముడు జీవించే విధానాన్నే అష్టావక్రులు ఇక్కడ వర్ణిస్తున్నారు. ప్రారబ్ధానుసారంగా అతనికి లభించినదానితో తృప్తి పడుతూ లేనిదానికోసం విచారించకుండా, నిత్యవర్తమానంలో సంతత సంతోషితాంతరంగంతో జీవిస్తూ ఉంటాడు. అట్టి పరిపూర్ణ వ్యక్తి మన మధ్యనే మనవలెనే జీవిస్తున్నట్టు కనిపిస్తున్నా అతడు మన ప్రపంచానికి చెందినవాడు కాడనే చెప్పాలి.

**శ్లో॥ కృతార్థోऽనేన జ్ఞానేనేత్యేవం గళితధీః కృతీ ।**
**పశ్యన్శృణ్వన్ స్పృశన్జిఘ్రన్ అశ్నన్నాస్తే యథా సుఖమ్॥8.**

టీ॥ అనేన = ఈ, జ్ఞానేన = జ్ఞానముచేత, (అహం = నేను), కృతార్థః = కృతార్థుడను, ఇత్యేవం = ఈ ప్రకారముగా, గళితధీః = జారిపోయిన బుద్ధిగలవాడై, కృతీ = జ్ఞాని, పశ్యన్ = చూచుచు, శృణ్వన్ = వినుచు, స్పృశన్ = తాకుచు, జిఘ్రన్ = ఆఘ్రాణించుచు, అశ్నన్ = తినుచు, యథాసుఖమ్=సుఖపూర్వకముగా, ఆస్తే = ఉంటున్నాడు.

**చూస్తున్నా, వింటున్నా, స్పృశిస్తున్నా, వాసనచూస్తున్నా, తింటున్నా అన్నిటిలోనూ ఆనందమయమైన తననే తన శక్తినే గమనిస్తూ, నిశ్చల మనస్సుతో, నిర్మలమైన జ్ఞానంతో, నిత్యసుఖుడై జీవిస్తూ ఉంటాడు.**

మనస్సులో కదలికగలిగి అశాంతి ఉదయించినప్పుడు మాత్రమే అస్తిత్వాన్ని కలిగి ఉంటుంది. అశాంతినుండి కోరికలు బయలుదేరి మహాప్రభంజనంలా మనస్సును అల్లకల్లోలం చేస్తాయి. ఈ కోరికలను తీర్చుకుంటే ఆనందం లభిస్తుందనే ఆశతో మనస్సు విషయాలపైన వస్తువుల పైన ప్రసరించి వాటిని స్వంతం చేసుకోవాలనుకుంటుంది, అనుభవించాలనుకుంటుంది.

బాహ్యంగా కనబడే జగత్తంతా తన భావాలకంటే విడిగా లేదనీ, కోరికలను సృష్టించిన మనస్సే విషయాలను చూస్తూ, విషయాలుగా, మారిపోతూ వాటికోసం, ప్రయత్నిస్తూ, కోరికలను పెంచుకుంటూ అనంతంగా చలిస్తున్నదని జ్ఞానికి నిశ్చయంగా తెలుసు. కాబట్టి అతని మనస్సు తనంత తానుగా మనఃకల్పిత భ్రమాభోగాలవైపు పరుగులుతీయకుండా నిశ్చలంగా

నిత్యశాంతంగా తనలోతాను సంతోషంగా ఉండగలుగుతుంది. బాహ్య జగత్తును ప్రారబ్ధానుసారంగా భావాల రూపంలో గుర్తిస్తున్నా, ఆ భావాలు తనకంటే భిన్నం కావని తెలిసి అతడు ఆనందంగా ఆటగా ప్రపంచదృశ్యాన్ని దర్శించ గలుగుతాడు.

అన్నిసమయ సందర్భాలలోనూ ఏవి ఎలా ఉన్నా అతడు శాంతంగా సాక్షిగా వాటిని చూడగలుగుతాడు. బాహ్యప్రపంచం అతనిని బాధలుపెట్టినా భరిస్తాడు, కానీ బాధపడడు, బాధపెట్టడు! అంతరంగంలో అనంతశాంతి సాగరంలో సుఖంగా జీవిస్తూ ఉంటాడు. చూస్తూ, వింటూ, వాసనచూస్తూ, స్పృశిస్తూ, రుచిచూస్తూ జీవిస్తూనే ఉంటాడు. దేనినుండి పారిపోవాలనుకోడు, దేనినీ కోరుకోడు. ఉన్నదంతా తానే అని దృఢంగా తెలుసతనికి. కాబట్టి శాంతంగా తనలోతాను స్థిరంగా ఉండగలుగుతాడు. జ్ఞానికి సామాన్యునికి తేడా బాహ్యప్రవర్తనలో ఉండదు. బాహ్యంగా మానవులుగా ఇద్దరి ప్రవర్తనా ఒకే విధంగా ఉంటుంది. అంతరంగంలో జ్ఞాని నిశ్చలుడై శాంతంగా అద్వయంగా నిత్యానంద స్వరూపంగా ఉంటూ తన భావనా తరంగాల నాట్యవిన్యాసాన్ని తిలకిస్తూ ఉంటాడు. సామాన్యుని అంతరంగం సంక్షుభిత సాంద్రమై,సుఖదుఃఖాల సుడిగుండాలతో,కోరికలతుఫానులతో, అనంతమైన ద్వంద్వప్రపంచంలో అల్పాతి అల్పజీవిగా దుఃఖిస్తూ కృశిస్తూ సంసార వృక్షాన్ని పెంచుతూ ఉంటుంది.

శ్లో॥ శూన్యాదృష్టిర్వృథా చేష్టా వికలానీంద్రియాణి చ ।
న స్పృహా న విరక్తిర్వాక్షీణ సంసార సాగరే ॥ 9.

టీ॥ క్షీణసంసార సాగరే = సంసార సాగరము క్షీణించినదగుచుండగా దానియందు, దృష్టిః = దృష్టి, శూన్యా = శూన్యమగు చున్నది, చేష్టాః = క్రియలు, వృథా = వ్యర్థ మగుచున్నవి, ఇంద్రియాణి = ఇంద్రియములు, వికలాని = వికలములగుచున్నవి, స్పృహా = ఇచ్ఛ, వా = మఱియు, న = లేదు, విరక్తిః = విరక్తియు, న = లేదు.

బాహ్యప్రపంచము యదార్థంకాదనీ, భావనామాత్రమనీ దృఢంగా తెలియడంతో జ్ఞానికి విషయాలపై యిష్టాయిష్టాలనేవి ఉండవు. ఇవి లేక పోవడంతో అతని దృష్టి భావశూన్యంగా నిర్లిప్తంగా ఉంటుంది. అతని శారీరిక కర్మలకు ప్రత్యేక ప్రయోజనం ఉండదు. అతని ఇంద్రియాలు తమంత తాముగా దేనినీ కోరి పనిచెయ్యవు.

సత్ చిత్ ఆనందమయమైన కేవలాత్మగా తన్నుతాను అంతరంగంలో తెలుసుకున్నా, బాహ్యంగా సమాజంలో సామాజిక ధర్మాల కనుగుణంగా జీవిస్తూనే ఉంటాడు జ్ఞాని. అంతరంగంలో అనుక్షణమూ తన ఆత్మతత్త్వాన్ని గుర్తిస్తూ జీవితాన్ని సాగించడం ఒక రకమైన జీవన్ముక్తి అని చెప్పబడుతుంది. సమాజంలో ఒకనిగా వ్యవహరిస్తూన్నా, అంతరంగంలో సహజ సమాధిలో, సంతతానంద స్వరూపంగా తన్నుతాను సంతతమూ గుర్తిస్తూనే ఉంటాడు.

"శూన్యాదృష్టిర్ "----బాహ్యప్రపంచంవైపు చూస్తున్నట్టు కనిపిస్తున్నా, తన్ను తానే భావాలుగా చూస్తున్నానని అతనికి తెలుసు కాబట్టి అతని దృష్టి శూన్యంగా భావరహితంగా ఉంటుంది. ఏ ప్రయోజనాన్నీ ఆశించి పనిచెయ్యడు కాబట్టి అతని కర్మలన్నీ "వృథాచేష్టాః"--చెయ్యబడినా వృథాయే అని చెప్ప వచ్చు. ఫలితాన్నివ్వని వాటిని వృథా అంటాం, అతని కర్మలు కూడా కొత్త వాసన లను సృష్టించవు కాబట్టి వృథా అని అనవచ్చును. విషయాల సంయోగంవలన జనించే సహజస్పందనే కనిపిస్తుంది గానీ అతని కర్మలలో వాసనా ప్రేరితమైన వేవీ ఉండవు. అతని జ్ఞాన దృష్టిలో వాసనలు కూడా అతనినుండి వేరుగా లేవు కాబట్టి అవి వేరుగా సాధించవలసినవి కూడా ఏవీ ఉండవు.

"వికలానీంద్రియాణి"--- సామాన్యుని ఇంద్రియాలు తనచుట్టూ ఉండే అద్భుతవిషయాల సమాచారాలను సేకరించి మనస్సుకు అందించి, అక్కడ పుట్టిన కోరికలాధారంగా వాటిని సంపాదించడానికి ప్రయత్నిస్తూ ఉంటాయి. మనస్సుకూ బాహ్యంగా కనిపించే ప్రపంచానికీ వార్తాహరులుగా బానిసలుగా వ్యవహరిస్తుంటాయి సామాన్యుని ఇంద్రియాలు, జీవన్ముక్తుని ఇంద్రియాలు చూస్తున్నా, వింటున్నా, వాసనచూస్తున్నా, రుచిచూస్తున్నా, స్పృశిస్తున్నా కూడా పనిచెయ్యనట్టే లెక్కించవచ్చు. ఇవి పనిచేసినా లోపల కోరికల అలజడి పుట్టడం లేదు, వాటి సంపాదనార్థం ఇంద్రియాలు మరల శ్రమపడడమూ లేదు, విషయసంయోగ సమయంలో సహజంగా స్పందిస్తున్నాయి. అంతేకాని సంక్షోభాన్ని చెందడమూ లేదు. సృష్టించడానికి కారణమూ కాలేదు. ఇంద్రియాల ద్వారా సమాచారాన్ని సేకరించి కోరికలను ఉత్పత్తిచేసి, సంతాపనాన్ని సృష్టించే అతని మనస్సు అనంత చైతన్యసాగరంలో లయం అయిపోవడంచేత, శాంతంగా, నిశ్చలంగా ఇంద్రియాలు సహజంగా స్పందించడమే జరుగుతోంది గానీ సంతాపం సృష్టించడం లేదు.

సంక్షిప్తంగా చెప్పాలంటే భావసంచలన రూపమైన అతని సంసారం అంతర్హితమయిపోయింది. కాబట్టే అతడు నిశ్చలంగా నిలబడి ఉన్నాడు, సంచలించే సంతాప తరంగాలలో ఈదులాడడం లేదు. అధిష్ఠానమయిన ఆత్మలో గోచరించే భావాలపై యిష్టాయిష్టాలేవీ ఉండవు. నిరహంకారంతో నిశ్చలంగా తనలో కదలాడే భావనాతరంగాలను శాంతంగా సాక్షిమాత్రంగా వీక్షిస్తూ, ఉంటాడు.

**శ్లో॥ న జాగర్తి న నిద్రాతి నోన్మీలతి న మీలతి ।**
**అహో పరదశా క్వాపి వర్తతే ముక్తచేతసః ॥ 10.**

టీ॥ న జాగర్తి = మేల్కొనుటలేదు, న నిద్రాతి = నిద్రించుటలేదు, న ఉన్మీలతి = కంటిరెప్పలను తెరచుటలేదు, న మీలతి = మూయుటలేదు, ముక్తచేతసః = ముక్త చేతసుడగు జ్ఞానికి, క్వాపి = ఒకానొక, పరదశా = ఉత్కృష్టదశ, వర్తతే = ఉంటున్నది, అహో = ఆశ్చర్యము.

**జ్ఞానికి జాగ్రదవస్థాలేదు,నిద్రావస్థాలేదు. అతను కండ్లను తెరవడమూ లేదు, మూయడమూలేదు. అహో! జీవన్ముక్తుడయిన అట్టి జ్ఞాని అన్ని సమయ సందర్భాలలోనూ పరమాత్మగా కేవలంగా తాను మాత్రమే ఉంటాడు.**

జీవన్ముక్తుని మనఃస్థితిని అర్థం చేసుకోవడం అతికష్టం. ఒకవేళ అర్థంచేసుకున్నా సరిగ్గా వ్యక్తీకరించడం అసాధ్యమే. జాగ్రత్తగా సూచనా మాత్రంగా వాడే ఎటువంటి పదజాలమైనాసరే అందమైన అబద్ధాలేమో అనిపిస్తుందే తప్ప అసలు స్థితిని బుద్ధికి అందించజాలదు. భగవద్గీతలో కూడా భగవాన్ శ్రీకృష్ణుడు, ఈ స్థితిని వర్ణించడానికి తనసమర్థతనంతా ధారపోశాడు.

యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. (భగవద్గీత 2-60)

*సర్వజీవులకు ఏది రాత్రిగా భావింపబడుతుందో అందులో జ్ఞాని జాగృతుడై ఉంటాడు. అందరికీ పగలయినప్పుడు జ్ఞాని చూస్తునే ఉన్నా అది అతడికి రాత్రి వంటిదే.*

ఉపనిషద్ ఋషులవలెనే భగవాన్ కృష్ణుడు కూడా ఈ స్థితిని సరిగ్గా వర్ణించలేకపోవడాన్ని ఇక్కడ గుర్తిస్తాం. అనిర్వచనీయమైన ఆ స్థితి భాషకందనిది, భావానికది ఆధారం. అదే చైతన్యం స్వరూపం!

జీవన్ముక్తుడూ పరమాత్మ ఒక్కటే అయిన ఆత్మస్థితి వర్ణించబడింది ఇక్కడ. అందుకే అట్టి దివ్యవ్యక్తిత్వాన్ని అర్థంచేసుకోవడం అంత కష్టమవు తోంది. మనవంటివారికి "న జాగర్తి"--మేలుకుని ఉన్నప్పుడు మనం బాహ్యంగా ప్రపంచాన్ని గుర్తిస్తూ యిష్టాయిష్టాలతో కర్మలను చేస్తూ ఉంటాము. జ్ఞాని మేలుకుని ఉన్నా బాహ్యప్రపంచాన్ని తన భావాలుగా గుర్తించి శాంతంగా ఉంటాడు. కాబట్టి మేలుకుని ఉన్నా లేనట్టే. అతడు నిత్యమూ ఆత్మస్థితిలో జాగృతుడై ఉంటాడు.

"న నిద్రాతి"--- శుద్ధచైతన్యరూపుడైన అతనిని జడత్వం సమీపించ జాలదు. మన మనశ్శరీరాలు పనిచెయ్యనిస్థితిలో మహానందమయమైన ఆత్మసన్నిధిలో ఉంటూ కూడా మనం నిద్రపోతాం, కాబట్టి మనకు ఆ స్థితి గురించి జ్ఞానం ఉండదు. జ్ఞాని సదాచైతన్య స్వరూపుడే కాబట్టి అతనికి నిద్ర అనేదేలేదు! అంటే స్వరూపం అతనినుండి విడిగా ఎప్పుడూ ఉండదని అర్థం.

"నోన్మీలతి నమీలతి"----కంటిరెప్పలు కదలకుండా స్థిరంగా ఉంటాయి. ఇక్కడ ఈ పదప్రయోగం అలంకారికంగా ఉపయోగింపబడింది. మనోబుద్ధులలో భావాలు కదిలినప్పుడు కంటిరెప్పలు కదలాడుతాయి. ఆలోచనాశక్తిలేని జంతువులలో ఈ ఉన్మీలనం అంతగా కనిపించదు. జ్ఞానిలో ఆలోచనల అలజడి ఉండదని సూచించడమే ఈ పదప్రయోగం ఇక్కడ సూచిస్తోంది.

ఇన్ని సూచనలు ఇక్కడ ఇవ్వబడినా ఇంకా జ్ఞానియొక్క మనఃస్థితి మన బుద్ధికి అందడంలేదు. అతడికతడేసాటి! జ్ఞానిని మరొక జ్ఞాని మాత్రమే అర్థం చేసుకోగలడు! పరస్పరాధార భూతమైన ఈ నానాతత్త్వ ప్రపంచానికి అట్టి జ్ఞాని జీవన్మృతుడే జీవించి ఉన్నా వాని నతడు గుర్తించడు. నిద్రపోయాడని కూడా అనలేం. సదా తన స్వస్థితిలో అతడు జాగృతుడయే ఉంటాడు.

శ్లో॥ సర్వత్ర దృశ్యతే స్వస్థః సర్వత్ర విమలాశయః ।
సమస్త వాసనాముక్తో ముక్తస్సర్వత్ర రాజతే ॥ 11.

టీ॥ ముక్తః = జీవన్ముక్తుడు, సర్వత్ర = అంతటా, స్వస్థః = ప్రశాంతాత్ముడై, సర్వత్ర = అంతట, విమలాశయః = నిర్మలాంతఃకరణముగలవాడుగా, దృశ్యతే = కనబడుచున్నాడు, చ = మరియు, సర్వత్ర = అంతట సమస్తవాసనా రహితుడై, రాజతే = విరాజిల్లుతున్నాడు.

సర్వత్రా, సర్వకాల సర్వావస్థలలోనూ కోరికలతో చలించకుండా **శాంతమైన స్వస్థితిలో వాసనాముక్తుడై నిత్యతృప్తుడై జ్ఞాని జీవిస్తూ ఉంటాడు.**

ఈ శ్లోకంలో "సర్వత్ర" అన్న పదం మూడుచోట్ల ఉపయోగింపబడింది. అన్నిస్థలాలలోనూ, అన్ని సమయాలలోనూ, అన్ని సంఘటనలలోనూ అని తెలియబర్చడానికి ఈ పదం అలా ఉపయోగింపబడింది. పరిపూర్ణుడయిన వ్యక్తికీ ఎటువంటి దేశకాల పాత్రలలోనయినా కోరికలూ ఉద్రేకాలూ లేకుండా శాంతంగా ఉంటాడు. వాసనా రూపమయిన సర్వబంధాలనుండి ముక్తినంది పరమాత్మ పదంలో పరమానందంగా ఉంటాడు. అవిద్యనధిగమించి వాసనారూపమయిన కారణశరీరం నుండి కూడా విడివడి పరమాత్మతో ఐక్యతను సిద్ధింపజేసుకున్న అట్టివానిలో అగ్రహణ, అన్యధాగ్రహణ ఫలితమయిన అజ్ఞానమంతా నశించగా జ్ఞానస్వరూపుడై ప్రకాశిస్తుంటాడు.

**శ్లో॥ పశ్యన్ఛృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్గృహ్ణన్ వదన్ వ్రజన్ ।**
**ఈహితానీహితైర్ముక్తో ముక్త ఏవ మహాశయః ॥ 12.**

టీ॥ పశ్యన్ = చూచుచున్నవాడై, శృణ్వన్ = వినుచు, స్పృశన్ = తాకుచు, జిఘ్రన్ = ఆఘ్రాణించుచు, అశ్నన్ = తినుచు, గృహ్ణన్ = గ్రహించుచు, వదన్ = మాట్లాడుచు, వ్రజన్ = పోవుచు, ఈహితానీహితైః = రాగద్వేషములనుండి, ముక్తః = విడివడిన, మహాశయః = మహాత్ముడు, ముక్త ఏవ = నిశ్చయముగా ముక్తుడే.

**చూడడం, వినడం, స్పృశించడం, వాసనచూడడం, తినడం, ఆమోదించడం, మాటాడడం, నడవడం-----ఇవన్నీ చేస్తున్నా మోహంకానీ క్రోధంకానీ లేకుండా నిశ్చలంగా స్వతంత్రంగా నిత్యముక్తుడై జీవిస్తాడు. మహాశయుడైన జ్ఞాని.**

ప్రాపంచిక బంధాలనుండి జ్ఞాని, ప్రపంచంనుండి దూరంగా పారిపోడు. అతని ప్రారబ్ధ ఫలమయిన శరీరం ఉన్నంతకాలమూ మనవలెనే మనమధ్యనే జీవించవలసి ఉంటుంది. ఇంద్రియ క్షేత్రాలయిన విషయాలతో వ్యవహరించే టప్పుడు జ్ఞానియొక్క ఇంద్రియాలు కూడా మనవలెనే స్పందిస్తాయి. మనవలెనే అన్నికర్మలనూ చేస్తుంటాడు. అయితే జ్ఞానికీ మనకుగల తేడా ఎక్కడ ఉన్నదంటే అంతరంగంలోనే చెప్పితీరాలి. సమయ సందర్భాలననుసరించి ఏంచేసినా జ్ఞాని హృదయంలో వాటి ఛాయలు రేఖామాత్రంగానయినా మిగిలి ఉండవు. మనం

కర్మలను చెయ్యడంలో యిష్టాయిష్టాలు ఉంటూ, కోరికలను పెంచుతూ, మనస్సును అశాంతిపాలుచేస్తూ, మరల కొత్త కోరికలు పుడుతూ, మరల కర్మలను చేస్తూ----ఇలా అనంతమైన సంసారవృక్ష బీజాలను అడు గడుగునా నాటుతుంటాము.

అల్పపదాలలో అనల్పమూ అనంతమూ అయిన భావాన్ని సూచించ గల భాష, ప్రపంచంలో సంస్కృతం ఒక్కటే అంటే అతిశయోక్తికాదు. ఇక్కడ అష్టావక్రులచే వాడబడిన "ఈహితానీహితైః" పదప్రయోగం "ఈహ" అనే ధాతువు నుండి నిర్మింపబడింది. "ఈహ" అంటే చెయ్యాలనే కోరిక ఉండడం, ఈ పదానికి వాంఛ, ఇచ్ఛ, కర్మ, చేష్ట, ఉద్యమం ఇలా ఎన్నైనా అర్థాలను చెప్పవచ్చు. ఈ విధంగా కొండంత అర్థాలను సూచించే శక్తి, ఈ పదంలో ఇమిడి ఉంది! సర్వ సంసార చక్ర పరిభ్రమణానికి "ఈహ"----ఈ కోరిక ఒక్కటే మూలమని చెప్ప వచ్చును. జ్ఞాని మనస్సు రాగద్వేషాలనుండి ముక్త మవడమే కాదు, అందులో కోరికలు, పనిచెయ్యాలనే ఇచ్ఛ, ప్రయత్నం ఏవీ ఉండవు. సర్వత్రా తానే ఉండడాన్ని గుర్తించే హృదయానికి ఇది అత్యంత సహజమైన స్థితి.

శ్లో॥ న విన్దతి న చ స్తౌతి న హృష్యతి న కుప్యతి ।
న దదాతి న గృహ్ణాతి ముక్త స్సర్వత్ర నీరసః ॥ 13.

టీ॥ సర్వత్ర = అన్నిటియందును, నీరసః = ఆసక్తిలేనివాడై, ముక్తః = ముక్తుడగు జ్ఞాని, న నిన్దతి = నిందించడు, న స్తౌతి = స్తుతించడు, న హృష్యతి = హర్షము నొందడు, న కుప్యతి = కోపింపడు, న దదాతి = యివ్వడు, న గృహ్ణాతి = గ్రహింపడు.

**జీవన్ముక్తుడయిన జ్ఞాని ఎవరినీ నిందించడు, స్తుతించడు, కోపంగానీ సంతోషంగానీ ఉండవు, దానం చెయ్యడంగానీ గ్రహించడంకానీ ఉండదు. సర్వ విషయానుభవాలనుండీ అతడు విడిగా ఉంటాడు.**

జ్ఞాని మనఃస్థితిని సరిగ్గా వర్ణించలేకపోయాననే వ్యథతో అష్టావక్రుడు ఇంకా చిత్రీకరించాలనుకుంటున్నారు. అలౌకికమయిన ఆత్మసౌందర్య ప్రకాశంతో తేజరిల్లే సమత్వబుద్ధిని ఎంత వర్ణించినా న్యాయం చేకూర్చబడదు. వాసనా రహితుడైన జీవన్ముక్తునిలో మమత్వబుద్ధి ఉండదు. కాబట్టి సహజంగా దేనినీ అనుభవించాలనే కోరిక ఉండదు. అతడు విషయాలననుభవిస్తున్నా అనుభవించా లనే కోరిక లేకపోవడంతో అనుభవించనట్టే. అట్టి జీవన్ముక్తుడు పరమాత్మ స్వరూపమే, మనశ్శరీరాల కార్యకలాపాలతో ఆత్మకు సంబంధమే ఉండదు.

నిందాస్తుతులు బుద్ధికి చెందిన లక్షణాలు, కోపించడం సంతోషించడం మనస్సుకుచెందిన లక్షణాలు, ఇచ్చి పుచ్చుకోవడాలు శరీరం చేసే పనులు ఇవేవీ కూడా అతనికి చెందవు. ఆత్మచైతన్యమయిన అతని సన్నిధిలో ఆ ఉపాధి పనిచేస్తుంది. ఆ పనులతో అతనికి ఏవిధమయిన సంబంధమూ ఉండజాలదు. ఆ మనశ్శరీరాలు ప్రారబ్ధానుసారంగాగాని, సహజ స్పదంనతోగానీ ఏ పనులను చేసినా వాటికి అతని బాధ్యత ఏమీ ఉండదు. అన్ని ఉపాధులు కూడా పనిచేసే శక్తిని స్పందనను (తెలివిని) ఆత్మనుండే గ్రహిస్తాయి. అయితే సామాన్యుల ఉపాధులు వారి వాసనానుగుణంగా పనిచేస్తాయి. వాసనారహితుడైన జ్ఞాని ఉపాధి బాహ్యప్రేరణలకు స్పందించి కార్యకలాపాలను చేసినా చేయనట్లే. అతడు కేవలం సాక్షిగా చూస్తూ ఉంటాడు.

## శ్లో॥ సానురాగం స్త్రియందృష్ట్వా మృత్యుంవా సముపస్థితం।
## అవిహ్వాలమనాః స్వస్థః ముక్త ఏవ మహాశయః ॥ 14.

టీ॥ సానురాగం = అనురాగముతో (ప్రీతితో) కూడుకొన్న, స్త్రియం = స్త్రీని, దృష్ట్వా వా = చూచినను (లేక), సముపస్థితం = సమీపమునందున్న, మృత్యుం = మృత్యువును, దృష్ట్వా వా = చూచినను, అవిహ్వాలమనాః = వ్యాకుల రహితమైన మనస్సు గలవాడై, స్వస్థః = శాంతచిత్తుడైన, మహాశయః ఏవ = మహాత్ముడే, ముక్తః = ముక్తుడు.

**అనురాగవతియైన స్త్రీని చూసినా, మృత్యువును చూసినా కూడా సమత్వ బుద్ధితో శాంతంగా ఉండగలుగుతాడు మహాశయుడైన జ్ఞాని.**

అన్ని సమయ సందర్భాలలోనూ పరిపూర్ణమైన సమత్వాబుద్ధిని కలిగి ఉండడమే జీవన్ముక్తుని గుర్తించడాని కుపయోగపడే చివరి పరీక్ష. అనురాగవతీ సౌందర్యవతీ అయిన స్త్రీ సమీపించినా, మృత్యువు సమీపిస్తున్నదని తెలిసినా కూడా చెక్కుచెదరని శాంతంతో నాటకాన్ని చూస్తున్నట్టుగా చూడగలిగే మనస్సు గల వ్యక్తి, మనశ్శరీరాల నధిగమించి ముక్తుడయినట్లే నిశ్చయంగా చెప్ప వచ్చును. అట్టిమహాశయుడైన జీవన్ముక్తుడు, అతడే ఆత్మనిష్ఠుడు, స్వప్నం లోని ప్రియురాలుకానీ, పులికానీ, మేలుకున్నవానికి సంతోష సంక్షోభాలను కలిగించ గలవా!!?

ఒకమారు బుద్ధభగవానుడు దేశసంచారం చేస్తూ ఒకరాత్రి ఒక

దేవాలయంలో ఆగి నిద్రిస్తున్నాడు. అత్యంత సౌందర్యవతి అయిన ఒక మహానర్తకి మనమోహనంగా అలంకరించుకుని పళ్ళెంలో రుచికరమయిన పదార్థాలతో ఆలయాన్ని సమీపించి తలుపుతట్టి పిలిచింది. నవయౌవ్వనుడూ సౌందర్యతేజోవిరాజితుడూ రాజకుమారుడూ అయిన బుద్ధుని మోహపరవశుడ్ని చెయ్యాలనే ఉద్దేశంతో సమీపించిన ఆమెకు పాదాభివందనం చేసి " అమ్మా! నీ కుమారుడు నిన్ను ఏవిధంగా సేవించమని "ఆజ్ఞ" అని బుద్ధుడు ఎంతో వినయంగా అడిగేడు. బాష్పరుద్ధకంఠంతో దిగ్భ్రాంతితో ఆమె అతనికి మోకరించి క్షమించ మని ప్రార్థించి తన గృహానికి తిరిగి వెళ్ళిపోయింది. కాలక్రమంలో ఆమె బుద్ధభగవానుని ముఖ్య అనుచరులలో ఒకరై వారిని సేవించగలిగింది.

నిశ్చలమూ శాంతగంభీరమూ అయిన జీవన్ముక్తుని మనఃస్థితికి ఇక్కడ చక్కటి ఉదాహరణ ఇవ్వడింది. అట్టి మనస్సును మృత్యువు భయపెట్టజాలదు. ప్రేమ ప్రలోభపెట్టజాలదు. అధికారం ఆనందాన్నివ్వదు. ఐశ్వర్యం ఆకర్షించదు. స్థిరశాంత గంభీర ముద్రతో నిత్యతృప్తితో ఆనందంగా జీవిస్తాడు. జీవన్ముక్తుడయిన జ్ఞాని.

**శ్లో॥ సుఖే దుఃఖే నరే నార్యాం సంపత్సు చ విపత్సుచ ।**
**విశేషోనైవ ధీరస్య సర్వత్ర సమదర్శినః ॥ 15.**

టీ॥ సుఖే = సుఖమునందు, దుఃఖే = దుఃఖమునందును, నరే = పురుషునియందును, నార్యాం = స్త్రీయందును, సంపత్సు = సంపదలయందును, విపత్సు = విపత్తుల యందును, సర్వత్ర = అంతటను, సమదర్శినః = సమానముగా చూచున్న, ధీరస్య = ధీరుడగుజ్ఞానికి, విశేషః = విశేషము (భేదము), న = లేదు.

**సర్వత్రా ఆత్మనే దర్శిస్తున్న జ్ఞానికి సుఖదుఃఖాలలో, స్త్రీ పురుషు లలో అదృష్ట దురదృష్టాలలో భేదమే కనిపించదు.**

అన్ని సమయాలలోనూ, సుఖమయినా దుఃఖమయినా, అన్ని ప్రాణుల లోనూ----స్త్రీలైనా పురుషులైనా, అన్ని సందర్భాలలోనూ---అదృష్టమయినా, సర్వత్రా ఆత్మనే చూస్తూ అన్యమేదీలేదనే దృఢజ్ఞానం కలిగిన జ్ఞాని ఎప్పుడూ శాంతంగానే ఉండగలడు.

బాహ్యంగా ఉండే వస్తువులూ విషయాలూ తమంత తాముగా మనస్సుకు అశాంతిని దుఃఖాన్నీ ఈయలేవు. మనస్సుకూడా తనంత తానుగా

విచారావృతం కాదు. మనస్సు విషయాలతో సంయోగించి వికర్షించినప్పుడే ఆలోచనల అలజడి ఆరంభమవుతుంది. మనస్సు తనవెనుక నుండే వాసనాను గుణంగా విషయాలతో ఆకర్షణ వికర్షణలను పెంచుకుంటుంది. జీవన్ముక్తునిలో వాసనారూపమయిన గత స్మృతులన్నీ నశించిపోవడంచేత అతని మనస్సు నిశ్చలంగా శాంతంగా ఉంటుంది. విషయాలతో సంయోగం చెందినా ఆకర్షణ వికర్షణలక్కడ జనించవు. నిజానికి ఇటువంటి మనస్సు మాత్రమే ఏ విషయాన్నయినా ఉన్నదానిని ఉన్నట్టుగా అనుభవించగలుగుతుంది. మిగిలిన మామూలు మనసులన్నీ వాటి యిష్టాయిష్టాలతో పరిమితం కాబడిన విషయాలను మాత్రమే అనుభవించగలుగుతాయి. అనుభవానికి అర్హమయిన మనస్సు జ్ఞానిది మాత్రమే అనడం అతిశయోక్తి కాకపోయినా, అతనికి దానితో ప్రమేయం లేకపోవడంతో వ్యర్థమూ నిరర్థకమూ అవుతున్నది.

జ్ఞానికి తన ఆలోచనలు ఎక్కడనుండి బయలుదేరుతున్నాయో ఆ మూలం సదా స్మృతిపథంలో ఉంటుంది, అజ్ఞానికి ఆలోచనలకు మూలం వేరే ఉందన్న విషయమే స్ఫురించదు. ఆలోచనలు జనించి నర్తిస్తూ అనేకానేక కల్పనా వైచిత్ర్యాలను సృష్టించి అనుభవింపజేస్తున్నా వాటి మూలంమీద సదా దృష్టినిలిపే జ్ఞానిని అవి భ్రమపెట్టజాలవు. ఒక ఇంద్రజాలకుడు మన ముందు ఎన్ని విచిత్రాలను సృష్టించినా ఆనందాశ్చర్యాలతో చూస్తూ ఉంటామే తప్ప ఆ అనుభవాలలో చిక్కుకుపోము. అది ఇంద్రజాలమే అని సదా స్ఫురించడమే అందుకు కారణం!

ఈ విధంగా సర్వభావ తరంగాలకూ మూలమైన చైతన్యసాగరం మీద సదా దృష్టినిలిపిన జ్ఞాని బాహ్యంగా కర్మలను చేస్తున్నా అవన్నీ కూడా మనః కల్పిత భావనా చిత్రాలని సదా గుర్తిస్తూనే ఉంటాడు. అందుకే అతడు సర్వత్రా సంభ్రమ విభ్రమాలకు లోనుగాకుండా సమత్వభావంతో నిశ్చలంగా ఉండ గలుగుతాడు. ఒకనటుడు పాత్రోచితంగా ఎంత బాగా లీనమై నటించినా అతని అంతరంగాన్ని ఆ పాత్ర సుఖదుఃఖాలేవీ స్పృశించవు. నటించడం అయిపోయిన మరుక్షణమే అతడు మామూలుగా శాంతంగా ఉండగలిగి అవసరాన్ని బట్టి మరల నటిస్తూ ఉంటాడు. ఇదేవిధంగా జ్ఞాని వాసనానుగుణంగా, అహంకారం నటునివలె బాహ్యప్రపంచంలో నటించడాన్ని చూస్తున్నా అంతరంగంలో సదా శాంతుడై ఉండగలడు. నిర్ణయింపబడిన పాత్రలో నటుడు నటించినట్టే జగన్నాటకంలో

ప్రారబ్ధానుగుణంగా అహంకారం నర్తించడాన్ని జ్ఞానిమాత్రమే సాక్షిగా వీక్షించ గలడు. మిగిలినవారంతా తమ పాత్రలతో తాదాత్మ్యం చెంది కష్టసుఖాల ననుభవిస్తూ, కొత్తకోరికలు కోరుతూ సంసారచక్రాన్ని అనంతంగా పరిభ్రమింప జేస్తుంటారు.

అద్వయమయిన ఆత్మలో స్థితుడైనవాని దృష్టితో ఈ శ్లోకం వివరింప బడింది. ప్రాపంచిక దృష్టితోకూడిన మన మనస్సుతో దీనిని అర్థంచేసుకుని ఆచరణలో పెడితే మనకు మనమే హాని చేసుకున్నట్టవుతుంది. వివిధ ప్రత్యేక రూపసమన్వితమయిన విశాల విశ్వాన్ని చూస్తూ, అద్వైతస్థితి ననుభవిస్తున్న మహర్షుల మహితాత్ముల మనోవర్ణనలను మనమనుసరించడం నేరం అవుతుంది. యుద్ధభూమిలో యుద్ధంచేస్తున్న సైనికుడు తన స్వంతనిర్ణయంతో శత్రు సంహారం చెయ్యడానికి తగిన అధికారం పొంది ఉంటాడు. కాబట్టి ఆ సమయంలో అతడెవరిని సంహరించినా అది ధర్మమవుతుంది. అదే సైనికుడు శెలవులో ఉన్నప్పుడు తన పొరుగువానితో కలహించి తనస్వంత నిర్ణయంతో వానిని సంహరిస్తే అది నేరం అవుతుంది. నానాత్వపు ప్రపంచాన్ని చూస్తూ స్వప్రయోజనం కోసం ఈ శ్లోకార్థాన్ని వాడుకుంటూ సర్వత్రా సమబుద్ధిని ప్రదర్శిస్తున్నామని గొప్పలు చెప్పుకుంటూ సంకుచితమూ నీచమూ స్వార్థ పూరితమూ అయిన కర్మలను చెయ్యబూనడంకన్నా ఆత్మవంచనా మహాపాపమూ మరేదీ ఉండదు. మనం ఏ పనిని చేస్తున్నా త్రికరణశుద్ధిగా చేస్తున్నామోలేదో ప్రతిక్షణమూ పరిశీలించుకుంటూ చిత్తశుద్ధితో జీవించాలి. ఏది సాధించాలన్నా ఈ లక్షణం అత్యంతావశ్యకం అయినప్పుడు ఆధ్యాత్మిక సాధకులకు ఇదే మొదటి మెట్టని వేరే చెప్పవలసిన అవసరమేలేదు.

**శ్లో॥ నహింసా నైవకారుణ్యం నౌద్ధత్యం న చ దీనతా ।**
**నాశ్చర్యం నైవ చ క్షోభః క్షీణసంసరణే నరే ॥ 16.**

టీ॥ క్షీణసంసరణే = నశించిన సంసారముగల, నరే = మనుష్యుని యందు, హింసా న = హింసయులేదు, న కారుణ్యం = కరుణయులేదు, న ఔద్ధత్యం = దౌష్ట్యములేదు, న దీనతా = దీనత్వము లేదు, న ఆశ్చర్యం = ఆశ్చర్యములేదు, న క్షోభః = క్షోభములేదు.

ఆత్మానుభవంతో సంసారంనుండి ముక్తుడైన జ్ఞానికి కరుణ, హింస, దీనత్వం,గొప్పదనము,ఆశ్చర్యము అలజడి--ఇటువంటి ఏ భావమూ ఉండదు.

సామాన్యులు శాశ్వతమైన సత్యాన్ని తెలియని అజ్ఞానంవల్ల మన శ్శరీరాలతో విషయానుభవాల నందేటప్పుడు రాగద్వేషాలకు లోనవుతారు. స్వాత్మనిష్ఠుడయిన జ్ఞాని స్వప్రకాశంలో సర్వమూ తెలియబడుతూ ఉండడాన్ని గుర్తించి శాంతుడై నిశ్చలంగా జీవిస్తాడు. జీవన్ముక్తుడయిన జ్ఞానిలో "అతడూ" లేడు. "అతనివీ" లేవు. అతని స్థితికి సాటి అయినదేదీ లేదు. అతనికతడే సాటి. దైవత్వం కూడా అతడి కంటే తక్కువే. అసలు దైవత్వము కూడా అతనిలోనే ఉంది.

**శ్లో॥ న ముక్తో విషయద్వేష్టా న వా విషయలోలుపః ।**
**అసంసక్తమనాః నిత్యం ప్రాప్తాప్రాప్తముపాశ్నుతే ॥17.**

టీ॥ ముక్తః = జీవన్ముక్తుడు, న విషయద్వేష్టా = విషయములను ద్వేషించువాడు కాడు, న విషయలోలుపః = విషయములయందు లోలుపుడు గాడు, నిత్యం = ఎల్లప్పుడు, అసంసక్తమనాః = ఆసక్తిరహిత మనస్సుగలవాడై, ప్రాప్తాప్రాప్తం = ప్రాప్తాప్రాప్త వస్తువులను, ఉపాశ్నుతే = అనుభవించుచున్నాడు, (ప్రాప్తవస్తువు ననుభవించుచున్నాడు , అప్రాప్తవస్తువును కోరుటలేదు)

**జీవన్ముక్తునికి ఇంద్రియవిషయాలపై ఆసక్తికానీ ద్వేషంకానీ ఉండవు. నిర్మోహత్వంతో నిశ్చలంగా ప్రాప్తించిన వాటి ననుభవిస్తూ ప్రాప్తించనివాని గురించి విచారించకుండా శాంతుడై జీవిస్తాడు.**

రాగద్వేషాలు, ఆసక్తి, అనాసక్తి, ప్రేమ, క్రోధం---ఈ ఉద్రేకాలన్నీ కూడా మనచుట్టూ ఉన్న వస్తువులపై మనకు మమత్వం ఉన్నప్పుడే సంభవం అవుతాయి. జీవన్ముక్తుడయిన జ్ఞానిలో మమత్వబుద్ధి ఉండదు కాబట్టి ప్రాపంచిక విషయాలతనికి సుఖదుఃఖాల నివ్వజాలవు. రాగబంధరహితమైన మనస్సుతో నిత్యముక్త స్థితినందిన బుద్ధితో, జీవితంలో వచ్చే సర్వసంఘటనలను శాంతంగా సాక్షిగా వీక్షిస్తూ సంతోషంగా జీవిస్తాడు. వచ్చిన వాటిగురించి కానీ, రానివాటి గురించి కానీ సంతోష విచారాలను పొందడు. యథార్థాన్ని యథాతథంగా చూస్తూ స్వీకరణ నిరాకరణ బుద్ధిలేకుండా సమత్వబుద్ధితో సదా ఆనందంగా ఉండగలుగుతాడు.

శ్లో॥ సమాధానా సమాధాన హితాహిత వికల్పనా ।
శూన్యచిత్తో న జానాతి కైవల్యమివ సంస్థితః ॥ 18.

టీ॥ శూన్యచిత్తః = మనస్సునందు ఏసంకల్పములును లేనివాడైన జీవన్ముక్తుడు, సమాధానాసమాధాన హితాహిత వికల్పానాః = సమాధాన అసమాధానములు హితము, అహితము వీటియొక్క కల్పనలను, న జానాతి = తెలిసికొనడు, పరం తు = మరే మనగా, కైవల్యం ఇవ=కేవలము మూర్తీభవించిన మోక్షమువలె, సంస్థితః = ఉంటున్నాడు.

శూన్యచిత్తుడయిన జ్ఞానిలో శాంతి అశాంతులు, మంచిచెడ్డలు మొదలయిన మానసికోద్రేక ద్వంద్వాలేవీ ఉండవు. కేవలంగా తానొక్కడే ఉన్నట్టుగా సంతత సంతోషితాంతరంగంతో శాంతుడై జీవిస్తాడు.

బుద్ధి ఉన్న సామాన్య మానవుడెవరయినా సరే ఆలోచనలు లేకుండా ఉండలేడు, అతడు ఆలోచిస్తూనయినా ఉంటాడు, లేక నిద్రలోనయినా ఉంటాడు. భావశూన్యస్థితిలో అనుభవానికి వచ్చే శుద్ధచైతన్యం భగవత్తత్త్వమే. అది సామాన్యునికి అందుకోలేని అనుభవమే. జ్ఞాని తనంతతానుగా విడిగా ఉన్నప్పుడు అతనిలో ఆలోచనలే ఉండవు. కాబట్టి మానసికోద్రేక రూపమయిన ద్వంద్వాలతనిలో ఉండజాలవు. తప్పొప్పులు, మంచిచెడ్డలు, అందము, కురూపత్వం సుఖదుఃఖాలు ఇటువంటి అసంఖ్యాకమయిన ద్వంద్వాలతనిని బాధించనేరవు. ప్రపంచం మీద అతనికి మోహం ఉండదు. కాబట్టి ప్రపంచం అతనినేవిధంగానూ కదలించజాలదు. మానసిక పరిధిలో విషయాలతో సంయోగం చెందినప్పుడు మాత్రమే మానసికోద్రేకాలు జనించి బాధిస్తాయి. అది మానసిక స్థితిలో ఉన్న జ్ఞానికి వాటితో ప్రమేయమే ఉండదు. అతడు అన్నిటికీ అతీతంగా "పరాత్-పరః" ఉన్నాడు. ఏకమూ అద్వయమూ అయిన సత్యంలో ఆనందంగా స్థితుడై ఉన్నాడు.

శ్లో॥ నిర్మమో నిరహంకారో న కించిదితి నిశ్చితః ।
అంతర్గళిత సర్వాశః కుర్వన్నపి న లిప్యతే ॥ 19.

టీ॥ అంతర్గళితసర్వాశః = అంతఃకరణమునందలి సమస్త కోరికలు నశించినవాడును, నిరహంకారః = అహంకార రహితుడును, నిర్మమః = మమతా రహితుడును, కించిత్ = కొంచెముగూడ, న = లేదు (ఇదంతయు మిథ్య), ఇతి = ఇట్లని, నిశ్చితః = నిశ్చయ జ్ఞానముగలవాడు, కుర్వన్ అపి = కర్మలు చేయుచున్న వాడైనను, న లిప్యతే = అంటడు.

అహంకార మమకార వర్జితుడై, కేవలం నామరూపాలు వినా సృష్టి లేదనే దృఢజ్ఞానంతో సర్వకోరికలు నశించినవాడై, జ్ఞాని కర్మలను చేస్తున్నట్టు కనిపించినా నిజానికి ఏ కర్మలనూ చెయ్యడంలేదు.

. అహంకారం ఎవనిలో నశించిందో అతడే ముక్తినందినవాడు. అహంకారం, "నేను", "నాది", అని రెండు విధాలుగా పనిచేస్తుంది. ఈ రెండు భావనలూ లేక పోతే అహంకారం నశించినట్లే. కోరికల అలజడే అహంకారానికి మూలస్థానము. జ్ఞానిలో అహంకారం తన మూలమయిన కోరికలతో సహా అంతరించిపోతుంది కాబట్టి, అష్టావక్రులు "అంతర్గళిత సర్వాశః"---అంతరంగంలో అన్ని కోరికలు నశిస్తాయి అంటున్నారు.

అహంకార రహితంగా చేసే కర్మలన్నీ నిజానికి కర్మలేకావు. కర్మకు కారణం కోరిక, కర్మనాచరించేవాడు అహంకారం నటుడయిన అహంకారమూ మూలమయిన కోరికలూ లేని స్థితిలో జరిగే కర్మలు, మనశ్శరీరాల కదలికలు మాత్రమే. ముక్తుడయిన జ్ఞానిలో కర్మఫలాన్నాశించే అహంకారం ఉండదు కాబట్టి కర్మలు కూడా ఫలితాల నివ్వజాలవు. అహంకార రహితమైన అంతరంగం భగవానుని మురళిగా దివ్యరాగాల నాలపిస్తుంది, ఆ రసాస్వాదనతో లోకం పునీతమవుతుంది. వ్యక్తిగతమయిన మనస్సతనిలో పనిచెయ్యదు. సమష్టి మనస్సయిన భగవానుని దివ్యప్రేమ లోకకల్యాణ కారకంగా అతని ఉపాధిద్వారా వ్యక్తమవుతుంది. ఈ అర్థంలోనే జ్ఞానిని భగవంతుడని ఆరాధిస్తాము.

**శ్లో॥ మనః ప్రకాశం సంమోహా స్వప్నజాడ్య వివర్జితః ।**
**దశాం కామపి సంప్రాప్తో భవేద్గళితమానసః ॥ 20.**

టీ॥ గళితమానసః = నశించిన మనస్సుగల జ్ఞాని, మనఃప్రకాశ సంమోహా స్వప్నజాడ్య వివర్జితః = మనః ప్రకాశమునుండియు, చిత్తభ్రాంతి నుండియు, జడత్వరూప నిద్రనుండియు విడివడినవాడై, కామపి = అనిర్వాచ్యమైన ఒకానొక, దశాం = దశను (అవస్థను), సంప్రాప్తః = పొందినవాడుగా, భవేత్ = అగును (అగుచున్నాడు)

**మనస్సు అమనస్కం కాగా, కోరికలూ కోరికలతో చేసే పనులూ, లేక భ్రమ, స్వప్నం, తమస్సులనుండి ముక్తినందిన జ్ఞానికి అనిర్వచనీయమైన స్థితి అనుభవంలోకి వస్తుంది.**

పందొమ్మిది శ్లోకాలలో శాయశక్తులా జ్ఞాని స్థితిని వర్ణించడానికి ప్రయత్నం చేసి చివరగా అష్టావక్రుడు తన ప్రయత్నం ఎంత వ్యర్థమో, ఆ స్థితి ఎంత అనిర్వచనీయమో గుర్తించారు, అందుకే ఈ స్థితిని మాటలతో వర్ణించడం సాధ్యం కాదని ఇక్కడ ఒప్పుకుంటున్నారు.

ధ్యానాయత్తమైన బుద్ధిని ఒక ప్రత్యేకపద్ధతిలో మలచి సరైన దిశకు మళ్ళించి దివ్యదృష్టిని ప్రసాదించడాని కుపయోగపడే మార్గసూచికలుగా ఈ ఇరవై శ్లోకాలనూ వర్ణించవచ్చు. ఈ దివ్యజ్ఞానాన్నందుకునేటందుకు ఏ మేరకు తన బుద్ధిలో సంసిద్ధత ఉంటుందో ఆ మేరకు ప్రతి సాధకుడూ ప్రగతిని సాధించ గలడు.

జీవన్ముక్తునిలో మనస్సు పూర్తిగా లయం అయిపోతుంది. సత్వగుణం కూడా అందులో వ్యక్తమవదు, భ్రమలనూ, స్వప్నాలను సృష్టించి చూపించే రజోగుణం అదృశ్యమయి పోతుంది. బుద్ధిని ఆవరించి సత్యాన్ని మరుగుపరచే తమోగుణం అంతమయిపోతుంది.

తమోగుణం ఆవరించడంతో సత్యం కప్పబడిపోతుంది. సత్యం తెలియని అజ్ఞానంలో రజోగుణం అశాంతిపాలై కల్పనలనూ స్వప్నాలనూ సృష్టిస్తోంది. తమోగుణంవల్ల అగ్రహణమూ, రజోగుణంవల్ల అన్యథాగ్రహణమూ సంభవం అవుతాయి. సాధనద్వారా ఈ రెండు గుణాలనూ స్వాధీనపరచుకుంటే సత్వగుణం వృద్ధిచెంది మనస్సు శాంతంగా ధ్యానానుకూలంగా మారుతుంది. ధ్యాననిష్ఠలో రేఖామాత్రంగా మిగిలిన తమో రజో గుణాలు అదృశ్యం అయిపోతాయి. మిగిలిన సత్వగుణం అనంతమైన ఆత్మ చైతన్యంలో ఐక్యం అయిపోతుంది. ఇక్కడే మాయను దాటడం అవిద్య అంతరిస్తుంది. జ్ఞానస్వరూపంగా ఆనందంగా జ్ఞానిమాత్రమే మిగిలి ఉంటాడు.

పరస్పరాధార భూతమయిన ప్రపంచాన్ని మాత్రమే భాష అతి కష్టం మీద వర్ణించగలుగుతోంది. ఈ ప్రపంచాన్నే అధిగమించిన ఆ స్థితిని వర్ణించ డానికి భాషకు ఎలా సాధ్యమవుతుంది? భావం భాషకు జీవితాన్నిస్తే, భాష భావానికి సౌందర్యాన్నందిస్తుంది. ఈ రెండూ పరస్పరాధారంగా ప్రవర్తిస్తూ ఉంటాయి. భావాతీతమయిన స్థితిని వర్ణించడానికి భాషకు జీవం ఎలా ఉంటుంది? అందుకే ఆ స్థితిని వర్ణించబూనితే భాష కొన్ని సంజ్ఞలను సూచించి మరికొన్ని పదాలతో వ్యర్థప్రయత్నం చేసి చివరకు మౌనంగా నిలచిపోక తప్పదు!!

...

## అధ్యాయం-18

# ల క్ష్య ము

మహా ఘనకార్యాలను సాధించిన మహితాత్ముడయినా తల్లి గర్భంలో ఉన్నప్పుడు జీవమూ అవయవాలూ కలిగిన మాంసపుముద్ద మాత్రమే. మనస్సూ బుద్ధీ అనబడే తొడుగులచే పరిమితం కాబడి, అనంత దివ్య తేజో విరాజితమయిన ఆత్మ చైతన్యం అహంకారంగా ఈ శరీరంలో ప్రస్తుతం బంధింపబడి ఉంది! ఈ వ్య క్తిత్వాన్ని బంధంనుండి విడిపించా లంటే దేశకాలాలనబడే సంకెళ్ళను సడలించాలి. ఆ తరువాత అనంతమైన తన సమిష్టి తత్త్వాన్ని అర్థంచేసుకుని వ్యష్టిగా హాయిగా జీవిస్తుంది. ఇదే ప్రాణికోటి జీవనయాత్రకు గమ్యస్థానం, మానవజీవిత పరమార్థం, మనమంతా చేరుకోవలసిన గమ్యం.

ఈ ఆధ్యాత్మిక లక్ష్యం బుద్ధికి అతీతం కావడంచేత మాటలతో దీనిని బుద్ధికి అందించడం అసాధ్యం. ఈ లక్ష్యాన్ని మన బుద్ధితో అర్థం చేసుకోవడం అసాధ్యమే. అయినా మన సహజ స్వరూపంగా అనుభవించడం సాధ్యమే. అందుకే ఈ ఆత్మతత్త్వం గురించి గురువు ఎన్ని ఉపన్యాసా లిచ్చినా, శిష్యుని బుద్ధి పరిధికి అతీతం కావడంచేత అర్థం కాదు.

అయినా సర్వాన్నీ బుద్ధితో అర్థం చేసుకుంటూ బుద్ధికి ప్రత్యేక విలువనిచ్చే సాధకుడు, సహజంగా ఈ లక్ష్యాన్ని గురించి బుద్ధికి అర్థం అయే విధంగా వినాలని అనుకుంటాడు. బుద్ధిమంతుడైన సాధకుడు తన బుద్ధికి అర్థం అయి విలువ ఏర్పడితేనే తప్ప దేనినీ సాధించాలనుకోడు. అందుకే సాధించవలసినదేదో, దాని తత్త్వమూ, వివరణా, మార్గమూ, ఫలితమూ అన్నీ వీలైనంత వివరంగా తెలుసుకోవాలనుకుంటాడు.

అందుకే అసాధ్యమే అయినప్పటికీ ఉపనిషత్కర్తలూ తత్త్వబోధకు లూ అయిన మహర్షులంతా అనిర్వచనీయమైన ఆత్మతత్త్వాన్ని వర్ణించాలనీ,

అవాఙ్మానస గోచరమైన సత్యాన్ని మాటలతో బుద్ధికి సూచన మాత్రంగా నయినా అందించాలనీ, శక్తివంచనలేకుండా కృషి చేసేరు. ఈ ప్రయత్నంలో అనేక ప్రత్యేక విధానాల నవలంబించి సాధకుని మనోబుద్ధులను ధ్యానాను కూలమూ ధ్యానాయుతమూ చెయ్యడానికి సూచనల నందించారు. జీవన్ముక్తుడు ప్రపంచంలో వ్యవహరించే తీరునూ అతని మానసిక దృష్టినీ అనుభవాలనూ వర్ణించడమే ఇందుకు ముఖ్యమయిన విధానంగా మన మహర్షులంతా భావించారు. జీవన్ముక్తుని జీవిత చిత్రాన్ని మనోనేత్రంతో దర్శించగలిగితే మన లక్ష్యమూ, మార్గమూ ఫలితమూ, మన మనస్సుకు అందీ అందనంత దూరంలో గోచరించి, మనస్సును ఆకర్షించి, ఏకోన్ముఖంచేసి, లయంచేసి, చివరగా అనంతమైన ఆత్మ చైతన్యం కేవలంగా భాసిస్తుంది.

అనంత సత్యంయొక్క వ్యక్తరూపమే జీవన్ముక్తుని జీవితచిత్రం. ఈ చిత్రకారులయిన ఉపనిషద్ ఋషులు అడుగడుగునా ఆగి చెపుతూనే ఉంటారు. బాధామయమూ దుర్భరమూ అయిన పరిస్థితుల్లో కూడా జ్ఞాని ఎలా నిత్యానందంగా ఉండగలుగుతున్నాడో,ఆ అనంతానందానికి హేతువేదో గ్రహించగలగడమే బుద్ధియొక్క పరమప్రయోజనం. ఆ ఆనందాన్వేషణలోనే సర్వజీవులూ సమస్త కార్యకలాపాలూ చేస్తూ ఆనందం లభించక అన్వేషణ లోనే జీవితాలనంతం చేసుకుంటున్నాయి.

అష్టావక్ర సంహితలో ఆణిముత్యాల గుచ్ఛమై అలరారు ఈ పద్దెనిమిదవ అధ్యాయంలో అక్షరాకృతినంది ఆత్మజ్ఞాని అంతరంగచిత్రం, అక్షరమయిన సత్యాన్ని అద్భుతంగా సూచిస్తోంది. భగవద్గీతలోవలెనే ఇక్కడ కూడా ఈ పద్దెనిమిదవ అధ్యాయంలో ఇంతవరకూ చెప్పబడినదంతా సమీక్షింపబడింది. పరమ పురుషార్థమూ జీవనలక్ష్యమూ అయిన ఆత్మజ్ఞాన స్వరూపం నిస్సందేహంగా నిరూపించబడింది.

అష్టావక్ర మహర్షి జీవన్ముక్తుని జీవితాన్ని చిత్రిస్తూ ఆత్మతత్త్వాన్ని చూపించడానికి ప్రయత్నించారు. అంతేకాని వివరంగా వర్ణించే ప్రయత్నం చెయ్యలేదు. జీవన్ముక్తుని జీవనలీలలో వ్యక్తమయే పవిత్రసత్యం, దివ్యానందం, ధ్యాననిష్ఠులయిన సాధకులందరికి కరదీపికగా మార్గాన్ని చూపిస్తూ ఊతకఱ్ఱగా నడిపిస్తూ దుర్భేద్యమైన అజ్ఞానాన్ని అంతంచేసి,అసాధ్యమనిపించే, ఆనంద మయ స్వస్థితికి చేరుస్తుంది.

ప్రత్యేకమయిన ఉపనిషత్సాహిత్య సౌందర్యంతో, తత్త్వరహస్యపు లోతులను తరచిచూపించే భావాలతో ఈ అధ్యాయమంతా నిండి ఉంది. అష్టావక్రుని కవితా ప్రౌఢిమ, భావగాంభీర్యం, భాషా సౌందర్యం, పద లాలిత్యం వాక్యనిర్మాణ వైచిత్ర్య చిత్రీకరణ అనన్య సామాన్యమయినవి, అసాధారణ మేధావిభవంతో అద్వయమైన ఆత్మ చైతన్యాన్ని అద్వితీయంగా చిత్రించి, రూపించడంలో మహర్షి ఏర్చికూర్చిన పదజాలం అడుగడుగునా అలౌకిక సౌందర్యాన్ననుభవింపజేస్తూ అపూర్వ సుగంధాలను వెదజల్లుతూ మన మనస్సులను మైమరపింపజేసి చివరగా ఆత్మానందంలో అంతమయ్యే టట్లు చేస్తుంది. హిందూవేదాంత వాఙ్మయంలో అపురూప కుసుమాలుగా భాసించిన మహావాక్యాలన్నీ ఈశ్లోకాల హారంలో దివ్యమణులై ప్రకాశించినవి. ---**"అయమాత్మా బ్రహ్మ"**----ఆత్మనయిన నేను ఆ బ్రహ్మాన్ని, **"అహం బ్రహ్మాస్మి"**----నేనే బ్రహ్మాన్ని, "ఆత్మైవ జగత్ సర్వమ్"-----ఈ జగత్తంతా ఆత్మే. ఈ దివ్యమణులు రాబోయే నూరుశ్లోకాలలోనూ అనేకచోట్ల కనిపిస్తాయి. మహర్షి స్వయంగా నిర్మించిన రత్నాలవంటి సమాసాలెన్నో వీటికి వన్నెతెస్తూ అడుగడుగునా కనిపించి మెరుస్తూ వుంటాయి--"నిష్ప్రించ" ,"నిస్స్వభావ", "నిరాయాస" మొదలైనవి అందులో కొన్ని మచ్చుతునకలు. మొత్తంమీద ఈ అధ్యాయం సత్ చిత్ ఆనందమై---సర్వభావాభవ సమన్వితమై అద్వితీయ మైన ఆత్మతత్వానికి, అమూల్యమైన ఆభరణంగా, అపురూపమయిన ఆలయంగా అద్భుతమయిన పుష్పగుచ్ఛంగా అద్వితీయంగా అంజలి ఘటించి భాసించి భాషను ధన్యం చేసింది! ఈ మహాజ్యోతిలో అనంతంగా కనిపించే విశ్వం ఒక క్రీనీడ మాత్రమే. ఈ మహాద్భుత చైతన్యసాగరంలో జగత్తంతా జలబిందువు మాత్రమే!

ఈ అధ్యాయంచేసే ఇంద్రజాలం మనలను అనంతానందమయ స్థితిలోనికి తీసుకొనిపోతుంది. ధ్యానానుకూలమయిన మనస్సున్న ఏ సాధకు డయినాసరే అష్టావక్రుడు చూపించే అతి పవిత్రమైన అనుభవ సాన్నిధ్యంలో మౌనంగా మిగిలిపోవలసిందే! ప్రత్యేక ప్రయోజనంతో పరస్పర విరుద్ధ భావాలుగా గోచరిస్తూ, అందమైన కల్పనలేమో అని భ్రమగొల్పుతూ అద్భుత భావసౌందర్య గాంభీర్యాలతో మనలను ఆకర్షించి తమవెంట తీసుకొనిపోయ్యే ఈ అధ్యాయంలోని శ్లోకాలు చివరగా మనలను మన ఊహకందని స్థితిలో

అహంకార రహితంగా అద్భుతమయిన ఆత్మానుభవ స్థితులను చేరుస్తాయి.

బ్రహ్మనిష్ఠుడయిన ఆత్మజ్ఞాని జీవితమూ మనఃస్థితీ, ముఖ్యంగా ఈ అధ్యాయంలో వర్ణించబడ్డాయి. ఇందులో ఇంద్రజాలమంతా వర్ణించిన పదాలలోకాక, పదపదానికీ మధ్య, పదాలు సూచించే పదంలో గర్భితమై ఉంది. గమ్యాన్ని చేరాలనే పట్టుదలతో దీక్షతో ధ్యానిష్ఠలో ప్రయాణంచేసే ప్రయాణీకులు, ఈ శ్లోకాలు వాహనాలై జీవనగమ్యానికి ఆధ్యాత్మిక సాధనా లక్ష్యానికి అనాయాసంగా చేర్చగలవు. మాటలు చెప్పలేనిది మనస్సు గ్రహించలేనిది అయిన మన స్వస్థితిలో నిష్ఠులను చేయగలవు.

ఈ అధ్యాయమంతటా శ్లోకాలతో పయనించినవారు గమ్యాన్ని చేరడంలో విఫలులైనా రాబోయే కాలమంతటా సహజ సమాధి స్థితులయి మనమధ్య జీవిస్తున్న మహర్షులపై భక్తి ప్రేమ గౌరవాలతో మౌనంగా నిలబడి, తమజీవన లక్ష్యాన్ని గుర్తుచేసుకుంటూ మహాత్ముల అడుగుజాడలలో జీవించా లనుకుంటారు. ఆత్మతత్వాన్ని"పూర్ణస్వరస విగ్రహః"--అని అంటారు. సర్వరసాలూ సంపూర్ణంగా మూర్తీభవించిన ఈ స్థితిని అందరూ కాంక్షిస్తూనే ఉన్నారు. అయినా లభించడం లేదంటే దృఢమైన నిర్ణయం లేకపోవడమే కారణం అని ఒప్పుకోవాలి.

**అష్టావక్ర ఉవాచః-**

**శ్లో॥ యస్య బోధోదయే తావత్ స్వప్నవద్భవతి భ్రమః ।**
**తస్మై సుఖైకరూపాయ నమః శాన్తాయ తేజసే ॥ 1.**

టీ॥ యస్య=దేనియొక్క, బోధోదయే=బోధోదయమైన మీదట, తావత్ = మొదట, భ్రమః=భ్రాంతి, స్వప్నవత్=స్వప్నమువలె, భవతి = అగుచున్నదో, తస్మై = ఆ, సుఖైక రూపాయ = ఆనందైక స్వరూపుడును, శాన్తాయ = శాంతస్వరూపుడును అగు, తేజసే = జ్యోతిస్వరూపునికొఱకు, నమః = నమస్కారము.

**నిత్యానానంద శాంత తేజోవిరాజితమైన ఆత్మతత్వానికి నమస్సులు. ఆ ఆత్మజ్ఞానం లభిస్తే, మనకుండే అజ్ఞానజనిత భ్రమాజ్ఞానమంతా స్వప్నం వలె అదృశ్యమయిపోతుంది.**

శాస్త్రాన్ని బుద్ధితో చదివి అర్థం చేసుకున్నంత మాత్రాన ధ్యాన మార్గంలో మనస్సు నిలబడదు. సత్యాన్వేషణలో మన సమగ్ర వ్యక్తిత్వమంతా

పనిచేసిప్పుడే ధ్యానం మొదలవుతుంది. మత ధర్మానుసారమయిన బాహ్యావేష ధారణా కర్మలూ శరీరానికి చెందినవి. ప్రగాఢమైన భక్తి గౌరవాలు మానసికమైనవి. మన లక్ష్యాన్నీ మర్గాన్నీ స్పష్టంగా అర్థంచేసుకోవడం బుద్ధికిచెందిన ధర్మం. ధ్యానం సాధ్యం కావడానికి మన వ్యక్తిత్వంలోని ఈ మూడు భాగాలూ సమానంగా సహకరించాలి. ఇది సమగ్రవ్యక్తిత్వంతో సాధనచెయ్యడం అనబడుతుంది. బ్రహ్మనిష్ఠుడయిన అష్టావక్రమహర్షి, అద్వయమూ అచింత్యమూ అయిన ఆత్మ తత్త్వం గురించి చెప్పబోతున్నప్పుడు కూడా ఆ ఆత్మతత్త్వానికి నమస్సులర్పి స్తూ మొదలు పెట్టడంలోగల అంతరార్థం ఇదే---సాధకుడు, సమగ్ర వ్యక్తిత్వంతో సాధన చేసినప్పుడే ధ్యానం సాధ్యం అవుతుందని, ఆత్మకు నమస్సు లర్పించ డంలో స్పష్టం చేస్తున్నారు. తనలోని ఆత్మకు, తానే అయిన ఆత్మకు, తాను ప్రణామం చేస్తూ శిష్యునికి మార్గదర్శకులవుతున్నారు.

చైతన్యస్థానం, భావనారూపమయిన సమస్తజగత్తుకు అధిష్ఠానంగా ఇక్కడ సూచింపబడింది. ఈ అధిష్ఠానాన్ని గుర్తించిన తక్షణమే అధ్యాస అయిన జగత్తు అదృశ్యమయిపోతుంది. త్రాడును గుర్తించిన తక్షణమే పాము దృశ్యం అంతరించిపోతుంది. స్తంభమును గుర్తించగానే భూతం అదృశ్యమవుతుంది. ఆత్మను గుర్తించడంలో అహంకారమూ అహంకార కల్పనా దృశ్యాలూ అంత ర్హితమయి తీరతాయి. చూస్తూ ఉన్న భ్రమను నిజంగా తలపోయడమే అధ్యాస అనబడుతుంది."సత్యానృతవస్త్వైభదప్రతీతిరధ్యాసః"---అని"ఆచార్య"శంకరులు అన్నారు. అంటే సత్య అసత్యాలలో తేడాను గుర్తించకపోవడమే అధ్యాస అని అర్థం.

ఇక్కడ యోగవాశిష్ఠంలో ఒక శ్లోకంలో వివేకానికి నమస్సుల నర్పించడం గుర్తుకువస్తోంది.

> అయమహమిద మాగతం మమేతి స్ఫురిత మపాస్య బలాదసత్యమన్తః
> రిపుమతిబలినం మనో నిహత్య ప్రశమముపైమి నమోஉస్తుతే వివేక.
>
> (యోగవాశిష్ఠం 2-9-65)

*ఓ వివేకమా నీకివే నా నమోవాకాలు. నా మనస్సుకు ప్రబల శత్రువయిన భ్రమాజ్ఞానాన్ని అంతం చెయ్యగలిగేవు. ఈ భ్రమే ఇన్నాళ్ళూ "ఇదినేను" "ఇది వచ్చింది", "ఇదినాది" అనుకొనునట్లు చెయ్యగలిగింది. నీవలననే భ్రమను పోగొట్టుకొని నిత్య శాంత మనస్సుతో హాయిగా నిశ్చలంగా ఉండగలుగుతున్నాను. వివేకమా! స్వీకరించు నా నమస్సులు.*

శ్లో॥ ఆర్జయిత్వాఽఖిలానర్థాన్ భోగానాప్నోతి పుష్కలాన్ ।
నహి సర్వపరిత్యాగం అన్తరేణ సుఖీభవేత్ ॥ 2.

టీ॥ అఖిలాన్=సర్వవిధములయిన, అర్థాన్=ధనములను, ఆర్జయిత్వా=సంపాదించి, పుష్కలాన్ = పుష్కలమయిన, భోగాన్ = భోగములను, (పురుషః = పురుషుడు), ఆప్నోతి = పొందుచున్నాడు, (పరం తు = అయితే), సర్వపరిత్యాగం అంతరేణ = సకల పరిత్యాగము లేకుండా (చేయక), సుఖీ = సుఖవంతుడు, న భవేత్ = కాజాలడు.

అసంఖ్యాకమయిన వస్తువుల నార్జించి పుష్కలంగా సుఖభోగాల ననుభవింపవచ్చును. వీటన్నిటినీ త్యజిస్తేనే తప్ప నిజమైన ఆనందం లభించదు.

ఈ శ్లోకాన్ని చదవగానే పరస్పర విరుద్ధభావాలు గోచరిస్తాయి. మొదటి పాదంలో ఎంత ఎక్కువగా వస్తువులను సంపాదించితే అంతగా సుఖభోగాల ననుభవింపవచ్చని స్పష్టంగా తెలుస్తోంది. వెనువెంటనే వాటన్నిటినీ త్యజిస్తేనే నిజమైన ఆనందం లభిస్తుందని చెప్తున్నారు. సుఖానుభవానికీ ఆనందానికీ గలతేడా తెలియకపోవడం చేతనే ఈ వైరుధ్యం కనిపిస్తోంది. ప్రతిమనిషీ కోరుకునేది ఆనందాన్నే అయితే ఆనందాన్ని పొందడానికి విషయభోగాలనను భవించడమే మార్గంగా అందరూ భావిస్తున్నారు. సాధనాలుగా ఉపయోగింపబడే సుఖానుభవాలను సాధింపవలసిన లక్ష్యమైన ఆనందంగా సాధారణంగా అందరూ పొరపడుతూ ఉంటారు.

ఇంద్రియాలు వాటి కనుకూలమయిన వస్తువు సాంగత్యంలో తాత్కాలికమే అయిన సుఖాల ననుభవిస్తాయని అందరూ ఒప్పుకుంటారు. అయితే నిజానికి మనిషికి కావలసింది శాశ్వతమూ పూర్ణమూ అయిన ఆనందమేకాని తాత్కాలిక సుఖానుభవం కాదు. ఈ సుఖానుభవంకోసం ప్రయత్నాన్నీ వ్యథనీ విడనాడి నప్పుడే శాశ్వతానందానికి మార్గం గోచరిస్తుంది. కోరికలు అలజడినీ అశాంతినీ సృష్టిస్తాయి, అలజడి చెందిన మనస్సు విచారావృతమవుతుంది. కోరికలను విడువగలిగితే ఆలోచనల అలజడి తగ్గుతుంది. అలా శాంతించిన మనస్సే ఆనందానికి ఆటపట్టు. ఈ విధంగా కోరికలు తగ్గేకొలదీ అశాంతి తగ్గుతుంది. అశాంతి తగ్గినకొద్దీ ఆనందం పెరుగుతుంది. తక్కువ కోరికలు, తక్కువ అశాంతి, ఎక్కువ ఆనందం. కాబట్టి కోరికలు లేని స్థితి---ఆలోచనారహితమైన స్థితి, అదే అనంతానంద నిలయమైన ఆత్మానుభూతి.

సర్వవిషయాలూ వస్తువులూ అదృశ్యమయిన సుషుప్తిలో అందరికీ ఆనందం ఉంది. నిజానికి ఏ ఆనందమయినా అనుభవింపబడేటప్పుడు వస్తువు ఉనికికి గుర్తింపు ఉండదు, కేవలం ఆనందం మాత్రమే ఉంటుంది, ఇదే ఆత్మ స్వభావం!

శ్లో॥ కర్తవ్యదుఃఖమార్తాండ జ్వాలాదగ్ధాన్తరాత్మనః ।
కుతః ప్రశమపీయూష ధారాసారమృతే సుఖమ్ ॥ 3.

టీ॥ కర్తవ్య దుఃఖమార్తాండ జ్వాలాదగ్ధాన్తరాత్మనః = కర్మజన్య దుఃఖరూప సూర్యకిరణ జ్వాలల వలన దహింపబడుచున్న మనస్సుగలవానికి, ప్రశమ పీయూష ధారాసారం ఋతే = సంకల్ప వికల్ప ప్రశమనరూప అమృతవర్షములేక, సుఖం = సుఖము, కుతః = ఎక్కడిది?

**తన కర్మలలోనుండి జనించే దుఃఖమే సూర్యతాపంవలె తనను దగ్ధం చేస్తుంటే, ఆ అంతరంగానికి శాంతీ సుఖమూ ఎలా లభించగలవు? కోరికలు లేని స్థితి అనబడే అమృతపు జల్లు మాత్రమే ఆ అంతరంగానికి ఆనందాన్ని ఇవ్వగలదు.**

కోరికలనబడే మహాతరంగాలతో కల్లోలితమయిన మనస్సు అనేక కర్మ లను చేస్తూ, కష్టపడుతూ, మళ్ళీ కోరికలను పెంచుకుంటూ అశాంతిమయమై పోతుంది. కోరికలు నశించిన స్థితిమాత్రమే అట్టిమనస్సును శాంతింప చెయ్యగలదు.

వేదాంత సత్యాన్ని శారీరిక అనుభవ సహాయంతో చెప్పడానికి ప్రయ త్నిస్తున్నారు కవి ఇక్కడ. సంస్కృత భాష కవిత్వంలో ఒక విలక్షణమయిన చిత్రీకరణకు ఉదాహరణంగా ఈ శ్లోకాన్ని చెప్పవచ్చు. మండు వేసవిలోని మధ్యాహ్నపు వేడిని మంచి వర్షపుజల్లు మాత్రమే చల్లార్చగలదు. కోరికలతో సంక్షుభితమయిన మానవాంతరంగం అనేక కర్మలను అధికశ్రమతో చేస్తూ కష్ట పడుతూ ఉంటుంది. మనం కోరే శాశ్వతానందం పరిమితమయిన ప్రాపంచిక విషయ భోగాలవల్ల లభించదనే జ్ఞానం కలిగినప్పుడు మాత్రమే వైరాగ్య సన్యాస భావాలు ఉదయించి స్థిరపడతాయి. తెలివైన ఈ నిర్ణయంతో వచ్చిన కోరికలు లేని స్థితి మాత్రమే మానసిక కల్లోలాన్ని శాంతిజేయ గలుగుతుంది. ఈ విధంగా వివేకోదయం కానంతవరకూ మన మనోబుద్ధులు అశాంతితో అనేక బాధల ననుభవిస్తూ ఉంటాయి, వివేక విజ్ఞానాల వరప్రసాదాలే శాంతీ సమతలు.

శ్లో॥ భవోఽయం భావనామాత్రో న కించిత్పరమార్థతః ।
నాస్త్యభావభావానాం భావాభావ విభావినామ్ ॥4.

టీ॥ అయం=ఈ, భవః=సంసారము, భావనామాత్రః = సంకల్పమాత్రమే, పరమార్థః = యదార్థముగా, కించిదపి = కొంచెముగూడ, న = లేదు, హి=ఎందుకనగా, భావాభావవిభావినాం=భావాభావరూప పదార్థములయందు స్థితమై ఉంటున్న, స్వభావానాం = స్వభావములకు, అభావః = అభావము, నాస్తి=లేదు.

**ఈ ప్రపంచమంతా భావనా మాత్రమే భావానికి వేరుగా, నిజంగా ప్రపంచం లేనేలేదు. అస్తిత్వం కలిగి ఉన్న ఆత్మా, అభావమయిన జగత్తూ తమ స్వభావంలో నిత్యమూ ఉంటాయి.**

అష్టావక్ర గీతలోని అనేక వాక్యాలు అత్యంతమైన ఆదరణను పొంది అనేక తత్త్వశాస్త్రిజ్ఞుల నాలుకలపై చరిస్తూ ఉండడానికి కారణం పదాలకూర్పులోని పొందికమాత్రమే కాదు. అనంత భావార్థ గంభీర సౌందర్యం ఆ వాక్యాలలో ఇమిడి ఉండి, ఒక్కసారి విన్నా మళ్ళీ మళ్ళీ ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. అందుకొక చక్కని ఉదాహరణను ఇక్కడ చూస్తున్నాం.--"భవోఽయంభావనా మాత్రః" ---ఈ ప్రపంచమంతా ఒకవిధంగా భావనలు మాత్రమే. ఈ వాక్యాన్ని వేదాంత బోధకులందరూ తరచుగా వాడుతున్నారు. మనస్సులోని ఆలోచనలణగిపోయి అనంత సత్యంలోకి జాగృత మయినప్పుడు భావప్రవాహంగా నామరూపాలుగా తెలియబడే ప్రపంచమంతా అదృశ్యమయినప్పుడు సాధకుడు తప్పకుండా ఇలా అనుకుంటాడు---"న కించిత్ పరమార్థతః"---నిజంగా ఇక్కడ ఏదీ లేదు. ఉన్నా ఆత్మలేని ప్రపచంమూ ఎప్పుడూ తమ స్వభావాలను మార్చుకోవు అనే వేదాంత సత్యాన్ని అష్టావక్రులు ఇక్కడ స్పష్టంగా చెపుతున్నారు.

ఆత్మసత్యమైనది, నిత్యమైనది పరిణామరహితం, అనంతం, ఈ ప్రపంచం అసత్యం, అనిత్యం, నిత్యపరిణామశీలి, పరిమితం, వాటి సహజ స్వభావా లను అవి ఎన్నడూ కోల్పోవడం లేదు. సంక్షిప్తంగా చెప్పాలంటే ఆత్మ మాత్రమే సత్యమైనది. ఇదే నిత్యంగా ఉంటుంది. ప్రపంచం ఉనికి కలిగిలేదు. వాటి స్వభావాలు మారకుండా ఎప్పుడూ అలాగే ఉంటాయి.

శ్లో॥ న దూరం న చ సంకోచాత్ లబ్ధమేవాత్మనః పదమ్ ।
నిర్వికల్పం నిరాయాసం నిర్వికారం నిరంజనమ్ ॥5.

టీ॥ ఆత్మనః = ఆత్మయొక్క, పదం = స్థానము, న దూరం = దూరము నందు లేదు, సంకోచాత్ = సంకోచమువలన, లబ్ధం = పొందబడునది, న = కాదు, (తత్ = అది), నిర్వికల్పం = సంకల్పరహితమైనది, నిరాయాసం = ప్రయాసరహితమైనది, నిర్వికారం = వికార రహితమైనది, నిరంజనం = దుఃఖరహితమైనది.

**కేవలమూ, అప్రయత్నమూ, పరిణామరహితమూ, నిష్కళంకమూ, అయిన ఆత్మ ఎక్కడో దూరంగా అందరానిదిగా లేదు. దీనికి పరిమితులు లేవు. అసాధ్యమూ కాదు, ఇది నిత్యసిద్ధమైనది.**

శుద్ధచైతన్యం స్వభావతః నిష్కళంకమైనది. ఇందులో ఏ విధమైన కోరికలు, భావాలు, వాసనలులేవు. ఇంద్రియాలతో ప్రపంచాన్ని గుర్తించడం, మనస్సులోని ఉద్రేకాలు, బుద్ధిలోని ఆలోచనలూ కూడా శ్రమతో కూడినవి, కాబట్టి ఈ ఉపాధులతో పనిచెయ్యడానికి ప్రయత్నం కావాలి. ఆత్మ ఇక్కడ "నిరాయాసం"గా వర్ణించబడింది. ఉపాధులయిన మనశ్శరీరాల నధిగమించి అహంకారం అంతరంగంలో లయమయి సత్యద్రష్టగా సత్యంగా జాగృతమయి నప్పుడు ఆత్మమాత్రమే ఉంటుంది. ఇందుకు ప్రయత్నమేమీ అక్కరలేదు. ఈ మహోన్నతస్థితి మన సహజస్వరూపమే కాబట్టి ఇది మనకు దూరంగాలేదు. ఈ స్థితి మన సహజస్వరూపమే కాబట్టి సాధించవలసిన పనిలేదు. ఇది నిత్య సిద్ధమే.

పరిమితమైన మన ఉపాధులతో మనం సాధించగలిగినదికూడా పరిమితమే. ఆత్మ అనంతమైనది కాబట్టి అది అపరిమితమైనది కూడా. కాబట్టే ఇది అసాధ్యం. మనలో ఉండే నిజమైన "నేను" ఇదే, సత్ గా సంతతమూ ఉంటూ చిత్ గా తెలుసుకుంటున్నది ఇదే, అందుచేత ఇది మననుండి ఎప్పుడూ దూరం కాదు. అదే నేను. ఇది నిత్యసిద్ధంగా ఉండనే ఉంది. అయితే మన భ్రమా జ్ఞానం వల్ల ఈ ఆత్మసాన్నిధ్యాన్ని తెలుసుకోలేక పోతున్నాము.

ముండకోపనిషత్తులో మహర్షి మేఘ గంభీర గర్జనారావంతో ఇలా అంటున్నారు!

దూరాత్ సుదూరే తదిహాన్తికే చ

పశ్యత్స్విహైవ నిహితం గుహాయాం. (ముండకోపనిషత్తు 3-1-7)

*దూరతమమైన దానికంటే సుదూరమైనది, ఇక్కడే ఈ శరీరంలోనే ఉంది. యోగి తన జీవితంలో తన హృదయంలోనే దీనిని దర్శించగలడు.*

శ్లో|| వ్యామోహమాత్ర విరతౌ స్వరూపాదాన మాత్రతః ।
వీతశోకా విరాజన్తే నిరావరణ దృష్టయః ॥ 6.

టీ|| వ్యామోహ మాత్రవిరతౌ = విశేషమోహము నశించిన దగుచుండగా, స్వరూపాదాన మాత్రతః = తన స్వరూప గ్రహణమాత్రమువల్లనే, వీతశోకాః = శోకరహితులై, నిరావరణ దృష్టయః = ఆవర రహిత దృష్టిగలవారై, విరాజన్తే = ప్రకాశించు చున్నారు.

మనోబుద్ధులలోని భ్రమలు తొలగిపోగానే, అధిష్ఠానమూ అద్వయమూ అయిన ఆత్మతత్త్వాన్ని తెలుసుకోగలుగుతారు. ఈ జ్ఞానోదయంతో భయాలూ బాధలూ అదృశ్యమయిపోతాయి. బుద్ధిని ఆవరించిన అజ్ఞానం నశిస్తుంది.

సాధకునిలో ఉండే అజ్ఞానమూ అహంకారమే అతని సహజ స్వరూపాన్ని మరుగు పరుస్తాయి. వ్యక్తిగత తన ప్రత్యేక సుఖదుఃఖాల గురించి సదా ఆలోచిస్తూ ఉండడం చేత అతని బుద్ధి తమోగుణంచేత ఆవరింపబడి, రజోగుణం చేత విచలితమూ అశాంతియుతమూ అవుతుంది. మనస్సుయొక్క ఈ రెండు స్థితులనూ సత్వగుణోద్భవమయిన శాంతివైపు మళ్ళించినప్పుడు మనస్సు ధ్యానానుకూలంగా మారుతుంది. ఈ ధ్యానంలో తన భ్రమలను అధిష్ఠానమయిన సత్యాన్నీ స్పష్టంగా తెలుసుకోగలుగుతారు. అట్టి చిత్తశుద్ధికల సాధకుల అంతరంగం ఆత్మానుభవ దీప్తితో ఆనందమయంగా ఉంటుంది.

శ్లో|| సమస్తం కల్పనామాత్రం ఆత్మాముక్తస్సనాతనః ।
ఇతి విజ్ఞాయ ధీరో హి కిమభ్యస్యతి బాలవత్ ॥ 7.

టీ|| సమస్తం=సమస్తప్రపంచము,కల్పనామాత్రం=కల్పనామాత్రమైయున్నది, ఆత్మా = ఆత్మ, ముక్తః = ముక్తమును, సనాతనః = సనాతమునై యున్నది, ఇతి = ఇట్లని, విజ్ఞాయ = తెలిసికొని, ధీరః=జ్ఞాని, బాలవత్ = పిల్లవానివలె, కిం = దేనిని, అభ్యస్యతి = అభ్యసించుచున్నాడు?

ఉన్నట్లుగా మనచేత గుర్తింపబడేదంతా మన భావాలు మాత్రమే ఆత్మ నిత్యమూ ముక్తంగానే ఉంది. ఈ సత్యం తెలిసిన ధీరులు చిన్నపిల్లల వలె అజ్ఞానంగా ఎందుకు ప్రవర్తిస్తారు?

స్వప్నంనుండి జాగృతుడైనవ్యక్తి అంతవరకూ తను అనుభవించినదంతా మనఃకల్పిత భావాలుమాత్రమే అని స్పష్టంగా తెలుసుకోగలుగుతాడు.

జాగృతుడైన తానే సత్యమని కూడా తెలుసుకుంటాడు. అహంకారం తన అనుభవ క్షేత్రమయిన మనోబుద్ధులనుండీ, వాటి సుఖదుఃఖాల గుర్తింపులనుండీ బయటపడినప్పుడు స్పష్టంగా చూడగలుగుతోంది. అంతవరకూ తను నిజంగా చూస్తున్నాననుకున్నవన్నీ తనలోని భావాలు మాత్రమేననీ, భావానికి విడిగా ఏదీలేదనీ తెలుసుకుంటుంది. శరీరంతోకాని, మనస్సుతోగాని, బుద్ధితో గాని ఏ అనుభవమైనా, గుర్తింపైనా, అన్నీ తనలోని భావాలుమాత్రమే, భావంలేని గుర్తింపు ఉండజాలదు. కోర్కెల బలంతో సంక్షుభితమయిన మనస్సే అనేక ఆలోచనలుగా, ఆలోచనలతో తన్నుతాను తెలుసుకుంటోంది. ఇదే వ్యక్తీ ప్రపంచమూ,వాటి సంబంధమూ కూడా. ధీరుడయిన సాధకుడు తాను చూస్తున్న దంతా తన భావాలే అని గుర్తించి, విచారాన్నివీడి, నిశ్చలమనస్కుడయినప్పుడు ఆనందమయ స్వరూపంగా ఆత్మానుభవ నిష్ఠుడవుతున్నాడు. ఈ విధంగా తన స్వరూపంలోనికి జాగృతుడయిన జ్ఞాని, బాలకునివలె ప్రంపంచలో కోరికలతో ఎలా సంచరిస్తాడు?

"బాలవత్" అని ఇక్కడ వాడబడిన ఉపమానార్థం గురించి ఎందరో పండితులు విభిన్నాభిప్రాయాలను వెలిబుచ్చేరు. చిన్నపిల్లవానివలె.1) బాధ్యతా రహితంగా, 2) తెలివితక్కువగా 3) పెంకెగా, 4) పిల్లలకు సహజమైన ఆడుకునే స్వభావంతో బాలురు అజ్ఞానంవలన తమకు హాని చేసుకోవచ్చు. ఆమాయకులే అయిన అదే జ్ఞానంవలన ఇతరులకు హాని కలింగచనూవచ్చు. ఈ ప్రపంచంలో జీవించినంతకాలమూ జ్ఞాని తన కర్మలవల్ల ఎవరికీ హాని కలుగజేయలేడు. దృగ్గోచరమయే ప్రపంచంతా తనకంటే వేరుగాదనే దృఢజ్ఞానం కలిగిన జ్ఞాని పనులు లోకకళ్యాణ కారకాలే అవుతాయి కానీ అన్యథా అవనేరవు. బాహ్యంగా, అసభ్యంగా, అధర్మరిగా, అవినీతితో కూడినట్లుగా కనిపించినప్పటికిని, ఆ పనుల ఫలితం కూడా చివరకు ఇతరులకు మంగళదాయకమే అవుతుంది! సర్వమూ తానే అయిన జ్ఞాని తనకు తాను హాని చేసుకోగలడా? అట్టి జ్ఞానులు ఎన్నడూ అధర్మాన్ని ఆచరించరు, ఆచరించలేరు.

**శ్లో॥ ఆత్మాబ్రహ్మేతి నిశ్చిత్య భావాభావౌ చ కల్పితౌ ।**
**నిష్కామః కిం విజానాతి కిం బ్రూతే చ కరోతి కిమ్॥ 8.**

టీ॥ ఆత్మా = జీవాత్మ, బ్రహ్మ = బ్రహ్మము, చ = మఱియు, భావా భావౌ = భావాభావములు, కల్పితౌ=కల్పితములు, ఇతి = ఇట్లని, నిశ్చిత్య = నిశ్చయించుకొని,

నిష్కామః=నిష్కాముడగు పురుషుడు, కిం=దేనిని, విజానాతి = తెలిసికొనుచున్నాడు, కిం బ్రూతే = ఏమి చెప్పుచున్నాడు? కిం కరోతి = ఏమి చేయుచున్నాడు?

**ఆత్మానుభవ స్థితుడయి తాను బ్రహ్మముకంటే వేరుకాదనీ, సృష్టి ఉండడమూ లేకపోవడమూ కూడా తన భావాలేననీ దృఢంగా తెలిసిన జ్ఞానికి కోరికలే ఉండవు. ఇక అతడు తెలుసుకోవలసిన దేమిటి? చెయ్యవలసిన దేమిటి? చెప్పవలసినదేమి ఉంటుంది?**

"భావా-అభావౌ" అన్న పదం శీతోష్ణాలు, కష్టసుఖాలు, మంచిచెడ్డలు, మొదలైన సమస్త ద్వంద్వాలను సూచించడానికి వాడబడింది. నానాత్వమయ మయిన ఈ మహావిశ్వమంతా ద్వంద్వాలతోనే తెలియబడుతుంది. తెలియబడే సర్వజగత్తు భావాలైతే, అభావమే తన స్వరూపం. అభావమంటే భావరహిత నిశ్చలస్థితి. అదే చైతన్యస్వరూపమయిన ఆత్మ. భావాభావౌ అన్న పదప్రయోగం భావాలుగా వ్యక్తమయే సర్వచరాచర జగత్తును అభావమయిన తనను కూడ సూచిస్తూ అనంతభావార్థ గంభీరతేజంతో పరిపూర్ణత్వాన్ని నిరూపిస్తోంది. ఎన్ని ద్వంద్వాలు కనబడినా ఉన్నది ఒకటే అనే అర్థం నిగూఢంగా ధ్వనిస్తోంది. అందుకే వేదాంతంలో ఈ పదప్రయోగం బహుళ వ్యాప్తిలో ఉంది.

సమస్త ద్వంద్వాలు కూడా మనోబుద్ధులచే వ్యక్తపరుపబడిన భావాలు మాత్రమే! శాంతస్వరూపమైన ఆత్మమీద, అశాంతితో నిండిన మనస్సు ఆరోపించిన భ్రమలు మాత్రమే అవి! ఆత్మలో జాగృతుడైన జ్ఞానిలో ఈ భ్రమలన్నీ నశించి పోతాయి. స్తంభాన్ని గుర్తించిన తరువాత భూతభ్రమ ఇంకా కొనసాగి భయ పెట్టగలదా?

మనస్సు నధిగమించడంతో సర్వకోరికలు నశిస్తున్నాయి. అట్టి జ్ఞానిలో అహంకారంగానీ కర్మలు గానీ ఎలా ఉండగలవు? శరీరము మనస్సు బుద్ధి అనే మూడు ఉపాధులను అధిగమించినప్పుడే ఆత్మానుభవం లక్ష్యమౌతుంది. అందుకే గురువుగారు ఇలా అడుగుతున్నారు---"కోరికలు లేనట్టి జ్ఞాని దేనిని తెలుసుకోవాలనుకుంటాడు?" "ఏమి చెప్పగలడు" ఏ పనిని చెయ్యాలను కుంటాడు? ఇక్కడ తెలుసుకోవాలనుకోవడం బుద్ధిలక్షణం, చెప్పడం మనస్సుకు చెందినది. చెయ్యడం శారీరిక ధర్మం. ఈ మూడింటినీ భావాలుగా తెలుసుకుని, భ్రమను వీడి, అధిగమించి, నిశ్చలమైన ఆత్మతత్వంలో నిష్ఠుడయిన జ్ఞానిలో కర్తృత్వ భోక్తృత్వ భావాలరూపమయిన అహంకారం ఉండనేరదు.

ఈ స్థితినే పూర్వం ఒక మహర్షి ఇలా కీర్తించినారు.

శుద్ధోముక్తః సదైవాత్మా న వై బద్ధ్యేతకర్హిచిత్
బంధమోక్షౌ మనఃసంస్థౌ తస్మిన్ భాంతే ప్రశామ్యతి.

*జీవన్ముక్తుడు మనస్సు నధిగమించి నిత్యమూ ఆత్మస్థితుడయే ఉంటాడు, అతనిని ఏదీ బంధించజాలదు. బంధమోక్ష భావాలు మనఃస్థితులు మాత్రమే. మనస్సే నిశ్చలమై నిశ్శబ్దమైన వానిలో వ్యక్తిత్వమంతా నశించే ఉంటుంది.*

**శ్లో॥ అయం సోऽహమయం నాహమితి క్షీణా వికల్పనాః ।**
**సర్వమాత్మేతి నిశ్చిత్య తూష్ణీభూతస్య యోగినః ॥9.**

**టీ॥** సర్వం = సమస్తమును, ఆత్మా = ఆత్మయే, ఇతి = ఇట్లని, నిశ్చిత్య = నిశ్చయించుకొని, తూష్ణీభూతస్య=ఉదాసీనముగా నున్న, యోగినః = యోగికి, అయం = వీడు, సః=వాడు, అహం = నేను, (అస్మి = అగుచున్నాను), అయం = వీడు, నాహం = నేనుకాను, ఇతి = ఈ ప్రకారమగు, వికల్పనాః = వికల్పనలు, క్షీణాః = క్షీణించి పోవుచున్నవి..

**సర్వమూ ఆత్మమాత్రమే అని నిశ్చయంగా తెలిసిన మౌని అయిన యోగిలో "ఇదే అది", "నేనే అది" "ఇది నేను కాదు" మొదలయిన భావాలేవీ ఉండనే ఉండవు.**

అనంతమైన ఆత్మమాత్రమే అంతటా అన్నిటిలోనూ స్థిరంగా ఉందని రెండవదేదీ లేదని దృఢజ్ఞానం కలిగిన యోగి మనస్సులో మెదిలే ఆలోచనలన్నీ ఆగిపోతాయి. "మనశ్శరీరాలే నేను" అని కాని, "మనశ్శరీరాలు నేను కాదు" అనికాని, "ఆత్మనే నేను" అనే భావం కాని. అన్నీ సిద్ధాంతరూపమయిన ఆలోచనలుగా మనస్సులో కదులుతూ ఉంటాయి. బుద్ధి దృష్టితో చూసినా ఈ రకమైన ఆలోచనలన్నీ సత్యాన్ని చాలాదగ్గరగా అంచనావేయగల ఊహలు మాత్రమే. ఆత్మానుభవంలో స్థితుడయి జీవించడమంటే అటువంటి మానసిక కల్పనలన్నిటినీ ఆపు చెయ్యాలి. బుద్ధితో ఎంతో విలువైనవిగా భావించే భావాలను విడనాడాలి. అప్పుడు మాత్రమే మనస్సు నిశ్చలం అయి భావాలతరంగ కల్లోలము అణగడంతో సత్ చిత్ ఆనందమయమైన ఆత్మ స్వయంగా స్ఫురిస్తుంది, జీవన్ముక్తులయిన జ్ఞానులు ఆ నిశ్చలయిన ఆత్మానుభవాన్ని స్వయంగా నిత్యమూ తానుగా తెలుసుకుంటూ ఉంటారు.

జీవన్ముక్తునిలో భావనాతరంగాల కల్లోలాలూ వాటితో తాదాత్మ్యము ఉండవు. సదా నిశ్చలచిత్తంతో సర్వభావాల్లకు కారణమయిన చైతన్యమయ మయిన ఆత్మమాత్రమే తాననీ, జ్వలించే జ్వాలనుండి నిప్పురవ్వలు పైకి లేచి కొంతకాలం కనిపించి అదృశ్యమయేటట్లుగా భావాలు కదలి, నిజమనే భ్రమ గొల్పి, అదృశ్యమయిపోతూ ఉంటాయనీ తెలుసుకుంటూ ఉన్నదంతా తానే అనే దృఢజ్ఞానంతో ఆనందంగా జీవిస్తాడు. నామరూపాలతో వేరుగా తెలియబడుతున్నా నిప్పురవ్వలు జ్వాలలో భాగమే. అదేవిధంగా జగత్తంతా నామరూపాలతో భావా లుగా తెలియబడుతున్నా చైతన్యంనుండి భిన్నం కాదు.

శ్లో॥ న విక్షేపో న చైకాగ్ర్యం నాతిబోధో న మూఢతా ।
న సుఖం న చ వా దుఃఖం ఉపశాన్తస్య యోగినః॥10.

టీ॥ ఉపశాన్తస్య = ఉపశాంత నొందిన, యోగినః = యోగికి, న విక్షేపః = విక్షేపము లేదు, న ఏకాగ్ర్యం = ఏకాగ్రతలేదు, న అతిబోధః = బోధయు లేదు, న మూఢతా = మూఢత్వము లేదు, న సుఖం = సుఖములేదు, న దుఃఖం = దుఃఖము లేదు.

శాంతిస్థితినందిన యోగిలో భావాల కల్లోలం ఉండదు. కాబట్టి మానసిక ఏకాగ్రత నభ్యసించవలసిన అవసరం ఉండదు. జ్ఞానం అధికమగుటయు లేదు. అజ్ఞానముకూడ ఉండదు. అతనికి సుఖదుఃఖాలే ఉండవు.

పరిమితమయిన మనోబుద్ధులే తాననే భ్రమనుండి విడివడిన జీవన్ముక్తునిలో శాంతస్థితి ఉంటుంది. ఆ శాంతంలో భావసంచలనరూప మయిన జ్ఞానాజ్ఞానాలూ, రాగద్వేషాది భావాలూ, కష్టసుఖానుభవ భావాలూ జనించి బాధించజాలవు. మానసిక కల్లోలాన్ని విక్షేపమనీ, తన్నివారణార్థం ప్రయత్నించడాన్ని ఏకాగ్రత అనీ అంటారు. బుద్ధిలోని ఏకాగ్రతతో మానసిక సంచలనాన్ని జయించవచ్చు. జ్ఞానంతో ప్రకాశించడమూ అజ్ఞానంతో తెలియ లేక పోవడమూ బుద్ధియొక్క స్థితులు, కష్టసుఖాలు మనోమాలిన్య రూప విక్షేపాలు. ఈ సర్వభావాలూ వాటి స్థితులూ జీవన్ముక్తుని శాంతహృదయంలో ఎట్టి భావసంచనల రూప జంఝామారుతాలనూ కల్పించజాలవు. క్రీస్తు చెప్పినట్టుగా "బుద్ధికి అందని పరమ శాంతస్థితి"ని జ్ఞాని సదా అనుభవిస్తూ ఉంటాడు.

శ్లో॥ స్వరాజ్యే భైక్ష్యవృత్తౌ చ లాభాలాభే జనే వనే ।
నిర్వికల్ప స్వభావస్య న విశేషోఽస్తి యోగినః ॥ 11.

టీ॥ స్వరాజ్యే = స్వయముగా రాజ్యభోగము లనుభవించుట యందుగాని, భైక్ష్య వృత్తౌ = భిక్షా వృత్తియందుగాని, లాభాలాభే = లాభలాభములయందుగాని, జనే = జనమధ్యమందుగాని, వనే = వనమధ్యమునందుగాని, నిర్వికల్ప స్వభావస్య = వికల్పరహితమైన స్వభావముగల, యోగినః = యోగికి, విశేషః = విశేషము, నాస్తి = లేదు.

**సర్వభోగాలైన భిక్షాటనమయినా, లాభనష్టాలలోనయినా, సమాజ మధ్యంలోనయినా, ఏకాంతంగ అడవిలోనైనా, కోరికలనబడే సుడిగుండాల బారినుండి ముక్తుడయిన యోగి సదా సమత్వ బుద్ధితో శాంతంగా జీవించ గలడు.**

జీవన్ముక్తుని అంతరంగం నిత్య శాంతస్థితిలో ఉండడం క్రిందటి శ్లోకం లో వివరింపబడింది. జ్ఞానికూడా మనవలెనే కల్లోలమయమయిన ఈ ప్రపంచంలో దేహానికి ప్రారబ్ధం ఉన్నంతవరకూ జీవించవలసిందే అనే విషయం మనందరికి తెలిసింగే. బాహ్యప్రపంచంలోని అనేకవేల సంఘటనలు మన అంతరంగ శాంతిని ఛిన్నా భిన్నం చేస్తాయన్నది కూడా మనందరికి అనుభవంలోనిదే. అయితే ఈ బాహ్యసంఘటనలూ పరిస్థితులూ జ్ఞాని అంతరంగాన్ని రేఖామాత్రంగా నయినా స్పృశించజాలవని అష్టావక్ర మహర్షి ఈశ్లోకంలో సుస్పష్టం చేస్తున్నారు. సర్వకాల సర్వావస్థలలోనూ జ్ఞాని అంతరంగం శాంతినిలయమే.

స్వర్గ సమాన భోగాలలో అతడు తేలియాడినా, బీదరికమూ బాధలతో భిక్షాటనమే చేయవలసి వచ్చినా, జ్ఞాని అంతరంగం సదా సమత్వంతో శాంతంగా ఉంటుంది. అతనికి లాభనష్టాలు రెండు సంఘటనలు మాత్రమే, వాటివల్ల అతనికి ఎటువంటి సంతోష విచారాలూ కలుగవు. ప్రాపంచిక విషయాలలో లాభం వచ్చి నందువల్ల అతనికి కొత్తగా లాభించేదేదీ ఉండదు, ఇదే విధంగా బాహ్యంగా నష్టం సంభవించినందువల్ల అతని ఆత్మానుభవం నష్టమూ కాదు.

సుఖసంతోషాలతో నిండిన స్నేహితులూ బంధువులూ మధ్య పట్టణ వాసమైనా, అడవిలో ఒంటరి జీవితమైనా అతనికి సమానమే----సదా అతడు కేవలమైన ఆత్మనే నేను అనే అనుభవంలోనే ఉంటాడు. మానసిక కల్లోలాన్నీ

కోరికలనూ అధిగమించి ముక్తుడయిన కారణంగా అతనిలో అహంకారం ఉండ జాలదు, అహంకారం లేకపోవడంతో మనోబుద్ధులలో తాదాత్మ్యమూ ఉండదు. కాబట్టి బాహ్యప్రపంచం అతని మనశ్శరీరాలను ఎంతగా బాధించినా అతడు అసంగంగా శాంతంగా ఉండగలుగుతాడు.

అజ్ఞానంతో భ్రమలతో బాధలతో దుర్భరమైన జీవితాన్ని క్రిమికీటకాల వలె గడిపే మనముండే నేలపైనే మహర్షుల పాదములు ఉన్నప్పటికీ వారి హృదయం మాత్రం నిత్యమూ ఆత్మానుభవస్థితమయి అపారమైన శాంతి సాగరమై భాసిస్తూ ఉంటుంది.

**శ్లో॥ క్వ ధర్మః క్వ చ వా కామః క్వ చార్థః క్వ వివేకతా ।**
**ఇదం కృతమిదం నేతి ద్వంద్వైర్ముక్తస్య యోగినః॥12.**

టీ॥ ఇదం = ఇది, కృతం = చేయబడినది, ఇదం = ఇది, న కృతం = చేయ బడలేదు, ఇతి=ఈ ప్రకారమగు, ద్వంద్వైః = ద్వంద్వములచేత, ముక్తస్య = ముక్తుడైన, యోగినః = యోగికి, ధర్మః = ధర్మము, క్వ = యెక్కడ, వా = మఱియు, కామః = కామము, క్వ = ఎక్కడ, అర్థః = అర్థము, క్వ = ఎక్కడ, వివేకతా = వివేకము, (విచారము), క్వ = ఎక్కడ?

**విధినిషేధరూపమైన ద్వంద్వభావాలను అధిగమించిన యోగికి ఆచరించవలసిన ధర్మం ఏముంటుంది? ఆర్థిక లాభానికి అర్థం ఏమిటి? కామ ప్రభావం ఏవిధంగా ఉంటుంది? వివేకానికి అర్థమూ ప్రయోజనం ఏమిటి?**

విషయి-విషయ రూపంగా పరస్పరాధారభూతంగా తెలియబడే ప్రపంచం ఉన్నప్పుడు మాత్రమే తెలుసుకునే అహంకారం పనిచేస్తుంది. బాహ్యవస్తు మయ ప్రపంచంనుండి సుఖాన్ని ఆశించినప్పుడే "ఇది చెయ్యవలసినది" అనే భావాలు యేర్పడతాయి. అహంకార వర్జితుడయిన జ్ఞానిలో భ్రమాజన్యాలయిన ఈ ద్వంద్వాలేవీ సంచలనం కలిగించజాలవు. పరమ పురుషార్థమనదగిన ముక్త స్థితినే సాధించిన అట్టి వ్యక్తిలో, జీవనయాత్రలోని మజిలీలనదగిన ధర్మ, అర్థ, కామ మోక్షాలనబడే పురుషార్థాల అర్థమూ ప్రయోజనమూ ఏముంటుంది?

సాధారణంగా మానవులు తమ మనశ్శరీరాల కోరికల కనుగుణంగా బుద్ధిలోని విలువలను మలచుకొని ప్రవర్తిస్తూ ఉంటారు. తాత్కాలిక సుఖాల నాశించే మనశ్శరీరాలు దూరదృష్టి కలిగిన బుద్ధిపై తిరుగుబాటు చేసయినాసరే

తమ కోరికల కనువైన వస్తువులను సంపాదించాలనుకుంటాయి. ఇటువంటి మనస్సులోని కోరికల ఉద్ధృతితగ్గి శాంతించినప్పుడు బుద్ధి తన సహజగుణ మయిన వివేకాన్ని పునరుద్ధరించి సక్రమమైన నిర్ణయాలను తీసుకోగలుగుతుంది. అట్టి స్థితిలో బుద్ధి వివేకాల ప్రతిభనూ ప్రయోజనాన్నీ గుర్తించిన మనస్సు మనో. వ్యథ చెందక మానదు! ఈ విధంగా బుద్ధియొక్క ఆధిక్యతను గుర్తించి తన గత ప్రవర్తనకు పరితపించే మనస్స్వభావాన్నే "అంతరాత్మ ప్రబోధం" అని అంటారు.

సంస్కృతీ సభ్యతాకలిగి విద్యాధికులందరికీ ఈ స్థితి అనుభవైక వేద్యమే, బుద్ధి విలువను గుర్తించి మనస్సును మందలించుకోవడం మన మంద రమూ ఎప్పుడో ఒకప్పుడైనా చేసే ఉంటాము. జ్ఞాని తన ఉపకరణాలయిన శరీరాన్నీ మనోబుద్ధులనూ అధిగమించి స్వస్థితిలో ఉండడంచేత ఈ భావసంచ లనరూప పరితాపం అతనిలో ఉండజాలదు. అందుకే "అంతవరకు చేసిన వాటిపై "గాని "చెయ్యలేకపోయిన వాటిపై"గాని అతనికి విచారభావం ఉదయించదు. ఇక్కడ వాడబడిన "వివేకిత" అనే పదం అర్థగంభీరంలో అనన్య సామాన్యమైనది.

శ్లో॥ కృత్యం కిమపి నైవాస్తి న కాఽపి హృది రంజనా ।
యథా జీవన మేవేహ జీవన్ముక్తస్య యోగినః ॥ 13.

టీ॥ జీవన్ముక్తస్య = జీవన్ముక్తుడగు, యోగినః = యోగికి, కృత్యం = చేయ దగిన కార్యము, కిమపి = కొంచెమైనను, న ఏవ అస్తి = లేనేలేదు, హృది = హృదయమునందు, కా అపి = ఎటువంటియు, రంజనా = అనురాగము, న = లేదు, ఇహ = ఈ ప్రపంచంలో, యథా = ఏ ప్రకారము, జీవనం = జీవనము అగుచున్నదో, (అంతమాత్రము భోగానుభవం చేయుచున్నాడు).

**జీవన్ముక్తుడయిన జ్ఞాని ఆచరించవలసిన ధర్మమేదీలేదు. దేనిపైనా అతనికి ప్రత్యేకమైన యిష్టమూ ఉండదు. అతని ప్రారబ్ధాన్ని అనుసరించి అతని సర్వకర్మలూ వ్యక్తమవుతూ ఉంటాయి.**

ఆత్మానుభవస్థితిలోకి జాగృతుడయిన జ్ఞానిలో అహంకారం నశిస్తుంది, అందుచేత అతనిలో "నేను" అనే భావంకాని "నాది" అనే భావం కాని ఉండ నేరవు, ఈ భావాలులేని కారణంగా అతనిలో విషయాసక్తి ఉండదు, విషయాసక్తి లేకపోవడంతో వస్తువులను సంపాదించి భద్రపరచాలనుకోడు. సాధారణంగా కోరికలు కలవాడే వస్తువులను సంపాదించి స్వంతం చేసుకోవాలనుకుంటాడు. జ్ఞానిలో ఇటువంటి భావాలేవీ ఉండవు.

జ్ఞాని మహోన్నతమైన ఆత్మానుభవంలో సమాధిస్థితుడయి ఉండడం క్రిందటి శ్లోకంలో వర్ణించబడింది. జీవన్ముక్తుడు సమాజంలో వ్యవహరిస్తూ ఇతరులచే ఎలా గుర్తింపబడేదీ ఈ శ్లోకంలో వివరింపబడుతోంది. జీవన్ముక్తుడు కూడా శరీరం ఉన్నంతవరకూ కర్మలను చేస్తూ ఉండడాన్ని మనం చూస్తూనే ఉంటాం. జ్ఞాని తనకు ప్రాప్తించిన ఏ పనినయినా శాంతంగా చేస్తూ ఉంటాడు. ఎటువంటి జీవితం లభించినా ప్రసాదబుద్ధితో స్వీకరిస్తూ ఉంటాడు.

సామాన్యుడు ఏదో ఒక ప్రత్యేకమయిన పనినీ, ప్రత్యేక జీవిత విధానాన్నీ కోరుకోకుండా ఉండలేడు. అలా ఎన్నుకుని లభ్యమవాలని ప్రయత్నమూ చేస్తాడు. జ్ఞాని ఈ విషయంలో అసామాన్యుడు! అతడు దేనినీ ఎన్నుకోడు. దేనినీ కోరడు. దేనికోసమూ ప్రయత్నించడు. అతడు జీవితాన్ని సంతోషంగా జీవించడం మాత్రమే చేస్తాడు. జీవితాన్ని క్రీడగా వీక్షిస్తాడు.

అతడు కోరకుండా ప్రాప్తించిన ఏ పనినయినా హాయిగా చేస్తాడు. అదృష్టవశాత్తు సంప్రాప్తమయిన జీవితమేదయినా చింతనందడు! అన్ని సమయ సందర్భాలలోనూ, అన్ని రకాల మనుష్యులమధ్యా, అంతటా ఎల్లప్పుడూ శాంతంగా ఆనందంగా తన్నుతాను అనంతమైన ఆత్మగా గుర్తిస్తూ జీవిస్తాడు. ప్రారబ్ధబలమే అతని జీవితాన్ని నడిపిస్తూ ఉంటుంది, అతడు సాక్షిగా చూస్తూ ఉంటాడు!

గత కర్మల ఫలం ఆధారంగా ఈ శరీరం రూపొందుతోంది. గతంలో చేసిన పుణ్యఫలాన్ననుభవించడమే కాదు, పాపఫలితాలయిన కష్టాలను కూడా అనుభవించడానికే ఈ ప్రపంచంలో శరీరం నిర్మింపబడింది. జీవన్ముక్తుడయిన జ్ఞాని తనకు ప్రాప్తమయిన సర్వకర్మలనూ సమర్థవంతంగా నిర్వహిస్తూనే అకర్తగా ఉంటాడు. ఆ కర్మలన్నిటికీ అతడు కేవలం సాక్షి మాత్రమే! అందుకే జ్ఞానిది "యథాజీవనం" అనబడింది.

అజ్ఞానులమయిన మన దృష్టితో జ్ఞానికూడా మనవలెనే కర్మలను చేస్తూ ఉండడాన్ని గుర్తిస్తాము, ఈ దృష్టికి అర్థం అవడానికి మాత్రమే ఈ వర్ణన ఉపయోగపడుతుంది. జ్ఞాని మాత్రం సదా తన్ను తాను ఆత్మగా గుర్తిస్తూ కేవలంగా ఉంటాడు. అతనిలో అన్ని కర్మలూ జరగబడుతూ ఉంటాయి. తన శరీరం అనుభవించే సర్వానుభవాలను తానే సాక్షిగా చూస్తూ ఉంటాడు! దేనితోనూ అతనికి ప్రమేయమే ఉండదు.

శ్లో॥క్వ మోహః క్వ చ వా విశ్వం క్వ తద్ధ్యానం క్వ ముక్తతా।
సర్వసంకల్ప సీమాయం విశ్రాన్తస్య మహాత్మనః ॥ 14.

టీ॥ సర్వసంకల్పసీమాయాం = సర్వసంకల్పములు రహితమగు స్థానమునందు, విశ్రాన్తస్య = విశ్రాంతుడగు, యోగినః = యోగియగు, మహాత్మనః = మహాత్మునకు, మోహః = మోహము, క్వ = ఎక్కడ, విశ్వం = ప్రపంచము, క్వ = ఎక్కడ, తత్ = ఆ ప్రసిద్ధమైన, ధ్యానం = ధ్యానము, క్వ = ఎక్కడ, ముక్తతా = మోక్షము నొందుట, క్వ = ఎక్కడ?

**భ్రమ మోహం ఎక్కడ ఉన్నాయి? విశ్వం ఏది? దీన్ని త్యజించడం ఏమిటి? కోరికల కల్లోలాన్ని జయించి శాంతమనస్కుడైన మౌనికి ముక్తి మాత్రం ఎందుకు?**

ఆత్మగురించి తెలియని "అజ్ఞానమే" నానాత్వమయమయిన ప్రపంచ భ్రమాదృశ్యానికి కారణం. ఆత్మానుభవస్థితుడయిన మహాత్మునిలో భ్రమ ఉండ జాలదు. తనకంటే భిన్నమయిన విశాల విశ్వమే అతనికి గోచరించదు. అద్వయంగా తాను మాత్రమే ఉన్నానని తెలుసుకుంటూ ఉంటాడు. వస్తుమయ ప్రపంచాన్నే అతను గుర్తించనప్పుడు త్యజించవలసిన దేముంటుంది? ఉద్రేకాలకు కోరికలకు అతీతమయిన శాంతస్వరూపంగా అతడు జీవిస్తూ ఉంటాడు.

శ్లో॥ యేన విశ్వమిదం దృష్టం స నాస్తీతి కరోతు వై ।
నిర్వాసనః కిం కురుతే పశ్యన్నపి న పశ్యతి ॥ 15.

టీ॥ యేన = ఎవనిచేత, ఇదం = ఈ, విశ్వం = ప్రపంచము, దృష్టం = చూడబడినదో, సః = ఆ ప్రపంచము, నాస్తీతి = లేదు అని, నిశ్చిత్య = నిశ్చయించి, కరోతు = చేయబడుగాక, నిర్వాసనః = వాసనారహితుడగు యోగి, కిం కురుతే = ఏమి చేయుచున్నాడు, సః=అతడు, పశ్యన్నపి = చూచుచున్నవాడైనను, న పశ్యతి = చూచుటలేదు.

**ప్రపంచాన్ని కోరికలతోనిండిన మనస్సుతో చూస్తున్న వ్యక్తి మార్చాలనుకుంటాడు. కోరికలేలేని జ్ఞానికి ఏ భావం ఉంటుంది? అతడు చూస్తూనే ఉన్నా చూడనట్లే.**

వ్యక్తిగతమయిన అహంకారమే శరీరం, మనస్సు, బుద్ధులతో తాదాత్మ్యం చెంది వాటిద్వారా వస్తువులను మానసిక ఉద్రేకాలను కోరికలను, బుద్ధిలోని భావాలను గుర్తిస్తూ ఉంటుంది. అనుభవించే విషయి ఉన్నపుడు,

అనుభవింపబడే సుఖదుఃఖ మిళితమయిన విషయమయ ప్రపంచం కూడా ఉంటుంది. అహంకారం గుర్తిస్తున్నంతసేపూ మనోబుద్ధులతో గుర్తింపబడే నామ రూపాత్మక ప్రపంచమే కనిపిస్తూ ఉంటుంది. ఈ స్థితితో చూస్తే మనచే చూడబడే అనుభవింపబడే ప్రపంచంపు సత్యత్వాన్ని ఒప్పుకుని తీరవలసి ఉంటుంది. మన ప్రస్తుత స్థితికీ దృష్టికీ, అనంతమూ అద్వయమూ అయిన ఆత్మతత్త్వం అందడం అసాధ్యమే. భ్రమకులోనై ఉన్నంతసేపూ భూతమే కనిపిస్తుంది కానీ స్తంభం ఉండనే ఉండదు! భూతాన్నిచూడడం భ్రమవల్లనే అని తెలుసుకుని స్తంభాన్ని చూడాలనుకునేవారు భూతం ఉందనే దృష్టినిమార్పుచేసుకోవాలి. స్తంభాన్ని చూస్తున్నపుడు భూతం కనిపించనే కనిపించదు. ఇదేవిధంగా ఆత్మనే సర్వంగా చూస్తున్న జ్ఞానికి ప్రపంచం కనిపించదు.

వాసనారహితుడయిన జ్ఞానిలో ప్రపంచాన్ని చూసే అహంకార రూపమయిన జీవభావం ఉండదు. అహంకారం అదృశ్యం అవగానే ఆత్మ స్వయం జ్యోతిగా ప్రకాశిస్తుంది. చీకటి పోయిందంటే వెలుగు మాత్రమే మిగిలి ఉంటుంది. ఆత్మలోనికి జాగృతుడయిన యోగికి సర్వత్రా ఆత్మవినా రెండవ దేదీ గోచరించదు.

చూడడం అనే కర్మ కనులద్వారా సాధ్యమవుతుంది. జ్ఞానికూడా మన వలెనే వస్తుమయ ప్రపంచాన్ని కనులతో చూస్తాడు. అయినా కష్టసుఖాలతో ఆకర్షణతో మనస్సును అల్లకల్లోలం చేసే మన సామాన్య ప్రపంచం అతనికి గోచరించదు. బాధమయంగా నిరాశపూరితంగా భయంకరంగా మనకు కనిపించే ప్రపంచం అతనికి గోచరించదు. సర్వత్రా అతనికి శాంతపూర్ణయిన ఆత్మతత్త్వమే గోచరిస్తుంది. అందులో నామరూపాలు, సుఖదుఃఖాలు ఏవీ ఉండవు. దీర్ఘస్వప్నం నుండి అతడు జాగృతుడయినాడు.

అజ్ఞానంతో మనం ప్రపంచాన్ని చూస్తూ నిజంగా ఉందని భ్రమపడుతూ ఉంటాం. యోగికూడా తన చక్షువులతో ప్రపంచాన్ని చూస్తూ ఉన్నా అది మిథ్య అనీ, భ్రమ అనీ, దృఢమైన జ్ఞానం కలిగి ఉంటాడు. ఈ కనిపించే సృష్టి అంతా ఆకాశహర్మ్యంవలె, ఎండమావులలోని జలంవలె,ఇంద్రజాలంవలె తాత్కాలికంగా ఉన్నట్టు భ్రమకలిగిస్తోందని అతనికి నిశ్చయంగా తెలుస్తుంది. మన వలెనే, మన మధ్యనే జీవిస్తున్నా జ్ఞాని తన అనుభవంతో జీవితాన్నీ ప్రపంచాన్నీ సరిగ్గా గుర్తించగలుగుతాడు.

**శ్లో॥యేన దృష్టం పరంబ్రహ్మ సోऽహం బ్రహ్మేతి చిన్తయేత్ ।**
**కిం చిన్తయతి నిశ్చిన్తో ద్వితీయం యో న పశ్యతి ॥ 16.**

**టీ॥** యేన = ఎవనిచేత, పరంబ్రహ్మ = పరబ్రహ్మము, దృష్టం = చూడబడినదో, సః = వాడు, అహం = నేను, బ్రహ్మ = ఆ పరబ్రహ్మమును, ఇతి = ఇట్లని, (ఈ ప్రకారము), చిన్తయేత్ = చింతించవలయును, యః = ఎవడు చూడడో, సః = వాడు, కిం = దేనిని, చిన్తయతి = చింతించుచున్నాడు.

**పరబ్రహ్మ స్వరూపాన్ని (బుద్ధితో) చూసినవాడు, "నేనే బ్రహాన్ని" అని నిత్యమూ ధ్యానిస్తాడు. భావాతీతమూ అద్వయమూ అయిన ఆత్మలో స్థితుడయిన జ్ఞాని దేనినయినా ఎలా ధ్యానిస్తాడు? ఎందుకు ధ్యానిస్తాడు?**

ధ్యాననిష్ఠులయిన వారిలో చివరగా ఉండే రెండు దశలలోని అతి సూక్ష్మమయిన తేడాను వివరిస్తున్నారిక్కడ మహర్షులు. దృఢమయిన దీక్షతో శాస్త్రాన్ని అధ్యయనం చేసి దానిని చక్కగా మధించి మననం చేసి, సారాన్ని గ్రహించిన సాధకుడు ఈ కనిపించే జగత్తంతా నామరూపాలతో బుద్ధిలో తెలియ బడుతూ నిజమనే భ్రమని కలిగిస్తోందనీ, ఏకమూ అద్వయమూ సత్ చిత్ ఆనంద స్వరూపమూ అయిన ఆత్మమాత్రమే ఉందనీ, బుద్ధితో నిశ్చయంగా తెలుసుకుంటాడు. "దృష్టం పరబ్రహ్మ"---పరబ్రహ్మస్వరూపాన్ని బుద్ధితో చూడ గలుగుతాడు. ఈ స్థితిలో ఉన్న సాధకుడు ఆ పరబ్రహ్మమే తానని (అహం బ్రహ్మాస్మి అని) ధ్యానిస్తాడు. ఏకాగ్రమయిన బుద్ధితో ఏకమయిన ఆలోచనతో తాదాత్మ్యంచెంది తన ఉపాధుల బంధంనుండి విడివడి ఆలోచనే తానుగా అఖండా కార వృత్తిలో స్థిరంగా నిలవగులుగుతాడు. ఈస్థితిని సవికల్పసమాధి అంటారు.

ఈ విధంగా కొంతకాలం అభ్యసించగా అహంకారం అంతరించగా సాధకుడు ఆత్మానుభవంలోకి జాగృతుడవుతాడు. తన భావాలనూ బుద్ధినీ అధిగమించి అద్వయమయిన ఆత్మగా మిగిలిపోతాడు. చైతన్య స్వరూపమే తానుగా నిలిచిన జ్ఞాని దేనిని ధ్యానించాలి? అని అష్టావక్రులనడం ఎంతో సమంజసంగా ఉంది, అతనికి ధ్యానంతో అవసరమే లేదు.

నిద్రవచ్చేదాకా మనం నిద్రకోసం ప్రయత్నించడం అర్థవంతంగా ఉంది, కాని నిద్రపోయాక నిద్రకోసం ప్రయత్నం ఏమిటి? ప్రయత్నించేదెవరు? దేని కోసం? గమ్యం చేరగానే యాత్ర అంతమయిపోతుంది. ఆత్మానుభవంతో ధ్యానలక్ష్యం సిద్ధిస్తుంది. ధ్యానించేవాడూ ధ్యేయమూ ఒక్కటే అయిపోతాయి.

పరమోత్కృష్టమయిన ఈ అనుభవంతో అహంకారం తన భ్రమలతో సహా అంతరిస్తుంది. అహంకారం అహంగా సర్వభూతాత్మగా సర్వంగా తన్ను తాను తెలుసుకుంటుంది.

అట్టి పరమపురుషుని కీర్తిస్తూ ఆచార్యశంకరులు వివేక చూడామణిలో ఇలా అంటున్నారు.

లక్ష్యా లక్ష్యగతిం త్యక్త్వా యస్తిష్ఠేత్కేవలాత్మనా
శివ ఏవ స్వయం సాక్షాత్ అయం బ్రహ్మ విదుత్తమః.
(వివేకచూడామణి-553)

*ఇది లక్ష్యము, ఇది అలక్ష్యము అనే శంకలనూ తర్కాలనూ వీడి శాంతుడై కేవలాత్మగా నివసించే జ్ఞాని సాక్షాత్తూ శివస్వరూపుడై బ్రహ్మస్వరూపాన్ని అతనికంటే తెలిసిన వారెవరూ ఉండరు.*

## శ్లో॥ దృష్టో యేనాత్మ విక్షేపో నిరోధం కురుతే త్వసౌ ।
## ఉదారస్తు న విక్షిప్తః సాధ్యాభావాత్కరోత కిమ్ ॥ 17.

టీ॥ యేన = ఎవనిచేత, ఆత్మవిక్షేపః = ఆత్మవిక్షేపము, దృష్టః = చూడబడుచున్నదో, అసౌ = ఇతడు, నిరోధం = విక్షేపనిరోధమును, కురుతే = చేయుచున్నాడు, తు = అయితే, ఉదారః = త్యాగపురుషుడగు జ్ఞాని, విక్షిప్తరహితః = విక్షేపరహితుడు, (అత ఏవ = ఇందువలననే), సాధ్యాభావాత్ = సాధింపదగినది లేనికారణమున, సః = అతడు, కిం = దేనిని, కరోతి = చేయుచున్నాడు?

**కోరికలతో మనస్సు చలించి అశాంతిగా ఉంటే నిరోధించి శాంతిపజెయ్యాలి. కోరికలే లేని మహాత్ముడు చెయ్యవలసినది ఏముంటుంది?**

ఉన్నసత్యాన్ని సరిగ్గా చూడలేని మనస్సు ఊహా కల్పనలను చేస్తూ ఉంటుంది. ఆత్మ విషయమయిన అజ్ఞానమే అహంకారానికీ, అహంకారం చూసే ప్రపంచానికిని కారణమవుతోంది. పరిమితమైన అహంకారం అనేక విషయాలతో నిండిన జగత్తును చూస్తూ,సుఖానుభవాలవైపు ఆకర్షింపబడుతుంది. ఆత్మ ప్రాప్తికై ప్రయత్నించే సాధకుడు బాహ్యసుఖాల నన్వేషించే మనస్సును నిరోధించి శాంతింపజేసి ధ్యానానుకూలం చెయ్యవలసి ఉంటుంది. అసంపూర్ణమైనది పూర్ణత్వం కోసం ప్రయత్నించక తప్పదు, అశాంతితో నిండిన మనస్సు శాంతిని సాధించడానికి ప్రయత్నించాలి.

భావసంచలనంనుండి ముక్తుడై శాంతపూర్ణమయిన ఆత్మగా తన్ను

తాను తెలుసుకున్న జ్ఞాని సాధించవలసినదేదీ ఉండదు. అతడు చెయ్యవలసిన దేముంటుంది?అతడికి కొత్తగా లాభించేదేమిటి? సర్వవిషయాలూ నామరూపాలుగా, చైతన్యమయిన తనలో వర్తిస్తున్నాయని స్పష్టంగా చూస్తున్న యోగికి కోరికలతో నిండిన మనస్సు ఎలా ఉంటుంది? అమనస్కుడైన అతనిలో అహంకారం అదృశ్య మయిపోతుంది. తత్ఫలితమయిన ప్రపంచ దృశ్యంకూడా మాయమయి పోతుంది. అచలమైన ఆత్మగా కేవలంగా మిగిలిపోయిన జ్ఞానికి ధ్యానం అర్థరహితం.

శ్లో॥ ధీరో లోకవిపర్యస్తో వర్తమానోఽపి లోకవత్ ।
న సమాధిం న విక్షేపం న లేపం స్వస్య పశ్యతి ॥18.

టీ॥ ధీరః = జ్ఞాని, లోకవిపర్యస్తః = లోకమునకంటే వేరైనవాడై, (విక్షేపరహితుడై), లోకవత్ = లోకులవలె, వర్తమానః అపి = ఉంటున్నావాడైనను, స్వస్య = తనయొక్క, సమాధిం = సమాధిని గాని, విక్షేపం = విక్షేపమునుగాని, లేపం చ = బంధనముగాని, న పశ్యతి = చూడడు.

**ఆత్మనిష్ఠుడయిన ధీరుడు సామాన్య జనులవలె ప్రవర్తించినట్టు కనిపించినా అతడసామాన్యుడే. అతనికి సమాధికాని, మనస్సంచలనం కాని, విషయ లగ్నమానసంగానీ ఉండవు.**

ఆత్మదృష్టితో చరించే జ్ఞాని సామాన్యునివలెనే సర్వప్రపంచ వ్యవహా రాలూ నిర్వర్తిస్తాడు. జీవితంపట్లా ప్రపంచంపట్లా అతని దృక్పథం మాత్రం సామాన్యునికంటే ఎంతో భిన్నంగా ఉంటుంది. సామాన్యంగా మనకు ప్రాపంచిక విషయాలన్నీ నిజంగానూ, ఆత్మ తత్త్వం అనుమానస్పదంగానూ వేదాంత విజ్ఞానం యోచనా యోగ్యంగానూ అనిపిస్తుంది. ఆత్మానుభవ స్థితుడయిన యోగికి ఆత్మ మాత్రమే సర్వత్రా సత్యంగా గోచరిస్తుంది. ఆ అనుభవంలో అతడు జీవిస్తాడు. అతని దృష్టిలో ప్రాపంచిక విషయాలన్నీ మనః కల్పిత భావనలే.

సహజ సమాధి స్థితుడయిన యోగికి, అంతర్ముఖంగా సాధించవలసిన సమాధిగాని, అంతరంగ కల్లోల కారణమయిన విక్షేపంకానీ ఉండవు. మనస్సు నధిగమించిన భావరహిత శాంతస్థితిలో నిష్ఠుడై ఉండడమే అందుకు కారణం. విక్షేపమూ సమాధి మనఃస్థితులు మాత్రమే. నిష్కామంగా నిస్వార్థంగా కర్మల నాచరించడం వలన అతడు వాటిచే బంధింపబడడు. అహంకారంతో స్వార్థంతో చేసినపనులు మాత్రమే వాసనలుగా సామాన్యులను సంసార బంధంలో భ్రమింప జేస్తాయి. కర్మలనాచరిస్తున్నా నిత్యముక్తుడైన జ్ఞాని అసామాన్యుడే.

శ్లో॥ భావాభావ విహీనో యస్తృప్తో నిర్వాసనో బుధః ।
నైవ కించిత్కృతం తేన లోకదృష్ట్యా వికుర్వతా ॥ 19.

టీ॥ తృప్తః = తృప్తుడైన, యః = యే, బుధః = జ్ఞాని, భావాభావ విహీనః = భావా భావరహితుడై, నిర్వాసనః = వాసనారహితుడై, లోకదృష్ట్యా = లోకదృష్టిలో, వికుర్వతా అపి = చేయుచున్నవాడైనను, తేన = అతనిచేత, కించిదపి = కొంచెము గూడ, న కృతం = చేయబడుటలేదు.

భావనారూపమయిన సృష్టినీ తద్విరుద్ధమయిన అభావాన్నీ భావించకుండా నిత్యతృప్తుడై వాసనారహితుడైన జ్ఞాని ఎన్ని కర్మలను చేస్తున్నట్టు కనిపించినా నిజానికి అతను దేనినీ చెయ్యడంలేదు.

జీవన్ముక్తుడయిన జ్ఞాని క్షణం కూడా తీరికలేకుండా సమాజాన్ని సేవిస్తూ కర్మల నాచరించడాన్ని ప్రపంచం గుర్తించవచ్చు. అయినా అతడే పనిని చెయ్యడంలేదనే చెప్పాలి. సాధారణంగా కర్మ అంటే ఫలితం ఉండి తీరుతుంది. తత్ఫలితంగా సంసారచక్రం భ్రమిస్తూ ఉంటూంది. ఈ దృష్టితో చూస్తే జ్ఞాని కర్మలను చెయ్యడంలేదనే అనాలి. అతడి కర్మల ఫలితంగా అతడు సంసార చక్రంలో బంధింపబడడంలేదు.

అహంకారంతో మనంచేసే పనులన్నీ స్వసుఖం కాంక్షించేవిగా స్వార్థ పూరితంగా ఉంటాయి. కోరికతో చేసే పనులన్నీ వాసనలను సృష్టించి జన్మ కర్మవలయంలో బంధిస్తాయి. జీవన్ముక్తునిలో అహంకారంలేని కారణంగా కోరిక లుండవు. "తృప్తో నిర్వాసనో బుధః"---నిత్యతృప్తుడై వాసనారహితుడై అతడు కర్మలను చేయడంవలన అవి అతనిని బంధిచజాలవు.

"భావాభావ విహీనోయః"---భావనారూపమయిన సృష్టినీ, అభావ రూపమయిన అవ్యక్త వాసనలనూ కూడా త్యజించి నిత్యమూ ఆత్మగా తన్ను తాను తెలుసుకునేజ్ఞాని కర్మలను చేస్తున్నా చేయనట్టే. అతని కర్మలను స్వార్థ పూరిత మనికానీ, స్వార్థరహితమనికానీ అనలేము, అయినా కర్మలను చెయ్యడం చూస్తున్నాం. కాబట్టి వాటిని లీలామాత్రంగా ఆటగా భావించవచ్చు. స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలతో ప్రత్యేక తాదాత్మ్యాన్ని విడనాడిన అతని కర్మలతో అతనికి ఏవిధమయిన సంబంధమూ ఉండజాలదు. అయినా ఉపాధి ధర్మంగా ప్రారబ్ధానుగుణంగా అతనిచే జరుపబడే కర్మలు.లోకకల్యాణ కారణాలై అతనిలో లీలామాత్రంగా భాసిస్తాయి.

బాలుడు ఆటాలాడేటప్పుడు అతని బుద్ధినీ శారీరిక శ్రమనూ వినియోగించినా దానిని కర్మ అని పిలవలేము. ఆటలాడడం వలన బాలుడాశించే ఫలితంకాని, మానివేయడంలో కష్టంకాని అతనికుండవు. అతని శరీరంలోని సహజశక్తి ఆటగా మనకు కనిపిస్తుంది! ఇదే విధంగా జీవన్ముక్తుడు చేసే పనులన్నీ వ్యక్తమవుతున్నా లీలా మాత్రాలే. అతని కర్మల వెనుకగా ఎటువంటి కోరికా ఉండదు.

భగవద్గీతలో బోధింపబడిన అకర్మణ్యత్వానికి చక్కటి ఉదాహరణగా ఈ శ్లోకాలన్నీ భాసిస్తున్నాయి.

కర్మణ్యకర్మయః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః
సః బుద్ధిమాన్ మనుష్యేషు సః యుక్తః కృత్స్నకర్మకృత్.

(భగవద్గీత-418)

*కర్మలో అకర్మను, అకర్మలో కర్మను గుర్తించగలిగినవాడే తెలివైనవాడు. అతడే నిజమైన యోగి. అతడు మాత్రమే నిజంగా పనులను చక్కగా చెయ్యగలిగినవాడు.*

**శ్లో॥ప్రవృత్తౌ వా నివృత్తౌ వా నైవ ధీరస్య దుర్గ్రహః।**
**యదా యత్కర్తుమాయాతి తత్కృత్వా తిష్ఠతస్సుఖమ్॥20.**

టీ॥ యదా=ఎప్పుడు, యత్ = యత్కించిత్కర్మ, కర్తుం = చేయుటకు, ఆయాతి= వచ్చుచున్నదో, తత్ = దానిని, సుఖం = సుఖపూర్వకముగా, కృత్వా = చేసి, తిష్ఠతః = సమాధిస్థితుడైన, ధీరస్య = జ్ఞానికి, ప్రవృత్తౌ వా = ప్రవృత్తియందుగాని, నివృత్తౌ వా = నివృత్తియందుగాని, దుర్గ్రహః = దురాగ్రహము, న ఏవ = (ఒకప్పుడను) ఉండనే యుండదు.

**యథాప్రాప్తమయిన కర్మలను సంతోషంగా నిర్వర్తించే జ్ఞాని, కర్మలను, చెయ్యడంలోకాని మానడంలోగాని సుఖదుఃఖాలను పొందడు. నిత్య తృప్తుడై సుఖంగా జీవిస్తాడు.**

కర్మలను చెయ్యడంలో జ్ఞానికి కొత్తగా లాభించేదేమీ ఉండదు. మానేయడంలో అతనికి నష్టమూ కలగదు.

"నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి"---- ఇదివరకు నాచే *సాధింపబడనిది, నేను కొత్తగా సాధించవలసినది ఏదీలేదు, అయినా నేను కర్మలను చేస్తూనే ఉన్నాను. (భగవద్గీత 3-22)*

అయినా జ్ఞాని అనేకకర్మలతో నిత్యమూ సమాజాన్ని సేవిస్తూనే ఉంటాడు. కోరకుండా ప్రాప్తించిన కర్మలను దేశకాలానుగుణంగా, ఎక్కువమందికి ఉపయోగపడే విధంగా తన శక్తినంతటినీ ధారపోసి నిర్వర్తిస్తూ వాటిని తన ప్రారబ్ధంగా గుర్తిస్తూ జ్ఞాని శాంతంగా జీవిస్తాడని అష్టావక్రమహర్షి యిక్కడ స్పష్టం చేస్తున్నారు.

తన శరీరమూ మనోబుద్ధులూ వాటి వాటి క్షేత్రాలలో పనిచెయ్యడాన్ని మిగతా ప్రపంచంతోపాటుగా గుర్తిస్తూ తాను మాత్రం సదా శాంతుడై ఆత్మనిష్ఠుడై ఆనందంగా జ్ఞాని జీవిస్తుంటాడు. అద్వయమయిన ఆత్మ తత్త్వమై అంతటా ఉండడాన్ని గుర్తిస్తున్న జ్ఞానికర్మలు ఆ దివ్యతత్త్వానికి అనుగుణంగానే జరుగుతూ ఉంటాయి. అంతేకాని దివ్యతత్త్వానికి వ్యతిరేకంగా జరుగుటకు వీలులేనేలేదు.

పనులలో పూర్తిగా నిమగ్నమయిపోయి క్షణం తీరికలేకున్నా, ఏకాంతం లో విశ్రాంతిగా ఉన్నా, సదా శాంతంగా తృప్తిగా ఆనందంగా ఉండగలుగుతాడు. నేను కర్తననికానీ భోక్తనని కానీ అతడెన్నడూ భావించడు. అతనిలో అహం కారమే ఉండదు. సత్ చిత్ ఆనందమయుడైన ఆత్మగా అతడు సర్వదా భాసిస్తూ ఉంటే, ఆ ప్రకాశంలో అతని ఉపాధులు అవి చూసే ప్రపంచమూ కూడా పనిచేస్తూ ఉంటాయి.

శ్లో॥ నిర్వాసనో నిరాలంబః స్వచ్ఛందో ముక్త బన్ధనః ।
క్షిప్తః సంసారవాతేన చేష్టతే శుష్కపర్ణవత్ ॥ 21.

టీ॥ నిర్వాసనః=వాసనారహితుడును, నిరాలంబః=ఆలంబరహితుడును, స్వచ్ఛందః = స్వతంత్రుడును (స్వేచ్ఛాచారియు), ముక్తబంధనః = బంధన రహితుడను, (అగు జ్ఞాని), సంసార వాతేన = ప్రారబ్ధరూప వాయువుచేత, క్షిప్తః = ప్రేరేపించబడినవాడై, శుష్కపర్ణవత్ = ఎండుటాకువలె, చేష్టతే = చేయుచున్నాడు.

సంస్కారాలనబడే బలమైన వాయువులు వీచడం వలన ఎగిరే ఎండుటాకువలె జీవన్ముక్తుని జీవనయాత్ర సాగుతూ ఉంటుంది. కోరికల రూపమయిన బంధంలేకుండా స్వతంత్రంగా హాయిగా జీవిస్తాడు.

అనంతమైన ఆత్మస్వరూపాన్ని తనదిగా గుర్తించిన జ్ఞానికి అల్పమూ పరిమితమూ అయిన శరీరం మీద మమకారం నశించి తీరుతుంది. అసలా ప్రత్యేక భావనతో అతనికి అవసరమే ఉండదు. ఎండుటాకు చెట్టుయొక్క బంధం నుండి విడిపోయి గాలికి ఎలా కదులుతూ పోతుందో అదేవిధంగా జ్ఞాని దేహం

కూడా బంధంనుండి బయటపడి ప్రారబ్ధానుగుణంగా మిగిలి ఉన్న సంస్కారాల కనుగుణంగా కర్మల నాచరిస్తూ ఉంటుంది. ఆ కర్మలవల్ల కొత్త వాసనలేవీ యేర్పడవు. అతని మనస్సూ శరీరమూ కూడా సంసార వృక్షంనుండి రాలి పోయిన ఎండుటాకులవంటివే, అనంతమైన ఆత్మగా తన్ను తాను గుర్తించిన జ్ఞానికి వాటితే ఏ అవసరమూ ఉండదు.

చెట్టుకు బంధింపబడి ఉన్న ఆకుకంటే కూడా ఎక్కువగా కదులుతూ ఎగురుతూ గాలితోపాటుగా పోతూ ఉంటుంది ఎండుటాకు. అదేవిధంగా జ్ఞాని సామాన్యునికంటే అధికంగా శ్రమిస్తూ నిర్విరామంగా కృషిచేస్తున్నట్టు కనిపించ వచ్చు. అయినా ఆ కర్మలతనిని ఏ విధంగానూ బంధింపజాలవు. జీవన్ముక్తుని శరీరం పనిచేస్తున్నా, ఫలితాలనుపొంది అనుభవించే అహంకారం అతనిలో లేని కారణంగా కర్మఫలాలతనిని చెందజాలవు. ప్రారబ్ధం అనే గాలికి ఎగిరే ఎండు టాకువలె జ్ఞానియొక్క మనశ్శరీరాలు పనిచేస్తూ ఉంటాయని అష్టావక్ర మహర్షి చెప్పడంలో ఎంతో ఔచిత్యమూ అందమూ అర్థమూ కనిపిస్తున్నాయి.

గతంలో చేసిన కర్మలు దృఢమయిన వాసనలుగా ఏర్పడి ప్రస్తుత ఆలోచనా విధానాన్ని ప్రత్యేక పద్ధతిలో రూపొందించి వ్యక్తి జీవితాలను నడిపిస్తూ ఉంటాయి. అనేక జన్మలుగా పోగుచేసుకున్న వాసనలన్నీ వ్యక్తిత్వాన్ని నిర్మించి జీవితాన్ని నడిపిస్తాయి. వీనినే పూర్వజన్మ సంస్కారాలు అంటారు. ఒకయోగి ఏకాంతంలో సమాధిలో జీవితం గడపవచ్చు, మరొక యోగి పిచ్చివానివలె జీర్ణ వస్త్రాలు ధరించి దొరికినది తింటూ ఏ రోడ్డుప్రక్కనో నిద్రపోతూ జీవించవచ్చు, మరొక మహాత్ముడు సమాజాన్ని ఉద్ధరించడానికి అనేక ప్రణాళికలు వేసి వాటి నాచరించడానికి అంకితం కావచ్చు. వేరొక జ్ఞాని కొత్తమతాన్ని స్థాపించవచ్చు. ఉన్నమత వ్యాప్తికై నిర్విరామంగా కృషి చేయనూవచ్చు. తన్ను తాను తెలుసుకుని జీవన్ముక్తులైన వీరంతా ఏ పనిచేసినా అది వారి ప్రారబ్ధానుగుణంగా గాలికి ఎండు టాకువలె చలించడమే అవుతుంది. అహంకార రహితులైన వారికి ఏ కర్మలూ బంధించజాలవు. మన పొగడ్తలూ తెగడ్తలూ కూడా వారుండే స్థితిని సమీపింప నైనాలేవు!

జీవన్ముక్తుని శేషజీవితాన్ని ఎండుటాకు చలనంతో పోల్చిన ఈ ఉపమానం ఎంతో అర్థవంతంగా సమర్థనీయంగా అతని స్థితిని మన బుద్ధికి అందిస్తుంది.

శ్లో॥ అసంసారస్య తు క్వాపి న హర్షో న విషాదతా ।
స శీతలమనా నిత్య విదేహ ఇవ రాజతే ॥ 22.

టీ॥ అసంసారస్య తు = సంసార రహితుడగు జ్ఞానికైతే, క్వ అపి = ఎక్కడను (ఎప్పుడును), హర్షః = హర్షము, న = లేదు, చ = మరియు, విషాదతా = శోకము, న = లేదు, సః=అతడు, శీతలమనాః=శాంతమైన మనస్సు గలవాడై, నిత్యం = ఎల్లప్పుడు, విదేహ ఇవ = ముక్తునివలె, రాజతే = ప్రకాశించుచున్నాడు.

**బాహ్య ప్రాపంచిక అనుభవాల నధిగమించిన స్థితిలో జీవించే వానికి సుఖదుఃఖాలుండవు. శాంత పూర్ణమయిన మనస్సుతో దేహంలేనివానివలె అతడు జీవిస్తాడు.**

అహంకారాన్ని అధిగమించగానే మనశ్శరీరాలతో తాదాత్మ్యం అంతరిస్తుంది. సుఖదుఃఖ భావనలు మనస్సులోనే అనుభవింపబడతాయి. మనస్సు యొక్క పరిణామాలే ఈ భావనలు. కోరిన కోరక నెరవేరినప్పుడు, సమకూరనప్పుడు మాత్రమే ఈ సుఖదుఃఖభావాలు మనస్సును వశపరచుకొని, అలజడిని కలిగిస్తాయి. జీవన్ముక్తునిలో అహంకారంతో తాదాత్మ్యం, తత్ఫలితమయిన కోరికలూ ఉండవు కాబట్టి అతని మనస్సు సదా శాంతంగా ఉంటుంది. ఆలోచనల అలజడి ఆ మనస్సులో జనించదు.

దివ్యమయన ఈ అంతరంగ శాంతస్థితిని సదా అనుభవిస్తూ తన్ను తాను అనంత చైతన్య స్వరూపంగా తెలుసుకుంటూ జ్ఞాని జీవిస్తాడు, అతని శరీరం, శేషించిన ప్రారబ్ధాను గుణంగా ఇదివరకు వర్ణింపబడినట్టుగా కోరికల రూపమయిన అశాంతి లేకుండా సర్వజన శ్రేయోదాయకమైన కర్మల నాచరిస్తూ ఉంటుంది, ఆ ఉపాధులు తనవనే తాదాత్మ్య రూపమయిన అహంకారం అతనిలో ఉండదు కాబట్టి, తరుచుగా అతని శరీరంపట్ల, అతనికిగల నిర్లక్ష్యభావం గోచరిస్తూ ఉంటుంది. అందుకే అష్టావక్ర మహర్షి "విదేహం ఇవ"---దేహమే లేనట్టుగా సంచరిస్తూ ఉంటాడు అని జ్ఞానిని వర్ణించారు.

మహోన్నతమయిన ఈ స్థితిని వర్ణిస్తూ యోగవాశిష్ఠం ఇలా అంటోంది.

పశ్చాత్ పావన పావనం యదమజం తత్ప్రాప్య తచ్ఛీతలమ్
తత్సంస్థేన న శోచ్యతే పునరలం పుంసామహాపత్ స్వపి.
(యోగవాశిష్ఠం)

పరమపావనమూ అజమూ అయిన ఆ స్థితిని చేరుకున్న అతని శాంత పూర్ణ మనస్సు ఎంతటి మహాపదలు వచ్చినా వీసమంతైనా చలించదు.

**శ్లో॥ కుత్రాపి న జిహాసాఽస్తి ఆశావాఽపి న కుత్రచిత్ ।**
**ఆత్మారామస్య ధీరస్య శీతలాచ్ఛతరాత్మనః ॥ 23.**

టీ॥ ఆత్మారామస్య = ఆత్మయందు రమించుచున్నటువంటియు, శీతలాచ్ఛత రాత్మనః = చల్లనైన మిక్కిలి నిర్మలమైన మనస్సుగల, ధీరస్య = ధీరుడగు జ్ఞానికి, కుత్రాపి = యెచ్చటనైనను, జిహాసా = త్యాగేచ్ఛ, నాస్తి = లేదు, కుత్రచిత్ = ఎచ్చట నైనను, ఆశా చ = గ్రహణేచ్ఛయు, నాస్తి = లేదు.

**పవిత్రమూ శాంతమూ అయిన మనస్సుతో నిత్యమూ ఆత్మానంద స్థితుడయిన యోగి దేనినీ త్యజించాలనీ కోరుకోడు, ఏది సంభవించినా నష్టంగా భావించడు.**

మనస్సు నధిగమించినప్పుడే ఆత్మానుభవం సిద్ధిస్తుంది. ఆలోచనా ప్రవాహమే మనస్సుగా ఏర్పడుతుంది. ఈ ప్రవాహానికి కారణమయిన అహం కారమూ కోరికలూ నశిస్తేనే మనస్సు అచేతనమవుతుంది. అహంకారం అదృశ్య మయి మనస్సు అచేతనమయినప్పుడు, జగత్తుగా భ్రమగొల్పే భావనా ప్రవాహం కూడా అదృశ్యం అయిపోతుంది. అటువంటి స్థితిలో కేవలం ఆత్మ మాత్రమే ఆనందంగా ఉంటుంది. ఆ ఆనందాన్ననుభవించే యోగిలో ఏ విధమయిన కోరికలూ ఉండవు. దేనినీ త్యజించాలనికాని, కావాలనికాని అనుకోడు, అటువంటి భావాలకవకాశమిచ్చే జగత్తే కనిపించదతనికి! "శీతలాచ్ఛతరాత్మనః" ----పవిత్ర శాంతితో నిండిన అంతరంగంతో అతడు జీవిస్తాడు.

"దేనినీ త్యజించాలనుకోడు"----అంటే సర్వాన్నీ వాంఛిస్తాడని అర్థం కాదు! సామాన్యుడుకూడా దేనినీ త్యజింజాలనుకోడు, అది తనకు బాధాకరము కానంతవరకూ! ఈ భావాన్ని స్పష్టం చెయ్యడానికే "నాశోవాపి న కుత్రచిత్"---ఏది సంభవించినా నష్టపోయానని అనుకోడు అని అంటున్నారు. జీవన్ముక్తుని జీవిత దృక్పథమూ పరిధీ మన మామూలు మనస్సుకు అందనంత చిత్రంగా ఉంటుంది. పరస్పరాధారమయిన ఈ పరిమిత ప్రపంచం కలిగించే కష్టనష్టాలు బాహ్యాభ్యంతరాలలో అతనిని ఏ విధంగానూ కదలింపజాలవు. నిత్య శాంతితో పరిపూర్ణ తృప్తితో అద్వయమయిన ఆత్మగా తన్ను తాను సదా

గుర్తిస్తూ జీవిస్తాడు. అతని అహంకారం మనశ్శరీరాల నధిగమించి ఆత్మగా జాగృతమయి అహం సర్వభూతాత్మగా అనంత శాంత పరిపూర్ణ స్వరూపంగా భాసిస్తుంది.

శ్లో॥ ప్రకృత్యా శూన్యచిత్తస్య కుర్వతోఽస్య యదృచ్ఛయా।
ప్రాకృతస్యేవ ధీరస్య న మానో నావమానతా ॥ 24.

టీ॥ ప్రకృత్యా = స్వభావముచేతనే, శూన్యచిత్తస్య = సంకల్ప వికల్పములు నశించిన మనస్సు గలిగినటువంటిన్నీ, యదృచ్ఛయా = ప్రారబ్ధవశము వలన స్వేచ్ఛగా, ప్రాకృతస్య ఇవ = అజ్ఞానివలె, కుర్వతః = చేయుచున్నటువంటిన్నీ, ధీరస్య = చిత్త విక్షేపము లేనటువంటి, అస్య = యీ జ్ఞానికి, మానః = మానము (గౌరవము), న = లేదు, అవమానతా = అవమానమును, న = లేదు.

స్వభావతః శూన్యమయిన మనస్సుతో, ప్రారబ్ధానుగుణంగా సంభవించే సంఘటనలను సాక్షిమాత్రంగా చూస్తూ, జ్ఞాని సామాన్యునివలెకాక, మానావమానాలకు లోనుగాక, శాంతంగా జీవిస్తాడు.

జీవన్ముక్తుడయిన జ్ఞాని సహజంగా కోరికలనుండి విడివడి శూన్య మనస్కుడై ఆలోచనల ఉధృతితగ్గి శాంతుడై ఉంటాడు. మానసిక పరిణామాలేవీ అతని మనశ్శాంతిని భంగపరచవు. ప్రారబ్ధవశాత్తు సంభవించే సంఘటనలను శాంతంగా వీక్షిస్తూ ఆనందంగా జీవిస్తాడు. మనవలెనే జీవిస్తున్నట్టు కనిపిస్తున్నా, మనవలె మానావమానాలకు మతిని పోగొట్టుకోకుండా ధీరత్వంతో శాంతితో జీవితాన్ని ఆటగా భావించగలుగుతాడు. జగన్నాటక రంగంలో జ్ఞాని దేహం ఎండుటాకు గాలికి చలించినట్టుగా, పూర్వ సంస్కారాలకనుగుణంగా చలిస్తూ చరిస్తూ ఉంటుంది. అహంకార రహితుడయిన అతనిలో కర్తృత్వ భోక్తృత్వ భావాలుండవు. ఆ స్థానే సర్వభావ రూపుడయిన సర్వేశ్వరుని దివ్య లీలా విలాసం నర్తిస్తూ లోకకల్యాణ కారకమూ సర్వజన శ్రేయోదాయకమూ అయిన కర్మలుగా వ్యక్తమవుతూ ఉంటుంది. మానావ మానాలు బుద్ధికి చెందిన విలువలు మాత్రమే. మనోబుద్ధుల నధిగమించిన అతనిలో మానావమానాల స్థానం ఎక్కడ?

శ్లో॥ కృతం దేహేన కర్మేదం న మయా శుద్ధరూపిణా ।
ఇతి చిన్తానురోధీ యః కుర్వన్నపి కరోతి న ॥ 25.

టీ॥ ఇదం = ఈ, కర్మ = కర్మ, దేహేన = దేహముచేత, కృతం = చేయబడినది, శుద్ధరూపిణా = పరిశుద్ధరూపుడనగు, మయా = నాచేత, న కృతం = చేయబడలేదు, ఇతి = ఈ ప్రకారమగు, యః = ఎవడు, చింతానురోధీ = చింతించుచున్నాడో, సః = అట్టివాడు, కుర్వన్ అపి = చేయుచున్నవాడైనను, న కరోతి = చేయనివాడే.

చైతన్యమయమయిన ఆత్మగా తన్ను తాను గుర్తిస్తూ, తనలో సంస్కారానుగుణంగా కదిలే భావాలవల్ల శరీరం పనిచేస్తున్నదని తానేమీ చెయ్యడం లేదనీ తెలుసుకున్న జ్ఞాని కర్మల నాచరిస్తున్నా చెయ్యనట్టే.

కర్మ అనగానే కేవలం శరీరావయాల కదలిక మాత్రమే కాదు. ఆ కర్మను నిర్ణయించే బుద్ధి, అహంకారం ఉన్నప్పుడు మాత్రమే కర్మ జరుగుతుంది. గాఢనిద్రలో నీ గురువును కాలితో తన్నినా సరే అది నీ పనిగా గుర్తింపబడదు. చిన్నపిల్లల పనులకుగూడ వారిని కర్తగా భావించి నిందించము. బుద్ధిలో కదలిన భావానుగుణంగా అహంకారంతో గుర్తిస్తూ చేసిన పనులు మాత్రమే మన కర్మలుగా గుర్తింపబడతాయి.

జీవన్ముక్తుడు సదా ఆత్మ జాగృతుడయి ఉండడంతో అతని మన శ్శరీరాలు వాసనానుగుణగా పనిచెయ్యడాన్ని సాక్షిగా చూస్తూ ఉంటాడు. సముద్రంలోని అలలవలె అతనిలో భావాలు కదులుతూ ఉండడాన్ని అతడే ఆధారమయిన, అతని దృష్టిలో రెండవదేదీ లేనేలేదు. గుర్తించే అహంకారం లేకపోవడంతో కర్మఫలాన్ని స్వీకరించేవారూ కూడా ఉండరు. కాబట్టి అష్టావక్ర మహర్షి"కుర్వన్నపి కరోతి న"--అతడు పనిచేసినా చెయ్యనట్టే అని అంటున్నారు.

భగవద్గీత అంతటా ఇదే భావం నిబిడీకృతమై ఉంది. (అధ్యాయం 3-26-28, 4-20-21, 5-8,9,13, 8-9, 18-58) ఈ శ్లోకాలన్నిటి లోనూ మహర్షి వచనాలే ధ్వని ప్రతిమలై కనిపిస్తూ ఉంటాయి. ఉపనిషత్తులన్నీ ఇదే భావాన్ని దృఢంగా చెప్పుతున్నాయి. మనదేశంలో మహర్షులూ మహాత్ములూ అన్ని కాలాలలోనూ ఈ సత్యాన్ని అనుభవ సహితంగా అనేక విధాల అందించా లని ప్రయత్నిస్తూనే ఉన్నారు, దీనినే జీవన్ముక్తిగా వర్ణిస్తున్నారు.

**శ్లో॥ అతద్వాదీవ కురుతే న భవేదపి బాలిశః ।**
**జీవన్ముక్త స్సుఖీ శ్రీమాన్ సంసరన్నపి శోభతే ॥ 26.**

టీ॥ అతద్వాదీ ఇవ = విరుద్ధవాక్యమును చెప్పువానివలె, జీవన్ముక్తః = జీవన్ముక్తుడు, కురుతే = కార్యమును చేయుచున్నాడు, బాలిశః = మూర్ఖుడు, న భవేత్ =

కాదు, అత ఏవ=ఇందువల్లనే, సంసరన్ అపి = సంసారము నందున్నవాడైనప్పిటికి, సః = అతడు, సుఖీ = సుఖముగలవాడును, శ్రీమాన్ = శ్రీమంతుడునునై, శోభతే = ప్రకాశించుచున్నాడు.

**జీవన్ముక్తుడు చేసే పనులకు అతడేకారణాన్నీ చూపించలేడు. కారణం లేకుండా కర్మలనాచరించే అతనిని ఉన్మాది లేక బుద్ధిహీనుడు అని కూడా అనలేము. అతడీ ప్రపంచంలో నివసిస్తున్నా అంతరంగంలో నిత్యానంద పూర్ణుడై పవిత్రజీవితం గడుపుతూ ఉంటాడు.**

తెలివిగలవారు ప్రణాళికాబద్ధంగా కర్మల నాచరిస్తూ తామాశించిన ఫలితాన్ని పొందాలనుకుంటారు. తమ లక్ష్యాలను విధానాలను స్పష్టంగా తెలుసుకుని పనిచేస్తూ ఉంటారు. తెలివి తక్కువ వానిని ప్రశ్నిస్తే అతని లక్ష్యం గురించి కానీ, విధానం గురించి కాని, ఏ కారణం వల్ల ఆ పనిని చేస్తున్నాడో ఏదీ చెప్పలేడు. ఏదీ అతనికి స్పష్టంగా తెలియదు. తాను చేస్తున్న పని ఎందుకు ఏ ఉద్దేశంతో చేస్తున్నాడో స్పష్టంగా తెలియని వానిని "అతద్ వాది" అంటారు.

జీవన్ముక్తుడు ప్రారబ్ధానుగుణంగా కర్మల నాచరిస్తూ ఉంటాడు. స్వార్థం అతనిలో లేకపోవడంతో సాధారణంగా అతని కర్మలు లోకోపకారంగా పరిణమిస్తాయి. అతడు చేసే కర్మలకు కారణాన్నడిగితే అతడు కూడా తెలివి తక్కువ వానివలెనే ఏ సమాధానమూ స్పష్టంగా ఇవ్వలేడు. అయితే ఇక్కడ తెలివి తక్కువ దీనికి కారణం కాదు. తన ఉపాధిద్వారా జరగబడే పనులను తానే సాక్షిగా చూస్తూ ఉండడంతో, తాదాత్మ్యం చెందే కర్తృత్వ రూపమయిన అహంకారం లేకపోవడంతో, ఆ కర్మలకు అతడే కారణాన్నీ చెప్పలేక మంద హాసంతో మౌనం వహిస్తాడు. ఆ కర్మలలో అతడు దైవలీలను ఆనందంతో చూస్తూ ఉంటాడు.

తెలివితక్కువవాని మనోబుద్ధుల తెలివిహీనతవల్ల సరిగ్గా జవాబు చెప్పలేడు. జ్ఞాని తన మనోబుద్ధల నధిగమించిన స్థితిలో ఉండడంవల్ల తన పనులకు సరైన కారణాలను చెప్పలేడు. అదే ఇద్దరికీగల తేడా!

బాధలతో, భయాలతో, ఆందోళనతో నిండిన ఈ ప్రపంచంలో మన వలెనే నివసిస్తున్నా జ్ఞాని సదా ఆనందంగా అద్వయమయిన ఆత్మలో నిష్ఠకలిగి శాంత స్వరూపుడై విరాజిల్లుతూ ఉంటాడు.

శ్లో॥ నానావిచార సుశ్రాన్తో ధీరో విశ్రాన్తి మాగతః ।
న కల్పతే న జానాతి న శృణోతి న పశ్యతి ॥ 27.

టీ॥ నానావిచార సుశ్రాన్తః = ద్వైత విచార నివృత్తిగలవాడై, ధీరః = జ్ఞానియై, విశ్రాన్తిం = ఆత్మశాంతిని, ఆగతః = పొందుచున్నాడు, అత ఏవ = ఇందువల్లనే (సః = అతడు), న కల్పతే = కల్పన చేయడు, న జానాతి = తెలిసికొనడు, న శృణోతి = వినడు, న పశ్యతి = చూడడు.

**మనోబుద్ధుల తాదాత్మ్యం నుండి విడివడి తనలోని భావాలను సాక్షిగా చూస్తూ, శాంతస్వరూపంగా జీవించే జ్ఞాని దేనినీ ఆలోచించడు, తెలుసుకోడు, వినడు, చూడడు.**

అనంతమూ దివ్యమూ అయిన ఆత్మానుభవం మనోబుద్ధుల తర్కానికి అతీతమైనది. ఈ స్థితి బుద్ధితో అర్థంచేసుకునే సిద్ధాంతం కాదు. ధ్యానంలో బుద్ధిని అధిగమించినప్పుడు భావరహిత నిశ్చల స్థితిలో అనుభవమయే పరమ సత్యం. పరిపూర్ణమూ ఆనందమయమూ అయిన ఈ స్థితిని చేరగలిగిన యోగి ఎన్నటికీ తిరిగి ద్వంద్వాలతో, తాపాలతో నిండిన మనః పరిధిలోనికి రాజాలడు.

అహంకారం అంతరించడంతో అతనిలో కర్తననికానీ భోక్తననికానీ భావాలుండవు. కాబట్టి అతడు ఆలోచించడు, తెలుసుకోడు, వినడు, చూడడు? అహంకారం మాత్రమే మనోబుద్ధులతో శరీరంతో తాదాత్మ్యం చెందుతూ వ్యక్తిగా కర్మల నాచరస్తున్నాననీ, ఫలితాల ననుభవిస్తున్నాననీ అనుకుంటుంది. అహంకారరూపమయిన "నేను"ఉన్నప్పుడే" ఆలోచించడం,తెలుసుకోవడం, చూడడం, వినడం" సంభవమవుతాయి. అహంకారం అంతరించడంతో ఈ కర్మలన్నీ అంతమయినట్లే! జ్ఞాని అనంతమయిన ఆత్మస్వరూపంగా పరిపూర్ణ శాంతితో నిత్యమూ కేవలుడై ఆనంద స్వరూపుడై ఉంటాడు.

శ్లో॥అసమాధేరవిక్షేపాన్న ముముక్షుర్న చేతరః ।
నిశ్చిత్య కల్పితం పశ్యన్ బ్రహ్మైవాస్తే మహాశయః ॥28.

టీ॥ మహాశయః = మహాత్ముడగు జ్ఞాని, అసమాధేః = సమాధి రహితుడగుట వలన, ముముక్షుః = మోక్షేచ్ఛగలవాడు, (న భవతి = కాడు), అవిక్షేపాత్ = ద్వైత భ్రమలేనందువలన, ఇతరః = బద్ధుడు, న = కాడు, ఇతి = ఈ ప్రకారముగా, నిశ్చిత్య = నిశ్చయించి, ఇదం = ఈ సమస్త ప్రపంచమును, కల్పితం = కల్పితముగా, పశ్యన్ = చూచుచున్నవాడై, బ్రహ్మైవ = బ్రహ్మముగానే, ఆస్తే = ఉంటున్నాడు.

మనస్సులో భావనా రూపమయిన కల్లోలాలు లేక పోవడంతో, శాంతుడైన మహాశయుడు, ఏకాగ్రతనిచ్చే ధ్యానాన్ని విడచిపెడతాడు. బంధ భావంలేని అతడు ముక్తిని కోరడు. భావనాగోచరమయిన జగత్తంతా చైతన్య మయిన తనలోని కదలికలుగా భావాలుగా గుర్తిస్తున్న అట్టి మహాత్ముడు చూస్తున్నా చూడనట్లే. అతడు సర్వదా బ్రహ్మ స్వరూపుడే.

అహంకారమూ అదికోరే కోరికలే మనిషి మనస్సులోని అశాంతికి కారణాలు. జ్ఞానిలో వాసనలంతరించడంచేత అహంకార శుద్ధత్వంతో ప్రకాశిస్తూ ఉంటుంది. అతడు బ్రాహ్మీస్థితిలో నివసిస్తూ అదే తన స్వరూపంగా నిత్యమూ గుర్తిస్తూ ఉంటాడు.

మనస్సులో అలజడి లేకపోవడంతో మనస్సును అదుపులో పెట్టడానికి అతడు ధ్యానించ నవసరం లేదు. ఆకలితో ఉన్నవాడే ఆహారాన్ని కోరుతాడు. దాహం ఉన్నపుడే నీరు అవసరమనిపిస్తుంది. అల్లకల్లోలమయిన మనస్సు మాత్రమే ధ్యానంతో శాంతిని పొందాలనుకుంటుంది. తన లక్ష్యమయిన దివ్య స్వభావాన్ని తన సహజస్వరూపంగా గుర్తించినయోగి ఆ ఆనందంలో స్థితుడై ఉండిపోతాడు. అతనికి ధ్యానంతో అవసరమే ఉండదు. ఈ విధంగా ధ్యానాన్ని విడిచిపెట్టిన అతనిని ముముక్షువు అనలేము. నిజానికి అతడు ముముక్షువు కాడు ముక్తుడే. శరీరం, మనస్సు, బుద్ధీ, నిజంగా ఉన్నాయనుకుని అవి చూపించే ప్రపంచం నిజమని, బాధపడే భ్రమా భావాలనుండి అతడు ముక్తుడయి ఆనందంగా ఆత్మగా తన్నుతాను సర్వదా గుర్తిస్తూ ఉంటాడు.

ఆత్మానుభవం పొందిన తరువాత, అంతకుముందు తాను చూచిన జగత్తంతా తనలో అణుమాత్రంగా కదిలే భావనాతరంగాలనీ, సర్వజగత్తూ నామ రూపాలతో భావాలుగా గుర్తింపబడుతోందనీ స్పష్టంగా గుర్తిస్తాడు. విషయి ---విషయ సంబంధ రూపమయిన జగద్భ్రమ అనే స్వప్నం నుండి అతడు జాగృతుడయేడు. ఇప్పుడు ప్రపంచాన్ని చూస్తున్నా అది కేవలం నామ రూపాలతో మనస్సులో కదిలే భావనా ప్రవాహమనీ, ఇంద్రజాలంవలె నిజమనే భ్రమ గొల్పుతుందనీ, గుర్తిస్తూ చూస్తూ ఉంటాడు. తాను ఆత్మగా, బ్రహ్మగా తనలో కదిలే భావనాతరంగాలను ఆనందంగా వీక్షిస్తూ ఉంటాడు.

శ్లో॥ యస్యాన్తః స్యాదహంకారో న కరోతి కరోతి సః ।
నిరహంకార ధీరేణ న కించిదకృతం కృతమ్ ॥ 29.

**టీ॥** యస్య = ఎవనియొక్క, అంతః = అంతఃకరణమునందు, అహంకారః = అహంకారము (కర్తృత్వాద్యభిమానము), స్యాద్యది = అయ్యేనేని (కలిగెనేని), సః = వాడు, (లోకదృష్ట్యా = లోకదృష్టిద్వారా), న కరోతి అపి = చేయనివాడైనప్పటికిని, కరోతి=(సంకల్పాదిద్వారా చేయుచున్నాడు), నిరహంకార ధీరేణ = అహంకార రహితు డైన జ్ఞానిచేత, (లోకదృష్ట్యా = లోకదృష్టిద్వారా), న కించిత్ = అధికముగా, కృతమపి = చేయబడినదైనప్పటికినీ, (స్వదృష్ట్యా = స్వకీయ దృష్టిచేత), (తత్ = అది), న కృతం = చేయబడనిదే.

**తాను కర్తననే భావం తనలో ఉన్నవాడు కర్మలను చేయకున్నా చేసినట్టే. అహంకార వర్జితుడయిన జ్ఞాని కర్మలనాచరించినా మానినా నిశ్చయంగా అతడెన్నడూ దేనినీ చేయనట్టే చెప్పవచ్చును.**

మనిషి తనలోని అహంకారంతో తత్సంబంధమయిన కోరికలతో సర్వ కర్మలనూ ఆచరిస్తూ ఉంటాడు. తన్ను తాను వ్యష్టిగా వ్యక్తిగా గుర్తించినప్పుడు అహంకారం తప్పకుండా ఉండి తీరుతుంది. అతడు బాహ్యంగా కర్మల నాచరించక పోయినా ఈ అహంకారం ఉండడంతో కర్మల నాచరించినట్టే---"కరోతి సః" ---అని అష్టావక్ర మహర్షి అంటున్నారు. తన మనశ్శరీరాల స్పృహ గాఢంగా ఉన్నవ్యక్తి ధ్యానంలో కూర్చుని నిశ్చలంగా ఉన్నట్టు కనిపిస్తున్నా అతని మనస్సు శాంతంగా ఉండదు. బాహ్యంగా నిశ్చలత కనిపిస్తున్నా అంతరంగంలో అతడు అనేక కర్మలను నిర్వర్తిస్తూ అశాంతిగా ఉండనే ఉంటాడు. అశాంతితో నిండిన ఆ మనస్సే ధ్యానంలో శాంతిని అన్వేషించాలనుకుంటుంది.

అహంకారాన్ని జయించిన యోగి అనంతమైన ఆత్మానుభవంలో స్థితుడై ఉంటాడు. "న కించిత్ అకృతం కృతమ్"---ఆత్మతత్త్వాన్ని తప్ప రెండవదానిని చూడలేని అట్టియోగి, సమాజ సేవాకార్యకలాపాల్లో నిమగ్నుడై ఉన్నా, నిశ్చల ధ్యానంలో నిష్ఠ కలిగి ఉన్నా, ఎప్పుడూ ఏ పనినీ చెయ్యనివాడే.

ఇదే అధ్యాయంలో రాబోయే 49వ శ్లోకార్థానికి ఈ శ్లోకం వ్యతిరేకంగా కనబడుతుంది. ఈ వ్యతిరేకత కేవలం బాహ్యాగోచరమే. ఈ శ్లోకంలో ఇలా ఉంది-----"జ్ఞాని తనకు ప్రాప్తించిన కర్మలను మంచి చెడ్డలను విచారించక యథేచ్ఛగా నిర్వర్తిస్తాడు. అతడు చేసే కర్మలన్నీ బాలునిపనులవలె ఉంటాయి" యోగి కర్మకు అకర్మకు కూడా అతీతుడు. మనశ్శరీరాలనబడే ఉపాధుల నధిగమించి అతని దృష్టి ఆత్మగా స్థిరంగా ఉంటుంది. కాబట్టి ద్వంద్వాల

ప్రభావానికి అతడు లోబడి ఉండడు. అట్టి యోగి విచక్షణా జ్ఞానశూన్యుడై ఎటువంటి పనినయినా చేస్తాడని అర్థం కాదు. స్వభావతః అతడు పవిత్రమయిన మనోభావాలతో సాత్త్విక బుద్ధితో ఉంటాడు కాబట్టి అతనిచే ధర్మవిరుద్ధమయిన కర్మలు నిర్వర్తింపబడవు. అహంకారంతో స్వార్థంతో చెయ్యబడిన పనులు మాత్రమే అధర్మంగా ఉండగలవు. అహంకార రహితుడయిన జ్ఞాని కర్మలు ధర్మాన్ని విడచి ఉండజాలవు. ధర్మానికాధారమయిన సర్వాత్మభావంతో తాదాత్మ్యం పొందిన జ్ఞాని చేసే కర్మలన్నీ ప్రేమమయుడైన భగవంతుని లీలలై భాసిస్తూ ఉంటాయి. అతడి కర్మల మానవాళికి మార్గదర్శకాలై మహాధర్మాలై అనుసరింపబడతాయి! అట్టి మహాత్ముల ఆచరణతో దేశకాలానుగుణంగా ధర్మ శాస్త్రాలు రూపుదిద్దుకుంటాయి!

అహంకారంతో తాను కర్తననిభావించి చేసే కర్మలన్నీ శ్రమతో కూడిన పనులుగా, మంచి చెడులుగా గుర్తింపబడతాయి. అట్టి పనులనే ధర్మా ధర్మాల దృష్టితో విమర్శిస్తాము. అహంకార రహితంగా జ్ఞానిచేసే కర్మలన్నీ అతని ఉపాధి యొక్క కదలికలు మాత్రమే. నిస్స్వార్థంగా ప్రారబ్ధానుగుణంగా, అహంకార రహితంగా, ఉపాధిద్వారా వ్యక్తమయే కర్మలనుండి కొత్త వాసనలేవీ జనించవు. అట్ట కర్మలను అకర్మగా పేర్కొనవచ్చును.

శ్లో॥ నోద్విగ్నం నచ సంతుష్టం అకర్తృత్వ స్పందవర్జితమ్।
నిరాశం గత సందేహం చిత్త ముక్తస్య రాజతే ॥ 30.

టీ॥ ముక్తస్య = జీవన్ముక్తుడగు జ్ఞానియొక్క, చిత్తం = మనస్సు, అకర్తృ = కర్తృత్వ రహితమైనదిగాను, స్పందవర్జితం = చలనరహితమైనదిగను, నిరాశం = ఆశారహిత మైనదిగను, గతసందేహం = గతించిన సందేహములు గలదిగను, నో ద్విగ్నం = కలత లేనిదిగను, న సంతుష్టం = సంతోషముతో నుబ్బిపోవనిదియునై, రాజతే = ప్రకాశించు చున్నది.

జ్ఞాని యొక్క మనస్సు సుఖదుఃఖాల కతీతంగా నిశ్చలంగా ఉంటుంది. మానసిక ఉద్రేకాలు, కోరికలు, సందేహాలు ఏవీ ఉండవు, అచంచలంగా స్థిరంగా ఉంటుంది.

ఆత్మయొక్క అపరోక్షానుభూతిని పొంది అనంతమైన చైతన్యం స్వరూపంగా తన్ను తాను తెలుసుకున్నవాడే జీవన్ముక్తుడు. అట్టి జ్ఞాని మనోబుద్ధుల

తాదాత్మ్యం నుండి వాటి భావోద్రేకాల నుండి ముక్తుడై ఆనందంగా జీవిస్తూ ఉంటాడు. కాబట్టి సహజంగా అతనిలో ఉద్రేకాలు రాగభావాలు, అహంకార పూరితమయిన కోరికలు ఉండజాలవు.

క్రిందటి శ్లోకంలో చెప్పిన భావాన్ని ధృవీకరిస్తూ ఇక్కడ వివరణ ఇవ్వ బడింది, అహంకారరహితుడై భావశూన్యుడయిన యోగి కర్మల నాచరిస్తున్నా ఉద్రేకాలకు లోనుకాడు. "న ఉద్విగ్నం"---అతనిలో రాగద్వేషాలు లేకపోవడమే అందుకు కారణం. దేనిమీదా ప్రత్యేకంగా యిష్టం లేకపోవడంతో సర్వత్రా సంతోషంగా ఉండగలుగుతాడు.---"సంతుష్టః",----అహంకారంలేని కారణంగా అతడు దేనికీ కర్తకాడు----"అకర్త. మనోబుద్ధుల నధిగమించిన కారణంగా భావో ద్రేకాలతనిని బాధించవు--"స్పందవర్జితమ్", "సాధించవలసిన దానిని సాధించిన సంతుష్ట మానసిక స్థితిలో కోరికలుండవు, అందుకే అతడు "నీరసమ్"---"రస భావరూపమయిన కోరికలు లేనివాడు. అనంతభావ నిలయమయిన చైతన్య స్వరూపంగా స్పష్టంగా తన్ను తాను తెలుసుకున్న అతనికి తెలుసుకోదగినదేదీ ఉండదు, సందేహ రహితుడై శాంతుడై ఉంటాడు ----"గతసందేహం"

**శ్లో॥ నిర్ధ్యాతుం చేష్టితుం వాऽపి యచ్చిత్తం ప్రవర్తతే ।**
**నిర్నిమిత్త మిదం కిం తు నిర్ధ్యాయతి విచేష్టతే ॥ 31.**

టీ॥ యత్ = యే జ్ఞానియొక్క, చిత్తం = మనస్సు, నిర్ధ్యాతుం = ధ్యాన రహిత ముగా (నిష్క్రియా భావముతో నుండుటకుగాని), వా అపి = లేనిచో, చేష్టితుం = యేదైన చేయుటకుగాని, న ప్రవర్తతే = ప్రవర్తింపదు, కిం తు = ఒకానొకపప్పుడు, ఇదం = ఈ చిత్తము, నిర్నిమిత్తం = నిమిత్తం లేకుండగనే, నిర్ధ్యాయతి = క్రియారహితమై యుంటున్నది, చ = మఱియు, విచేష్టతే = నానా ప్రకారములగు క్రియలను చేయు చున్నది.

జీవన్ముక్తుని మనస్సు ధ్యానంలో కానీ కర్మలలోకానీ లీనమవదు. సహజ స్పందనతో ఆ మనస్సు ధ్యాన యుక్తంగా క్రియాశీలతతో నిస్వార్థంగా కర్మల నాచరిస్తుంది.

జీవన్ముక్తుడు ఆత్మగా ఆత్మలో నివసిస్తాడు. మనస్సు కలితమయిన స్థితిలో అతడు స్థితుడై ఉంటాడు. మహోన్నతమయిన ఆ స్థితినుండి ఆందోళనా పూరితమయిన తన మనస్సునుకాని, ఆ ప్రేరణచే పనిచేసే తన శరీరాన్ని కాని వేరుగా గుర్తించలేడు. ఆ కారణంచేతనే మనస్సును శాంతింపజేసే ధ్యానాన్ని

అతడు కొనసాగించలేడు. బంధత్వంతో బాధపడుతూ ముక్తిని కోరే అహంకారం మాత్రమే ధ్యానించాలనుకుంటుంది. నిత్యముక్తునిగా తన్నుతాను తెలుసుకుని ఆత్మానుభవస్థితుడయిన యోగికి ధ్యానంతో పనిలేదు. గమ్యాన్ని చేరిన తర్వాత కూడా అక్కడికిచేరే మార్గం వెంట నడవగలమా?

శారీరికమయిన కోరికల తాపంతోనూ మానసికమైన భావోద్రేకాలతోనూ బుద్ధిలోని అశాంతితోనూ మనవలె బాధపడుతూ జ్ఞాని జీవిస్తాడని పొరపడ కూడదు. ధ్యానఫలమయిన దివ్యశాంతి పథంలో ఆత్మానుభవంలో నిత్యమూ స్థితుడై ఉంటూనే అతడు బాహ్యంగా కర్మలను చేస్తున్నట్టుగానీ, ధ్యానిస్తున్నట్టు కానీ కనిపిస్తూ ఉంటాడు. అతని జీవితమంతా సహజానందంతో నిండి ఉంటుంది. అతడు విశ్రాంతి తీసుకుంటుంటే దివ్యత్వమే విశ్రాంతినందుతున్నట్టనిపిస్తుంది. పనులు చేస్తుంటే దివ్యలీలను అతని వ్యక్తిత్వంలో దర్శించవచ్చు.

**శ్లో॥తత్త్వం యథార్థ మాకర్ణ్య మందః ప్రాప్నోతి మూఢతామ్।**
**అథవాఽఽయాతి సంకోచ మమూఢః కోఽపి మూఢవత్॥32**

టీ॥ మందః = అజ్ఞాని, యథార్థం తత్త్వం = యథార్థ తత్త్వమును, ఆకర్ణ్య అపి = వినియును, మూఢతాం = మూఢత్వమును (సంశయ-విపర్యయములను), ప్రాప్నోతి = పొందుచున్నాడు, అథవా = లేదా, సంకోచం = సంకోచబుద్ధిని (సమాధిని), ఆయాతి = పొందుచున్నాడు, తథా = ఆ ప్రకారము, అమూఢః = జ్ఞాని, కః అపి = ఒకానొకడు, మూఢవత్ = అజ్ఞానివలె, మూఢతాం = మూఢత్వమును (బాహ్యదృష్ట్యా = బాహ్య దృష్టితో), ప్రాప్నోతి = పొందుచున్నాడు.

**తెలివిహీనుడు తత్త్వసారాన్ని విని సందేహాస్పదుడౌతాడు. బుద్ధి మంతుడు తత్త్వజ్ఞానసారాన్ని గ్రహించి అంతర్ దృష్టితో అంతర్ముఖుడై సత్యాన్ని దర్శించి బాహ్యంగా మూఢునివలె కనిపిస్తాడు.**

సునిశితమూ, తీక్షణమూ అయిన బుద్ధితో, సుశిక్షితమయిన ధ్యానా నుకూల మానసంతో, అంతర్ దృష్టితో తన వ్యక్తిత్వాన్ని విమర్శించి చూసుకో గలనేర్పు సాధకునికి అత్యంత అవసరం, అట్టి సత్యాన్వేషి మాత్రమే శాస్త్రి హృదయగత భావాన్ని అర్థంచేసుకుని సత్ చిత్ ఆనందరూపమైన ఆత్మాను భవాన్ని పొందగలుగుతాడు. ప్రాథమిక పాఠశాల విద్యార్థికి అయిన్ స్టీన్ సాపేక్ష సిద్ధాంతాన్ని అతి సూక్ష్మమైన గణితశాస్త్రి విజ్ఞానశాస్త్రి సిద్ధాంతాలతో బోధిస్తే, అర్థం చేసుకోలేక అయోమయావస్థలో పడిపోతాడు. అదే విద్యార్థి క్రమంగా

విజ్ఞాన శాస్త్రాన్నర్థం చేసుకుంటూ పట్టభద్రుడయిన తరువాత అతనికి అయిన్ స్టీన్ సిద్ధాంతాన్ని బోధిస్తే ఎంతో చక్కగా అవగాహన చేసుకోగలుగుతాడు.

"మందః"---తెలివితక్కువవారు---ఆలోచనాశక్తినంతటినీ ఇంద్రియ సుఖభోగాలకోసమే వ్యయం చేయడంతో గంభీరమయిన తాత్త్విక విషయాల నర్థం చేసుకోలేనివాడని అర్థం. అట్టివానికి అద్వయమయిన ఆత్మతత్త్వపు అనంతత్వాన్ని బోధిస్తే అర్థంకాక అయోమయావస్థలో పడిపోతాడు.

అధికారీ అర్హుడూ అయిన సత్యాన్వేషికి ఇదే తత్త్వాన్ని సమర్థుడయిన గురువు బోధిస్తే వెంటనే అర్థం చేసుకుని అంతర్ముఖుడయి అనంత శాంతి స్వరూపమయిన ఆత్మను తానుగా తెలుసుకోగలుగుతాడు. బాహ్యచలనం ఆగిపోగా అంతర్ముఖుడయిన అట్టివానిని ప్రాపంచిక దృష్టిగల ప్రజలు మూఢు నిగా తలపోస్తారు. పరుగు పందెంవంటి జీవితంలో సంపదలను సంపాదిస్తూ వ్యయ ప్రయాసలతో వస్తువులను సేకరిస్తూ, ఉద్రేకాలతో ఉద్విగ్నుడవుతూ, ప్రాపంచిక భోగాల వెంట పిచ్చిపరుగులు తీస్తూ, రాగద్వేషాల, కష్టసుఖాల, సుఖదుఃఖాల మధ్య నలిగిపోతూ జీవించేవాడే సాధారణంగా ప్రజ్ఞావంతుడుగా గుర్తింపబడతాడు!!

అష్టావక్ర మహర్షి ఇక్కడ "మూఢునివలె" అని వాడుతున్నారు. నిజంగా మూఢుడుకాడు, అయినా అలా కనిపించేవాడని అర్థం. మూఢుడు ఏ పనినీ సమర్థవంతంగా చెయ్యలేడు, అయినా అతనిలో అనేక కోరికలు నిత్యమూ ఉద్భవిస్తూ అతనిని నిత్య అశాంతికి లోను చేస్తుంటాయి. జ్ఞానికూడా మూఢునివలెనే కర్మలను చెయ్యకుండా ఉన్నప్పటికీ అతని మనస్సు మాత్రం నిత్యశాంతి పూర్ణంగా కోరికలు లేకుండా ఉంటుంది.

వేదాంత వీధులలో అడుగుపెట్టడానికి కావలసిన అర్హతలను చర్చిస్తూ యోగవాశిష్ఠం హాస్యంగా ఇలా అంటోంది.

వయం తు వక్తుం మూర్ఖాణామజితాత్మీయ చేతసామ్
భోగకర్దమ మగ్నానాం న విద్ మోభిమతం మతమ్
తేషామభిమతా నార్థః భావాభవ విభూషితః. (యోగవాశిష్ఠం)

*స్థూల శరీరాభిమానులయి, స్వేచ్ఛాచారులయి, ఉద్రేకాలలో సుఖభోగాలలో మునిగిపోయిన వారికి జీవామృత మనదగిన ఆత్మవిద్యను బోధించడం ఎలాగో తెలియడం లేదు. తెలివిహీనత అనే అలంకారంతో భాసించే స్త్రీలనుండే వారిని నేర్చుకోనిద్దాం.*

శ్లో॥ ఏకాగ్రతా నిరోధో వా మూఢై రభ్యస్యతే భృశమ్ ।
ధీరాః కృత్యం న పశ్యన్తి ససుప్తవత్స్వపదే స్థితాః॥ 33.

టీ॥ ఏకాగ్రతా = చిత్తైకాగ్ర్యము, వా = లేక, నిరోధః = చిత్తనిరోధము, మూఢైః = అజ్ఞానులచేత, భృశం = మిక్కిలి, అభ్యస్యతే = అభ్యసింపబడుచున్నది, ధీరాః = ధీరులగు జ్ఞానులు, కృత్యం = పూర్వకృత్యమును (ఏకాగ్రతాసమాధులను), న పశ్యన్తి = చూడరు (వాటిపై దృష్టినిడరు), పరం తు = మరేమనగా, స్వప్నవత్ = నిద్రపోవు వానివలెనే, స్వపదే = తన స్వరూపమునందే, స్థితాః = ఉంటున్నారు.

మూఢులు మాత్రమే మనస్సును నియమించి ఏకాగ్రత నభ్యసిస్తూ ఉంటారు. జ్ఞాని తన సహజ స్వరూప నిష్ఠుడై, సుషుప్తిలో ఉన్నవానివలె, దేనినీ సాధించాలనుకోడు.

తమ మనశ్శరీరాలపై దృష్టి బాగా ఉండి అహంకారం అధికంగా పనిచేసే వారిని దృష్టిలో ఉంచుకొని ఇక్కడ "మూఢః"--అన్నపదం వాడబడింది. ఈ స్పృహ ఉన్నంతకాలమూ ఇంద్రియాల నడుపులో ఉంచుకుంటూ మనస్సును ఏకాగ్రతతో శాంతింప జెయ్యడానికి ప్రయత్నించక తప్పదు. జీవన్ముక్తుడయిన జ్ఞాని ఆత్మస్థితుడయి ఉండడంతో అతని దనిపించే మనస్సూ అహంకారమూ అతనిలో ఉండవు. అహంకార వర్జితుడయిన అతడు దేనినీ సాధించాలనుకోడు! అట్టి వానినే మహర్షి "సుప్తవత్ ",సుషుప్తిలో ఉన్నవానివలె అని వర్ణించారు. గాఢ నిద్రలో ఉన్న వ్యక్తికి అతని శరీర స్పృహకానీ నానాత్వమయమయిన బాహ్య ప్రపంచపు స్ఫురణకానీ ఉండవు. దేనినీ చూడక పోవడంతో అన్యథా గ్రహణ మనబడే భ్రమకూడా ఉండదు. అద్వయమయిన ఆత్మనే తన్నుగా వీక్షించే జ్ఞానికూడా దేనినీ శరీరంగా, ఇంద్రియాలుగా, వాటి అనుభవ క్షేత్రమయిన జగత్తుగా భ్రమపడడు.. కేవలంగా తాను మాత్రమే శాంతి పూర్ణుడై ఉంటాడు.

జీవన్ముక్తుడయిన యోగి తనదైన ప్రత్యేక ప్రపంచంలో జీవిస్తూ ఉంటాడు. అతని దృక్పథంలో మనకు సహజంగా కనిపించే ఇంద్రియానుభవ క్షేత్రాలేవీ ఉండవు. అంతటా ఆత్మతత్త్వం మాత్రమే ఉంటుంది. ఆత్మలో, ఆత్మగా జీవించే అట్టి యోగి కోరడానికి ఏముంటుంది? ధ్యానింపదగినది ఏది? దేనితో ధ్యానిస్తాడు? దేనినుండి అతడు దూరంగా తొలగిపోవాలి? చేరవలసిన గమ్యాన్ని చేరిన అతనికి మార్గం అవసరం ఏమిటి?

పరమ పురుషార్థ మనదగిన మానవ జీవిత గమ్యాన్ని, సత్యాన్ని, ఇక్కడ మహర్షి నేరుగా స్పష్టంగా చూపిస్తున్నారు. ఈ గమ్యాన్ని చేరడంలోగల దశలను యోగవాశిష్ఠం ఎంతో ప్రేమతో ఒకచోట ఇలా వివరిస్తోంది.

పూర్వైః వివేకేన తనుత్వమేతి రాగోధ వైరం చ సమూలమేవ
పశ్చాత్పరిక్షీయతే ఏవ యత్నః సః పావనో యత్ర వివేకితాస్తి.

(యోగవాశిష్ఠం)

*విచారణతో ధృవపడిన వివేకంతో మోహం నశిస్తుంది. ఫలితంగా తరువాత ద్వేషభావాలు మూలమయిన అహంకారంతో సహా నశిస్తాయి. ఆ తరువాత క్రమంగా ధ్యానం మీద ప్రత్యేకదృష్టి తగ్గి శాంతం భాసిస్తుంది. ఆ ప్రకాశంలో ఆత్మ తత్త్వం, అసలైన వివేకం, అనంతంగా నిత్యంగా అద్వయంగా ఉంటుంది.*

## శ్లో॥అప్రయత్నాత్ప్రయత్నాద్వా మూఢోనాప్నోతి నిర్వృతిం।
## తత్త్వనిశ్చయ మాత్రేణ ప్రాజ్ఞో భవతి నిర్వృతః ॥ 34.

**టీ॥** మూఢః = అజ్ఞాని, అప్రయత్నాత్ = చిత్తనిరోధాదులను చేయకుండుటవల్ల గాని, ప్రయత్నాత్ = చేయుటవల్లగాని, నిర్వృతిం = పరమ సుఖమును, నాప్నోతి = పొందకున్నాడు, ప్రాజ్ఞః = జ్ఞాని, తత్త్వనిశ్చయమాత్రేణ = కేవలము తత్త్వనిశ్చయము చేయుట చేతనే, నిర్వృతః = పరమ సుఖమును పొందువాడుగా, భవతి = అగుచున్నాడు.

**మూఢుడు కర్మవల్లగానీ, అకర్మవల్లగానీ శాంతిని సాధించలేడు. జ్ఞాని సత్యాన్ని తెలుసుకున్నంత మాత్రాన శాంతస్వరూపంగా ఉండ గలుగుతాడు.**

మనశ్శరీరాల తాదాత్మ్యంతో వాటిపై వ్యామోహంతో వాటి కోరికలను తీర్చడం కోసమే అనునిత్యమూ కృషిచేసే వానిని మూఢుడు అని అంటున్నారు. అట్టివ్యక్తి---"ప్రయత్నాత్"---పనులు చెయ్యడంవల్లగాని, "అప్రయత్నాత్"----పనులను మానివేయడంవల్లగానీ శాంతిని సాధించలేడు. ప్రతీ సాధకుడూ కొంతకాలం తన భావనా బలంతో కోరికలను లేకుండా చేసుకుని శాంతంగా ఉండగలడు. అంతమాత్రాన అతని ప్రయత్నంవల్లగాని, ప్రయత్నంతో సాధించిన శాంతివల్లగాని, ఆత్మానుభూతిని పొందలేడు. బాహ్యప్రపంచంలో కర్మల నాచరిస్తున్నా, తాత్కాలికంగా వాటినుండి విడివడి శాంతంగా ఉన్నా---ఈ రెండు స్థితులు కూడా ఆత్మానుభవానికి నిదర్శనాలు కావు.

అహంకారాన్ని నశింపజేసుకుని మనస్సును శుద్ధపరచుకుని, వాసనా

రహితుడై, "ప్రాజ్ఞ" సాధకుడు మాత్రమే ధ్యానానుకూలమయిన మనస్సును సాధించినవాడవుతున్నాడు. అట్టి మనస్సు మాత్రమే గమ్యాన్ని చేర్చగలుగుతుంది. అట్టి మనస్సుగల సత్యాన్వేషి మాత్రమే శాస్త్రం చూపించే బాటవెంట నడచి, గురువాక్య శ్రవణంలోనో వాటి మననంలోనో అద్వితీయమయిన ఆత్మ తత్త్వాను భూతిని పొందగలుగుతాడు.

"ప్రయత్న"--- అన్నపదం కోరికలచే ప్రేరేపింపబడిన కర్మలను సూచిస్తోంది. "అప్రయత్న"--- అన్నపదం కోరికలను బలవంతంగా అణుచుకోవడంతో సాధించిన శాంతిని, అకర్మత్వాన్ని సూచిస్తోంది. ఈ రెండు విధానాలలో దేనివల్లనూ కూడా మనం శాంతపూర్ణమయిన ఆత్మానుభవాన్ని పొందలేము.

ఈశ్లోకంయొక్క భావార్థ గాంభీర్యం భగవద్గీతలోని ఇటువంటి శ్లోకాన్నే జ్ఞప్తికి తెస్తోంది. అక్కడ కూడా భగవాన్ కృష్ణుడు ప్రయత్న పూరితమూ కృత్రిమము అయిన శాంతిలో కోరికలు అణగద్రొక్కబడి ఉంటాయనీ అందువల్ల ఆత్మ లక్ష్యము కాదని వివరంగా చెప్పుతున్నారు.

యస్త్వాత్మ రతిరేవస్యాద్ ఆత్మ తృప్తశ్చ మానవః
ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే (భగవద్గీత-3-17)

*ఆత్మరతుడై, ఆత్మచే తృప్తుడై, ఆత్మలోనే ఆనందం అనుభవించే మనుజుడు చేయదగిన కార్యం ఏదీ ఉండదు.*

## శ్లో॥శుద్ధం బుద్ధం ప్రియం పూర్ణం నిష్ప్రపంచం నిరామయమ్।
## ఆత్మానం తం న జానన్తి తత్రాభ్యాసపరా జనాః ॥ 35.

టీ॥ తత్ర=ఆ హఠయోగాదులయందు, అభ్యాసపరాః = అభ్యాస పరులగు, జనాః = జనులు, శుద్ధం = శుద్ధమైనట్టియు, బుద్ధం = జ్ఞాన స్వరూపమైనట్టియు, ప్రియం = ప్రియమైనట్టియు, పూర్ణం = పూర్ణమైనట్టియు, నిష్ప్రపంచం = ప్రపంచ రహితమైనట్టియు, నిరామయం = దుఃఖరహితమైనట్టి, తం = ఆ, ఆత్మానం = ఆత్మను, న జానన్తి = తెలిసికొనజాలదు.

**అనేక సాధనలకూ అభ్యాసాలకూ అంకితమయిన జనులు, శుద్ధమూ, జ్ఞానస్వరూపమూ, ప్రియమూ, పూర్ణమూ, ప్రపంచాతీతమూ, నిష్కళంకమూ అయిన ఆత్మ తత్త్వానుభూతిని పొందజాలదు.**

ఈ శ్లోకాలనుచూసి సాధనతో అవసరమేలేదని పొరపడకూడదు. సాధన

చెయ్యకుండా, సంసిద్ధతలేకుండా ఉన్నవారిని గూర్చి మహర్షి "మూఢ" అన్న పదాన్ని ప్రయోగించారు. అయితే సాధన మార్గమనీ, ఆత్మానుభవం గమ్యమనీ సాధకుడు స్పష్టంగా తెలుసుకోవాలి. తరుచుగా చాలామంది మార్గాన్నే లక్ష్యంగా పొరపడుతూ ఉంటారు. సామాన్యజీవితంలో ఇది సహజంగా సంభవిస్తుంది. సంపద సంతోషమయమయిన జీవితానికి అవసరమయినదే! అయితే బుద్ధి హీనులు మార్గాన్నే లక్ష్యంగా భావించి సంపదను సంపాదించడంలోనే నిత్య ఆసక్తులై వారి లోభత్వంతో దుర్భరమయిన జీవతాన్ని గడుపుతూ ఉంటారు.

ఆధ్యాత్మిక జీవితం పేరుతో, మూఢత్వంతో అట్టి దుర్భరమయిన జీవితాన్ని జీవించకు! భగవద్భక్తి, సమాజసేవ, శాస్త్రాధ్యయనము, మననమూ, ధ్యానమూ, నిధిధ్యాసనాకూడా అన్నీ మార్గాలే. అహంకారం చూపించే జాగ్రత్ ప్రపంచ స్వప్నాన్ని దూరంచేసి మన సహజస్వరూపాన్ని చేరుకోవడానికి ఇవన్నీ ప్రయోజనకారులే. ధ్యానంలో ఏకాగ్రతను ప్రగతి సాధించిన సాధకు లందరికీ ఈ హెచ్చరిక సముచితమైనది. మరెంతో అవసరమైనది కూడా! ఒక మహాఋషికి అంతటి మహనీయుడైన శిష్యుడు జనకునికి మధ్య జరిగిన సంవాదమే అష్టావక్రగీత. కాబట్టే ఇందులోని వాదమంతా ఇంతటి ఉన్నత స్థాయిలో ఉంటుంది. సాధన ప్రథమ దశలో ఉన్న సాధకులు ఇక్కడ పొరబడరాదు.

**శ్లో॥ నాప్నోతి కర్మణా మోక్షం విమూఢోఽభ్యాస రూపిణా ।**
**ధన్యో విజ్ఞాన మాత్రేణ ముక్త స్తిష్ఠత్య విక్రియః ॥ 36.**

టీ॥ విమూఢః = అజ్ఞాని, అభ్యాస రూపిణా = అభ్యాస రూపమైన, కర్మణా = కర్మచేత, మోక్షం = మోక్షమును, నాప్నోతి = పొందజాలడు, అవిక్రియః = క్రియా రహితుడైన, ధన్యః = పుణ్యపురుషుడు, విజ్ఞానమాత్రేణ = కేవల జ్ఞానమాత్రముచేతనే, ముక్తః = ముక్తుడై, తిష్ఠతి = ఉంటున్నాడు,(మోక్షమును పొందుచున్నాడు)

**మూఢుడు ధ్యాన సమాధానాలతో మనస్సును నియమించడానికి ఎంత ప్రయత్నంచేసినా ఆత్మానుభూతిని పొందలేడు. సుకృతం కలిగిన సాధకుడు శ్రవణ మననాలతో ముక్తినంది, ఆత్మానుభూతిలో స్థిరంగా స్థితుడై ఉండగలుగుతాడు.**

క్రిందటి శ్లోకంలోని అష్టావక్రుని ఉపదేశం శిష్యుడిని సంశయాలకు చిత్తుడినిచేస్తుంది. అతని విశ్వాసాన్నీ ఆలోచనాశక్తినీ సవాలు చేస్తుంది. వేదా ధ్యయనంచేసేటప్పుడు ముందుగా కర్మకాండ విభాగంలో విభిన్న కార్య

కలాపాలపై ఆచారవిధానాలపై విలువను వ్యామోహాన్నీ పెంచుకుని, వాటిని వదలడం కష్టంగా భావిస్తారు. ఉపనిషద్ విభాగాన్ని మొదలు పెట్టేటప్పుడు గురువు తప్పనిసరిగా వారిని హెచ్చరిస్తారు. ఆ విధానాలలోను, నియమ నిష్ఠలను, వాటిపై విలువలను కూడా శిష్యులు విడిచిపెట్టవలసి ఉంటుంది. ఆచార వ్యవహారాల ఆచరణకు అలవాటుపడిన మనస్సును కదలించి, వాటిని విడిచిపెట్టి, అంతకంటే సునిశితమూ సూక్ష్మమూ అయిన ఉపనిషద్విజ్ఞానాన్ని అర్థం చేసుకోవడానికి అనువుగా శిష్యుని సంసిద్ధుని చేస్తారు ఆచార్యులు. ఆ తరువాత అంతకంటే సూక్ష్మతరమైన ధ్యానంలో అధ్యయనాన్ని కూడా విస్మరింపజేస్తారు, ఈ విధంగా మనస్సు యొక్క పరిధిని క్రమంగా ఏకాగ్రతను పెంచుతూ అనంత సత్యాన్ని బోధించి, నిరూపించి, ఆ అనుభవానికి శిష్యుడిని సంసిద్ధునిగా చేస్తారు గురుదేవులు.

ధ్యాననిష్ఠుడయిన శిష్యుని ఆ ధ్యానంనుండి కూడా ముక్తునిచేసి ఆత్మానుభవాని కనువుగా మలచడానికి మహర్షి యిక్కడ ఇలా ఉపదేశించారు. ధ్యానంచేస్తున్నానన్న భావమే అహంకారానికి జీవంపోసి, ధ్యానికి ధ్యానలక్ష్యానికి మధ్య అర్థరహితమూ అనవసరమూ అయిన విభేదాన్ని సృష్టిస్తుంది. అందుకే మహర్షి చివరగా ఈ హెచ్చరికను చేస్తున్నారు.

కలాన్ని ఖడ్గసమమైన నేర్పుతో ఉపయోగించగలనని ఇదివరకే నిరూపించారు అష్టావక్రమునీంద్రులు. వాడియైన తనలేఖినితో శిష్యుని మనస్సును గాయంచేసి హేళనచేసి అతని మూర్ఖత్వాన్ని శాశ్వతంగా నిర్మూలించగల సమర్థులాయన. ఈ గీత మూడవ అధ్యాయం అంతటా ఈ విధానమే వాడబడడాన్ని మనం ఇదివరకు స్పష్టంగా చూచాము.

ఇక్కడ మళ్ళీ అదే విధానాన్ని ఉపయోగిస్తూ గురుదేవులు ఇలా అంటున్నారు. "మనస్సును ధ్యానంతో నియమించడానికి శ్రమించే మూఢునికి ఆత్మానుభవం ఎన్నటికీ సిద్ధించదు" "సుకృత బలంతో ధన్యుడై చిత్తశుద్ధితో సత్యాన్నన్వేషించి సాధకుడు శ్రవణ మననాలతో ఆత్మతత్త్వాన్ని అర్థంచేసుకుని సర్వసాధనలనూ వీడి ఆత్మానుభవంలో ఆనందంగా ఉండగలుగుతాడు. ధ్యానం మార్గమయితే అపరోక్షానుభూతి గమ్యం. యాంత్రికంగా సాధనలనూ చేస్తూ, తెలివితక్కువగా మనస్సుతో ఏదో ఒక భావాన్ని పట్టుకొని ఆగిపోవడం, ధ్యానికీ సత్యానికీ భేదం ఉందని ఒప్పుకోవడమే అవుతుంది నామమాత్రావిశిష్టమయిన

ఈ అహంకారం కూడా పూర్తిగా నశించాలి. నేను ధ్యానిని అనే భావం అంత రించాలి అప్పుడు మాత్రమే విషయి విషయరూపమైన ద్వంద్వ ప్రపంచం అదృశ్యమయి అద్వితీయమైన ఆత్మతత్త్వం స్వయంగా ప్రకాశిస్తుంది.

శ్లో॥ మూఢో నాప్నోతి తద్బ్రహ్మ యతో భవితుమిచ్ఛతి ।
అనిచ్ఛన్నపి ధీరో హి పరబ్రహ్మ స్వరూపభాక్ ॥37.

టీ॥ యతః = ఏ కారణమువలన, మూఢః = అజ్ఞాని, బ్రహ్మ = బ్రహ్మము, భవితుం = అగుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడో, తతః = ఆ కారణమువలననే, సః = అతడు, తత్ = ఆ బ్రహ్మమును, న అప్నోతి = పొందజాలకున్నాడు, ధీరః = జ్ఞాని, అనిచ్ఛన్నపి = కోరకున్నను, పరబ్రహ్మస్వరూపభాక్ = పరబ్రహ్మ స్వరూపమును పొందువాడుగా, భవతి = అగుచున్నాడు.

**మూఢుడు బ్రహ్మత్వాన్ని సాధించలేడు, సాధించాలనే అతని కోరికే అందుకు అవరోధంగా నిలుస్తుంది. జ్ఞాని బ్రహ్మత్వాన్ని కోరకుండానే, అర్థం చేసుకోవడంతో ఆ బ్రహ్మమై నిలుస్తాడు.**

ధ్యాన సాధనలన్నిటికీ కారణంగా సత్యాన్ని సాధించాలనే కోరిక ఉండి తీరుతుంది. చివరిదైన ఈ కోరికే సాధకుని తన సాధనకు బంధీని చేస్తుంది. చివరికోరికైన ఈ ముముక్షుత్వం మొత్తం కోరికలన్నిటికంటే అతిబలీయమై దృఢమైన బంధంగా సాధకుని మనస్సును సాధనతో బంధిస్తుంది. ఈ చివరి బంధాన్ని ఛేదించడమే ఈ శ్లోకం లక్ష్యం. సాధన ప్రథమదశలో ముముక్షుత్వాన్ని గొప్పదిగా వర్ణించి ప్రోత్సహిస్తారు. అలా దానిపై విలువను పెంచుకున్న మనస్సు సహజంగా మిగిలిన కోరికల బంధంనుండి ముక్తమయి, ఏకాగ్రమయి, సునిశితమూ తీక్షణమూ అవుతుంది. అంతవరకూ అనేక ఆకర్షణలతో చీలి బలహీనమయిన మనస్సు తనశక్తి అంతటితో కోరిన ఈ ఒకే ఒక చివరికోరిక మహాబలవంతంగా తయారయి, అజేయంగా అహంకారాన్ని రూపొందిస్తుంది. కోరే అహంకారం వేరుగా, కోరబడేది వేరుగా ద్వైతభావం మరింత బలపడుతుంది. ద్వైతం ఏ రూపంలో ఉన్నా గర్హనీయమే. అద్వయమయిన ఆత్మానుభవాన్ని పొందడానికి, ద్వైతాన్ని చూపించే మనోబుద్ధులను వీలైనంత బలహీనంచేసి చివరగా వాటిని అధిగమించాలి. ఇందుకు ముముక్షుత్వం సాధన ప్రథమదశలో సహకరించినా, చివరలో బలీయమైన బంధంగా రూపుదాలుస్తుంది. అందుకే ఆచార్యులు ఇక్కడ సాధకులను హెచ్చరిస్తూ అద్వయమయిన ఆత్మానుభవంలో

ఉండడానికి ద్వైతాన్ని భావాలరూపంలో చూపించే మనస్సు నధిగమించి, భావశూన్య స్థితిలోకి రావలసిన అవసరాన్ని ఇంతగట్టిగా నొక్కి చెప్పు తున్నారు. మనస్సు భావశూన్య రూపంలో తెలియబడుతూ ఉంటే మనస్సన బడుతుంది. ఆలోచనా ప్రవాహం ఆగిపోతే అద్వయమయిన ఆత్మతత్త్వం నిశ్చలంగా ఉంటుంది. కదలిక ఉన్నప్పుడు తరంగాలుగా నామరూపాలతో తెలియబడిన సముద్రమే, కదలిక ఆగినప్పుడు నిశ్చల గంభీరంగా, మహా సాగరంగా, కేవలంగా నిలుస్తుంది.

ఆత్మతత్త్వాన్ని సాధించాలనే కోరిక ఉన్నంతసేపూ అది కోరికగానే మిగిలిపోతుంది. నిద్రపోవాలనే కోరిక బలంగా ఉన్నంతసేపూ నిద్రపట్టటం లేదనడం ఎంత హాస్యాస్పదం?!? ఆ కోరిక అంతరించినప్పుడు నిద్రలో ఉండడం జరుగుతుంది. అందుకే శాస్త్రాధ్యయనం చేస్తూ, మననం చేసే వారంతా ధ్యానాది సాధనల ప్రయోజనాన్నీ పరిమితిని గుర్తించి, సరైన సమయంలో వాటిని విడిచిపెట్టగలగాలి.

అందుకే వేదాంత సాధన ప్రారంభదశలో శాస్త్రాధ్యయనాన్నీ, శ్రవణ మననాలను ముముక్షుత్వాన్ని యమ నియమాది సర్వసాధనాలను ప్రోత్సహించి మనస్సును ఏకాగ్రం చెయ్యమని గురువులు బోధిస్తారు. ఇలా ఏకాగ్రతతో బలీయమైన మనస్సు ఏదో బలాన్ని ఉపయోగించి ఈ చివరి కోరికను కూడా విస్మరించాలనే సత్యాన్ని మహర్షి ఇక్కడ గట్టిగా చెప్పుతున్నారు. నాచే చూపబడే మనశ్శరీరాలు నేను కాదని తెలుసుకోవడంతో ప్రారంభమయిన ముముక్షుత్వం నేనెవరో తెలుసుకోవాలని బలంగా కోరుకుంటుంది. ఈ కోరిక బలంగా ఉన్నంతకాలమూ మనస్సుతో తాదాత్మ్యం ఉంటూనే ఉంటుంది. శాస్త్రహృదయాన్ని బుద్ధితో అర్థం చేసుకుని, నేను ఆత్మను అని తెలుసుకుని, ఆత్మను సాధించాలనే ఇన్నాళ్ళ తపనా అర్థరహితం హాస్యాస్పదం అని స్పష్టంగా గుర్తించిన బుద్ధి మౌనం దాల్చాలి, దాలుస్తుంది. అదే ఆత్మానుభవం అందామన్నా, అనుభవించే నేను వేరనే అపోహవచ్చే అవకాశం ఉంది---కాబట్టి అదే ఆత్మస్వరూపం నా సహజ స్వభావం, అని గుర్తించడమే సాధన ఫలం, ధ్యానలక్ష్యం, అదే మానవ జీవిత పరమార్థం. అందుకే నేను ఆత్మను సాధించాలి దర్శించాలి అనే కోరికను అర్థరహితంగా గుర్తించి, ఆత్మనే నేను అనే దృష్టిని స్థిరంగా ఉంచుకోవాలి.

ప్రాపంచికమయిన చిన్న చిన్న కోరికలను విడచిపెట్టగలగడం అంత గొప్ప విషయమేమీకాదు. అంతకంటే పెద్దకోరిక అనదగిన ఆత్మసాక్షాత్కారం ముందు అవన్నీ అల్పంగా తోచడంతో వాటంతట అవే అంతరించిపోతాయి. నిజమైన ధీరత్వం బలీయమైన ఈ చివరి కోరికను త్యజించడమే. అతడే నిజమైనసన్యాసి అతడే సత్ చిత్ ఆనందరూపం. పరబ్రహ్మం,ఆత్మ,ఈ విషయాన్నే యోగవాశిష్ఠం ఇలా ఘోషిస్తోంది.

భారూపైక స్వరూపేస్మిన్ స్వరూపేణ జయామ్యహమ్. (యోగవాశిష్ఠం)

*నా స్వస్వరూపంగా ఈ అనంత చైతన్యాన్ని గుర్తిస్తూ ఆనం దంగా జీవిస్తున్నాను.*

క్లుప్తంగా చెప్పాలంటే ఆత్మానుభవం విజ్ఞానంవలన మాత్రమే సాధ్యం, ఆ రాచబాటలో ఇక్కడ ఆగి చూస్తే ధ్యానరూపమయిన మనోనియమం అర్థ రహితం అనిచెప్పక తప్పదు. ఇది ఎంత ఉత్కృష్టమయిన కోరిక అయినప్పటికి, ఈ స్థితికి చేరేక అహంకారాన్ని జీవింపజేసే కోరికగా బంధంగా గుర్తింపబడి విడువబడాలి. ధ్యానిని,ధ్యేయాన్ని,విడదీసే దృష్టిగా పరిణమించి ముముక్షుత్వం చివరిదశలో ప్రతిబంధకమయి బాధిస్తుంది. అందుకే ఈ స్థితికి చేరిన సాధకులు ఆత్మతత్త్వాన్ని బుద్ధితో అర్థంచేసుకుని ఆత్మగా మిగిలిపోవాల. ఆత్మను దర్శించాలనీ, సాధించాలనీ కోరిక ఉంటే శ్రవణమననాల అవసరం ఇంకా ఉన్నట్టే. శాస్త్రహృదయం అర్థం అయితే ఈ చివరికోరిక అదృశ్యమయి ఆత్మతత్త్వం అద్వితీయంగా భాసిస్తుంది!

**శ్లో॥ నిరాధార గ్రహవ్యగ్రా మూఢా స్సంసారపోషకాః ।**
**ఏతస్యానర్థమూలస్య మూలచ్ఛేదః బుధైః ॥ 38.**

**టీ॥** నిరాధారాః = ఆధార రహితులైనటువంటివన్నీ, గ్రహవ్యగ్రాః = దురాగ్రహులైనటువంటివన్నీ, మూఢాః=మూఢులు, సంసారపోషకాః = సంసారమును పోషించువారుగా, (భవన్తి = అగుచున్నారు), అనర్థమూలస్య = అనర్థములకు హేతువైన, ఏతస్య = ఈ, సంసారస్య = సంసారముయొక్క, మూలచ్ఛేదః = మూలచ్ఛేదము, బుధైః = జ్ఞానులచేత, కృతః = చేయబడినది.

ముక్తిని సాధించాలనే తపనతో మూఢులు సంసారాన్ని పోషిస్తూ చిరంజీవిని చేస్తున్నారు. తెలివైనవారు ఈ సంసార వృక్షమూలాన్ని ఛేదించి హాయిగా జీవిస్తారు.

ఉన్న సత్యమేదో సరిగ్గా తెలియని అజ్ఞానంవలన వివిధ ప్రత్యేక రూప సమన్వితమయిన ఈ మహావిశ్వం ఉన్నట్టుగా గుర్తింపబడుతోంది. తెలివైన వారు ఈ సంసార వృక్షం యొక్క మూలమనదగిన అజ్ఞానాన్ని నశింపజేసి హాయిగా జీవిస్తారు. సత్యాన్ని సరిగ్గా గుర్తింపని ఈ అజ్ఞానం, ఈ అగ్రహణ అన్యథాగ్రహణాలు, సత్యాన్ని సరిగ్గా గుర్తించడం అనబడే జ్ఞానంతోనే నశిస్తాయి. అనంతసత్యాన్ని పరిమిత ప్రపంచంగా గుర్తించే మనోబుద్ధులతోనే సత్యాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలనే తపనతో అనేక సాధనలను చేసేవారిని జ్ఞానులతో పోలుస్తూ వర్ణిస్తున్నారు మునీంద్రులిక్కడ. తెలివిహీనులయిన ఈ సాధకులు తమకాలాన్నీ శక్తిని మనస్సును నియమించడానికి నిగ్రహించడానికి వెచ్చిస్తారు. అసలు మనస్సే భ్రమకు జన్మస్థానంగా, తాను వేరుగా ప్రపంచం వేరుగా భావిస్తూ భ్రమిస్తూ పరిభ్రమిస్తూ ఉంటుంది. ఈ మూలకారణాన్ని గుర్తించి ఛేదించకుండా, నియమించి, నిగ్రహించాలనుకోవడం పరిణతి నందిన సాధకు లకు కాలాన్ని వృథా చేయడమే అవుతుంది.

ఈ సూచన సాధన ప్రథమ దశలో ఉన్నవారికోసం కాదు. సాధనా బలంతో మనోబుద్ధులను వశంచేసుకున్న సంయమీంద్రుడు జనకరాజర్షి. అతని యిష్టంతో ఆజ్ఞతో సేవకులవలె సేవిస్తాయి అతని మనోబుద్ధులు. అవసర మయితే వాటిని నిర్మూలించగల మహాధీరుడయిన శిష్యుని ఉద్దేశించి గీత మొత్తం అంతా ఉపదేశింపబడింది.

"నిరాధారా"---మనస్సూ దానిలోని సర్వభావాలూకూడా శుద్ధచైతన్యం ఆధారంగా గుర్తింపబడి అనుభవింపబడుతున్నాయి. అట్టి మనస్సును నియమిం చాలనుకోవడం స్వప్నంలోని స్వాప్నికుని ప్రవర్తనను సరిదిద్దాలనుకోవడం వంటిదే. తాడులో ఉన్న పామును చంపాలనుకుని కఱ్ఱతో బాదడంవంటిదే!!

జాగ్రదవస్థలోనికి రాగానే స్వాప్నికుని ప్రవర్తన అంతరిస్తుంది, తాడును గుర్తిస్తే చంపడానికి పామే ఉండదు! ఆత్మతత్త్వాన్ని గుర్తించగానే స్వాధీనం చేసుకోవలసిన మనస్సుకాని మార్చుకోవలసిన ప్రపంచంగాని ఉండనే ఉండవు.

"అనర్థమూలస్య"--అన్నిఅనర్థాలకు కారణం ఆత్మవిషయమైన అజ్ఞానమే. ధ్యానించాలని ప్రయత్నించడం ధ్యాని అజ్ఞానంలో ఉండడాన్ని సూచిస్తుంది. తనకంటే భిన్నంగా జగత్తును, జగదీశ్వరుని చూస్తున్నప్పుడే ధ్యానించాలనే కోరికకు ఆస్కారం ఉంటుంది. అందుకే అట్టివారిని పరిహసిస్తూ మార్గాన్ని నిర్దేశి

స్తున్నారు అష్టావక్రులు. శాస్త్రహృదయాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేని తెలివి హీనులు, ధ్యానంమీద విలువను పెంచుకుని, మనస్సును పోషిస్తూ, సంసార చక్రభ్రమణానికి ఇంకా దోహదం చేస్తూనే ఉంటారు.

ధ్యానం మొదలుపెట్టడానికి మనస్సును శాంతపరచి ఏకాగ్రం చెయ్యడానికి నియమాలూ ప్రయత్నాలూ అవసరమే. అనేక భావాలతో అశాంతి మయమైన మనస్సును ధ్యానంతో ఏకోన్ముఖం చేసిన తరువాత ధ్యానాన్ని వదలి జ్ఞానాన్నందుకోవాలి, అజ్ఞానపు ఉనికిని సాధ్యంచేసే రేఖామాత్రమయిన అహంకారాన్ని, తాను ధ్యానిస్తున్నాననే భావాన్ని విస్మరించాలి. అప్పుడు మాత్రమే జ్ఞానంలోకి అడుగుపెట్టడం సాధ్యం అవుతుంది. ఇదే మహర్షి సూచించే మహాలక్ష్యం, జీవనగమ్యం. అసత్తునుండి సత్తులోనికి, చీకటినుండి వెలుగు లోనికి, అనిత్యతనుండి నిత్యత్వంలోకి లంఘించాలి. ప్రస్తుతం సాధకుడు అజ్ఞానపు చివరిమెట్టుమీద నిలబడి అనంత సత్యంలో అడుగుపెట్టడానికి సందేహి స్తున్నాడు. ఇక్కడ అష్టావక్ర మహర్షి యిస్తున్న సూచనను అందుకోగలగడం జనక రాజర్షితో సరితూగగల తపస్సంపన్నులకు ప్రజ్ఞాధీవిశారదులకు మాత్రమే సాధ్య మవుతుంది!!

శ్లో॥ న శాన్తిం లభతే మూఢో యతశ్శమితు మిచ్ఛతి ।
ధీరస్తత్త్వం వినిశ్చిత్య సర్వదా శాన్తమానసః ॥ 39.

టీ॥ యతః = ఏ కారణమువలన, మూఢః = అజ్ఞాని, శాన్తిం = శాంతిని, ఇచ్ఛతి = కోరుచున్నాడో, తతః = ఆ కారణమువలన, సః = అట్టివాడు, శాన్తిం = శాంతిని, న లభతే = పొందడు, ధీరః = బుద్ధిమంతుడగు జ్ఞాని, తత్త్వం = పరతత్త్వమును, వినిశ్చిత్య = నిశ్చయముచేసికొని, సర్వదా = ఎల్లప్పుడు, శాన్తమానస = శాంతమైన మనస్సుగలవాడుగా నున్నాడు.

మనస్సును నియమించి శాంతిని సాధించాలనుకునే తెలివి హీనునికి అది ఎన్నటికీ సాధ్యం కాదు. సత్యాన్ని నిశ్చయంగా తెలుసుకున్న జ్ఞాని మనస్సు ఎప్పుడూ శాంతపూర్ణంగా ఉంటుంది.

భూతాన్ని చూసి భయాందోళనలతో విహ్వాలమయిన మనస్సు, ఆ కనిపించేది స్తంభమే అన్న నిశ్చయ జ్ఞానంతోనే శాంతిస్తుంది. ఆత్మజ్ఞాని మాత్రమే భావానాతీతమయిన పరమ శాంతిని అనుభవించగలడు. మూఢుడు శాంతిని వాంఛించి మనస్సును నియమించాలని ప్రయత్నిస్తాడు. ప్రయత్నం

ఉన్నచోట శ్రమ అశాంతి ఉండనే ఉంటాయి. అందుకే శాంతిని కోరుతూ అశాంతిపాలౌతుంటాడు. అంతేకాక సాధింపబడేది దూరమయే అవకాశంకూడా ఉంటుంది. మూఢుడు శాంతిని సాధించాలని కోరుకుని మనస్సును నియమించ డానికి శ్రమిస్తాడు, ఆ శ్రమకు బహుమానంగా శాంతి లభిస్తుందని భ్రమపడతాడు. ధ్యానించాలనే బలమైన భావమే మనస్సును మరింత బలవంతంగా చేస్తుంది. నిప్పును ఆర్పడానికి నీరనుకొని పెట్రోలును వాడడం వంటిదే ఇది కాగలదు. అగ్నికి ఆజ్యం తోడయినట్టే మనస్సుకు ధ్యానం కూడా కాగలదు. మనస్సు మనస్సుచే ఎన్నటికీ నియమింపబడదు. మనస్సు భావానికి ఎన్నడూ లోబడదు. మనోబుద్ధుల నధిగమించడమే వాటిని వశంచేసుకునే ఏకైక మార్గం. శాస్త్రం సహాయంతో ఆత్మతత్త్వాన్ని అర్థంచేసుకుని భావాతీతమూ భావనాధారమూ అయిన నిశ్చల శాంతిలో ఆత్మగా నిలచి ఆనందంగా జీవిస్తారు జ్ఞానులు. ఆత్మ తత్త్వాన్ని అర్థంచేసుకోవడమే మనస్సును అధిగమించడం!

**శ్లో॥ క్వాత్మనో దర్శనం తస్య యద్దృష్టమవలమ్బతే ।**
**ధీరాస్తం తం న పశ్యన్తి పశ్యన్త్యాత్మాన మవ్యయమ్॥40.**

టీ॥ గుత్ = ఎవనిచేత, దృష్టం = దృశ్యపదార్థము, అవలంబతే = అవలంబింప బడుచున్నదో, తస్య = అతనికి, ఆత్మనః = ఆత్మయొక్క, దర్శనం = దర్శనము, క్వ = ఎక్కడ, ధీరాః=జ్ఞానులు, తం తం=ఆయా, దృష్టం = దృశ్యప్రపంచమును, న పశ్యన్తి = చూడరు, (పరం తు = మరేమనగా), అవ్యయం = నాశరహితమగు, ఆత్మానం = ఆత్మను, పశ్యన్తి = చూచుచున్నారు.

వ్యక్తప్రపంచాన్ని చూస్తున్నవానికి ఆత్మదర్శనం ఎలా సాధ్యం? జ్ఞాని తాను చూస్తున్నదంతా అవ్యయమయిన ఆత్మతత్త్వమే అనే నిశ్చయ జ్ఞానం కలిగి ఉంటాడు.

మనస్సు నధిగమిస్తేనే ఆత్మానుభవం సాధ్యమవుతుందనే భావాన్ని ఈ శ్లోకం దృఢంగా చెప్తోంది. ఒక వ్యక్తికి అనుభవమయే ప్రపంచమంతా అతని ఇంద్రియాలతో తెలుసుకోబడేదీ, మనస్సుచే అనుభవింపబడేదీ, బుద్ధితో నిశ్చయింప బడేదిగా ఉంటుంది. మనలోని చైతన్యం మనోబుద్ధులద్వారా బాహ్యాభిముఖ మయి ఉన్నంతసేపూ నానాత్వమయిన ప్రపంచం తెలియబడుతూనే ఉంటుంది. ఆ విధంగా బాహ్యాభిముఖమయిన మనస్సుగల వ్యక్తి శుద్ధచైతన్య స్వరూపాన్ని ఎన్నటికీ చేరలేడు.

"ధీరాస్తం తం న పశ్యన్తి"---"ధీరులనదగిన జ్ఞానులు దానిని చూడరు". చిత్తశుద్ధితో ధ్యానాన్నభ్యసించి శాస్త్రాధ్యయనం సక్రమంగా చేసిన వారు, వారి ఉపాధుల తాదాత్మ్యాన్ని విడనాడి సామాన్యదృష్టిని అధిగమించగలుగుతారు. వారికి ప్రపంచంలోని వస్తువులు, మానసిక ఉద్రేకాలూ, బుద్ధిలోని నిశ్చయా నిశ్చయరూపమయిన భావాలూ కనిపించవు. ప్రగాఢ ధ్యానమగ్నమయిన క్షణాలలో మనోబుద్ధులు నిశ్చలంగా నిలచిపోవడంతో, ధ్యానించేవ్యక్తి ధ్యానింప బడేది అనే భేదం అంతరించి ఏకంగా ఆత్మమాత్రమే ప్రకాశిస్తుంది, అవ్యయ మయిన ఆత్మతత్త్వం అనుభవంలోకి వస్తుంది.

క్రిందటి శ్లోకంలోని భావమే వివరింపబడి దృఢంగా ఇక్కడ చెప్పబడింది. మనస్సుతో శాంతిని సాధించాలనే ప్రయత్నం ఉన్నంతసేపూ తాత్కాలిక శాంతి ఉండవచ్చునేకానీ సహజమైన ఆత్మతత్త్వం అనుభవంలోకి మాత్రం రానేరదు. మనస్సుయొక్క చలనాన్ని మనస్సుతో నిరోధించబూనడంలో చలనవేగం తగ్గుతుందికానీ చలించడం ఆగిపోదు, అందుకే తాత్కాలికంగా శాంతి లభిస్తుంది. కానీ నిశ్చలమయిన ఆత్మతత్త్వం అనూహ్యంగా అసాధ్యంగా మిగిలిపోతుంది. ధ్యానంపై తమకున్న విలువతో వ్యామోహంతో ధ్యానానికి బంధింపబడి ఆత్మను సాధించడం అసాధ్యం అని అక్కడే అశాంతితో ఆగిపోతూ, అలవాటయిన ధ్యానాన్ని మానలేక మళ్ళీ ప్రయత్నిస్తూ అలాగే ఉండిపోతారు. ఈ స్థితికి చేరిన తరువాత శాస్త్రహృదయాన్ని సరిగ్గా అర్థంచేసుకోగలిగితే, ఆత్మనుసాధించడం అసాధ్యమనీ, ఆత్మ సాధింపబడవలసినదికాదనీ, ఉన్నది ఆత్మమాత్రమేననీ తెలుసుకుని, సర్వప్రయత్నాలను వదలి, ధీరులు, ఆనందంగా జీవించ గలుగుతారు. ఈ నిశ్చయజ్ఞానమే మనస్సునధిగమించడానికి ఏకైక మార్గం. మనస్సు నధిగమించడమే ఆత్మానుభవం. నేను ధ్యానిస్తున్నాను అనుకుంటూ రేఖామాత్రంగా నిలచి ఉన్న అహంకారాన్ని త్యజించి ఆత్మానుభవంలో నిలవ మని ఈ శ్లోకం బోధిస్తోంది. అత్యంత విలువైన సూచననిచ్చే ఈ శ్లోకాన్ని అర్హులైన వారికి అమూల్యమయిన బహుమానంగా అష్టావక్ర మహర్షి అంది స్తున్నారు.

దృగ్గోచరమయే ప్రపంచమంతా విషయి-విషయ సంబంధంగా తెలియ బడుతుంది. విషయం విషయిలో విలీనమయిపోతే ఏకమూ అవ్యయమూ అయిన ఆత్మతత్త్వం అనుభవింపబడుతుంది, ఆత్మమాత్రమే ఉంటుంది.

శ్లో॥ క్వ నిరోధో విమూఢస్య యో నిర్బంధం కరోతి వై ।
స్వారామస్యైవ ధీరస్య సర్వదాఽసావ కృత్రిమః ॥41.

టీ॥ యః = ఎవడు, నిర్బంధం = చిత్తనిరోధమును, వై = హఠముతో, కరోతి = చేయుచున్నాడో, (తస్య = ఆ), విమూఢస్య = మూఢునకు, నిరోధః = చిత్తనిరోధము, క్వ = ఎక్కడ? (కలుగదని భావము). స్వారామస్య = ఆత్మారాముడగు, ధీరస్య = జ్ఞానికి, సర్వదా ఏవ = ఎల్లప్పుడును, అసౌ = ఈ చిత్త నిరోధము, అకృత్రిమః = కృత్రిమ రహితమైనది స్వాభావికమైనది.

మనస్సును నిరోధించాలని ప్రయత్నించే మూఢునికి అది ఎలా సాధ్యమవుతుంది? ఆత్మానుభవంలో ఆనందంగా ఉండే జ్ఞానికి మనస్సు ఎక్కడ? నిరోధించవలసిన ఆవశ్యకత ఎక్కడ?

మనస్సును నియమించే ప్రయత్నాలను ఎందుకు హేళన చేయవలసి వచ్చిందో ఇంకా మహర్షి వివరిస్తూనే ఉన్నారు. మనస్సును మనస్సుతో నిరోధించబూనడం నిష్ఫలం, కుక్కతోక వంకరను తీయడానికి ప్రయత్నించడం వంటిదే అది కాగలదు! మనస్సు స్వభావమే విషయాల నాశ్రయించి ఉండడం. విషయాలు లేనప్పుడు మనస్సుకు ఉనికే ఉండదు!!

మూఢులు మాత్రమే మనస్సును నిరోధించాలని ప్రయత్నం చేస్తారు, ప్రయత్నం ఉన్నంతసేపూ మనస్సు ఉండనే ఉంటుంది. అందుకే అట్టి ప్రయత్నం చేసేవారిని మూఢులు అంటున్నారు. మూఢుడైన సాధకునికి జ్ఞానికిగల తేడాను ఇక్కడ చూపిస్తున్నారు.

అనేక భావోద్రేకాలతో అశాంతిమయంగా ఉన్న మనస్సును సాధన ద్వారా ఏకోన్ముఖంచేసి తాత్కాలిక శాంతిని సాధించి అట్టి మనస్సుతో శాస్త్రి హృదయాన్ని అర్థం చేసుకుంటూ ధ్యానించాలి. ధ్యానం మనస్సును శాంత పరుస్తుంది, అట్టి శాంత సౌమ్య మనస్సును సాధించి చివరగా దానినికూడా విస్మరించాలి, అప్పుడే ఆత్మానుభవం సిద్ధంగా ఉంటుంది. "స్వారామస్యైవ ధీరస్య"---ఆ విధంగా ఆత్మగా ఆనందంగా ఉంటే ధీరులు, అట్టి జ్ఞానుల మనస్సు----సర్వదాసావకృత్రిమః----సర్వదా సహజంగా శాంతంగా ఉంటుంది. ఆత్మానుభవంలో మనస్సు నధిగమించిన అట్టి జ్ఞానికి మనస్సే ఒక మహాభ్రమ అని స్పష్టంగా తెలుస్తుంది!

మనస్సును నిరోధించడానికి సాధకుడు చేసే ప్రయత్నాలన్నీ అతనిని మనోతాదాత్మ్యంతో మరింతగా బంధిస్తాయి. ప్రయత్న బలంతో మనస్సు బలపడుతూ తన భ్రమాలోకంలో ఇలా జీవిస్తూనే ఉంటుంది. ఆత్మానుభవం సిద్ధించడంతో మనస్సును నిరోధించవలసిన అవసరం తీరిపోతుంది. అసలు మనస్సే భ్రమ అని స్పష్టంగా తెలుస్తుంది. భ్రమను భ్రమతో నిరోధించ బూనడం భ్రమను పెంచడమే అవుతుంది.

ప్రాథమికదశలో ఉన్న సాధకులు మనస్సును తప్పకుండా నియమించ వలసిందే. ఈ గీత అంతటా ఈ విషయం స్పష్టం చెయ్యబడుతూనే ఉంది. సాధనాబలంతో మనస్సును స్వాధీనం చేసుకుని, సత్యాసత్యాలను విమర్శించి తెలుసుకోగలిగిన బుద్ధితో, ఆత్మానుభవానికి అతి సమీపంలో ఉన్న అర్హులయిన సాధకులకే ఈ గీత ఉద్దేశింపబడింది. అసత్యాన్ని విమర్శించి తెలుసుకోగలిగిన బుద్ధితో, ఆత్మానుభవానికి అతి సమీపంలో ఉన్న అర్హులయిన సాధకులకే ఈ గీత ఉద్దేశింపబడింది. ఆ సత్యాన్ని విస్మరించి, సత్యాన్ని సమీపించి, ఆఖరి అడుగు య్యడానికి సందేహించేవారికి ఈ సూచన అమూల్యమయిన బహుమానంగా మహర్షిచే అందించబడింది.

**శ్లో॥ భావస్య భావకః కశ్చిత్ న కించిద్భావకోऽపరః ।**
**ఉభయాభావకః కశ్చిత్ ఏవమేవ నిరాకులః ॥ 42.**

టీ॥ కశ్చిత్ = ఒకానొకడు, భావస్య = భావముయొక్క, భావకః = భావకుడుగా, (భవతి = అగుచున్నాడు), అపరః = ఇతరుడు, కించిత్ = కొంచెముగూడ, న భావయతే = భావించుటలేదు, ఏవమేవ = ఈ ప్రకారముగానే, కించిత్ = కొంచెముగూడ, ఉభయా భావకః=భావాభావములను రెంటిని భావించినవాడై, నిరాకులః=స్వస్థ చిత్తుడగుచున్నాడు.

**కొందరు ఆధారమైన సత్యం ఉందని నమ్ముతారు, మరి కొందరు శూన్యం మాత్రమే ఉందని అనుకుంటారు. ఇలా దేనినీ భావించని జ్ఞాని చాలా అరుదుగా కనిపిస్తాడు. అతడు సర్వభావ సంచనాలనుండి ముక్తుడై సదా శాంతంగా ఉండగలుగుతాడు.**

"చార్వాకులు"---అని పిలువబడే భౌతిక వాదుల దృష్టిలో ప్రపంచపు ఉనికికి సత్యత్వం ఉంది. కనిపించే భౌతిక ప్రపంచం నిత్యమూ సత్యంగా ఉందని వారంటారు. "మాధ్యమికులు"---అని పిలువబడే కొందరు బౌద్ధులకు శూన్యం మాత్రమే సత్యం, కనిపించేదంతా అసత్యం. సాధన దృష్ట్యాకూడా కొంతమంది

ఆత్మను సత్ చిత్ ఆనందంగా ధ్యానించాలని, అందువల్ల ఆత్మానుభవం లభ్య మవుతుందని నమ్ముతారు. మరికొందరు మనస్సు నిశ్శబ్దమయినప్పుడు మాత్రమే ఆత్మతత్త్వం అనుభవంలోకి వస్తుందని అంటారు. వారి దృష్టిలో వస్తువుగా గుర్తింపబడడం అంటే వస్తు విషయమయిన జ్ఞానం అని అర్థం, ఈ విషయజ్ఞాన రహితమయిన చైతన్యమే శుద్ధమూ అనంతమూ అయిన ఆత్మగా వారు భావిస్తారు.

మనస్సు మామూలుగా ఇంద్రియాలను తృప్తిపరచే విషయభోగాల వైపు ఆకర్షింపబడి పనిచేస్తూ ఉంటుంది. అట్టి మనస్సును ఆ దృష్టినుండి మళ్ళిం చడానికి ఈ విభిన్న విధానాలన్నీ ఉపయోగపడతాయి. విషయ వాసనలనుండి విముక్తమయిన మనస్సు ధ్యానానుకూలంగా శాంతంగా సౌమ్యంగా తయారవు తుంది. ఆత్మానుభవంలోనికి జాగృతమయిన తరువాత ఆత్మను సత్యమైన ఉనికి కలిగి ఉన్నట్టుగానీ, ఉనికిలేదనికానీ నిర్వచించలేము. పరస్పరాధారంగా ప్రమాతచే తెలియబడే ప్రపంచం ఉన్నంతసేపే ఈ మాటలన్నిటికీ అర్థం ఉంటుంది. తెలుసుకునే ప్రమాతలేనప్పుడు అన్నిమాటలూ అర్థరహితాలే. ద్వంద్వాతీతమూ భావాతీతమూ అయిన అట్టి స్థితిలో నిలువగలిగిన మహాత్ములు నిజంగా చాలా అరుదే.

అందుకే అష్టావక్ర మహర్షి ఆశ్చర్యానందాలతో అంటున్నారు. "అలా దేనినీ భావంచని జ్ఞాని చాలా అరుదు" శాంతమైన ఆత్మచైతన్యం, సర్వ చరాచర ప్రపంచపు ఉనికిని తెలియజేసే మనస్సును ప్రకాశింపజేసే ఉనికి సత్యం అనిపిస్తుంది.అదే చైతన్యంలో మనస్సు లేకపోవడం సంభవించినప్పుడు శూన్యమే సత్యంగా భావింపబడుతుంది. ప్రపంచం ఉందనికానీ, లేదనికానీ తెలుసుకునే మనోబుద్ధుల కాధారమే శాంతమైన శుద్ధచైతన్యం, అదే ఆత్మ.

ఆత్మ నిత్యమూ శాంతస్వరూపమే ఇందులో ప్రపంచం నిజంగా ఎప్పుడూ లేనేలేదు, ప్రపంచం పుట్టి నశించిందని కూడా అనలేము. స్తంభం స్తంభంగా ఎప్పుడూ ఉంది, భూతమే భ్రమచే భావింపబడింది. భూతం కనిపించ డంతోగాని అదృశ్యమవడంతోగానీ స్తంభానికి ఎటువంటి సంబంధమూ లేదు.

శ్లో॥ శుద్ధమద్వయమాత్మానం భావయన్తి కుబుద్ధయః ।
నతు జానన్తి సమ్మోహాత్ యావజ్జీవమనిర్వృతాః ॥ 43.

టీ॥ కుబుద్ధయః = దుర్బుద్ధిగలవారు, శుద్ధం = శుద్ధమైనట్టియు, అద్వయం = అద్వితీయమైనట్టియు, ఆత్మానం = ఆత్మను, భావయన్తి = భావించుచున్నారు, తు = అయితే, సమ్మోహాత్ = అజ్ఞాన కారణమువలన, న జానన్తి = తెలిసికొనజాల కున్నారు, అతః = ఈ కారణమువలన, యావజ్జీవం = జీవితాంతమువఱకు, అనిర్వృతాః = సంతోష రహితులై యున్నారు.

**ఆత్మ శుద్ధమని అద్వితీయమని ధ్యానించే మూఢులు ఆత్మానుభవాన్ని పొందజాలరు. ఆత్మను సాధించాలనే భ్రమతో అసంతృప్తితో జీవిత మంతా గడిపివేస్తారు.**

బుద్ధితో మనతాదాత్మ్యం అతి బలీయమైనది. ధ్యానంలో ప్రగతి సాధించి శాస్త్రాన్ని కొంతవరకు అర్థంచేసుకున్న సాధకుడు కూడా బుద్ధినే తానుగా భ్రమిస్తూ బుద్ధిలోని భావాలతో శుద్ధచైతన్య స్వరూపమయిన ఆత్మను అద్వయంగా తెలుసుకోవాలనుకుంటాడు. తనచే చూడబడే బుద్ధి తానుకాదనే సత్యాన్ని విస్మరిస్తాడు. ఆ బుద్ధితో ఆత్మను దర్శించగోరినంతకాలమూ అది బుద్ధిలో కోరికగానే మిగిలిపోయి అశాంతికి లోనౌతాడు. అపారప్రేమతో ఉపనిషత్ ఋషులు ఆత్మతత్త్వాన్ని అతి ప్రయాసతో సూచించగలిగారు. ఆ పదజాలాన్ని బుద్ధితో గట్టిగా పట్టుకొని ధ్యానంపేరుతో వల్లెవేసినంతమాత్రాన అవి సూచించే ఆత్మతత్త్వం చేరలేము.సత్యంలోనికి జాగృతమవడానికి ధ్యానం నిస్సందేహంగా సాధనా మార్గమే. కాని ఆత్మానుభవంలో ఉండడమే అసలైనలక్ష్యం, ఆ గమ్యాన్ని చేరడానికి మార్గాన్ని ఎప్పటికయినా విడువక తప్పదు!

వివేకయుక్తమూ నిశితమూ తీక్షణమూ అయిన బుద్ధిలేనివారు ఎంతగా శాస్త్రాధ్యయనం చేసినా తమ అంతరంగంలో ఆత్మను దర్శించాలని సాధించాలని అనుకుంటూనే ఉంటారు! మనలో ఉంటూ సర్వాన్నీ విషయాలుగా చూచే చైతన్యమే ఆత్మ, ఈ ఆత్మ ఎన్నటికి విషయాకరింపబడదు, విషయి, విషయంగా మారడం అసంభవం. ఇలా అనడంలో ఆత్మవిచారణ చేయకూడదనే అర్థంలేదు, నిజానికి ఆత్మవిచారం చేయడం ఒక్కటే మనస్సును తన సహజ ధోరణి నుండి మళ్ళించే ఏకైక మార్గం. అయితే గమ్యం మాత్రం నేను ఆత్మగా మారడం కాదు, నేనే ఆత్మను అనే అనుభవంలో ఉండడమే.

బ్రహ్మగా మారడం ఒకస్థితికాదు.....అదే అసలైన సహజస్థితి, ఉన్నదే అది. ఆత్మను ధ్యానంతో సాధించాలనే భ్రమే మూఢులను ఆ అనుభవంనుండి దూరంగా ఉంచుతోంది. జీవితాంతమూ వారు ధ్యానిస్తూనే ఉంటారు, అయినా

వారిలోని అశాంతి తొలగిపోదు. వారి మనోబుద్ధుల ప్రభావంతో బంధింపబడే ఉంటారు.

శ్లో॥ ముముక్షోర్బుద్ధిరాలంబం అంతరేణ న విద్యతే ।
నిరాలంబైవ నిష్కామా బుద్ధిర్ముక్తస్య సర్వదా ॥ 44.

టీ॥ ముముక్షోః = ముక్తిని కోరువానియొక్క, బుద్ధిః = బుద్ధి, ఆలంబమంతరేణ = ఆలంబమును విడచి, న విద్యతే = ఉండదు, ముక్తస్య = ముక్తపురుషునియొక్క, బుద్ధిః = బుద్ధి, నిష్కామా = కామనారహితమైనదియు, చ = మఱియు, నిరాలంబా = ఆశ్రయ రహితమైనదియు, ఏవ = గానే, విద్యతే = ఉండును.

**ముక్తిని కాంక్షించే సాధకుని బుద్ధి ఏదో ఒక ఆధారాన్ని ఆశ్రయించే పని చేస్తూ ఉంటుంది. కోరికేలేని జీవన్ముక్తుని బుద్ధికి ఆధారం అవసరంలేదు. అక్కడ నిత్యముక్త భావరూపమయిన ఆనందం సర్వదా ఉంటుంది.**

సాధన ప్రథమ దశలో "ముముక్షుత్వం" అత్యవసరం. ఇది మహాశక్తి వంతమైనదికూడా. ముముక్షుత్వం ఎంత తీవ్రంగా ఉంటే అంతగా సాధకుడు ధ్యానాది నియమాలతో మనస్సును ఏకాగ్రంచేస్తూ అట్టి మనస్సుతో శాస్త్రాధ్యయనం చేస్తూ అర్థం చేసుకుంటూ ఉంటాడు. అయితే ఈ సాధన ఒక ప్రత్యేకదశకు చేరిన తరువాత ఈ ముముక్షుత్వం కూడా బంధమై మనోబుద్ధులను బంధిస్తుందని మహర్షి ఇక్కడ హెచ్చరిస్తున్నారు. ముక్తిని కోరుతున్నాడూ అంటే ఇంకా ఆత్మానుభవంలేనట్టే, అంటే ఇంకా అహంకారంగా మిగిలి ఉన్నట్టే. అహంకారం ఉన్నంతసేపే విషయి-విషయ సంబంధంగా పరస్పరాధారంగా ద్వైతమయిన సర్వజగత్తూ ఉండనే ఉంటుంది. అహంకారంతో ముక్తిని కోరే సాధకుడు, అహంకార స్వభావానుగుణంగా ఆత్మను కూడా విషయంగా దర్శించాలనుకుంటాడు! ఆత్మ తనకంటే భిన్నంగా ఉందని, తనకు తెలియకుండానే భ్రమపడుతూ ఉంటాడు.

జీవన్ముక్తుని బుద్ధిలో ఈ కోరికకూడా (ముముక్షుత్వం) అంతరించ డంతో అహంకారానికి ఆధారం ఏమీ ఉండదు. అతడు కేవలం ఆత్మగా తన్ను తాను, సర్వదా తెలుసుకుంటూ ఉంటాడు.

ఆత్మగురించి మనం ధ్యానించవచ్చు, కానీ ధ్యానఫలం మాత్రం ఆత్మానుభవమే, ఆ అనుభవంలో అనుభవించేవ్యక్తి అనుభవింపబడే ప్రపంచమూ

అని వేరుగా ఉండవు. ఆత్మానుభవం రావడం అంటే తాను ఆత్మగా ఉండడమే. స్వప్నాన్ని చూసేవాడు జాగ్రదవస్థలోకి రాగానే జాగృతుడే అవుతాడు

శ్లో॥ విషయద్వీపినో వీక్ష్య చకితాశ్శరణార్థినః ।
విశన్తి ఝటితి క్రోడన్ నిరోధైకాగ్రసిద్ధయే ॥ 45.

టీ॥ విషయద్వీపినః = విషయరూపములగు వ్యాఘ్రములను, వీక్ష్య = చూచి, చకితాః=భయపడినవారై, శరణార్థినః = శరీరమును రక్షించుకొనవలయుననెడి మూఢులు, నిరోధైకాగ్ర్యసిద్ధయే = చిత్తనిరోధము, ఏకాగ్రము సిద్ధించుటకొఱకు, ఝటితి = శీఘ్రముగా, క్రోడన్ = గూహలను(యందు), విశన్తి = ప్రవేశించుచున్నారు.

**విషయభోగాలనబడే పులులధాటికి తాళలేక భయభ్రాంతులైనవారు బుద్ధి గుహలోకి జొరపడి మనస్సును ఏకాగ్రంచేసి నిరోధించాలని ప్రయత్నిస్తారు.**

అహంకారం ఆధారంగాగలవ్యక్తి, విషయాలను చూడకుండా ఉండలేడు. విషయాలను గుర్తించగల ఉపకరణమే మనస్సు,మనస్సుకు విషయాలే ఆహారం, విషయాలతోనే మనస్సు పెరుగుతూ జీవిస్తూ ఉంటుంది. విషయాలు మనస్సు లోనికి ప్రవేశించి కోరికలనబడే ఝంఝూమారుతాలను లేవదీసి మనస్సును అశాంతిపాలు చేస్తాయి. అందుకే సాధకులు ప్రథమదశలో విషయభోగాల నుండి మనస్సును మళ్ళించవలసి ఉంటుంది. ఇందుకు భగవద్భక్తి ఎంతగానో సహాయ పడుతుంది. భగవంతుని స్మరిస్తూ బుద్ధి గుహలో తలదాచుకుంటారు. అంటే వివేకంతో విషయాలనుండి దూరంగా ఉంటారు. బాహ్యవిషయాలు కలిగించే ఉద్రేకాలకు అశాంతికి దూరంగా ఉండాలంటే మనస్సును విషయాల సంబంధం నుండి విముక్తం చేసి ఉన్నత లక్ష్యం వైపు మళ్ళించాలి. సాధన ప్రథమదశలో సాధకులకు ఇంతకంటే వేరేమార్గం లేదనడంలో ఎంత మాత్రమూ సందేహం లేదు.

మనస్సంయమనం సాధించిన సాధకులకే ఇక్కడ మహర్షి సలహా ఇస్తున్నారు. జీవన్ముక్తులు విషయాలను చూసి ఎంతమాత్రమూ భయపడరు. బుద్ధిగుహలో తలదాచుకోవలసిన అవసరమూ వారికిలేదు. ఆత్మవినా రెండవదేదీ వారికి కనబడకపోవడమే ఇందుకు కారణం. బృహదారణ్య కోపనిషత్తు ఈ విషయాన్నే ఇలా ఘోషిస్తోంది. "ద్వితీయాత్ వై భయం భవతి"---రెండవది కనిపిస్తే భయం ఉండితీరుతుంది!

సాధన ప్రథమదశలో ఈ సూచన పరస్పర విరుద్ధంగా కనిపించక

తప్పదు. అర్థరహితంగా అనిపించనూవచ్చు. ప్రాపంచిక విషయాలను చూసేదీ చూపించేదీ మనస్సే, మరల ఈ మనస్సే వాటివెంబడి పిచ్చిపరుగులు తీస్తూ ఉంటుంది. అందుకే మనస్సును శరణువేడి శాంతిని సాధించాలనుకోవడం మనంతట మనమే విషయభోగాలనబడే పులులనోట్లో తలపెట్టడం వంటిదే! క్లుప్తంగా చెప్పాలంటే మనస్సుతో ఎంత ప్రయత్నించినా శాంతి గగన కుసుమమే. ఎండమావిలోని జలంవంటిదే అందుకే మనస్సులో మనస్సుతో ఎంతదూరం ప్రయత్నించినా అది వ్యర్థమే. మనస్సుతో ప్రయత్నించకుండా మనస్సును అధిగమించడమే సరైన మార్గం. అప్పుడు మాత్రమే మనఃకల్పిత బంధాలనుండి ముక్తి లభించగలదు!!

## శ్లో॥ నిర్వాసనం హరిం దృష్ట్వా తూష్ణీం విషయదన్తినః ।
## పలాయన్తే న శక్తాస్తే సేవన్తే కృతచాటవః ॥ 46.

టీ॥ నిర్వాసనం = వాసనారహిత పురుషరూపమగు, హరిం = సింహమును, దృష్ట్వా = చూచి, విషయదన్తినః = విషయములను గజములు, న శక్తాః = అసమర్థము లైనవై, తూష్ణీం = ఊరకే, పలాయన్తే = పరుగెత్తిపోవుచున్నవి, తే = ఆ విషయములు, (ఈశ్వరా కృష్టాః = ఈశ్వరప్రేరితములైనవై), కృతచాటవః = ప్రియోక్తులుగల ప్రియు రాండ్రవలె, (తం = ఆ నిర్వాసనగలవానిని), అగత్య = వచ్చి, సేవన్తే = సేవించు చున్నవి.

వాసనారహితుడైన పురుష సింహుని చూసి విషయాలనబడే మదగజములు పారిపోతాయి. పారిపోలేకపోతే విధేయులైన సేవకులవలె సేవిస్తాయి.

జీవన్ముక్తుని గొప్పదనం ఇక్కడ వర్ణింపబడుతోంది. విషయాలమధ్య జీవిస్తున్నా అవి అతనిని బాధింపజాలవు. అంతేకాక మహారాజును సేవించే సేవకులవలె భక్తిగౌరవాలతో సేవిస్తాయి, అని మహర్షి అంటున్నారు.

మన బుద్ధిలో ఉన్న వాసనల వ్యక్తరూపమే కోరికలు. వాసనా రహితుడైన వానికి కోరికలుండవు. ఆ భయ భోగాల ననుభవించాలనే మనలోని కోరికే మనలను విషయాలకు బానిసను చేస్తుంది. కోరికలు లేని వ్యక్తిముందు విషయాలున్నా అవి అతనిని వశపరచుకోలేవు. బొమ్మల దుకాణంలో ఉన్న పిల్లవాడు ఉత్సాహ ఉద్రేకాలకు లోనవడం మనకు తెలిసిందే. అతని తండ్రి మాత్రం నిర్వికారంగా ఉంటాడు! ఇద్దరిచుట్టూ అనేక ఆటవస్తువులు ఉండడం

నిజమే, అయితే బాలునికి మాత్రమే కోరిక ఉండడంతో అవి బాలుని మనస్సుతో ఆడగలుగుతాయి. అతని తండ్రిలో వాటికి సంబంధించిన వాసనలు లేక పోవడంతో నిర్వికారంగా ఉండగలుగుతాడు.

వాసనారహితుడయిన జీవన్ముక్తునిలో కోరికలుండవు.కాబట్టి ప్రాపంచిక విషయాలతనిని ఆకర్షించి బాధించవు, బంధించవు. తపో నిష్ఠాగరిష్ఠులైన వయో వృద్ధులైన ఎందరో మునులు దేవేంద్రుడు పంపిన అప్సరసల రూప వయో విలాసాలకు మోహపడి, తపస్సుని వీడి మాయా జాలంలో చిక్కుకున్న సంఘటనలను మన పురాణాలలో అనేకచోట్ల చూడవచ్చు. అదే, కైలాసపతి ముందు సాక్షాత్తు ఇంద్రాణివచ్చి నాట్యంచేసినా అతనిలో ఎటువంటి చలనమూ ఉండదు. యోగనిష్ఠలో తపోదీక్షలో అణచిపెట్టబడిన కోరికలు అవకాశం వస్తే విజృంభిస్తాయి. జ్ఞానంతో కోరికలయొక్క మూలాన్ని, వాటి ప్రభావాన్ని బాగా తెలుసుకుని కోరికలనుండి ముక్తినందిన వానిని విషయాలెన్నైనా, ఏవయినా ఆకర్షించవు, బాధించవు.

కోరికలతోనిండిన మనస్సును మాత్రమే ప్రాపంచిక విషయాలు ఆకర్షిస్తాయి. కోరికలు లేని జ్ఞాని మదగజసమమయిన ఇంద్రియ భోగ్యవిషయాల మధ్య సింహంవలె ధీరుడై చరిస్తూ ఉంటాడు. ఏనుగులు చాలా బలమైన జంతువులే, అయినప్పటికీ మృగరాజైన సంహాన్ని అవి ఏమీ చెయ్యలేవు. అలాగే విషయాలు ఎంత సుందర రమణీయాలైనా కోరికలు లేని జ్ఞానిని ఏమీ చెయ్యలేవని మహర్షి అంటున్నారు. భగవద్గీత కూడా ఇదే భావాన్ని సూచిస్తోంది.

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.

(భగవద్గీత 2-58)

*విరాగియైన యోగి విషయభోగాలు ఆకర్షించలేక తిరిగిపోతాయి, ఇట్టి విరాగిలో కోరికలు లేకపోయినా విషయాలకు స్పందించే గుణం మాత్రం మిగిలి ఉంటుంది. ఆత్మానుభవంతో అదికూడా అంతరిస్తుంది.*

ఈ భావానికి తోడుగా మహర్షి మరొక్క భావాన్నికూడా చెప్పుతున్నారిక్కడ. ఈ విధంగా విషయాలు తొలగిపోక పోయినా వాసనా రహితుడయిన మహాత్ముని, విశ్వాసంగల భటులు రాజును సేవించినట్టుగా సేవిస్తూ లొంగి ఉంటాయి.

శ్లో॥న ముక్తికారికాన్ దత్తే నిశ్శంకో యుక్తమానసః ।
పశ్యఞ్ఛృణ్వన్స్పృశన్ జిఘ్రన్నశ్నన్నాస్తే యథాసుఖమ్॥47.

టీ॥ నిశ్శంకః = శంకారహితుడును, యుక్తమానసః = నియమితమును, నిశ్చల మునైన మనస్సుగలవాడునగు జ్ఞాని, ముక్తికారికాన్ = యమనియమాది యోగక్రియలను, అగ్రహాత్ = పట్టుదలవలన, న దత్తే = ధారణచేయడు, కిం తు = మరేమనగా, పశ్యన్ = చూచుచు, శృణ్వన్ = వినుచు, స్పృశన్ = తాకుచు, జిఘ్రన్ = ఆఘ్రాణించుచు, అశ్నన్ = తినుచు, సః = అతడు, యథాసుఖం = సుఖపూర్వకముగా, ఆస్తే = ఉంటున్నాడు.

సందేహరహితుడై తన్ను ఆత్మగా నిశ్చయంగా తెలుసుకున్న వ్యక్తి, ముక్తికోసం మనః సంయమరూపమైన ధ్యానం చెయ్యాలని అనుకోడు. చూస్తూ, వింటూ, స్పృశిస్తూ, వాసనచూస్తూ తింటూ ఆనందంగా జీవిస్తాడు.

తాను ఆత్మననే దృఢజ్ఞానం కలిగిన వ్యక్తి జీవన్ముక్తుడే. అతనిలో అహంకారంతో తాదాత్మ్యం చెందిన వ్యక్తిత్వం ఉండదు. కర్త అనుకునే అహంకారమూ కోరికలూ లేకుండా అతనిచే చెయ్యబడిన కర్మలు కొత్తగా అతనికి ఫలితాలను సంపాదించి పెట్టవు, కొత్తవాసనలు సృష్టింపబడవు.

జీవన్ముక్తుని ఇంద్రియాలు వినడం చూడడం మొదలయిన పనులను చేస్తున్నా అవేవీ అతనికి చెందవు. ఆ కర్మలన్నీ ఆయా ఇంద్రియాలకు చెందినవి మాత్రమే. జడమైన ఇంద్రియాలు చైతన్యం సన్నిధిలో చలిస్తూ ఉంటాయి. ఆ చైతన్యమే తానుగా తెలుసుకున్న జ్ఞానిని ఈ కర్మలేవీ బంధించజాలవు. సూర్యుని వేడిమితో నీరు ఆవిరిగా మారి మేఘాలుగా ఏర్పడుతుంది. ఆ మేఘాలు నీటిని వర్షిస్తాయి. ఆ నీరు సూర్యుని తడపగలదా? సూర్యుడు వర్షాన్ని కురిపించడని అనగలమా? అయినా సూర్యుడు లేకుండా వర్షం పడజాలదు. ఇదే విధంగా జీవన్ముక్తుని సన్నిధిలో శరీరం పనిచేస్తూన్నా ఆ కర్మలేవీ అతనిని స్పృశించలేవు. అతడు శరీరంలోలేడు, శరీరమే అతనిలో (చైతన్యంలో) ఉంది.

శ్లో॥ వస్తుశ్రవణ మాత్రేణ శుద్ధబుద్ధిర్నిరాకులః ।
నైవాచార మనాచారం ఔదాస్యం వాన పశ్యతి ॥ 48.

టీ॥ వస్తుశ్రవణ మాత్రేణ = శ్రవణమాత్రముచేతనే, శుద్ధబుద్ధిః = పరిశుద్ధమైన బుద్ధిగలవాడును, నిరాకులః = వ్యాకులములేనివాడైన (స్వస్థిచిత్తుడగు పురుషుడు), ఆచారం వా = ఆచారమునుగాని, అనాచారం వా = అనాచారమును గాని, ఔదాస్యం = ఉదాసీనతనుగాని, న పశ్యతి = చూడడు.

సత్యమైన ఆత్మతత్త్వం గురించి విన్నంత మాత్రాన్నే, తెలివైన వాని బుద్ధి శుద్ధమయి శాంతంగా జీవిస్తాడు. అతనికి ఇది చెయ్యదగినది, ఇది చెయ్యకూడనిది అన్న భావాలు ఉండవు. ఏదైనా చేస్తున్నాననికానీ చెయ్యడం లేదనికానీ అతడనుకోడు.

ఆ విధంగా శాంతంగా నిశ్చలమూ అయిన బుద్ధితో శాస్త్రిసారాన్ని ఒక్కసారి విన్నంత మాత్రాన్నే చిత్తశుద్ధి కలిగిన సాధకుడు, శాస్త్రిం సూచించే ఆత్మతత్త్వాన్ని అర్థంచేసుకుని ఆ అనుభవంలో ఉండిపోగలుగుతాడు. సాధకునిలో కోరికలు లేకపోవడంతో మనస్సులోని ఏ ఒక్క భావమూ కూడా విషయాలతో ముడిపడి మిగిలిపోదు. తన సర్వభావాలతోడి ఆత్మను అర్థం చేసుకుని, ఆత్మనే తలపోసే అట్టి బుద్ధి, అచిరకాలంలోనే ఆ అనుభవంలో నిశ్చలంగా భావరహితంగా ఉండిపోగలుగుతుంది. భావశూన్యస్థితిలో నిలవడమే జీవన్ముక్తి. అదే ఆత్మానుభవం.

అట్టి జీవన్ముక్తునికి ఆచరించవలసినవికాని విసర్జించవలసినవి కాని ఏవీ ఉండవు. కర్మ అకర్మల ప్రమేయం ఉండదు. అతడు కర్తనని భోక్తనని అనుకోడు, అతనిలో అహంకారం నశించింది. అందుకే అతడేపనిని చెయ్యనట్టే. అన్నికర్మలు కూడ అతని సన్నిధిలో జరుగుతున్నాయి. ధర్మాధర్మాలు బుద్ధి నిర్ణయించే విలువలు మాత్రమే. బుద్ధితో తాదాత్మ్యం చెందే అహంకారం నశించిన అతనికి ధర్మాధర్మాలు ఉండవు. జాగృతుడయిన వానికి స్వప్నంలోని ధర్మాధర్మాలతో ఏం ప్రయోజనం ఉంటుంది? అదేవిధంగా ఆత్మతత్త్వంలోనికి జాగృతుడయిన జ్ఞాని విషయం కూడా ఉంటుంది. మనవలెనే ప్రపంచంలో నివసిస్తున్నా అతడీ ప్రపంచానికి చెందడు. కేవలం అతిథిమాత్రమే!

**శ్లో॥ యదా యత్కర్తుమాయాతి తదా తత్కురుతే ఋజుః ।**

**శుభం వాప్యశుభం వాఽపి తస్య చేష్టా హి బాలవత్॥50.**

**టీ॥** యదా = ఎప్పుడు, శుభం వా = శుభమైనదిగాని, అశుభం వా = అశుభమైనదిగాని, యత్ = ఏ కర్మ, కర్తుం = చేయుటకు, ఆయాతి = వచ్చుచున్నదో, తదా = అప్పుడు, తత్ = ఆ కర్మను, ధీరః = జ్ఞాని, ఋజుః = ఆగ్రహములేనివాడై, కురుతే = చేయుచున్నాడు, హి = ఎందుకనగా, తస్య = అతనియొక్క, చేష్టా = వ్యవహారము, బాలవత్ = బాలునివలె, భవతి = అగుచున్నది.

/ జ్ఞాని తనకు ప్రాప్తించిన ఏకర్మలనైనా, మంచివి, చెడ్డవి, అని భావించక సమదృష్టితో శాంతంతో ఆచరిస్తాడు. కేవలం బాలునివలె అతని ప్రవర్తన ఉంటుంది.

అన్ని సమయ సందర్భాలలోనూ పరిస్థితులలోనూ కూడా జ్ఞాని సమ భావంతో శాంతంగా జీవించగలడు. ప్రారబ్ధానుసారంగా సంప్రాప్తమయిన కర్మ లను మనశ్శరీరాలతో కర్త భోక్త భావాలు లేకుండా ఆచరిస్తుంటాడు. దేనినీ కావాలని కోరుకోడు, వచ్చిన దానిని నిరసించడు. ఎట్టి పరిస్థితులలోనూ భయాం దోళనలకు, సంతోషాతిశయాలకు లోనుకాడు. సంఘటనలను సాక్షిగా చూస్తూ క్రొత్త కోరికలను కోరకపోవడంతో కర్మలతనిని బంధింప సమర్థంకావు. అహంకార మమకారరహితుడైన సర్వత్రా ఏకమైన సత్ చిత్ ఆనందమైన తన స్వరూపాన్నే వీక్షిస్తూ శాంతంగా జీవించే అట్టి మహాత్మునికి శుభాశుభ భావాలే ఉండవు. కోరే మనస్సుకు, నిర్ణయించే బుద్ధికి తన్ను వేరుగా తలపోస్తూ నానాత్వాన్ని దర్శించే అహంకారాన్ని అధిగమించి, ఏకత్వానుభవంలో స్థిరుడయి ఉంటాడు.

సంప్రాప్తించిన వాటిని శాంతంగా వీక్షిస్తూ నిశ్చల మనోబుద్ధులతో జ్ఞాని వ్యవహరించేతీరు బాలునివలె కనిపిస్తుంది. ఈ ఉదాహరణ ఇదివరకే వివరంగా చర్చించబడింది.

ఇదే అధ్యాయంలోని 29 వ శ్లోకపు భావాన్ని ఈ శ్లోకం వ్యతిరేకించి నట్టుగా స్ఫురిస్తుంది. "తాను కర్తననే భావం తనలో ఉన్నవాడు కర్మలను చేయకున్నా చేసినట్టే అహంకార వర్జితుడయిన జ్ఞాని కర్మలనాచరించినా మానినా నిశ్చయంగా అతడెన్నడూ దేనినీ చేయనట్టే చెప్పవచ్చును." అయినా నిశితంగా పరిశీలిస్తే అదేభావం విపులీకరించబడడం కనిపిస్తుంది.

**శ్లో॥స్వాతంత్ర్యాత్సుఖమాప్నోతి స్వాతంత్ర్యాల్లక్షతే పరం ।**
**స్వాతంత్ర్యాన్నిర్వృతిం గచ్ఛేత్ స్వాతంత్ర్యాత్పరమం పదమ్ ॥ 50.**

టీ॥ జ్ఞానీ = జ్ఞాని, స్వాతంత్ర్యాత్ = స్వాతంత్ర్యమువలన, సుఖం = సుఖమును, ఆప్నోతి = పొందుచున్నాడు, స్వాతంత్ర్యాత్ = స్వాతంత్ర్యము వలన, పరం = పరమును, లభతే = పరమును, లక్షతే=పొందుచున్నాడు, స్వాతంత్ర్యాత్ = స్వాతంత్ర్యమువలన, నిర్వృతిం = పరమశాంతిని (సుఖమును), గచ్ఛేత్ = పొందుచున్నాడు,

స్వాతంత్ర్యాత్ = స్వాతంత్ర్యమువలననే, పరమం పదం = పరమ పదమును, ఆప్నోతి = పొందుచున్నాడు.

**సుఖమూ, సుఖాతీతమయిన ఆనందస్థితి, భావరహిత శాంతస్థితి చివరగా ఆత్మానుభవం అన్నీ కూడా స్వతంత్రం వల్లనే లభిస్తాయి.**

దేనితోనూ బంధింపబడకుండా స్వతంత్రంగా ఉన్న మనస్సుతోనే ఆత్మానుభవాన్ని పొందగలగడం సాధ్యమవుతుంది. మంచిదయినా చెడ్డదయినా సరే ఆలోచన ఉందంటే మనస్సులో వికారం కలిగినట్టేగదా? సరోవరం ఉపరితలం కల్లోలితమయినప్పుడే తరంగాలు కనిపిస్తాయి. ఏ సదాచార నియమాలయినా, ధార్మిక విలువలయినా, చివరగా ధ్యానించే మనస్సయినా సరే మనస్సు కల్లోలితమయినప్పుడే భావంగా భాసిస్తుంది! భావరహితంగా ఉండగలగడమే అమనస్కంగా ఉండడం, అదే నిశ్చల నిజచైతన్య స్వరూపదర్శనం, అనుభవం ధ్యాననిష్ఠులయిన సాధకులకు ఈ సత్యాన్నే ఇక్కడ అష్టావక్ర మహర్షి సూచిస్తున్నారు.

తెలివిహీనుడై ప్రాపంచిక విషయ సుఖభోగాలలో మునిగి తేలుతూ ఆలోచనారహితుడై విచక్షణా శూన్యుడైన మూఢుడు ఆత్మానుభవంలో ఉన్నాడని ఇక్కడ అర్థంకాదు. సంసిద్ధత, అర్హత, తెలివిలేని కొంతమంది, యథేచ్ఛగా భోగాలనుభవించడమే ఆత్మదర్శనానికి మార్గమని కూడా అనుకోవచ్చు! అట్టి వారిని గర్హించకూడదు. వారినిచూసి జాలిపడాలి! వారునమ్మిన సిద్ధాంతాన్ని సమాజానికి బోధించబూనితే అంతకంటే హానికరమైనదేదీ ఉండదు. వారు సమాజానికి చీడపురుగులై ఇంకా హీనస్థితికి దిగజార్చి మనుషులను మృగ తుల్యులుగా మారుస్తారు. ఈ అష్టావక్రగీత ప్రాథమిక దశలో ఉన్న సాధకుల నుద్దేశించి చెప్పినది కాదని, మొదటినుండీ హెచ్చరిస్తూనే ఉన్నాం. సాధన చతుష్టయసంపన్నులై, శాస్త్రాధ్యయనం చక్కగా చేసి, ధార్మిక జీవనం జీవిస్తూ అంతరంగశుద్ధిని, నిశ్చల మనోబుద్ధుల శాంతస్థితిని సాధించి, సత్యాన్వేషణ కోసమే జీవిస్తున్న ఉత్తమాధికారులకు, అర్హులకు ఈ గీత ఉద్దేశించబడింది. అహంకారాన్నీ తద్వారా చూడబడే ప్రపంచపు స్వభావాన్నీ చక్కగా అర్థం చేసుకుని,భావంలో భావంతో గుర్తింపబడే భావనామయ జగద్భ్రమను విడనాడా లనే దృఢసంకల్పంతో ధీరత్వంతో ఆఖరి అడుగు వేయబోయే సత్యాన్వేషులకు, సాధకశ్రేష్ఠులకు మాత్రమే ఈ గీత సరి అయిన ప్రయోజనాన్నివ్వగలదు.

శ్లో॥ అకర్తృత్వమభోక్తృత్వం స్వాత్మనో మన్యతే యదా ।
తదా క్షీణా భవన్త్యేవ సమస్తాశ్చిత్త వృత్తయః ॥ 51.

టీ॥ యదా=ఎప్పుడు, (పురుషః=పురుషుడు), స్వాత్మనః=తన ఆత్మకు, అకర్తృత్వం = అకర్తృత్వమును, అభోక్తృత్వం = అభోక్తృత్వమును, మన్యతే = తలంచు చున్నాడో, తదా=అప్పుడు, తస్య = అతనియొక్క, సమస్తాః = సమస్తములయిన, చిత్తవృత్తయః = చిత్తవృత్తులు, క్షీణాః = క్షీణములైనవిగా, భవన్త్యేవ = నిశ్చయముగా నగుచున్నవి.

**తనలో ఉందనుకుంటున్న ఆత్మ నిజానికి కర్తా భోక్తా కాదని తెలుసుకున్న జ్ఞానిలో సర్వభావసంచలనాలూ సమసిపోతాయి.**

ఆధ్యాత్మికసాధనలో అభివృద్ధి సాధిస్తున్నకొద్దీ, ఉపాధిమీదా ఉపాధిచే చూడబడే ప్రపంచంమీదా దృష్టితగ్గి వీటికి ఆధారమైన ఆత్మమీదే దృష్టిని అధికంగా నిల్పడం జరుగుతుంది. సర్వానికీ అధిష్ఠానమయిన ఆత్మగా తన్ను తాను సదా తెలుసుకుంటూ ధ్యానించడంలో క్రమంగా తన శారీరిక చర్యలకు తాను కర్తననీ భోక్తననీ భావించడం తగ్గిపోతుంది. ఈ విధమయిన భావనా పరిణామ క్రమమే మనోబుద్ధులను శాంతపరచే మహౌషధం. పూర్తిగా శాంతించిన మనస్సులో అహంకారం నశిస్తుంది.

అయితే ఈ విధంగా ఆత్మనుగూర్చి విచారణ చేయడంకూడా ఆలోచన తోనే "నేను ఆత్మను" అనే అవగాహనగానీ, "అనంతమైన ఆత్మలో కర్త భోక్తలు లేరనే" అవగాహనకానీ, ఆలోచనలే అయినప్పటికి వాటిలో అద్భుతమైన శక్తి ఇమిడి ఉంది. ఇలా సదా ఆత్మవిచారణ చేయడంతో అహంకారం బలహీనమయి నిశ్చలత్వం దాలుస్తాయి. అహంకారమే శారీరిక కర్మలను తనవిగానూ, మనో బుద్ధుల చలనాన్ని తనదిగానూ భావిస్తూ, కర్తృత్వ భోక్తృత్వ భావాలను పెంచుకుంటూ సుఖ దుఃఖాల ననుభవిస్తూ ఉంటుంది. ఆత్మ విషయమయిన ఆలోచన ఏకాగ్రంగా తగినంతకాలం మనస్సులో ఉంటే ఇతర ఆలోచనలన్నిటినీ నశింపజేయడమేకాక తానుకూడా చివరగా అదృశ్యమయిపోయి, ఆత్మానుభవం సిద్ధిస్తుంది. కేవలం తార్కికంగా ఒక సిద్ధాంతాన్ని నిలబెట్టడానికి ఉద్దేశింపబడిన మాటలు కావివి, వేదాంత విద్యార్థులు గరళంలా ఆ వాదాన్ని మింగనూలేక కక్కనూ లేక బాధపడే అవసరమూ లేదు, గుడ్డినమ్మకం అంతకంటే కాదు! సత్యా న్నన్వేషించే సునిశితమూ తీక్షణమూ అయిన ఏ బుద్ధిచేతనయినా తార్కికంగా ఆమోదింపబడేదే.

ఆత్మవిషయమైన అవగాహన, నిశితంగా పరిశీలిస్తే ఆలోచనేకాదు. ప్రతి ఆలోచనకు ఆధారంగా ఒక వస్తువో విషయమో ఉంటుంది. నామం రూపం వేరుగా ఉండజాలవు. మిగిలిన ఆలోచనలకు భిన్నంగా ఆత్మపరమైన ఆలోచన విషయాల గురించికాక, విషయికి సంబంధించి ఉండడంతో ఇది ఆధార శూన్యమయిన "ఆలోచన" అవుతోంది. పరస్పరాధారంగా గుర్తింపబడే ఈ ద్వంద్వ ప్రకృతిలో ఆధార శూన్యమయిన ఆలోచనను---ఆలోచన అనలేము. అయినప్పటికీ మనోభావాలు నశించడంలో చివరిదనదగిన ఈ అఖండమైన ఆత్మ ఆకార వృత్తి సాధకునికి ఊతకట్టవలె సహాయపడి, స్వస్వరూపస్థితిలో నిష్ఠ కలిగిస్తుంది.

కర్తృత్వ భోక్తృత్వ భావాలు పూర్తిగా నశించగానే అహంకారం అదృశ్యమయిఅహంగా సర్వభూతాత్మగా సత్ చిత్ ఆనందంగా మిగిలిపోతుంది. ధ్యాని ధ్యేయమూ ఐక్యమయిపోతాయి. నదిసాగరంలో కలిసిపోయి అభిన్నంగా ఏకంగా జలమయినట్లు, ఇదే జీవబ్రహ్మ ఐక్యంగా అభివర్ణించబడుతుంది.

**శ్లో॥ ఉచ్ఛృంఖలా ప్యకృతిగా స్థితిర్ధీరస్య రాజతే ।**
**నతు సంస్పృహ చిత్తస్య శాంతిర్మూఢస్య కృత్రిమా॥52.**

**టీ॥** ధీరస్య = జ్ఞానియొక్క, స్థితిః = స్థితి, ఉచ్ఛృంఖలా అపి = స్వేచ్ఛ గలదియై శాంతిరహితమైనదివలె నున్నను, అకృతికా = స్వాభావికమైనదై(శాంతి యుతమైనదై), రాజతే = ప్రకాశించుచున్నది, సంస్పృహచిత్తస్య = కోరికలతో నిండిన మనస్సుగల, మూఢస్య = మూఢునియొక్క, శాంతిః = శాంతి, కృత్రిమా = కృత్రిమమైనదై, న రాజతే = ప్రకాశించదు.

**విధినిషేధాలనుండి విముక్తినందిన జ్ఞాని ప్రవర్తన సహజానందంతో ప్రకాశిస్తూ ఉంటుంది.అభ్యసించిన శాంతితో ఎంత నియమబద్ధంగా ప్రవర్తించినా కోరికలతో నిండిన మనస్సుగల మూఢుని చేష్టలు కృత్రిమంగానే ఉంటాయి.**

ఇంద్రియానుభవాలద్వారా సుఖాన్ని సాధించాలనే కోరిక జీవన్ముక్తునిలో ఉండదు. అతనిలో ఏ విధమయిన కోరికలూ ఉండవు. విధినిషేధాలతో పనిలేకుండా, స్వతంత్రంగా సహజంగా అతడు చరించగలుగుతాడు. సదా ఆత్మానుభవనిష్ఠుడై శాంతస్వరూపంగా ఆనందంగా అద్వయమయిన తన స్వరూపాన్నే సర్వత్రా వీక్షిస్తూ ఉంటాడు.

అట్టి జ్ఞాని స్థితిని నిర్దేశిస్తూ మూఢుని ప్రవర్తనను పోల్చి చూపిస్తున్నారిక్కడ. తనలోని కోరికలనూ ఉద్రేకాలనూ అణచుకొని బాహ్యంగా శాంతంగా ఉన్నట్టుగా కనిపించే మూఢుని చర్యలలో కృత్రిమత్వం అడుగడుగునా స్ఫురిస్తూనే ఉంటుంది. ఇలా కృత్రిమంగా ప్రయత్నపూర్వకంగా శాంతంగా ఉన్నట్టుగా పైవారికి కనిపంచవచ్చు కానీ, అతని అంతరంగం అశాంతితో నిండి ఉంటుంది, ఆత్మానుభవం అట్టివారికి గగన కుసుమమే అవుతుంది.

నిజమైన సాధకుడు ఇటువంటి కృత్రిమపు శాంతిని హర్షించకూడదు, ఆశించకూడదు. నిజమైన శాంతి ఆత్మానుభవంలోనే లభిస్తుంది. సరైన జ్ఞానం వలననే ఆత్మానుభవం సిద్ధిస్తుంది. అప్పుడు మాత్రమే అహంకారం అంతరిస్తుంది.

**శ్లో॥ విలసన్తి మహాభోగైః విశన్తి గిరిగహ్వరాన్ ।**
**నిరస్త కల్పానా ధీరా అబద్ధా ముక్త బుద్ధయః ॥ 53.**

టీ॥ నిరస్త కల్పనాః = సంకల్పరహితులును, అబద్ధాః = బంధన రహితులును, ముక్త బుద్ధయః = ముక్త బుద్ధులునగు, ధీరాః = జ్ఞానులు, కదాచిత్ = ఒకప్పుడు (ప్రారబ్ధవశాత్ = ప్రారబ్ధవశమున), మహాభోగైః = మహాభోగములతో, విలసన్తి = ఒప్పుచున్నారు, (కదాచిత్ = ఒకప్పుడు), గిరిగహ్వరాన్ = కొండ గుహలయందు, విశన్తి = ప్రవేశించుచున్నారు.

మనోబుద్ధులలోని భావాల తాదాత్మ్యంనుండి విడివడి తన్ను తాను ఆత్మగా గుర్తించిన జ్ఞానులు సంతోషంగా సరదాగా అప్పుడప్పుడు మనోబుద్ధులతో ప్రపంచంలో వ్యవహరిస్తారు. మరొకప్పుడు పర్వత గుహలలో ధ్యానమగ్నులై ఉండనూగలరు.

జీవన్ముక్తులనుభవించే ముక్తస్థితిని, వారి ఆనందాన్ని, సుఖంగా పరిపూర్ణతృప్తితో వారు జీవించే విధానాన్నీ గానం చెయ్యడానికే అష్టావక్ర మహర్షి ఈ అధ్యాయాన్ని అంకితం చేసినారు. జ్ఞాని ప్రపంచంలో జీవిస్తున్నప్పుడు అతని దృక్పథం ఎలా ఉండేదీ, బాహ్యవిషయాలకు అతడేవిధంగా స్పందించేదీ ఇక్కడ వర్ణిస్తున్నారు.

పరిపూర్ణుడయిన అట్టి మహాత్ముడు అహంకార రహితుడు, మనోబుద్ధులను అధిగమించినవాడు, కాబట్టి అతనిలో బాహ్య విషయాలపట్ల, వాటి ఉనికి వైఖరిపట్ల, ఊహాకల్పనలు ఎంతమాత్రమూ ఉండవు. మనఃకల్పనలు లేక

పోవడంతో అతని మనస్సు సదా శాంతంగా ఉంటుంది. అహంకార వర్జితుడయిన అతని బుద్ధికి బంధుత్వ భావన ఉండదు. అతడి కోరికలచే అతడు పరిమితం కాబడడం లేదు. ఈ విధంగా అతడి మనోబుద్ధులు వాటి సహజ గుణాలయిన కోరికల భావాల ఒత్తిడినుండి విడివడి, ధ్యానఫలమయిన శాంతస్థితిని అనుభవిస్తూ తృప్తిగా ఉండగలుగుతాయి.

ఈ విధమయిన నిత్యతృప్త మానసంతో, శాంతబుద్ధితో కిరీటం లేని చక్రవర్తివలె జ్ఞాని జీవిస్తూ ఉంటాడు. అతడు సరదాగా, తన ప్రారబ్ధవశాత్తూ ప్రాప్తించిన మనశ్శరీరాలతో ప్రపంచాన్ని శాంతంగా వీక్షిస్తూ క్రీడించనూ గలడు. ఏకాంతంలో గిరి గహ్వారాలలో నదీతీరాలలో సమాధిస్థితుడై స్వరూపనిష్ఠలో కాలాతీతంగా ఉండనూగలడు.

జ్ఞానిశరీరం ఎక్కడ ఉంది అన్న విషయం అతడికి అనవసరం; అప్రస్తుతం. ఆ శరీరం ప్రారబ్ధానుగుణంగా అనంత సుఖభోగాల మధ్యనయినా, మహాకష్టదశ లోనయినా ఉండవచ్చును. ఆ పరిస్థితులేవీ అతనికి సుఖదుఃఖాల నివ్వజాలవు. అహంకారమేలేని అతడు విషయభోగాల సుఖాన్ని కానీ, ప్రాపంచిక కష్టాలను కాని అనుభవించడు. శరీరం ప్రారబ్ధానుగుణంగా అనుభవించడాన్ని, సాక్షిగా, శాంతంగా, నిర్వికారంగా చూడగలుగుతాడు. అహంకార మమకార రహితుడయిన అతనిని ఇంద్రియ భోగ్య క్షేత్రాలు కదలింపజాలవు. సర్వమూ భావనామయు మని, భావాలు తన నర్తనలని, భావం భావాన్ని కదిలిస్తోందని స్పష్టంగా చూస్తూ శాంతంగా సర్వదా కేవలంగా తానుగా ఆత్మగా ఉండగలుగుతాడు.

జ్ఞాని సుఖభోగాల ననుభవిస్తున్నట్టుగానీ, సత్కర్మ నిష్ఠాగరిష్ఠుడై ఉన్నట్టుకానీ, లేదా ఏకాంతంలో సమాధి స్థితుడయినట్టు కానీ మనకనిపించ వచ్చును. ఇది మన దృష్టిమాత్రమే. అతడే స్థితిలో ఉన్నట్టు మనం భావించినా అవన్నీ మన భావనలే. అతడు మాత్రం సదా ఆత్మానుభవస్థితుడై ఏకత్వాన్ని సర్వదా చూస్తూ శాంతుడై ఉంటాడు. జీవన్ముక్తునికి అతని మనఃకల్పిత ఉపాధీ, జగత్తూ ఇంద్రజాలంవలె స్వప్నం వలె ఉన్నా లేకున్నా ఒకటే. అహంకారంతో తాదాత్మ్యం చెందినప్పుడు మాత్రమే ఏదైనా ఆ విధంగా ఉండాలని కాని, ఇంకొక విధంగా మారాలని అనిపిస్తుంది. బుద్ధిలో విలువలతో తాదాత్మ్యం చెందిన అహంకారం మాత్రమే స్థితిని మార్పును గుర్తిస్తూ కోరుతూ ఉంటుంది. అహంకార వర్జితుడయిన జ్ఞాని నిర్వికారంగా భావాల లీలలను వీక్షించగలుగుతాడు!

**శ్లో॥ శ్రోత్రియం దేవతాం తీర్థం అంగానాం భూపతిం ప్రియం।**
**దృష్ట్వా సంపూజ్య ధీరస్య న కాపి హృది వాసనా ॥ 54.**

టీ॥ శ్రోత్రియం = పండితుని, దేవతాం = దేవతను, తీర్థం = తీర్థమును, సంపూజ్య = పూజించి, చ = మఱియు, అంగనాం = స్త్రీని, భూపతిం = రాజును, ప్రియం = ప్రియులైన పుత్రాదులను, దృష్ట్వా = చూచి, ధీరస్య = జ్ఞానియొక్క, హృది = హృదయమునందు, కా అపి = ఎటువంటి, వాసనా = వాసనయు, న భవతి = కలుగదు.

వేదవిదులను దేవతలను పూజిస్తున్నా, తీర్థాలను సేవిస్తున్నా, సౌందర్యవతులైన స్త్రీలను, మహారాజును, ప్రియజనులను చుస్తున్నా, అతనిలో కోరిక లేశ మాత్రమయిన ఉదయించదు. స్థిర చిత్తంతో చూస్తూ ఉంటాడు.

వేదవిదులను దేవతలను పూజించడమూ, తీర్థసేవనమూ మనదేశంలో చాలా సహజమైనవే, ఇటువంటి కార్యకాలాపాల మధ్యనున్నప్పటికి జ్ఞానిలో ఎటువంటి కోరికా ఉదయించదు. అందమైన స్త్రీని, మహారాజును, యిష్టులను చూసినా ఒకేవిధంగా నిర్వికారంగా అతడుండగలడు.

అహంకారానికి అతీతంగా నిలచి, సర్వత్రా ఏకత్వాన్ని అనుభవించగల జ్ఞానికి సర్వమూ సమానమే, సర్వమూ తన స్వరూపమే, సర్వమూ ప్రియమే. అందుకే అతడు సర్వకాల సర్వావస్థలలోనూ సమదృష్టితో శాంతంగా ఉండగలడు.

**శ్లో॥ భృత్యైః పుత్రైః కళత్రైశ్చ దౌహిత్రైశ్చాపి గోత్రజైః ।**
**విహస్య ధిక్కృతో యోగీ నయాతి వికృతిం మనాక్॥55**

టీ॥ భృత్యైః = సేవకులచేతను, పుత్రైః చ = పుత్రులచేతను, కళత్రైః = భార్యచేతను, దౌహిత్రైః=మనుమల చేతను, గోత్రజైః అపి = దాయాదులచేతను, విహస్య = నవ్వి, ధిక్కృతః=ధిక్కరింపబడినవాడైనప్పటికినీ, యోగీ = జ్ఞాని, మనాక్ = కొంచెము గూడ, వికృతిం = వికారమును, (క్షోభను), న యాతి = పొందదు.

సేవకులు, పుత్రులు, భార్య, దౌహిత్రులు, బంధువులు, వీరిలో ఎవరు ఏవిధంగా దూషించినా, బాధించినా, అతడు వికారం చెందదు, బాధపడడు.

అవమానాలు, దూషణలు, అహంకారాన్ని గాయపరచక మానవు. అయితే ఈ రెండూ జ్ఞాని దృష్టిలో, దూషించేవాని మనస్సులో కదిలే రెండు రకాల భావనా వీచికలు మాత్రమే! సంతోషంతో నిండిన మనస్సులోంచి పొగడ్తలవంటి మంచి శబ్దాలు వస్తాయి. క్రోధ విచారాలతో యీర్ష్యతో నిండిన మనస్సునుండి

తిట్లు అవమానాలు ఉదయిస్తాయి. వస్తుతః రెండూకూడా మనోవికార జనిత భావాలే! భావనాధారంగా ఆత్మ చైతన్యంగా తన్ను తాను తెలుసుకున్న జ్ఞాని భావాల క్రీడ అని శాంతంగా సమదృష్టితో వీక్షిస్తాడు. సాధారణంగా మనలోని అహంకారమే బుద్ధితో తాదాత్మ్యంచెంది ఎదుటివారి మాటల అర్థాన్ని గ్రహించి సంతోష విచారాలను అనుభవిస్తూ ఉంటుంది. ఆత్మతత్త్వాన్ని అర్థం చేసుకుని అహంకారపు మాయను జయించిన ధీరుని, మానావమానాలు ఏం చెయ్యగలవు? రెండూ అదే చైతన్యంలో ఉద్భవించి నర్తించి నమస్కార సూచకమయిన మౌనంతో పాదాభివందనంచేసి అదృశ్యమయిపోతాయి.

ఒకసారి బుద్ధభగవానుడు బజారులోనుండి శిష్యసమేతంగా వస్తూ ఉన్నాడు. ఒకవ్యక్తి ఆయనను సమీపించి దూషించి అవమానించడం మొదలు పెట్టేడు. అన్నిటినీ శాంతంగా వింటూ భగవానుడు నిలబడ్డాడు. అవన్నీ పూర్తయిన తరువాత అదే శాంతంతో ఆయన ముందుకు సాగబోతుంటే ఆయన శిష్యుడు అపరిమితమైన ఆవేశంతో "స్వామీ ఆ నీచునికి బుద్ధి చెప్పి వస్తాను అనుజ్ఞ నీయండి, దైవస్వరూపులయిన మిమ్మల్ని అన్ని మాటలన్న అతడు క్షమార్హుడు కాడు" అన్నాడు. అందుకాయన చిరునవ్వుతో "వత్సా! అతడన్న మాటలన్నిటిని నేను విన్నాను కాని, స్వీకరించలేదు. అందుకే నేనతనికి తిరిగి యివ్వవలసిందేదీ లేదు. ఒకవేళ నీవు స్వీకరించి ఉంటే తప్పకుండా వెళ్ళి బదులు తీర్చి రా నాయనా" అన్నారట. బుద్ధితో సాధించగలిగిన పూర్ణత్వం ఇదే. దీనినే సమబుద్ధి అంటారు.

ఆత్మజ్ఞానికి తన చైతన్యమే భావనా తరంగాలుగా సర్వత్రా నర్తిస్తూందనే సత్యం సర్వదా స్ఫురిస్తూనే ఉంటుంది. చూడబడే, గుర్తింపబడే సర్వమూ తన నర్తనలే అని అతడికి స్పష్టంగా తెలుసు. అహంకారంలేని కారణంగా, మనోబుద్ధులతో తాదాత్మ్యం చెంది, సంఘటనలను యిష్టాయిష్టాల దృష్టితో చూడడు. మానావమానాలతనికి సమానమే. దేనిపైనా అతనికి ఆకర్షణా వికర్షణా ఉండవు. సర్వత్రా, సర్వదా, సర్వ సంఘటనలలోనూ, చైతన్యమయిన తానే భావనా తరంగాలుగా నర్తించడాన్ని గుర్తిస్తూ మౌనసమయ మాధురీపూర్ణ మానసంతో శాంతుడై ఉంటాడు!

**శ్లో॥ సన్తుష్టోఽపి న సన్తుష్టః ఖిన్నోఽపి న చ ఖిద్యతే ।**
**తస్యాశ్చర్యదశాంతాం తాం తాదృశా ఏవ జానతే॥ 56.**

టీ॥ జ్ఞానీ=జ్ఞాని యగువాడు లోక దృష్టితో, సన్తుష్టః అపి = సంతుష్టుడైనప్పటికినీ, న చ సన్తుష్టః = సంతుష్టుడుకాడు, ఖిన్నః అపి = దుఃఖమును పొందినవాడైనప్పటికీ, న చ ఖిద్యతే = దుఃఖింపడు, తస్య = అతనియొక్క, తాం తాం = ఆయా, ఆశ్చర్య దశాం = ఆశ్చర్యదశలను, తాదృశా ఏవ = అటువంటివారే, జానతే = తెలిసికొను చున్నారు.

**సంతుష్టుడయినా అతడు సంతోషించడం లేదు. విచారాన్ననుభవిస్తున్నా అనుభవించడంలేదు. అటువంటి మరొక మహాత్ముడై అతని ఆ మహత్తర ఆశ్చర్య అద్భుత స్థితిని గుర్తించగలడు!**

ఆత్మలో ఆత్మగా నివసించే జ్ఞాని మనస్సు నధిగమించి ఉంటాడు. కాబట్టి అతని మనస్సు సంతోషంగా ఉన్న అతడిని సంతుష్టుడు అనకూడదు. సంతోష విచారాలు మనోధర్మాలు అతని మనస్సు మాత్రమే వాటిని అనుభవిస్తోంది. అతడిని సంతుష్టుడు బాధితుడు అని ఎలా అనగలము? శరీరం, మనస్సు, బుద్ధి, నాకు చెందినవి. నేను వాటి స్వంతదారుని, వాటిని కలిగి ఉన్న స్వామిని నేను. కాని, అవి నేను కాదు! అవి సంతోష విచారాల ననుభవిస్తుంటే, స్వామినైన నేను అనుభవిస్తున్నాను అని ఎలా అనగలను? నా గేదె విరోచనాలతో బాధపడుతూ ఉంటే నేను వైద్యం చేయించుకోవాలా? నిజమే. గేదె నాదే! అందులో సందేహం లేదు. అయినా నేను గేదె కాదు, కదా!

అట్టి మహాత్ముడు ఎక్కడయినా ఉండవచ్చును. ఏ పరిస్థితులలో నయినా ఉండవచ్చును. అయినా సర్వదా సర్వత్రా తాను ఆత్మగా ఆనందంగా ఉంటాడు. ఆశ్చకరమయిన ఈ దశ, అహంకార పూరితమయిన బుద్ధికి అర్థం కావడం కష్టమే. ఈ స్థితిని వర్ణించడానికి అశక్తమయిన వాణి, వీణానాదంతో వినతులర్పిస్తూ మౌనంగా ఉండిపోవలసిందే! భావనాతీత మయినది భాషకు కూడా అతీతమే. భావానికి భాషకు అవినాభావ సంబంధం ఉంది. భాషకధీనమై భావం భాసిస్తుంది. భావం ఉంటేనే భాష జీవిస్తుంది. ఇదేవిధంగా చైతన్యం ఉంటేనే భావాలు నర్తిస్తాయి. భావాలే తనరూపుగా చైతన్యం వ్యక్తమవుతుంది. భావాలు భాషగా వీలైనంత వర్ణించి మౌనం దాలుస్తాయి. భావనాధారంగా, భావాలుగా, చివరగా మౌనంగా కూడా ఆత్మే ఉంది. భావార్థాన్ని గ్రహించి నిలిచి పోగలగడమే మానవజీవిత పరమార్థం. జన్మించితినన్న భావానికి సార్థకత సంపూర్ణత ఇది మాత్రమే.

మనోబుద్ధుల నధిగమించినప్పుడే ఆత్మానుభవం సిద్ధిస్తుంది. మనో

బుద్ధులతో తెలుసుకోవాలనుకుంటున్నంతకాలమూ భావాలే కనిపిస్తుంటాయి! భావాతీతమయిన స్థితిలో ఉన్న జ్ఞాని ఏంచేసినా చెయ్యకున్నా, అతనికి మనం ఏం చేసినా, మానినా, అతని దృష్టిలో సమానమే. స్వప్నంలోని సుఖదుఃఖాలు జాగృతుని బాధించినట్లే ప్రాపంచిక సుఖదుఃఖాలు జీవన్ముక్తుని చలింపజేయవు.

శ్లో॥ కర్తవ్యతైవ సంసారో న తాం పశ్యన్తి సూరయః ।
శూన్యాకారం నిరాకారా నిర్వికారా నిరామయాః॥57.

టీ॥ కర్తవ్యతా ఏవ = కర్తృత్వబుద్ధియే, సంసారః = సంసారము, తాం=ఆ కర్తృత్వ బుద్ధిని, శూన్యాకారాః = శూన్యాకారులును, నిరాకారాః = నిరాకారులును, నిర్వికారాః = సంకల్ప రహితులును, నిరామయాః = దుఃఖ రహితులును (అగు), సూరయః = జ్ఞానులు, న పశ్యన్తి = చూడరు.

**కర్తవ్యదృష్టే, ధర్మాచరణభావమే, ఈ సర్వసృష్టికూడా, సర్వవ్యాపిగా నిరాకారంగా, పరిణామ రహితంగా, నిష్కళంకంగా తన్ను తాను గుర్తించిన జ్ఞానికి ధర్మాధర్మాల ప్రసక్తే ఉండదు.**

స్వప్నంలో నా కుటుంబానికి, సమాజానికి, నేను నిర్వర్తించవలసిన ధర్మాలెన్నో ఉంటాయి. ఆ కర్తవ్యదీక్ష చాలా పవిత్రమైనది, అనుల్లంఘనీయ మైనది. నిజమే!

స్వాప్నికుడు (తైజసుడు అని పిలవబడతాడు) స్వప్నంలో ఉన్నంత సేపూ అది నిజమనే భావిస్తాడు. ఆ భావనలోనుండే అన్ని ధర్మాలూ బాధ్యతలూ బయలుదేరతాయి. అయితే తైజసుడు స్వప్నంనుండి మేల్కొని విశ్వుడు (జాగృతుడు) గా తన్ను తాను గుర్తించినప్పుడు ఆ ధర్మాల ప్రయోజనం ఏమిటి? ఇంకా ఆ కుటుంబాన్నీ సమాజాన్నీ తన కర్తవ్యాలనూ అతడు గుర్తుంచు కోవాలా? జీవన్ముక్తుడయిన జ్ఞాని, దీర్ఘ స్వప్నంవంటి జగద్భ్రమనుండి ముక్తుడవుతాడు. అనంతమైన చైతన్యమే తానని గుర్తిస్తాడు. మనఃకల్పిత మయిన జగత్తూ దాని ధర్మాలూ కూడా జీవన్ముక్తునికి వర్తించవు. కొన్ని విషయాలమీద ప్రత్యేక విలువా వ్యామోహం ఉన్నప్పుడే కర్తవ్యమూ ధర్మమూ ఉద్భవిస్తాయి. ప్రపంచాన్ని నిజంగా భావిస్తేనే విలువలూ వ్యామోహాలూ ఉండడం సాధ్యమవుతుంది. జ్ఞానిదృష్టిలో ఈ కనిపించే జగత్తంతా భావనామాత్రం, మిథ్య, కావడంతో అతనికి విలువా వ్యామోహమూ ఉండవు, నిర్వర్తించవలసిన ధర్మాలూ

ఉండవు. అతడు సర్వానికీ ఆధారంగా సర్వవ్యాప్త నిరాకార నిష్కళంక చైతన్యంగా తన్ను తాను తెలుసుకున్నాడు.

శ్లో|| అకుర్వన్నపి సంక్షోభాత్ వ్యగ్రస్సర్వత్ర మూఢధీః ।
కుర్వన్నపి తు కృత్యాని కుశలో హి నిరాకులః ॥ 58.

టీ|| మూఢధీః = అజ్ఞాని, అకుర్వన్ అపి = కర్మలను చేయనివాడైనప్పటికినీ, సర్వత్ర = అంతట, సంక్షోభాత్ = సంకల్ప వికల్పరూప సంక్షోభకారణమువలన, వ్యగ్రః = వ్యాకులుడుగా, (భవతి = అగుచున్నాడు), కుశలః = నేర్పరియగు జ్ఞాని, కృత్యాని = కర్మలను, కుర్వన్ అపి = చేయుచున్నవాడైనను, తు = మరేమనగా, నిరాకులః = ఆకులము లేనివాడుగా, భవతి = అగుచున్నాడు.

**మూఢుడు ఏ పనీ చేయకున్నా తనలోని ఆందోళనలతో సతమతమవుతూనే ఉంటాడు. తెలివైనవాడు పనిచేస్తున్నా సత్యమయిన నిశ్చయ జ్ఞానంతో అంతరంగంలో శాంతంగా ఉంటాడు.**

జీవన్ముక్తునికి కర్తవ్యమూ విహిత కర్మలూ ఉండవని క్రిందటి శ్లోకంలో చెప్పబడింది. అంటే జ్ఞాని ఏపనీ చెయ్యకుండా తుమ్మమొద్దులాపడి ఉంటాడని అర్థం కాదు. అనంతమైన తన కొత్తవ్యక్తిత్వం ఇచ్చిన పూర్తి స్వతంత్రంతో తనకు తోచిన విధంగా అతడు సమాజాన్ని సేవిస్తూనే ఉంటాడు. జ్ఞానీ, మూఢుడూ ఆచరించే కర్మలలో బాహ్యంగా తేడా ఏమీ ఉండదు. ఉన్నతేడా అంతా వారి అంతరంగాలలోనే. జ్ఞాని సదా శాంతుడై ఉంటాడు, మూఢుడు ఏ పనిచేసినా, మానినా సదా వ్యాకులతాంతరంగుడై ఉంటాడు! అట్టివాడు ధ్యానానికి కూర్చున్నా అంతరంగం మాత్రం అనేక విషయాలపై ఆకర్షణ వికర్షణలతో అల్లకల్లోలమయి ఉంటుంది.

అంతరంగంలో సదా శాంతుడై, సత్త్వగుణ ప్రధానమయిన అహంకారంతో వ్యవహరిస్తూ, మనోబుద్ధులతో ఆత్మజ్ఞానానందం ప్రతిఫలిస్తుండగా, జ్ఞాని అనేక కర్మలను చేపట్టగలడు. అవి మానవాళికి మహోన్నత పథాన్ని చూపి మహోవరాలై భాసిస్తాయి. అనేక వ్యవస్థలను పూర్తి సేవాభావంతో స్థాపించి అహోరాత్రాలు శ్రమించి అశేష మానవాళికీ మార్గదర్శకుడూ ఆనందదాయకుడూ అయినప్పటికీ అంతరంగంలో నిరహంకారిగా, బాలునివలె, క్రీడా వినోదాలలో పాల్గొన్నట్టుగా హాయిగా ఉండగలడు. అట్టివారి చేష్టలు అసాధారణంగా, మానవాతీతంగా, మాన

వాళికి మహోపకారంగా, అద్భుతంగా, అనన్యసామాన్యంగా,అందరికీ ఆశీస్సు లుగా పరిణమిస్తాయి.

ఈ భావమే భగవద్గీతలో మరొకవిధంగా వ్యక్తం చెయ్యబడింది. సమస్త కర్మలను విసర్జించి అడవిలో తపస్సు చేస్తానని అర్జునుడన్నప్పుడు భగవాన్ కృష్ణుడతనిని పరిహసిస్తాడు. జీవితాన్నీ కర్మలనూ విడచిపెట్టి దూరంగాపోవడమే మతమూ ధర్మమూ బోధిస్తున్నాయా? అది కేవలం అసమర్థుల లక్షణం. ఉన్న చోటనే నిలబడి సత్యాన్ని తెలుసుకొని తాను చేస్తున్న పనులకుగల కారణాన్నీ ప్రయోజనాన్నీ అర్థాన్నీ తెలుసుకుని జీవిత పరమార్థాన్ని గుర్తించాలి. భగవాన్ కృష్ణుడు తన తత్త్వజ్ఞానాన్నంతటినీ, మంత్రించినట్టుగా అతి చిన్నమాటలలో ఇమిడ్చి ఇలా అంటాడు. "సమత్వం యోగ ఉచ్యతే" (భగవద్గీత 2-48) సమత్వాన్ని కలిగి ఉండడమే యోగం, "యోగః కర్మసు కౌశలమ్"---"కర్మలను సమర్థవంతంగా నిర్వహించగలగడమే యోగం, నిజమైన జ్ఞాని కర్మలను విడిచి పెట్టి భీరువై పారిపోడు. తనకు ప్రాప్తించిన వానిని ఎంతో సమర్థతో అద్భుతంగా నిర్వర్తించి అందరికీ ఆదర్శప్రాయుడౌతాడు.

**శ్లో॥ సుఖమాస్తే సుఖం శేతే సుఖమాయాతి యాతి చ ।**
**సుఖం వక్తి సుఖం భుంక్తే వ్యవహారేఽపి శాన్తధీః ॥59.**

**టీ॥** వ్యవహారే అపి = ప్రపంచ వ్యవహారమునందు, శాన్తధీః = శాంత చిత్తము గల వాడై, సుఖం = సుఖపూర్వకముగా, ఆస్తే = ఉంటున్నాడు, సుఖం = సుఖపూర్వ కముగా, ఆయాతి = వచ్చుచున్నాడు, చ = మఱియు, యాతి=పోవుచున్నాడు, సుఖం = సుఖపూర్వకముగా, వక్తి = మాట్లాడుచున్నాడు, సుఖం = సుఖపూర్వకముగా, భుంక్తే = భోజనము చేయుచున్నాడు.

**జీవిత నిత్యకృత్యాలలోకూడా జ్ఞాని శాంత మనస్సుతో సుఖంగా కూర్చొనగలడు. సుఖనిద్రపోగలడు. హాయిగా తిరుగగలడు. ఆనందంగా భాషించగలడు. సంతోషంగా భుజించగలడు.**

మహాత్మునికి అంతరంగంలోని అత్మానుభవమూ బాహ్యప్రపంచంలోని అనుభవాలూ వేరుకావు. అనంతమైన చైతన్యమే ఏకంగా నేననే భావంతోనూ, బహుళంగా ప్రపంచ భావాలుగానూ సర్వత్రా అనుభవిస్తున్నాననుకోవడాన్ని సదా ఆనందంగా వీక్షిస్తూ ఉంటాడు. సర్వత్రా ఒకే చైతన్యం అనేక భావాలుగా వ్యక్తమవుతూ ఉండడాన్ని చూస్తున్న అతని మనస్సు శాంతంగా సంతోషంగా

మాయా వినోదమగ్నమయి ఉంటుంది. అందుకే అతడు సర్వజీవులనూ సమబుద్ధితో చూడగలడు. ఎటువంటి పరిస్థితీకూడా అతని అంతరంగ శాంతిని హరింపజాలదు.

ప్రారబ్ధానుగుణమయిన వాసనలతో నేను వేరుగా జీవుడుగా ఉన్నానని భ్రమించే అహంకారమే మనోబుద్ధులతో తాదాత్మ్యం చెంది, రాగద్వేషాలతో ప్రపంచాన్ని చూసి, అనేక సమస్యలను సృష్టిస్తుంది. అహంకారాన్ని అధిగమించిన జ్ఞానికి కేవలమయిన ఆత్మతత్త్వమే సర్వత్రా స్ఫురిస్తుంది. అట్టివానిలో విషయి విషయపరమైన విభేదం ఉండదు. ద్వంద్వాతీతమయిన ఆ దృష్టికి, ద్వంద్వానుభవాలయిన సుఖదుఃఖాలూ, శీతోష్ణాలూ, ధర్మాధర్మాల మొదలయినవేవీ ఉండవు.

బాహ్యంగా కనిపించే నానాత్వ ప్రపంచం నిస్పందేహంగా, దాన్నిచూసే నాకంటే భిన్నంగా వేరుగా అనిపిస్తుంది. సాధారణంగా ఈ రెండూ రెండు విభిన్న విషయాలని, ఎట్టి పరిస్థితులలోనూ అవి ఏకం కావడానికి వీలులేదనీ మనం భావిస్తుంటాం. ఈ దురదృష్టకరమయిన ఆలోచనే, ఈ విషయి-విషయ పరమైన విభేదమే మనలోని సర్వసమస్యలకు మూలకారణమవుతోంది. దీనితో బాహ్య ప్రపంచం మహాబలవంతంగా దుర్భేద్యంగా శత్రుదుర్గంలా అనిపిస్తుంది.

ఒక ఆవు ముఖం దాని పృష్ఠ భాగంకంటే నిశ్చయంగా వేరు విధంగా కనిపిస్తుంది. అంతమాత్రంచేత తెలివైన వాడెవడూ అవి రెండు జంతువులని అనుకోడు! ఆవుకు హాని కలిగించకుండా అందులో ఏ ఒక్క భాగాన్నీ మనం నశింపజేయలేము! విషయి, విషయాలూకూడా ఆత్మైచన్యం యొక్క విభిన్న వ్యక్తరూపాలే. ఏకమయిన ఆత్మ అనేకంగా గుర్తింపబడుతూ ఉందన్న సత్యాన్ని అనుక్షణమూ జ్ఞాని అనుభవపూర్వకంగా తెలుసుకుంటూ ఉంటాడు. అందుకే అతని మనస్సు అన్ని పరిస్థితులలోనూ శాంతంగా ఉండగలుగుతుంది. "శాంతధీః"

ఆత్మానుభవంతో అహంకార రహితులై, స్వార్థపూరితమయిన ఆలోచనలు లేనివారై జ్ఞానులు జీవితాన్ని జీవిస్తారు. సర్వకాల సర్వావస్థలలోనూ హాయిగా ఆనందంగా ఉండగలుగుతారు! "సుఖం ఆస్తే, శేతే, వక్తి, భుంక్తే"---అన్ని వ్యవహారాలనూ సుఖంగా చెయ్యగలుగుతాడు. సుఖం కోసం దేననీ చెయ్యడు. భగవద్గీతలో (4-22) చెప్పినట్టుగా---"యదృచ్ఛాలాభసంతుష్టః"--- యదేచ్ఛగా లభించిన దేనితోనయినా సంతోషంగా ఉండగలడు.

**శ్లో॥ స్వభావాద్యస్య నైవార్తిః లోకవద్వ్యవహారిణః ।
మహాహ్రద ఇవాక్షోభ్యో గతక్లేశస్సు శోభతే ॥ 60.**

టీ॥ వ్యవహారిణః = వ్యవహారమును చేయుచున్నను, (సమస్త క్రియలను చేయుచున్నను), యస్య = ఏ జ్ఞానికి, స్వభావాత్ = ఆత్మజ్ఞాన స్వభావమువలన, లోకవత్ = లోకమువలె (పామరునివలె), ఆర్తిః = భేదము, న ఏవం = ఉండదో, సః = అట్టివాడు, గతక్లేశః = క్లేశరహితుడై, మహాహ్రద ఇవ = గొప్ప తటాకమువలె, అక్షోభ్యః = క్షోభ రహితుడై, సుశోభతే = శోభాయమానుడగుచున్నాడు.

**స్వభానుగుణంగా జీవిత కార్యకలాపాలలో పాల్గొంటున్నా సామాన్యుని వలె విచారానికి బాధకు లోనుకాడు. విశాల సరోవరం వలె నిశ్చల శాంత గంభీరుడై ప్రకాశిస్తాడు---జ్ఞాని.**

మన మనస్సరోవరాలు భావనాతరంగాలతో కల్లోలితమయి ఉంటాయి. ఇందుకు ముఖ్యంగా రెండు కారణాలు చెప్పవచ్చును. బాహ్యప్రపంచ విషయాలు ఇంద్రియాలద్వారా మనస్సుచేరి కోరికలతో ఉద్రేకపరుస్తాయి.బాహ్యంగా విషయాలు ఎదురుగా లేనప్పటికి మనస్సే తన గతజ్ఞాపకాలతో భవిష్యత్తులో అనుభవించాలనే కోరికతో కల్లోలాన్ని సృష్టించగలదు. మనోబుద్ధుల నధిగమించి, అహంకార వర్జితుడయి, ఆత్మానుభవస్థితుడయిన జ్ఞాని మనస్సును బాహ్యవిషయాలు చేరినా వ్యామోహపరచలేవు. కోరికలులేని అతని మనస్సు స్వయంగా కల్లోలాన్ని సృష్టించనూ లేదు. అతని మానససరస్సు సదా శాంతంగా నిశ్చలంగా ఉంటుంది.

అట్టి మహాత్ముడు సర్వదా సర్వత్ర ఆత్మనే వీక్షిస్తూ ఆత్మారాముడై ఉంటాడు. అతని శాంత మనస్సు, గుర్తించగల సర్వభావాలను చైతన్యమయిన తన వ్యక్తరూపాలుగా తెలుసుకుంటూ అనుభవిస్తూ ఉంటుంది. ఈ సార్వత్రిక నిత్యానుభవంతో జీవిస్తూ సర్వకర్మలనూ తన వ్యక్తరూపంగా గుర్తిస్తూ శాంతంగా నిర్వర్తించగలుగుతాడు. దేనినీ కోరడు, దేనినీ అనుభవించడు, మానస సరోవరమును కల్లోలితం చేసే అహంకారం అసలే ఉండదు. ఆత్మచైతన్యం అంతరంగంలో నిండి బాహ్యంగా ఉపాధులద్వారా వ్యక్తమవుతూ నిశ్చల శాంత గంభీరంగా ప్రకాశిస్తూ ఉంటుంది.

**శ్లో॥ నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తి రుపజాయతే ।
ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తి ఫలభాగినీ ॥ 61.**

టీ॥ మూఢస్య = మూఢుని (అజ్ఞాని) యొక్క, నివృత్తిః అపి = నివృత్తి కూడ, ప్రవృత్తిః = ప్రవృత్తి, ఉపజాయతే = అగుచున్నది, చ = మఱియు, ధీరస్య = జ్ఞాని యొక్క, ప్రవృత్తిః అపి = ప్రవృత్తి అయినను, నివృత్తి ఫలభాగినీ = నివృత్తి ఫలమును పొందించునదిగా, భవతి = అగుచున్నది.

మూఢునికి "నిర్వృత్తి" వృత్తిరాహిత్యం కూడా శ్రమకలిగించే కర్మే అనిపిస్తుంది. జ్ఞానికి కర్మలు కూడా శాంతాన్నే కలిగిస్తాయి.

కర్మ, అకర్మ,----సుఖంగా జీవిచండం కోసం ఐశ్వర్యాన్ని సంపాదించే ప్రయత్నమూ, సర్వాన్నీ విసర్జించి సన్యాసిగా జీవించడమూ రెండూ కూడా శారీరిక కదలికమీదా విశ్రాంతిమీదా ఆధారపడి ఉండవు. ఈ రెండూకూడా అహం- కారం మీదా అదికోరే కోరికలమీదా ఆధారపడి ఉంటాయి. నేను కర్తనని కానీ, భోక్తనని కానీ అనుకున్నప్పుడే కర్మలు శ్రమతో కూడినవిగా అశాంతి నిచ్చేవిగా అనిపిస్తాయి. ఈ భ్రమాజన్యభావాలు నశించిన జ్ఞాని కర్మలను సమర్థవంతంగా సంతోషంగా నిర్వర్తించగలుగుతాడు. సహజంగా ఆ విధంగా కర్మల నాచరించ డంలోనే జ్ఞానికి కర్మ ఫలత్యాగమయిన పరమ శాంతి లభిస్తుంది. సామాన్యు లందరికీ నిర్వృత్తిలో, మనస్సు అంతర్ముఖం అవుతున్నకొద్దీ శాంతి లభిస్తూ, బాహ్యాభిముఖమయిన కొలది (ప్రవృత్తి) అశాంతి అధికమవుతూ ఉంటుంది.

తెలివిహీనుడు అహంకారంతో ధ్యానాన్నభ్యసిస్తూ సర్వకర్మలనూ విసర్జించి గంగాతీరంలో ఏకాంతంగా జపతపాదుల నాచరిస్తున్నా అతని అంత రంగం అశాంతితో ఉండే ఉంటుంది. కోరికే అశాంతికి పుట్టినిల్లు. జీవన్ముక్తుడు ఊపిరి సలపని కార్యకలాపాల్లో ఉన్నప్పటికీ అహంకారవర్జితుడు కావడంతో సదా శాంతంగా ఆనందంగా ఉంటూ మానవాళిని సేవిస్తూ వారికి మార్గదర్శకంగా ఉండగలుగుతాడు. నిజానికి మార్గమూ గమ్యమూ కూడా అతడే.

**శ్లో॥ పరిగ్రహేషు వైరాగ్యం ప్రాయో మూఢస్య దృశ్యతే ।**
**దేహే విగళితాశస్య క్వ రాగః క్వ విరాగతా ॥ 62.**

టీ॥ పరిగ్రహేషు = గృహారామాదులయందు, ప్రాయః = తరచుగా, వైరాగ్యం = వైరాగ్యము, మూఢస్య = మూఢునకు, దృశ్యతే = కనబడుచున్నది, పరం తు = అయితే, దేహే = దేహమునందు, విగళితాశస్య = నశించిన ఆశగల జ్ఞానికి, రాగః = రాగము, క్వ = ఎక్కడ, విరాగతా = వైరాగ్యము, క్వ = ఎక్కడ.

మూఢులే తమకున్న వస్తువులపై వైరాగ్యభావాన్ని చూపుతారు. దేహతాదాత్మ్యమే లేని జ్ఞానికి రాగం ఎక్కడ? ద్వేషింపదగినదేది?

సామాన్యులే తమకు ప్రాప్తించిన కర్మలనుండి దూరంగా తొలగిపోవాలని కోరుకుంటారు. ప్రతివారమూ సాధ్యంకాకపోతే సంవత్సరాని కొకసారయినా సరే ఉన్నదానినుండి దూరంగాఉండాలనే కోరికమాత్రం ఉంటుంది. సంపాదించడంలో శ్రమను, అనుభవించడంలో ఖర్చయే శక్తినీ చూస్తూ వైరాగ్యభావాన్ని పెంచు కుంటారు. మన నిత్య దైనందినజీవితంలో కూడా మనం వరుసగా నాలుగు చాకలెట్టులు తింటూనే, వానిపైన ఎంత ఇష్టముండినా, ఇంకా తినా లనిపించదు. వానిపైన అయిష్టత వస్తుంది. అంటే వానిపై వైరాగ్యం కలగడం. అయితే ఇది క్షణికమే. మళ్ళీ కోరడం, శ్రమించడం, విరక్తి ఇలా అనంతంగా జీవితయాత్ర సాగి పోతూనే ఉంటుంది.

పాంచభౌతికమయిన మన స్థూలదేహంతో తాదాత్మ్యం ఉన్నంతసేపూ కోరికలు ఉంటూనే ఉంటాయి. ఈ శరీరస్పృహ మనలో అనేకయిష్టాయిష్టాలను మోహాన్ని, కోరికలను పుట్టిస్తూ మనస్సును అశాంతి మయం చేస్తూ ఉంటుంది. ఈ కోరికలను తీర్చుకోవడం కోసం శ్రమిస్తూ, మరీ కష్టం అనిపించినప్పుడు బుద్ధిలో తాత్కాలిక వైరాగ్యభావం తలెత్తుతూ ఉంటుంది. ఈ వైరాగ్యం అధ్యాత్మిక పురోభివృద్ధికికాని, శాస్త్రాన్ని అర్థం చేసుకోవడానికిగాని ఎంత మాత్రము సహాయ పడదు.

ఈ మూఢుని జీవితానికి వ్యతిరేకంగా సదా శాంతంగా సుఖ సంతోషాలతో కర్మలను నిర్వర్తించే జ్ఞాని జీవితాన్ని వర్ణిస్తున్నారు మహర్షి ఇక్కడ. సంతోషంగా ఆచరించే కర్మలలో అతడలసిపోవచ్చు, కాని అశాంతి పాలుకాడు. అలసట తీరగానే ద్విగుణీకృతోత్సాహంతో పనులను చేస్తూనే ఉంటాడు. పని చెయ్యడంలో శరీరస్పృహగాని, శరీరం మీద ప్రేమకాని అతనికుండవు. అలసట కలిగిన మానవ యంత్రానికవసరమయిన విశ్రాంతి ఇస్తాడు. అంతేకాని నిరాశకు తాత్కాలిక వైరాగ్యభావానికి లోనుకాడు. సామాన్యుడు పనిచేస్తున్నప్పుడూ శ్రమను గుర్తించినప్పుడు కూడా విచారావృతుడయే ఉంటాడు. దీనితో మరింత బాధ పెరుగుతుంది. జ్ఞానికి తన శరీరం, చెట్టునుండి విడివడి పండి రాలిపోయిన ఆకువలెనే తన మమత్వం నుండి విడిపోయినట్టు తెలుస్తుంది. శరీర స్పృహలేని అతనిలో రాగమూ ఉండదు, వైరాగ్యమూ ఉదయించదు. మనో లక్షణాలయిన ఈ రెండింటినీ అతడధిగమిస్తాడు. వాటికతీతంగా శాంతంగా ఉంటాడు.

శ్లో॥ భావనాభావనాసక్తా దృష్టిర్మూఢస్య సర్వదా ।
భావ్యభావనయా సా తు స్వస్థస్యాదృష్టి రూపిణీ ॥63.

టీ॥ మూఢస్య=మూఢునియొక్క, దృష్టిః=దృష్టి, సర్వదా = ఎల్లప్పుడు, భావనా భవనాసక్తా = భావనయందును అభావనయందును అసక్తమైనదిగా (ఉండును), స్వస్థస్య = స్వస్థచిత్తుడగు జ్ఞానియొక్క, సా = ఆ దృష్టి, భావ్యభావనయా = భావింపదగిన దానిని భావించినదగుటవలన, అదృష్టరూపిణీ = దృశ్యదర్శన రహిత రూపముగలదిగా, భవతి = అగుచున్నది.

**మూఢుని దృష్టి ఎల్లప్పుడూ వస్తువులను భావించడం మీదా, వాటి అభావం మీద ఉంటుంది. కాని ఆత్మనిష్ఠుడయిన జ్ఞాని వస్తువుల గురించి భావిస్తున్నా భావించనట్టే.**

ఆత్మానుభవం పొందని సాధకుడు తప్పకుండా తన భావాల గురించి తగిన జాగ్రత్త తీసుకోవలసిందే. మనస్సును శాంతంగా ఉంచే ఆలోచనలను వృద్ధి చేసుకుంటూ, అశాంతిని ఉద్రేకాన్నీ కలుగజేసే ఆలోచనలను తగ్గించుకుంటూ తాత్కాలికంగా శాంతించిన మనస్సుతో శాస్త్రాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. ఈ శాంత మనస్సుతోనే అతని మనశ్శరీరాల తాదాత్మ్యం నుండి ముక్తి పొందాలి. ఆత్మతత్త్వాన్ని అర్థం చేసుకుంటూ, ఆ ఆత్మనే నేను అని ధ్యానిస్తూ ఉండాలి. ఈ విధంగా భావసంయమనంపై దృష్టి నిలుపుతూ భావరహిత స్థితికి చేరుకోవాలి. అప్రయత్నంగా వచ్చే భావాలను ముందుగా నిరోధించినా, చివరగా ప్రయత్నపూర్వకమయిన భావాలను కూడా విసర్జించగలగాలి.

ఆత్మజ్ఞానంతో ఆత్మనిష్ఠుడయిన మహాత్ముడు విషయాల గురించి ఆలోచిస్తున్నా తన్ను తాను అద్వయంగా తెలుసుకుంటూ ఉండడం చేత ఆలోచనా రహిత స్థితిలో ఉన్నట్టే!

మన మనస్సులో ఆలోచనలున్నాయా లేదా అన్నవిషయం అంత ముఖ్యం కాదు. వాటితో తాదాత్మ్యం ఉందా లేదా అన్నదే ముఖ్యంగా గుర్తించవలసినది. యోగి ఆలోచనల తాదాత్మ్యం నుండి ముక్తి నొంది ఉంటాడు. కాబట్టి ఆలోచనలున్నా లేకున్నా అవి అతనిని బాధించవు. నేను సముద్ర తీరంలో నిలబడి ఉన్నంత సేపూ తరంగాలు నన్నేమీ చెయ్యలేవు. నీటిలో దిగితేనే వాటి ప్రభావం చూపిస్తాయి.

మనస్సులో ఆలోచనలు కదలడంవల్ల మనం బుద్ధిహీనులవడంలేదు. వాటితో తాదాత్మ్యం చెంది, వాటి మూలాన్ని విస్మరించడంవల్లనే తెలివిహీనుల మవుతున్నాము. జ్ఞాని అల్లకల్లోలమయిన ఆలోచనలను తన మనస్సులో గుర్తిస్తున్నా వాటి మూలాన్ని విస్మరించడు. అనంత చైతన్యం కోరికల ఒత్తిడితో కదిలే కదలికలే ఆలోచనా తరంగాలుగా మనస్సులో తెలియబడుతోందని అతనికి స్పష్టంగా తెలుస్తూ ఉంటుంది. అందుకే అష్టావక్ర మహర్షి, జ్ఞాని ఆలోచిస్తున్నా ఆలోచించనట్టే అని అంటున్నారు.

**శ్లో॥ సర్వారంభేషు నిష్కామో యశ్చరేద్బాలవన్మునిః ।**
**న లోపస్తస్య శుద్ధస్య క్రియమాణేఽపి కర్మణి ॥ 64.**

టీ॥ యః = ఏ, మునిః = ముని (జ్ఞాని), బాలవత్ = బాలకునివలె, నిష్కామః = కామనారహితుడై, సర్వారంభేషు = సర్వక్రియారంభముల యందు, చరేత్ = చరించునో, తస్య = అటువంటి, శుద్ధస్య = పరిశుద్ధ స్వరూపునకు, కర్మణి = కర్మ, క్రియమాణే = చేయబడుచున్నప్పటికిని, లోపః = లోపము, న భవతి = కలుగదు.

**ఏ కోరికలూ లేకుండా కర్మలనాచరించే జ్ఞాని బాలునివలె చరిస్తూ ఉంటాడు. అతడు చేస్తున్న కర్మలలోకూడా అతని ప్రమేయం ఉండదు, అతడు వానిచే బంధింపబడడు.**

అహంకార వర్జితుడయిన వ్యక్తిలో కర్తృత్వ భావం ఉండదు. బాలుని చేష్టలవల్ల ఎంతటి మహోపద్రవం జరిగినా అందుకతడిని బాధ్యుడుగా నిందించము. హానిచెయ్యాలని ఉద్దేశంకానీ, చేస్తున్నానన్న భావంకానీ బాలునిలో లేకపోవడమే అందుకు కారణం. జ్ఞానిలో కూడా ఇదేవిధంగా కర్తృత్వభావమూ అహంకారమూ ఉండవు కాబట్టి అతడి సర్వచేష్టలూ బాలునివలెనే అమాయకంగా ఉంటాయి. అందుకే ఇక్కడ మహర్షి జ్ఞానిని బాలునితో పోలుస్తున్నారు.

అహంకారమూ అదికోరే స్వార్థపూరితమయిన కోరికలే మనలను బాహ్యప్రపంచ విషయాలకు బంధీని చేస్తాయి. ఈ వ్యామోహమే సర్వ దుఃఖాలకు మూల కారణం. ఆత్మజ్ఞాని తనకు ప్రాప్తమయిన కర్మలను సహజ స్పందనతో శాంతంగా నిర్వర్తిస్తూ వాటిచే బంధింపబడకుండా సంతోషంగా ఉండగలుగుతాడు. సర్వకర్మలూ అతనికి లీలామాత్రాలే.

"సర్వారంభ"---అని ఇక్కడ వాడబడిన పదం ఎంతో భావార్థ గాంభీర్యం

కలిగి ఉంది. భగవద్గీతలో ఈ పదం ఎంతో సమర్థనీయంగా కృష్ణునిచే అనేక తావులలో వాడబడడాన్నీ గుర్తిస్తాము.

సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తః సమే ప్రియః (భగవద్గీత-12-16)

*ఏ కార్యాన్ని తనంతతానుగా మొదలు పెట్టకుండా నన్నే ధ్యానించే భక్తుడు నాకు ప్రియతముడు.*

సర్వారంభ పరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే (భగవద్గీత-14-48)

*సర్వ కర్మలనూ ఆరంభించడం మానినవాడు గుణాతీతుడే.*

సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః (భగవద్గీత-18-48)

*సర్వకర్మలూ దోషంతో కప్పబడి ఉంటాయి. అగ్ని ధూమంచే ఆవృతమయినట్లే.*

జ్ఞాని ఏ కర్మలనూ ఆచరించడని భగవాన్ కృష్ణుడు అనడంలేదు. అతడాచరించే కర్మలలో కర్తృత్వ భావం మాత్రం ఉండదని అంటున్నాడు. అందుకే సర్వకార్యాలనూ ఆరంభింపనివాడే భక్తుడుగా జ్ఞానిగా వర్ణింపబడుతున్నాడు. (సర్వారంభపరిత్యాగీ)

## శ్లో॥ స ఏవ ధన్య ఆత్మజ్ఞః సర్వభావేషు యస్సమః ।
## పశ్యఞ్ఛృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్నిస్తర్ష మానసః॥65.

టీ॥ యః=ఎవడు, పశ్యన్ = చూచుచు, శృణ్వన్ = వినుచు, స్పృశన్ = తాకుచు, జిఘ్రన్ = వాసన చూచుచు, అశ్నన్ = తినుచు, సర్వ భావేషు = సమస్త భావముల యందును, సమః = సముడై, నిస్తర్షమానసః = ఆశారహితుడో, సః ఏవ = వాడే, ధన్యః = ధన్యుడు, ఆత్మజ్ఞః = ఆత్మజ్ఞుడు.

**ఆత్మజ్ఞాని అదృష్టమే అదృష్టము. చూస్తూ,వింటూ,స్పృశిస్తూ, వాసన చూస్తూ, తింటూ కూడా దేనికోసమూ తపించకుండా శాంతంగా ఉండగల అతని జీవితం ధన్యం.**

విషయానుభవ క్షేత్రాలలో చరిస్తూ కూడా వాటి ప్రలోభానికి ప్రభావానికి గురికాకుండా ఉండడం ఎలా సాధ్యమో ఎంత ఆలోచించినా మనకు అర్థం కాదు. జ్ఞాని ఏ విధంగా సర్వకాల సర్వావస్థలలోనూ శాంతంగా ఉండగలుగుతాడో, ఆ రహస్యాన్ని అష్టావక్ర మహర్షి ఇక్కడ వివరిస్తున్నారు.

మనసును ఒక ప్రత్యేక విధానంలో మలుచుకోవడంలోనే ఈ రహస్యమంతా ఇమిడి ఉంది. ఇంద్రియాలను తృప్తిపరచాలనే కోరికలనూ తపననూ జ్ఞాని

తన మనస్సులో లేకుండా చేసుకుంటాడు. వస్తువులనుండి సుఖం లభిస్తుందనే భావంతో బాహ్యంగా అన్వేషించే కోరికను మనస్సునుండి తొలగించగానే మనస్సు కోరలు తీసిన పాములవలె బలహీనం అయిపోతుంది. ఈ విధంగా తన సహజ స్వభావమయిన కోరే గుణాన్ని కోల్పోయిన మనస్సు తనచుట్టూ ఎన్ని ఆకర్ష ణీయమైన వస్తువులున్నా చలించకుండా శాంతంగా ఉండగలుతుంది. జ్ఞాని విషయభోగాలనుండి దూరంగా పారిపోడు. వాటి మధ్యన జీవిస్తూనే వాటి ప్రలో భానికి ప్రభావానికి లోబడకుండా స్వతంత్రంగా శాంతంగా ఉండగలుగుతాడు.

మనచుట్టూ ఉండే అద్భుతమైన ప్రపంచం భగవంతుడిచ్చిన ఒక మహావరం. ఆ ప్రపంచాన్ని గుర్తించే సున్నితమయిన మన ఇంద్రియాలు అంత కంటే అపురూపవరం. సత్యద్రష్టలయిన మహాత్ములు సర్వ జగత్కర్త అయిన సర్వేశునీ అతని సృష్టినీ సదా ఆరాధిస్తారు. అంతేకాని అవమానించరు. భగవంతుని అపురూప సృష్టిని విషయభోగాలను తిరస్కరించడం అవమానించడమే, అత్యంత సున్నితమయిన ఇంద్రియాలను నిరోధించి నశింపజేయడం అంతకంటే ఘోరమే. సర్వాన్నీ ఆరాధిస్తూ, సరయిన విధానంలో గౌరవిస్తూ, సృష్టినీ ఇంద్రియాలనూ ఉపయోగిస్తూ కూడా వాటికి బానిసకాకుండా స్వతంత్రంగా జీవిస్తారు మహాత్ములు. చూస్తూ వింటూ స్పృశిస్తూ వాసన చూస్తూ తింటూ, తన కనుగ్రహింపబడిన విషయాలను తిరస్కరించకుండా సంతోషంగా అనుభవించడంలో సృష్టికర్తను గౌరవిస్తూ, అనుభవించే శక్తిగల ఇంద్రియాల నిచ్చినందుకు అభినందిస్తూ, భావనా మయ జగతిలో భగవదారాధనా మగ్నమానసుడై, సంతోషంగా జీవించగలవాడే నిజమైన మనిషి, మనీషి, మహాత్ముడు.

స్వేచ్ఛగా సంతోషంగా మహాద్భుతమయిన ఇంద్రజాలాన్ని మనస్సుతో మనస్సులో చూస్తూ, ఈ సర్వానికీ అధిష్ఠానమయిన చైతన్యస్వరూపంగా తన్ను తాను తెలుసుకుంటూ సంతోషంగా జీవించే జ్ఞానికి సాటిరాగల వారెవ్వరు?

**శ్లో॥ క్వ సంసారః క్వ చాభాసః క్వ సాధ్యం క్వ చ సాధనమ్।**
**అకాశస్యేవ ధీరస్య నిర్వికల్పస్య సర్వదా ॥ 66.**

టీ॥ సర్వదా = ఎల్లప్పుడు, ఆకాశస్యేవ = ఆకాశమునకువలె, నిర్వికల్పస్య = సంకల్పరహితుడగు, ధీరస్య = ధీరుడగు జ్ఞానికి, సంసారః = సంసారము, క్వ = ఎక్కడ, ఆభాసః = దానియొక్క భావము, క్వ = ఎక్కడ, సాధ్యం = సాధ్యములయిన స్వర్గాదులు, క్వ = ఎక్కడ, సాధనం = సాధనములైన యజ్ఞాదులు, క్వ = ఎక్కడ.

ఆకాశంవలె నిత్యంగా పరిణామరహితంగా తానున్నానని తెలుసుకున్న జ్ఞానికి ఈ ప్రపంచం ఎక్కడ? అహంకారం ఎక్కడ? సాధన ఎక్కడ? సాధ్యం ఎక్కడ?

ఇక్కడ మనం మళ్ళీ మన హెచ్చరికను గుర్తుచేసుకోవాలి. ప్రాథమిక దశలో ఉన్న సాధకులు ఈ శ్లోకాలనుదహరిస్తూ తమ సాధనలను వదిలివేయకూడదు! జీవిత పరమార్థాన్ని సాధించి, గమ్యాన్ని చేరుకుని, అనంతమూ శుద్ధమూ అయిన ఆత్మచైతన్యంగా తన్ను తాను తెలుసుకున్న జ్ఞానులకే ఇవి వర్తిస్తాయి. శాస్త్ర హృదయాన్నర్థం చేసుకుని ఆత్మానుభవంలోకి అడుగు పెట్టడానికి సిద్ధంగా ఉన్న జనక రాజర్షివంటి శిష్యులకు మాత్రమే ఇవి వర్తిస్తాయి.

ఆత్మానుభవస్థితుడయిన జ్ఞానికి తనకంటే భిన్నంగా రెండవదేదీ ఉండదు. అతడికి అనుభవింపబడే ప్రపంచమూ అనుభవించే అహంకారమూ కూడా ఉండవు. జీవన పరమార్థాన్ని సాధించిన అతడికి సాధించవలసిన లక్ష్యమేదీ ఉండదు. అతననుసరించవలసిన మార్గం కానీ విధానాలు కానీ ఉండవు. పరిణామరహితమూ నిత్యమూ సర్వవ్యాప్తమూ అయిన ఆత్మచైతన్యంగా తన్ను తాను తెలుసుకోవడంతో, తనను ప్రపంచంనుండి వేరుగా చూపించే అహంకారం అంతమైంది. అతడి పరిమితులన్నీ నశించాయి. ఘటం నశించి ఘటాకాశం మహాకాశంతో ఐక్యమయింది. అనంత చైతన్యాన్ని వ్యక్తిగా ప్రపంచంగా విభజించే అహంకారం ఘటం వంటిదే. అహంకార వినాశనంతో జ్ఞాని ఆకాశంవలె ఏకంగా కేవలంగా ఆత్మగా మిగిలిపోతాడు.

తరంగం సముద్రంలో లయమయిపోయింది, కుండ విరిగి తన మూలమయిన మట్టిలో కలిసిపోయింది. కలకంటున్న వ్యక్తి మేల్కొన్నాడు.

జీవన్ముక్తునిలో అనంతమయిన ఆత్మచైతన్యపు భావనాతరంగా విన్యాసం వ్యక్తమవుతూ ఉంటుంది.

మానవుడు మహాత్ముడై మాధవుడయ్యాడు.

మానవునిగా జన్మించానన్న భావం ధన్యమయి అజరామరంగా ఆత్మచైతన్యంగా ప్రకాశిస్తుంది.

శ్లో॥ స జయత్యర్థ సన్న్యాసీ పూర్ణస్వరస విగ్రహః ।
అకృత్రిమోఽనవచ్ఛిన్నే సమాధిర్యస్య వర్తతే ॥ 67.

టీ॥ యస్య = ఎవనికి, అకృత్రిమః = స్వాభావికమైన, సమాధిః = సమాధి, అనవచ్ఛిన్నః = (తనయొక్క) పూర్ణ స్వరూపమునందు, వర్తతే = ఉంటున్నదో, సః = అటువంటి, అర్థసన్న్యాసి = అర్థయుక్తుడగు సర్వసంగపరిత్యాగి, పూర్ణస్వరస విగ్రహః = పూర్ణానంద స్వరూపుడగు జ్ఞాని, జయతి = సర్వోత్కృష్టుడగుచున్నాడు.

**సర్వకోరికలనూ జయించి, స్వ స్వరూపనిష్ఠుడయి, సహజమూ అపరిచ్ఛిన్నమూ అయిన స్వ స్థితిలో లీనుడయి చరించే మహాత్మునకు జయమగుగాక!**

అనంత శాంతికాలమనదగిన అష్టావక్ర మహర్షి మానసం కూడా ఆరాధనతో ప్రేమతో ఉప్పొంగుతున్నట్టుంది. అహంకార బంధంనుండి ముక్తుడయి, భ్రమను విడనాడి,సర్వాన్నీ చైతన్యమయమయిన స్వస్వరూపంగా తెలుసుకున్న విశ్వవిజేత, పూర్ణపురుషునకు జయమగుగాక అని పరవశానందంతో పలుకుతున్నారు మహర్షి. జీవితమూ ప్రపంచమూ కేవలం భావాలనీ, భావాలన్నీ చైతన్య స్వరూపమయిన తన కదలికలనీ గుర్తించిన విశ్వవిజేత, తన భావనా తరంగ నాట్య విన్యాస విభవాన్ని ఆనందంగా తిలకిస్తూ, సర్వసృష్టికీ అధిష్ఠానమయి ఉండగా, అట్టి వ్యక్తిత్వాన్ని, ఆత్మతత్త్వాన్ని కీర్తించగలవారెవరు? కీర్తింపబడే వారెవరు? అయినా మహర్షి పరవశానందంతో పలుకుతున్నారంటే ఆ స్థితి ఎంత మహోన్నతమయినదో మరెంత కష్టసాధ్యమో బుద్ధికి లీలా మాత్రంగా అందుతోంది, అజేయమైన దానిని సాధించడంలో అనంతతృప్తి ఉంది. అందుకే సాధన చతుష్టయ సంపన్నమై, స్వశాస్త్రిసార స్వరూపమై, సర్వ సందేహ భ్రమా కల్పనా వర్జితమైన సాధకుని బుద్ధి చివరి అడుగువేస్తూ, ఈ విజయానందాన్నను భవిస్తూ, మహర్షి జయ జయ ధ్వానా నందుకుంటూ, మౌనంగా స్తంభించి పోతుంది. ఆత్మస్వరూపంగా నిలచిపోతుంది!

జ్ఞాన యిచ్ఛా క్రియాశక్తులకు మూలమై
నేనుందు నను తెలియు వారులేరు!
నాది, నేనను బుద్ధి తనమూలమును మరచి,
యీ భ్రమా జ్ఞానమే మానసమ్ము
నందు నెలకొని రాగద్వేషములుగా మారి
కర్మ బీజంబగుచు జన్మనిచ్చు!

దర్శనీయంబయిన దృశ్య కావ్యమ్మగుచు
మోహ పాశాబద్ధ భ్రాంతినిచ్చు!
స్వర్గ సుఖములయిన నరక బాధలయిన
రూపొందు భావమ్ము నాశ్రయించి!
పోల్తు రిలను పాల నీటిని వేర్పరచు
హంసతోడి జ్ఞానినెల్ల జనులు!

"పూర్ణస్వరస విగ్రహః"---సర్వభ్రమలనుండీ ముక్తుడయిన జ్ఞాని, సర్వ కామనలూ అంతంకాగా, జ్ఞానానంద స్వరూపునిగా, పరిపూర్ణంగా, స్వస్వ రూపానంద రసానుభవంలో స్థితినందుతున్నాడు. అనంత గంభీర భావగర్భిత మయిన ఈ పదం, అద్వైతానంద రసపాన మగ్నమయిన మహర్షి హృదయ సరసిలో వికసించిన అపురూప పద్మం. ఇటువంటి మహత్తరమయిన మరెన్నో ఆణిముత్యాలవంటి పదాలు మహర్షి హృదయంలో జనించి వికసించి ఈ గీతా మకరందాన్నాస్వాదించే భ్రమరాలకు మహానందాన్ని చవి చూపిస్తాయి. పూర్ణ స్వరసవిగ్రహః---పూర్ణంగా స్వరసమే విగ్రహంగా, రెండవదేదీలేని అనుభవంలో, ఆ మహానందంలో ఈ పదం ఉదయించిందనడం నిర్వివాదాంశం. ధ్యాని ధ్యేయమూ ఒకటే, విషయి,విషయాలూ పరస్పరాలింగనంలో సర్వాన్నీ విస్మరించాయి. నదీ కన్య సాగరసంగమంలో స్వరూపాన్ని కోల్పోయింది. అద్వైతానంద అపురూపంగా లాస్యం చేస్తోంది!

వ్యక్తిత్వం అనంతత్వంలో అప్రయత్నంగా సహజంగా లయమయి పోతుంది. ప్రయత్నమంతా వ్యక్తిత్వాన్ని దాని పరిధినీ అర్థాన్నీ గుర్తించడానికే అవసరం. ఇదే తెలిస్తే సర్వ సాధనలూ ఫలించినట్టే, సర్వశాస్త్ర సారమూ అవగత మయినట్టే. వ్యక్తిత్వం అనంతత్వంలో ఎంత సహజంగా ఐక్యమయిపోగలదో వర్ణిస్తూ ఆచార్య శంకరులు వివేకచూడామణిలో ఇలా అన్నారు.

దేవదత్తోహమిత్యేతద్ విజ్ఞానం నిరపేక్షకమ్
తద్వద్ బ్రహ్మవిదోపస్య బ్రహ్మాహమితివేదనమ్.(వివేకచూడామణి 533)

నేను దేవదత్తుడిని అనే జ్ఞానం, ఈ స్ఫురణ దేనిమీద ఆధారపడింది కాదు, ఇది సర్వస్వతంత్రం. ఇదేవిధంగా బ్రహ్మజ్ఞాని తాను బ్రహ్మననే స్ఫురణను సహజంగా కలిగి ఉంటాడు.

శ్లో॥ బహునాऽత్ర కిముక్తేన జ్ఞాతతత్త్వో మహాశయః ।
భోగమోక్ష నిరాకాంక్షీ సదా సర్వత్ర నీరసః ॥ **68.**

టీ॥ అత్ర = ఈ విషయమైన, బహునా = పెక్కువిధములుగా, ఉక్తేన = చెప్పుట చేత, కిం = ఏమి ప్రయోజనము, జ్ఞాతతత్త్వః = తత్త్వము నెఱింగినట్టియు, భోగమోక్ష నిరాకాంక్షీ = భోగమోక్షముల ఆశను విడిచిపెట్టినటువంటి, మహాశయః = ఓజ్ఞాని, సదా = ఎల్లప్పుడు, సర్వత్ర=ఎల్లయెడల, నీరసః = రాగద్వేషరహితుడై, (వర్తతే = ఉంటున్నాడు).

**క్లుప్తంగా చెప్పాలంటే ఇక్కడ ఇక చెప్పవలసినదేదీ లేదు. సత్యదృష్టి అయిన మహాశయుడు సర్వవిషయ భోగవాంఛలనుండి ముక్తుడయి ఉంటాడు. ముక్తికాంక్షకూడా అతనిలో ఉండదు. సర్వకాల సర్వావస్థలలోనూ అతడు మానసిక చలన రూపమయిన కోరికలూ ఉద్రేకాలూ లేకుండా ఉంటాడు.**

ఇప్పటివరకూ ఈ అధ్యాయంలో చెప్పిన విషయాన్నంతటినీ సమీక్షిస్తూ మహర్షి చెప్పవలసింది సరిగ్గా చెప్పలేక పోయాననే అనుకుంటున్నట్టుంది. మహర్షి ఈ శ్లోకంలో తన భావాలనన్నిటినీ సమీక్షించారు. మన మహర్షులంతా ఇదే పద్ధతిని అవలంబించేరు. ఆఖరుకి వేదాలు కూడా లక్ష్యాన్ని సూచించగలిగామే కాని వర్ణించలేక పోతున్నామన్న అసంతృప్తిని అడుగడుగునా వెలిబుచ్చుతూనే ఉన్నాయి. ఆత్మతత్త్వం అనిర్వచనీయమయినది.

"బహున్నాత్ర కిముక్తేన"---(బహునా, అత్ర, కిం, ఉక్తేన)--ఇంతకంటే ఇక ఏమి చెప్పగలను? అంతఃకరణ శుద్ధి కలిగి విషయాన్ని చక్కగా యధాతథంగా అర్థంచేసుకోగలిగిన వారికి ఇంతకంటే చెప్పవలసిదీలేదని ఇక్కడ ధ్వనిస్తోంది. ఇక మిగిలినవారికి ఎంతచెప్పినా రేఖా మాత్రంగానైనా అర్థంకావడం అసంభవం అని కూడా అర్థమవుతోంది. జనకుడు అర్హతా సంసిద్ధతా కలిగి ఉంటే ఈ చెప్పినది చాలనే భావాన్ని మహర్షి వ్యక్తం చేస్తున్నారు. ఇప్పటికీ అర్థంకాని శిష్యులను ఇంకా బాధించి బోధించినా ప్రయోజనం ఏముటంది?!

అయితే నిజానికి ఇక్కడ జనకుని అర్హతను శంకించడం లేదు. భాష యొక్క ప్రయోజనాన్నీ పరిధినీ ప్రమాణాన్నీ స్పష్టంగా తెలుసుకుని, అనంత సత్యాన్ని పరిమితమైన భాషలో వ్యక్తీకరించలేక పోతున్నామే అన్న ఆవేదనకు రూపం ఇది. గురువు ఇవ్వదలచుకున్న దానిని స్వీకరించడానికి అర్హ మైన పాత్ర శిష్యుని బుద్ధికాదు. సాధకుడు ధీరత్వంతో తన బుద్ధి బంధనుండి, వ్యక్తిత్వపు

పరిధినుండి,తనకు తానుగా విడివడాలి. అప్పుడు మాత్రమే గురువు సూచించిన సత్యం అనుభవంలోకి వస్తుంది.

పరిమితమైన ప్రస్తుత స్థితినుంచి అపరిమితత్వాన్ని చేరుకునే ఈ యాత్రలో ధ్యాని తన సర్వాన్నీ త్యజించాలి. లేశమాత్రమే మిగిలి ఉంటే యాత్ర సాగుతూనే ఉంటుంది. గమ్యం దిక్చక్రం అంతంత దూరంలో కనిపిస్తూనే ఉంటుంది. ఎంతటి ఉదాత్తమూ ఉన్నతమూ అయిన ఆశయాలనయినా సరే విడచిపెట్టవలసిందే. మంత్రాలన్నీ ప్రార్థనలే, భక్తి, యోగసాధనలు, ధ్యానం చివరగా ముముక్షుత్వం కూడా బంధమే, భావాలే, వీటన్నిటినీ విడచిపెట్టి తీరవలసిందే అపుడు మాత్రమే సత్యదర్శనం సాధ్యం కాగలదు. ఇక్కడ "దర్శనం" "సాధ్యం" అన్న మాటలు కూడా అర్థరహితాలే. ఆ స్థితిలో ఉండడం జరుగుతుంది అని అనవచ్చేమో?!?

జీవన్ముక్తుడు అంటేనే జీవితం నుండి ముక్తి నందినవాడు అని అర్థం. జీవితం అంటేనే క్షణక్షణమూ మనం గుర్తించే భావాలసముదాయం. అందుకే సర్వభావాలనుండీ ముక్తినందిన వానిని మాత్రమే జీవన్ముక్తుడు అని అంటున్నాం. అతనిలో విషయాల ననుభవించాలనే కోరికలు గాని, మోక్షం కావాలనే కోరికగానీ ఏవీ ఉండవు. సర్వకాల సర్వావస్థలలోనూ అతడు నిశ్చల మనస్సుతో శాంత మైన బుద్ధితో సర్వదా సర్వత్రా చైతన్యంగా తనను తాను గుర్తిస్తూ ఉంటాడు. కోరికలూ ఉద్రేకాలూ అహంకార తాదాత్మ్యం కలిగిన మనోబుద్ధుల లక్షణాలు. మనోబుద్ధులు నధిగమించిన మహాశయునకు మనస్సుగా బహిర్ముఖంగా చరించే భావాలెక్కడ ఉంటాయి? ఎలా ఉంటాయి?!?

శ్లో॥ మహదాది జగద్ద్వైతం నామమాత్ర విజృంభితమ్ ।
విహాయ శుద్ధబోధస్య కిం కృత్య మవశిష్యతే ॥ 69.

టీ॥ మహదాది = మహత్తత్త్వము మొదలగు, ద్వైతం జగత్ = ద్వైతజగత్తు, నామమాత్ర విజృంభితం = నామమాత్ర భిన్నమై యున్నది, తత్ర = దానిలో, కల్పనాం = కల్పనను, విహాయ = విడిచిపెట్టి, శుద్ధబోధస్య = శుద్ధ బుద్ధ స్వరూపునికి, కిం = ఏమి, కృత్యం = కర్తవ్యము, అవశిష్యతే = మిగులుచున్నది?

శుద్ధచైతన్య స్వరూపునిచే చేయబడదగిన కార్యాలేమి ఉంటాయి? మహత్ (అందరి బుద్ధియొుక్క మొత్తం రూపం) నుండి ద్వైత జగత్తువరకూ సర్వ మూ నామస్మరణ మాత్రంచేత బుద్ధిలో విజృంభించి భావనా మాత్రంగా తెలియ బడుతోందని తెలిసి విస్మరించిన మహాశయునకు చెయ్యవలసిన దేముంటుంది?

సాంఖ్యదర్శనంలో వ్యక్తిగతమైన ఆలోచనల కేంద్రాన్ని బుద్ధి అనీ, మొత్త విశ్వం అంతటా ఉన్న భావాల సమూహాన్ని మహత్ అనీ వ్యవహరిస్తారు. అనేక నామ రూపాలతో గుర్తింపబడే యీ విశాల విశ్వమంతా మహత్ యొక్క వ్యక్తరూపంగా గుర్తిస్తారు. సాంఖ్యుల దృష్టిలో ఈ ప్రపంచమంతా ప్రకృతినుండి ఉద్భవిస్తోంది. ప్రకృతి నుండి మహత్, మహత్ నుండి అహంకారము, అహం కారమునుండి మనస్సు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, సూక్ష్మ రూపమైన తన్మాత్రలు, వాటిలోనుండి పంచమహాభూతాలు, వాటి మిశ్రమంతో విశాల విశ్వమూ ఉద్భవిస్తున్నాయని సాంఖ్యులు తార్కికంగా బోధిస్తారు. బంగారం నుండి కంసాలి కడ్డీనిచేసి, తీగలుగామార్చి, ముక్కలు చేసి, రింగులుగా మార్చి, హారం తయారుచేస్తాడు. నామరూపాలు వేరుగా హారంగా ఉన్నా అది బంగారమే! కడ్డీ, తీగ, రింగు, ముక్క, హారం----ఇవన్నీ కూడా కేవలం నామాలే, వస్తుతః అవన్నీ బంగారం మాత్రమే. ఈ కనిపించే భౌతిక ప్రపంచమంతా ప్రకృతి యొక్క వ్యక్తరూపమే, నానాత్వమంతా కేవలం నామరూపాలలోనే ఉంది.

మనలో ఉండే అహంకారం కర్తగా, విషయిగా, శరీర మనోబుద్ధుల ద్వారా వస్తువులను, ఉద్రేకాలను, ఆలోచనలను అనుభవించినట్టు గుర్తిస్తోంది. జీవన్ముక్తుడు అహంకారాన్ని అధిగమించి అనంతమైన ఆత్మగా తన్ను తాను తెలుసుకుంటాడు. కాబట్టి అతని దృష్టితో చూస్తే ప్రపంచం ఎలా ఉండగలదు? ప్రపంచమేలేని అతనికి విధినిషేధాలు ధర్మాలు ఎలా ఉంటాయి? అతడు చెయ్యవలసినదేదీ ఉండదు, అతడు సాధించవలసినది కూడా ఏమీలేదు!

పరిపూర్ణమయిన ఈ ఆత్మానుభవంలో సర్వమూ సిద్ధించే ఉన్నాయి. నామ రూపాత్మకమయిన ఈ ప్రపంచంనుండి జ్ఞాని సాధించవలసినదేదీ ఉండదు. నిన్నరాత్రి కలలోని నా కుటుంబంలో నేను చెయ్యాలనుకున్న ముఖ్యమయిన పనులు ఇప్పుడు ప్రస్తుతం నాకు ఏవిధంగా సంబంధించి ఉంటాయి. అదే విధంగా ఆత్మగా జాగృతుడయిన జ్ఞానికి ఈ ప్రపంచంకూడా ఏ విధంగానూ సంబంధించి ఉండదు.

తనచుట్టూ ఉన్న ప్రపంచానికి సాధకుడు నిర్వర్తించవలసిన ధర్మాలేవీ లేవని ఇక్కడ అర్థం కాదు. ఆత్మానుభవస్థితులై ద్వైత ప్రపంచాన్ని గుర్తించని వారికే ఇది వర్తిస్తుంది.

జ్ఞాని ప్రపంచాన్ని ఏ దృష్టితో చూసేదీ మహోపనిషత్తులో ఇలా వివరింపబడి ఉంది.

అశంకితాపి సంప్రాప్తా గ్రామయాత్రా యధాధ్వగైః
ప్రేక్ష్యతే తద్వదేవ జ్ఞైర్ భోగ శ్రీరవలోక్యతే (మహోపనిషత్తు 5-72)

*గ్రామీణులు వారి గ్రామ వీధులగుండా పోతున్న యాత్రికులను ఏ విధంగా చూస్తారో, జ్ఞాని అదేవిధంగా తనముందు రోజూ కనబడే జగద్ లీలను చూస్తూ ఉంటాడు.*

గ్రామీణులు తమ విధిలోనుండి పోతున్న యాత్రికులను చక్కగా చూస్తారు. అయినా ఆ చూడడంపై వారికి ఏ విధమయిన ప్రత్యేకభావమూ ఉండదు. వారి కళ్ళముందుగా కొంతమంది నడచి వెళ్ళేరని మాత్రమే గుర్తిస్తారు!! జ్ఞానికూడా ఇదేవిధంగా నిస్సంగంగా నిర్వికారంగా తన బుద్ధిచే గుర్తింపబడే జగద్భావాలను గుర్తిస్తూ ఉంటాడు!

## శ్లో॥ భ్రమభూత మిదం సర్వం కించిన్నాస్తీతి నిశ్చయీ ।
## అలక్ష్యస్స్ఫురణః శుద్ధః స్వభావేనైవ శామ్యతి ॥ 70.

టీ॥ ఇదం = ఈ, సర్వం = సమస్త ప్రపంచము, భ్రమభూతం = భ్రాంతిమూలము, కించిత్ = కొంచెమైనను, నాస్తి = లేనిది, ఇతి = ఈ ప్రకారమగు, నిశ్చయీ = నిశ్చయం కలిగినటువంటిన్ని, శుద్ధః = పరిశుద్ధుడైనటువంటి, అలక్ష్యస్ఫురణః = చైత్యాన్యాత్మాను భవముగల జ్ఞాని, స్వభావేనైవ = స్వాభావికముగానే, శామ్యతి = శాంతుడై ఉంటాడు.

**ఈ కనబడే ప్రపంచమంతా భ్రమాజన్యమనీ, నిజానికి ఎక్కడా ఉనికి కలిగిలేదనీ జ్ఞానికి స్పష్టంగా తెలుస్తుంది. అగోచరమైన ఆత్మస్థితి అనుభూతమయిన కారణంగా అతడు సదా శాంతుడై ఉంటాడు.**

ఆత్మానుభవం వచ్చినతరువాత ఏ విధమయిన సందేహమూ మిగిలి ఉండదు. ఆత్మానుభవంలో ఉండడమంటే జగద్భ్రమనుండి పూర్తిగా మేలుకున్నట్టే. అట్టి జ్ఞాని సదా ఆత్మానుభవంలో స్థితుడై ఉంటాడు.

ఇక్కడ అనుభవం అన్నపదానికి ఆత్మవిషయంగా అనుభవింపబడు తుందని అర్థం కాదు. అనంతచైతన్యం కేవలంగా ఉంది, ఉన్నది అదొక్కటే. అది ఎన్నటికీ దేనికీ విషయం కాజాలాదు. శరీరం మనస్సు బుద్ధి---వీటిచేత మాత్రమే విషయాలు విడిగా గుర్తింపబడతాయి. "అలక్ష్యస్ఫురణః"--అని మహర్షి వాడ డంలో ఆత్మ దేనిచేతనూ స్ఫురింపబడదనీ, ఉన్నది కేవలంగా ఇదేననీ అర్థం ఇమిడి ఉంది. అహంకారం అదృశ్యమయితేనే ఆత్మానుభవం సిద్ధిస్తుంది. అందుకే ఇది దేనిచేతనూ తెలియబడనిది, స్వభావంగా అనుభవంలోకి మాత్రమే వచ్చేది ఇదే ఉన్న ఏకైక సత్యం.

ఈ అనుభవంతో వ్యక్తి పరిశుద్ధుడు అవుతాడు. సత్యం తెలియకపోవడం (అగ్రహణం) అనే అజ్ఞానంనుండి ముక్తి పొందుతాడు. అగ్రహణం మూలంగా అహంకారం సత్యాన్ని అనేక విధాలుగా భావిస్తుంది. (అన్యథా గ్రహణం) ఈ అన్యథాగ్రహణం నుండే శరీరమూ శరీరంచే అనుభవింపబడే ప్రపంచమూ ఉద్భవించి బుద్ధిలో గుర్తింపబడి సుఖదుఃఖాలుగా అనుభవింప బడతాయి. అగోచరమైన ఆత్మానుభవంలో అపరోక్షానుభూతిలో అగ్రహణం (అజ్ఞానం) నశించడమే జీవన్ముక్త స్థితి.

"స్వభావేనైవశామ్యతి"---సహజంగా అతడు శాంతుడై ఉంటాడు అని మహర్షి అంటున్నారు. ఆత్మలో ఆత్మగా కేవలంగా పవిత్రంగా ఉన్నవానిలో అలజడి ఎలా ఉంటుంది? అన్ని అలజడులూ మనశ్శరీరాలనుండే ఉద్భవిస్తాయి. వానినధిగమించినప్పుడే జ్ఞాని ఆత్మానందంలో స్థితుడయి ఉండగలుగుతాడు.

**శ్లో॥శుద్ధస్ఫురణ రూపస్య దృశ్యభావ మపశ్యతః ।**
**క్వ విధిః క్వ చ వైరాగ్యం క్వ త్యాగః క్వ శమోఽపివా॥71.**

**టీ॥** దృశ్యభావం = దృశ్యభావమును, అపశ్యతః = చూడనటువంటి, శుద్ధస్ఫురణ రూపస్య = శుద్ధప్రకాశ స్వరూపుడగు జ్ఞానికి, విధిః = విహితకర్మానుష్ఠాన రూపవిధి, క్వ = ఎక్కడ, వైరాగ్యం = వైరాగ్యము, క్వ = ఎక్కడ, త్యాగః = త్యాగము, క్వ = ఎక్కడ, శమః అపి = శమము గూడ, క్వ = ఎక్కడ.

**శుద్ధచైతన్య స్వరూపుడై భౌతిక ప్రపంచాన్నే చూడని మహాత్మునికి జీవితధర్మాలు వైరాగ్యం త్యాగం మనః సంయమనం ఇవన్నీ అర్థరహితాలు.**

మందులు, పథ్యం, మంచంమీద విశ్రాంతి, పక్కన నర్సు (Nurse) ఇవన్నీ ఎందుకు---ఆస్పత్రినుండి ఆరోగ్యవంతంగా బైటికివచ్చి తిరిగే సుఖ జీవికి? వాటి ఉపయోగం ఏమిటి? అజ్ఞానావృతమైన పరిమితత్త్వంతో బాధపడుతూ, బాహ్యప్రపంచ విషయాలచే ఆకర్షింపబడి అనేక కష్టనష్టాలకు లోనౌతూ, కోరికలూ ఉద్రేకాలకూ బానిసగా ఉంటూ, తన మనః సంక్షోభాన్ని తానే భరించలేని అహంకారానికి, ఉపనిషత్తులు దివ్యమయిన ఔషధంగా జప, తప, ధ్యానాదులను, శమదమాది నియమాలను, ధార్మిక జీవనం మొదలయిన వాటినీ విధించింది.

శుద్ధమూ అనంతమూ అయిన ఆత్మ చైతన్యంగా తన్ను తాను గుర్తిస్తూ, అన్యంగా బాహ్యంగా భౌతిక ప్రపంచం లేనే లేదని తెలుసుకున్న పరి పూర్ణ జ్ఞానికి ఈ విధి నిషేధ రూపమయిన సాధనలన్నీ అర్థరహితం, అనవసరం.

అతనిచే జరుగబడే కర్మలన్నీ అనంత చైతన్యపు దివ్యలీలలై, సమకాలీన సమాజానికి మార్గదర్శకాలై సర్వమానవాళికీ శిరోధార్యమయిన ధర్మాలుగా రూపొంది ప్రకాశిస్తాయి. పరిపూర్ణుడయిన జ్ఞాని ధర్మస్వరూపాన్ని నిర్వచించి ఆచరించి, అత్యంత శ్రద్ధతో మనమంతా నడచి, వారి మాటల నర్థం చేసు కునేందుకు ప్రయత్నిస్తూ, వారు చూపించే గమ్యంవైపు ప్రయాణం సాగించాలి.

జీవన్ముక్తుని జీవితాన్ని అణువణువూ సమీక్షిస్తూ వ్యాఖ్యానిస్తున్నారు అష్టావక్ర మహర్షి. అంజలిబద్ధుడై ధ్యానముద్రలో అసాధారణ మేధా సంపన్నుడూ ఉత్తమాధికారీ అయిన జనకరాజర్షి అర్థం చేసుకుంటున్నాడు. ఈ శ్లోకపు భావార్థాన్ని సరిగ్గా గ్రహించకుండా తమ జీవితాలలో ఆచరించాలనుకునే మూఢులైన సాధకులు ఆత్మహత్యా సదృశమయిన ప్రయత్నం చేస్తున్నట్టే! వీనిని చదివి అర్థం చేసుకోవడంలో అత్యంత జాగ్రత్త వహించితీరాలని మరోసారి హెచ్చరిస్తున్నాను!

**శ్లో॥ స్ఫురతోఽనంతరూపేణ ప్రకృతిం చ న పశ్యతః ।**
**క్వ బంధః క్వ చ వా మోక్షః క్వ హర్షః క్వ విషాదతా॥72**

టీ॥ అనంతరూపేణ = అనంతరూపములతో, స్ఫురతః = ప్రకాశించుచున్నప్పటికి, ప్రకృతిం = మాయను, న పశ్యతః = చూడనటువంటి జ్ఞానికి, బంధః = బంధము, క్వ = ఎక్కడ, మోక్షః=మోక్షము, క్వ=ఎక్కడ, హర్షః = సంతోషము, క్వ = ఎక్కడ, విషాదతా = దుఃఖము, క్వ = ఎక్కడ,

పరస్పరాధారంగా ఉనికి కలిగి ఉండే ప్రకృతి నధిగమించి ఆత్మ చైతన్యమే అనేక రూపాలలో తెలియబడడాన్ని చూస్తున్న జ్ఞానికి---బంధం ఎక్కడ? ముక్తి ఏమిటి? సుఖదుఃఖాలెలా ఉంటాయి?

వ్యక్తిగా పరిచ్ఛిన్నుడైన జీవుడు (జీవచైతన్యం), తన వాసనల ద్వారా బాహ్యంగా చూస్తూ, నామ రూపాత్మకమైన నానాత్వపు ప్రపంచాన్ని తెలుసు కుంటూ ఉంటాడు. ఇలా తెలుసుకుంటూ యిష్టా యిష్టాలను మరల కొత్తగా ఏర్పరచుకుంటూ ఉంటాడు. ఈ విధంగా భ్రమాచక్రంలో భ్రమిస్తూ ఉంటే అహంకారానికి నామ రూపాత్మకమూ భావనారూపమూ అయిన ప్రపంచం నిజంగా ఉన్నట్టు అనిపిస్తుంది. నిజంగా భావింపబడే ప్రపంచంలో యిష్టా యిష్టాలతో కష్టసుఖాలను నిజంగా అనుభవిస్తున్న అహంకార రూపుడైన జీవుడు సహజంగా ముక్తిని కోరుకుంటాడు. తన పరిమితులను గుర్తిస్తూ వాటి నుండి

బయటపడాలనుకుంటాడు. తాను నిర్మించుకున్న బంధ భావనుండి తానే బయటపడాలని ఉన్మాదివలె అహంకారం ఆక్రోశిస్తూ ఉంటుంది. అహంకారం మన శ్శరీరాలతో తాదాత్మ్యం చెందుతూ సుఖదుఃఖాలననుభవిస్తూ యిష్టా యిష్టాలకు లోనౌతూ, కోరికలను పెంచుకుంటూ, సుఖదుఃఖ మిశ్రితమయిన జీవితాన్ని సృష్టించి పోషించి జీవిస్తూ, నిరంతరం పరిభ్రమిస్తూ ఉంటుంది.

ఇట్టి అహంకారాన్ని అధిగమించి స్వస్థితిలోకి జాగృతుడయిన జ్ఞాని దృష్టిలో ద్వైతమయమయిన ప్రపంచం ఉండనే ఉండదు. కేవలంగా తాను చైతన్యస్వరూపంగా భ్రమనుండి బయటపడి శాంతంగా ఉంటాడు. అట్టి మహర్షికి అతని మనోబుద్ధులు ప్రపంచాన్ని చూపించినా, ఆ జగత్తంతా చైతన్య స్వరూపమయిన తన కదలికలుగా భావాలుగా గుర్తించి ఆ మహాద్భుతలీలను సంతోషంగా గుర్తిస్తూ ఉంటాడు.

సముద్ర స్వభావాన్ని చక్కగా అర్థం చేసుకున్న వానికి కెరటాలు నురగలు బిందువులు వేరుగా కనిపిస్తాయా? బంగారాన్ని గుర్తించగల వానికి ఎన్ని నామరూపాలు కలిగిన విభిన్న ఆభరణాలయినా బంగారంగానే కనిపిస్తాయి. స్వప్నం నుండి మేల్కొన్న తరువాత ఆ స్వప్నం మన మనస్సుకంటే విడిగా ఉందని అనుకుంటామా? ఆత్మానుభవస్థితుడయిన జ్ఞాని ప్రపంచాన్ని చూస్తున్నా, చైతన్యపు నాట్యవిన్యాస చతురత భావాలరూపంలో చూసి ఆనందిస్తూ ఉంటాడు. ప్రపంచం నిజంగా ఉందని భ్రమ లేశం కూడా అతనికి ఉండదు.

కష్టసుఖాలన్నీ అజ్ఞాన జనితాలే. సత్యాన్ని సరిగ్గా గ్రహించకపోవడంతో (అగ్రహణం), అన్యథా జగత్తుగా గ్రహించి దానిని నిజమనుకుని భ్రమపడుతూ ఉంటాం. బంధభావం ఈ భ్రమనుండి ఉద్భవిస్తోంది. ఆచార్య శంకరులు వివేక చూడామణిలో ఇలా అంటున్నారు-"అత్రానాత్మన్యహమితి మతిర్బంధః"ఆత్మను అనాత్మగా గ్రహించడమే బంధమై భాసిస్తుంది.

**శ్లో॥ బుద్ధిపర్యంత సంసారే మాయామాత్రం వివర్తతే ।**
**నిర్మమో నిరహంకారో నిష్కామః శోభతే బుధః ॥73.**

టీ॥ బుద్ధిపర్యంత సంసారే = బుద్ధిపర్యంత సంసారమునందు, మాయామాత్రం = మాయావిశిష్టమగు చైతన్యము, (జగత్ = ప్రపంచమును), వివర్తతే = కల్పన జేయు చున్నది, బుధః=జ్ఞాని, నిర్మమః=మమతారహితుడును, నిరహంకారః=అహంకార రహితు డును, నిష్కామః = కామనా రహితుడునునై, శోభతే = ప్రకాశించు చున్నాడు.

ఆత్మజ్ఞానం లభించేవరకు భౌతిక ప్రపంచ భ్రమ బాధిస్తూ ఉంటుంది. జ్ఞాని "నేను", "నాది" అనే భావాలనూ, సర్వకోరికలనూ విడచిపెట్టి సుఖంగా జీవిస్తూ ఉంటాడు.

వేదాంత ప్రక్రియానుసారంగా సత్యదర్శనం మాత్రమే సమస్తమయిన భ్రమలనూ (అన్యథాగ్రహణాన్ని) పోగొడుతుంది. "బుద్ధి పర్యన్త సంసారే"-- బుద్ధి ఉన్నంతకాలమూ సంసారం ఉంటుంది అని మహర్షి అనడంలోగల అంతరార్థాన్ని జనకుని సూక్ష్మబుద్ధి గ్రహించే ఉంటుంది. సంసార భ్రాంతి సత్యదర్శనంతోనే నశిస్తుంది. అయితే ఏ భ్రమ అయినా మన మనస్సులో, మనం సరిగా చూడాల నుకోనంత కాలమూ ఉండనే ఉంటుంది. మనం చూస్తున్న దేమిటి? దేనితో ? ఏవిధంగా చూస్తున్నాము? అసలు చూడడం అంటే ఏమిటి? అనే తర్కంతో వివేకవంతమైన బుద్ధి దృఢంగా దీక్షగా ప్రయత్నించి చూస్తే, మనం ఇంతవరకూ నిజంగా చూస్తున్నామనుకున్నదంతా అనేక నామరూపాలతో మన బుద్ధిలో గుర్తింపబడే భావాలేనన్న విషయం స్పష్టంగా కనిపిస్తుంది.

భౌతిక విజ్ఞాన శాస్త్రం కూడా, తమ లేబరీటరీలలో ఈ భౌతిక ప్రపంచం భౌతికంగా లేదనే నిర్ణయానికి వచ్చింది! రసాయన శాస్త్రం సర్వనామ రూపాలను శక్తిగా గుర్తిస్తోంది, శక్తి పదార్థాన్ని సృష్టిస్తోంది. పదార్థం శక్తిగా మారిపోగలదు. భౌతికశాస్త్రం నేను చూసేదంతా దేశకాలాల పరస్పర సంబంధం ఆధారంగా నియమింపబడుతోందని స్పష్టం చేస్తోంది. ఈ విధంగా వివేకవంత మైన తార్కిక బుద్ధి ఉన్నచోట భౌతిక ప్రపంచం యథార్థంగా నిలవడం లేదు. ఈ సంసారమంతా మన మూఢత్వంలో జీవిస్తూ పనికిమాలిన ఊహా గానాలతో చిరాయువుగా వర్ధిల్లుతోంది. నానాత్వంతో కూడిన ఈ మాయా ప్రపంచమూ దాని ఫలితమయిన బాధలూ విచారాలూ అన్నీ కూడా సాధకుడు సరైన విచారణ సాగించేవరకూ మాత్రమే ఉంటాయి.

మనలో ఉండే అహంకారభావమే భౌతికప్రపంచాన్ని గుర్తిస్తోందని విచారణ సాగిస్తే సులభంగా బోధపడుతుంది. అహంకారమే శరీరభావంతో తాదాత్మ్యం చెందుతూ మాయా ప్రపంచాన్ని గుర్తిస్తోంది. మనస్సుతో తాదాత్మ్యం చెందుతూ అనుభవిస్తోంది. సంక్షిప్తంగా చెప్పాలంటే అహంభావమే (కారమే) ప్రపంచాన్ని చేసే వ్యక్తిననుకుంటూ, నామరూపాత్మక భావనా ప్రపంచాన్ని నిజమని భ్రమ పడుతోంది. అహంకారపుటాలోచనలే మమత్వరూపంలో ప్రపంచ భావం మీద

మోహాన్ని బాంధాన్ని పెంచుకుంటోంది. అహంకారాన్ని అధిగమించిన ధీరుడు అహంకార మమకారాలను జయించినట్టే, వాటి బంధంనుండి ముక్తుడయినట్టే.

ప్రపంచాన్ని చూసే విషయి లేకపోవడంతో చూడబడే విషయాలన్నీ కూడా అదృశ్యమయి పోతాయి! పరిపూర్ణుడయిన వ్యక్తిలో అహంకారం సమూలంగా నశిస్తుంది, వాసనా బలంతో ఉద్భవించిన కోరికలే ఊపిరిగా జీవించే అహంకారం అంతంకాగా జీవన్ముక్తస్థితిలో ఆనందంగా జీవించే మహాశయుడు మానవాళి చేతనే కాదు దేవతలచే కూడా పూజింపబడతాడు! ఏకమూ అచలమూ అయిన ఆత్మతత్త్వం,జగత్తూ జగదీశ్వరుడూ జీవుడుగా భావింపబడుతూ భ్రమగొల్పుతూ ఉంటుంది, ఈ మూడింటికిని ఆధారమయిన చైతన్య స్వరూపంగా తన్ను తాను తెలుసుకున్న జ్ఞాని సర్వలోక వంద్యుడు, సదానందరూపుడు!

## శ్లో॥అక్షయం గత సంతాపం ఆత్మానం పశ్యతో మునేః ।
## క్వ విద్యా చ క్వ వా విశ్వం క్వ దేహోऽహం మమేతి చ॥74.

**టీ॥** అక్షయం=నాశరహితమైనటువంటిన్ని, గతసంతాపం = సంతాప రహిత మైనటువంటి, ఆత్మానం = ఆత్మను, పశ్యతః = చూచుచున్నటువంటి, మునేః = మునికి, విద్యా = శాస్త్రము, క్వ = ఎక్కడ, విశ్వం = ప్రపంచము, క్వ = ఎక్కడ, దేహః = దేహము, క్వ = ఎక్కడ, అహం మమ ఇతి చ = నేను నాది యనెడి భావము, క్వ = ఎక్కడ.

**అక్షయమయిన ఆనందస్వరూపంగా ఆత్మగా తన్ను తాను గుర్తించిన మునికి ఏది జ్ఞానం? విశ్వమెక్కడ? "నేను దేహాన్ని", "దేహం నాది" అనే భావాలెలా ఉండగలవతనిలో?**

జీవన్ముక్తుని జీవిత చిత్రాన్ని ఉత్తమాధికారీ శిష్యుడు అయిన జనక రాజర్షి కోసం చిత్రీకరిస్తూ అష్టావక్ర మహర్షి ఎంత ప్రయత్నించినా సరిగ్గా చిత్రీ కరించలేక పోయాననే ఆవేదనతో ఆవేశంతో అసాధారణ కవితా మాధుర్యాన్ని అందిస్తున్నారు!

"నేను దేహాన్ని" అనే భ్రమే విత్తనం కారణంగ మానసికాందోళనలన్నీ మొలకెత్తుతాయి. వ్యక్తిగా తన సహజ దేహతాదాత్మ్య బుద్ధితో శరీరపు సర్వావ స్థలనూ తనవిగానే భావిస్తాడు. అందులోనుండి నాది అనిపించే మమత్వాభావం ఉద్భవించి శరీరానికి సుఖాన్నిచ్చే వాటన్నింటినీ తనవిగా భావిస్తూ, వాటి ప్రాప్తి

ప్రాప్తాలలో కష్టసుఖాలననుభవిస్తూ ఉంటాడు. శరీరమే నేను అనే భ్రమ కారణంగా నా చుట్టు ఉన్నా బాహ్యప్రపంచంతో నేను నిష్పక్షపాతంగా వ్యవహరించలేక పోతున్నాను. ఈ మోహపు విలువలతో వ్యక్తి పొందే బాధలే సంసారంగా గుర్తింపబడుతోంది.

ఇటువంటి అహంకారాన్ని అధిగమించి సుఖానంద స్వరూపమూ అవినాశీ అయిన ఆత్మగా తన్ను తాను గుర్తించిన యోగిలో దేనిని గురించయినా తెలుసుకోవాలనే కోరిక ఎలా ఉంటుంది? అతడు మాత్రమే కేవలంగా ఉన్నాడు, మిగిలిన జ్ఞానాలన్నీ అతడి చైతన్యంలోని విషయాలే. అతడు చైతన్యంగా బుద్ధిలోని జ్ఞానాన్ని తానే ప్రకాశింపజేస్తూ ఉంటాడు. ఆత్మవిదునకు వేరుగా తెలుసుకోవలసినదేదీ ఉండదు. ఇక్కడ అష్టావక్రుని భావాలనే ముండకోపనిషత్తులో శిష్యుడు తన గురువును ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు.

కస్మిన్ భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి (ముండకోపనిషత్తు 1-1-3)

*గురుదేవా! దేనిని తెలుసుకుంటే సర్వమూ తెలియబడుతుంది?* ఆత్మ జ్ఞానమే అన్ని జ్ఞానాలకూ మూలజ్ఞానం. ఆత్మ చైతన్యంలోనే బుద్ధిలోని సర్వ భావాలూ, జానాలూ మనచే గుర్తింపబడుతున్నాయి. అందుకే ఆత్మను తెలుసుకుంటే సర్వమూ తెలియబడినట్టే.

అసత్యమూ నామరూపాత్మకమూ అయిన జగత్తును గుర్తించడం మానినప్పుడే సత్యం అనుభవంలోకి వస్తుంది. సత్యతత్వంలోనికి జాగృతుడయిన వానికి అసత్యాన్ని గుర్తించడం ఎలా సాధ్యపడుతుంది అసలతడికి ప్రపంచం ఎక్కడ ఉంది? ఎలా ఉంటుంది?

**శ్లో॥నిరోధాదీని కర్మాణి జహాతి జడధీర్యది ।**
**మనోరథాన్ ప్రలాపాంశ్చ కర్తుమాప్నోత్యతత్ క్షణాత్॥75.**

టీ॥ జడధీః = అజ్ఞాని, నిరోధాదీని = చిత్తనిరోధము మొదలగు, కర్మాణి = కర్మలను, జహాతి యది = విడిచిపెట్టుచున్న వాడైనప్పటికిని, అతత్ క్షణాత్ = కొంతసేపటికి, మనోరథాన్ = కోరికలను, ప్రలాపాన్ = సంభాషణలను, కర్తుం = చేయుటకు, ఆప్నోతి = ప్రవృత్తుడగుచున్నాడు.

జడమైన బుద్ధిగలవాడు మనః సంయమనాన్ని ఆపిన మరుక్షణం నుండీ కోరికలూ మనఃకల్పనలూ విజృంభిస్తాయి.

తగినంత సాధన చెయ్యని మందబుద్ధుల నుద్దేశించి అష్టావక్ర మహర్షి సలహా ఇస్తున్నారీ శ్లోకంలో. సాధనను ఆపితే ఏ విధంగా అశాంతి వృద్ధి అవుతోందో చెప్తుతూ సాధనను సాగించమని ప్రోత్సహిస్తున్నారు. ఇలా చెప్పడంలోనే సాధనను సక్రమంగా కొనసాగించే వారికి కూడా సున్నితమైన సూచననిస్తున్నారు.

వాసనలున్నంతకాలమూ అది జడంగానే ఉంటుంది. అందుకే ఆలోచనలను నిరోధించే ధ్యానం చెయ్యడం అవసరం. ధ్యానం ఆపిన తక్షణమే మనస్సు తనకలవాటయిన కోరికలలోకి ఊహాలోకాలకు పరుగులు తీస్తుంది. బుద్ధిలో వ్యక్తమయే వాసనలే కోరికలు, ఈ కోరికలే మనస్సులో ఆలోచనలుగా మనస్సును కల్లోలితం చేస్తాయి. కల్లోలితమయిన మనస్సు ఊహాలోకాలలోకి పరుగులు తీస్తుంది. అందుకే సాధన ప్రథమదశలో ఉన్నవారు క్రమం తప్పకుండా సాధన చేస్తూనే ఉండాలి. ఈ సాధన శరీరాన్నీ మనస్సును బుద్ధినీ కూడా శుద్ధం చేసేటట్టుగా ఉండాలి. శరీరం పరిశుభ్రంగా మనస్సు సంతోషంగా బుద్ధి శాంతంగా ఉండేటట్టు చూసుకుంటూ ఉండాలి. ఇందుకు జపతపాది నియమాలూ శాస్త్రాధ్యయనమూ సహాయం చేస్తాయి.

సాధనలో ప్రగతిని స్థిరత్వాన్ని సాధించిన వారికి కూడా ఇక్కడ ఒక సూచన ఇమిడి ఉంది. వారిని మహర్షి ఇలా ప్రశ్నిస్తున్నారు? మనస్సును మనస్సుచేతనే ఎలా నిరోధించగలవు? మనస్సును అధిగమిస్తేనే మనస్సును నియమించి శాసించగలగడం సాధ్యమవుతుంది అని అంటున్నారు.

మన ఉపాధిలో ఉన్న అవయవాల్నీ సదా సక్రమంగా విశ్వసనీయంగా పనిచేస్తూ అజ్ఞానంనుండి పుట్టిన వాసనలనుసేవిస్తూనే ఉంటాయి. సాధన ప్రథమ దశలో, ఇంద్రియాలు విషయాలవైపు ఆకర్షింపబడడం అనే సహజగుణాన్ని సాధకుడు పెద్ద అడ్డుగా భావిస్తాడు. అందుకే ధ్యానంలో మనస్సును నియమించ డానికి ప్రయత్నిస్తాడు. అందుకే మహర్షి ఇక్కడ మనఃసంయమనం మార్గం మాత్రమేననీ లక్ష్యం వేరుగా ఉందనీ సున్నితంగా సూచిస్తున్నారు. ఆత్మ తత్త్వంలోనికి మేలుకోవడమే లక్ష్యం. మార్గంలో ప్రయాణిస్తున్నంత కాలమూ లక్ష్యాన్ని చేరలేదనే అర్థం. లక్ష్యాన్ని చేరడం అంటే మార్గంతో పనిలేదని స్పష్టంగా బోధపడుతుంది.

సాధనతో సతమతమయే సాధకులు అంతరంగాలనూ దశలనూ గుర్తించే మహర్షి సూచనలనిస్తున్నారు. మనస్సును నిరోధించడమూ యోగాభ్యాసాలూ

కేవలం మార్గాలే, వాటంతట అవి ముక్తినియ్యలేవు. కోరికల కతీతంగా ఉన్నతమైన స్థితికి మనస్సును చేర్చగలగాలి, అంతేకాని మనస్సుని నియమించడం లోనే ఉండిపోకూడదు. సాధకులు ఈ సున్నితమయిన సూచనను గ్రహించి మనస్సును అధిగమించి కోరికల కతీతంగా నిలవగలగాలి.

మానసిక కల్పనలనుండి భ్రమలనుండి విడివడేశక్తి కలగడానికి ధ్యానాది నియమాలతో మనోబలం వచ్చేవరకూ మనస్సుతోనే సమతలంలో (Horizontal) కొంతకాలం ప్రయాణించక తప్పదు. సరైన అదనుచూసి భూమిని విడచిపెట్టే విమానంవలె మనస్సునుండి విడివడి శాస్త్రం సూచించే ఉన్నత స్థితినందుకో గలగాలి. "ఉద్ధరేదాత్మనాత్మానం" (గీతావచనం)---మనలను మననే ఉద్ధరించు కోవాలి. యోగాభ్యాసాలూ, జపతపాది నియమాలూ,మనస్సును శాంతపరచడం నిజమే, అయితే ఈ విధంగా సాధింపబడిన తాత్కాలిక శాంత స్థితే ఆత్మానుభవ మని పొరబడకూడదు. యోగ ఉత్థాన సమయాన ఈవలకు వచ్చిన మరుక్షణమే మనస్సు తన సహజ స్వరూపందాల్చే ప్రమాదముంది. అందుకే మహర్షి హెచ్చ రిస్తున్నారు. తాత్కాలిక శాంతిని ఆత్మానుభవంగా పొరపడకూడదు. అలా శాంతించిన మనస్సుతో మనస్సునుండి విడివడి అమనస్కులమయి ఆత్మానుభవ స్థితులము కావాలి.

సాధనా బలంతో శాంతించిన మనోబుద్ధులే దృఢమైన ఆలంబనంగా నిలబడి భావాతీస్థితి సాధించి తద్వారా సాక్షి అనుభవం పొందాలి. (బ్రహ్మ జ్ఞానంతో కూడిన) ఆత్మానుభవంలో మాత్రమే జగజ్జీవేశ్వర రూపమయిన మనో భ్రమ తొలగి సత్ చిత్ ఆనందంగా నిలచిపోవడం సంభవం అవుతుంది. యోగా భ్యాస ఫలంగా ఆత్మానుభవం సిద్ధించడం లేదు. ఆత్మ ఎప్పుడూ కేవలంగా నేనుగా ఉండనే ఉంది, మనః కల్పనలను చూడడం మాని నన్ను నేనుగా చూసుకోవాలి, నేను నిలచిపోవాలి!

**శ్లో॥ మందః శ్రుత్వాఽపి తద్వస్తు న జహాతి విమూఢతామ్।**
**నిర్వికల్పో బహిర్యత్నాత్ అన్తర్విషయలాలసః ॥ 76.**

టీ॥ మందః = మూర్ఖుడు, తద్వస్తు = ఆయాత్మ వస్తువును, శ్రుత్వా అపి = వినిన ప్పటికిని, విమూఢతాం = మూఢత్వమును, న జహాతి = విడిచిపెట్టడు, బహిః = వెలుపటిదైన, యత్నాత్ = యత్నమువలన, నిర్వికల్పః = సంకల్ప రహితుడు, పరం తు = కాని, అంతః = లోపల, విషయలాలసః = విషయలాలసుడు, భవతి = అగుచున్నాడు.

సత్యమైన ఈ జ్ఞానాన్ని విన్న తరువాత కూడా మందబుద్ధులు తమ మనోభ్రమలను విడనాడలేరు. బాహ్యంగా శాంతులై వారు కన్పించినా అంత రంగంలో విషయ వాంఛలు విత్తనాలవలె ఉండనే ఉంటాయి.

సాధకులను మందబుద్ధులుగా ఇక్కడ వర్ణించడం సమంజసంగానే ఉంది. ఆత్మానుభవం ఇంకా రాకపోవడంతో యోగసాధనలను ఇంకా కొనసాగిస్తూ, ఏదో ఒకనాటికి వాటి ఫలంగా ఆత్మానుభవం సిద్ధిస్తుందనే భ్రమలో ఉండిపోతాడు. ఆత్మ సాధించవలసినది కాదు. ఇది మనలోనే ఉంది, ఇదే నేను. దీనిని ఎవరూ బహూకరించలేరు. మన అంతరంగమే భావనా మేఘాలతో మన స్వస్వరూపాన్ని కప్పివేస్తోంది. ఈ అంతఃకరణ యోగసాధనలతో అంతం కాదు, కేవలం శాంతి స్తుంది. ఆత్మానుభవంలో మాత్రమే అంతఃకరణ అదృశ్యం అవుతుంది. (జ్ఞానం కూడా ఇక్కడ సహాయపడదు, ఆత్మతత్త్వాన్ని సూచించి, రూపించి అతి సమీపంలో మనలను ఉంచగలుగుతుంది జ్ఞానం) సాధకుడు తనంతటతానే స్వయం గా అవగతం చేసుకున్న ఆత్మతత్త్వాన్ని సాక్షి అనుభవానికి తెచ్చుకోవాలి. విజ్ఞాన స్వరూపమై విలసిల్లాలి.

ఇలా ఆత్మతత్త్వంలోనికి అడుగుపెట్టడానికి సంసిద్ధుడయిన వ్యక్తిలో అహంకారం గురించీ, దాని కోరికల కల్పనల గురించీ ఎటువంటి భ్రమలూ ఉండవు. మందబుద్ధులయిన సాధకులలోనే మనోభావాలు అణచిపెట్టబడి, శాంతంగా కనిపిస్తూ పైకి మహాయోగిగా కనిపించవచ్చు. అతని అంతరంగంలో కూడా శాంత భావాన్ని అనుభవించి ఉండవచ్చు. అయినా జీవితమూ విషయా లూ సరైన అదునులో సవాలు చేస్తే, ఆ శాంతభావం అంతరించి, అణచి పెట్టబడిన మనస్సు అపూర్వ వేగంతో విజృంభించి అతనిని సామాన్యునికన్నా హీనంగా మారుస్తుంది. యోగభ్రష్టుల్ని చేస్తుంది. ఇటువంటి సమయాలలోనే సాధకులు అపారమయిన నిరాశ నిస్పృహలకు లోనై, తనలోనూ శాస్త్రంలోనూ కూడా శ్రద్ధను కోల్పోతుంటారు.

సాధకుల మలినాంతరంగాలను స్పష్టంగా చూసుకునేటందుకు వీలుగా శుద్ధమైన అర్థాన్ని మహర్షి ఇక్కడ చూపిస్తున్నారు. మనస్సు యొక్క అట్టడుగు పొరల్లో విషయభోగాలపై కోరికలూ, శరీరమే నేననే భావనా నిక్షిప్తమై ఉంటాయి.

భగవాన్ కృష్ణుడు భగవద్గీతలో మందబుద్ధుల మానసిక స్థితిని ఎంతో చక్కగా సమీక్షించి ఇలా సలహా యిస్తున్నారు.

విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోऽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. (భగవద్గీత 2-59)

*నిష్ఠకలిగిన వానినుండి విషయాలు తొలగిపోతాయి. కాని విషయ వాంఛలు విత్తనం వలె మరుగుపడి ఉంటాయి. ఆత్మానుభవంలో అవి కూడా నశిస్తాయి.*

చారిత్రకంగా అష్టావక్రగీతను భగవద్గీత తరువాత రచింపబడినట్టుగా భావిస్తున్నారు. బహుశా అందుకేనేమో ఏ గీత అనే సందేహాన్ని నివారించే టందుకుదీనిని అష్టావక్ర సంహిత అని అన్నారు. భగవాన్ కృష్ణుని గీత రజోగుణ ప్రధానులయి నిరంతర కార్యశీలురయిన అర్జునునివంటి శిష్యుల నుద్దేశించి చెప్పబడింది. సత్త్వగుణ ప్రధానులై నిరంతర తపోధ్యాన మగ్నులయిన జనక రాజర్షి వంటి వారి చెవులలో అష్టావక్ర సంహిత ఉపదేశింపబడింది. రణరంగంలో మమత్వ బంధంతో కర్తవ్యమూఢుడయి నిల్చిన క్రియాశీలి అర్జునుని మనస్సును శాంతింపజేసి, కర్తవ్యాన్ని నిర్దేశించడానికి భగవాన్ కృష్ణుని గీత గానం చెయ్య బడింది. అసాధారణ మేధాసంపన్నుడై నిరంతర తపోధ్యాన స్వాధ్యాయ తత్పరు డైన జనకరాజర్షికి, మేఘగర్జనా సదృశంగా ఆత్మనిష్ఠుడయిన అష్టావక్ర మహర్షిచే ఈ గీత ఉపదేశింపబడింది.

మనః సంయమనం, తపోధ్యానాదులు, సాధన ప్రథమదశలో కొంత వరకూ ప్రయోజనాన్నిచ్చే మాట నిజమే, తాత్కాలికంగా మనోబుద్ధులను శాంతింపజేసి, శాస్త్రాన్ని అర్థంచేసుకోగల శక్తినిస్తాయి. అయినా ఇవన్నీ మానసిక సాధనలే కావడంతో మనస్సును చిరంజీవిగా చేస్తాయి తప్ప నశింపజెయ్యలేవు. ఆత్మానుభవంలో మాత్రమే మనఃకల్పనలు సమూలంగా నశిస్తాయి. అందుకే సాధనలను సరైన సమయంలో విడచిపెట్టి శాస్త్రం సూచించిన సత్యాన్ని అందుకోవాలి. ఈ విషయాన్నే ఈ రెండు శ్లోకాలూ స్పష్టంగా సూచిస్తూ హెచ్చరిస్తున్నాయి.

**శ్లో॥ జ్ఞానాద్గళిత కర్మా యో లోకదృష్ట్యాऽపి కర్మకృత్ ।**
**నాప్నోత్యవసరం కర్తుం వక్తుమేవ న కించన ॥ 77.**

టీ॥ యః = ఎవడు, జ్ఞానాత్ = జ్ఞానమువలన, గళితకర్మా = నష్టమైన కర్మలు గలవాడై, లోకదృష్ట్యా = లోకదృష్టికి, కర్మకృత్ అపి = కర్మ చేయుచున్న వానివలె నున్నాడో, సః = అట్టివాడు, కించన = కొంచెముగూడ, కర్తుం = చేయుటకుగాని, వక్తుం = మాట్లాడుటకుగాని, అవసరం = అవసరమును, నాప్నోతి = పొందడు.

జ్ఞానంతో సర్వకర్మల ఆవశ్యకతాభావాన్నీ, కర్తృత్వాన్నీ, విడనాడిన జ్ఞాని లోకం దృష్టిలో కర్మలనాచరిస్తున్నట్టు కనిపించినా, నిజానికి అతడే పనినీ చెయ్యడంలేదు, ఏదీ చెప్పడం లేదు.

ఇదివరకే అష్టావక్ర మహర్షి జ్ఞానియొక్క జీవితాన్నీ అతని జీవన దృక్పథాన్నీ ఎండుటాకుతో పోల్చి వర్ణించేరు. పండి చెట్టునుండి రాలిపోయిన ఆకు గాలి దయమీద ఆధారపడి కదులుతుంది. అయినా ఆ ఆకు కదులుతోంది అని ఎలా అనలేమో, అదేవిధంగా జ్ఞాని చేసే పనులు కూడా అతనికి చెందవు. చెట్టున ఉన్నప్పటికంటే అమిత వేగంతో రాలిన ఆకు కదలవచ్చు. అయినా అది కదలడంలేదు. జ్ఞాని గతంలోకంటే ఎంతో దీక్షతో అనేక కర్మల నాచరించినట్టు ప్రారబ్ధవశాత్తూ కనిపించవచ్చు, అయినా అతడేమీ చెయ్యడంలేదు.

ఆత్మానుభవాన్నందిన జ్ఞానిలో అహంకారం ఉండదు. అతనిలో కర్తృత్వ భోక్తృత్వ భావాలుండవు. అందుకే అతనిచే ఎంతటి లోకల్యాణ కారకమయిన పనులు చెయ్యబడినా, అతడు వాటిని చేసేనని అనుకోడు. సమాజం దృష్టిలో అతడు పనిచేస్తుండడం నిజమే. అయితే అతనినే ఆపి "ఇంకా ఏం చెయ్యాలను కుంటున్నారు?" ఏవిధంగా సహాయపడమంటారు? అని అడిగితే ఆశ్చర్యపోయి జవాబు చెప్పలేడు. అతడేమీ చెయ్యడంలేదని, అన్నీ అలా జరుగుతుండడాన్ని ఆశ్చర్యంగా చూస్తున్నానని అతనికి స్పష్టంగా తెలుసు!

భయంకర స్వప్నంలోనుండి కలవరిస్తూ మేలుకున్న నీ చుట్టూ నీవారందరూ నిలబడి "ఏముంది? ఏ సహాయం కావాలి?" అని అడిగితే ఏం చెప్పగలవు? ఏదో భ్రమ అని అస్పష్ట సమాధానం చెప్పి ఆ భయానికి సిగ్గుపడి ఊరుకోవాలి. అదే విధంగా జ్ఞానిని అతని కార్యకాలపాల గురించి ప్రశ్నిస్తే ఏమని సమాధానం ఇవ్వగలడు? ఎలా ఇవ్వగలడు?

"నాప్నోత్యవసరం కర్తుం వక్తుమేవ న కించన"---"పనిచెయ్యవలసిన అవసరం కనబడదు, చెప్పడానికి ఏమీ ఉండదు"---జీవన్ముక్తునిలో అహంకారం ఉండదు. అతని శరీరం ద్వారా నిర్వర్తింపబడే కర్మలు సమకాలీన వాసనా బల ప్రభావంచేత లోకకల్యాణ కారకంగా విలసిల్లుతాయని ఉపనిషత్తులు ఉద్ఘోషి స్తున్నాయి. నెల్సన్ యొక్క టెలిస్కోపు అతడు చూసిన దానిని వర్ణించగలదా? శ్రీరామునికోదండం అతనితోనే ఎప్పుడూ ఉన్నా రామయణాన్ని గానం చెయ్య గలదా? ఇదేవిధంగా జ్ఞాని శరీరం కేవలం నిమిత్త మాత్రం. ఉపాధి, ఉపకరణం

మాత్రమే. ఆ ఉపాధిద్వారా జరిగే పనులకు అతడెంత మాత్రమూ బాధ్యుడు కాడు, అసలతనికేమీ తెలియదు. పండి రాలిపోయిన ఆకు గాలిబలంతో నీ గది లోకివస్తే, చెట్టును అదేమని ప్రశ్నించగలవా? జ్ఞానికి తాను చేస్తున్నానన్న భావనే ఉండదు, ఆత్మానుభవం వచ్చిన తరువాత జ్ఞానికి ఆత్మకథ ఉండదు!

**శ్లో॥ క్వ తమః క్వ ప్రకాశో వా హానం క్వ చ న కించన ।**
**నిర్వికారస్య ధీరస్య నిరాతంకస్య సర్వదా ॥ 78.**

టీ॥ సర్వదా = ఎల్లప్పుడు, నిర్వికారస్య = వికార రహితుడును, నిరాతంసక్య = సంతాపభయాది రహితుడును నగు, ధీరస్య = జ్ఞానికి, తమః = తమస్సు, క్వ = ఎక్కడ, ప్రకాశః = ప్రకాశము, క్వ = ఎక్కడ, హానం = త్యాగము, న కించన = కొంచెము గూడ లేదు (విడిచిపెట్టవలసినదేమియు లేదు)

**నిర్భయుడై నిశ్చల శాంత మానసంతో చరించే జ్ఞానికి ఏది అంధ కారం? ఏది వెలుగు? ఏది నష్టం?......అసలే భావాలు అతనిలో చలించవు చరించవు.**

జ్ఞానం అజ్ఞానం, వెలుగు చీకటి, లాభనష్టాలు ఇవన్నీ మనోబుద్ధులచే అనుభవింపబడే ద్వంద్వాల వ్యక్తరూపాలే. మనస్సుచే అధిగమించిన జ్ఞానికి ఈ ద్వంద్వాలన్నీ ఏ విధంగా బాధిస్తాయి? అజ్ఞానం పోయింది కాబట్టి అతనిలో జ్ఞానం కలిగిందని అంటాం కాని నిజానికి జీవన్ముక్తునిలో జ్ఞానం ఉంది అనడంలో గల అర్థం ఏమిటి? ఆత్మచైతన్యంగా సర్వభావాలను ప్రకాశింప జేస్తున్నానని గుర్తించిన జ్ఞానిలో, జ్ఞానాన్నీ అజ్ఞానాన్నీ కూడా ప్రకాశింప జేయగల చైతన్యం లో, జ్ఞానం విలువా, ఉనికీ ఎక్కడ? ఎలా? ఏవిధంగా ఉంటుంది? అందుకే మనకు అర్థం అవడంకోసం మాత్రమే అతనిని జ్ఞాని అనాలి. కాని అతనికి జ్ఞానమూ అజ్ఞానమూ కూడా లేవు.

సర్వసృష్టికి ఉనికిని ఆశ్రయాన్నీ కల్పించగల అనంతానందమయ ఆత్మచైతన్యమే స్వరూపంగాకల మహోన్నత మూర్తికి దేనిని ఇస్తే లాభం పొందు తాడు? దేనిని అతనినుండి దూరం చేస్తే నష్టం సంభవిస్తుంది? అనంతానికి దేనినీ చేర్చలేము. అనంతంనుండి దేనినీ తీసివేయనూలేము. అనంతం ఎప్పుడూ అనంతమే. స్వప్నంలో సంభవించిన లాభం కానీ, నష్టంకానీ మేలుకున్న నన్ను ఏవిధంగా బాధిస్తాయి.

శ్లో॥ క్వ ధైర్యం క్వ వివేకిత్వం క్వ నిరాతంకతాऽపివా ।
అనిర్వాచ్య స్వభావస్య నిస్స్వభావస్య యోగినః॥79.

టీ॥ అనిర్వాచ్య స్వభావస్య = అనిర్వచ్య స్వభావము గలిగినటువంటిన్ని, నిస్స్వభావస్య = స్వభావ రహితుడైనటువంటి, యోగినః = యోగికి, ధైర్యం = ధీరత, క్వ = ఎక్కడ, వివేకిత్వం = వివేకిత్వము, క్వ = ఎక్కడ, నిరాతంకతా అపి = నిర్భయత్వము కూడ, క్వ = ఎక్కడ.

**అనిర్వచనీయమైన స్థితిలో స్వభావరహితుడై స్థితుడైన యోగికి ధైర్యం ఏమిటి? భయం ఎక్కడ? వివేకం ఏమిటి?**

ఆధ్యాత్మిక సాధనలో అడుగుపెట్టి ప్రయాణించదలుచుకున్న సాధకులకు ఈ మూడు గుణాలూ అత్యవసరం. (1) ధైర్యం, (2) వివేకం, (3) నిర్భయత్వం. ఈ మూడింటిలో ఏ ఒక్కటి లోపించినా అతని నడక తప్పక కుంటుబడుతుంది. అన్ని కాలాలోనూ ఆచార్యులంతా సాధకులందరినీ ఈ మూడు గుణాలను కలిగి ఉండమని హెచ్చరిస్తూనే ఉన్నారు. ఇవి లేనిదే ఆధ్యాత్మికాభివృద్ధి అసంభవం.

ఒక పర్వతాన్ని అధిరోహించేవానికి ఒక పొడవాటి కఱ్ఱ. నీటితో నింపిన సీసా,కొన్ని దుప్పట్లూ బహుశా అవసరం అవుతాయి. పర్వతాన్ని దిగ్విజయంగా అధిరోహించి ఇంటికి తిరిగివచ్చిన తరువాత కూడా ఆ కఱ్ఱా, నీటిసీసా, దుప్పట్లూ తన భుజంమీద మోస్తూనే ఉండాలా? అవన్నీ అతని యాత్రలకు మాత్రమే అవసరం. గమ్యాన్నిచేరి లక్ష్యాన్ని సాధించిన తరువాత సహజంగా వాని నన్నిటినీ వదలి వేస్తాడు. వాటి ఉపయోగం అతనికింక ఉండదు.మాయా ప్రపంచంలో మమత్వపు బంధాలతో భయభ్రాంతులమవుతూ, మనఃకల్పిత వ్యామోహ తాపంతో దుర్భర జీవితాన్ని గడుపుతూ దరిజేరాలనుకున్నప్పుడు, తాత్కాలిక శాంతిని సాధించి నిలబడడంకోసం, ముందుకు సాగడం కోసం ఊతకఱ్ఱ అవసరమే. అయితే వీటన్నిటినుండి బయటపడి హాయిగా స్వస్థానానికి చేరుకున్నప్పుడు కూడా ఈ ఊతకఱ్ఱను ఇంకా మోస్తూనే ఉండాలా?

అనేక విఘ్నాలు కలుగుతున్నా అడుగు కదపడం అసాధ్యం అనిపిస్తున్నా ధ్యానాన్నీ సాధననీ కొనసాగించాలంటే ధైర్యం దీక్ష చాలా అవసరం. ఏది భౌతిక బంధమో ఏది అనంతమైన ఆత్మచైతన్యమో,మనం చేస్తున్న దేమిటో, ఎక్కడున్నామో స్పష్టంగా గుర్తించడానికి వివేకం అత్యవసరం. మనస్సును ఏకాగ్రంచేసి

చివరగా ఆ భావాన్ని కూడా త్యజించి అహంకారాన్ని అంతంచేసి భావరహిత స్థితిలోనికి అడుగుపెట్టడానికి నిర్భయత్వం మరెంతో ధీరత్వం కావాలి. సాధకుడు తన లక్ష్యాన్ని చేరుకునే ప్రయత్నంలో ప్రయాణంలో ఈ గుణాలన్నీ తప్పకుండా ఉండితీరాలి.

తన లక్ష్యాన్ని సాధించిన జీవన్ముక్తునికి ఇవన్నీ అనవసరం. అందుకే హృదయపూర్వకంగా అష్టావక్రమహర్షి ఒప్పుకుంటూనే ఉన్నారు--"నిః స్వభావస్య" ---స్వభావమే లేని మహాయోగికి దేనితో మాత్రం ఏ అవసరం ఉంటుంది? అతని స్థితి "అనిర్వచనీయ"మైనది, అని చెప్పుతూ మహర్షి తన శిష్యుని ముందు, ఆ మహోన్నత స్థితిని వర్ణించలేని తన అశక్తతను ఒప్పుకుంటున్నారు.

**శ్లో॥ న స్వర్గో నైవ నరకో జీవన్ముక్తిర్న చైవ హి ।**
**బహునాఽత్ర కిముక్తేన యోగదృష్ట్యా న కించన ॥80.**

టీ॥ జ్ఞానినః = జ్ఞానికి, న స్వర్గః = స్వర్గంలేదు, నైవ నరకః = నరకము లేదు, జీవన్ముక్తిః ఏవ = జీవన్ముక్తియు, న = లేదు, అత్ర = ఈ విషయమై, బహునా = అనేకము, ఉక్తేన = చెప్పుటచేత, కిం = ఏమి ప్రయోజనము, (యోగినః = యోగికి) యోగదృష్ట్యా = యోగదృష్టిచేత, న కించన = ఏమియులేదు.

**స్వర్గంలేదు, నరకంలేదు, జీవన్ముక్త స్థితి కూడా లేదు. ఇన్ని చెప్పడం ఎందుకు యోగి దృష్టిలో ఏదీ ఉనికి కలిగిలేదు.**

బౌద్ధుల శూన్యవాదాన్ని మహర్షి ఇక్కడ ఒప్పుకుంటున్నారని అర్థం కాదు. జీవన్ముక్తుని దృష్టిలో ఏదీలేదు. అంటే---నా దృష్టిలో మీ దృష్టిలో ఉన్నవన్నీ ఎలా నిజంగా ఉన్నాయో ఆవిధంగాలేవని అర్థం. అతని దృష్టిలో సర్వత్రా ఆత్మచైతన్యమే నిశ్చలంగాకానీ భావరూపంలోకానీ కనిపిస్తూ ఉంటుంది. రెండవదేదీ ఉండదు. సత్ చిత్ ఆనందమయిన ఆత్మతత్త్వమే సర్వనామరూపాల భావాలుగా తెలియబడుతూ ఉంటుంది.

అహంకారం ప్రారబ్ధాను గుణమయిన వాసనలతో యిష్టాయిష్టాలతో సుఖదుఃఖాలనుభవ క్షేత్రాలుగా స్వర్గనరకాలను ఊహిస్తూ ఉంటుంది. ఈ ప్రపంచం నిజం అనుకునే అహంకారానికి స్వర్గనరకాలు కూడా అంతే నిజం! ఇక్కడ ఒక ఉపాఖ్యానం జ్ఞప్తికి వస్తోంది. జనకమహారాజు ఒకానొకప్పుడు యాచకుడై అనేక బాధల ననుభవించినట్లుగా కలగన్నాడు. మెలకువ వచ్చి చూస్తే తాను

మామూలుగా సింహాసనాన్నధిష్ఠించిన రాజుగానే ఉన్నాడు. అప్పుడతుడు అష్టావక్ర మహర్షిని సమీపించి "మునీంద్రా స్వప్నంలోని యాచకుడు సత్యమా? ఇప్పటి రాజు సత్యమా?" అని అడిగేడు. మునీంద్రుల జవాబు ఎంతో అర్థవంతంగా సమంజసంగా యుక్తియుక్తంగా ఇలా ఉంది----"రాజా, నీ కలలోని యాచకుడే నిజమని నీవు భావిస్తే, మెలకువలోని రాజూ సింహాసనమూ కూడా అంతే నిజం!" అలాగే ప్రపంచం నిజమనుకునే అహంకారానికి స్వర్గనరకాలుకూడా అంతే నిజం! ఇవన్నీ కూడా అహంకారానుభవ క్షేత్రాలే. జీవన్ముక్తుడు అహంరాకాన్ని అధిగమించి ఉండడంతో ఈ ప్రపంచమూ అతని శరీరమూ కూడా ఎల్లప్పుడూ అతని దృష్టిలో ఉండవు. వాటి మిథ్యాత్వాన్ని అతడు స్పష్టంగా గుర్తించ గలిగేడు. అట్టి మహనీయుడు స్వర్గనరాకాలనెలా ఊహిస్తాడు?

అతనిలో జగదీశ్వరుడూ జగత్తూ వ్యక్తీ అన్నీ కూడా వాటి కాధారమయిన చైతన్యంలో లయం అయిపోతాయి, ఆ చైతన్యమే అతడు.

**శ్లో॥ నైవ ప్రార్థయన్తే లాభం నాలాభే నానుశోచతి ।**
**ధీరస్య శీతలం చిత్తం అమృతేనైవ పూరితమ్ ॥ 81.**

టీ॥ ధీరస్య = జ్ఞానియొక్క, చిత్తం = చిత్తము, అమృతేన ఏవ = మృతముచేత, పూరితం = నిండింపబడినదే, శీతలం = చల్లనైనది, (అత ఏవ = కనుకనే) సః = ఆ జ్ఞాని, లాభం = లాభమును, న ప్రార్థయన్తే = కోరడు, చ = మఱియు, అలాభేన = లాభము లేకపోవుటచేత, న అనుశోచతి = దుఃఖింపబడు.

**తెలివైనవాడు లాభం కావాలని కోరుకోడు, నష్టం వస్తే విచారించడు. అతని నిశ్చల శాంతచిత్తం సదా ఆత్మానందంతో నిండి ఉంటుంది.**

పరిమితత్వం ఉందని భావించేవాడే అపరిమితత్వాన్ని అన్వేషిస్తాడు, ఆరాధిస్తాడు. సహజంగా అతనిలో ఉండే పరిమితత్వ భావపు అసంతృప్తి అందుకు కారణం. శరీరం మనస్సూ బుద్ధితో తాదాత్మ్యం చెందిన అహంకారమే, తాత్కాలికంగా వాటి అనుభవక్షేత్రాలయిన వస్తువులలోనూ ఉద్రేకాలలోనూ ఆలోచనలలోనూ ఆనందాన్నన్వేషిస్తుంది. ఆకలి ఉన్నవాడే ఆహారాన్ని కోరుతాడు. దాహంతో తపించేవాడే నీరు కావాలనుకుంటాడు. పరిమితత్వంతో బంధింపబడినవాడు తప్పకుండా అనంతత్వములో తన ఆనందాన్ని అన్వేషించకతప్పదు.

జీవన్ముక్తుడు తన్ను తాను అనంతానందమయమయిన ఆత్మగా

గుర్తించిన వాడు కాబట్టి అతనిలో పరిమితమయిన ఇంద్రియ తాదాత్మ్యరూప మయిన అశాంతి ఉండదు. పరిపూర్ణత్వం భ్రమాజన్య జగత్తునుండి ఎటువంటి లాభాన్నీ ఆశించదు. భ్రమలో ఏది నశించినా నష్టం సంభవించిందని బాధపడడు. అనంతతత్త్వానికి దేనినీ కలపలేమనీ, అందులోనుండి దేనినీ తీసివెయ్యలేమనీ, ఇదివరకే తెలుసుకున్నాం. ఉపనిషత్తులోని శాంతిమంత్రం ఈ భావాన్నే సుస్పష్టం చేస్తోంది.

పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే.

పూర్ణత్వంనుండి పూర్ణాన్ని తీసేసినా మిగిలేది పూర్ణమే.

జీవన్ముక్తుని అంతరంగం సదా నిశ్చలంగా శాంతంగా చల్లగా ఆహ్లాద కరంగా ఉంటుంది. అతనితో పోల్చిచూస్తే మన అంతరంగాలు కోరికలనే లావా లను వెదజల్లే అగ్నిపర్వతాల్లా ప్రజ్వలిస్తూ ఉంటాయి. అగ్ని గుండంవంటి అంతరంగానికి ఎన్ని లభించినా అగ్నిలో ఆజ్యం పోసినట్టే. అది ఇంకా జాజ్వల్య మానంగా ప్రకాశిస్తూ కోరికలనే జ్వాలలను విరజిమ్ముతూనే ఉంటుంది. జ్ఞాని అంతరంగం శాంతంగా అమృతతుల్యంగా ఉంటుంది. వేదాంత సత్యాలను అంద మైన కథాచిత్రాలుగా మలచి అందిస్తాయి మన పురాణాలు. సదా నిశ్చలంగా శాంతంగా ఉండే మనస్సుయొక్క ఆనందరసపాన మత్తతనే దేవతలు త్రాగే అమృతంగా చిత్రించారు! మానవలోకంలో అట్టి సంతోషితాంతరంగం అరుదే కదా! అరుదైన దానిని అందంగా దేవతా పానీయంగా సూచించడంతో దానిని సాధించాలనే కోరిక కలిగి తీరుతుంది. అమృతం అంటే మరణం లేనిది--- అమరత్వం, మరణం కేవలం మార్పు మాత్రమే. క్రిందటి స్థితి అంతమయి కొత్త స్థితి మొదలవడమే మార్పు. అమరత్వము అంటే మార్పులేనిస్థితి అని అర్థం అవుతుంది. మార్పు మానవుని అంతరంగంలోనే అనుభవింపబడుతుంది. కాబట్టి మనస్సు నధిగమించినప్పుడు మార్పులనుకూడా అధిగమించి అమరత్వాన్ని పొందినట్టే.

పౌరాణిక సహజమయిన కవితా చిత్రీకరణలో కూడా అష్టావక్ర మహర్షి ఎంత సమర్థుడో ఈ శ్లోకంతో అర్థం అవుతుంది.

శ్లో॥ న శాంతం స్తౌతి నిష్కామో న దుష్టమపి నిన్దతి ।
సమదుఃఖసుఖస్తృప్తః కించిత్ కృత్యం న పశ్యతి ॥82.

టీ॥ నిష్కామః = కామనారహితుడగు జ్ఞాని, శాంతం = శాంతపురుషుని, న స్తౌతి = స్తుతించడు, దుష్టమపి = దుష్టుడైనను, న నిందతి = నిందించడు, సుమదుఃఖసుఖః = సుఖదుఃఖములను సమానముగా చూచున్నవాడై, తృప్తః = ఆనందితుడై, కించిత్ = కొంచెమైనను, కృత్యం = అది చేయదగినదని, న పశ్యతి = చూడడు.

**వాసనారహితుడు శాంతిని పొగడడు. దుష్టత్వాన్ని నిందించడు. సదా శాంతంగా సుఖదుఃఖాలలో సమత్వ బుద్ధితో ఉంటూ దేనినీ కావాలని కోరుకోడు.**

ఆత్మతత్త్వపు ప్రత్యక్షానుభూతితో కోరికలు లేని స్థితికి చేరుకోవడమే మన మహర్షుల దృష్టిలో పరిపూర్ణత్వంగా గుర్తింపబడుతోంది. ఇది కోరికలను అణచి వెయ్యడం కాదు. కోరికలను శుద్ధపరచడమూ కాదు. అంతరంగంలో అనంతానంద స్వరూపంగా తన్ను తాను గుర్తించడంలో కోరికలే కలగని స్థితి అది! చీకటి వెలుగులు రెండూ ఒకతావులో ఒకే సమయంలో ఉండలేవు. చీకటి లేకపోవడం వెలుగుకాదు. వెలుగు ఒక ప్రత్యేకమయిన స్థితి----అందులో చీకటి ఉండజాలదు. అలాగే కోరికలు లేని స్థితి కోరికలను అణచివెయ్యడంవల్లా తగ్గించడంవల్లా వచ్చేదికాదు. కోరికలు ఉండడానికి వీలులేని పరిపూర్ణమైన ఆనంద స్వరూపంగా తన్ను తాను గుర్తించిన స్థితి అది. ఈ స్థితి ఆత్మతత్త్వంలోనికి జాగృతమయినప్పుడే అనుభవైక వేద్యమవుతుంది.

సత్ చిత్ ఆనందమయమయిన స్వస్థితిలో పూర్ణత్వం అనుభవంలోకి రావడంతో సర్వకోరికలూ నశిస్తాయి. కోరికలే ఆలోచనలకు కారణాలు. జీవన్ముక్తునిలో ఆలోచనల అలజడి ఉండదు. ఆలోచనా ప్రవాహమే మనస్సు. అట్టి మనస్సతనిలో ఉండదు. మనస్సే అహంకారానికి పుట్టిల్లు. మనస్సే లేనివానిలో అహంకారం ఎలా ఉంటుంది?

అహంకార పూరిత వ్యక్తిత్వమే మంచినిపొగడి చెడును నిందిస్తుంది. అహంకారమే లేని జ్ఞాని దేనినీ పొగడడు, నిందించడు. అతని దృష్టిలో ఆత్మకంటే భిన్నంగా రెండవదేదీ ఉండదు.

తనలో తాను సదా ఆనందంగా ఉంటాడు బాహ్యంగా జరిగే ఏ సంఘటనలూ కూడా ఆ ఆనందమందిరంలోకి, పవిత్ర సదనంలోకి అడుగు పెట్టజాలవు. అందుకే అతడు సుఖదుఃఖాలను సమంగా స్వీకరించగలగడాన్ని మనం గుర్తించగలం. ప్రాపంచిక విషయాలు ఏవిధంగా జ్ఞాని అంతరంగపు శాంతిని భంగం

చెయ్యలేవో ఇదివరకే తెలుసుకున్నాం. వచ్చినదానిని యథాతథంగా స్వీకరించడమేకాని, దేనినీ చెయ్యాలని, కావాలనీ, కోరుకోకపోవడమే అతని సమత్వానికి శాంతికీ మూలకారణం.

మనం అపరిపూర్ణంగా ఉన్నామనీ పూర్ణత్వాన్ని పొందుతామేమోననీ, మనం దేనినైనా సాధించాలనుకుంటాం. పరిపూర్ణత్వమే తానుగా గుర్తించిన జ్ఞాని దేనినీ సాధించాలనుకోడు. అతడే సర్వమూ, అతనినుండి విడిగా ఏదీ లేదు.

**శ్లో॥ ధీరో న ద్వేష్టి సంసారం ఆత్మానం న దిదృక్షతి ।**
**హర్షామర్ష వినిర్ముక్తః న మృతో న చ జీవతి ॥ 83.**

**టీ॥** ధీరః = జ్ఞాని, సంసారం = సంసారమును (ప్రపంచమును), న ద్వేష్టి = ద్వేషింపడు, న దిదృక్షతి = చూచుటకైన ఇచ్ఛగించడు, హర్షామర్ష వినిర్ముక్తః = సంతోష దుఃఖములు లేనివాడు గనుకనే, (సః = అతడు), న మృతః = చచ్చినవాడుగాడు, న జీవతి = జీవించువాడునుగాడు, (అనగా జనన మరణ రహితుడని భావము)

**నిత్య పరిణామ శీలమైన సంసారాన్ని ద్వేషించడు, అచలమైన ఆత్మను దర్శించాలనీ కోరడు. సుఖదుఃఖాలనుండి ముక్తుడయిన అతడు జీవించి ఉన్నాడనీ అనలేము, అతడు మృతుడు కూడా కాడు.**

పితృవాత్సల్యంతో జీవన్ముక్తుని స్థితిని స్పష్టంగా తనశిష్యునికి తెలియజెప్పాలనే తపనతో మహర్షి ఈ శ్లోకాలలో తాపత్రయపడుతున్నారు. నిస్సందేహంగా అష్టావక్రమహర్షి మహామనీషి. ఆచార్య శ్రేష్ఠుడు---కానీ అతి కొద్ది మందికి మాత్రమే భగవద్గీతలో కృష్ణునివలె అష్టావక్రమహర్షి బహు జనానీకంలో ప్రశస్తి పొందలేదు. ఈ విభేదమే తెలియబరుస్తుంది.----అష్టావక్ర మహర్షి ఎంతటి ఎత్తునుండి ఎటువంటి శిష్యశ్రేష్ఠుల నుద్దేశించి చెప్పేదీ, కృష్ణుడేవిధంగా సర్వ జనానీకాన్నీ దృష్టిలో ఉంచుకొని జాగ్రత్తపడింది స్పష్టమవుతుంది.

నిరంతర పరిణామశీలి అయిన సంసారంలోని బాధలతో, భయాందోళనతో అశాంతితోనిండిన అంతరంగంగల సాధకుడే సంసారాన్ని ద్వేషిస్తాడు. అహంకారంతో ఉన్న సాధకుడే తన పరిమితులను గుర్తించి వాటిని ద్వేషిస్తూ అపరిమితత్వాన్ని సాధించాలని ఆశిస్తాడు. నిద్రపట్టనివాడే నిద్రకోసం ప్రయత్నిస్తాడు.

ఆత్మానుభవస్థితుడయిన జ్ఞానికి ఆత్మను చూడాలనే కోరిక ఉండదు. అతనికి సంసారం అంటే ద్వేషం కూడా ఉండదు. అతని దృష్టిలో ఆత్మకంటే

భిన్నంగా రెండవదేదీ లేకపోవడమే అందుకు కారణం. ఈ విధంగా అతనికి కోరదగినవి కానీ ద్వేషించవలసినవి కానీ ఉండవు. భౌతికంగా అతడు మనమధ్య నివసిస్తున్నట్టు కనిపించినా అతడీ భూమికి చెందనివాడే!!

మృతుడనికూడా అనలేము, మనవలెనే తింటూ తిరుగుతూ మనమధ్య మసిలే అతడు మృతుడెలా ఔతాడు? అయితే జీవించి ఉన్నాడా? ఏమయినా అతడు మనవలె మామూలుగా సుఖదుఃఖాల ననుభవిస్తూ సామాన్యంగా జీవించడం లేదు. బాహ్య విషయాకర్షణలకు అతడు మృతతుల్యుడే. అతనిలో సుఖదుఃకాలు లేవు, ఉద్రేకాలు లేవు, దేనికీ చలించడం లేదు. భౌతిక విషయాల ప్రభావానికి చలించని ఉపాధిని సాధారణంగా మనం చనిపోయినట్టే నిర్ణయిస్తాము. దేనికీ చలించని జీవన్ముక్తుడు మృతతుల్యుడే. అయితే మనవలెనే తింటూ తిరుగుతూ ఉండడాన్ని బట్టి బ్రతికి వున్నట్లే కదా! ఈ విధంగా మనం దేనినైనా వర్ణించే సామాన్య పదజాలం జీవన్ముక్తుని స్థితిని వర్ణించడానికి అసమర్థమవుతోంది.

శ్లో॥ నిస్స్నేహః పుత్రదారాదౌ నిష్కామో విషయేషు చ ।
నిశ్చింతః స్వశరీరేఽపి నిరాశః శోభతే బుధః ॥ **84.**

టీ॥ పుత్రదారాదౌ = భార్యాబిడ్డలయందు, నిఃస్నేహః = స్నేహరహితుడై, విషయేషు = విషయములయందు, నిష్కామః = కామనారహితుడై, అపి చ = మఱియు, స్వశరీరే = స్వశరీరమునందు, నిశ్చింతః = చింతారహితుడై, బుధః = జ్ఞాని, శోభతే = ప్రకాశించుచున్నాడు.

**దారాపుత్రాదులపై మోహం లేకుండా, విషయ వాంఛలు లేకుండా, తన శరీరం మీదకూడా శ్రద్ధలేనివాడై, ఏ ఆశలూ లేని మహాశయుని జీవితం ధన్యం, సంతతానందంతో శోభిస్తుంది.**

ఈ వర్ణన విన్న సామాన్యులకు యింతకంటే దుర్భరమూ నికృష్టమూ అయిన జీవితం ఉండదేమో అనిపిస్తుంది. దేనిమీదా మోహంలేక, కోరికలు లేక ఆశలులేక, శరీరాన్ని లక్ష్యపెట్టక జీవించే అతడు మృతతుల్యుడే! జడస్వరూపుడే! జీవితపుటందాలకు చలించని అతడు జీవన్మృతుడే!

అందుకే అష్టావక్ర మహర్షి అడుగడుగునా హెచ్చరిస్తూనే ఉన్నారు, జీవన్ముక్తుని స్థితి, అట్టి మరొకరికి మాత్రమే అర్థం కాగదలని, ఏం చెప్పినా అది

అసత్యమే అవుతుంది. అపరిపక్వమూ పరిమితమూ అయిన మన మనస్సు, అనంత శాంతితో అపూర్వానందంతో విరాజిల్లే ఆ మహామహితాత్ముని స్థితిని ఊహించనైనా ఊహించజాలదు.

"శోభతే"---అపూర్వకాంతితో పరిపూర్ణ తేజస్సుతో శోభించే జ్ఞాని అంతరంగం సదా శాంత గంభీరంగా ఉంటుంది. ప్రస్తుత పరిస్థితులు కాని భవిష్యత్ ప్రణాళికలు కాని గతస్మృతులు కాని అతనిని కదిలించజాలవు. సర్వవ్యామోహాలకు గతస్మృతులే కారణం. పుట్టని కొడుకును ప్రేమించలేము. పెళ్ళికానిదే భార్యపై ప్రేమ ఎలా సాధ్యం? ఆర్జించని సంపదపై వ్యామోహం ఉండగలదా?

ప్రాపంచిక విషయభోగాలలో సుఖాన్నన్వేషించడం, తనవారిని ప్రేమించడం, భవిష్యత్తులో ఎన్నిటినో సాధించాలనే కోరికా, ఈ మూడూ కూడా వ్యక్తి యొక్క శారీరిక తాదాత్మ్యం మీద ఆధారపడి ఉంటాయి. శరీర తాదాత్మ్య బుద్ధితో జీవించే ప్రతీ వ్యక్తీ కూడా ఈ మూడింటి ప్రభావంనుండీ బయటపడలేడు. ఫలితంగా నిత్య అశాంతితో బాధపడక తప్పదు. ఈ శ్లోకంలో వర్ణింపబడిన పరిపూర్ణ వ్యక్తిలో మాత్రమే మానవ సహజమయిన ఈ మూడు బలహీనతలూ కనిపించవు. "నిశ్చింతః స్వశరీరేఽపి"---తన శరీరం గురించి కూడా చింతచేయక పోవడమే ఇందుకు కారణం.

అనాత్మ అయిన శరీరంతో తాదాత్మ్యం చెందడమే బంధం. జీవన్ముక్తుడు భౌతిక పదార్థం బంధాలనుండి ముక్తుడయ్యేడు. అతడు జీవిస్తున్న నూతన స్థితి లోనికి ప్రస్తుతం మనం అడుగుపెట్టలేము, అందుకే జ్ఞానులు జీవించే స్థితిని వారి జీవన దృక్పథాన్నీ మనం అర్థం చేసుకోలేము.

శ్లో|| తుష్టిస్సర్వత్ర ధీరస్య యథా పతితవర్తినః ।
స్వచ్ఛందం చరతో దేశాన్యత్రాస్త మితశాయినః|| 85.

టీ|| యత్ర = ఎచ్చట, అస్తమితశాయినః = సూర్యుడు అస్తమించు చున్నాడో అచట పండుకొనుచున్నటువంటిన్ని, స్వచ్ఛందం = ఇచ్ఛానుసారముగా, దేశాన్ = దేశములను, చరతః = తిరుగుచున్నటువంటిన్ని, యథా పతితవర్తినః = ప్రారబ్ధానుసారముగా వచ్చిన వాటితో తృప్తుడైనటువంటి, ధీరస్య = జ్ఞానికి, సర్వత్ర = అంతట, తుష్టిః = తృప్తి, భవతి = అగుచున్నది.

జ్ఞాని తన హృదయంలో నిత్య తృప్తుడై ఉంటాడు. కోరకుండా

ప్రాప్తించిన దానితో సుఖంగా జీవిస్తూ, యధేచ్ఛగా చరిస్తూ సూర్యాస్తమయం అవగానే ఉన్నచోటనే విశ్రమిస్తూ ఉంటాడు!!

మనచుట్టూ ఉన్న వస్తువులను లేదా విషయాలను సంపాదించడం లోనూ వాటిని మార్చడంలోనూ, ఇప్పుడున్న దానికంటే ఎక్కువ సుఖంగా ఉండవచ్చునేమోననే ఆలోచనే మన అసంతృప్తికి కారణం అవుతూ ఉంటుంది. బాహ్యప్రపంచంనుండి సుఖం పొందవచ్చుననే భ్రమతోనే సాధారణ మానవుడు జీవితాన్ని తనకూ యితరులకూ కూడా దుర్భరంగా చేసుకుంటూ ఉంటాడు. "ప్రగతి పథంలో ప్రయాణం" జీవన విలువలలో ఉన్నత ప్రమాణాల సాధన, "అభ్యుదయం" ఇటువంటి ఆడంబర పదజాలంతో ఈ జీవన విధానాన్ని ఎంతగా పొగిడినా అసలైన నిజం మనకందరికి తెలిసినదే---ప్రస్తుత జీవన విధానాలూ స్థితిగతులూ అశాంతిమయంగా దుర్భరంగా ఉద్రేకపూరితంగా ఉన్నయేకాని మనిషికి ఏమాత్రం శాంతినివ్వడం లేదు. వేదిక మీద ఉపన్యాసం ఇచ్చే రాజకీయ నాయకులు, ఆర్థిక శాస్త్రాన్ని బోధించే పాఠ్యగ్రంథాలు ఈ విషయాన్ని అంత సులభంగా ఒప్పుకోకపోవచ్చు కాని, ఈ నిజాన్ని మన హృదయ లోతులలో స్పష్టంగా చూసుకోవచ్చు. జ్ఞాని మాత్రమే నిజమైన తృప్తినీ శాంతినీ అనుభవించ గలడు. ఆ శాంతికోసం తృప్తికోసం అతడు బాహ్యవిషయాలపై ఆధారపడ నవసరంలేదు. తన స్వరూపాన్ని సత్ చిత్ ఆనందంగా గుర్తించడంలో అతడే స్వతంత్రాన్ని అనుభవిస్తాడు. విషయాలనుండి సుఖాన్నాశించే యాచకునివలె కాక, విషయాల ఉనికికే ఆధారమైన విషయిగా మకుటంలేని మహా సమ్రాట్టుగా నిత్యానందస్వరూపుడై చరిస్తూ ఉంటాడు.

బాహ్యప్రపంచంనుండి ఏమీ కోరకుండా సదా సంతోషంగా జీవించే జ్ఞాని శరీరం ప్రారబ్ధానుసారంగా తన కర్మలను నిర్వర్తిస్తూ ఉంటుంది. అహంకారం లేని కారణంగా అతడు దేనినీ కోరడు, దేని ఫలితాలూ అతనికి చెందవు.

ఉద్దేశరహితంగా యథాప్రాప్తంగా చరించే జ్ఞాని శరీరస్థితిని' అష్టావక్ర మహర్షి ఈ శ్లోకంలో వర్ణించేరు. ఆత్మానుభవ స్థితుడై సర్వానికీ అధిష్ఠానంగా ఆధారంగా తన్ను తాను తెలుసుకుంటూ, తన జ్ఞానానుభవ సారాన్ని సమ కాలీనులకు సంతోషంగా అందిస్తూ, ఎవరి దూషణ భూషణలను సరకుచేయక, కేవలంగా తానే ఉన్నాననే జ్ఞానంతో నిర్విచారంగా జీవించే జ్ఞానికి జ్ఞానే సాటి.

శరీర పోషణ కత్యవసరమైన ఆహారం, బట్టలు, ఇల్లు, వీటికోసం కూడా

అతడు సమాజంపై ఆధారపడడు. ఆకాశమే తనపై కప్పుగా చరిస్తూ ఏ చెట్టు క్రిందో విశ్రాంతి తీసుకుంటాడు. ఎవరినీ కోరకుండా ఏది ప్రాప్తిస్తే దానినే భుజిస్తాడు. నిత్యనూతనమైన ఆకాశమే, దిక్కులే అంబరంగా ధరిస్తాడు!

ఐశ్వర్యం, అనారోగ్య, మానావమానాలు, దూషణ భూషణలు దేనినీ అతడు పట్టించుకోడు. అన్నిటినీ సమానంగానే అనుభవిస్తాడు, అన్నీ అతని దృష్టిలో ఆత్మకంటే వేరుకావు, అతని బుద్ధిచే గుర్తింపబడిన ఏ శబ్దమైనా, పద మైన---అనంత చైతన్య స్వరూపమయిన అతనిలో స్పందించే తరంగ నాదాలు మాత్రమే. సమకాలీన సమాజమంతా అతనిని గుర్తించి ఆరాధించినా, దూషించినా అతనికి సమానమే. సర్వానికీ ఆధారంగా తన్ను తాను గుర్తించిన ఆ మహ నీయుడు సర్వదా సర్వత్రా సర్వసృష్టికీ రాజాధిరాజు.

**శ్లో॥ పతతూదేతు వా దేహో నాస్యచింతా మహాత్మనః ।**
**స్వభావభూమి విశ్రాంతి విస్మృతాశేష సంసృతేః॥86.**

టీ॥ స్వభావ భూమి విశ్రాంతి = స్వభావమేన భూమియందు విశ్రమించు చున్నటు వంటిన్ని, విస్మృతాశేష సంసృతేః = సమస్త సంస్కారములను మరచినటువంటి, అస్య =ఈ జీవన్ముక్తుడు, మహాత్మనః = మహాత్మనకు, దేహః=దేహము, ఉదేతు= ఉండును గాక, వా = లేక, పతతు = నాశనమగుగాక, చింతా = చింత, న = లేదు, (ఉండదు).

**తన స్వభావం అనే భూమిమీద స్థితుడై జనన మరణ చక్రంనుండి ముక్తుడైన మహాశయుడు, తన శరీరం మృతినంది పడిపోయినా, సజీవంగా తిరుగుతున్నా లెక్క చెయ్యకుండా సదా శాంతంగా ఉండగలడు.**

బాహ్యంగా కనబడే సమస్త చరాచర సృష్టి, (అంతరంగంగా అనుభవించే ఇంద్రియాలు కూడా) అనంతమైన ఆత్మతత్త్వంమీద ఆరోపింపబడ్డాయి. ఈ ఆత్మ తత్త్వమే సర్వాధిష్ఠానం, సర్వం పుట్టిపెరిగి చరించి నశించే భూమి, దీని మీదే సృష్ట్యాదిగా సర్వ సంఘటనలూ సంభవమవుతూ గుర్తింపబడుతూ చరిత్రగా స్మృతిగా నిలచిపోతున్నాయి. అనంతమూ అచలనమూ పరిణామ రహితమూ అయిన ఆత్మగా తన్ను తాను గుర్తించిన మహనీయుడు, అందులో భావనా లేశ మాత్రమయిన తన శరీరం గురించి ఎందుకు శ్రద్ధతీసుకుని విచారిస్తాడు? మహోన్నతమయిన తన స్వస్థితిలోని కదలికలుగా ఈ మహావిశ్వమంతా అతనికి గోచరిస్తుంది. ఆ మహావిశ్వంలో, సప్తఖండాలతో కూడిన మన భూగోళం ఒక చిన్న చుక్కవంటిది, అందులో ఒక ఖండం ఆసియా, అందులో ఉపఖండంగా

భారతదేశం ఉంది. భారతదేశంలో ఒక రాష్ట్రంలో ఒక చిన్న గ్రామంలో ఒక వీధిలో ఒక ఇంటి వరండాలో ధూళికణ సమానమైన యీ దేహం విశ్రాంతి తీసుకుంటూ ఉంది! ఈ శరీరం "జీవించి చరిస్తున్నా, మృతినంది పడి ఉన్నా" మహావిశ్వానికే అధిష్ఠానమైన నన్ను ఏ విధంగా బాధిస్తుంది.

ఆత్మజ్ఞాని సర్వదా తన స్వస్థితిని గుర్తిస్తూ, చరిస్తూ ఉంటాడు. అందుకే ఈ భ్రమాజగత్తులో చరించే అతని శరీరం ఏ స్థితిలో ఉన్నా అతనికి ఒకటే. కలనుండి మేల్కొన్న నీకు కలలో ఉన్న నీ అందమైనశరీరానికీ గల సంబంధం ఎటువంటిది? నిస్పందేహంగా ఆ శరీరం జీవించి చరించినా, మృతి నంది పడి ఉన్నా నీకేవిధమైన భావమూ కలగదు, ప్రస్తుతం మేలుకుని ఉన్నావు కాబట్టి!

శ్లో॥ అకించనః కామచారో నిర్ద్వంద్వ శ్ఛిన్నసంశయః ।
అసక్త స్సర్వభావేషు కేవలో రమతే బుధః ॥ 87.

టీ॥ అకించనః = దీనభావరహితుడై, కామచారః = విధినిషేధ రహితుడై, నిర్ద్వంద్వః = ద్వంద్వభావరహితుడై, ఛిన్నసంశయః = సంశయరహితుడై, సర్వభావేషు = సమస్త భావములయందును, అసక్తః = ఆసక్తి రహితుడై, బుధః = జ్ఞాని, కేవలః = ఎట్టి వికారములు లేనివాడై, రమతే = విహరించుచున్నాడు.

**మోహింపజేసే రెండవదేదీ లేదనే దృఢజ్ఞానంతో,దేనినీ సంపాదించా లనే కోరిక లేకుండా యథేచ్ఛగా చరిస్తూ ఉంటాడు జ్ఞాని. సర్వసంశయ రహితుడై సర్వద్వంద్వాల ప్రభావానికీ లోనుకాకుండా నిత్యానందస్వరూపుడై ఉంటాడు.**

ఈ ప్రాపంచిక విషయాలు తమంతతాముగా ఏ వ్యక్తినీ బంధించి బాధించవు. వాటిని సంపాదించాలనే కోరికే అహంకారంగా రూపుదిద్దుకుంటుంది. అహంకారమే తన కోరికలతో ఉద్రేకాలతో విషయ వాంఛలతో కష్టసుఖాల ననుభవిస్తూ ఉంటుంది. సాధించి స్వంతం చేసుకోవాలనే ఈ కోరిక వస్తువులపై కావచ్చు, వ్యక్తులపై కావచ్చు, ప్రదేశాలపై కావచ్చు, కొందరు తమ గురువుల నారాధిస్తూ బందీలైపోతారు. మరికొందరు గంగాతీరానికో పుణ్యక్షేత్రాలకో బానిసలైపోతారు. ఈ విధంగా ఆకర్షింపబడి దృఢంగా కట్టుబడిపోవడం సాధకు లకు ప్రాథమిక దశలో అవసరమే. ఈ విధంగా ఒక భావాన్ని ఆరాధిస్తూ కట్టుబడిన మనస్సు క్రమంగా ఏకాగ్రమయి, సునిశితమూ తీక్షణమూ అయిన శాస్త్రాధ్యయ

నంలో సారాన్ని గ్రహించగలుగుతుంది. ఇక్కడ మహర్షి జీవన్ముక్తుని జీవన దృక్పథాన్ని వర్ణిస్తూ అతడేవిధంగా దేనినీ సంపాదించాలనే కోరికలేకుండా, ఏ స్థలంమీద ప్రత్యేక వ్యామోహం లేకుండా యథేచ్ఛగా చరిస్తూ ఆనందంగా జీవించ గలడో స్పష్టం చేస్తున్నారు. మానసికంగా అతనిలో అహంకార తాదాత్మ్యం ఉండదు. కాబట్టి తత్ఫలితమయిన కోరికలూ అశాంతీ ఉండవు, సుఖదుఃఖాలు మానావమానాలు మొదలయిన ద్వంద్వాలతనిని బాధించవు.

ఈ విధంగా శరీరానికి సంబంధించి అతనివంటూ ప్రత్యేక వస్తువులు కానీ అతనికిష్టమయిన ప్రత్యేక ప్రదేశాలు కానీ ఉండవు. ద్వంద్వాలచే బాధింప బడని శాంత మనఃస్థితి కలిగి ఉంటాడు. ప్రపంచంలో యథేచ్ఛగా చరిస్తూ ఉంటాడు. బుద్ధిపరంగా అతనిలో ఎటువంటి సందేహాలు లేకపోవడంతో నిశ్చలశాంత బుద్ధితో సదా సంతోషంగా ఉండగలుగుతాడు. అనుక్షణమూ తాను ఆత్మనని, తనకంటే భిన్నంగా రెండవదేదీ లేదని దృఢజ్ఞానం కలిగిన అతనిలో ఎటువంటి సందేహాలూ ఉండవు. వ్యక్తులపై, వస్తువులపై, ప్రదేశాలపైనా కూడా మోహపు విలువలు అతనిలో పూర్తిగా నశిస్తాయి. సాధారణ మానవులలో ఈ మూడింటిపైనా ఉండే మోహపు విలువలే వారి బాధలన్నిటికీ కారణంగా ఉంటాయి.

ఈ విధంగా జ్ఞాని---"కేవలో రమతే"---తనలో తానే సదా ఆనందంగా ఉంటాడు. ఈ కేవలత్వం సర్వవ్యాప్తమయిన ఆత్మ చైతన్యపు స్వస్థితిని యథా తథంగా సూచిస్తుంది. స్తంభంలో భూతపుజాడ ఏ మాత్రమూ ఉండదు! భ్రమా జన్యమయిన పాము పోలికలు తాడులో మచ్చుకయినా కనిపించవు!! ఆత్మ తత్త్వంలోనికి జాగృతుడయిన వానిలో జగద్రూపభ్రమ లేశమాత్రమయినా ఉండదు, ఉన్న ఏకైక సత్యమే ఎప్పుడూ ఉంటుంది. వేదాంతంలో సూచింపబడే లక్ష్యం ఈ కైవల్యమే.

ఇక్కడ మహర్షి వాడిన "ఛిన్నసంశయః" అన్న పదం ముండకోపనిషత్తు లోని ఈ క్రింది శ్లోకాన్ని జ్ఞప్తికి తెస్తుంది.

భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.

(ముండకోపనిషత్తు 2-28)

*పరాపరాల రెండింటినీ దర్శించగల మహనీయునిలో హృదయపు గ్రంథులు ఏకమయి సర్వసంశయాలూ నశిస్తాయి. అతని కర్మలన్నీ కూడా దీనితోపాటే నశిస్తాయి.*

శ్లో॥ నిర్మమః శోభతే ధీరః సమలోష్టాశ్మ కాంచనః ।
సుభిన్న హృదయగ్రంధిః వినిర్ధూత రజస్తమః ॥ 88.

టీ॥ నిర్మమః = మమతారహితుడును, సమలోష్టాశ్మ కాంచనః = మట్టి పెళ్ళను, బంగారపుముద్దను సమానముగా చూచువాడును, సుభిన్న హృదయగ్రంధిః = బాగుగా భేదింపబడిన హృదయగ్రంధులు గలవాడును, నిర్ధూత రజస్తమః = ఎగురగొట్టబడిన రజస్తమోగుణములు గలవాడునగు, ధీరః=జ్ఞాని, శోభతే = ప్రకాశించుచున్నాడు.

హృదయంలోని అజ్ఞానగ్రంధులు నశించగా అహంకార రహితుడైన జ్ఞానికి మట్టి, రత్నం, బంగారం అన్నీ సమాన భావాన్నే కలిగిస్తాయి. అహంకారం లేకపోవడంతో రజోగుణమూ తమోగుణమూ నశించి సత్త్వప్రధానుడై ప్రకాశిస్తాడు.

ఈ శ్లోకంలో, మన పురాతన శాస్త్రగ్రంధాలలో వాడబడిన మూల్య రత్నాలవంటి పదాలు ప్రదర్శింపబడుతున్నాయనిపిస్తుంది. ఉపనిషద్ వాఙ్మయపు భావార్థ గంభీరతో, భగవద్గీతలోని భాషాసౌందర్యంతో ఈ శ్లోకం అత్యంత మనోహరంగా శోభిస్తోంది.

ఆత్మజ్ఞానాన్నిపొంది జీవన్ముక్తుడయిన జ్ఞాని అలౌకిక తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంటాడు. వ్యక్తిత్వానికి వ్రణంవలె సమస్త బాధలను సృష్టించే అహంకారం అతనిలో అదృశ్యమయి పోతుంది. బుద్ధిపరంగా అతడెక్కడా ఎప్పుడూ ద్వైతాన్ని చూడనే చూడడు, అతడు బాహ్యవస్తుమయ ప్రపంచాన్ని చూస్తున్నా, ఆ గుర్తింపబడిన భావాలన్నీ చైతన్యస్వరూపమయిన తన కదలికలే అని అతనికి స్పష్టంగా తెలుస్తుంది. సామాన్యులు అత్యంత విలువయినవిగా భావింపబడే కొన్ని విచిత్రాలను ఇక్కడ తెలుసుకుందాం. ఆఫ్రికాలో కొన్ని జాతులలో వేట కుక్కల వాడి దంతాలను అపురూపంగా భావించి వాటిని హారాలుగా మలచి మెడలో ధరిస్తారట! వారికి వజ్రాలకంటే ఈ శునక దంతాలే అత్యంతము విలువ యినవి! నవీన నాగరికులలో హిప్పీలు కొందరు తమ మెడలో ఒక గంటను కట్టుకుంటారు. అది వారిచే ఎంతో అమూల్యంగా భావింప బడుతుంది. మనదేశంలో గడ్డిమేసే ఆవు మెడలో ఈ గంటలు చిరుధ్వనులు చేస్తూ ఉండడం మనందరికీ పరిచయమే!!వస్తువులలో వస్తుతః విలువలేదనీ, ధరించేవాని మనోభావమే వాటికి విలువ నిస్తోందనీ ఇక్కడ స్పష్టపడుతోంది. ఇక్కడ మహర్షి వర్ణించే జ్ఞానికి, మట్టి, రత్నం, బంగారం, అన్నీకూడా వివిధ వర్ణాలలో ఆకారాలలో కనిపించే పదార్థాలు

మాత్రమే. "సమలోష్టాశ్మ కాంచనః" ---ఈ పదజాలం భగవాన్ శ్రీకృష్ణుని గీత నుండి (అధ్యాయం 6-8) ఉన్నది ఉన్నట్టుగా గ్రహింపబడింది.

మానవ వ్యక్తిత్వాన్ని పరిశీలించిన మన మహర్షులు, ఇది ముఖ్యంగా మూడు ముడులచే బంధింపబడి ఉందని అంటున్నారు. హృదయగ్రంధి--- హృదయాన్ని బంధించే ముడులు మూడు---అవి "అవిద్య","కామం","కర్మ". మన సహజ స్వరూపం తెలియకపోవడం అవిద్య. అవిద్యతో మనలను మనం అసంపూర్ణ వ్యక్తిగా, పరిమితంగా భావించుకుంటున్నాము. ఈ పరిమితులను తొలగించుకోవాలనే తపనతో బుద్ధిచేసే ప్రయత్నం అనేక కోరికల రూపంలో వ్యక్తమవుతుంది. బుద్ధిలోని కోరికలు మనస్సులో అశాంతిని కలిగిస్తాయి. ఈ అశాంతి కారణంగా నిర్విరామంగా శరీరంతో అనేక కర్మల నాచరిస్తాం. అవిద్య, కామం, కర్మ, ఈ మూడే మనలను పరిమితం చేసి కష్టనష్టాలని కలిగించి బందీని చేస్తున్నాయి. జీవితమంతా బంధంతో ముక్తి కోసం తపనతో బాధామయంగా గడచిపోతుంది.

త్రివిధములయిన ఈ బంధాలకు కారణం మన అజ్ఞానమే. సత్యాన్ని సరిగ్గా గుర్తించకపోవడమే అవిద్యగా అన్యధా గ్రహణానికి ఆధారమవుతోంది. అపరోక్షానుభూతిలో, ఆత్మానుభవంలో అజ్ఞానాన్ని దగ్ధం చేసినవాడే జ్ఞాని. అతడు మాత్రమే హృదయగ్రంధిని ఛేదించి వ్యక్తిత్వాన్ని బాధామయమయిన బంధాలనుండి తప్పించినవాడు. కఠోపనిషత్తులోనూ ముండకోపనిషత్తు (2-2-8) లోనూ ఈ భావం సుస్పష్టంగా గావించబడింది.

> యదా సర్వే ప్రముచ్యన్తే హృదయస్యేహ గ్రంధయః
> అథ మర్త్యోమృతో భవతి ఏతావదను శాసనమ్ .(కఠోపనిషత్తు 2-3-15)

*ఈ భూమిమీద జీవిస్తున్నప్పుడే హృదయగ్రంధలను ఛేదించగలిగిన మర్త్యుడు ఇక్కడే అమరుడౌతాడని వేదాంతం ఘోషిస్తోంది.*

ఆత్మను గూర్చిన అజ్ఞానం మనిషిలో సత్త్వ, రజస్, తమోగుణాలుగా విస్తరించి మనస్సును పాలిస్తుంది. ఈ మూడు గుణాలే ఆత్మను మన దృక్పథం నుండి మరుగుపరుస్తున్నాయి. ఆత్మ కనిపించకుండా తెరలాగా "ఆవరణ"గా తమోగుణం ఆవరిస్తుంది, అప్పుడు మనస్సును రజోగుణం ఆవరించి సత్యాన్ని గురించి అనేక కల్పనలను రచించి చూపిస్తూ ఉంటుంది---"విక్షేపం" ఈ ఆవరణ విక్షేపాలే మనల్ని అహంకార సహిత జీవులుగా మార్చి కోరికలూ, అశాంతీ కర్మ, బాధా అనుభవింపజేస్తున్నాయి.

రజస్తమోగుణాల ప్రభావం నుండి ముక్తుడయిన సాధకుడు అపరోక్షానుభూతిలో ఆనందంగా ఉండగలుగుతాడు. ఆవరణ విక్షేపం లేకపోవడంతో మన బుద్ధులు శాంతంగా సహజంగా ఉండగలుగుతాయి, భ్రమాకల్పనలన్నీ నశిస్తాయి? సత్యం స్వతస్సిద్ధంగా ప్రకాశిస్తుంది. రజోగుణాన్ని మనస్సునుండి తొలగించడానికి బాహ్యసాధనలన్నీ ఉపయోగపడతాయి. బుద్ధిలోనుండి తమోగుణాన్ని తొలగించుకోవడానికి సాధకులకు ధ్యాన, శ్రవణ, మనన, నిధిధ్యాసలు నిర్దేశించబడినాయి. దీనినే అభ్యంతర సాధన అంటారు.

ఇక్కడ శిష్యుడయిన జనకునిలో అజ్ఞానం అతి పల్చగా మబ్బువలె ఉంది, సత్యానికి అతి సమీపంలో ఉండి వెలుగును చూస్తున్నా మబ్బు అడ్డు ఉండడంతో స్పష్టంగా జ్ఞాన భాస్కరుని చూడలేక పోతున్నాడు. అటువంటి శిష్యునికి మహర్షి ఇచ్చే సూచనలు మనకు అత్యాశ్చర్యకరంగా అసంబద్ధంగా అనిపించవచ్చు. మానవాళి క్షేమాన్ని కాంక్షించి మహర్షులు విధించిన చతుర్విధ పురుషార్థాలను, ముముక్షుత్వాన్నీ కూడా విడచిపెట్టమని శిష్యునికి బోధిస్తుంటే, అది విన్న సామాన్యులు ఏమనుకుంటారు? సత్యాన్ని సంపూర్ణంగా దర్శించడానికి అతి పలచని ఆవరణగా అజ్ఞానం రేఖామాత్రంగా మిగిలి ఉన్న సాధకులకు, గమ్యాన్ని సమీపించినవారికి ఇవ్వబడిన సూచనలను, ప్రయాణం మొదట్లో ఉన్న సాధకులు గ్రహించకూడదు. ప్రాథమికదశలో ఉన్న సాధకులు తమ నిశ్చయాన్ని, చిత్తశద్ధిని, విడవకుండా అసిధారావ్రతంగా సాధనను కొనసాగించి గమ్యాన్ని సమీపించాలి. ఆధ్యాత్మిక మార్గం కత్తి అంచువలె అతి పదునైనదని కఠోపనిషత్తు అంటోంది. అతి జాగ్రత్తగా అడుగడుగునా శాస్త్రిజ్ఞాన తేజంతో దారి చూసుకుంటూ ప్రతీ అడుగూ నిశ్చలంగా చిత్తశుద్ధితో వేస్తూ గమ్యాన్ని చేరుకోవాలి.

క్షురస్య ధారా నిశితా దురత్యయా
దుర్గం పథస్తత్కవయో వదన్తి (కఠోపనిషత్తు 1-114)

*ఈ మార్గం కత్తి అంచువలె అతి పదునైనది. దీనిమీద నడవడం అతి కష్టం, గమ్యాన్ని చేరడం అంతకన్నా కష్టం అని జ్ఞానులంటారు.*

**శ్లో॥ సర్వత్రానవధానస్య న కించిద్వాసనా హృది ।**
**ముక్తాత్మనో వితృప్తస్య తులనా కేన జాయతే ॥ 89.**

టీ॥ సర్వత్రా = అన్నివిషయములయందు, అనవధానస్య = ఆసక్తి రహితుడైనటువంటియు, హృది = హృదయమునందు, కించిత్ = కొంచెమైనను, వాసనా = వాసన,

న=లేనట్టియు, తృప్తస్య=నిత్యతృప్తుడైనట్టియు, మహాత్మనః = మహాత్ముడైన, ఈశ్వరస్య = ఇటువంటి జ్ఞానికి, కేన = ఎవనితో, తులనా = సాదృశ్యము, జాయతే = అగుచున్నది, (అతనికి సాటి యెవ్వరును లేరని భావము).

ఏ కోరికలూ లేని నిత్యతృప్తి హృదయంతో సర్వాన్నీ ఉదాసీన భావంతో వీక్షించగలిగే జ్ఞానికి సాటి యెవరు?

ఈ అధ్యాయపు చివరి శ్లోకాలలో అష్టావక్ర మహర్షి స్పష్టంగా ఒప్పు కుంటున్నారు. బాహ్యాంభ్యంతరాలలో జ్ఞాని జీవితాన్ని ఎంత వర్ణించినా అది కేవలం లేశ మాత్రమే. వర్ణనాతీతమయిన ఆ స్థితిని దూరం నుండి కేవలం చూపించగలిగేనో లేదో అని మునీంద్రులు సంశయిస్తున్నారు. జ్ఞానితో సాటిరాగల వారెవరూ ఉండరు. అతని స్థితిని వర్ణించగలగడం అసాధ్యం. మానవమేధకొక సవాలుగా జ్ఞాని అంతరంగం సదా శాంతంగా, అతని జీవితమే అందమైన దృశ్య కావ్యాన్ని చూస్తున్నట్టుగా ఉంటుంది. అశాంతికి, కష్టాలకు, సర్వకర్మలకు కారణయిన కోరికలేలేని జ్ఞాని మనోబుద్ధులు సదా శాంతంగా సంతోషంగా ఉంటాయి. సర్వత్రా తన స్వరూపాన్నే సదా గుర్తిస్తూ ఉండడంతో అతనికి దేనిమీదా ప్రత్యేకమైన వ్యామోహం ఉండదు. రాయిని, రత్నాన్ని సమభావంతో చూడగల అతని మనస్సును అశాంతి ఎలా సమీపించగలదు? బాహ్యంగా భౌతిక ప్రమాణాల దృష్ట్యా అతడు మనిషిగా మనకు కనిపిస్తున్నా, మన బుద్ధికి అందని ఎత్తుకు ఎదిగిపోయిన అతని మహావ్యక్తిత్వం అనితరసాధ్యం, అపూర్వం, అద్భుతం. అతని అంతరంగ జీవితం కూడా అసాధారణం, అసామాన్యం. అంజలి ఘటించి మౌనంగా నిలబడడమే తప్ప ఏ విధంగానూ ఆ స్థితిని వర్ణించలేము. అందుకే మహర్షి "తులనా కేన జాయతే"--- "సరిపోల్చదగినదేమున్నది?" అని అనడంలో తన అసమర్థతను సమర్థనీయంగా ఒప్పుకుంటున్నారు.

**శ్లో॥ జానన్నపి న జానాతి పశ్యన్నపి న పశ్యతి ।**
**బ్రువన్నపి న చ బ్రూతే కోఽన్యో నిర్వాసనాదృశే॥90.**

టీ॥ జానన్ అపి = తెలిసికొనుచున్నవాడైనను, (యః = ఎవడు), న జానాతి = తెలిసికొనుటలేదో, పశ్యన్ అపి = చూచుచున్న వాడైనను, న పశ్యతి = చూచుటలేదో, బ్రువన్ అపి = మాట్లాడుచున్న వాడైనను, న బ్రూతే = మాట్లాడుటలేదు, సః = అట్టివాడు, నిర్వాసనాత్ ఋతే = వాసనారహిత పురుషునికంటే, అన్యః = ఇతరుడు, కః = ఎవడు?

జీవన్ముక్తుడు తప్ప వేరెవరు తెలుసుకుంటున్నా తెలుసుకోనివారు? చూస్తున్నా చూడనివారు? మాటాడుతున్నా మాటాడని వారు? అతనికతడే సాటి.

కిందటి శ్లోకంలోని భావాన్నే మహర్షి ఇంకా సమర్థిస్తున్నారు. జీవన్ముక్తునితో పోల్చదగినవారెవరూ ఉండరూ. అతనిలో కోరికలు లేకపోవడమే కాదు, వాటి జన్మస్థానమదగిన అహంకారమే అదృశ్యమయి పోతుంది. సాధారణంగా మనం ఎవరిని వర్ణించినా అది వారి వ్యక్తిగత అహంకార వర్ణన మాత్రమే అవుతుంది. అహంకారాన్ని సర్వానికీ అధిష్ఠానమైన ఆత్మానుభవంలో లయం చేసుకుని జ్ఞానిని ఎలా వర్ణించడం? ఏమని వర్ణించడం? సమాజంలోని వ్యక్తులను వర్ణించినట్టుగా జ్ఞానిని, అతని పనులనూ ఆలోచనలనూ ప్రవర్తననూ, వర్ణించ బూనడం అబద్ధం చెప్పడమే అవుతుంది. సాధారణంగా జీవిత చరిత్రను రచించేటప్పుడు ఈ విషయాలనే వ్రాస్తుంటాము. జీవన్ముక్తుని జీవితాన్ని వ్రాయబూనడం అసాధ్యమయిన కార్యమే. అతని మనోబుద్ధులతో కాని, శారీరిక కర్మలతో గాని అతనిని అంచనా వెయ్యలేము. అవేవీ కాని అనంత వ్యక్తిత్వమతనిది, పరిమితమయిన మనశ్శరీరాల కార్యకలాపాలను మాత్రమే వర్ణిస్తూ పర్వతాన్ని వర్ణించబోయి అందులో ఒక చిన్నరాయిని వర్ణించినట్టువుంది.

పరిపూర్ణుడయిన ఆ మహావ్యక్తిలో బాహ్యాభ్యంతర ఇంద్రియాలు పరిశుద్ధమూ నిర్మలమూ అయి సామాన్యుల దృష్టిలోగల అత్యున్నత ప్రమాణాలను కలిగి ఉంటాయి. అయినా ఆ ఉపాధుల కార్యకలాపాల వర్ణన మాత్రమే అతని జీవిత చిత్రంకాదు. ఆత్మానుభవంలో కర్తృత్వ భోక్తృత్వ భావరూపమయిన అహంకారాన్ని లయం చేసుకున్న జీవన్ముక్తుడు ఏ పనులను చేసినా చేయనట్టే. అతడు చూసినా చూడనట్టే, వింటున్నా విననట్టే, మాటాడుతున్నా మాటాడనట్టే. ఈ పనులన్నింటినీ చేస్తున్నాననుకునే కర్త అక్కడ ఉండనే ఉండడు. కర్తలేకుండా జరిగే పనులను జ్ఞానివిగా వర్ణిస్తే అది నిజమవుతుందా? కైవల్యోపనిషత్తులోని ప్రఖ్యాత వ్యాఖ్యానం ఇక్కడ గుర్తుకు వస్తోంది.

పశ్యమ్యచక్షుః సః శృణోమ్యకర్మణః.(కైవల్యోపనిషత్తు-21)

కళ్ళు లేకుండా చూస్తున్నాను, చెవులు లేకుండా వింటున్నాను.

**శ్లో॥ భిక్షుర్వా భూపతిర్వాఽపి యో నిష్కామస్స శోభతే ।**
**భావేషు గళితాయస్య శోభనాఽశోభనామతిః ॥ 91.**

టీ॥ యస్య=ఎవనియొక్క, శోభనా=శ్రేష్ఠమైనట్టిగాని, అశోభనా = అశ్రేష్ఠమైనట్టిగాని, మతిః = బుద్ధి, భావేషు = సమస్త భావముల విషయమై, గళితా = జారిపోయినదో (నశించినదో), సః = అట్టి, నిష్కామః = కామనారహితుడగువాడు, భూపతిః వా = రాజే యగుగాక, వా=లేక, భిక్షుః వా = సన్యాసియే యగుగాక, శోభతే = శోభాయమానుడగు చున్నాడు.

**జ్ఞాని భిక్షకుడయినా మహారాజయినా అతనికతడే సాటి. చూడబడే సర్వమూ తననుండి వేరుకాదనే దృఢజ్ఞానంలో మమత్వాన్ని మోహాన్నీ విడనాడి మంచి చెడుల భావాలనుండి బయటపడి శాంతంగా జీవించే అతని జన్మధన్యం.**

ఆత్మద్వారా, ఆత్మగా, జీవన్ముక్తుడు సర్వంలో సర్వత్రా ఆత్మనే గుర్తిస్తూ ఉంటాడు. ఆభరణాలేవయినా కంసాలికి బంగారమే కనిపిస్తుంది. అహంకారమే బాహ్యవస్తుమయ ప్రపంచాన్ని యిష్టాయిష్టాలతో చూస్తూ, యిష్టాయిష్టాలను పెంచుకుంటూ వ్యామోహాలతో బంధింపబడుతూ ఉంటుంది. ఈ విధంగా బంధీ అయిన అహంకారంతో అనేక కోరికలు ఉదయిస్తాయి. కోరికల ఒత్తిడితో శారీరికంగా అనేక కర్మలనుచేస్తూ ఇంద్రియాలతో విషయభోగాలనుభవించాలని కోరుకుంటుంది. ఇదే ప్రపంచం ఆత్మనిష్ఠుడయిన జ్ఞానిచే ఆత్మయొక్క బహురూపాలుగా అనంత సౌందర్య సమన్వితమయిన స్వస్వరూపంగా సర్వదా సర్వత్రా గుర్తింప బడుతుంది. తన్ను తానే చూసుకునే అతనిలో కోరికలు అశాంతి మొదలయిన వేవీ నిలువజాలవు. సూర్యునిముందు చీకటి నిలువజాలనట్లే,అద్దాలగదిలో అడుగు పెట్టే అన్ని దిక్కులా మన ప్రతిబింబాన్నే చూసుకున్నట్టుగా జ్ఞాని సర్వత్రా ఆత్మతత్త్వమే గోచరిస్తుంది. సర్వనామరూపాలూ బుద్ధిలో గుర్తింపబడే భావాలే, భావాలన్నీ చైతన్యపు నర్తనలే, సర్వదా సర్వత్రా చైతన్యం మాత్రమే ఉంది, రెండవదేదీ ఎప్పుడూ లేనేలేదు---భ్రమాకాలంలో కూడా.

మహోపనిషత్తు కూడా ఈ భావాన్నే ఇలా ధృవపరుస్తోంది.

యైరేవ జాయతే రాగో మూర్ఖస్యాధికతాం గతః
తైరేవ భోగైః ప్రాజ్ఞస్య విరాగ ఉపజాయతే. (మహోపనిషత్తు 5-169)

*మూర్ఖుని మనస్సులో కోరికలనూ ఉద్రేకాలనూ రగిల్చే వస్తువులే జ్ఞానిలో పూర్తిగా వైరాగ్యాన్ని కలిగిస్తాయి.*

జ్ఞాని సర్వదా సర్వత్రా తన స్వరూపమైన చైతన్యాన్నే చూస్తూ ఉండడంవలన అతనిలో మంచిచెడుల భేదబుద్ధి నశిస్తుంది. మన కర్థమయే

భావనామయప్రపంచంలో అతడు నివసించడంలేదు. భావనాతీతమయిన స్వస్థితి లోనికి అతడు జాగృతుడయి, తనకంటే భిన్నంగా రెండవదేదీలేదని తెలుసుకుని శాంతంగా జీవిస్తాడు.

**శ్లో॥ క్వస్వాచ్ఛంద్యం క్వ సంకోచః క్వ వా తత్త్వవినిశ్చయః।**
**నిర్వ్యాజార్జవ భూతస్య చరితార్థస్య యోగినః ॥ 92.**

టీ॥ నిర్వ్యాజార్జవ భూతస్య = నిష్కపట సరళరూపుడైనట్టియు, చరితార్థస్య = యథోచిత ప్రయోజనమును పొందినట్టియు, యోగినః = యోగికి, స్వాచ్ఛంద్యం = స్వచ్ఛందత, క్వ = ఎక్కడ, సంకోచః = సంకోచము, క్వ = ఎక్కడ, వా = లేక, తత్త్వ వినిశ్చయః = తత్త్వనిశ్చయము, క్వ = ఎక్కడ?

**జీవిత పరమార్థాన్ని గ్రహించి సాధించి అవ్యాజానంద స్వరూపుడైన యోగికి, నియమాలేమిటి? స్వేచ్ఛాప్రవృత్తి ఏమిటి? తత్త్వజ్ఞాన నిశ్చయంతో పని ఏమిటి?**

జీవన్ముక్తుడు సదా ఆత్మగా ఆత్మలో స్థితుడై ఉంటాడు. అహం కారాన్ని అధిగమించిన అతనిలో కర్తృత్వభావమే ఉండదు. కాబట్టి సహజంగా స్వేచ్ఛా జీవనంలో అతనికి ఆనందం ఎలా లభిస్తుంది? అసలు (స్వ+ఇచ్ఛ) స్వేచ్ఛ ఎలా ఉంటుందతనిలో? కోరికలేలేని అతడు భోగలాలసుడై ఎలా జీవించగలడు? ఎవరి తృప్తికోసం? ఇంద్రియ నియమము, మనఃసంయమనం అన్నమాట లతనికి ఏవిధంగా వర్తిస్తాయి? ఇవన్నీ అహంకారం ఉన్నప్పుడు మాత్రమే అర్థవంతంగా ఉంటాయి. ఇంద్రియాలకు విషయాలు గోచరించి అనుభవించాలనే కోరిక ఉంటే అక్కడ తప్పకుండా అహంకారం ఉన్నట్టే. ఆ అహంకారం ఒత్తిడితో అశాంతికి, తద్వారా అనేక కష్టనష్టాలకు గురికాక తప్పదు. స్వప్నం నుండి మేల్కొన్నవ్యక్తి ఏవిధంగా స్వప్నంలో నియమాలను పాటించగలడు? ఏవిధంగా స్వేచ్ఛగా స్వప్నంలో మళ్ళీ జీవించగలడు?

మన ధార్మిక ప్రమాణాలతో అహంకారాన్ని అధిగమించిన జ్ఞాని స్థితిని ఊహించి నిర్ణయించలేము. అన్ని ధర్మాలనూ అధిగమించి అతడికతడే ధర్మమై విరాజిల్లితూ ఉంటాడు! భావనాతీతసత్యం భాషకందని సౌందర్యంతో జీవన్ముక్తునికి అనుభవమౌతుంది. అట్టి మహాశయునికి తత్త్వజ్ఞాన నిశ్చయంతో అవసరం ఏమిటి? శాస్త్రాధ్యయనం ఎందుకు? సాధన దేనికోసం? తన్ను తాను జయించి పరమపురుషార్థాన్ని సాధించి, ఆత్మానుభవంలో పూర్ణత్వమే మకుటంగా

రాజాధిరాజువలె సంతోషంగా జీవించే అతనికి ఏది వాంఛనీయం? అతడే సర్వం, అతడే సత్యం, అతడు కోరిదగినదేదీ లేదు. అందుకే అతడికి తత్త్వ జ్ఞానంతో అవసరం లేదు, జ్ఞానస్వరూపమే అతడు.

శ్లో॥ ఆత్మవిశ్రాంతి తృప్తేన నిరాశేన గతార్తినా ।
అంతర్యదనుభూయేత తత్కథం కస్య కథ్యతే ॥ 93.

టీ॥ ఆత్మవిశ్రాంతి తృప్తేన=ఆత్మయందే విశ్రాంతిబొంది తృప్తుడైనట్టియు, నిరాశేన = ఆశారహితుడైనట్టియు, గతార్తినా = దుఃఖలేశమేలేని జ్ఞానిచేత, అంతః = లోపల, యత్ = ఏది, అనుభూయేత = అనుభవింపబడుచున్నదో, తత్ = దానిని, కస్య = ఎవనికి, కథం = ఎట్లు, కథ్యతే = చెప్పబడుచున్నది.

ఎవరికి ఏవిధంగా వర్ణించి చెప్పగలం? సుఖదుఃఖాల నధిగమించి, కోరికలు లేకుండా, అనంతాత్మ తత్త్వంలో నిత్యతృప్తుడై ఉన్న జ్ఞానిస్థితిని అతడు మాత్రమే అర్థం చేసుకోగలడు.

మేధానిధీ, సాధకోత్తముడూ తన ప్రియ శిష్యుడూ అయిన జనకునికి, జ్ఞానియొక్క స్థితిని యథాతథంగా వర్ణించి చెప్పాలని మహర్షి ప్రయత్నిస్తూ, చెప్పలేని అసమర్థతను గుర్తిస్తూ విచారిస్తున్నారు. తన స్వానుభవమైనప్పటికీ అనంతానందమయమైన ఆ స్థితిని పరిమితమయిన భాష పరిధిలో ఇమడ్చలేక మహర్షి వీలైనంతగా స్పష్టం చేస్తున్నారు. విషయిగా విషయాలను గుర్తించే స్వభావంకల అహంకారానికి బుద్ధికీ, విషయి-విషయ సంబంధరహిత స్థితి అర్థం అయే అవకాశంలేదు. అందుకే బుద్ధితో ఎంత ప్రయత్నించినా ద్వంద్వాతీత మయిన ఆత్మస్థితి భాషాబద్ధం కావడం లేదు.

భావాతీతమయిన ఈపరమసత్యాన్ని భాషాబద్ధం చెయ్యడం అసంభవమని ఉపనిషత్తులన్నీ ముక్తకంఠంతో ఘోషిస్తున్నాయి. వర్ణించలేని తన అసమర్థతను స్పష్టంగా గుర్తిస్తున్న ఒక ఋషి ఇలా అంటున్నారు.

యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ (తైత్తరీయోపనిషత్తు 2-9)

*"మనస్సు తన వాక్కుతో సహా ఎక్కడనుండి అశక్తతో తిరిగి వస్తుందో"*అక్కడ సత్యం ఉంటుంది. అని అంటూ తన అసమర్థతను ఒప్పుకుంటున్నారు. మనో బుద్ధుల నధిగమించి సత్యం ఉంటుంది కాబట్టే మనోబుద్ధులతో సత్యాన్ని దర్శించడం సాధ్యం కాదు. భౌతిక పదార్థ నిర్మితాలయిన ఉపాధుల తాదాత్మ్యం నుండి

విడివడి సర్వాధిష్ఠానమయిన ఆత్మచైతన్యమే తానుగా గుర్తించిన జ్ఞాని జీవన్ముక్తుడవుతాడు. "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" అని ఉపనిషత్తులంటున్నాయి. బ్రహ్మను తెలుసుకుంటున్నవాడు బ్రహ్మ అవుతున్నాడు. అందుకే మహర్షి అడుగుతున్నారు. "ఎవరికి, ఏవిధంగా? వర్ణించి చెప్పగలం?" అ స్థితిని ఎవరు అర్థం చేసుకోగలరు?

శ్లో॥ సుప్తోఽపి న సుషుప్తౌ చ స్వప్నేఽపి శయితో న చ ।
జాగరేఽపి న జాగర్తి ధీరస్తృప్తః పదే పదే ॥ 94.

టీ॥ ధీరః = జ్ఞాని, సుషుప్తౌ అపి = సుషుప్తియందును, న సుప్తః = నిద్రించువాడు కాడు, స్వప్నే అపి = స్వప్నమునందును, న శయితః = పండుకొనువాడు కాడు, జాగరే అపి = జాగ్రదవస్థయందును, న జాగర్తి = మేలుకొనడు, అత ఏవ = ఈ ప్రకారముగానే, సః = అతడు, పదే పదే = మాటిమాటికి, తృప్తః = తృప్తుడగుచున్నాడు.

**సుషుప్తిలో ఉన్నా జ్ఞాని నిద్రించడం లేదు, స్వప్నాన్ని చూస్తున్నా పడుకుని లేనట్టే, జాగ్రదవస్థలో మేలుకుని కూడా ఉండడు. సర్వదా స్వస్థితిలో శాంతుడై ఉంటున్నాడు.**

ఈ సంహితలో మొదటిసారిగా మహర్షి, జ్ఞానిని మన అనుభవంలో ఉండే జాగ్రత్స్వప్న సుషుప్తి అవస్థల దృష్టితో పోల్చి చూపించడానికి ప్రయత్నిస్తున్నారు. సాధారణంగా మానవులు తమ జీవితపు సమగ్ర అనుభవాలను మూడు ముఖ్య స్థితులనుండి గ్రహిస్తూ ఉంటారు. అవి జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్తి అవస్థ. వీటిలో మనం స్థూలసూక్ష్మకారణ శరీరారలతో అనుభవాలను పొందుతూ ఉంటాము. ద్వంద్వాతీతమయిన ఆత్మానుభవస్థితుడయిన జ్ఞానికి ఈ మూడు అవస్థలూ ఉండవు. అతడు అహంకారం దర్శించే సర్వానుభవ భావాలకు అతీతంగా ఉంటాడు. స్థితికాని ఈ నాలుగవస్థితిని తురీయం అని అంటారు. పరిణామరహితమయిన శుద్ధచైతన్యంగా ఆత్మ కేవలంగా ఇక్కడ ఉంటుంది. ఈ చైతన్యం ఆధారంగానే మిగిలిన మూడవస్థలలోనూ అహంకారం ప్రత్యేక ప్రపంచ భావాను భవాలను పొందుతూ ఉంటుంది. ఏకమైన ఈ చైతన్యమే అనేక ప్రాణులలో ఉన్నట్టుగా అనేకత్వ భ్రమను కలిగిస్తూ ఉంటుంది.

మన అజ్ఞానం కారణంగా స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలతో తాదాత్మ్యం చెందుతూ జాగ్రత్ స్వప్న సుషుప్తి అనుభవాలను అనుభవిస్తూ ఉంటాము. ఈ మూడవస్థలను అధిగమించి ఏకత్వానుభవాన్ని పొందిన జ్ఞాని ఆ అవస్థలలో ఉన్నట్టు

కనిపిస్తున్నా లేనట్టే. అతడు జాగ్రదవస్థనుచూసే విశ్వుడూ కాడు, స్వప్నాన్ని దర్శించే తైజసుడుకాడు, సుషుప్తిలో లీనమయిన ప్రాజ్ఞుడూ కాడు. మూడవస్థలకు కారణ భూతుడయిన సర్వాధిష్ఠానమయిన ఆత్మతత్త్వమే తానుగా సదా ఆనందంగా ఉంటాడు. అతడు కేవలం "అవస్థాత్రయం"---మాత్రమే.

అందుకే అష్టావక్ర మహర్షి ఇలా వ్యాఖ్యానిస్తున్నారు. "జ్ఞాని నిద్రిస్తున్నా నిద్రించనట్టే, స్వప్నాన్ని చూస్తున్నా పడుకోనట్టే. జాగ్రదవస్థలో ఉన్నా దేనినీ చూడనట్టే" అహంకారం మాత్రమే నేను జాగ్రదవస్థను చూస్తున్న విశ్వుడననీ, స్వప్నాన్ని చూస్తున్న తైజసుడననీ, సుషుప్తిలోని ప్రాజ్ఞుడననీ అనుకుంటుంది. స్వరూపం తెలియని అజ్ఞానంనుండి జన్మించిన అహంకారానికి అవస్థాత్రయాలుంటాయి. ఈ మూడవస్థలతోనూ తాదాత్మ్యం చెందుతూ అహంకారం కష్టసుఖాలనుభవిస్తూ, పరిభ్రమిస్తూ ఉంటుంది.

అజ్ఞానం రెండు విధాలుగు వ్యక్తమవుతుంది. (1) సత్యాన్ని దర్శించకపోవడం, (2) సత్యాన్ని అన్యథా గ్రహించడం, సత్యాన్ని దర్శించక పోవడం నిద్రగా అనుభవమౌతుంది. సత్యాన్ని గ్రహించక పోయినా అన్యథా దేనినీ గ్రహించకపోవడంతో, ఏమీ తెలియని అజ్ఞానం మాత్రమే ఉన్నదశను నిద్రావస్థ అంటున్నాం. సత్యం తెలియని కారణం చేత ఊహాకల్పనలతో అన్యథా గ్రహించడం స్వప్నంగా మనస్సుచేత మనస్సులో అనుభవింపబడుతుంది. వేదాంత తత్త్వశాస్త్రి గ్రంథాల పరిభాషలో మానవ జీవితమంతా కేవలం ఈ రెండు రకాల అనుభవాల సమగ్ర రూపంగా మాత్రమే గ్రహింపబడింది. మూడవదైన జాగ్రదవస్థ కూడా స్వప్న తుల్యంగానే భావించబడింది. అందులో కూడా సత్యజ్ఞానం లేకపోవడమే అందుకు కారణం. జాగ్రదవస్థలో గుర్తింపబడే ప్రపంచమంతా కూడా స్వప్నంలోవలె అన్యథా గ్రహణం చేతనే సంభవమౌతుంది.

ఉపనిషద్ వాఙ్మయంలో వాడబడిన ఈ అవస్థాత్రయం(జాగ్రత్ స్వప్న సుషుప్తి) ఇక్కడ అష్టావక్ర మహర్షిచే ఈ శ్లోకంలో ఉపయోగింపబడి వివరింపబడుతోంది. జ్ఞానిశరీరం సుషుప్తిలో ఉన్నట్టుగా మనకు కనిపించినా అతనిలో ఎన్నడూ అగ్రహణం ఉండదు. స్వస్థితిలో సదా నిష్ఠుడై ఉన్న అతనిలో అజ్ఞానం ఉండదు. ఇదేవిధంగా జ్ఞాని స్వప్నాన్ని తన మనస్సులో చూస్తున్నా, బాహ్యంగా జాగ్రదవస్థలో ప్రపంచం కనిపిస్తున్నట్టు మనోబుద్ధులతో గుర్తిస్తున్నా కూడా అతనిలో అన్యథాగ్రహణ ప్రభావమయిన భ్రమ ఉండదు. అపుడు కూడా అతడు ఆత్మను

మాత్రమే ఆత్మలో ఆత్మగా తెలుసుకుంటూ ఉంటాడు. కాబట్టే అతడు మేలుకుని ప్రపంచాన్ని చూస్తున్నా చూడనట్టే. చూసే అహంకారం అతనిలో ఉండదు. ప్రాపంచిక భ్రమలకు అతడు మేలుకుని ఉండడు, అతడు సదా స్వస్వరూపంలో మేలుకునే ఉంటాడు. నిద్రలో అతడు నిద్రించడంలేదు. తన స్వస్థితిలో అతడు జాగృతుడయే ఉంటాడు.

**శ్లో॥ జ్ఞః సచిన్తోఽపి నిశ్చింతః సేంద్రియోఽపి నిరింద్రియః।**
**స బుద్ధిరపి నిర్బుద్ధిః సాహంకారోఽనహంకృతిః ॥ 95.**

టీ॥ జ్ఞః=జ్ఞాని, సచిన్తః అపి = చింతాసహితుడైనను, నిశ్చింతః = చింతారహితుడు, సేంద్రియః అపి = ఇంద్రియములతో కూడుకొన్నవాడైనను, నిరింద్రియః = ఇంద్రియ ములు లేనివాడును, స బుద్ధిః అపి = బుద్ధితో కూడుకొన్న వాడైనను, నిర్బుద్ధిః = బుద్ధి రహితుడు, సాహంకారః అపి = అహంకార యుక్తుడైనను, అనహంకృతిః = అహంకార రహితుడుగా, భవతి = అగుచున్నాడు.

**జ్ఞాని ఆలోచిస్తున్నప్పుడు కూడా అతనిలో ఆలోచనలుండవు. ఇంద్రి యాలు ఉపయోగిస్తున్నా అతనికి ఇంద్రియాలు లేవు. బుద్ధి ఉన్నా అతనిలో బుద్ధిగతమయిన తెలివిలేదు. అతనిలో అహంకారం ఉన్నా అతనికి అహంకారం లేదు.**

జీవన్ముక్తునిలో ఒక మనస్సు దాని ఆలోచనలూ, ఇంద్రియాలూ వాటి ప్రాకృతిక ధర్మాలూ, బుద్ధీ అందులోని తెలివీ, అందరివలె ఉంటాయి! నిస్సందే హంగా అతనికి ప్రత్యేక వ్యక్తిత్వం ఉంది కాబట్టి అతనిలో అహంకారం ఉండి తీరాలి. అయినా దేనినయితే మనం వ్యక్తిత్వ సహిత వ్యక్తిగా గుర్తిస్తున్నామో, ఆ ఉపాధితో తాదాత్మ్యం ఉండని జ్ఞానిని ఏవిధంగా వర్ణించడం? అందుకే అష్టావక్ర మహర్షి పిచ్చివానివలె అసందర్భ పదజాలంతో, పరస్పర విరుద్ధ భావాలతో అభి వర్ణిస్తున్నారు. జీవన్ముక్తునిలో సర్వేంద్రియ సమన్వితమయిన ఉపాధి సలక్షణం గా ఉంటుంది, అయినా తాను కర్తననే తాదాత్మ్య భావం ఉండదు. సాధారణుని దృష్టిలో జ్ఞాని తన సర్వేంద్రియాలనూ ఉపయోగిస్తూనే ఉన్నాడు. సామాన్యుని వలె సామాన్యంగా జీవిస్తూనే ఉన్నాడు, అయితే అతనిని సామాన్య మానవ సమూహం నుండి విడిగా ప్రత్యేకంగా దివ్యునివలె నిలబెడుతున్నదేమిటి? "నేను చేస్తున్నాను, నేను అనుభవిస్తున్నాను" అన్న తాదాత్మ్య బుద్ధి లేకుండానే అతడు తన కార్యకలాపాలన్నిటినీ నిర్వహిస్తూ ఉంటాడు, నిర్వహిస్తూనే తానేమీ

చెయ్యడం లేదనే సత్యాన్ని స్పష్టంగా సర్వదా గుర్తిస్తూ ఉంటాడు, అందుకే అతడేమీ చెయ్యనివాడే.

అహంకార రహితంగా ఉపాధిలో జీవించడం ఆత్మానుభవమే! అనుక్షణమూ, అన్ని సంఘటనలలోనూ ఆత్మనుతప్ప అతడు అన్యమేదీ చూడడం లేదు. సత్యాన్ని గుర్తించక పోవడం, (తమోగుణం) మాత్రమే ఉన్న సుషుప్తిలో ఏ విచారాలూ బాధలూలేవు, అన్యధాగ్రహణం మనః కల్పనలుగా రూపుదాల్చిన స్వప్నావస్థలోనూ జాగదవస్థలోనూ కూడా, నిజానికి ఏ విచారాలూ లేవు. అయితే మనసు ఇలా కల్పనా జగత్తును ఒక ప్రక్క సృష్టిస్తూ , చూస్తూ, తాననుభవిస్తున్నా ననుకున్నప్పుడే కష్టసుఖాలన్నీ ఉద్భవిస్తున్నాయి. ఈ తాదాత్మ్యంతోనే అహంకారం ఉద్భవించి అనుభవిస్తున్నాననుకుంటూ అనుభవిస్తోంది. మనః కల్పిత భ్రమా జగత్తులోని సర్వానుభవాల్నీ, భ్రమాజన్య అహంకారం అనుభవిస్తున్నానని భ్రమపడుతోంది.

దేనినైనా చూస్తున్న సమయంలో నిజానికి ఏ అనుభవమూ లేదు. అహంకారంలో ఒక జ్ఞాపకంగా అనుభవం ముద్రింపబడుతుంది. "నేను చూసేను" అన్నది అనుభవం, ఒక జ్ఞాపకం, "నేను చూస్తున్నాను" ఇది చైతన్యపు నర్తనంలో ఒక మెరుపు మాత్రమే! ప్రతీ అనుభవమూ ఒక ఆలోచన, జ్ఞాపకం మాత్రమే. మదిలో మెదిలే ప్రతీ ఆలోచనా సూక్ష్మంగా ఉండే గతం యొక్క జ్ఞాపకాల వ్యక్త రూపమే. ఆలోచనా గుచ్ఛమే అహంకారం--గతానుభవాల, జ్ఞాపకాల, భావనా గుచ్ఛమే అహంకారం!!

ఆత్మానుభవంతో పరిపూర్ణడయిన యోగి నిత్య నూతనమయిన అనుభవాలలో జీవిస్తూ ఉంటాడు. గతించిన అనుభవాల జ్ఞాపకాలతో, సజీవంగా ఉన్న ప్రస్తుత క్షణాలను అతడు కలుషితం చేయడానికి ఇష్టపడడు. నిత్యనూతనంగా సర్వత్రా సర్వదా చైతన్యపు నర్తనాన్ని సంతోషంగా గుర్తిస్తూ జీవిస్తూ ఉంటాడు.

**శ్లో॥ న సుఖీ న చ వా దుఃఖీ న విరక్తో న సంగవాన్ ।**
**న ముముక్షుర్న వా ముక్తో న కించన్న చ కించన॥ 96.**

టీ॥ జ్ఞానీ = జ్ఞాని, సుఖీ = సుఖవంతుడు, న = కాడు, దుఃఖీ చ = దుఃఖితుడును, న = కాడు, విరక్తః = విరక్తుడును, న = కాడు, సంగవాన్ = సంగియు, న = కాడు, ముముక్షుః = ముముక్షువు, న = కాడు, ముక్తః = ముక్తుడును, న = కాడు, (తస్య = అతనికి), కించిత్ = ఏమియును, న = లేదు, కించన = ఏమియు, న = కాడు.

జ్ఞానికి సంతోషమూ లేదు, విచారమూ లేదు, రక్తి విరక్తులు ఉండవు, ముక్తుడూ కాడు, ముక్తికోసం కోరికా ఉండదు. అతడు ఇదీ కాడు, అదీ కాడు, అసలేదీ కాడు.

శ్లోకం తరువాత శ్లోకంలో, అనేక పదాలలో మహర్షి చక్కగా చెప్పుతూ ఉన్నారు, జీవన్ముక్తుని జీవనాన్నీ దృక్పథాన్నీ వర్ణించగలగడం అసాధ్యమే. ఉపాధుల నధిగమించిన ఏకత్వ దృష్టితో జ్ఞాని ప్రపంచాన్ని చూస్తూ ఉంటాడు. పరిమితమయిన బుద్ధి పరిధిలో నుండి బుద్ధిద్వారా ప్రపంచాన్ని చూసే సామాన్యులకు భావనాతీతమయిన ఆత్మానుభవం రేఖామాత్రంగా నయినా అర్థం కావడం అసంభవమే.

సుఖదుఃఖాలు మనస్సులో మనస్సుచే అనుభవింపబడే భావాలు. జీవన్ముక్తునికి సుఖదుఃఖాలు లేవు---అనడంలో అతడు తానే మనస్సునని భ్రమ పడడంలేదని అర్థం, మనస్సుతో తాదాత్మ్యం లేకపోవడంతో అతడు సుఖదుఃఖాల ననుభవించడం లేదు.

సంగభావం, విరక్తి----ఇవి బుద్ధి పరిధిలో నిర్ణయింపబడి అనుభవింప బడతాయి. బుద్ధి నేనుకాదనీ, బుద్ధి నాది కాదనీ స్పష్టంగా తెలుసుకున్న జ్ఞానికి రక్తీ విరక్తీ ఎలా ఉండగలవు?

ఆధ్యాత్మిక సాధనా దృష్టితో ముముక్షువనీ ముక్తుడనీ విభజించగలం, జీవన్ముక్తుడు కొత్తగా ముక్తి పొందనూ లేదు, ముక్తికోసం ఆరాటపడటమూ లేదు. ఇదివరకు అతనిలో ఉన్న భ్రమాజ్ఞానం తొలగిపోవడంతో తానెవరో తెలుసుకుని స్వస్థితిలో నిలబడి చూస్తున్న అతనికి స్పష్టంగా తెలుస్తోంది. తానెన్నడూ బంధింపబడలేదనీ, బంధించే రెండవదేదీ లేనేలేదనీ, ఉన్నదంతా తాను మాత్రమే ననీ!! ఈ స్థితిలో ముక్తి ఎవరికి? ముముక్షుత్వం ఎవరికి? స్వప్నంలో కారాగారం లో బంధింపబడి ఉండే మెలకువ వచ్చేక కూడా ఎవరైనా తప్పించుకునే ప్రయత్నం చేస్తారా?!!

"న కించిన్న చ కించన"--అతడు ఇదీకాడు, అదీ కాడు, అసలు ఏదీ కాడు -జ్ఞాని గురించి ఏమని చెప్పడమూ అబద్ధమే అవుతుంది. అతడేదీ కాడు,అన్నీ అతడే!

వేదాంత గ్రంథాలలో బృహద్ గ్రంథమనదగిన యోగవాశిష్ఠం కూడా జీవన్ముక్తుని వర్ణించడంలో తన అసమర్థతను స్పష్టంగా ఇలా ఒప్పుకుంటోంది.

తతస్తేజ స్తమోనిద్రా మోహాది పరివర్జితామ్
కామ ప్యవస్థామాస్థాయ విశ్రామ మనః క్షణమ్. (యోగవాశిష్ఠం)

మనస్సు తన అహంకార వ్యామోహాలనూ అజ్ఞానాన్నీ భ్రమలనూ ఎప్పుడు విడనాడుతుందో అప్పుడు, ఆ తక్షణమే అనిర్వచనీయమైన ఒక కేవలానంద స్థితిలో సహజంగా ఉంటుంది.

**శ్లో॥ విక్షేపేఽపి విక్షిప్త న స్సమాధౌ న సమాధిమాన్ ।**
**జాడ్యేఽపి న జడో ధన్యః పాండిత్యేఽపి న పండితః ॥97.**

టీ॥ ・ధన్యః = ధన్యుడగు జ్ఞాని, విక్షేపే అపి = విక్షేపము కలిగినదగుచుండగా, న విక్షిప్తః = విక్షిప్తుడు కాడు, సమాధౌ = సమాధియందున్నను, న సమాధీమాన్ = సమాధిగలవాడు కాడు, జాడ్యే అపి = జడత్వమునందును, న జడః = జడుడు కాడు, పాండిత్యే అపి = పాండిత్యము గలవాడైనను, న పండితః = పండితుడు కాడు.

**విక్షేపంలోకూడా విక్షేపాన్ని చూడడు జ్ఞాని. సమాధిలో ఉన్నా ధ్యానించడు, జడంగా కనిపించినా అతడు జడుడు కాడు, పండితునివలె కన్పించినా అతనికి పాండిత్యం లేదు.**

ఈ శైలి ఒక్క అష్టావక్ర మహర్షికే ప్రత్యేకమూ పరిమితమూ కాదు. అనిర్వచనీయమయిన దానిని వర్ణించబూనుకునే మహామహులందరూ ఇటువంటి పరస్పర విరుద్ధ భావసమన్వితమయిన భాషనే వాడవలసి వస్తుంది! అవర్ణనీయ మయిన దానిని వర్ణించడానికి ఇదొక్కటే మార్గం. దీనిని బుద్ధితో మాత్రమే అర్థం చేసుకునే వారందరికీ ఇది పరస్పర విరుద్ధమైన అసంబద్ధ ప్రలాపనగా అనిపించక మానదు. ఇది బుద్ధి అర్థం చేసుకోవలసిన విషయం కాదు. తాను మనశ్శరీరాలే అనే భ్రమను వీడిన సాధకుడు ఈ అనుభవంలో ఉండగలడు. అనుభవం మాత్రమే సత్యాన్ని అర్థవంతంగా ఆమోదయోగ్యంగా చేస్తుంది. శాస్త్రాలన్నీ మార్గాన్నీ నిర్దేశించి, లక్ష్యాన్ని సూచిస్తాయి. సాధకుడు శాస్త్రజ్ఞాన తేజంలో మార్గాన్ని సరిగ్గా చూసుకుంటూ, సూచనలను బుద్ధితో గ్రహించి, సూచింపబడిన లక్ష్యాన్ని తనంతట తాను చేరుకుని, ఆ అనుభవంలో మార్గమూ లక్ష్యమూ సాధకుడూ లేక పోవడాన్ని, తానుమాత్రమే ఉండడాన్నీ, గుర్తించి అపరోక్షానుభూతిలో నిలచి పోవాలి.

నిజం చెప్పాలంటే జ్ఞాని ఎలా కనిపిస్తాడో అదేదీ అతడు కాడు. ఆత్మ జ్ఞాని తన అనుభవంలో, నిత్య పరిణామశీలమైన ఈ సమస్త సృష్టినుండీ భిన్నంగా

ఉన్నట్టు స్పష్టంగా గుర్తిస్తాడు. అతని మానసిక స్థితులతోనే కాదు, శారీరిక ప్రారబ్ధంతో కూడా అతనికేవిధమయిన సంగమూ సంబంధమూ ఉండదు. మానసిక విక్షేపం, ధ్యానం, సమాధి, జడత్వం, పాండిత్యం, ఇవన్నీ కూడా మనోబుద్ధులకు చెందినవి మాత్రమే. మనోబుద్ధుల నధిగమించిన మహాశయునికి ఈ లక్షణాలకు సంబంధం ఎలా ఉంటుంది?

జీవన్ముక్తుని జీవితమూ, దృక్పథమూ అనంతానంద స్వరూపంగా మానవ మేథకు అందీ అందకుండా ఉంటున్నది. అందుకే అంత ఆకర్షణ, అదే జీవన పరమార్థంగా జీవితలక్ష్యంగా భావింపబడుతున్నది. ఆ లక్ష్యాన్ని రేఖా మాత్రంగానయినా సూచించలేని భాషాభావాల పరిమితత్వాన్ని గుర్తించిన అష్టావక్ర మహర్షి మనస్సు కవితా వేశంతో ఉన్మత్తమయి ఉప్పొంగి పోతున్నది. అర్హుడయిన శిష్యునికి అత్మీయమైన తన అనుభవాన్ని అక్షరరూపంలో అందించాలనే తపనా అందించలేని అసమర్థతనుండి జనించే ఆవేదనా కలసి కవితా సుధా ధారలై, తొంభైనాలుగవ శ్లోకంనుండి మహర్షి కలం ద్వారా జాలువారుతున్నాయి. ఆత్మీయమయిన మహర్షి అనుభవం సర్వమానవాళికీ జీవిత పరమార్థంగా, జీవన లక్ష్యంగా, ఈ అధ్యాయంలో నూరు శ్లోకాలనబడే అపురూప మణులుగా అందించబడ్డాయి. మానవమేధకే భాషా పరిమితికి అవధులై భాసించేయి.

**శ్లో॥ ముక్తో యథాస్థితి స్వస్థః కృతకర్తవ్య నిర్వృతః ।**
**సమస్సర్వత్ర వైతృష్ణ్యాత్ న స్మరత్యకృతం కృతమ్॥98.**

టీ॥ ముక్తః = ముక్తుడగు జ్ఞాని, యథాస్థితి స్వస్థః = కర్మానుసారముగా ప్రాప్త వస్తువు విషయమై స్వస్థ చిత్తముగల వాడును, కృతకర్తవ్య నిర్వృతః = చేయబడినట్టియు, చేయదగినట్టియు కార్యము విషయమై సంతుష్టిగల వాడును, సర్వత్ర = అంతట, సమః = సముడునై, వైతృష్ణ్యాత్ = తృష్ణా రహితుడైనందువలన, అకృతం = చేయబడనట్టిగాని, కృతం = చేయబడినట్టిగాని, కర్మ = కర్మను, న స్మరతి = స్మరింపడు.

సర్వకాల సర్వావస్థలలోనూ ఆత్మస్థితుడైన జీవన్ముక్తుడు, కర్మ ధర్మం, అనే భావాలనుండి ముక్తుడవుతున్నాడు. సర్వత్రా సమత్వబుద్ధితో చరిస్తూ, కోరికలు లేకపోవడంతో చేసిన వాటిని గురించి కానీ, చెయ్యాని వాటిని గురించి కానీ, విచారించడు.

ఈ అధ్యాయం అంతటా బోధింపబడిన భావమే ఇక్కడ మళ్ళీ నొక్కి

చెప్పబడుతోంది. దీని ప్రాముఖ్యతను శిష్యుడు గుర్తించలేక పోతాడేమో అని మళ్ళీ మళ్ళీ చెప్పుతున్నారు. జీవన్ముక్తునిలో "నేను" అనే అహంకారం కానీ, "నాది" అనే మమకారం కానీ ఉండవు. అహంకారంలేని కారణంగా అతను చెయ్యవలసిన కర్మలు గానీ, అతడివైన ధర్మాలు కానీ ఉండవు. "వైతృష్ణ్యాత్" కోరికలులేని----కారణంగా అతనిలో విచారం కూడా ఉండదు. అందుకే అతడు గతంలో సాధించిన వాటి గురించీ, చెయ్యని వాటి గురించీ సమీక్షించుకోడు. కర్మలను చెయ్యడం వలన కానీ, చెయ్యకపోవడం వల్ల కానీ అతని మనస్సెప్పు డూ అశాంతికి లోనుకాదు. గతం గురించి చింతించడు. భవిష్యత్తు గురించి ఆలోచించడు. నిత్యవర్తమానంలో సంతుష్టాంతరంగుడై జీవిస్తూ ఉంటాడు. అతడికతడే సాటియై ఏలక్షణాలచేతనూ వర్ణింపబడని విలక్షణ స్వరూపుడే అతడు.

శ్లో॥ న ప్రీయతే వంద్యమానో నింద్యమానో న కుప్యతి ।
నై వోద్విజతి మరణే జీవనే నాభినందతి ॥ 99.

టీ॥ జ్ఞానీ = జ్ఞాని, వంద్యమానః = స్తుతింపబడినవాడై, న ప్రీయతే = సంతోషించడు, నింద్యమానః = నిందింపబడినవాడై, న ప్రీయతే = సంతోషించడు, నింద్యమానః = నిందింపబడినవాడై, న కుప్యతి = కోపించడు, మరణే = మరణవిషయమై, న ఉద్విజతి = ఉద్వేగపడడు, జీవనే అపి = జీవించి యున్నందుకు, న అభినందతి = అభినందించడు.

జీవన్ముక్తుడు పొగడబడినప్పుడు పొంగిపోడు, దూషింపబడినప్పుడు విచారించడు. జీవితములో ఆనందాన్ని అనుభవించడు, మరణమంటే భయపడడు.

సత్ చిత్ ఆనందంగా జాగృతుడయిన జ్ఞాని, భౌతిక శరీరంలో నివసించడం లేదు. శరీరాన్నే అతనిలో చూస్తున్నాడు. అందుకే విషయి-విషయ సంబంధం సర్వద్వంద్వాలు అతనికి చెందవు. ప్రపంచం అతని నేవిధంగానూ స్పృశించదు. మానసికోద్రేకాల మహా తుఫానులతో, ఉరుములు మెరుపులతో కూడిన భౌతిక ప్రపంచం ఆ మహామనీషి పాదసన్నిధిలో భావనాతరంగాలుగా లీలామాత్రంగా, చీకటి వెలుగుల నీడల జాడలవలె నర్తిస్తూ ఉంటుంది. ఆ ప్రపంచంలో అణువులవలె నిలబడి మనం ఆ మహాత్ముని వాసస్థానాన్ని చూడబోతే అది ఆకాశహర్మ్యం వలె స్వర్గలోకాల కావల మన దృక్పథానికి సుదూరంగా ఉండిపోతుంది.

జీవితం వరంలా లభించిందని అతడనుకోడు. అతనిని నాశనం చేస్తామని బెదిరించినా మరణానికి భయపడడు! శాంతంగా సౌమ్యంగా జీవితాన్ని సాక్షిగా చూస్తూ ఉంటాడు. శరీరంలో అతని ఉనికి,అతని దృష్టిలో కేవలం లీలా మాత్రమే, సర్వజగత్తుకు ఆధార భూతమయిన నిజమయిన ఉనికిగా, సత్ గా తనను తాను చిత్ గా గుర్తించి ఆనందంగా ఉంటాడు.

ప్రభువు తానని తెలియు ప్రకృతి తానై తోచు
ప్రత్యగాత్మగ నిల్చు ప్రాణులందు
జ్ఞప్తిచేయును జ్ఞాన దాతయౌ గురువుగా
జిజ్ఞాసులకు కృపామూర్తి యగుచు
యేనామ మేరూప మెన్నిలోకాలైన
యెరుకకావలలేవు యెంచి చూడ
సత్ రూపమున వెలయు చిత్ రూపమున తెలియు
ఆనందమైయుండు నహరహమ్ము
త్యజించియిచి భావనల తన్ను తానుగ తెలియు
మనుజులే మహాత్ములగుదు రిలను
నిత్య సత్యము నరయు జాలదీ మనసంచు
తెలిసి శాంతినందు తెలివి తెలివి.

ఈ శ్లోకంలో వాడబడిన శైలి భగవద్గీతను స్ఫురణకి తెస్తోంది.
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా. (భగవద్గీత 2-57)
*దేనినీ అభినందించకుండా, ద్వేషించకుండా స్థితప్రజ్ఞుడై ఉంటాడు.*
లోకాన్నో ద్విజతే చ యః (భగవద్గీత 12-5) *ప్రపంచ దుఃఖానికి లోనుకాడు.*

**శ్లో॥ న ధావతి జనాకీర్ణం నారణ్య ముపశాంతధీః ।**
**యథా తథా యత్ర తత్ర సమ ఏవావతిష్ఠతే ॥ 100.**

**టీ॥** ఉపశాంతధీః = ఉపశాంత చిత్తముగల జ్ఞాని, జనాకీర్ణం = జనముతో వ్యాప్తమైన ప్రదేశమును గూర్చిగాని, అరణ్యం = అడవిని గూర్చిగాని, న ధావతి = పరుగిడడు, కిం తు = మరేమనగా, యత్ర తత్ర = ఎక్కడో ఒకచోట, యథా తథా = ఏదోయొక విధముగా, సమ ఏవ = సమభావముగలవాడై, అవతిష్ఠతే = ఉంటున్నాడు.

నిత్యశాంత తృప్త మానసుడయిన జ్ఞాని జన సమూహ మధ్యాన్ని కానీ, ఏకాంతారణ్య వాసాన్ని కానీ కోరుకోడు, ఏ ప్రదేశంలోనయినా ఏ పరిస్థితిలోనయినా అతడు సమత్వబుద్ధితో శాంతంగా ఉండగలడు.

భావాతీతమయిన ఆత్మానుభవంలో స్థితుడై ఉన్న కారణంగా అతని ఉపాధి ఏ పరిస్థితిలో ఉన్నా అతడు చలించడు. అతని పరిసరాలతనిని బాధించవు. పరిసరాలన్నీ అతని ఉనికివల్లే ప్రకాశిస్తూ ఉంటాయి. అందుకే అతడు జన సమూహం మధ్య ఉన్నా, హిమాలయ గంగాప్రవాహంలో ఉన్నా ఒకే విధంగా ఉండగలడు.

మనః పట్టణంలో నవనాగరిక భౌతికవస్తువులలో అద్భుతమయిన వాటి మధ్య ఉన్నప్పటికీ అతడు సదా ఆత్మని మాత్రమే గుర్తిస్తూ ఉంటాడు. ఏకాంత కాంతారాలలో, మహోన్నత హిమాలయ శిఖరాలలో కూడా అదేవిధంగా ఉంటాడు. అతనిలో విభేదాన్ని గుర్తించే బుద్ధే ఉండదు. ఏ పరిస్థితులలోనూ అతని అంత రంగికమయిన ఆత్మానుభవం చలించదు. సంతత సంతోషితాంత రంగంలో సత్ చిత్ ఆనంద స్వరూపంగా భాసిస్తూ ఉంటాడు.

భగవద్గీత మేఘ గంభీరవాణితో ఇలా అంటోంది "నిర్దోషం హి సమం బ్రహ్మ" (భగవద్గీత 5-19) నిష్కళంకమైన బ్రాహ్మీస్థితి సర్వత్ర సమానమే. అతడెక్కడ ఏపరిస్థితిలో ప్రారబ్ధానుగుణంగా (ఇందులో 21వశ్లోకం) ఉన్నప్పటికీ, అంతరంగంలో సమత్వంతో శాంతంగా సత్ చిత్ ఆనందంగా ఉండగలడు. ఈ చివరి శ్లోకంలో జనకుడు ఇదివరకు చెప్పిన ఒక శ్లోకం ప్రతిధ్వనిస్తోంది. (2-21)

అహో అద్భుతం! మహాజన సమూహమధ్యంలో కూడా నాకు రెండవ దేదీ కనిపించడం లేదు. ద్వైతభావమే లేదు, అరణ్యంలో ఉన్నట్టుగానే ఉంది. దేనిమీదనైనా నాకు కోరిక ఎలా ఉంటుంది?

అన్ని పరిస్థితులలోనూ జ్ఞాని ఏ విధంగా నిర్లిప్తంగా ఉదీసీనంగా ఉండ గలడో అన్నపూర్ణోపనిషత్తులోని ఒక శ్లోకం ఇలా స్పష్ట పరుస్తోంది.

విహరన్ జనతావృందే దేవకీర్తన పూజనైః
భేదాహ్లాదౌ న జానాతి ప్రతిబింబగతై రివ. (అన్నపూర్ణోపనిషత్తు 5-99)

*జనసమూహ మధ్యంలో అహ్లాద వినోదాలతో గడిపినా, దేవపూజా కీర్తనాదులలో గడిపినా అతని సుఖదుఃఖాలతనికి చెందవు. ప్రతిబింబ సూర్యునికి పరిసరాలెలా సంబంధించవో అదేవిధంగా జ్ఞానికి కూడా అతని శరీర సుఖ దుఃఖాలు సంబంధించి ఉండవు.*

నీటిలో సూర్య ప్రతిబింబం నాట్యం చెయ్యవచ్చు, విరిగి ముక్కలుగా అయిపోవచ్చు, అయినా ఆకాశంలోని సూర్యునికి ఏ హానీ జరగడం లేదు. అసలతడు స్పృశింపబడనే లేదు. ఇదే విధంగా జ్ఞాని స్వస్వరూపమయిన శుద్ధ అనంతచైతన్యం, అతని అహంకారానుభవాలచే స్పృశింపబడదు. చైతన్య ప్రకాశపు ప్రతిబింబతుల్యమే ఆ అహంకారం! జ్ఞానిలో అహంకారం ఉండదు. కాబట్టి బాహ్యస్థితిగతు లతనిని స్పృశించవు, స్పృశించలేవు.

...

## అధ్యాయం-19

# ఆత్మానుభవం-అఖండానందైక రసరూపం

జీవిత లక్ష్యాన్ని, మేఘగంభీర రవంతో, క్రిందటి అధ్యాయంలో మహర్షి నిర్దేశించారు. జీవన్ముక్తుని జీవితాన్నీ జీవన దృక్పథాన్నీ మానవ మేధా భాష కలసి వర్ణించగలిగిన అవధులమేరకు, అద్భుతంగా చిత్రించారు. మహామనీషి, ఆత్మానుభవ పరిపూర్ణుడూ అయిన అష్టావక్ర మహర్షి, అర్హుడైన శిష్యునికి అందించాలనే తపనతో కవితావేశంతో వర్ణించేటప్పుడు సామాన్యుల మెప్పుదలను ఆశించడంలేదు. అటువంటి మహర్షులు కేవలం మాటలతో చిత్రించాలని మాత్రమే అనుకోరు. వారి అనుభవాన్ని శిష్యుల అనుభవంగా రూపించాలని దృఢసంకల్పంతో ప్రయత్నిస్తారు.

మానసికమయిన సంసిద్ధత లేకపోవడంవల్లనే సాధకులంత సత్య దర్శనాన్ని, సత్యత్వానుభవాన్ని వెంటనే పొందలేక పోతున్నారు. ఉత్తమాధి కారులూ సంసిద్ధులూ అయిన జనకునివంటి శిష్యులు మాత్రం గురువుల ఉపదేశాలను సూచనలుగా గ్రహించి ఆ మార్గం వెంట పయనించి, సూచింప బడిన లక్ష్యాన్ని వెంటనే అందుకోగలుగుతారు. ఈ విధంగా తత్త్వరహస్యా లను వింటూ అందులో సూచింపబడిన లక్ష్యాన్ని వెంటనే అందుకోగలగ డాన్ని శ్రవణం అంటారు. ఉపనిషత్తులన్నీ ఈ శ్రవణం యొక్క విశిష్టతనూ సమర్థనీయమైన సహాయాన్ని బహుధా సర్వదా ప్రశంసిస్తూనే ఉన్నాయి.

చిత్తశుద్ధీ సంసిద్ధతా కలిగిన ఉత్తమ వేదాంత విద్యార్థికి శ్రద్ధగా శ్రవణం చేస్తుండగానే లక్ష్యం స్ఫురించి ఆత్మానుభవం ప్రాప్తిస్తుంది, అనుభవైకవేద్య మౌతుంది. జనక రాజర్షి తన గురువైన అష్టావక్ర మహర్షుల ప్రవచనాన్ని విని, వింటూనే ఆ అనుభవాన్నందుకోగలిగేరు. అందుకు నిదర్శనంగా ఈ అధ్యాయంలో తన అనుభవాన్ని ఆనందాతిరేకంలో అక్షరా లుగా మలచడానికి ప్రయత్నిస్తున్నారు. అనుభవింపబడిన ఆనందాన్ని వ్యక్తం చెయ్యడం ఆనందానుభవాన్ని దృఢం చేసుకోవడమే. ఆత్మతృప్తితో

గురుదేవుల కానంద హేతువుగా జనకుడు వర్ణించబోతున్నాడు. వేదాంత శ్రవణానికి నిజమైన ఫలం అపరోక్షానుభూతిలో అనుభూతమవుతుంది.

క్రిందటి అధ్యాయాన్ని జనకునివలె శ్రద్ధగావిని ఏ సాధక శ్రేష్ఠుని కయినా ఈ ఫలం కరతలామలకమే. ఇక్కడ ఎనిమిది శ్లోకాలలో ఆత్మానుభూతిని అపార శాంతస్వరూపాన్ని, అఖండానందైక రసరూపంగా జనకులు వర్ణిస్తున్నారు.

చతుర్విధ పురుషార్థాల కతీతంగా (ధర్మ, అర్థ, కామ, మోక్షాలు), సర్వ తత్త్వశాస్త్రాల ఊహాగానాల కావలగా,దేశకాల సిద్ధాంతాల నధిగమించి, జీవన మరణాల కతీతంగా అనంతానందమయమయిన ఆత్మతత్త్వం అఖండానందైక రసరూపంగా అద్వితీయ ప్రకాశంతో విరాజిల్లుతూ ఉంటుంది అని జనకుడు ఈ అధ్యాయంలో అంటున్నారు.

తేజోబిందు ఉపనిషత్తు ఇలా ఉద్ఘోషిస్తున్నది,
యేషాం వృత్తిః సమావృద్ధా పరిపక్వా చ సా పునః
తే వై సద్ బ్రహ్మతాం ప్రాప్తా నేతరే శబ్దవాదినః.

(తేజోబిందూపనిషత్తు 2-45)

*మనస్సును శుద్ధంచేసుకుని బుద్ధిపరంగా శాంతంగా ఆత్మానుభవానికి సిద్ధంగా ఉన్నవారు మాత్రమే శుద్ధమైన బ్రహ్మానుభవాన్ని పొందగలరు. శాస్త్రాల నుల్లేఖిస్తూ వాగాడంబరంతో శాస్త్రార్థాలను విశ్లేషించేవారికి ఎన్నటికీ లభ్యం కాదు.*

**జనక ఉవాచ :-**

**శ్లో॥ తత్త్వవిజ్ఞాన సందంశం ఆదాయ హృదయోదరాత్ ।**
**నానావిధ పరామర్శ శల్యోద్ధారః కృతోమయా ॥ 1.**

**టీ॥** భవతః = మీనుండి, తత్త్వవిజ్ఞానసందంశం = తత్త్వవిజ్ఞానమనే పట్టకారును, ఆదాయ = పొంది, హృదయోదరాత్ = హృదయగర్భమునుండి, నానావిధ పరామర్శ శల్యోద్ధారః = అనేక ప్రకారములగు సందేహ వివాద కంటకోద్ధరణము(తీసివేయుట), మయా = నాచేత, కృతః = చేయబడినది.

**సత్యాన్ని గురించిన జ్ఞానం అనే శ్రావణంతో నా హృదయపు లోతులలో ముళ్ళవలె ఉన్న భ్రమాభావాలను తొలగించగలిగేను.**

"ఏకం సత్ విప్రాః బహుధావదన్తి" (వేదాలలో) ఉన్నసత్యం ఒకటే అయినప్పటికీ ఎంతోమంది మహర్షులు ఎన్నో విధాలుగా చెపుతున్నారు. మన

మహర్షులంతా సత్యాన్వేషణచేసే సాధకులందరకు శాస్త్రాన్ని బోధించి శిష్యు లకా స్వరూపానుభవాన్ని అందించాలనే ప్రయత్నించేరు. ప్రతి మహర్షీ కూడా రకరకరముల దర్శన గ్రంధాల నుపయోగించి తన శిష్యుల మనఃస్థితీ, ధీశక్తీ, సంసిద్ధతా, అర్హతా గురించి, వారికనువైన ప్రత్యేక పద్ధతిలో బోధించ బూనడం వలననే ఈ వైరుధ్యం వైవిధ్యం కనిపిస్తున్నాయి. పాశ్చాత్య తత్త్వవేత్తలు తమ పేరుతో కొత్తసిద్ధాంతాలను సృష్టించడంలోనూ పాత సిద్ధాంతాలకు కొత్తభాష్యం చెప్పడంలో తమ ప్రత్యేకత నిలబెట్టుకోవడంలోనూ మాత్రమే శ్రద్ధ వహించేరు.

ప్రతి మహర్షీ కూడా శాస్త్రహృదయాన్ని చక్కని ప్రవచనం ద్వారా, మహోన్నతమయిన తార్కిక దృష్టితో, వారి ప్రత్యేక మేధా దీప్తితో అనితర సాధ్యంగా సత్యాన్ని ప్రవచించేరు. శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడైన గురువు లభ్యం కానప్పుడు, దొరికినను వాసనలవలనను, సుకృతం, లేకపోవుటచేతను ఆ అధ్యయనంలోని అవగాహన స్థితులందక పోవుటచేతను, స్వతంత్రముగ తీక్షణమైన బుద్ధితో శాస్త్రి హృదయాన్ని అర్థం చేసుకొనుటకు కొందరు ప్రయత్నిస్తారు. అట్టి వారు చేయ వలసిన యోగసాధనపట్ల నిర్లక్ష్యం చూపుతూ, దర్శనముల సహాయంతో బుద్ధి పరమైన ఆనందం కోసం ఈ వివిధ శాస్త్రచర్చా విధానాలనూ అధ్యయనం చేస్తే వారి మనస్సులలో అనేక రకాలయిన సందేహాలుదయించి అశాంతీ అసంతృప్తి చోటు చేసుకునే అవకాశం ఉంది. అందుకే ఆచార్య శంకరులు తమ వివేకచూడామణి లో సాధకులను ఇలా హెచ్చరించారు.

> శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణ కారణం
> అతః ప్రయత్నాత్ జ్ఞాతవ్యం తత్త్వజ్ఞై స్తత్త్వమాత్మనః
>
> (వివేకచూడామణి-60)

*తత్త్వశాస్త్ర గ్రంధాలు శబ్దజాలంతోనిండిన మహారణ్యాలవంటివి. అందులో చరించే మనస్సు దారితప్పి అరణ్యమధ్యంలో చిక్కుపడిపోయే ప్రమాదం ఉంది. కాబట్టి చిత్తశుద్ధికల సాధకులు నిష్ఠతో ఆత్మతత్త్వాన్ని సరైన పద్ధతిలో తెలుసుకొని అనుభవంలోకి తెచ్చుకొనే ప్రయత్నం చేయాలి.*

మనస్సు యొక్క ఈ వివిధ విభ్రమాలూ అపరోక్షానుభూతిలో మాత్రమే అంతమవుతాయి. జనకరాజర్షి హృదయపూర్వకంగా కృతజ్ఞతా భావంతో తన సర్వసందేహాలూ తొలగిపోయాయని ఒప్పుకుంటున్నారు. అపరోక్షానుభూతి అనే శ్రావణంతో మన హృదయపు లోతులలో దాగి ఉన్న సందేహాలనబడే కంటకాలను నిర్మూలించడం సాధ్యమవుతుంది.

వివిధ దర్శన గ్రంథాధ్యయనం మనకు మార్గాన్ని చూపిస్తుంది. అయితే ఆ జ్ఞానం ఆత్మానుభవాన్ని మాత్రం సాధించలేదు. అందుకే ఉపనిషత్తులు మనలను సదా హెచ్చరిస్తూనే ఉంటాయి. కేవల దర్శనాధ్యయనమూ, అనేక మహాత్ముల దగ్గర శ్రవణమూ, బాటని మాత్రమే చూపిస్తాయి. ఆ దారిన నడచి గమ్యం చేరుకోవాలనే కోరికా దీక్షా మనకు ఉన్నప్పుడు మాత్రమే ఆత్మానుభవం సిద్ధిస్తుంది.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునాశ్రుతేన.
(కఠోపనిషత్తు-1-2-23)

*వేదాధ్యయనం వల్లనూ, మేధా విభవం వల్లనూ, బహుధా శ్రవణం వల్లనూ ఈ ఆత్మ లభ్యం కాదు. కోరికతో దీక్షతో మనంతట మనం ప్రయత్నించి సాధించాలి.*

జీవితంలోని అనేక బాధలనుండీ భ్రమలనుండీ ముక్తిని ప్రసాదించిన ఆత్మానుభవానికి కారణమయిన గురువు మీద ప్రతీ శిష్యునికీ తప్పక ఉండే సహజమైన కృతజ్ఞతా భావమే ఈ శ్లోకం అంతటా ప్రతిధ్వనిస్తోంది. బృహదారణ్యకోపనిషత్తులోనూ,ప్రశ్నోపనిషత్తులోనూ కూడా ఇటువంటి భావాలు వ్యక్తమవడం చూడవచ్చు.

".......త్వం హి నః పితా యోస్మాకం అవిద్యాయాః పరం పారం తారయసీతి"
(ప్రశ్నోపనిషత్తు 6-8)

*ప్రగాఢమయిన అజ్ఞానం అనే మహా సముద్రాన్ని దాటడానికి సహాయపడిన మీరే మాకు తండ్రి.*

**శ్లో॥క్వ ధర్మః క్వ చ వా కామః క్వచార్థః క్వ వివేకితా ।**
**క్వ ద్వైతం క్వచ వాఽద్వైతం స్వమహిమ్ని స్థితస్య మే॥2**

**టీ॥** స్వమహిమ్ని = స్వకీయమహిమయందు, స్థితస్య = ఉంటున్న, మే = నాకు, ధర్మః = ధర్మము, క్వ = ఎక్కడ, కామః = కామము, క్వ = ఎక్కడ, అర్థః = అర్థము, క్వ = ఎక్కడ, వివేకితా = వివేకముండుట, క్వ = ఎక్కడ, ద్వైతం వా = ద్వైతముగాని, అద్వైతం = అద్వైతముగాని, క్వ = ఎక్కడ.

**నా స్వస్థితిలో స్థితికలిగి ఉన్న నాకు ధర్మం ఎక్కడ? కోరికలెక్కడ? ఐశ్వర్యం ఎక్కడ? వివేకం ఎక్కడ? ద్వైతం ఎక్కడ? అద్వైతం ఎక్కడ?**

అద్వయమయిన అనంతాత్మ చైతన్యస్వరూపంగా తన్నుతాను గుర్తించిన జనకుడు, తనకంటే భిన్నంగా రెండవదేదీ లేదనీ, జీవితంలో సాధించవలసిన

ధర్మ, అర్థ, కామ, మోక్షాలు అర్థరహితంగా కనిపిస్తున్నాయనీ అంటున్నారు. తన స్వరూపజ్ఞానం నుండి అహంకార యుక్తమయిన తన చర్యలు కూడా వేరే లేవు కాబట్టి వివేకంయొక్క ఆవశ్యకతే లేదనీ అంటున్నారు. అనేకత్వాన్ని గుర్తిస్తూ, అనేక బాధలకూ ఆందోళనలకూ లోనవుతున్న సాధకులు మనస్సును శాంతపరచ డానికి ఉపనిషద్ ఋషులు వారిదృష్టిని స్వస్వరూపంవైపు మళ్ళించడానికి ప్రయత్నించారు. భ్రమాజనిత ద్వైతానుభవాలదృష్ట్యా వాడిన ఈ అద్వైతజ్ఞానం స్వరూపజ్ఞానానుభవంలో పర్యవశించినపుడు ఈ ద్వైతాద్వైతములకు ఉనికి ఎక్కడ? అద్వైతం స్వరూపమే, నిజానికి ఈ అద్వైత భావంకూడా ఆత్మదృష్ట్యా భ్రమే అయినప్పటికీ అది మాత్రమే అనేకత్వాన్ని దర్శించి అశాంతికి లోనవు తున్న సాధకులు మనస్సును శాంతపరచగలదని మన మహర్షులు గుర్తించే అందుకు ప్రోత్సహించారు. అనేకత్వం నుండి ఏకత్వంవైపు మళ్ళిన మనస్సు క్రమంగా ఆ ఏకత్వ భావనను కూడా అధిగమించ గలిగినప్పుడు సాధకులు భావనాతీతమయిన ఆత్మానుభవంలో ఉంటారు. ఆ స్థితి దృష్ట్యా అద్వైతభావం కూడా అర్థ రహితమేననీ, భావాలన్నీ పరిమితమయిన చైతన్య నర్తనా రూపాలనీ స్పష్టంగా గ్రహిస్తారు. ఆత్మమాత్రమే ఉంది. దానిని ఏ విధంగా నిర్వచింప బూనినా అది పరిమితమయిన అసత్యమే అవుతుంది. ఈ విషయాన్నే అవధూత గీత ఇలా వివరిస్తున్నది.

అద్వైతం కేచిదిచ్ఛన్తి ద్వైతమిచ్ఛన్తి చాపరే ।
సమం తత్త్వం న విందంతి ద్వైతాద్వైత వివర్జితమ్. (అవధూతగీత 1-35)

*కొంతమంది ద్వైతాన్ని ఇష్టపడతారు, మరికొంతమంది అద్వైతమే సత్యం అని అంటారు. ఇద్దరూ కూడా సత్యాన్ని చూడడం లేదు. అసలైన ఆత్మతత్త్వం ద్వైతమూ కాదు, అద్వైతమూ కాదు, కేవలం అదే ఉంది.*

ఛాందోగ్యోపనిషత్తులో ఈ ద్వైతాద్వైతాల కతీతమయిన స్థితిని భూమ అని అంటారు. ఈ భూమ ఎక్కడ ఉంటుంది? అని ప్రశ్నిస్తూ జవాబుగా తన మహిమలో తానే స్థితమై ఉంది, నిజానికి అది మహిమే కాదు అని చెబుతుంది.

"యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమాయ యత్ర అన్యత్ పశ్యతి అన్యత్ శృణోతి అన్యత్ విజానాతి తదల్పం యో వై భూమా తదమృతం అథ తదల్పం యో వై భూమా తదమృతం అథ తదల్పం తన్మర్త్యం స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వేమహిమ్ని యది వా న మహిమ్నీతి"

ఎక్కడైతే రెండవదిగా ఏదీ గుర్తింపబడదో, రెండవదిగా ఏదీ వినబడలో అనంతంగా ఒకటే ఉంటుందో అదే భూమ. ఎక్కడైతే రెండవది కనిపిస్తుందో, రెండవది వినిపిస్తుందో, రెండవది తెలియబడుతుందో అది అల్పము. అనంతమైనది భూమ అదే అమృతత్త్వం. పరిమితమైనది అల్పము, అదే మర్త్యము అయితే భూమ ఎక్కడ ఉన్నట్టు? అది తన స్వ మహిమలో స్థితమై ఉంది, నిజానికి దానిని మహిమ అని కూడా అనలేము.

## శ్లో॥ క్వ భూతం క్వ భవిష్యద్వా వర్తమానమపి క్వ వా ।
## క్వ దేశః క్వ చ వా నిత్యం స్వమహిమ్ని స్థితస్య మే॥3.

**టీ॥** నిత్యం = ఎల్లప్పుడు, స్వ మహిమ్ని = తన మహిమయందే, స్థితస్య = ఉన్నటువంటి, మే = నాకు, భూతం = భూతకాలం, క్వ = ఎక్కడ, భవిష్యత్ = భవిష్యత్కాలము, క్వ = ఎక్కడ, వర్తమానం అపి వా = వర్తమాన కాలమైనను, క్వ = ఎక్కడ, దేశః = దేశము, క్వ = ఎక్కడ.

**భూతకాలం ఎక్కడ? భవిష్యత్తు ఎక్కడ ఉంది? అసలు వర్తమానం ఎక్కడ? అవకాశం ఎక్కడ ఉంది? నిత్యత్వం మాత్రము ఎక్కడ ఉంది? నా మహిమతో నేను మాత్రమే ఉన్నాను?**

దేశం కాలం మనోబుద్ధుల భావాలు మాత్రమే, సుషుప్తిలోవలె మనో బుద్ధులు పనిచెయ్యనిచోట దేశం కాలం అనుభవంలోనికిరావు. ఆకాశము దూర మూ వలెనే కాలము కాలనిర్ణయమూ కూడా మానవ మేధా కల్పనలే.

ఆకాశంలో రెండు నిర్ణీత బిందువుల మధ్య మాత్రమే దూరాన్ని కొలవడం సాధ్యమవుతుంది. ఉదాహరణ "అ" "ఆ" అనే రెండు బిందువులను తీసుకుంటే వాటిమధ్య దూరం ఎంతో కొంత అని నిర్ధారణగా చెప్పవచ్చును. అయితే ఇలా దూరాన్ని కొలవడం రెండవ బిందువు ఉన్నప్పుడు మాత్రమే సాధ్యం. ఒకే బిందువు "అ" అన్నప్పుడు అక్కడ దూరం. దూరపు కొలత ప్రమాణాలకు అర్థమే ఉండదు.

ఇదే విధంగా కాలాన్ని రెండు అనుభవాల మధ్యగల కాలం దృష్టితో కొలవగలుగుతున్నాము. అనుభవం ఆలోచనతో గుర్తింపబడుతుంది. కాబట్టి క్లుప్తంగా చెప్పాలంటే రెండు ఆలోచనల మధ్యగల వ్యవధే కాలపరిమాణంగా గుర్తింపబడుతోంది. ఒకే అనుభవం ఉండి రెండవ అనుభవమే లేనప్పుడు, ఒకే ఆలోచనే ఉన్నప్పుడు, కాలమూ కాల పరిమాణాలూ అర్థరహితాలే.

(మనస్సు నధిగమించి నిలవగలగిన సాధకునిలో ఆలోచనలే ఉండవు. కాబట్టి అతనిలో ఆకాశం కాలం అనబడే సిద్ధాంతాల ఉనికికి ఆస్కారమే ఉండదు. భావనాతీతంగా, భావనాధారమైన చైతన్యంగా తన్ను తాను గుర్తిస్తున్నప్పుడు, ఆ స్థితిలో భావాలతో గుర్తింపబడే దేశకాలాలు ఉండనే ఉండవు.)

కాలాన్ని గుర్తించే మనస్సులోనే కాలపరమైన భూత భవిష్యత్ వర్త మానాలు గుర్తింపబడతాయి. ఆత్మలో ఈ విభాగాలు ఉండజాలవు. ఈ విధంగా దేశకాలాల సిద్ధాంతాల కలీతంగా నిలవగలిగినప్పుడు అట్టి జ్ఞాని నిత్యత్వం అర్థ విహీన మవుతుంది. ఆగని కాలప్రవాహపు గుర్తింపే నిత్యత్వం, ఆలోచనలే లేని స్థితిలో నిత్యత్వం అర్థరహితం కాదా?

మనస్సు నధిగమించిన జనకరాజర్షి, తన అనుభవంతో ద్వంద్వమయ మయిన ప్రపంచం లేనేలేదనీ, సర్వనామ రూపాలూ దేశకాల సిద్ధాంతాలతో తాదాత్మ్యం చెందిన మనస్సులో మాత్రమే ఉండగలవనీ స్పష్టంగా చెప్తున్నారు.

**శ్లో॥ క్వచాత్మా క్వ చ వా నాత్మా క్వ శుభం క్వాశుభం తథా।**
**క్వచింతా క్వచ వాऽచింతా స్వమహిమ్ని స్థితస్య మే॥4.**

టీ॥ స్వమహిమ్ని = నా మహిమయందే, స్థితస్య = ఉంటున్నటివంటి, మే = నాకు, ఆత్మా = ఆత్మ, క్వ = ఎక్కడ, వా = లేక, అనాత్మా = అనాత్మ, క్వ = ఎక్కడ, శుభం = శుభము, క్వ = ఎక్కడ, అశుభం = అశుభము, క్వ = ఎక్కడ, చింతా = విచారము, క్వ = ఎక్కడ, అచింతా = అచింత, క్వ = ఎక్కడ.

ఆత్మ ఏది? అనాత్మ ఎక్కడ ఉంది? ఇదేవిధంగా మంచి చెడులు సుఖదుఃఖాలు ఎక్కడ ఉన్నాయి? నా మహిమతో నేను మాత్రమే ఉన్నాను?

స్వప్నంనుండి మెలకువరాగానే ఆ స్వప్న ప్రపంచ సంబంధమయిన విషయీ-విషయాలూ కూడా జాగ్రదవస్థలోని వ్యక్తి మనస్సులో పూర్తిగా విలీనమయి పోతాయి. ఇదేవిధంగా మన ప్రస్తుత జాగ్రదవస్థనుండి ఆత్మతత్త్వం లోనికి జాగృత మయినప్పుడు, ఆ స్థితిలో ఆ అనుభవంలో, ఆత్మ అనాత్మల విభేదం ఉంది. మంచి చెడుల ప్రత్యేకత ఉండదు. సుఖదుఃఖాలు విడివిడిగా ఉండనే ఉండవు. ఇవన్నీ మానవ మనస్సులో మాత్రమే ఉద్భవించి, గుర్తింపబడి, నశిస్తుంటాయి. అటువంటి మనస్సు నధిగమించగానే ఆత్మ ఆత్మగా కేవలంగా ఉంటుంది. ఈ మనో భ్రమలూ భావాలూ అన్నీ అదృశ్యమయి పోతాయి. అని జనకులు అంటున్నారు.

సంస్కృత పదాలయిన"చింతా" "అచింతా" అనేవి ఇక్కడ సుఖదుఃఖాలుగా అనువదింపబడ్డాయి. కొందరు వ్యాఖ్యాతలు ఈ పదాలను ధ్యానము ధ్యానం చెయ్యక పోవడం అనే అర్థాలలో కూడా వాడినారు. నిజానికి ఈ అర్థాలు కూడా స్వీకరింపదగినవే. భ్రమాజన్య జ్ఞానంతో ప్రపంచాన్ని చూసే అహంకారం, శాస్త్రాధ్యయన జ్ఞానబలంతో మనస్సు నధిగమించాలని ప్రయత్నించేటప్పుడు, ధ్యానం చేస్తూ ఏకాగ్రంగా ఉంటుంది. ఇదే అహంకారం బాహ్యవిషయాలచే ఆకర్షింపబడి వాటి ప్రలోభానికీ ప్రభావానికీ గురయినప్పుడు ధ్యానరహితంగా, అనేకాలోచనలతో అసంతృప్తిగా అశాంతిగా అలజడితో నిండి ఉంటుంది. ఈ రెండు మానసిక స్థితులూ కూడా మనస్సు యొక్క అంతర్ముఖ, బాహ్యాభిముఖ ప్రవృత్తులపై ఆధారపడి ఉంటాయి. మనః ప్రవృత్తికీ వృత్తులకూ (భావాలకూ) అవినాభావ సంబంధం ఉంది. మనస్సు నధిగమించిన స్థితిలో సర్వవృత్తులూ అదృశ్యమయి పోతాయి. కాబట్టి ఆ స్థితిలో ధ్యానం కాని, ధ్యానం ఉండక పోవడం కానీ రెండు సమానమే. అర్థరహితాలే!

**శ్లో॥క్వ స్వప్నః క్వ సుషుప్తిర్వా క్వ చ జాగరణం తథా ।**
**క్వ తురీయం భయం వాఽపి స్వమహిమ్ని స్థితస్య మే॥5.**

టీ॥ స్వమహిమ్ని = స్వకీయ మహిమయందు, స్థితస్య = ఉంటున్న, మే = నాకు, స్వప్నః = స్వప్నము, క్వ = ఎక్కడ, సుషుప్తిః వా = సుషుప్తి గాని, క్వ = ఎక్కడ, తథా = అట్లే, జాగరణం = జాగ్రదవస్థ, క్వ = ఎక్కడ, తురీయం అపి = తురీయముగానీ, భయం = భయముగాని, క్వ = ఎక్కడ?

**స్వ. మహిలో స్థితుడయిన నాకు స్వప్నం ఎక్కడ? సుషుప్తి ఏది? జాగ్రదవస్థ ఏది? తురీయం కూడా ఎలా ఉంటుంది? భయం ఎలా ఉంటుంది? దేనిని గూర్చి?**

విజ్ఞానశాస్త్రీ సహజమయిన మేధానైశిత్యంతో, తత్త్వశాస్త్రానుగుణమయిన భావగాంభీర్యంతో, మాండూక్యోపనిషత్తు మొదటిసారిగా వ్యక్తియొక్క జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలను పరిశీలించి నిర్వచించింది. విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, స్థూల, 'సూక్ష్మ, కారణ శరీరాలతో ఈ మూడవస్థలకు ఆలంబనగా సాక్షులుగా ఉంటూ వ్యక్తి జీవితంలోని మూడవస్థలుగా భావింపబడుతూ ఉంటారు. వీటన్నిటినీ అధిగమించిన అహంకారం ఆత్మచైతన్యంగా కేవలంగా నిలుస్తుంది. మిగిలిన మూడవస్థల దృష్ట్యా ఈ స్థితిని నాలుగవ అవస్థగా తురీయంగా గుర్తిస్తు-

న్నారు. తనకు తెలిసిన విషయ పరిజ్ఞానంతో మాత్రమే తెలియని దానిని గూర్చి తెలుసుకునే ప్రయత్నం చేయగలము. అందుకే మాండూక్యోపనిషత్తులో ఆ మహాఋషి, మనకు తెలిసిన మూడవస్థల దృష్ట్యా భావాతీతమయిన సత్యస్థితిని నాలుగవదైన తురీయావస్థగా అక్షరాకృతిలో మన అంతరంగానికి అందించ గలిగేరు.

స్వప్నం నుండి మేలుకోగానే స్వాప్నికుడు కూడా అతని ప్రపంచమూ ఏ విధంగా అదృశ్యమయి పోతాయో అదే విధంగా ఆత్మతత్త్వమైన తురీయంలో నిలవగానే మిగిలిన మూడవస్థలు బాధితమయి పోతాయి. ఆ స్థితిలో, అందుకే దానిని నాలుగవ "అవస్థ" అని అనలేము. భావాతీతమయిన ఆత్మ చైతన్యాను భవం మాత్రమే అక్కడ కేవలంగా ఉంటుంది.

ఆత్మానుభవనిష్ఠుడయిన జనకుడు, అందుకే, ఆ మూడు అవస్థలూ తనకు లేవని చెపుతూ, తురీయం ప్రత్యేకమైన అవస్థకాదని ఆపాతతః జ్ఞానం సంపాదించిన మందమాధికారులు మూడవస్థల్లో వుంటూ వాటికతీతంగా సాక్షిగా ఉన్న ఆత్మ తురీయమని, శాస్త్రం చెప్పినప్పుడు అది కూడా అవస్థ అని అర్థం చేసుకుంటారేమోనని ఆత్మను తురీయంగా చెప్పి ఆ పదాన్ని ఉపసంహరించు కుంటూ "తురీయం" ఎక్కడ అని అడిగేరు.

అహంకారం కోరికలచే ఆవరింపబడి ఉంటుంది. అందుకే అన్ని రకాల భయాలూ అహంకారానికే ఉంటాయి. "ద్వితీయాత్ వై భయం భవతి"-- రెండవ దానిని చూచినప్పుడే భయం ఉంటుంది అని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తున్నాయి. అనంతమైన ఆత్మ చైతన్యంలోనికి జాగృతుడయిన జీవన్ముక్తునికి, సర్వత్రా బాహ్యాభ్యంతరాలలో తనస్వరూపం మాత్రమే కనిపిస్తూ ఉంటుంది. అందుకే జనకులు "నాకు భయం మాత్రం ఎలా ఉంటుంది?" అని అడుగుతున్నారు.

సత్యాన్ని సమగ్రంగా అర్థం చేసుకుని నిర్భయంగా నిర్వచించగల గడంలో అవధూత గీతకు సాటిరాగలది మరొకటి ఉండదనడం అతిశయోక్తి కాదు.

స్థానత్రయం యది చ నేతి కథం తురీయం
కాలత్రయం యది చ నేతి కథం దిశశ్చ
శాంతం పదం హి పరమం పరమార్థ తత్త్వం
జ్ఞానామృతం సమరసం గగనోపమోహమ్. (అవధూతగీత 3-20)

*మూడవస్థలూ లేనప్పుడు నాలుగవదిగా తురీయం ఎలా ఉంటుంది? (భూత,*

*భవిష్యద్, వర్తమానాలనబడే) కాలత్రయ విభాగం లేనిచోట దేశం ఎలా ఉండగలదు? పరమాత్మ పదం----పరమ శాంత స్వరూపం, నేను అమృతత్త్వాన్ని, జ్ఞానాన్ని, ఆకాశంవలె స్వచ్ఛంగా పరిణామ రహితంగా నేనే ఉంటాను.*

**శ్లో॥క్వదూరం క్వసమీపం వా బాహ్యం క్వాభ్యంతరం క్వ వా।**
**క్వ స్థూలం క్వ చ వా సూక్ష్మం స్వమహిమ్ని స్థితస్య మే॥6**

టీ॥ స్వమహిమ్ని = స్వ మహిమయందు, స్థితస్య = ఉంటున్నటువంటి, మే = నాకు, దూరం = దూరము, క్వ=ఎక్కడ, సమీపం = సమీపము, క్వ = ఎక్కడ, బాహ్యం = బాహ్యము, క్వ = ఎక్కడ, అభ్యంతరం = అభ్యంతరము, క్వ = ఎక్కడ, స్థూలం = స్థూలము, క్వ = ఎక్కడ, సూక్ష్మం = సూక్ష్మము, క్వ = ఎక్కడ?

**నా మహిమలో స్థితుడయిన నాకు దూరం ఏమిటి? ఏది దగ్గర? ఏది స్థూలం? సూక్ష్మం ఎక్కడ?**

ద్వంద్వాలతో నిండిన ప్రపంచాన్ని బాహ్యాభిముఖ మనస్సుతో చూసినప్పుడు మాత్రమే ఈ తేడాలన్నీ గుర్తింపబడతాయి. సత్యాన్ని గుర్తించని మనస్సు మాత్రమే బాహ్యాభిముఖమయి శాంతిని అన్వేషిస్తుంది. తమోగుణం బుద్ధిలోని వివేకాన్ని మందగింపజేసి సత్యాన్ని మరుగుపరుస్తుంది. సత్యాన్ని గుర్తించలేకపోవడమే అజ్ఞానం. బుద్ధి అజ్ఞానంచే ఆవరింపడినప్పుడు, సత్యాన్నే అన్వేషించే మనస్సు రజోగుణంతో ప్రేరేపింపబడి అనేక కల్పనలను చేస్తూ అనేకత్వ ప్రపంచాన్ని చూస్తూ అశాంతిమయ మవుతుంది. అప్పటినుండీ ఆ మనస్సు దూరాన్నీ దగ్గర తనాన్నీ, బాహ్యాభ్యంతరాలనూ, స్థూల, సూక్ష్మాలనూ, సర్వద్వంద్వాలనూ గుర్తిస్తూ భ్రమిస్తూనే ఉంటుంది.

నిశ్చల ప్రశాంతతతో, నిత్యవర్తమానంలో నివసించే మానసంతో శ్రవణం చేసిన జనక రాజర్షికి సర్వ సందేహాలూ భ్రమలూ తొలగిపోయి బుద్ధిని ఆవరించి ఉన్న అజ్ఞానం అదృశ్యమయి పోవడంతో ఆత్మానుభవంలో ఆత్మగా కేవలంగా మిగిలిపోయాడు. స్థిరంగా ఆత్మానుభవంలో స్థితుడయిన అట్టి జ్ఞానికి, మనస్సు తన తాత్కాలిక తృప్తి కోసం సృష్టించుకున్న భ్రమలు ఎలా మిగిలి ఉండగలవని జనక రాజర్షి ఆశ్చర్యంతో అంటున్నారు.

**శ్లో॥క్వ మృత్యుర్జీవితం వా క్వ లోకాః క్వాస్య స్వ లౌకికమ్ ।**
**క్వలయః క్వ సమాధిర్వా స్వమహిమ్ని స్థితస్య మే ॥7.**

టీ॥ స్వమహిమ్ని = నామహిమయందే, స్థితస్య = స్థితుడనైన, మే = నాకు, మృత్యుః = మృత్యువు, క్వ = ఎక్కడ, జీవితం = జీవితము, క్వ = ఎక్కడ, లోకాః = భూర్భువాది లోకములు, క్వ = ఎక్కడ, లౌకికం = లోకవ్యవహారము, క్వ = ఎక్కడ, లయః = లయము, క్వ = ఎక్కడ, సమాధిః = సమాధి, క్వ = ఎక్కడ.

నా మహిలో స్థితుడనయిన నాకు మరణమెక్కడ? జీవితం ఏది? ప్రపంచం ఎక్కడ? ప్రాపంచిక సంబంధాలు ఎక్కడ? ఏది ధ్యానం? ఏది సమాధి?

జనన మరణాలు, ఇంద్రియానుభవ క్షేత్రాలుగా గుర్తింపబడే ప్రపంచం కూడా, మనోబుద్ధులచే గుర్తింపబడే భావానుభవాలు మాత్రమే. అనేక విషయాలను గుర్తిస్తూ జీవించే అహంకారం, సర్వానికి ఆధారమయిన మహాతత్త్వాన్ని గుర్తించే ప్రయత్నంలో, మనస్సును బాహ్యవిషయాలనుండి మరలించి, అంతర్ముఖంచేసి, లయం చేసుకుంటుంది. ఈ ప్రయత్నానికి ధ్యానం అత్యంత సహాయకరంగా ఉంటుంది. అహంకారం తన మూలమయిన చైతన్యంలో లయమవడమే సమాధి అనబడుతుంది. అహంకారం దృష్ట్యా ఆ స్థితిని సమాధి అన్నప్పటికీ నిజానికి అప్పుడక్కడ ఆత్మతత్త్వం మాత్రమే ఉంటుంది, అది అద్వయం అద్వితీయం, ఏకం, కేవలం, అట్టి బ్రాహ్మీస్థితిలో నిష్ఠుడయిన జనకుడు లయాన్ని గురించీ సమాధిని గురించీ ఆశ్చర్యపడడంలో ఆశ్చర్యం లేదు.

**శ్లో॥ అలం త్రివర్గ కథయా యోగస్య కథయాఽప్యలమ్ ।**
**అలం విజ్ఞాన కథయా విశ్రాంతస్య మమాత్మని ॥ 8.**

టీ॥ ఆత్మని = ఆత్మయందు, విశ్రాంతస్య = విశ్రమించుచున్న, మమ = నాకు, త్రివర్గకథయా = ధర్మార్థ కామముల వర్ణనముచేత, అలం = చాలును, యోగస్య = యోగముయొక్క, కథయా = అకథనముచేత, అలం = చాలును, విజ్ఞానకథయా = విజ్ఞాన కథనముచేత, అలం = చాలును.

ఆత్మానుభవంలో ఆనందస్వరూపంగా ఉన్న నాకు త్రివిధములయిన జీవన ధ్యేయాలను గురించి ఉపన్యాసాలన్నీ వృథాలాపనలే. అపరోక్షానుభూతిని గురించిన జ్ఞానోపదేశం కూడా అర్థరహితమే.

జీవన్ముక్తునికి అనుభూతమయే అపారశాంతి, అవధులు లేని తృప్తి, ఈ శ్లోకంలో వర్ణింపబడుతున్నాయి. దీనితో జనకరాజర్షి యొక్క ఆధ్యాత్మికానుభవ వర్ణన ఈ అధ్యాయంతో సమాప్త మవుతున్నది. జీవన ధ్యేయాలనిపించే ధర్మ,

అర్థ, కామాలూ, యోగమూ, సమాధి, అనుభవమూ అన్నీ కూడా ఆత్మతత్త్వాన్ని చేరుకోవడానికి మార్గాలవంటివి మాత్రమే. గమ్యాన్ని చేరినవానికి మార్గంతో అవసరం ఏమిటి? నదిని దాటిన తరువాత కూడా ఎవరైనా నావని తలమీద పెట్టుకుని నడుస్తారా?

ఆత్మానుభవం పరిపూర్ణమయినది, అందులో లేనిదీ, కావాలనిపించేదీ ఏదీ ఉండదు. దానికదేసాటి. అన్ని సాధనలూ కూడా అహంకారాన్ని భ్రమల నుండీ అజ్ఞానం నుండీ దూరం చెయ్యడానికి మాత్రమే ఉపయోగపడతాయి. భ్రమలూ అజ్ఞానమూ తొలగిపోగానే, వాటితోపాటుగా వాటిని గుర్తించే అహంకారం కూడా అంతరించి ఆత్మతత్త్వం మాత్రమే నిత్యశుద్ధంగా ప్రకాశిస్తూ ఉంటుంది.

...

# అధ్యాయం-20

# పరమార్థ స్థితి

అనిర్వచనీయమైన పరిపూర్ణ స్థితిని, అపార సౌందర్య భావాన్ని, ఆత్మతత్త్వాన్ని, బ్రహ్మానుభవాన్ని సాధకుల బుద్ధికి అందించాలనే తపనతో ఉపనిషత్తులు ఎంతగానో ప్రయత్నించాయి. బ్రహ్మసూత్రాలు తమని తామే పూర్ణాహుతిగా అర్పించుకుంటున్నాయి. భగవద్గీత క్షమార్హమయిన లజ్జా భావంతో సందేహించి ఆగిపోయింది. అటువంటి ఆత్మతత్త్వాన్ని ఈ అష్టావక్ర సంహిత సాధకుల బుద్ధికి సమర్థవంతంగా అందించడం నిజంగా అభినందించ దగినదే! అవాఙ్మానస గోచరమయిన ఆత్మానుభవాన్ని, పరిమిత పదాలతో సూచింపగలిగిన అష్టావక్రమహర్షి ఆరాధనీయుడు, ఆయన కృషి ప్రశంసార్హం. ఈ చివరి అధ్యాయంలో భావాతీతమయిన శుద్ధచైతన్యతత్త్వం, పరమార్థ స్థితి, మనబుద్ధికి అర్థమయ్యే విధంగా అందించబడింది. మహర్షుల అపూర్వ భాషాసౌందర్య రచనా చమత్కృతి ఇందుకు కారణం కాదు. మానవతా దక్పథంతో అసాధారణ ప్రతిభతో, అలౌకిక ప్రేమతో, జనకుని నోటివెంటే ఆ అనుభవ వర్ణనను రాబట్టడమే ఇందుకు కారణం. ఈ సంహితలో విద్యార్థీ, సాధకుడూ అయిన జనకుడే, జీవన్ముక్తుడై ఆత్మనిష్ఠుడై స్వానుభవాన్ని తన వలె ప్రయత్నించే సాధకులకు మార్గదర్శకంగా ఆశాజ్యోతిగా అందిస్తున్నారు.

ఈ చివరి అధ్యాయంలో అసంగమైన ఆత్మతత్త్వం కేవలంగా ఉండడం వర్ణించబడింది. పరస్పరాధారంగా వర్ధిల్లే ఈ భౌతికప్రపంచాన్ని నిర్వచించగలిగే సమస్త పదజాలమూకూడా కేవలంగా ఉండే ఆత్మతత్త్వాన్ని వర్ణించడానికి అసమర్థమవుతున్నాయి. ఉందని లేదనీ నిర్ణయింపబడే సర్వ నిర్ణయాలకూ అతీతంగా, బంధమోక్షాల కతీతంగా, ఆత్మతత్త్వం ఉంది. అందులో వ్యక్తిగా గుర్తింపబడే జీవుడుగానీ, పరమసత్యంగా వర్ణింపబడే బ్రహ్మం కానీ ఉండనే ఉండవు! ఉన్నదంతా ఒకే ఒక ఆత్మచైతన్యం మాత్రమే.

సమర్థయిన చిత్రకారుడు రంగులను మిళితం చేసినట్లుగా, శస్త్ర చికిత్సలో వైద్యుడు నైపుణ్యంతో తన శస్త్రాలనుపయోగించినట్లుగా, ఇక్కడ అష్టావక్రమహర్షి పరస్పరవిరుద్ధాలుగా ధ్వనించే పదజాలాన్ని సమర్థతో ఉపయోగిస్తున్నారు. దీనిని చదివే పాఠకుడు తరుచుగా విభ్రాంతిని చెందుతూ, ఆశ్చర్యంతో ఆగిపోతూ బుద్ధిపరిధి నుండి క్రమంగా విడివడి సత్యదర్శనానికి అతిచేరువగా చేరుకుంటాడు.

ఈ అధ్యాయ నిర్మాణంలో అష్టావక్ర మహర్షి ఒక ప్రత్యేక అపూర్వ చిత్రణా విధానాన్ని అవలంబించేరు. ప్రతీ శ్లోకంలోనూ జనకుడు తన జీవన్ముక్తత్వాన్ని ఒక ప్రత్యేక పదంతో సూచిస్తున్నారు. ధ్యానమగ్న శాంత మనస్సుకల సాధకుల మనస్సను, ఈ విశిష్ట పదం భావాతీతమయిన అనుభవంలో నిలబెట్టి తీరుతుంది. "నిరంజన", "గతద్వంద్వ", "అరూప" మొదలయిన పదాలన్నీ ఈ కోవకి చెందినవే. సంసిద్ధతా అర్హతా కలిగిన నిజమైన ధ్యానిని ఈ పదాలు ఆత్మానుభవంలో వదలిపెడతాయి. ప్రతి పదమూ విస్పష్టమయిన జ్ఞాన ప్రకాశాన్ని విరజిమ్ముతూ సాధకుని ఏకాంత మార్గాన్ని ప్రకాశింపజేస్తూ అతని ప్రయాణాన్ని సుఖకరం చేస్తుంది. ఏకాంతం లో ఏకాకిగా ప్రయాణిస్తూ ఏకత్వానుభవంలో నిలచిపోయేలా చేస్తుంద.

వాక్కుకీ, బుద్ధికీ, ధ్యానానికీ కుడా అతీతమయినది ఆత్మతత్త్వమని ఇదివరకే అష్టావక్ర మునీంద్రులు హెచ్చరించారు. ధ్యానిస్తూ, ధ్యానంలో ధ్యానాన్ని లయం చెయ్యడమే ధ్యానలక్ష్యమూ, గమ్యయమూ, ధ్యేయమూ అన్న సత్యం సుస్పష్టం చెయ్యబడింది. అదే ధ్యానానికి పరమావధి.

మేధానైశిత్యంగల సాధకులు తమ బుద్ధిని తృప్తి పరచడం కోసం న్యాయబద్ధమైన తర్కంతో శబ్దజాల మహారణ్యాన్ని శోధిస్తూ ఆగిపోతూ ఉంటారు. అట్టివారి బుద్ధిని, తార్కికశక్తిని, ధీ విభవాన్ని సవాలుచేస్తూ సవ్యమయిన మార్గాన్ని చూపడానికనువైన విధంగా మహర్షి తమ పదాలను పరస్పర విరుద్ధంగా పైకి గోచరించే విధంగా ఎంతో సమర్థుడైన శస్త్రవైద్యుని శస్త్రవిన్యాస విధానంలో చిత్రీకరించారు.

జంతుకోటినుండి విడదీసి ప్రత్యేకంగా మానవునికి గౌరవాన్నాపాదించినది నిస్సందేహంగా అతని మేధా వైభవమే, అదే అతని గొప్పదనమూ

అందమూ కూడా. అయితే, ఆధ్యాత్మిక సాధనలో నిమగ్నుడయిన సాధకుడు మానవ సహజమయిన ఈ ప్రత్యేకతలను వాటి అవధుల మేరకు ఉపయోగించి లబ్ధిపొంది చివరగా వాటినుండి విడివడగలగాలి. బుద్ధిని కూడా అధిగమించి నప్పుడు ఆత్మానుభవం అన్న పదంయొక్క అర్థం, పదార్థం అనుభవైక వేద్య మవుతాయి.

పూ రేకు యొక్క సున్నితమైన సువాసనా, సురుచిరమయిన సౌంద ర్యమూ, ఎండి వాడి నశించి పోతేనే అందులోనుండి అనుభవింపదగిన ఫలం ఉదయిస్తుంది.

బుద్ధికి అతీతంగా అనంతశాంతి సాగరమనదగిన సత్ చిత్ ఆనంద రూపమయిన ఆత్మతత్త్వం దివ్యతేజస్సుతో ప్రకాశిస్తూ ఉంటుంది. అష్టావక్ర మునీంద్రుల రచనా చిత్రణావిధానం న్యాయసమ్మతంగా, మూర్తీభవించిన జ్ఞానవిజ్ఞానరాసిగా, జీవన్ముక్తుడయిన జనకునిలో గోచరిస్తుంది.

జనక ఉవాచ :-

శ్లో॥క్వ భూతాని క్వ దేహో వా క్వేంద్రియాణి క్వ వా మనః ।
క్వ శూన్యం క్వ చ నైరాశ్యం మత్స్వరూపే నిరంజనే ॥1.

టీ॥ నిరంజనే=సర్వోపాధిమల శూన్యమైన, మత్స్వరూపే = నాయొక్క స్వరూపము నందు, భూతాని = పంచభూతములు, క్వ = ఎక్కడ, దేహః = దేహము, క్వ = ఎక్కడ, ఇంద్రియాణి=ఇంద్రియములు, క్వ=ఎక్కడ, మనః = మనస్సు, క్వ = ఎక్కడ, శూన్యం = శూన్యము, క్వ = ఎక్కడ, నైరాశ్యం = అశాభావము, (ఆకాశాభావము), క్వ = ఎక్కడ.

స్వభావతః నిరంజనుడయిన నాలో పంచమహాభూతాలు ఎక్కడ? వాటిచే నిర్మింపబడిన శరీరం ఎక్కడ? ఇంద్రియాలెక్కడ? మనస్సెక్కడ? శూన్యం ఎక్కడ? నిరాశ ఎక్కడ?

ఈ అధ్యాయంలోని పధ్నాలుగు శ్లోకాలలోనూ కూడా జనక రాజర్షి జీవన్ముక్తుని జీవితాన్నీ దృక్పథాన్నీ స్వీయానుభవంతో అందిస్తున్నారు. మూగ, చెముడు, ఉన్న కవి, ప్రఖ్యాత గాయనియొక్క గాన మాధుర్యాన్ని, శ్రోతలపై ఆ గాన ప్రభావాన్ని వర్ణించాలని ప్రయత్నిస్తే ఏవిధంగా ఉంటుందో అదే విధంగా

ఉంటుంది.---జ్ఞాని జీవిత చరిత్రను ఎవరు చిత్రించ ప్రయత్నించినా! జీవన్ముక్తుడే స్వయంగా స్వీయ చరిత్రను వినిపిస్తే అది మాత్రమే సత్యానికి వీలయినంత దగ్గరగా ఉంటుంది.

పరస్పరాధారభూతమయిన సర్వస్థితులనూ అవస్థలనూ అధిగమించి నిలచిన ఆత్మానుభవంలో,పంచమహాభూతాలూ వాటిచే నిర్మించబడిన శరీరమూ కూడా ఉండవు. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలూ, మనస్సు----ఏవీ ఉండవు. పంచమహాభూతాలూ కారణమయితే, మనస్సు కార్యము, వీనినే లేవని జనకుడు చెప్పడంలో కార్యకారణ సంబంధ రూపమయిన సర్వసృష్టినీ లేనిదిగా నిరూపించి చెప్పుతున్నారు. ఈ సర్వసృష్టి అహంకారం దృష్టితో చూస్తే ఎంతో నిజంగా ఉన్నట్టుగా అనిపిస్తుంది.

శరీరం, మనస్సు, బుద్ధి----వీటిచే చూడబడే సమస్త సృష్టి కార్యకారణ సంబంధంతో మాత్రమే గుర్తించబడుతుంది. ఈ కార్యకారణ సంబంధాన్ని కూడా అధిగమించి ఆత్మచైతన్యం కేవలంగా ఉంటూ, ఈ రెండింటినీ బుద్ధిలో ప్రకాశిపంజేస్తూ ఉంటుంది. ప్రకాశింపబడే వాటికంటే ప్రకాశింపజేసేది ఎప్పుడూ విడిగానే ఉంటుంది. అట్టి ఆత్మచైతన్యంతో తాదాత్మ్యం చెందిన రాజర్షి దృష్టిలో కారణమేలేదు. ఫలితంగా కార్యమనదగిన విశాలవిశ్వం ఉండే ఆస్కారమేలేదు. అచలమయిన ఆత్మమాత్రమే కేవలంగా ఉంది.

ఈ విధంగా కనిపించే కార్యాలనన్నిటినీ లేనివిగా నిరసించగలిగిన బుద్ధిలో, సుషుప్తిలోవలెనే ఏమిలేని శూన్యత్వం ఉంటుంది. కొన్ని తెగల బౌద్ధులచే ఈ శూన్యమే మహోన్నతమయిన పరమార్థస్థితిగా అంగీకరించబడుతుంది. అట్టి శూన్యంలో ఉండడం కంటే నిరాశజనకమయిన స్థితి ఏదీ ఉండబోదు. "క్వచ నైరాశ్యం" ఈ నిరాశ ఎక్కడ? అని జనకులు అనడంలో శూన్యమే మహోన్నత స్థితి అనే భ్రమాజన్య నిర్ణయాన్ని పూర్తిగా నిరసిస్తున్నారు. విషయా-విషయాలూ లేని ఈ మహాశూన్యం దుర్భరం, దుస్సహం, నిరాశా పూరితం. దృశ్యమయే సర్వజగతీ చైతన్యం కల్లోలితమయినప్పుడు భావాలుగా మనోబుద్ధులలో గుర్తింపబడి అశాంతిగా అనుభవింపబడుతుంది. దృశ్యంలోనే స్థితిలో అశాంతి అంతర్థానమయి అనంతానంద పరమశాంత స్వరూపస్థితి మిగిలి ఉంటుందనీ, ద్రష్ట సత్యమనీ, వేదాంతం ఎలుగెత్తి చాటుతున్నది. జనకుడు స్వానుభవంతో నిరంజనంగా తాను మాత్రం కేవలంగా ఆనందంగా ఉన్నానని

చెప్పుతున్నారు. సర్వ విషయాలూ అదృశ్యంకాగా మిగిలి ఉండే విషయమే ఆత్మచైతన్యం. విషయాలున్నప్పుడు మాత్రమే కార్య కారణ సంబంధం ఉంటుంది. ఈ కార్య కారణ సంబంధాన్ని సూచిస్తూ ఇక్కడ మూడు ఉదాహరణలు ఇవ్వబడ్డాయి. శరీరంతో అనుభవింపబడే కార్యకారణ సంబంధంగా పంచమహా భూతాలు సూచింపబడ్డాయి.ఇంద్రియాలూ మనస్సు కలసి మానసికానుభవాలను సూచిస్తున్నాయి. వీటి ఫలితంగా వచ్చే నైరాశ్యం బుద్ధిచే గుర్తింపబడే అనుభవం. దీనితో మన సమగ్ర వ్యక్తిత్వపు అనుభవాలన్నీ కార్యకారణ సంబంధానికి లోబడి నవే అని స్పష్టపడుతోంది.

**శ్లో॥క్వ శాస్త్రం క్వాత్మ విజ్ఞానం క్వ వా నిర్విషయం మనః।**
**క్వ తృప్తిః క్వ వితృష్ణత్వం గత ద్వంద్వస్య మే సదా ॥2.**

టీ॥ సదా = ఎల్లప్పుడు, గతద్వంద్వస్య = ద్వంద్వ రహితుడనగు, మే = నాకు, శాస్త్రం = శాస్త్రము, క్వ = ఎక్కడ, ఆత్మవిజ్ఞానం = ఆత్మ విజ్ఞానము, క్వ = ఎక్కడ, నిర్విషయం = విషయరహితమైన, మనః = మనస్సు, క్వ = ఎక్కడ, తృప్తిః = తృప్తి, క్వ = ఎక్కడ, వితృష్ణత్వం = తృష్ణారహితత్వము, క్వ = ఎక్కడ.

సర్వ ద్వంద్వాలకూ అతీతంగా ఉన్న నాలో శాస్త్రాలెక్కడ? ఆత్మ జ్ఞానం ఎక్కడ? విషయ రాహిత్యమైన మనస్సేది? తృప్తి ఏమిటి? కోరిక లేకపోవడం ఏమిటి?

మానసిక పరిధిలో అహంకారంగా తన్ను తాను గుర్తిస్తున్న కాలమూ వివిధ ప్రత్యేకరూప సమన్వితమయిన విశ్వాన్ని గుర్తించక తప్పదు, ద్వంద్వాల ననుభవించడమూ జరుగుతుంది. మనస్సు నధిగమించి అహంకార రహిత స్థితిలో నిలువగలిగిన వానిలో భోక్తననే భావం ఉండదు. అతనిచే ద్వంద్వాలేవీ అనుభవింపబడవు.

తాను కర్తననీ, భోక్తననీ భావించే అహంకారానికే తత్త్వశాస్త్ర గ్రంథా లన్నీ బోధింపబడుతున్నాయి. ఆనందమయమైన పరిపూర్ణ ఆత్మతత్త్వాన్ని సాధకుల బుద్ధికి అందించడానికే శాస్త్రాలన్నీ కృషిచేస్తున్నాయి. ఆత్మతత్త్వా నుభూతి కలగాలంటే మనస్సు తన బాహ్యాభిముఖ స్వభావాన్ని విడనాడి అంత ర్ముఖం కావాలి. శాస్త్రాలు విధించే సాధనలన్నీ సాధకులను బాహ్యావిషయాకర్షణ నుండి తప్పించడానికే ఉపయోగపడతాయి. ఈ విధంగా విషయాకర్షణనుండి

విముక్తమయిన మానసం మాత్రమే నిశ్చలంగా అంతర్ముఖమయి అదృశ్యమయి ఆత్మానుభూతిలో ఐక్యమయి పోతుంది.

మానసిక తృప్తీ, కోరికలులేని బుద్ధిలో ఉండే నిశ్చల శాంతీ కూడా జీవన్ముక్తునికి అర్థరహిత పదాలే. మనోబుద్ధులే లేని అతనికి తృప్తి శాంతి అనేవి ఎక్కడ ఉంటాయి?!?

ఇక్కడ చూపించిన ఈ స్థితి మనబుద్ధితో అర్థం చేసుకోవడానికి కాదు, ప్రత్యక్షానుభవం కావాలి. ఈ అనుభవం కావాలంటే ఈ శ్లోకాలు ఘోషిస్తున్న స్థితిని సాధకులు సాధించాలి. ఆత్మజ్ఞానం తత్త్వశాస్త్ర గ్రంథాలలోనూ వేదాల లోనూ నిక్షిప్తమైలేదు. ఇది ప్రత్యక్షానుభవం కోసం సిద్ధంగా మౌనంగా మనలోనే వేచి ఉంది.

**శ్లో॥క్వవిద్యా క్వచ వాఽవిద్యా క్వాహం క్వేదం మమ క్వవా।**
**క్వబంధః క్వచ వా మోక్షః స్వరూపస్య క్వ రూపితా ॥3.**

టీ॥ స్వరూపస్య = అద్వితీయ చిన్మాత్రస్వరూపుడగు నాకు, రూపితా = రూపము గలిగియుండుట, క్వ = ఎక్కడ, విద్యా = విద్య, క్వ = ఎక్కడ, అవిద్యా = అవిద్య, క్వ = ఎక్కడ, అహం = అహంకారము, క్వ = ఎక్కడ, ఇదం – ఈ బాహ్య ప్రపంచము, క్వ = ఎక్కడ, బంధః = బంధము, క్వ = ఎక్కడ, మోక్షః = మోక్షము, క్వ = ఎక్కడ.

**జ్ఞానం ఎక్కడ? అజ్ఞానం ఎక్కడ? ఏది నేను? ఏది నాది? బంధం ఏది? ముక్తి ఎక్కడ? అనంతమైన నా స్వరూపానికి రూపం ఏది?**

ఈ పదాలన్నీ పరస్పరాధార భూతమయిన భౌతిక ప్రపంచంలోనే అర్థవంతమయి భాసిస్తాయి. మనస్సే లేనప్పుడు అహంకారానికి "ఇదినాది" అని ఎలా తెలుస్తుంది? అనంతమయిన జ్ఞానంలో అజ్ఞానం ఉండనేరదు. జ్ఞానం ఆత్మయొక్క లక్షణం కూడా కాదు. అజ్ఞానరూపమయిన సర్వభ్రమలూ తొలగి పోయినప్పుడు జ్ఞానంతో ప్రమేయమే లేదు!!

ప్రపంచ వస్తువులనూ విషయాలనూ అనుభవించే "నేను" అందరికీ సుపరిచితమే. "నేను"గా తెలియబడే విషయి ఉన్నంతకాలమూ తన ఉపాధు లయిన శరీరం, మనస్సు, బుద్ధులతో వస్తువులను చూస్తూ, అనుభవిస్తూ, ఆలోచిస్తూ, విషయాలతో సంబంధం కలిగే ఉంటుంది. ఈ అహంకారపు అనుభవాల సమూహమే మనకు తెలిసిన సర్వప్రపంచమూ కూడా. అందుకే

విషయి ఉన్నంత కాలమూ విషయ సముదాయ రూపమయిన ప్రపంచంకూడా ఉంటుంది. పరస్పరాధారమయిన వీటిని అధిగమించి అతీతమయిన ఆత్మా నుభవంలో ఉన్నప్పుడు "నేను" అనే భావం కాని, తదనుభవ రూపమయిన భావనామయ ప్రపంచం కాని ఎక్కడ ఉంటాయి? ఎలా ఉంటాయి?

ఈ "నేను" భావమే ప్రపంచ వస్తువుల దృష్ట్యా వ్యక్తమయినప్పుడు నాది అనే భావంతో అహంకారంతో ప్రతిఫలించి భాసిస్తుంది. "నేను"అనే అహంకారాన్నే అధిగమించిన స్థితిలో "నాది" అనే మమకారం ఎలా నిలువగలుగుతుంది? నేను స్వప్నంలోనుండి మేలుకోగానే స్వప్న గతమయిన నా భార్యా ఉండదు, ఆ భార్యకి నేను భర్తనూ కాను! నేను నేనే!!

ఉపనిషత్కర్తలయిన మన మహర్షులు ఆత్మానుభవ నిష్ణాతులు మాత్రమే కాదు, భావాతీతమయిన తమ అనుభవసారాన్ని భావాలరూపంగా మలచి సాధకుల బుద్ధికి అందించగలిగే మహాశిల్పులు కూడా. అలా అందిస్తూనే ఆ అనుభవంలో సాధకులు స్థితులయేటట్లుగా చెయ్యగల నైపుణ్యం కూడా వారి స్వంతమే. దీనిని సాధ్యం చెయ్యడానికే భాషలో అనేక నూతన పదాలను వారు ఎంతో శ్రమతో ఏర్చి కూర్చి, అరూపమయిన ఆత్మకు రూపకల్పన చెయ్యగలిగేరు.

అహంకారమూ దానియొక్క స్వభావమూ ప్రవర్తనా కలిసి "అహంతా" అనబడతాయి. ఇదేవిధంగా అహంకారంచే అనుభవింపబడే సర్వ క్షేత్రాల మొత్తమూ కలసి "ఇదం" అనబడుతుంది. అందుకే అనుభవ క్షేత్రరూపమయిన ప్రపంచాన్ని వ్యాఖ్యానించేటప్పుడు "ఇదం" అనే పదాన్నే ఎక్కువగా తీసుకోవడం జరిగింది.

బంధత్వమూ మోక్షమూ రెండూ కూడా మనస్సుచేతనే భావింప బడతాయి. విషయ భోగానుభవ క్షేత్రాలవైపు పరుగులుతీసే మనస్సు బంధింపబడినట్టే. బంధింపబడి ఉన్నాననే భావంతో బాధతో తపించే మనస్సు, తన ప్రస్తుత స్థితి దృష్ట్యా, ముక్తస్థితిని కోరుతుంది. అహంకారాన్ని అధిగమించి భావనాతీతమయిన స్వస్థితిలో, భావనాధారమయిన చైతన్యంగా తన్ను తాను గుర్తిస్తున్న జీవన్ముక్తుడయిన జనకుడు అందుకే ఇలా అడుగగలుగుతున్నారు --"బంధం ఏది? ముక్తి ఎక్కడ"?

మేఘ గంభీర రవంతో, ఈ భావాన్నే అవధూత గీత ఇలా వ్యక్తం చేస్తోంది.

న జాతోహం మృతోవాపి న మే కర్మ శుభాశుభమ్
విశుద్ధం నిర్గుణం బ్రహ్మ బంధో ముక్తః కథం మమ. (అవధూత గీత1-58)

నేను ఎప్పుడూ జన్మించలేదు, నాకు మరణమూ లేదు. నాలో మంచివి కానీ చెడువిగానీ, ఏ కర్మలు లేవు. నిర్గుణమూ విశుద్ధమూ అయిన పరబ్రహ్మమే నేను. *అటువంటి నాలో బంధం కాని ముక్తిగాని ఎలా ఉంటాయి?*

శ్లో॥ క్వ ప్రారబ్ధాని కర్మాణి జీవన్ముక్తి రపి క్వ వా ।
క్వ తద్విదేహ కైవల్యం నిర్విశేషస్య సర్వదా ॥ 4.

టీ॥ సర్వదా = ఎల్లపప్పుడును, నిర్విశేషస్య = విశేష (ధర్మాధర్మ)రహితుడగు, మే = నాకు, ప్రారబ్ధాని = ప్రారబ్ధములైన, కర్మాణి = కర్మములు, క్వ = ఎక్కడ, జీవన్ముక్తిః = జీవన్ముక్తి, క్వ = ఎక్కడ, తత్ = ఆ, విదేహకైవల్యం = విదేహముక్తి, క్వ = ఎక్కడ.

**సర్వదా ఏకంగా విషయరహితంగా ఉండే నాలో ప్రారబ్ధం పని చెయ్యడమేమిటి? జీవితంనుండి ముక్తి ఏమిటి? మరణానంతరం వచ్చే విదేహముక్తి మాత్రం ఎవరికి?**

ప్రతీ కర్మకూ ఫలితం ఉంటుంది. మంచి కర్మలవల్ల మన వ్యక్తిత్వం లో మంచి వాసనలు ఉదయించి, ఫలితంగా మంచి ఆలోచనలు స్ఫురించి, మనోబుద్ధులను శాంతంగా సంతోషంగా ఉంచుతాయి. చెడుకర్మలు చెడు వాసనలకు కారణమయి, చెడు ఆలోచనలతో మళ్ళీ చెడు కర్మలకు కారకాలయి జీవితాన్ని దుఃఖమయం చేస్తాయి. సామాన్య మానవులను సంతృప్తి పరచడానికి ఇదివరకే ఈ సంహితలో జీవన్ముక్తుడు ప్రారబ్ధానుగుణంగా ఈ ప్రపంచంలో ఏ విధంగా జీవించేది వివరింపబడింది.

అట్టి జ్ఞాని శరీరంయొక్క కర్మలతో అతనికి ఏ విధమయిన ప్రమేయమూ ఉండదనే విషయాన్ని సుస్పష్టం చెయ్యడానికే జ్ఞానిశరీరం ఎండి రాలిన ఆకు గాలికి చరించే విధానంతో పోల్చబడింది. ఆత్మానుభవనిష్ఠుడయిన జనక రాజర్షి తన స్థితిదృష్ట్యా తనలో ప్రారబ్ధమేలేదని అంటున్నారు. కర్మల నాచరించేది అహంకారమూ, ఆ అహంకారానికే ఫలితాలు చెందుతాయి. హంతకుడు మాత్రమే హత్యానేరానికి శిక్షింపబడతాడు. పోలీసులు ఎంతో శ్రమపడి హంతకుని జాడ కనుక్కోవచ్చు. కాని ఆ హంతకునికి కోర్టు శిక్ష ఎలా విధించగలుగుతుంది ---అతడంతకు ముందురాత్రే చనిపోయి ఉంటే?!?

నిస్సందేహంగా కర్మవలయం నుండి తప్పించుకోవడం మనతరం కాదు. కర్మలకు ఫలితాలు ఉండనే ఉంటాయి. అయితే ఈ కర్మలన్నీ అహంకారంచే నిర్వర్తింపబడుతున్నాయి. ఫలితాలు కూడా అహంకారం చేతనే అనుభవింప బడాలి. అహంకారాన్ని అధిగమించిన జ్ఞానిని కర్మ సిద్ధాంతం ఏవిధంగా బంధించ గలుగుతుంది?!? నేరస్తుడు చనిపోయాడు, శిక్షాస్మృతి శాసనం ఎవరికి వర్తిస్తుంది?!? తనకు ప్రారబ్ధమేలేదని జనకులు దృఢ విశ్వాసంతో చెప్పు తున్నారు. అతడే సర్వభూతాత్మ, సర్వాత్మ, నిర్విశేషుడు, అతనిలో ఏ విశేషములూ లేవు, కేవలంగా ఆత్మమాత్రమే ఉంది.

శుద్ధమూ అనంతమూ అయిన ఆత్మగా, పరిణామరహితమయిన చైతన్యంగా, సర్వనామరూపాలకూ ఆధారంగా, తన్ను తాను గుర్తించిన జనక రాజర్షి జీవన్ముక్తిగానీ, విదేహముక్తి కానీ తనకు లేనేలేవనీ, నిష్కళంకంగా, నిత్యంగా కేవలంగా ఆత్మగా తాను మాత్రమే ఉన్నానని ధృవపరుస్తున్నారు.

శ్లో॥ క్వ కర్తా క్వ చ వా భోక్తా నిష్క్రియం స్ఫురణం క్వ వా।
క్వాపరోక్షం ఫలం వా క్వ నిస్స్వభావస్య మే సదా ॥ 5.

టీ॥ నిస్స్వభావస్య = స్వభావరహితుడనైన, మే = నాకు, కర్తా = కర్తృత్వము గాని, భోక్తా వా = భోక్తృత్వము గాని, క్వ = ఎక్కడ, నిష్క్రియం = క్రియా రహితత్వం, క్వ = ఎక్కడ, స్ఫురణం వా = స్ఫురణముగాని, అపరోక్షం = ప్రత్యక్ష జ్ఞానముగాని, ఫలం వా = ఫలము (విషయాకార వృత్త్యవచ్ఛిన్న తేనత్వము)గాని, క్వ = ఎక్కడ.

కర్త ఎవరు? భోక్త ఎవరు? ఆలోచనలు ఆరంభం కావడం ఏమిటి? వాటిని నిరోధించడం ఎక్కడ? పరోక్షజ్ఞానం ఏమిటి? అపరోక్షానుభూతి ఎవరికి? స్వభావరహితంగా నిత్యమూ నేను మాత్రమే ఉన్నాను.

అహంకారం కోరే కోరికలతో నిత్య క్రియాశీలుడై ఉండడం మానవుని సహజలక్షణం. తన ఇంద్రియాలను తృప్తిపరచడానికతడు నిత్యమూ శ్రమిస్తూనే ఉంటాడు. తన రాగద్వేషాల రాపిడితో బాధపడుతూ ద్వంద్వమయ ప్రపంచంలో జీవిస్తూ ఉండాడు. ఇట్టి అహంకారపు పరిధినుండి ముక్తుడై స్వేచ్ఛగా ఆనందంగా జీవిస్తాడు జీవన్ముక్తుడు. అందుకే అతని ప్రవర్తననూ, జీవితాన్నీ స్వభావతః నిర్వచించి చెప్పలేం, నిస్స్వభావుడతడు, స్వభావ రాహిత్యమే అతని స్వభావం!"జీవన్ముక్తి గీత"లో దత్తాత్రేయ మహర్షి కూడా ఈ సందర్భంలో ఇదే భావాన్ని వ్యక్తం చేస్తూ "స్వభావ గుణ వర్జితమ్" అని వాడడం గమనార్హం.

అహంకారంలేని వ్యక్తిలో కర్తృత్వ భోక్తృత్వ భావాలు ఉండవు. అహంకారం మనోబుద్ధుల నాక్రమించి జీవిస్తూ పనిచేస్తూ ఉంటుంది. అహంకారం లేనప్పుడు మనోబుద్ధులు కూడా అధిగమింపబడినట్టే. ఆలోచనా ప్రవాహమే మనస్సు. మనస్సు కలీతంగా ఆత్మగా నిలవగలిగిన జ్ఞానిలో ఆలోచనలను నిరోధించడం ఏమిటి? ఆలోచనల కారంభం ఏది? అన్ని మత తాత్త్విక గ్రంధాలూ కూడా మానవుడు ఎలా జ్ఞానం పొందాలో వివరంగా చెప్పుతూనే ఉంటాయి. వీటన్నిటిలో వేదాంతం మాత్రమే నిస్సందేహంగా తార్కికమూ న్యాయసమ్మతమూ అనిపిస్తుంది. చూడడం అంటే ఏమిటి? దేనిని చూస్తున్నాం? అనే విషయాలను వేదాంతంవలే మరే తత్త్వశాస్త్రమూ స్పష్టపరచలేక పోయింది. మనస్సు ఇంద్రియాలద్వారా బహిర్గతంగా ప్రవహించి బాహ్యంగా వస్తురూపాన్ని సంతరించుకుంటుంది. చైతన్యంలోని ఈ కదలిక ఒక మెరుపువలె మెరిసి ఆ బాహ్యవస్తువుని చూసేననీ అర్థం చేసుకున్నాననీ అనుకుంటుంది.

వస్తువిషయిక జ్ఞానం ఒక వృత్తివలె చైతన్యజ్యోతిలో ప్రకాశిస్తుంది. అలా ప్రకాశించిన జ్ఞానాన్ని బుద్ధి తన స్వజ్ఞానంగా భ్రమించి గ్రహిస్తుంది. "విషయాకార వృత్త్యవిచ్ఛిన్న చైతన్యమ్..................ఫలమ్"---విషయాకారం దాల్చి పరిమితమైనట్టుగా చైతన్యం గోచరిస్తుంది. ........ఇదే ఫలం, ఫలితం. అందుకే సమస్తవస్తు విషయజ్ఞానాన్నీ ఫలం అని అంటారు. ముందుగా ఇంద్రియాలు విషయాకారాన్ని మనస్సుకు అందించినప్పుడు అక్కడ తదను రూపమయిన వృత్తి ఏర్పడి చైతన్య ప్రకాశంలో గుర్తింపబడుతుంది. ఇదే ఫలంగా పరోక్షంగా గుర్తింపబడే జ్ఞానమంతా.

వస్తువునుండి వస్తువుకి మారే ఈ ఫలరూపమయిన జ్ఞానం కంటే భిన్నంగా అపరోక్షమయిన మరొక రకపు జ్ఞానం ఉంది. వస్తురహితమయిన ఆత్మజ్ఞాన ప్రకాశమే ఈ అపరోక్ష జ్ఞానం. ఆత్మానుభవ స్థితుడయి, ఆత్మలో ఆత్మగా అద్వయంగా నిలచిన మహనీయునికి ఫలరూపమయిన పరోక్షజ్ఞానం ఎలా ఉంటుంది? ఫలరూప పరోక్ష జ్ఞానంతో వివిధ వస్తువుల విషయాల మధ్య సతమతమవుతూ ఉండేవారే, శాశ్వతమూ, స్థిరమూ అయిన జ్ఞానం కోసం ప్రయత్నిస్తారు. అపరోక్షానుభూతికోసం ఆరాటపడతారు. అనంతచైతన్య స్వరూప మయిన ఆత్మగా, తన్ను తాను తెలుసుకున్న జీవన్ముక్తునికి అపరోక్షానుభూతి ఏమిటి? ఉన్నది తాను మాత్రమే.

క్లుప్తంగా చెప్పుకోవాలంటే జీవన్ముక్తుడు మనవలె పరస్పరాధార భూతమయిన మన భౌతిక ప్రపంచానికి చెందిన వాడు కాదు. అతడే ఈ సర్వ సృష్టి అతడే బ్రహ్మము. అట్టి మహనీయుని మరే విధంగానూ వర్ణించలేము.

శ్లో॥ క్వ లోకః క్వ ముముక్షుర్వా క్వ యోగీ జ్ఞానవాన్ క్వవా।
క్వ బద్ధః క్వచ వా ముక్తః స్వస్వరూపేఽహమద్వయే ॥ 6.

టీ॥ అహం = ఆత్మస్వరూపుడనగు నేను, అద్వయే = అద్వైతమైన, స్వస్వరూపే = స్వస్వరూపమునందున్న వాడనగుచుండగా, లోకః =లోకము, క్వ =ఎక్కడ, ముముక్షుః =ముముక్షువు, క్వ=ఎక్కడ, యోగీ = యోగి, క్వ = ఎక్కడ, జ్ఞానవాన్ = జ్ఞానవంతుడు, క్వ = ఎక్కడ, బద్ధః = బద్ధుడగుట, క్వ = ఎక్కడ, ముక్తః = ముక్తుడగుట, క్వ = ఎక్కడ.

అద్వయమూ ఆత్మ స్వరూపమూ అయిన నాలో ప్రపంచం ఎక్కడ ఉంది? ముక్తిని కాంక్షించే సాధకుడెక్కడ? ధ్యానించేదెవరు? జీవన్ముక్తుడెవరు? బద్ధుడెక్కడ? ముక్తుడెవరు?

అద్వయమయిన ఆత్మానుభవంలో విషయి-విషయ సంబంధరూపంగా కనిపించి సమస్త ద్వంద్వాలూ సమసిపోతాయి. ప్రపంచము, సాధకుడు, ధ్యాని, జ్ఞాని, బద్ధుడు, ముక్తుడు--ఈ పదాలన్నీ అర్థరహితమయి పోతాయి. అనంతమైన ఆత్మానుభవంలో సర్వకామనలూ,సాధనలూ అన్నీ తమ ప్రత్యేకతనూ విలవలనూ కోల్పోతాయి. అద్వయంగా ఆత్మతత్త్వమే మిగిలి ఉంటుంది. ఆత్మ తత్త్వంలోనికి జాగృతుడయిన జ్ఞాని, తాను అద్వయంగా ఉన్నానని గుర్తించ గలుగుతాడు. ఆ జ్ఞానానుభవంలో సాధకుడు, సాధన, సాధ్యం అని సమసిపోతాయి.

శ్లో॥ క్వ సృష్టిః క్వచ సంహారః క్వ సాధ్యం క్వచ సాధనం
క్వ సాధకః క్వ సిద్ధిర్వా స్వస్వరూపేఽహమద్వయే ॥7.

టీ॥ అహం = నేను, అద్వయే = అద్వయమైన, స్వస్వరూపే = నా నిజస్వరూపమునందు (ఉండగా), సృష్టిః = సృష్టి, క్వ = ఎక్కడ, సంహారః = సంహారము, క్వ = ఎక్కడ, సాధ్యం = సాధ్యము, క్వ = ఎక్కడ, సాధనం = సాధనము, క్వ = ఎక్కడ, సాధకః = సాధకుడు, క్వ = ఎక్కడ, సిద్ధిర్వా = సిద్ధి అయినను, క్వ = ఎక్కడ.

అద్వయమూ ఆత్మ స్వరూపమూ అయిన నాలో సృష్టి ఎక్కడ? సంహారం ఎక్కడ? సాధించవలసినదేది? సాధన ఏమిటి? సాధకుడెవరు? సిద్ధించవలసినదేది?

మనస్సు బాహ్యాభిముఖంగా చూస్తున్నంతసేపూ ఈ ప్రపంచమంతా ఉన్నట్టుగా కనిపిస్తుంది, అనిపిస్తుంది. ఆ స్థితిలో సృష్టి సంహారమూ మానసిక సిద్ధాంతాలే. ఈ మనస్సే అంతర్ముఖమయినప్పుడు, అంతవరకూ కనిపించిన కల్పనా జగత్తంతా మనస్సులోనే లయం అయిపోతుంది. ఇదే మనందరికి నిద్రగా అనుభవంలోకి వస్తోంది. బ్రహ్మాండ దృష్టితో చూస్తే ఈ సృష్టినంతటినీ సృష్టికర్తగా ఒక బ్రహ్మ సృష్టిస్తున్నాడు. లయకారకుడుగా రుద్రుడు సంహారం గావిస్తున్నాడు. దీనినే ప్రళయం అంటారు. కోరికల ఒత్తిడికి లోనయిన అహంకారం అశాంతికి లోనవుతుంది. అశాంతిగా ఉన్న మనస్సు విషయమయ ప్రపంచానుభవాలను కల్పించి చూపిస్తుంది. నిద్రలోగాని సమాధిలోగాని మనస్సు ఈ కల్పనలనుండి విడివడినప్పుడు బాధామయమయిన ఈ జగద్భావమంతా అంతరించి పోతుంది.

అద్వయమయిన ఆత్మానుభవ స్థితుడయిన జ్ఞాని మనస్సు కలీతంగా ఉంటాడు. కాబట్టి అతనికి మనస్సుచే చూడబడే సృష్టి ఎలా ఉంటుంది? లేని సృష్టికి సంహారం ఏమిటి? ఈ స్థితే స్పష్టంగా చెప్తున్నది.---సాధనలూ లేవు, సాధింప బడవలసినదిలేదు, ఆత్మ మాత్రమే కేవలంగా ఉంది. జ్ఞాని సాధకుడు కాడు, అతనికి సిద్ధించినది కూడా ఏమీ లేదు. సర్వసిద్ధులకూ సృష్టికీ అధిష్ఠానమయిన చైతన్యమే అతడు.

ఈ రెండు శ్లోకాలూ (6,7) మన మనస్సు చూడగలిగే సర్వ ద్వంద్వాలనూ లేనివిగా నిరూపిస్తున్నాయి. సృష్టి--సంహారము,సాధన--సాధ్యం, సిద్ధులు, బద్ధుడు---ముక్తుడు---ఈ సర్వద్వంద్వాలూ కూడా అద్వయమయిన ఆత్మ తత్త్వంలో లేవు. విషయ ప్రపంచపు అనిత్యతను వర్ణిస్తూ శ్రీ గౌడపాదులు తమ కారికలో ఇలా అనడం గుర్తుకు వస్తోంది.

న నిరోధో న చోత్పత్తిః న బద్ధో న చ సాధకః
న ముముక్షుః న వై ముక్త ఇత్యేషా పరమార్థతా.

(మాండూక్య ఉపనిషత్తు--వైతథ్య ప్రకరణం-32)

ఉత్పత్తీ లేదు, లయమూలేదు, ఎవరూ బద్ధులు కారు, సాధకులు లేనేలేరు, ముముక్షువులు లేరు, ముక్తులు లేరు, పారమార్థిక దృష్ట్యా ఇవేవీ లేనేలేవు. అదే పరమ సత్యం.

**శ్లో॥క్వ ప్రమాతా ప్రమాణం వా క్వ ప్రమేయం క్వచ ప్రమా।**
**క్వ కించిత్క్వన కించిద్వా సర్వదా విమలస్య మే ॥ 8.**

టీ॥ సర్వదా = ఎల్లప్పుడు, విమలస్య = నిర్మలరూపుడనగు, మే = నాకు, ప్రమాతా = ప్రమాత, క్వ = ఎక్కడ, ప్రమాణం = ప్రమాణము, క్వ = ఎక్కడ, ప్రమేయం = ప్రమేయము, క్వ = ఎక్కడ, ప్రమా = ప్రమా జ్ఞానము, క్వ = ఎక్కడ, కించిత్ = కించిత్తు (కొంచెము), క్వ = ఎక్కడ, న కించిత్ వా = అధికం ఎక్కడ.

నిత్యశుద్ధడనయిన నాలో తెలుసుకునే ప్రమాత ఎవరు? తెలియబడే ప్రమేయం ఏది? ప్రమాణ రూపమయిన జ్ఞానం ఎక్కడ? ఉన్నది ఏది? లేనిదేది?

"సర్వదా విమలస్య"---ఆత్మ నిత్యశుద్ధంగా వర్ణించబడింది. ఇది అన్యథాగ్రహణ జనిత ప్రపంచంచేతకానీ, ప్రాపంచిక అనుభవాలచేతకానీ కలుషితం కాదు. మనస్సు కలితమయిన ఆత్మానుభవంలో మనోజాడ్యాలేవీ ఉండజాలవు. రజోగుణ ప్రభావంతో మనస్సుఅశాంతితో అలజడితో అలమటిస్తూ ఉంటే, బుద్ధిలో భావనాతరంగనాట్య విన్యాసంగా ప్రపంచం గుర్తింపబడుతూ ఉంటుంది. ఇవేవీ గుణాతీతమయిన ఆత్మలో లేవు. కాబట్టే, అది నిత్యశుద్ధం, రజోగుణమూ తమో గుణమూ లేకపోతే అజ్ఞానం ఉండదు. కాబట్టి సహజంగా ఉపాధిరహితమయిన శుద్ధచైతన్యం అపరిచ్ఛిన్నంగా అఖండంగా ఉంటుంది.

ఈ అధ్యాయంలో ఇదివరకే అయిదవ శ్లోకంలో వేదాంత దృష్టి వివరంగా చర్చించబడింది. ప్రమాత అంటే తెలుసుకునే అహంకారం, జ్ఞానమే ప్రమాణం. తెలియబడే వస్తువు ప్రమేయం. విషయజ్ఞానం ప్రమ, ఈ శాస్త్రి పారిభాషిక పదాలన్నీ మన తత్త్వశాస్త్రి గ్రంధాలనుండి గ్రహింపబడినవే. ఇవేవీ కూడా నిత్యశుద్ధమయిన ఆత్మలో లేవు. ఆత్మ అద్వయం, అవ్యయం.

శ్లో॥క్వ విక్షేపః క్వచైకాగ్ర్యం క్వ నిర్బోధః క్వమూఢతా ।
క్వ హర్షః క్వ విషాదో వా సర్వదా నిష్క్రియస్య మే ॥9.

టీ॥ సర్వదా = ఎల్లప్పుడును, నిష్క్రియస్య = క్రియారహితుడనగు, మే = నాకు, విక్షేపః = విక్షేపము, క్వ = ఎక్కడ, ఏకాగ్ర్యం = ఏకాగ్రత, క్వ = ఎక్కడ, నిర్బోధః = జ్ఞానము, క్వ = ఎక్కడ, మూఢతా = మూఢత్వము, క్వ = ఎక్కడ, హర్షః = సంతోషము, క్వ = ఎక్కడ, విషాదః = దుఃఖము, క్వ = ఎక్కడ.

సర్వదా నిష్క్రియుడనైన నాలో విక్షేపం (చలనం) ఎక్కడ? ఏకాగ్రత ఎక్కడ? దృఢజ్ఞానం ఎక్కడ? మూఢత్వము ఏమిటి?. సుఖ దుఃఖాలు ఎలా ఉంటాయి?

అంతులేని అశాంతితో బాహ్యాభిముఖమయిన మనస్సు విషయ భోగాల లో శాంతిని పొందాలని పిచ్చిపరుగులు తీస్తూ ఉంటుంది. అట్టి మనస్సుకు ఏకాగ్రతా ధ్యానమూ అత్యవసరమే. ప్రాపంచిక వస్తువులలో విషయభోగాలలో ఆనందాన్నన్వేషిస్తూ అశాంతితో అలమటించే మనస్సును, ఆలోచనా తరంగాల తాకిడి నుండి రక్షించడానికి, యిష్టదేవతా పాదపీఠము మీద ప్రయత్నంతో దృఢనిశ్చయంతో దృష్టినిలపడమే ఏకైక మార్గం. అద్వయమయిన ఆత్మలో ఆత్మగా తన్ను తాను తెలుసుకున్న జ్ఞాని దృష్టిని మళ్ళించి అశాంతి కలిగించ కలిగినదేది? ఏకాగ్రత ధ్యానములతో అతడికి అవసరం ఏమిటి? నిత్య నిశ్చల మానసంతో అద్వయంగా ఆనంద స్వరూపంగా అతడు (మాత్రమే) జీవిస్తూ ఉంటాడు.

తమోగుణంచే ఆవరింపబడినప్పుడు స్వస్వరూపం విస్మరింపబడు తుంది. బుద్ధి ఆ అజ్ఞానంలో ఉన్న మనస్సు తన ఊహాకల్పనలతో వివిధ ప్రత్యేక రూప సమన్వితమయిన విశాలవిశ్వాన్ని ఊహించి గుర్తించి, ఆ విషయ భోగాలమధ్య ఆనందాన్వేషిస్తూ అంతులేని అశాంతితో అహంకారంగా అనేక కోరికలతో జనన మరణ చక్రంలో బందీ అయిపోతుంది. ఈ విధంగా పరిమిత జీవిగా, తన కోరికలకు బానిసగా, పరిస్థితుల ప్రాబల్యంతో ప్రభావితమవుతూ, కష్టసుఖాలననుభవిస్తూ, తన భావనాబలతంతో తానే బంధింపబడుతూ, విలపిస్తూ జీవచ్ఛవంలా జీవిస్తుంటాడు అజ్ఞాని. మనోబుద్ధులకతీతమయిన స్థితిలో ఉన్న జీవన్ముక్తునిలో భ్రమలూ కల్పనలూ ఉండజాలవు. భ్రమాజన్య కల్పనా జగత్తు నుండి జాగృతుడయి ఆత్మనందాన్ననుభవిస్తూ ఉంటాడు. అతనిలో అజ్ఞాన ఫలమయిన అసత్య జ్ఞానం లేకపోవడంతో అతనికి సత్యజ్ఞానంతో అవసరంలేదు. "నిర్బోధః"---అతనికి బోధతో నిమిత్తమే ఉండదు. మహాకవులు నిరంకుశత్వానికి ప్రతీకగా "నిర్బోధ"అనే పదం ఇక్కడ వాడబడింది. "నిశ్చయబోధ"---నిజమైన జ్ఞానం అనే అర్థంలో ఈ పదం ఇక్కడ వాడబడింది.

మనోబుద్ధుల నధిగమించగానే అహంకారం అదృశ్యమయిపోతుంది. అందుకే జీవన్ముక్తునిలో "నేను అనుభవిస్తున్నాను" అనే భావమే ఉండదు. ఇక సుఖదుఃఖాలెలా ఉంటాయి? భావాతీతమూ అద్వయమూ అయిన ఆత్మానుభ వంలో కర్మలు చేయబడే ఆస్కారమే లేదు. ఆత్మే సర్వవ్యాప్తంగా పరిణామ రహితంగా నిత్యంగా ఉంటుంది. అట్టి మహత్తరమయిన అనుభవంలోనుండి

జనకుడు "సర్వదా నిష్క్రియస్యమే" అంటున్నారు. నాలో ఎప్పుడు ఏ కర్మలూ లేవు, నిష్క్రియుడను నేను.

శ్లో॥క్వచైష వ్యవహారో వా క్వచ సా పరమార్థతా ।
క్వ సుఖం క్వ చ వా దుఃఖం నిర్విమర్శస్య మే సదా॥10.

టీ॥ నిర్విమర్శస్య = దోషరహితుడనగు, మే = నాకు, ఏషః = ఈ, వ్యవహారః = వ్యవహారము, క్వ = ఎక్కడిది, సా = ఆ, పరమార్థతా = పరమార్థత, క్వ = ఎక్కడ, సుఖం = సుఖము, క్వ = ఎక్కడ, దుఃఖం = దుఃఖము, క్వ = ఎక్కడ.

విమర్శకాధారమయిన సర్వభావాలకూ అతీతంగా ఉన్న నాలో పరస్పరాధారంగా జరగబడే కర్మలెక్కడ ఉన్నాయి? కర్మరహిత కేవలస్థితి ఏమిటి? సుఖదుఃఖాలెక్కడ?

బుద్ధిలో తెలియబడే సమస్త ప్రామాణిక జ్ఞానానికీ అతీతంగా ఆధారంగా ఆత్మచైతన్య తత్త్వం విరాజిల్లుతూ ఉంటుంది. మనోబుద్ధుల అనుభవ క్షేత్రా లయిన ద్వంద్వమయ ప్రపంచం గురించి మాత్రమే తర్కబద్ధంగా న్యాయ సమ్మతంగా చర్చించగలగడానికి వీలవుతుంది. ఈ మనోబుద్ధుల పరిధిని దాటగానే ఉద్రేకాలూ భావాలూ ఆలోచనలూ నిర్ణయాలూ అన్నీ అర్థరహితమే. ఆత్మమాత్రమే అద్వయంగా ఉంటుంది. ద్వంద్వాత్మకయిన ఈ చరాచర సృష్టిలో సర్వమూ మనోబుద్ధులచే గుర్తింపబడతాయి. పరస్పరాధారంగా ఇలా గుర్తింపబడే జ్ఞానందృష్ట్యా ఆత్మ భావనాతీతం అని వర్ణించబడింది. మనో బుద్ధుల నధిగమించి జీవన్ముక్తుడయిన జనకునికి పరస్పరాధారంగా ప్రవర్తించే కర్మలతో పనియేమిటి? భావనాతీత సత్యంగా తన్ను తాను భావించవలసిన అవసరం ఏమిటి? పరస్పరాధారంగా తెలియబడే ప్రామాణిక జ్ఞానానికి మరో ధృవమే భావనాతీత సత్యం స్వరూపం.

"క్వ సుఖం క్వచ వా దుఃఖం"---అశాంతితో నిండిన అంతరంగంలో జనించే భావనా తరంగ జంఝా మారుతాలు, భ్రమాకల్పనలు, సుఖదుఃఖాలు వీటన్నిటికీ అతీతంగా అతి దూరంగా ఆధారంగా, ఆత్మతత్త్వం ప్రకాశిస్తూ ఉంటుంది. దీనినే తన స్వరూపంగా గుర్తించి శాంతంగా ప్రసన్నంగా జీవిస్తాడు.

శ్లో॥ క్వ మయా క్వచ సంసారః క్వ ప్రీతిర్విరతిః క్వ వా ।
క్వ జీవః క్వ చ తద్బ్రహ్మ సర్వదా విమలస్య మే ॥11.

టీ॥ సర్వదా = నిరంతరము, విమలస్య = మలరహితుడనైన, మే = నాకు, మయా = మాయ, క్వ = ఎక్కడ, సంసారః = సంసారము, క్వ = ఎక్కడ, ప్రీతిః వా = ప్రీతిగాని, విరతిర్వా = విరాగముగాని, క్వ = ఎక్కడ, జీవః = జీవుడు, క్వ = ఎక్కడ, తద్బ్రహ్మ = ఆ బ్రహ్మము, క్వ = ఎక్కడ.

**నిత్యశుద్ధమయిన నాలో మాయ ఎక్కడ? సంసారం ఎక్కడ? రాగద్వేషాలెలా ఉంటాయి? జీవుడెవరు? బ్రహ్మ ఎక్కడ?**

వివేకచూడామణిలో ఆచార్య శంకరులు "మనస్సుకంటే వేరుగా మాయ కానీ అజ్ఞానం కానీ లేవనీ, అవిద్యయొక్క వ్యక్తస్వరూపమే మనస్సనీ" వివరంగా స్పష్టపరచారు.

న హ్యస్త్యవిద్యా మనసోతిరిక్తా మనోహ్యవిద్యా భవబంధహేతుః
తస్మిన్ వినష్టే సకలం వినష్టం విజృంభతేఽస్మిన్ సకలం విజృంభతే .(వి.చూ.169)

*మనస్సుకంటే వేరుగా అవిద్యలేదు. జనన మరణ వలయంలో బంధించే అవిద్య యొక్క వ్యక్తరూపమే మనస్సు. ఈ మనస్సు నశిస్తే సర్వమూ నశిస్తుంది. మనస్సు రూపుదాలిస్తే సర్వసృష్టీ రూపు దాలుస్తుంది.*

అవిద్య (అజ్ఞానం) యొక్క స్థూలమైన వ్యక్తరూపమే "మాయ"గా గుర్తింపబడుతోంది. బ్రహ్మాండమయిన బాహ్యప్రపంచమంతా మాయయొక్క వ్యక్తస్వరూపమే. మాయాశక్తే జగద్భ్రమని కలిగిస్తోంది. ఇదే మాయ వ్యష్టిగా అజ్ఞానంగా మనస్సుగా భావింపబడుతోంది. మనస్సుతో మనస్సులో సర్వాన్నీ తెలుసుకుంటున్నా ననుకుంటున్నది. ఈ మనస్సు నధిగమించి అతీతంగా నిలవగానే దృష్టి అనుభవమూ కూడా మారిపోతాయి. ఆ ఆత్మానుభవం దృష్ట్యా మాయా ఎక్కడ? నిత్యపరిణామ శీలమైన జగత్తు ఎక్కడ?

మనోబుద్ధుల ఉపాధితో తాదాత్మ్యం చెంది చూసినప్పుడు ఆత్మచైతన్యం పరిమితమయినట్టుగా గోచరిస్తుంది. ఇలా పరిమితమయిన ఆత్మచైతన్యమే అహంకారంగా జీవుడుగా తనను తాను మనోబుద్ధులలో గుర్తిస్తుంది. ఒక పాత్రలోని నీటిలో సూర్యుని ప్రతిబింబం కదులుతూ కనిపిస్తూ ఉంటుంది. ఆ నీటిని తీసివేయగానే ప్రతిబింబపు వెలుగు అనంతమైన సూర్యకాంతిలో అంతర్ధానమయి పోతుంది. ఇదేవిధంగా ఆలోచనా తరంగాలు ఆగిపోతే మనస్సు అదృశ్యమయిపోతుంది. మనస్సులో "నేను" గా ప్రతిబింబించే "చిదాభాసుడు" అనబడే జీవుడు కూడా అంతర్ధానమయి పోతాడు. సర్వత్రా ఉండే ఆత్మచైతన్య ప్రకాశం మాత్రమే మిగిలి ఉంటుంది.

ఈ ఆధ్యాత్మిక సత్యం యోగవాశిష్ఠంలో ఇలా వివరింపబడింది.

వ్యపగతకలనా కలంకశుద్ధః స్వయమమలాత్మన పావనే పదేసౌ
సలిలకరణ ఇవాంబుధౌ మహాత్మా విగలతివాసన ఏకతాం జగామ.

(యోగావాశిష్ఠం)

*అంతరంగంలోని ఆలోచనా తరంగజనిత కల్లోలం అణగిపోగా శుద్ధమయిన మనస్సు, దివ్యమైన తన స్వస్వభావంలో అడుగు పెడుతుంది. సముద్రంలో ప్రవేశించిన నీటిబొట్టువలె, సర్వకోరికలు నశించిన మనస్సు స్వస్వరూపమయిన ఆత్మచైతన్యంలో ఏకమయి పోతుంది.*

ఈ విధంగా తన స్వస్వరూపానుభవం పొందిన మహాత్ముని దృష్ట్యా, "జీవుడెవరు?" వ్యక్తిగా విలపించే జీవుడేలేనప్పుడు "బ్రహ్మయెక్కడ?" ముండక ఉనిషత్తులోని భావాన్నే ఈ శ్లోకం ప్రతిధ్వనిస్తోంది.

స యో హ వైతత్ పరమం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి......

*పరబ్రహ్మ స్వరూపాన్ని తెలుసుకున్నవాడు పరబ్రహ్మమే అయిపోతాడు.*

*(ముండకోపనిషత్తు 3-2 9)*

## శ్లో॥ క్వ ప్రవృత్తిర్నివృత్తిర్వా క్వ ముక్తిః క్వ చ బంధనమ్ ।
## కూటస్థ నిర్విభాగస్య స్వస్థస్య మమ సర్వదా ॥ 12.

టీ॥ ప్రవృత్తిః = ప్రవృత్తి, క్వ = ఎక్కడ, నివృత్తిర్వా = నివృత్తియైనను, క్వ = ఎక్కడ, ముక్తిః = ముక్తి, క్వ = ఎక్కడ, బంధనం = బంధనము, క్వ = ఎక్కడ, మమ = నా యొక్క, కూటస్థ = కూటస్థము, నిర్విభాగస్య = విభాగములులేని, సర్వదా స్వస్థస్య = నిత్యము ఆత్మస్థితుడనైన.

**ప్రవృత్తి ఎక్కడ? నివృత్తి ఎక్కడ? ముక్తి ఎవరికి? బంధమెవరికి? విభాగరహితంగా పరిణామరహితంగా నిత్యమూ ఆత్మగా ఆత్మస్థితుడనై నేను మాత్రమే ఉన్నాను.**

వ్యక్తిగా గుర్తింపబడే ఉపాధులలో ఆత్మచైతన్య ప్రకాశస్థానము "కూటస్థం"గా ఉపనిషద్ ఋషులచే అలంకారికంగా సూచింపబడింది. కూట+స్థ ----కూటంలో స్థిరంగా ఉండేది అని అర్థం. కమ్మరి తన వస్తువులను కొట్టి సాగదీసే దిమ్మనికూడా కూటము అని అంటారు. దానిమీద అన్ని వస్తువులూ రూపాంతరం చెందుతున్నా అది మాత్రం మార్పు చెందక స్థిరంగా ఉంటుంది. మనస్సు, శరీరము. ఇంద్రియాలు, బుద్ధి వీటన్నిటి కూటమిలో స్థిరంగా ఉండేది

ఆత్మ చైతన్యం మాత్రమే. ఆత్మతత్త్వాన్నీ స్వభావాన్నీ బుద్ధికి అందించాలనే తపనతో మన మహర్షులు అపూర్వాలంకారికములయిన ఇటువంటి పద ప్రయోగాలనెన్నిటినో సమర్థతతోచేసి సత్యాన్ని రేఖామాత్రంగా సూచించ గలిగేరు. కూటం మీద లోహపు ముక్కలు సాగకొట్టబడి అనేక రూపాలుగా మారినట్టే, ప్రాపంచిక సంఘటనలనే దెబ్బలతో మనస్సూ బుద్ధీ శరీరమూ సదా మార్పు చెందుతూ, వ్యక్తియొక్క వ్యక్తిత్వం రూపుదిద్దుకుంటూ, సర్వదా మార్పు చెందుతూ ఉంటుంది. ఇదేవిధంగా మన అంతరాంతరాల్లో ఉండే ఆత్మ చైతన్యం స్థిరంగా శారీరిక మానసిక మార్పులన్నిటికీ ఆధారంగా, కారణంగా, సాక్షిగా ఉంటుంది.

క్లుప్తంగా చెప్పుకోవాలంటే అన్ని మార్పులమధ్యా స్థిరంగా ఉండేది కూటస్థము అనవచ్చును. కూటస్థమూ నిర్విభాగమూ అయిన ఈ ఆత్మ చైతన్యంతో తాదాత్మ్యం చెందినవాడే జ్ఞాని. శారీరిక మానసిక కర్మలన్నిటికీ కారణమవుతూ, స్వయంగా తానే కర్మలనూ నిర్వర్తించకుండా స్థిరంగా ఉంటుంది ఆత్మ చైతన్యం. అందుకే దానిని "కర్త", అని కానీ "అకర్త" అని కానీ అనలేము. కర్మ, అకర్మ,----ఈ రెండూ మనశ్శరీరాల రెండు రకాల స్థితులు మాత్రమే, ఆత్మ కర్మని చెయ్యడమూ లేదు. మానడమూ లేదు. ఈ స్థితు లన్నిటినీ మన ఆలోచనా పరిధిలో ఆలోచనలుగా వ్యక్తమయేటట్టు చేసే ప్రకాశం మాత్రమే----ఆత్మ.

అజ్ఞాన జనితమయిన ఉపాధులతో, భ్రమాజన్యమైన ద్వంద్వమయ ప్రపంచ విషయాలతో ఏ మేరకు తాదాత్మ్యం చెందితే ఆ మేరకు అహంకారం బంధింపబడినట్లు భావిస్తుంది. తనకోరికలతో తానే బంధింపబడుతుంది. ఆ బంధంనుండి బయటపడాలనే తపనతో ముక్తిని కాంక్షిస్తుంది. అందుకే బంధ మోక్షాలు రెండూ అహంకారపు భావనలే, కోరికలే, స్థితులే. సాక్షిగా స్థిరంగా ఉండేది-----ఆత్మ చైతన్యం. ఆ చైతన్యమే తానుగా జనకరాజర్షి అడుగగలుగు తున్నారు-----"బంధం ఎవరికి?" ముక్తి ఎక్కడ? కూటస్థంగా నిర్విభాగంగా నేను మాత్రమే ఉన్నాను.

ఆత్మానుభవ స్థితుడయిన రాజర్షి జనకుడు తనకంటే భిన్నమైనదేదీ లేదనీ దృఢజ్ఞానంతో ఉన్నాడు. పనిచెయ్యాలనే కోరికకానీ, ఫలాన్నపేక్షించే అహంకారం కానీ, అతనిలో లేవు. అహంకార సహితమయిన వ్యక్తిత్వం లేక పోవడంతో అతడు సాధించవలసినదీ, నిరోధించవలసినదీ ఏదీ లేదు.

శ్లో॥ క్వోపదేశః క్వవా శాస్త్రం క్వ శిష్యః క్వచ వా గురుః ।
క్వ చాస్త పురుషార్థో వా నిరుపాధేః శివస్య మే ॥ 13.

టీ॥ నిరుపాధేః = ఉపాధిరహితుడైనట్టియు, శివస్య = మంగళకరరూపుడైనట్టియు, మే = నాకు, ఉపదేశః = ఉపదేశము, క్వ = ఎక్కడ, శాస్త్రం = శాస్త్రము, క్వ = ఎక్కడ, శిష్యః = శిష్యుడు, క్వ = ఎక్కడ, గురుః వా = గురువైనను, క్వ = ఎక్కడ, పురుషార్థః = పురుషార్థము, క్వ = ఎక్కడ, అస్తి = ఉన్నది.

ఉపదేశం ఎవరికి? శాస్త్రం ఎక్కడ? శిష్యుడెవరు? గురువెక్కడ? అసలు పురుషార్థాలెక్కడ? ఉపాధిరహితంగా ఏకంగా మంగళ స్వరూప మయిన శివునిగా నేను మాత్రమే ఉన్నాను, నాలో ఏవీ లేవు.

పరమ పవిత్రం, మంగళప్రదం---ఇదే శివశబ్దానికర్థం, నిర్వచనం. పౌరాణిక పరిభాషలో శివుడు లయకారుకుడుగా పరిగణింపబడుతున్నాడు. సాధకుల ప్రయత్నమంతా అహంకార రూపమయిన అవిద్యను నశింపజెయ్యాలనే సాధన ఫలించి అవిద్య నశించగానే లయకారకుడయిన శివుడే అక్కడ స్వయం జ్యోతిగా ప్రకాశిస్తూ ఉంటాడు. అందుకే ఆ పరమ శివుని నిరంతర ధ్యానశీలిగా మన పురాణాలు చిత్రీకరిస్తున్నాయి. సాధకులందరికీ అతడే మార్గదర్శకుడు. మార్గం. గమ్యం, పురాతన వేదాంత గ్రంథాలలో ఈ శివశబ్దం కనిపించదు. కాని తరువాత కాలంలో ఈ శివశబ్దము అనంతమూ శుద్ధమూ అయిన ఆత్మస్వరూపానికి ప్రతీకగా ఆమోదింపబడింది. ఇదే సర్వసృష్టికీ ఆధారం. అధిష్ఠానం, అతి పవిత్రం, అవాఙ్మానసగోచరం.

జనకుడు తన ఆత్మానుభవానందంతో ఇలా అనగలుగుతున్నాడు. "పరమ శివస్వరూపం నేనే, నాకు ఏ హద్దులూ అవధులూ లేవు, సర్వమూ నేనే, ఉన్నది నేను మాత్రమే"

సమస్త జ్ఞానానికీ సర్వభావాలకీ ఆధారమయిన చైతన్యస్వరూపంగా తన్ను తాను గుర్తించిన జ్ఞానికి శాస్త్రప్రయోజనం ఏమిటి? గురూపదేశం ఎందుకు? అఖండమైన ఆత్మచైతన్యంలో గురువెవరు? శిష్యుడెవరు? ఈ సంహిత అంతటా అనేకచోట్ల మనం అష్టావక్రుని సంభ్రమాశ్చర్య విభ్రమా పూర్వక శైలిని గుర్తిస్తూనే ఉంటాము. అద్వయమయిన ఆత్మానుభవంలో నిష్ఠుడయిన మహర్షి, ఆ అనుభవాన్ని శిష్యుని కందించాలనే తపనతో, భాషా

పరిమితత్త్వపు పరిధిని గుర్తించిన అవేదనతో, పరస్పర విరుద్ధమూ అస్పష్టమూ అసందర్భమూ అనిపించే పదప్రయోగాలను చెయ్యడం చూస్తాం, మరికొన్ని చోట్ల అపూర్వ కవితాగానంతో, ఆనందమగ్నమానసంతో, ఆశ్చర్యాన్వితమయిన బుద్ధితో అలౌకికానందానుభూతిని కలిగించారు. అయితే ఎక్కడా ఎట్టి పరిస్థితులలోనూ తన అద్వైత దృష్టినుండి అణుమాత్రం కూడా చలించలేదు. ఈ కారణంగానే ఈ గ్రంథాన్ని ఈ దేశంలో కూడా రహస్యంగానే ఉంచారు. అర్హతా సంసిద్ధాతా లేని వారికి ఈ సంహిత అపార్థమయే అవకాశమే ఎక్కువ ఉంది. అర్హతానర్హతల ప్రమేయం లేకుండా సమాజంలో అందరికీ ఈ పుస్తకం అందుబాటులో ఉంటే, అపార్థం కాబడి, మతం, ధర్మం, భక్తి, సత్ ప్రవర్తన, సత్ సాంప్రదాయాలు, అన్నీ విస్మరింపబడి అంతరించే ప్రమాదం ఉంది. సమాజ రక్షణకూ, శ్రేయస్సుకూ, ఈ విలువన్నీ ప్రాణసమానాలు. సమాజంలోని వివిధ దశలలో ఉన్న వివిధ వర్గాలవారి ప్రగతికి అనువైన విధంగా సోపానాలుగా ఈ ధర్మాలన్నీ ఉపయోగపడుతున్నాయి. సోపానాలే నశిస్తే పైకి చేరడం అసాధ్యం. తల్లి గర్భంలో ఎంతో సహనంతో తొమ్మిది నెలలూ శిశువు నిరీక్షించవలసిందే, అప్పుడే బాహ్యప్రపంచంలో జీవించగలిగే అర్హత ఆ శిశువుకి వస్తుంది! మానవుడూ మాధవుడూ ఒకటే అని తెలుసుకునే లోపలే మత ధర్మాలన్నీ సోపాన పంక్తిగా మార్గాన్ని సుగమం చేస్తూ నిరాకరిస్తున్నాయి.

**శ్లో॥ క్వ చాస్తి క్వచ వా నాస్తి క్వాస్తి చైకం క్వచ ద్వయమ్ ।**
**బహునాఽత్ర కిముక్తేన కించిన్నోత్తిష్ఠతే మమ ॥ 14.**

టీ॥ అస్తి = అస్తిత్వము, క్వ = ఎక్కడ, నాస్తి = నాస్తిత్వము, క్వ = ఎక్కడ, కం = ఏకము, క్వ = ఎక్కడ, అస్తి = ఉన్నది, ద్వయం = ద్వైతము, క్వ = ఎక్కడ, అత్ర = ఈ విషయములో, బహునా = అధికముగా, ఉక్తేన = చెప్పుటచేత, కిం = ఏమి (ప్రయోజనం ), మమ = నాకు, (నన్ను), కించిత్ = ఏ వస్తువుగూడ, న ఉత్తిష్ఠతే = ప్రకాశింపజేయజాలదు, (నేను అన్నిటిని ప్రకాశింపజేయు వాడనని భావము)

**ఉనికి ఏమిటి? లేకపోవడం ఏమిటి? ఏది ఏకత్వం? ద్వైతం ఎక్కడ? ఇంతకంటే చెప్పవలసిన దేముంది? నానుండి ఏదీ వ్యక్తం అవడం లేదు.**

ఈ సంహితకు చివరిదైన ఈ శ్లోకం ద్వారా అష్టావక్రమహర్షి ఆత్మానుభవంలోనుండి ఆత్మగా ప్రపంచంతో మాటాడుతున్నారు. సందర్భానుసారంగా ఈశ్లోకం జనకునిచే చెప్పబడినా ఈ మొత్తం

తత్త్వశాస్త్రమంతా అష్టావక్ర మహర్షి ప్రవచనమని మనం మరచిపోకూడదు. ఈ సృష్టి అంతా ఉనికి కలిగి ఉందని కానీ లేదని కానీ చెప్పలేం. ఈ నిర్ణయాలు బుద్ధికి చెందినవి మాత్రమే. ఆత్మ చైతన్యమే మన అనుభవాన్నిటినీ ప్రకాశింప జేస్తోంది, గుర్తింపజేస్తోంది. ఈ చైతన్యాన్ని ఏకమని కానీ ద్వైతమనికానీ నిర్వచింపజాలము. పరస్పరాధారమయిన భౌతిక ప్రపంచానికి మాత్రమే ఈ సిద్ధాంతాలన్నీ పరిమితం,ఇవికూడా బుద్ధియొక్క నిర్ణయాలే, బుద్ధిలో మెదిలే భావాలే.

ఈ అధ్యాయంలోని పధ్నాలుగు శ్లోకాలలోనూ ఆత్మతత్త్వాన్ని నిరూపిస్తూ రూపరహితమని చెప్తుతూ, అవాఙ్మానసగోచరమయిన ఆత్మ చైతన్య స్వరూపాన్ని సూచిస్తూ, సూచించలేని తెలుసుకుంటూ జనకులు చివరగా ఇలా అంటున్నారు. "ఇంతకంటే చెప్పవలసినదేముంది?"---తన అనుభవాన్ని గురుదేవులకి మాటలలో చెప్పగలిగినంతగా వివరించి చెప్పలేక పోయానని గుర్తించిన జనక రాజర్షి ఆవేదనతో, నిరాశ నిస్పృహలతో, ఉపనిషద్ ఋషులవలె అవేశంతో ఆక్రందిస్తున్నట్టుంది---"నానుండి ఏదీ వ్యక్తం అవడంలేదు."

ఉపనిషద్ వాఙ్మయమంతటా ఇదే విధంగా ఈ భావం ధ్వనిస్తున్నా అష్టావక్ర అంత నిర్భయంగా ధైర్యంగా ఎవరూ చెప్పలేకపోయారు. ఆత్మ తత్త్వం గురించి ఎంత చెప్పినా అది తన అసమర్థతను మాత్రమే సూచిస్తూ మాటలుగా భావాలుగా ఆగిపోతున్నది. భావనాతీతమయినది ఆత్మ చైతన్యం!

అందుకే ఈ సంహిత అతి తక్కువ మందికే తెలిసిననప్పటికీ, హిందూ తత్త్వశాస్త్ర గ్రంథాలలో అతి ముఖ్యమయినదిగా భావింపబడుతోంది.

పరమోత్కృష్టమూ అతి పవిత్రమూ అయిన అజాత వాదానికి అష్టావక్ర మహర్షి మూలపురుషుడు కాకపోయినా, ముఖ్య సంరక్షకునిగా భావించ వచ్చును. కాలక్రమంలో తరువాత శ్రీ గౌడపాదులచే వారి మాండూక్య కారికలో ఈ అజాతవాదం వివరంగా చర్చించబడింది.

త్రికాలములలోనూ ఎప్పుడూ ఏదీ పుట్టనే లేదనీ, ఆత్మమాత్రమే కేవలంగా సర్వదా ఉందనీ సత్యాన్ని యోగవాశిష్ఠం కూడా ఎంతో వివరంగా చర్చించింది. నామరూపాలతో తెలియబడే ఈ ప్రపంచమంతా కేవలం మనః కల్పితభ్రమ మాత్రమేననీ, మానసిక అశాంతే అందుకు కారణమనీ యోగవాశిష్ఠం స్పష్టం చేస్తోంది.

దేహసంస్థోప్య హత్వాద్ అదేహోసి విదేహదృక్
వ్యోమ సంస్థప్యసక్తత్వాదవ్యోమేవ హి మారుతః. (యోగవాశిష్ఠం)

*నువ్వు శరీరంలో నివసిస్తున్నప్పటికీ ఆత్మవైన నీకు శరీరం లేని కారణంగా పరిశుద్ధమయిన సాక్షివి మాత్రమే నీవు. గాలి ఆకాశంలో చరిస్తున్నప్పటికీ ఆకాశానికి ఏ విధంగానూ సంబంధించి లేదు.*

ఈ పరమసత్యం భావనాతీతమయినది. కాబట్టి సహజంగా భావనిర్ణయ రూపమైన అస్తి-నాస్తి, ద్వైతం మొదలైన సిద్ధాంతాలన్నిటికీ ఇది అతీతమయినది. ఈ సిద్ధాంతాలేవీ ఆత్మను నిరూపించలేవు. తత్త్వశాస్త్రాన్ని తర్క-న్యాయ శాస్త్రాలాధారంగా బుద్ధితో అర్థం చేసుకున్నంత మాత్రాన ఆత్మానుభవం సిద్ధించదు. శాస్త్రం సూచించే సూచనను గ్రహించి ఆ స్థితిలోనికి అంతర్ముఖమయి శాంతించిన మనస్సుతో అడుగుపెట్టాలి. ఈ విధంగా మనస్సును శాంతింపజేసి అంతర్ముఖం చెయ్యడానికే అన్ని సాధనలూ సహకరిస్తాయి. అందుకే కైవల్యోపనిషత్తు (2) ఇలా అంటోంది----"శ్రద్ధా భక్తి ధ్యాన యోగాదవైహి"----"శ్రద్ధాభక్తులతో, ధ్యానంతో నీ అంతట నీవే తెలుసుకుంటావు."

తవ చరణమే శరణమని తలచితొకనాడు
తులలేని భక్తి నిన్ కొలచితపుడు
త్వమేవ సర్వమ్మను తలంపుదయించె
ప్రేమపూర్ణత్వమై సృష్టితోచె
మది సంశయము కలిగే మహనీదు రూపైన
నేనెవరు? నా భావ భావమేమిటి
సిగ్గాయె సింహావలోకమ్ము సేయగా
ప్రియమేది యిల ప్రేమకర్థమేది
త్వమేవ అహమౌను, అహము సర్వమ్మౌను
మేధ కావల జగమె కానరాదు
వాసనోద్భవముగా భావమే రూపుగా
హంసగా సహమేలు నఖిల జగతి ||

**... శాంతిః శాంతిః శాంతిః ...**

## చిన్మయ గీతాశ్రమము

ఎల్లమండ్యం గ్రా॥, పుత్తూరు రోడ్, పిల్లపాలెం పో॥
కె.యల్.యం. హాస్పటల్ దగ్గర, వయా రేణిగుంట,
చిత్తూరు జిల్లా., ఫోన్ : 0877 - 275027.

*"Close your eyes, which see the outer illusions,*
*For the inner vision to gain the*
*supreme illumination"*

## చిన్మయ యోగాశ్రమం - చిత్తూరు

ఇరువారం గ్రా॥, పలమనేరు రోడ్, చిత్తూరు- 517 128

ఫోన్ : 08572-200079

*"The Lord resides in the cave of your heart. Wash His feet with tears of devotion. Gaze at His face with the eye of wisdom!!"*

## చిన్మయారణ్యం పబ్లికేషన్స్ ట్రస్టు

(చిన్మయ మిషన్ వారి తెలుగు గ్రంథముల విభాగము)

## అరణ్యస్పందన

(చిన్మయ మిషన్ వారి తెలుగు ఆధ్యాత్మిక మాసపత్రిక)
'అరణ్యస్పందన' చందాలకు, గ్రంథములకు కొరకు
డి.డి., యం.ఓ. లు పంపవలసిన చిరునామా :

**పద్మినీ జ్యూయలర్స్, మెయిన్‌రోడ్ -**
**భీమవరం - 534 201**

ప.గో. జిల్లా., ఆంధ్రప్రదేశ్. ఫోన్ : 98494 61336





# చిన్మయమిషన్ ప్రమాణం

పరస్పరగౌరవాభిమానములతో మేము ఒకే కుటుంబముగా నిలబడెదము.

మాలోనూ, బాహ్య ప్రపంచములోనూ ఉన్న అన్ని విధములైన అల్పప్రవృత్తులను, అసత్యపు విలువలను అనుక్షణము ప్రతిఘటించుటకు క్రమశిక్షణాయుతమైన సైన్యమువలె ధైర్యముతో పనిచేయగలము.

ఉపయోగించుదానికన్నా ఎక్కువగా ఉత్పత్తిచేయుచూ, స్వీకరించినదానికన్నా ఎక్కువగా దానముచేయుచూ మేము నిజాయితీతో, త్యాగసేవా నిరతితో ఉదారజీవనమును కొనసాగింప గలము.

మమ్ములను ధర్మ, ధీర, వివేక మార్గమున నిలిపియుంచుటకై భగవంతుని అనుగ్రహమును కోరుచున్నాము.

పరాత్పరా! నీ అనుగ్రహమును, ఆశీర్వాదములను మా ద్వారా లోకమునకు ప్రసరింపజేయుము.

జనసేవయే జనార్దన సేవయని, దేశభక్తియే దేవదేవుని భక్తి యనియు మేము విశ్వసించుచున్నాము.

మా బాధ్యతలను మేము ఎరుగుదుము. వాటిని నిర్వహించుటకు తగిన శక్తిని, ధైర్యమును మాకు ప్రసాదించుము.

*... హరిః ఓం తత్సత్ ...*

## మా ప్రచురణలు

1. CCT 01 ఆత్మ బోధ
2. CCT 02 భజగోవిందం
3. CCT 03 వివేక చూడామణి 1వ భాగం
4. CCT 04 వివేక చూడామణి 2వ భాగం
5. CCT 05 శ్రీమద్భగవద్గీత (వ్యాఖ్యాన సహితం)
6. CCT 06 మానవ నిర్మాణ కళ
7. CCT 07 శ్రీరామ గీత
8. CCT 08 అష్టావక్ర గీత
9. CCT 09 అపరోక్షానుభూతి
10. CCT 10 ఈశావాశ్యోపనిషత్తు
11. CCT 11 కేనోపనిషత్తు
12. CCT 12 కఠోపనిషత్తు
13. CCT 13 ముండకోపనిషత్తు
14. CCT 14 ప్రశ్నోపనిషత్తు
15. CCT 15 తైత్తరీయోపనిషత్తు
16. CCT 16 మాండుక్యోపనిషత్తు
17. CCT 17 కైవల్యోపనిషత్తు
18. CCT 18 ముక్తికోపనిషత్తు
19. CCT 19 సాధన పంచకము, మనీషా పంచకం
    మరియు నిర్వాణ షట్కం
20. CCT 20 వాక్య వృత్తి
21. CCT 21 ధ్యానము - జీవితము
22. CCT 22 శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము
23. CCT 23 శివాపరాధ క్షమాపణ స్తోత్రము
24. CCT 24 నా ఉత్తర ఖండ యాత్ర
25. CCT 25 చిన్మయ భావతరంగిణి
26. CCT 26 చిన్మయ లహరి
27. CCT 27 చిన్మయ వేదాంత సరళి
28. CCT 51 నారద భక్తి సూత్రములు
29. CCT 56 ఒక మహాత్ముని జీవనయానం
30. CCT 57 ప్రతీ శ్వాస ఉపదేశమే
31. CCT 58 పురుష సూక్తం
32. CCT 61 విష్ణు సహస్ర నామం
33. CCT 28 ఆత్మ వికాసము
34. CCT 29 జీవజ్యోతి
35. CCT 30 మనం చేసి తీరాలి
36. CCT 31 ఈశ్వర దర్శనము
37. CCT 32 హిమగిరి విహారము
38. CCT 33 గంగా స్తోత్రము
39. CCT 34 బదరీశ స్తోత్రము
40. CCT 35 శ్రీ సౌమ్య కాశీశ స్తోత్రము
41. CCT 36 ఒక కథ చెప్పవూ?
42. CCT 37 ఎందుకు చేయాలి మనం
43. CCT 38 భక్తి సుధ
44. CCT 39 దృగ్దృశ్య వివేకము
45. CCT 40 మనః శోధనం
46. CCT 41 సద్దర్శనం
47. CCT 42 ఉపదేశసారం
48. CCT 43 జ్ఞాన సారం
49. CCT 44 హనుమాన్ చాలీసా
50. CCT 45 కపిలగీత
51. CCT 46 హంసగీత
52. CCT 47 జీవితం ఒక ఆట
53. CCT 48 విభీషణ గీత
54. CCT 49 ధన్యాష్టకం
55. CCT 50 ఆనంద జీవనానికి సూత్రములు
56. CCT 52 శ్రీ గంగోత్రి క్షేత్ర మహాత్మ్యం
57. CCT 53 భిక్షు గీత
58. CCT 54 మానస భక్తి సూత్రాలు
59. CCT 55 ధ్యాన స్వరూపం
60. CCT 59 శివమానస పూజ
61. CCT 60 శ్రీమద్భాగవత ప్రవచనం
62. CPT 01 తత్వ బోధ
63. CPT 02 శ్రీమద్భగవద్గీత (వ్యాఖ్యాన సహితం)
64. CPT 03 ఆత్మ విద్యా విలాసం
65. CPT 04 వేమన వేదాంతము
66. CPT 05 సంగీత వేదాంతము
67. CPT 06 ఈశావాశ్యోపనిషత్తు
68. CPT 07 కేనోపనిషత్తు
69. CPT 08 ప్రశ్నోపనిషత్తు
70. CPT 09 తైత్తరీయోపనిషత్తు
71. CPT 10 ఛాందోగ్యోపనిషత్తు 4వ అధ్యాయం
72. CPT 11 భావనోపనిషత్తు
73. CPT 12 ఐతరేయోపనిషత్తు
74. CPT 13 సూర్య-అక్షి ఉపనిషత్తులు
75. CPT 14 స్కందోపనిషత్తు
76. CPT 15 శ్రీ సద్గురు పాదుకాస్తవము
77. CPT 16 శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము
78. CPT 17 శ్రీ శివ మహిమ్న స్తోత్రము
79. CPT 18 శంభు నటనం
80. CPT 19 సందేహాలు - సందేశాలు
81. CPT 20 హిందూ ధర్మము! స్త్రీలు, శూద్రులు
82. CPT 21 యజ్ఞ శిష్టం
83. CPT 22 శ్రీ చిన్మయ స్తోత్ర భజనమాల
84. CPT 23 శ్రీ చిన్మయ స్తోత్ర భజనమాల (సాధారణ)
85. CPT 24 పూజా కదంబము
86. CPT 25 భగవద్గీత స్థూలాక్షరి (ఉత్తమ ప్రతి)
87. CPT 26 భగవద్గీత స్థూలాక్షరి (సాధారణ ప్రతి)
88. CPT 27 రామాయణ రత్నమాల
89. CPT 28 ఆదిత్య హృదయం
90. CPT 29 శ్రీ గాయత్రి మంత్రార్థం
91. CPT 30 స్వరూప దర్శనం
92. CPT 31 శతరుద్రీయం
93. CPT 32 భగవద్గీత పరిచయం
94. CPT 33 శ్రీమన్నారాయణీయం
95. CPT 34 నారద భక్తి సూత్రాలు (సూత్రముల మంత్రం)
96. CPT 35 శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్రము,
    శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రము.
97. CPT 36 గురోదేహిమే దివ్య పాదానురాగం
98. CPT 37 శ్రీకృష్ణాన్వేషణ
99. CPT 38 శ్రీరామ స్తోత్ర మంజరి
100. CPT 39 ఆణిముత్యాలు-క్యాలెండర్
101. CPT 40 ఈశావాస్యమిదం సర్వం
102. CPT 44 భాగవత మహత్త్వం
103. CPT 45 శ్రీరామ హృదయం
104. CPT 46 వింటే భారతమే వినాలి
105. CPT 41 ప్రతిమలు - పరమార్థం
106. CPT 42 రామాయణ సందేశం
107. CPT 43 శ్రీ సౌమ్య కాశీశ స్తోత్రం (ప్రథమ స్తబకం మొ॥)
108. CPT 47 జ్ఞాన ప్రవాహ గంగ

''ఓ జనకమహారాజా! దేవాలయము యొక్క గోపురము ఆకాశమును ఏవిధముగాను అంటనటుగానే భౌతిక శరీరము యొక్క వికారములు ఏవీ కూడా ఆత్మను అంటవు. జ్ఞాని, ప్రపంచమును ఆత్మదృష్టితో చూచి నప్పుడు ఈ వ్యక్త ప్రపంచము అంతా సద్రూపముగానే కనపడుతుంది. అజ్ఞాని, ప్రపంచాన్ని కర్మదృష్టితో చూచినప్పుడు అంతా నామరూపాత్మకంగానే తోస్తుందని; ఆత్మజ్ఞానములోను, యోగవిద్యలోను నిష్ణాతులైన అష్టావక్రమునీంద్రులు ఉపదేశించారు.

అద్వైతవేదాంతాన్ని ఒక క్రమపద్ధతిలో బోధించగలిగిన మహాగ్రంథము ఈ అష్టావక్రగీత. శాంతస్థితిని, ఆనందమును పొందగల భావాతీతస్థితిలోనికి తేలియాడే విధానము ఈ మహాగ్రంథములో వివరించ బడినది.

వేదాంత రహస్యాలను, వేదాంత సూక్ష్మాలను అష్టావక్ర మహామునికి, జనకమహారాజుకు జరిగిన గురుశిష్యుల సంభాషణ రూపములో వివరించబడినది.

ధ్యానాభ్యాసములో నిశ్శబ్దస్థితిలో పొందిన ఆత్మాను భావాన్ని ప్రత్యక్షంగాసాక్షాత్కరింపచేసుకొనడం గురించి ఈ అష్టావక్రగీత తెలియజేస్తుంది.




చిన్మయారణ్యం పబ్లికేషన్స్ ట్రస్ట్,
భీమవరం.